ప్రచురణ నెం : 3

సర్వ హక్కులు : చిక్కాల కృష్ణారావు

నిర్వహణ : నిష్టల వెంకట రమణమూర్తి
నాగమణి

ప్రథమ ముద్రణ : మార్చి 1992

కాపీలు : 1000

ధర : రూ. **60**



ప్రతులకు :
చిక్కాల కృష్ణారావు
"సాగర సంగమం"
భీమునిపట్నం
విశాఖజిల్లా - 531 163

---

ముద్రణ : స్పందన ప్రింటర్స్, మచిలీపట్టణం.

మొదటినుంచీ ప్రేమతో నన్ను ప్రోత్సహించిన
కృష్ణమూర్తి సెంటర్, విజయనగరం వారికీ,

గ్రంథం ఆమూలాగ్రం శ్రద్ధగా చదివిన
స్వామి యోగానందగారికి - తక్కిన మిత్రులకూ,

గ్రంథ ప్రచురణకు అనుమతి ఇచ్చిన
కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ ఇండియా వారికీ,

ముద్రణ విషయంలో సహకరించిన
బాబూరావుగారికి, స్పందన ప్రింటర్స్ వారికీ,

నా హృదయ పూర్వక కృతజ్ఞతలు

# వి ష య సూ చి క

# అంకితం



రమణమహర్షికి
ప్రేమతో

# ముందు మాట

జిడ్డు కృష్ణమూర్తి గారి గురించి చదవడం, వినడమే కాని, ఆయన్ని చూడలేదు. ఆయన మద్రాసు వచ్చారని తెలిసి, వెళ్ళాను.

దట్టంగా అల్లుకున్న పచ్చని చెట్లమధ్య, సూర్యాస్తమయ అరుణకాంతి వెలుగునీడల్లో, సామాన్యంగా అమర్చబడిన చిన్న వేదిక మీదకు, ప్రకటించిన సమయానికి క్షణం ఆలస్యం కాకుండా నెమ్మదిగా, మౌనంగా వచ్చారు కృష్ణమూర్తిగారు. ఆయన రాకకోసం ఆశతో, ఆతృతతో నిశ్శబ్దంగా ఎదురు చూస్తున్న శ్రోతలకు, చిరునవ్వుతో ప్రతినమస్కారం చేసి, పద్మాసనంలో నిటారుగా కూర్చున్నారు. ఆ చిరునవ్వే, ఆయన్ని సర్వమానవాళికి సన్నిహితుల్ని చేసింది అనుకుంటాను.

కృష్ణమూర్తిగారిని చూడగానే, నా సర్వేంద్రియాలు ఒక్కసారిగా ప్రకంపించాయి. అపురూపమైన ఓ దివ్యకాంతి, "కృష్ణమూర్తి రూపం" ధరించింది అనిపించింది. ఆయన, ఈ భూమికి చెందిన మామూలు మనిషిగా నాకు తోచలేదు. అప్పుడే నేలకు రాలిన పున్నాగ పువ్వంత స్వచ్ఛంగా సహజంగా వున్నారాయన. అప్పటివరకు నేను అటువంటి అందమైన వ్యక్తిని చూడలేదు. క్రమంగా నా దృష్టి, కేంద్రీకృతమైంది. ఓ క్షణం 'నేను' ఏమీ మిగలకుండాపోయినట్లు అనిపించింది.

వరదలాంటి చురుకైన చూపులతో ఆయన అందర్నీ, అన్నింటినీ సూటిగా, ప్రేమగా చూశారు. ప్రతి ఒక్కరూ ఆయన తమనే చూస్తున్నారనుకున్నారు. ఆ చూపు - అక్కడ చేరిన మా అందరి ఆంతర్యాల్ని శోధిస్తున్నట్లు, ఓ మహాజ్వాల మా మధ్యకు వచ్చి, చొరబడ్డట్లు, ఓ జలపాతం మా మీదకు దూకుతున్నట్లుంది. మరుక్షణంలో ఆ చూపు, అగాధాల్ని అన్వేషిస్తున్నట్లు తీవ్రంగా నిలిచేప్పటికి, నా మాదిరిగా అందరి మనసులూ నిశ్చలమైనట్లు నాకు తోచింది. అంతలోనే ఆ చూపు, దిగంతాలు దాటి, విస్తరించింది. కాని, ఆ చూపులోని ప్రేమ, దయ, అందం వర్ణనాతీతం.

ఆయన రూపం, అక్కడ చేరిన వారందర్నీ ఆకర్షించి, ఆకట్టుకుని, ఆనందపారవశ్యుల్ని చేసింది. ఆయన తన ఉనికితో, ఆ ప్రదేశాన్ని మరింత సౌందర్యవంతం చేశారు. ఆ క్షణంలో ఆ ఆవరణ అంతటా ఒక వింత వాతావరణం అలుముకుంది. ఒక్కరూ కదలరు, కనీసం కన్నుతిప్పరు. అందరూ అంత నిశ్శబ్దంగా, నిశ్చలంగా కూర్చున్నారు. పైన నీలాకాశం. చుట్టూ పచ్చని చెట్లు. అప్పుడప్పుడూ అరుచుకుంటూ ఆకాశంలో అడ్డంగా ఎగిరిపోయే పక్షులు. అన్నింటి మధ్యా 'కృష్ణమూర్తి'. ఆ దృశ్యం నాకు పురాణగాథల్ని జ్ఞప్తికి తెచ్చింది. ఆయన్ని అట్లా చూడ్డం, ఒక అసాధారణమైన దృశ్యం; అనుభవం కూడా.

ఆయన ఏ విధమైనటువంటి సాంప్రదాయక సంబోధనా చేయకుండా, సరాసరి ఉపన్యాసం ప్రారంభించారు. ఆయన కంఠస్వరం - దృఢం, స్వచ్ఛం, నిర్దుష్టం, మధురం, శాంతపూరితం. శ్రోతల దృష్టిని తన వైపుకు తిప్పుకునేందుకో, వారు తనను శ్రద్ధగా, నిజంగా వినేందుకో, ఆ క్షణంలో వారిలో ఆంతరంగిక పరిణామం, పరివర్తన కలిగించేందుకో ఒక్కోసారి చెప్పిందే మళ్ళా చెప్పేవారు. అప్పటి వరకు అందరి మనసుల్లో ఏర్పడి

వున్న దాన్నంతటినీ పునాదులతో సహా కూల్చి, నేల మట్టం చేసి, ఆశిధిలాలలోంచి నెమ్మదిగా, బలీయంగా ఒక మహా నిర్మాణం ఆరంభించారు.

ఆయన మాటలు కొన్ని కఠినంగా బాధాకరంగావున్నా, ఆయన కళ్ళల్లో కరుణ, ప్రేమ, దయ, నమ్రత కనుపించాయి. ఉపన్యాసమంతా అందమైన చిన్నచిన్న ఇంగ్లీషు మాటల్నే ఉపయోగించారు. ఆ మాటల్లో మాధుర్యం, భావంలో స్పష్టత, అర్థంలో గంభీరత హృదయాన్ని సూటిగా తాకే వాడీ, వేడీ, వున్నాయి. ఆ సమయంలో ఆయనలోంచి నిత్య జీవిత సత్యాలు, సమస్యలు, అంతులేని ఆలోచనలూ ధారావాహినిగా వెలువడ్డాయి-పువ్వులోంచి పరిమళం, చంద్రునిలోంచి చల్లదనం, గాలిలోంచి మార్దవం వెలువడినట్లు. సమస్యా పరిష్కారమనే యాత్రలో, ఆయన తనతో పాటు శ్రోతలందర్నీ వెంట తీసుకుపోయారు.

ఆ విధంగా కృష్ణమూర్తి ఓగంట సేపు మాట్లాడి, శ్రోతల హృదయాల్లో పూర్తి వికాసం కలిగించారనిపించింది. ఆయన వాణి, శ్రోతల హృదయ కుహరాల్లో వెలుగురేకల్ని విరియించింది.

ఉపన్యాసం ముగించేముందు అనేక కోణాలనుంచి, ఆయన అసలు సమస్యకు వచ్చారు. ఆయనలో అదొక ప్రతిభ. ఆ కొద్ది సేపట్లో శ్రోతలకు బహుముఖంగా ఎరుక విస్తృతమైంది. ఉపన్యాసం పూర్తి అయ్యేప్పటికి, తన చుట్టూ వున్నదాన్నంతా, ఓ నూతన దివ్యస్వరూపంగా మార్చారు.

ఉపన్యాసం పూర్తయింది. ఆయన కొన్ని క్షణాలు వేదిక మీద నిశ్శబ్దంగా కూర్చున్నారు. సంపూర్ణ అవగాహనతో శ్రోతలు ఆయనకు నిశ్శబ్దంగా స్వాగతం చెప్పినట్లే, వీడ్కోలూ ఇచ్చారు.

• • •

ఆరోజు కృష్ణమూర్తిగారి ఉపన్యాసం విన్నవారి అనుభూతి ఏమిటో నాకు తెలియదుగాని, నేను మాత్రం నిలువెల్లా కదిలీ పోయాను. ఓదివ్యశక్తి నన్ను గట్టిగా పట్టుకుని వూపేసినట్టూ. నా ఆలోచనావిధానమంతా తలక్రిందులైనట్టూ, నిత్య జీవిత సత్యాలు పెనుతుఫాను లాగ నా మీదకు వచ్చి, నా గతాన్నంతా పూర్తిగా ఊడ్చేసినట్లూ అనిపించింది. ఆయన ఒక అద్దం మాదిరిగా తోచారు. అందు నా జీవితం ప్రతిబింబించింది. అజ్ఞానంలో మరుగుపడివున్న నా గతమంతా, ఆయన సమక్షంలో ఆకారం తీసుకుని, మేల్కొని బైట పడిందనిపించింది. జీవితంలో మొట్టమొదటిసారిగా మంత్రింపబడ్డట్లు అయ్యాను. ఆయన ప్రతిమాట నా అంతరాంతరంలోకి చొచ్చుకు పోయి, నా మనసును తృప్తిపరచి, నా హృదయాన్ని శాంత పరచింది. ఆక్షణాన నాలో కలిగిన సంకల్ప స్వరూపమే, మీ ముందున్న ఈ పుస్తకం.



దివ్యజ్ఞాన సమాజంతో గాని, జిడ్డు కృష్ణమూర్తి అనుచరులతో గాని, వారి పాఠకులతో గాని నాకు ఎటువంటి పరిచయం, సంబంధం లేదు. కాని, కృష్ణమూర్తిని చదివి, ఒకసారి చూసి నా బుద్ధికి, ఊహకు, అవగాహనకు తోచినంతమేరకు, సేకరించిన సమాచారంతో, ఈ గ్రంధాన్ని తయారు చేశాను. ఈ గ్రంధ రచనకు కావలసిన సమాచారాన్ని కృష్ణమూర్తికి సన్నిహితులైన మేరీ లూట్యన్స్, పుపుల్‌జయకర్‌ల గ్రంధాలనుంచీ, ఆయన రచనల-ఉపన్యాసాల, చర్చలనుంచీ, ఆయన గురించి వెలువడిన ఇంకా అనేక గ్రంధాలనుంచీ, పత్రికలనుంచీ సేకరించాను.

ఇది కృష్ణమూర్తి జీవిత చరిత్ర. జ్వాజ్వల్యమానమైన ఆయన జీవితానికి సంబంధించిన అనేక సంగతులను, సంఘటన

లను, సందర్భాలను వీలైనంతవరకు తీసుకుని, వాటిని నా సంస్కార, స్వభావ, శక్తి-సామర్థ్యాల మేరకు ఈ గ్రంథంగా తయారు చేశాను.

ఇది మామూలు జీవితచరిత్ర కాదు. ఒక అసాధారణమైన కథ. కృష్ణమూర్తి ఏవిధంగా వికాసం చెందిందీ ఇందులో కొంత వరకు రూపొందించబడింది. ఆయన పడిన కష్టాలు, బాధలు, యాతనలు, సంశయాలు, సంతోషాలూ, ఆయన పెరిగిన తీరు, వ్యక్తిగత సంబంధాలూ, ఆధ్యాత్మిక సాధనలూ; అభివృద్ధి మేల్కొవడం ; అన్ని సంవత్సరాలలోనూ శారీర కంగా ఆయన పడిన బాధలూ, వాటి అన్నింటిమధ్యా నిలబడి, ఆయన తనని తాను తెలుసుకోవడం - అన్నీ - అంతా ఈ గ్రంథంలో చాలా వరకు వ్యక్తపరచబడ్డాయి.

ప్రతి మహాత్ముని చుట్టూవుండే చరిత్రే, కృష్ణమూర్తి చుట్టూ వుంది. కాని, కాలం మాత్రం భిన్నం. కనుక కొన్ని సంగతులు సంఘటనలు, సందర్భాలు, విషయాలు తక్కినవారి జీవిత చరిత్రలకు భిన్నంగా వుండవచ్చు. ఆయన జీవితం చాలావరకు మరుగుపడి, ఎందరికో తెలియకుండా చేసిందీ కృష్ణమూర్తే : " నేను చెప్పేదేదో అది మరింత తికమకగా చెప్పివుంటే, ఇంకా ఎక్కువమంది నన్ను అనుసరించేవారు, " అన్నారు కృష్ణాజీ ఒకసారి. కృష్ణమూర్తి ఉపయోగించే కొన్ని ఇంగ్లీషు మాటలు **Awareness, Aloneness, Death, Desire, Freedom, God, Happpiness, Meditation, Pleasure, Reality, Truth, Time, what is** — వాటికి సరైన అర్థాలు, ఒక్క ఆయన నిఘంటువు లోనే దొరుకుతాయి. అందుచేత ఈ పుస్తకంలోని పదాల పొందిక, విషయసమన్వయం, భావప్రకటన పాఠకులే నిర్ణయించుకోగలరు.

ఈ గ్రంథంలో ఉదహరించబడిన వ్యక్తులేకాక, ఇంకా ఎందరో, వారందరూ కృష్ణమూర్తికి చేసిన సేవలు, సహాయాలు, ఆయన్ని ప్రపంచానికి తెలియపరచడానికి వారు చేసిన ప్రయత్నాలు, ప్రచారాలు - వారందరి పేర్లూ ఇందులో ఉదహరించబడలేదు. అలాగే ఈ గ్రంథరచనకు కావలసిన సమాచారాన్ని నేను అనేకమందినుంచి తీసుకున్నానేకాని, వారిపేర్లు ఇందులో ఉదహరించలేదు. వారందరికీ నాహృదయపూర్వక కృతజ్ఞతలు ఈ పుస్తకంద్వారా తెలియజేసుకుంటున్నాను.

ఈయత్నంలో నేను ఏశతసహస్రాంశమైనా కృష్ణమూర్తిని వ్యక్తపరిస్తే ఆ సంగతి పాఠకులు కూడా అంగీకరిస్తే, నా కృషి ఫలించిందని సంతోషిస్తాను.

— కృష్ణ

# పరిచయం

ఈ తరంలో చాలామందికి దివ్యజ్ఞాన సమాజం గురించి కాని, ఆ సంస్థ వ్యవస్థాపకులైన బ్లావట్స్కీ, ఆల్కాట్ గురించి కాని, ఆ సమాజ పోషకులైన అనీబిసెంట్, లెడ్‌బీటర్ గురించి కాని పూర్తిగా, వివరంగా తెలియకపోవచ్చు. కాని, ఆ సమాజం తీసుకొచ్చిన జిడ్డు కృష్ణమూర్తి మాత్రం, ఈనాడు ప్రపంచంలో కొందరు మేధావులకు ఆలోచనా కేంద్రంగా నిలిచాడు. ఆయన అతి గంభీరమైన, గూఢమైన ఆలోచనాపరుడుగా, బోధకుడుగా ఆధ్యాత్మిక గురువులలో, మహామేధావులలో ఒకరుగా పరిగణింపబడుతున్నారీనాడు.

కృష్ణమూర్తి జీవితం, ఈ శతాబ్దారంభంలో ప్రారంభమైన గాథ. అది పురాణ, ఇతిహాస కథలవంటి కథ కాదు. అధునాతనమైన ఒక సంగతి. అందమైన ఓ జీవిత గాథ. తెరవెనక వుండి మహాత్ములు ఆడించిన మహానాటకమది. ఆ గాథ రెండు భాగాలు చేస్తే, ఒకటి - కృష్ణమూర్తిని దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షురాలైన అనీబిసెంట్ తన చేతుల్లోకి తీసుకుని, అతనే రాబోయే జగద్గురువనీ, తిరిగి వస్తానన్న ఏసుప్రభువనీ, బుద్ధుని, కృష్ణుని అవతారమనీ ప్రపంచమంతా తిరిగి ఆమె ప్రచారం చేయడం. రెండవది - అనీబిసెంట్ చెపుతున్నవన్నీ సత్యం కావనీ, తాను అందరి వంటి వానినేననీ, సత్యం మినహా తక్కినవన్నీ అర్ధం లేని సంగతులనీ, కృష్ణమూర్తి చెప్పడం. ఈ రెండు విషయాల వల్ల కృష్ణమూర్తి జీవితం మరింత ఆసక్తికరం, అద్భుతం అయింది.

బాల్యంలో కృష్ణమూర్తి స్థితి వేరు. అడయార్ దివ్యజ్ఞాన సమాజ పర్యవేక్షణలో కృష్ణమూర్తి పరిస్థితి వేరు. ప్రపంచసంస్థకు సర్వాధికారిగా వున్న కృష్ణమూర్తి సంగతివేరు. తిరిగి వస్తానన్న ఏసుక్రీస్తుగా, జగద్గురువుగా, ప్రవక్తగా ప్రచారం చేయబడి అనేక చోట్లనుంచి ఆహ్వానాలు అందుకుని, వెళ్ళిన ప్రతిచోటా సత్యాన్ని, ప్రేమను ప్రబోధించిన కృష్ణమూర్తి విషయం వేరు.

కృష్ణమూర్తి ఎంతో జీవితానుభవాన్ని పొంది, విశాలంగా ఎదగడానికీ, నమ్మినదాన్ని ఆచరించడానికీ, తనచుట్టూవున్న దానిమీద తిరుగుబాటు చేయడానికీ అనేక కష్టాలు బాధలు, యాతనలు పడ్డాడు. చివరికి తాను మేల్కొని, అనీబిసెంట్ ఆశల్ని, ఆశయాల్ని, ఆదర్శాల్ని, ప్రయత్నాల్ని ధైర్యంగా ప్రతిఘటించి, ఆమె స్థాపించిన ప్రపంచ సంస్థను తాను సర్వాధికారి హోదాలోవుండి రద్దు చేస్తో "నేను ఇంతవరకు కలల బ్రతుకులో వున్నాను. ఇప్పుడే మేల్కొన్నాను. నాకు శిష్యులు, అనుచరులు లేరు. వారి అవసరమూ నాకు లేదు. నా పేరు మీదుగా ఒక మతాన్నిగాని, సంఘాన్నిగాని, మరి దేన్నిగాని స్థాపించడం నాకు ఇష్టంలేదు. నా దారిని నన్ను పోనివ్వండి" అన్నాడు. ఆ తర్వాత దివ్యజ్ఞాన సమాజంనుంచి కూడా తప్పుకుని, సంపూర్ణ స్వేచ్ఛాపరుడై, సంవత్సరం తర్వాత సంవత్సరం ప్రపంచం తిరిగి బోధిస్తో, చర్చిస్తో, ఉపన్యాసాలిస్తో ప్రజల్లో నవచైతన్యాన్ని కలిగించిన కృష్ణమూర్తి అందరూ స్వేచ్ఛాపరులు కావాలని అంటాడు.

కృష్ణమూర్తి హిందూమతంలో, బ్రాహ్మణకులంలో జన్మించినా, సాంప్రదాయ పద్ధతిలో పెరగలేదు. పైగా మతాల్ని, వాటి పద్ధతుల్ని, సిద్ధాంతాల్ని, సూత్రాల్ని, నమ్మకాల్ని, అనుసరణల్ని, ఆచరణల్ని, గతాన్ని, గురువుల్ని, వ్యాఖ్యాతల్ని

—అన్నింటినీ వ్యతిరేకించి, నిరాకరించాడు. "అధికారాన్ని అంగీకరించి, అనుసరించి, ఆచరించి, అణగివుండటం, సత్యాన్ని కాదని వ్యతిరేకించడం" అని కృష్ణమూర్తి భావన. అధికారాన్ని అనుసరించేవారు, తమను తాము నాశనం చేసుకున్నట్లే! అధికారం అంధుల్ని చేస్తుంది. మనోస్పష్టతే, జ్ఞానజ్యోతి. అదివున్ననాడు, ఎవరినీ అనుసరించవలసిన పనిలేదు.

కృష్ణమూర్తి ఎప్పుడూ మత్స్య-మాంసాదులు, మత్తు పానీయాలు ముట్టలేదు. పొగ త్రాగలేదు. తొంభై ఏళ్ళు పైబడ్డా సూర్యోదయంతోపాటు నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని, ఓ గంటసేపు యోగాసనాలు ప్రాణాయామం చేసేవాడు. రోజూ సాయంత్రం ఐదారు కిలోమీటర్ల దూరం నడిచేవాడు. యోగం చేయడం ఏవో అతీతశక్తుల్ని సాధించడానికి కాదు. దేహం శక్తివంతంగా, సున్నితంగా వుండడానికి. అంతే! ఎందుకంటే, దేహం అద్భుతమైనది, అతి సున్నితమైనది. అటువంటి అపురూపమైన దేహాన్ని ఆహార-విహారాల్లో, ఇంకా అనేకవిధాల ఉపేక్షచేసి, చేతులారా నాశనం చేసుకుంటారు. పాడైన ఆదేహం, మనసుమీద పనిచేస్తుంది. తిరిగి ఆమనసు దేహం మీద తన ప్రభావాన్ని చూపుతుంది. పాడైన మనసు, దేహం రెండూ క్రమంగా హృదయాన్ని పాడుచేస్తాయి. హృదయం మనసు, దేహం — ఈ మూడు సక్రమంగా, సహజంగా, సఖ్యతగా పనిచేయడమే, పూర్ణయోగం. హృదయ నిర్మలత్వం, మనోనిశ్చలత్వం, దేహపటుత్వమే కృష్ణమూర్తి వేదాంత సారం.

ఆయన మాటా, తీరూ, ఉనికీ, చూపూ అంతా ప్రత్యేకం. ఆయన మనోహర మూర్తిత్వం, అందర్నీ అయస్కాంతం లాగ ఆకర్షించింది.

ఆయన మార్క్స్‌వంటి - అర్థికశాస్త్రవేత్తకాదు. లెనిన్ వంటి విప్లవవాదీకాదు. గాంధి వంటి శాంతిదూత కాదు. హిట్లర్ వంటి నిరంకుశవాదికాదు వివేకానందుని వంటి అర్గనైజర్ కాదు. కాని సిద్ధాంతాలనుంచి స్వేచ్ఛపడ్డవాడు. జీవితాన్ని నిర్వచించిన వాడు. లోక సమ్మతమైన సాంప్రదాయాల్ని, మూఢాచారాల్ని, నమ్మకాల్ని అధిక్షేపించిన వాడు. అసాధారణా ఆలోచనాపరుడు.

అందరూ వికాసం చెందాలనుకుంటాడు, కృష్ణమూర్తి. వికాస మంటే భావాలు, ప్రభావాలు అధికారాలూ, మనల్ని అడ్డగించేవి ఆటంకపరిచేవీ; మనపై అదికారం చెలాయించి అణచేవి-ఏమీ లేకుండా పోవడం. లోతుగా చూసేకొద్దీ, విశాలంగా ఎదిగే కొద్దీ మనలో మార్పు వస్తుంది. ఆమార్పు ఏదో త్యాగం చేయడంవల్ల ఏర్పడ్డ ఫలితం కాదు. ఎందుకంటే, అవగాహనలో త్యాగానికి తావులేదు. దాంట్లోఎవరికివారు తమను తాము పరిశుద్ధం చేసుకోవడమే వుంటుంది. లోదృష్టితో తనను తాను పూర్తిగా తెలుసుకున్న స్థితే, అవగాహన. అది, గతభారంలేని మనో నిశ్చలత్వంలో కలిగే మార్పు. అది మౌనంలోనే సాధ్యం.

కృష్ణమూర్తి ముఖ్యంగా, గట్టిగా నొక్కి పదే, పదే చెప్పే సంగతి: ఎవరికి వారు, తమను తాము తెలుసుకోవడం. అది, తమ కళ్ళు తాము తెరవడమంత సులభం. కాని, చాలా మందికి తమ కంటిరెప్పల్ని పైకెత్తి చూడ్డం భయం, బద్ధకం. అందుచేత ప్రజలు క్రమంగా పైకిచూడ్డం మానేశారు, మరచి పోయారు. అటువంటి వారిని నిద్రలేపాలిగాని, వారికి ఉప దేశాలు చేయడం, దీక్షలు ఇవ్వడంవల్ల ప్రయోజనం లేదు, అంటారు కృష్ణాజీ.

అంతర్యంలో రేగే ఆలోచనలకూ, బాహ్యంగా-చూసి, వినే వాటికి సదా ఎరుకలో వుండి, వాటిని వెంబడించడమే తనను తాను తెలుసుకునేందుకు మార్గం. అదే సాధన. మనసును నెమ్మదిగా, క్రమంగా, నిజాయితీగా, నిదానంగా ఓర్పుతో వెంబడించి, పరిశీలించినట్లయితే, ఆలోచనా విధానం క్రమంగా సన్నగిల్లి, నెమ్మదై దాని వేగం ఆవేశం తగ్గుతుంది.

కాని, మనిషి ఎప్పుడూ తన ఆలోచనలను ఒక పద్ధతిలో వుంచాలని చూస్తాడు. తంటాలు పడతాడు. అసలు ఆలోచించే వానిని తీసేస్తే ఆలోచనే లేదు. కనుక ఆలోచించేవానిని తీసేసే ముందు, అన్నింటినీ నిరాకరించాలి; చివరికి గురువును కూడా. "నే నెవరు ?" అని నిజంగా లోపల్నించి ప్రశ్న వస్తే, ఆ క్షణంలోనే "సత్యం" గోచరమౌతుంది," అంటూ అన్ని బాధ్యతలూ, బరువులూ అన్వేషకునిమీదే వుంచుతారు కృష్ణాజీ.

అన్నివిధాలైన ప్రబోధాలకూ, ప్రవక్తలకూ, గురువులకూ ఆధారభూతమైన మతాల్ని, సాంప్రదాయాల్ని, తాత్విక సంస్థల్ని, సమాజాల్ని, సంఘాల్ని, గుడుల్ని, చర్చిల్ని, మశీదుల్ని నిరాకరించి, వాటిని తీవ్రంగా ప్రతిఘటించారు కృష్ణాజీ. చెడి, దుర్వాసన కొట్టే మనుష్యుల బుద్ధి, స్వభావాల, మనసుల సంరక్షణార్థం, అసలు ఆధ్యాత్మిక తత్వాన్ని అందరికీ తెలియజెప్పుటకు దేశదిమ్మరి జీవితాన్ని స్వీకరించి, సంవత్సరం తర్వాత సంవత్సరం దేశంనుంచి దేశానికి వెళ్ళి, మంచిగా బ్రతకమనీ, తమను తాము తెలుకోమనీ చెప్పారేకాని, కొత్తగా ఒకమార్గాన్నీ, పద్ధతినీ చూపలేదు, చెప్పలేదు. ఎవరికీ "దీక్ష" అంటూ ఇవ్వలేదు. ఉపదేశమూ చేయలేదు. ఏ మతమూ స్థాపించలేదు. ఎందుకంటే, ఒక పద్ధతి వెనక పడిపోనివారే, వాస్తవానికి ఎరుకలో వుంటారు. "ఎవరికి వారే" తమ

మార్గాన్ని తామే ఎన్నుకోవాలి. తమ లక్ష్యం తామే సాధించుకోవాలి. అప్పుడే జీవితంలో ఓ నూతన విధానం ఏర్పడుతుంది. నూతన క్రియలు, నూతన ఫలితాలు కలుగుతాయి. అటువంటి వారిలో పరివర్తనకూడా కలుగుతుంది" అని అన్నారేకాని, తానొక ప్రవక్తననిగాని, తత్వవేత్తననిగాని ఎప్పుడూ చెప్పుకోలేదు. పైగా తనను గొప్పచేసి అనుసరించేవారిని నిరాకరించారు.

ఆయన బోధలోని సారం "నిన్ను నీవు తెలుసుకో." అంటే, "నీకు నువ్వుగా వుండు. సహజంగా వుండు. అది చాలు" అని. ఆ సత్యాన్నే ప్రతిసారి అనేకవిధాల మరింత నూతనంగా, స్పష్టంగా, శక్తివంతంగా చెప్పేవారు కృష్ణమూర్తి. ఆయన తత్వం, నిజాయితీగా ఆత్మపరిశీలన చేసుకునేవారికి బాగా ఉపయోగపడుతుంది.

కృష్ణమూర్తి సంపూర్ణ స్వేచ్ఛాపరుడు. తనవలె అందరూ స్వేచ్ఛాపరులు కావాలన్నది ఆయన ఆకాంక్ష. "స్వేచ్ఛ" అంటే; ఒక విధమైన మానసికావస్థ. ఏ భయమూ, బలవంతమూ లేనప్పుడూ, జీవితంలో దేనికీ, ఎప్పుడూ రక్షణ కావాలనే కోర్కెలేనప్పుడూ—అప్పుడు మాత్రమే స్వేచ్ఛగా వుండగలరు. "స్వేచ్ఛ" అనేది ప్రోత్సాహంమీదగాని, విజ్ఞానంమీదగాని, ఆధారపడి వుండదు. అది ఒక అనుభవం వల్లా, ఒకటి అంతంకావడంవల్లా కలిగే స్థితి కాదు. స్వేచ్ఛ అంటే ఏమిటో ప్రతిఫలాపేక్షలేని ప్రేమకే తెలుసు.

"స్వేచ్ఛ" అంటే, సహజ స్థితి. స్వచ్ఛమైన పరిశోధన. కృష్ణాజీ అటువంటి స్థితిని పొంది, ప్రతీదీ స్థిరనిశ్చయంతో మాట్లాడనారంభించాడు. అందుకే ఆయన మాటల్లో అంత స్పష్టత. ప్రతీమాటా నిశ్చయంగా, నిర్భయంగా, నిర్దుష్టంగా,

నిస్సంకోచంగా, ఊహాతీతంగా, అద్భుతంగా, ప్రేమవెదజల్లుతూ ఎదుటివారి హృదయాల్ని సూటిగా తాకడంవల్ల మల్లెపువ్వు చుట్టూ పరిమళంవలె ఆయనచుట్టూ జనసమూహం చేరింది.

ఎవరైనా స్వేచ్ఛాపరులు కావాలనుకుంటే, బాహ్యాంతర పరాధీనతలపై తీవ్రమైన, తిరుగుబాటు చేయాలి. కాని, దానికై ఆశ, ప్రయత్నం వుండకూడదు. ఏ పనీ ఆదర్శభావం మీద ఆధారపడి జరగకూడదు. ఆ క్షణంలో ఎట్లాతోస్తే అట్లా చెయ్యాలి.

'అసలు మీరు ఇవన్నీ ఎట్లా మాట్లాడగలుగుతున్నారు?' అని మీరు నన్ను అడిగితే, నేనేం చెప్పలేను ? కాని, బహు చిత్రంగా అనుకోండి, ఏమైనా అనుకోండి - ధారావాహినిగా మాట్లాడే శక్తో, గుణమో అది నాలో వుందనుకుంటాను. అందుకే మాట్లాడుతున్నాను. మాట్లాడే ముందూ తర్వాతా నా మనసు శూన్యంగా, నిరామయంగా వుంటుంది " అంటాడు కృష్ణమూర్తి.

" మీకేదో బోధించాలని నేను ఇవన్నీ చెప్పడం లేదు. నిత్యజీవిత సమస్యలపై మనమంతా కలసి చర్చించుకుందాం. ఒకరి సమస్యల్ని ఒకరం అర్థం చేసుకుందాం. ఒకరి ఆలోచనల్ని ఒకరం పంచుకుందాం, అంటున్నాను. అంతే! కాని నేను మీరు అంటున్న, అనుకుంటున్న గురువులు మాదిరిగా ఏమీ బోధించడం లేదు. వారి మాదిరిగా నేను ప్రవర్తించడమూ లేదు. నేను మీకేమీ వరాలు ఇవ్వడం లేదు. వాగ్దానాలు చేయడం లేదు. ప్రతిరోజు ప్రతిక్షణం ఏఏ కర్మలు ఎట్లా ఆచరించాలో, ఏఏ నియమాలు ఎట్లా పాటించి నడచుకోవాలో చెప్పడం లేదు. కాని, ఏదో ఒకటి సూచిస్తున్నాను. దాన్నికూడా మీ ఇష్టానికే వదలుతాను. ఏదీ చెయ్యమని

ఎవరినీ, ఎప్పుడూ నిర్బంధించను. కాని, మీలో చాలామంది నేను చెప్పేదాంట్లో తృప్తికనపడక, ఒకరోజున నన్నెట్లానూ వదిలేస్తారు.

"నేను తర్కశాస్త్రాల్ని, వేదాంత గ్రంథాల్ని తాత్విక రచనల్ని మనస్తత్వ శాస్త్రాల్ని, పవిత్ర—పరిశుద్ధ గ్రంథాల్ని —ఏమీ చదవలేదు. నేను ఎప్పుడూ కీర్తి గొప్పతనం, అధికారం కోసం చూడలేదు. ఈర్ష్య, దురాశ, కసి, ద్వేషం, అసూయవంటి ప్రలోభాలకు లోనుకాలేదు. ఇతరులతో నన్ను నేను పోల్చుకోవడం, ఏదో సాధించాలనుకోవడం వంటివి నాకు తెలియవు. అవి నా చెవిని పడినా, తోసేశాను. దేనికీ, ఎప్పుడూ నా మనసు కలతచెందలేదు, తొందరపడలేదు, బాధ పడలేదు, నొచ్చుకోలేదు. అసలు నేనేదీ ఆశించలేదు. దేని కోసమూ ప్రయత్నించలేదు. ఎప్పుడూ ఏదీ వదలుకోవాలను కోలేదు. అందుకేనేనంటాను—"నాకేం తెలియదు" అని. నాకేం తెలియదంటే, మీరు నమ్మరు. కాని, మీరు అంటున్న దేదో అది ఆ అనుభవం మాత్రం నాకు కలిగింది. అంతే! కాని, అసలు అదేమిటో, అది నాకు ఎట్లా కలిగిందో అదీ తెలియదు. కాని, అనుభవం మాత్రం కలిగింది. ఆ అనుభవాన్ని పొందా లని చాలామంది తమకు వీలైన మార్గాన్ని అనుసరిస్తారు. వారిలో కొందరు సత్యం కానిదాన్ని, సత్యమనీ, అది తమకు తెలుసుననీ, దాన్ని మరొకరిమీద బలవంతంగా కాని, బ్రతిమాలి కాని రుద్దుతారు. దానితో వారు బాధలకూ, కష్టాలకూ, నష్టాలకు, దుఃఖాలకు, తికమకలకూ, పశ్చాత్తాపాలకు గురై, వాస్తవజీవితం నుంచి తప్పుకుని, తప్పుడుమార్గం పట్టి, అసలు సత్యానికి దూరమౌతారు.

"మార్గం" అనేది ఒక తప్పు అభిప్రాయం. "మార్గం" అనే దాంట్లో ఉపదేశకుడు, నిగూఢంగా వుంటాడు. ముందు

అతడు తొలగిపోవాలి. "అన్ని దారులూ అక్కడికే చేరుస్తాయి" అనే వాదనకూడా సరైనది కాదు. ఎందుకంటే, అసలు మార్గాలే లేవు. సత్యమంటే, ఏ మార్గమూ లేనిది.

"కాని, నేను సూచించేది నమ్మకాల పద్ధతి కాదు. సిద్ధాంతాల జాబితా కాదు. తీరికగా కూర్చుని తయారుచేసిన నియమావళి కాదు. నా స్వంత అభిప్రాయాల, భావాల, ఉద్దేశాల క్రమ పట్టిక కాదు. అది ఒక రకమైన సాధనావిధానం కాదు. సదాచార కర్మానుష్టానం కాదు. హిందూ, ముస్లిం, క్రైస్తవ మత ధర్మాలూ కాదు. ధర్మశాస్త్రంకాదు. న్యాయచట్టం కాదు. ఆవేశంతో పిచ్చిగా ప్రలాపించడం కాదు. నేను చెప్పేదే ఈశ్వర ప్రేరిత జ్ఞానమనడంలేదు. అందుచేత నేను చెప్పేది తీసుకోండి, మానండి. అది మీ ఇష్టం. కాని, నేను నిత్యజీవిత సమస్యలకు వాస్తవమైన కొన్ని సూచనలు ఇస్తాను. అంతే! ఎవరి సమస్యల్ని వారే పరిష్కరించుకోవాలంటాను. పరిష్కరించుకునే శక్తి అందరిలో వుంది. అది ఎట్లా అభివృద్ధి పరచుకోవాలో చెపుతాను. కాని, నేను చెప్పేది ఏ సిద్ధాంతాన్ని, మతాన్ని, సాంప్రదాయాన్ని లక్ష్యపెట్టక ప్రతిఒక్కరూ స్వేచ్ఛగా వుండాలనీ, తమలోని ఆధ్యాత్మిక తత్వాన్ని గుర్తించమని, దాన్ని అనుభవంలోకి తెచ్చుకోమనీ అంటాను. అంటే, అంతర్వాణి ఆజ్ఞ తు. చ. తప్పకుండా పాటించమంటానేకాని, నేను మరో మార్గాన్ని సూచించను. ఎందుకంటే, "మార్గం" అనేప్పటికి అందులో సాధన, ప్రయత్నం రెండూ వుంటాయి," అన్నారు కృష్ణాజీ.

"మీరు కూడా గురువులందరి మాదిరిగా బోధిస్తున్నారు కదా?" అని ఒకరు కృష్ణమూర్తిని అడిగితే, "నేను మీలో ఒకడినే కాని, నన్ను గురువును చేయకండి. నాకు ఆధ్యాత్మిక అధికారం, గురుపీఠం, అసహ్యం. ఆరకమైన వ్యర్థపు మాటలు నాకు ఇష్టంలేదు. ఆ విషయాలు మనసును పాడుచేస్తాయి.

"ఈనాడు ప్రపంచమంతా గురువులతో నిండివుంది. గురువుంటే, అనుచరులూ, శిష్యులూ వుంటారు. అటువంటి శిష్యులెవరూ నాకు లేరు. నేను అనుచరుల్ని కోరడంలేదు. నన్ను విని, అనుసరించేవారిని సైతం, నేను లక్ష్యపెట్టను.

"గురువులు తమ చేతుల్లో సర్వాధిపత్యం వున్నట్లు చెప్పి, ధనం పోగుజేసుకుంటారు. గొప్పపదవులు అలంకరిస్తారు. పదవి, కీర్తి, ధనం, అధికారంతో పీఠం వేసుకుని ఆధ్యాత్మిక అంగడి తెరుస్తారు. వాళ్ళు నిజంగా మానవుల్ని ఉద్ధరించగలరా? వాళ్ళు మానవుల మనసులు మార్చగలిగితే, అది చాలా గొప్ప సంగతే! అద్భుతమైన కార్యం నెరవేర్చినట్లే! వారే కాదు ఏ సంస్థా, ఏ సంఘం మనిషిని ఏమాత్రం మార్చలేవు, రక్షించ లేవు.

" గురువులు, మతాధిపతులు, మఠాధిపతులు గొప్పపనులు చేయాలని ప్రయత్నించి తప్పిపోతే, తమ పదవి, కీర్తి, అధికారం, ఆదాయం తగ్గి, పీఠం ఎగిరిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. ఆ తర్వాత ఎవరూ వారిని ఖాతరు చేయరు. ఆ సంగతి వారికి బాగా తెలుసు. వారు మనుష్యులతో చాలా తెలివిగా, జాగ్రత్తగా మసలుకొని, తమ దుకాణం వృద్ధిలో వుంచుకుంటారు చివరికి శంకరాచార్యులైనా సరే 'ఇదంతా ఏం లేదు. వుత్తనాన్ సెన్స్,' అని అంటే, ఆయన్ని కూడా ఎప్పుడో తోసేసే వారె!

" నే నెప్పుడూ గురువులందరి మాదిరిగా బోధించలేదు. నాదంతా వారికి భిన్నమైన పద్ధతి నేను ఇతరుల ఆలోచనల్ని పంచుకుంటాను. ఆ పద్ధతిలో జీసస్, బుద్ధుడు ఎవరైనా సరే అంగీకరిస్తాను కాని, వారి చుట్టూ అల్లుకున్న మతాన్ని ఆరాధనా విధానాన్ని మాత్రం అభ్యంతర పెడతాను. వారి ఆలోచనల కన్నా, వారి నామ - రూపాలు ముఖ్యం కావడం నేను అంగీకరించను. నేను ఆశావాదినీ కాను. నిరాశావాదినీ కాదు.

" నేను ఒక అద్దం మాదిరిగా పనిచేస్తాను. ఆ అద్దంలో మీ ప్రతిబింబాన్ని చూసుకుని, మిమ్మల్ని మీరు తెలుసుకుని, ఆ అద్దాన్ని విసిరి పారెయ్యండి. మీకు అద్దం ముఖ్యం కాదు, మీకు మీరు ముఖ్యం, " అన్నాడు కృష్ణమూర్తి.

ఆయన బోధలో, మానవ సమస్యల సారం వుంది. అది ఆయన అనుభవ సారం.

కృష్ణమూర్తి నిజంగా పూర్ణ మానవుడే !



కృష్ణాజీ ఎప్పుడూ, దేనికీ ఎవరిమీదా, దేనిమీదా ఆధార పడలేదు. కాని, ఆయన్ని మొదటినుంచీ ఎవరో ఒకరు, చూసుకుంటూనే వచ్చారు. మొదట తండ్రి, తర్వాత అనీబిసెంట్ ఆ తర్వాత రాజగోపాల్, అనంతరం మేరీ జింబాలిస్ట్. ఇంకా ఎందరో తమ తమ అమూల్యమైన జీవితకాలాన్ని కృష్ణమూర్తి సేవకు అంకితం చేశారు.

కృష్ణమూర్తి ప్రపంచ సంస్థకు సర్వాధికారి కావడం, ప్రపంచం నాలుగు మూలల నుంచీ ఇష్టంతో, ప్రేమతో ప్రముఖులూ, మేధావులూ తమ జీవితాల్ని అర్పించి, ఆయన్ని అనుసరించడం, ఆయన బోధలకు పలుచోట్ల భవనాలు నిర్మించడం, జగద్గురువుగా, తిరిగి వస్తానన్న ఏసుప్రభువుగా కీర్తించడం—ఏవీ ఆయన అంతర్యాన్ని ఏమాత్రం కదిలించ లేదు, అకర్షించలేదు.

ఆ కాలం గురించీ, ఆ పరిస్థితుల గురించీ కృష్ణాజీ ఒకసారి ప్రస్తావిస్తూ, "ఆనాటి నా జీవితం చిల్లులు పడిన కుండ మాదిరిగా వుంది. అందు ఎందరో ఎన్నిరకాలైనవో పోశారు. వాటిల్లో ఏ ఒక్కటీ అందులో నిలవలేదు," అన్నారు.

జీవితం పొడవునా ఆయనకి ఎటువంటి ఆశయం, భావం, అభిప్రాయం, సిద్ధాంతం, ఆశ అంటూ ఏమీలేవు. కాని కృష్ణమూర్తే ఒకసారి, "అందరిమాదిరిగా ప్రపంచంలో వున్న అన్నిభావాలూ, గుణాలు, రసాలు నాలో వున్నాయి. కాని, అవి నా మనోశక్తికి లోబడివున్నాయి," అన్నారు,

కృష్ణాజీ నిత్యజీవితం ఎప్పుడూ సహజంగా, సామాన్యంగా సరళంగా సాగింది. ఆయన ధరించిన బట్టలు, ప్రవర్తన, వైఖరి, రీతి, విధం, స్వభావం, కదలిక, ఉచ్ఛారణ — అన్నీ అద్భుతంగా, ఆశ్చర్యకరంగా, గొప్పగా, అందంగా వుండేవి.

ఆయన చాలా బిడియంగా, సౌమ్యంగా, వివేకవంతంగా వుండేవారు.

కృష్ణాజీ జీవితాన్ని పరిశీలిస్తే ఆయనెప్పుడూ — చివరికి చిన్నతనంలో కూడా ఎటువంటి నిందలకు, అపనిందలకూ గాయపడలేదు. అలాగే ఏ పొగడ్తలకూ పొంగిపోలేదు. ఆయన ఏనాడూ అవమానాలకు, బెదిరింపులకు లొంగలేదు. రక్షణకోసం వెదుక్కోలేదు. కాని గతించిపోతున్నవాటి అన్నింటికీ, సదా సంపూర్ణ ఎరుకలో వుండేవాడు. తన గురించిన వ్యక్తిత్వ రూపకల్పన లేనివాడు, కృష్ణాజీ.

గత స్మృతి ఏమాత్రం లేని మనస్సే, కృష్ణాజీ తత్వాన్ని అర్థం చేసుకోగలుగుతుంది అని గ్రహించాలి.

• • •

కృష్ణాజీ సత్యాన్వేషణ తనను గురించిన వివేకజ్ఞానంతో ఆరంభమైంది.

కృష్ణాజీ ప్రబోధాలు అందరికీ నచ్చకపోయినా ఆయన ఔన్నత్యాన్ని, నిజాయితీని సందేహించినవారు లేరు.

ఆయన ప్రతిఒక్కరినీ-అన్నిరకాల మతాల, జాతుల, జాతీయతల, వర్గాల, తరగతుల, సిద్ధాంతాల, సాంప్రదాయాల - నుంచి, స్వేచ్ఛ పరచి ప్రపంచ పరిస్థితులకు వారు సదా ఎరుకలో వుండేట్లు చూడ్డమే ఆయన పని. వారిలో పరిణామం తీసుకురావాలన్నదే ఆయన లక్ష్యం.

ఆ లక్ష్యంతో ఆయన చేసిన ప్రబోధం చివరి వరకు ఆగకుండా సాగడానికి కారణం—ఆయన ఏనాడూ, ఎవరినుంచీ, దేనినుంచీ ఎటువంటి ప్రాముఖ్యతా ఎదురుచూడకపోవడం.

ఈనాడు ఆయన పేరుమీద అమెరికా, ఇంగ్లండు ఇండియాలలో కేంద్రాలు స్థాపించబడివున్నాయి. వాటికి సభ్యులు వున్నారు. వాటికి అనుబంధ సంస్థలు ఇరవై ఒక్క దేశాల్లో వున్నాయి.

కృష్ణాజీకి జీవితంలో అన్నింటికన్నా ఎక్కువ ఆసక్తికర మైన విషయం విద్య. ఆయనకు పిల్లలంటే ఎంతో ప్రేమ. మొగ్గల్లాంటి పిల్లలు గిడసబారిపోకండా పూర్తిగా విచ్చు కోవాలంటే, వాళ్ళల్లో ఎటువంటి పక్షపాతాలు, దురభిమానాలు, మతాలు, సాంప్రదాయాలు, ఆదర్శాలు, జాతీయతలు వంటివి ఏమాత్రం వుండకూడదంటారాయన. ఆ ఉద్దేశ్యంతోనే ఆయన విద్యాలయాల స్థాపనకు పూనుకున్నట్లు తోస్తుంది.

ఒక కొత్తరకం మానవ సమాజం ఏర్పడాలనే ఉద్దేశ్యంతో కృష్ణాజీ అన్ని సంవత్సరాలు ప్రపంచం తిరిగి బోధించారు. అటువంటి నూతన సృష్టి విద్యాలయాలలోంచి రావాలి. దానికి

ఉపాధ్యాయులు తోడ్పడాలి. ఆ కార్యక్రమాన్ని చేపట్టడానికి యువతీ - యువకులు నిర్భయంగా ముందుకు రావాలి.

" కొందరు నా దగ్గరకు వస్తారు. కానీ, వారికీ - నాకూ మధ్య ఒక రక్షణ కవచం వుంచుతారు. నా దగ్గరకు వచ్చేవారు చాలా వరకు నాలో ఆకర్షణ పడి ఆగిపోతారు. అసలు వచ్చిన పనే మరచిపోతారు. లేదా, "ఆధ్యాత్మిక పురోభివృద్ధి" అంటూ ఏవేవో చేస్తారు. కానీ, నూతన మానవ సమాజ స్థాపనకు పూనుకోరు, శ్రమపడరు. కాబట్టి అటువంటి యువకుల్ని ఈ విద్యాసంస్థలే తయారు చేయాలి. వారే నా కన్నా బాగా నవ సమాజ నిర్మాతల్ని ముందుకు తీసుకురాగలరు.

ఈనాడు కృష్ణాజీ పేరు మీద ఏడు స్కూళ్ళు వున్నాయి. వాటిల్లో ఐదు ఇండియాలో, ఒకటి అమెరికాలో, ఒకటి ఇంగ్లండులో వున్నాయి.

చదువుకునే పిల్లల్లో సామాన్యంగా వుండే భయాలు తల్లి - తండ్రుల భయం, పరీక్ష తప్పుతానేమోననే భయం, ఉద్యోగం దొరకదేమోననే భయం, సంఘం - సాంప్రదాయం - నియమ నిష్టల భయం - ఇన్ని భయాలతో వారి చదువు సాగుతుంది. పసితనం నుంచీ, ప్రౌఢత్వం వరకూ పిల్లలు ఆ భయాలతోనే జీవిస్తారు. పిల్లల్లో సహజంగా వుండే సృజనాత్మక శక్తికి ఆ భయమే చావు గంట మోగిస్తుంది. ఇక్కడ " సృజన " అంటే కేవలం " సృష్టి " అనే భావానికి పరిమితం చేసుకోవడం కాదు ప్రకృతిసహజమైన "ఉత్పత్తి - స్థితి - లయం" వంటి సత్యాలను ఎరుకపరచుకోవడం.

భయం లేనప్పుడే పిల్లలు తమ కోర్కెల్ని, భావాల్ని, ఆలోచనల్ని, స్వేచ్ఛగా అభివృద్ధిపరచుకుంటారు. అదే జీవితంలో ముఖ్యమైన సంగతి.

వ్యక్తిత్వాన్ని పరిపూర్ణం చేసుకోవడానికే విద్య అభ్యసించాలి. కాని, యంత్రంలో బాగంగా నడచుకోవడానికి కాదు.

వ్యక్తిత్వాభివృద్ధితోపాటు, పరిసరం - శరీరం - మనసు - భావాలు - మొదలైనవి కూడా అభివృద్ధి చెందడానికి ఆస్కారం వుంటుంది.

కృష్ణాజీ పుస్తకాలు, ఆడియో - వీడియో టేప్స్ ఈనాడు ప్రపంచమంతటా వున్నాయి.

ఆయన పేరు మీద అనేక చోట్ల 'కృష్ణమూర్తి సెంటర్స్' వున్నాయి. ఆ సెంటర్స్‌లో నిత్యం దేదీప్యమానంగా వెలిగే జ్వాల వుంటుందే కాని, కాలిన బూడిద కాదు. ఆ జ్వాలను సమీపిస్తే, మనకూ ఆ కాంతి కనిపిస్తుంది. దాని సహాయంతో మన దీపాన్ని వెలిగించుకోవచ్చు.

చిక్కాల కృష్ణారావు

**పూర్వం** ఇండియా, చైనా, టిబెట్, జపాన్, సిరియా మొదలగు దేశాలలో గుప్త విద్యాకేంద్రాలూ, విశ్వమానవ సౌభాతృత్వపు సంఘాలూ, సంస్థలూ గొప్ప గొప్ప మహాత్ములతో విలసిల్లేవి. ఆయాచోట్ల విశ్వవిజ్ఞాన గ్రంథాలన్నీ వ్రాత ప్రతుల్లో వుండేవి. ఆ సంఘాధిపతులు తమకు తెలిసిన విజ్ఞాన స్వరస్వాన్ని లోకంలో అర్హులైనవారిని ఏరి తీసుకుని, వారికి బోధించి, అవసరమైన శిక్షణ ఇచ్చేవారు. ఆ సంఘాలూ, సంస్థలూ, విద్యాలయాలూ సర్వకళలతో, సమస్త విద్యలతో, అసాధారణ వ్యక్తులతో దేదీప్యమానంగా వెలిగేవి.

అటువంటి గుప్తవిద్యా కేంద్రాలన్నీ క్రమంగా కనుమరుగై కొత్తరకం సంఘాలూ, సంస్థలూ, వచ్చాయి. కొత్త ఆలోచనా విధానం, కొత్తరకం విద్యా విధానం చోటు చేసుకున్నాయి. కాని, ప్రాచీన నాగరికత, విద్య, విజ్ఞానం, సంస్కృతి, సంప్రదాయం ఇంకా ప్రపంచంలో అక్కడక్కడా —అంటే, ఆధునిక మానవుని దృష్టికీ, ఊహకూ అందని అసాధారణమైన ప్రదేశాల్లో, ఈనాటికీ బహు స్వల్ప సంఘాల్లో, వ్యక్తుల్లో, మతాల్లో ఛాయలుగా మిగిలివున్నాయి.

మనిషి కర్మబంధంనుంచి విముక్తిపొంది, పరిపూర్ణస్థితిని చేరుకోవడానికి అనేక జన్మలు ఎత్తవలసి వుంటుంది. ఆయా జన్మల్లో కూడా వారూ మామూలు మనుష్యులవలె జీవించి, ప్రేమించి, నలిగి, బాధలు, యాతనలు, కష్టాలు, సుఖాలు, దుఃఖాలు అనుభవిస్తారు. ప్రతి దేహధారికీ ఆ అవస్థలు తప్పవు. వారు ఓ జగద్గురువు దగ్గర చేరి, సాధనచేసి, అర్హత సంపాదించి,

తాము నిర్ణయించుకున్న మానవరూపంలో ఏళ్ళ తరబడి నిలిచి, తమవలె ఆ మార్గాన నడవదలచుకున్న వారికి సహాయం చేస్తారు. వారు కొన్ని అద్భుతశక్తుల్ని, కొన్ని గ్రహణశక్తుల్ని వృద్ధి చేసుకుంటారు. వారు అన్నివిధాలా ఔన్నత్యంకల పరిపూర్ణ మానవులు. అటువంటివారు ఎక్కడో అందరానంత దూరాన అంటే, స్వర్గంలో వుండే దేవతలు కాదు; వారూ, ఈ భూమికి చెందినవారే!

వారూ మనవంటి మనుష్యులే అయినా, రాగద్వేషం లేని నిర్ద్వంద్వులు. సద్గురు కృపవల్ల తత్వరహస్యం తెలుసుకుని, జీవన్ముక్తులై, కాలంలో నిలిచినవారు. వైరాగ్యం, జ్ఞానం, ఉపరతి పూర్ణంగా కలవారు. బ్రహ్మచర్యా దీక్షాపరులు. అణిమాది అష్టసిద్ధులు కలవారు గనుక, తమకు ఇష్టంవచ్చిన రూపం ధరించి, తలచుకున్నంత మాత్రాన ఎక్కడికైనా వెళ్ళ గల సమర్ధులు. ఇతరుల మనసులు తెలుసుకోగల శక్తిఎంతులు. అట్టివారిని పరమపురుషులనీ, పరమ గురువులనీ, సిద్ధపురుషులనీ అంటారు. అటువంటి మహాత్ములలో కొందరు అనేక అద్భుత శక్తులు సంపాదించి, సమస్త విశ్వాన్ని ఆకళింపు జేసుకుని, అపార దివ్యజ్ఞాన సంపన్నులై అమరులుగా నేటికీ ఈ భూమి మీద ఉన్నారన్న సంగతి కొందరు మహాత్ముల జీవిత చరిత్రల ద్వారా తెలియవస్తోంది. దాని ప్రకారం చూస్తే, పరిణామ అవస్థలో మానవుడు పరిపూర్ణుడు కాగలడని రుజువు అవుతోంది.

అటువంటి మహాత్ములకు "వయసు" అనేది ఆగిపోవడం వల్ల, అమరులుగా వుంటారు. వారు ఆ స్థితిని అందుకోవడానికి వారు పొందిన, నేర్చిన విద్య, విజ్ఞానం, చేసిన సాధన, ఉన్నత గుణాలు, గొప్ప వ్యక్తిత్వం—అవీ కారణాలు. వారికి ఆతృతలూ, ఆరాటాలు వుండవు. వారు ప్రశాంత జీవనులు.

వారికి మానవ జాతిపై గొప్ప ప్రేమ వుండటంవల్ల, మనుష్యులతో సంబంధం పెట్టుకుని వారిలో పరిపూర్ణత్వం కలగ జేయాలని అనేక విధాల పాటుపడతారు. ఈ ప్రపంచానికి వెలుగునూ, జీవమునూ ప్రసాదిస్తారు. చాలా బాధ్యతగా ప్రవర్తిస్తారు. ఆ సందర్భంలో వారు, కొందర్ని ప్రత్యేకంగా ఏరి తీసుకున్న వారికి దర్శనమిస్తో, కావలసిన సహాయంచేస్తో తమకు తెలిసిన విశ్వవిజ్ఞాన సర్వస్వాన్నీ, అంతిమ సత్యాన్నీ బోధిస్తో, తాము నిర్వహించే కార్యానికి వారిని వినియోగించు కుంటారు.

"కొందర్నే ఎందుకు ఏరి తీసుకుంటారు?" అని అడిగితే; "దేహతత్వం, రోగవిధానం తెలుసుకుని కదా మందులు ఇవ్వడం? విరివిగా వైద్యగ్రంధాలు చదవడంవల్లా మన వద్ద ఆ గ్రంధాలు వుండటంవల్లా రోగాలు నయమౌతాయా? కొడుకులందర్నీ సమంగా చూసే తండ్రి, అర్హత గమనించి, ఒక కొడుక్కే తాళంచెవి ఇస్తాడు. అట్లానే మహాత్ములు అన్ని కాలాల్లో ఇన్ని కోట్ల మందిలో అర్హులైనవారినే ఏరి తీసుకుంటారు," అని సమాధానమిస్తారు.

ఆ మహాత్ములు తాము నిర్దేశించుకున్న కార్యనిర్వహణకు అవసరమైనప్పుడు తమ శిష్యులకు అనేక మహాత్యాలు చేసి చూపుతారు. ఆ సందర్భంలో చిత్ర విచిత్రమైన, అసాధారణ మైన అనూహ్యమైన అలౌకిక శక్తులు ప్రకటనమౌతాయి. ఆ శిష్యులను క్షణం విడవక సదా వెన్నంటి వుంటారు. వారికి నిగూఢ రహస్యాలు బోధిస్తారు. స్థూల, సూక్ష్మ రూపాల్లో వారికి దర్శనమిస్తారు. ఉత్తరాలు రాస్తారు. కబుర్లు పెడతారు. సమా చారాలు అందజేస్తారు. ఎన్నో అద్భుతాలు చేస్తారు. కాని,

తాము ఏరి తీసుకున్న వారిని గట్టిగా శోదిస్తారు, పరీక్షిస్తారు. తాము చేపట్టిన కార్యక్రమం తాము ఎన్నుకున్న వారి మనసులో గట్టిగా నాటుకుపోయేటట్లు చేస్తారు. ఆ విధంగా అసలు సత్యానికి వారి కళ్ళు తెరిపిస్తారు. వారికి ఉపదేశం, దీక్ష ఇస్తారు. ఆదేశాలూ ఇస్తారు. పవిత్రంగా జీవించమనీ బాధ్యతతో వ్యవహరించమనీ హెచ్చరిస్తారు. ఆ కార్యభారాన్ని పూర్తిగా వాళ్ళ మీదే వుంచుతారు. అలా గట్టిగా విదించడంవల్ల వారు ఆ మహాత్ములకు అయస్కాంతానికి ఇనుము అతుక్కున్నట్లు, అతుక్కుపోతారు - ఎప్పటికీ విడిపోకండా, తను మధ్య సంబంధం చెడి పోకుండా. ఆ మహాత్ములు శిష్యుల ద్వారా తమ నిర్ణీత కార్యక్రమాన్ని నడుపుతారు. తమ ఉనికినీ, మహిమనూ ప్రజలు నమ్ముతున్నదీ, లేనిదీ వారికి పట్టదు.•

---

• నోట్ :- "లోకమందు జ్ఞానం ప్రతిష్ఠించు కొరకు బ్రహ్మ మానస పుత్రులైన సనత్కుమారుల వారి యాజమాన్యమున, "మహీ పీఠం" అను జ్ఞానదాతల సమూహము భూలోకమునకు పంపబడెను."

పీఠమంటే, జ్ఞానోపదేశం చేయుటకు అధికారం కల జ్ఞానులు వుండుచోటు. మహీపీఠమంటే, మహర్షులు వుండుచోటు. అక్కడ జీవన్ముక్తులందరూ కలుస్తారు.

భారతదేశంలో శ్రీశంకరాచార్యులవారు సాపించిన పీఠములు వంటివి, ప్రపంచంలో ఎక్కడ, ఏమతంలో వున్నా, వాటి అన్నింటికన్నా అధిక శక్తివంతమైనది ఈ "మహాపీఠం". దానికి అగ్రగణ్యులు సనత్కుమారులు. ఆయనే మహీపీఠానికి అధిపతి. ఆయన జ్ఞాన సముద్రులు. మహాత్మా మైత్రేయుల

వారు వారికి ప్రధాన మంత్రిగా వ్యవహరిస్తారు. సకల మత స్థాపకులూ వారి శిష్యవర్గంలోని వారే : వారందరూ సనత్కుమారుల వారి ఆజ్ఞకు లోబడి వుంటారు. వారందరి అభీష్టం, - లోకమందుగల అజ్ఞానమును నశింపజేసి, జ్ఞానదానం చేయడం.

అన్ని కాలాల, అన్ని మతాల తాలూకు సమస్త విద్యల్ని లోకులకు, అందించే నిమిత్తం, తగిన గురువులను లోకమందు అవతరించునట్లు నియమించుట కూడా ఆ మహీపీఠం వారి కార్యక్రమాల్లో ఒకటి. వారు భూలోకమంతా భాగాలుగా విభజించి, ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క మహాత్ముని అధికార నిర్వహణకింద వుంచుతారు.

ఆ మహీపీఠం చేరిన మహాత్ములందరూ లోకసేవా పరులై, అనేక కార్యక్రమాలు చేపడతారు. కొందరు శిష్యుల్ని ఏరి తీసుకుంటారు. కాని, వారు మాత్రం ప్రచ్ఛన్నంగా వుండి, ఆ శిష్యుల చేత తమ కార్యక్రమాల్ని నిర్వహిస్తారు. కాని, ఎవరు ఎవరికి జ్ఞాన దీక్ష ఇవ్వాలన్నా, సనత్కుమారుల వారి అనుమతి తప్పనిసరిగా వుండాలి.

భరతఖండమునకు సర్వాధిపత్యం అగస్త్య ఋషికి ఇవ్వబడింది. ఆయన పార్వతీ - పరమేశ్వర కళ్యాణ కాలమందు దండకారణ్యమునకు పంపబడ్డట్లు పురాణాల్లో వుంది,

అటువంటి సిద్ధపురుషుల నివాస స్థలాలు, మఠాలు మానస సరోవరందగ్గరా, ఈజిప్టులో, చాలావరకు టిబెట్‌లో వున్నట్లు పరిశోధనలద్వారా రుజువుఅవుతున్నాయి. ఆ సిద్ధపురుషులలో మాష్టర్ మోర్య, మాష్టర్ కుతుమి ముఖ్యులు. వారిద్దరూ మహా పీఠమునకు చెందినవారు. వారి నివాసస్థలం, టిబెట్. మాష్టర్ జ్వాలకుల్ కూడా అక్కడివారే.

మాష్టర్ మోర్య గత జన్మలో రాజపుత్రరాకుమారుడు. ఆయన ఆరడుగుల మనిషి. అంగసౌష్టవంతోపాటు ఎంతో అందమైనవారు. నిగనిగలాడే నల్లని జుట్టుతో, మెరిసే కళ్లతో ఠీవిగా వుండేవారు. ఆ సంగతులన్నీ ఆయన్ని దర్శించినవారు వర్ణించారు. ఎంతటివారినీ తనవైపు ఆకర్షించుకోగల శక్తివంతులాయన.

మాష్టర్ కుతుమి నిజనామం, నిశికాంత చటోపాధ్యాయ. ఆయన గత జన్మలో కాశ్మీరు బ్రాహ్మణులు. కొన్నాళ్ళు బౌద్ధమతం స్వీకరించారు. మరికొన్నాళ్ళు హిమాలయాల్లో వున్నారు. గుర్రంమీద ఎన్నో దేశాలు తిరిగారు. గొప్ప సంగీత పరిజ్ఞానం కలవారు. ఆయన కళ్ళు నీలంగా, జుట్టు - గెడ్డం నల్లగా, దేహం బంగారు ఛాయతో మెరిసిపోయేవి. ఆయన అంతకుముందు జన్మలో గ్రీక్ వేదాంతి "పైథాగరస్". ఆయన మహాత్మా మైత్రేయునకు మొదటి సహచరులు. మహాత్మా మైత్రేయ అంతకుపూర్వం అవతారాల్లో పశ్చిమదేశాల్లో క్రైస్ట్‌గా, తూర్పుదేశాల్లో బోధిసత్వుడుగా వున్నారు.

మహాత్మా మైత్రేయ బంగారువర్ణపు జుట్టు - గెడ్డంతో, అందమైన కళ్ళతో, దివ్యత్వంతో వెలిగిపోయేవారు. "మైత్రేయ" అంటే, "దయ" అని అర్థం. ఆయన

హిమాలయాల్లో అందమైన పూలతోటగల ఓ కుటీరంలో వుండే వారు. ఆయన అనేక కాలాల్లో, అనేక దేశాల్లో ఆయాపరిస్థితులకు అనుగుణంగా అవతారాలు ఎత్తి, అనేక మతాలు స్థాపించారు. మాష్టర్ మోర్య, మాష్టర్ కుతుమి వారికి సన్నిహితులు. వారు ఒక సమయంలో ఆయన కుటీరానికి చేరువలో వుండేవారు.

దాదాపు నూటయాభై సంవత్సరాలకు పూర్వం, రష్యా దేశంలో, ఒక సంపన్న కుటుంబంలో జన్మించిన ఒకామె సాంఘికాచారాల్ని, సాంప్రదాయాల్ని, దేశ-కాలపద్ధతుల్ని, పరిస్థితుల్ని, బంధు-మిత్రుల మూర్ఖపు అభ్యంతరాల్ని పరిచారకుల-పరిచయస్థుల కఠిన పర్యవేక్షణల్ని భరించలేక, తిరుగుబాటుచేసీ ప్రయోజనం కనుపించక, వివాహంతోనైనా ఆ చీదరంతా పోతుందేమోనని ఆశించింది. వివాహంతో కోరిన స్వేచ్ఛ లభించకపోగా, పైపెచ్చు భర్త ఆమె చుట్టూ గట్టి రాతి గోడలు కట్టాడు. ఇంక భరించలేక సంసారాన్ని, సంసారాన్ని సర్వస్వాన్ని త్యజించి, ప్రపంచమంతా పలుమారులు తిరిగి, అనేక యాతనలు, బాధలు, కష్టాలుపడి, ఆశ్రమాలు చేరి, గురువుల్ని దర్శించి, సిద్ధపురుషుల్ని అర్థించి, విశ్వరహస్యాలు తెలుసుకుని, ఎంతో విజ్ఞానాన్ని సంపాదించి, అలౌకిక-నిగూఢ శక్తుల్నికూడా సంపాదించి, అనేక గ్రంధాలు రచించి, జీవితాశయాన్ని పరిపూర్ణంచేసుకుని, ప్రపంచచరిత్రలో ప్రముఖ స్థానం ఆక్రమించి, శేషజీవితాన్ని ప్రశాంతంగా గడపాలని పారిస్ సమీపానగల "ఫాన్‌టైన్ బ్లూ" అనే అందమైన పర్వత ప్రదేశంలో నివసిస్తోవుండగా — ఒకరోజున ఒకామె భారంగా అడుగులు వేసుకుంటో ఆమెను సమీపించి, మోకరిల్లి, ఆమె కళ్ళల్లోకి సూటిగాచూస్తూ, చాలాసేపు మౌనంగా వుండి, "నన్ను మీ శిష్యురాలిగా అంగీకరించి తీసుకుంటారా?" అని ప్రార్ధనాపూర్వకంగా అడిగింది.

దానికి ఆమె సమాధానం చెప్పలేదు.

అంతసేపూ మౌనంగా, నిశ్చలంగా, గంభీరంగావున్న ఆమె కళ్ళల్లోకి తీక్షణంగా చూసి, "మిమ్మల్ని నా గురువుగా ప్రపంచముందు చెప్పుకోవడానికి అనుమతి ఇస్తారా?" అని మళ్ళా అడిగింది.

ఆ మాటతో ఆమె కళ్ళల్లోంచి నీళ్ళు జలజలారాలాయి. ఆమె తలపై చేయివేసి, "నువ్వు ఉన్నతురాలివి. ఈశ్వరుడు నిన్ను అనుగ్రహించుగాక:" అని హృదయపూర్వకంగా దీవించింది.

దివ్యమైన ఆక్షణంనుంచి ఆమెకు శాంతి లభించింది. ఆమే, అనీబిసెంట్. ఆమె గురువే, మేడమ్ బ్లావట్స్కి. గురు – శిష్యులిద్దరూ ప్రపంచచరిత్రలో ప్రముఖ స్థానాలు ఆక్రమించుకున్నారు.

బ్లావట్స్కి పూర్తిపేరు, మేడమ్ హెలీనా పెట్రోవనా బ్లావట్స్కి. ఆమె 1831 ఆగస్ట్ 12వ తేదీన దక్షిణ రష్యాలో "ఇకాటిరినోస్‌లావ్" అనే గ్రామంలో జన్మించింది. ఆమె పూర్వీకులు మూడువందల సంవత్సరాల క్రిందట, జర్మనీ నుంచి రష్యా వచ్చి స్థిరపడ్డారు. ఆమె తండ్రి పీటర్ హాక్‌హాన్. ఆయన మిలిటరీలో సైన్యాధిపతిగా పనిచేసేవారు. ఆమె తల్లి, చిన్నప్పుడే చనిపోయింది. అందువల్ల బ్లావట్స్కి "సారిటోవ్" లో అమ్మమ్మగారి ఇంటివద్ద వుండి చదువుకుంది. తాతగారు సివిల్ గవర్నరుగా పనిచేసేవారు. ఆమెకు చిన్నప్పుడంతా ఏదో ఒక జబ్బు చేస్తూనే వుండేది.

బ్లావట్స్కి చిన్నప్పటినుంచీ ప్రత్యేక తరహా పిల్ల. తన చుట్టూవున్న వాటినీ, జరుగుతున్న విషయాలను, సంగతులనూ జాగ్రత్తగా గమనిస్తూ ఎరుకలో వుండేది. కాని, ఆమెలో ఒక విచిత్రమైన గుణం వుంది – అర్ధరాత్రి నిద్రలో లేచి, దూరంగా ఎక్కడికోవెళ్ళి, అదృశ్యశక్తులతో మాట్లాడేది. చదువులో తెలివైనది. ఆటల్లో చురుకైనది. తాతగారి ఇంట్లో వున్న గ్రంథాలన్నీ స్వశక్తితో చదివి ఎంతో విజ్ఞానాన్ని

ఆర్జించింది. చదువుతోపాటు సంగీతంకూడా నేర్చింది. పియానో చక్కగా వాయించేది. ఆమెది గొప్ప కళా హృదయం.

అద్భుతమైన ఆమె మనోశక్తికీ, ఊహాశక్తికీ, బంధుమిత్రులు ఆశ్చర్యపోయేవారు. ఆమెకు అలౌకికశక్తులంటే ఇష్టం. ఆ ఇష్టంతో వాటికి సంబంధించిన గ్రంథాలన్నీ చదివింది. పదిహేనేళ్ళ వయసు వచ్చేప్పటికి, ఆమె ఎంతో విజ్ఞానాన్ని సంపాదించింది.

బ్లావట్స్కీ ఎప్పుడూ ఏవో దూరపు కలలు కనేది. అందుచేత ప్రతి పనినీ, ప్రతివారూ అభ్యంతరం పెట్టడమేకాక, నిందించి, గట్టి ఆంక్షలు విధించి, కఠిన నియమ నిబంధనలలో పెట్టేవారు. అవన్నీ భరించలేక ఆమె చాలాసార్లు ఎదురు తిరిగేది. కాని, లాభంలేకపోయింది. ఒక్కొసారి ఆమెను మరీ విసుగెత్తించేవారు. వాళ్ళ మూర్ఖత్వాన్ని భరించలేక, ఏదో పుస్తకం తీసుకుని దూరంగా వెళ్ళిపోయేది. లేదా, గుర్రంమీద ఎక్కడికో వెళ్ళి ఏరాత్రికో తిరిగి ఇంటికి వచ్చేది. ఆమె గుర్రపు స్వారీ చాలా నిర్భయంగా చేసేది. ఒకసారి ఆమె స్వారీ చేస్తుండగా, కాలుజారి పడిపోబోతే, ఒక అదృశ్యవ్యక్తి ఆమెను తనచేతులమీద కాపాడాడు.

వయసు పెరిగినకొద్దీ బ్లావట్స్కీ విలక్షణత్వం అందర్నీ ఇబ్బంది పెట్టింది. వారు ఆమెను ఎప్పటికీ అర్థంచేసుకోలేకపోయారు. అప్పట్లో "ఎరివాన్" రాష్ట్ర వైస్ గవర్నరుగా వున్న "నిసెఫోర్ .వి. బ్లావట్స్కీ" అనే ఆయన ఆమెకు పరిచయమయ్యారు. ఆయన అవివాహితుడు. నలభై ఏళ్ళవాడు. అప్పటికి బ్లావట్స్కీ వయసు పదిహేడేళ్ళు. ఆమెకు

అతనిపై ప్రత్యేక ప్రేమంటూ ఏమీ లేకపోయినా, ఇంటా-బైటా తనపై అర్ధంలేని ఆంక్షలూ, క్రమశిక్షణలూ అధికం కావడంతో వాటినుంచి బైటపడటంకోసం ఆమె అతన్ని వివాహం చేసుకుంది. అదీకాక, అప్పటికే వారిద్దరి విషయమై అనేక అపవాదులు వచ్చాయి.

పెళ్ళయిన తర్వాత, ఆమెను భర్త గట్టి అదుపు, ఆజ్ఞల్లో పెట్టాలనుకున్నాడు. అతని ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో రోషం వచ్చి, ఆమెపై మరిన్ని ఆంక్షలు విదించాడు.

అతను ఒకసారి బ్లావట్స్కీని విలాసయాత్రకు తీసుకు వెళ్ళాడు. అక్కడ అతను ఇంట్లోలేని సమయంచూసి, ఆమె ఓమంచి గుర్రాన్ని తీసుకుని, కొన్ని నిత్యావసర వస్తువులు, చిల్లర సామానులు మూటకట్టుకుని పారిపోయింది. కొండలు, అడవులు, మైదానాలు, ఎడారులు దాటి ఈజిప్ట్, గ్రీస్, తూర్పు యూరప్‌దాటి కాన్‌స్టాంటినోపిల్ చేరుకుంది. ఆమె జాడ తెలియక భర్త, ఆ వార్త ఆమె తండ్రికి తెలిపాడు.

చేతిలో డబ్బులేక బ్లావట్స్కీ మొదట ఒక సర్కస్ కంపెనీలో చేరింది. అక్కడ ఒకసారి గుర్రపుస్వారీ చేస్తుండగా ప్రమాదం సంభవించింది. వెంటనే పూర్వం రక్షించిన ఆ అదృశ్య వ్యక్తి మళ్లా వచ్చి రక్షించారు.

బ్లావట్స్కీ ఈజిప్టులో ఒక సంవత్సరం సంగీతం నేర్చుకుంది. పియానో వాయిద్యంలో ప్రజ్ఞావంతురాలు కావడం చేత, పారిస్, లండన్ నగరాలలో పియానో ప్రదర్శనలు ఇచ్చింది. పెద్ద పెద్ద వాయిద్య సమ్మేళనా కార్యక్రమాల్ని నిర్వహించింది. పత్రికలకు రాసి డబ్బు సంపాదించింది. ఎన్నో కష్టాలు, యాతనలు, బాధలు పడి, ధైర్యంగా జీవితం సాగించింది.

ఏ విధంగానైనా సరే మానవులకు సేవ చెయ్యాలనే సంకల్పం ఆమెలో దృఢంగా వుండటం చేత, జీవితంలో ఎప్పుడూ దేనికీ నిరుత్సాహపడలేదు, నిరాశ చెందలేదు. దేశం కాని దేశంలో చివరికి అవమానాల్ని కూడా భరించింది. జీవితాన్ని త్యాగం చేసి అయినా సరే, మానవ స్వభావాన్ని దైవత్వంగా రూపొందించ గల పరశువేది పొందాలనేది ఆమె ఆకాంక్ష. ఆమెలో ఆ కోర్కె కేంద్రీకృత జ్వాలగా రగుల్కొంది. దాన్నే జీవితలక్ష్యంగా పెట్టుకుంది. ఆ లక్ష్యసాధనలో సమస్తాన్ని తృణప్రాయంగా విసర్జించింది.

ఒకరోజున ఆమె లండన్ వీధుల్లో తిరుగుతూ వుండగా, తనను చిన్నప్పటినుంచీ వెంటవుండి కాపాడే అదృశ్యవ్యక్తి దర్శనమిచ్చారు. అసలు ఆయనెవరో ఆమెకు తెలియదు. కాని ఆయన్ని చూడగానే గుర్తించింది; ఆయనే తనను మొదటినుంచీ రక్షించే అదృశ్య వ్యక్తని. ఆయన ఇండియా యువరాజా వలె వున్నారు. ఆమె ఆయనతో మాట్లాడాలనుకుంది. మళ్లా ఏదో ఆలోచన అడ్డువచ్చి ఆగిపోయింది. ఆయన కొంత మంది మిత్రులతో కలసి దూరంగా వెళ్ళిపోయారు. ఆయన కనుపించడం, తాను ఆయనతో మాట్లాడాలనుకోవడం, అంతలో ఆయన దూరంగా వెళ్ళిపోవడం - అదంతా ఆ మర్నాడు "హైడ్‌పార్క్" లో కూర్చుని ఆలోచిస్తోవుండగా అంతలో ఆయన మళ్లా కనుపించారు. ఆయన తనవైపు రావడం గమనించి సంతోషపడింది. ఆయన చాలా దర్జాగా, హుందాగా, గంభీరంగా వున్నారు. ఆయన గొప్ప ఉన్నతులువలె కను పించారు. ఆమె లేచి నిలబడేలోపల, చేతిసౌంజ్ఞతో ఆమెను కూర్చోమని, ఆయన వెళ్ళి ఆమె పక్కన కూర్చుని, "నేను ఒక ముఖ్యమైన పనిమీద లండన్‌లో వున్నాను. నీతో మాట్లాడా లని వచ్చాను," అన్నారు. ఆయనే మాష్టర్ మోర్య.

తాను వింటున్న మాటల్ని బ్లావట్స్కి నమ్మలేకపోయింది. భవిష్యత్తులో, మానవ జాతిని ఉద్ధరించేయత్నంలో, ఆయన ఆమె సహకారాన్ని కోరారు. అయినా, మరి కొందరూ ఆ కార్యం నిర్వహించదలిచారు. ఆ కార్యార్థం అయన ఆమె అంగీకారం కోరితే, ఆమె సంతోషంతో అంగీకరించింది. కార్య సాధనలో రాబోయే కష్టాలు, బాధలు, ఆమెకు చెప్పారు ఆయన. అయినా ఆమె అంగీకరించింది. ఆ కార్యక్రమ నిర్వహణార్థం, ఆమె కొన్నాళ్ళు టిబెట్‌లో మహాత్ముల వద్ద శిక్షణ పొందవలసి వుంటుందన్నారు. టిబెట్ వెళ్ళేరోజు త్వరలో రాబోతోంది గనుక, ఆమెను సిద్ధంగా వుండమన్నారు.

ఆనాటినుంచి బ్లావట్స్కి మాష్టర్ మోర్య అధ్వర్యంలో నడచింది. అటువంటి క్లిష్ట సమయంలో ఆయన ఆదరణ లభించడంవల్ల విశాలమూ, భయంకరమూ అయిన ప్రపంచం ఆమెను ఏమీ చేయలేకపోయింది. ఆమె ఎక్కడ ఎట్లావున్నా, ఆమెకు తండ్రి డబ్బు పంపించేవారు. కాని, ఒక్కొకసారి ఆయనకు ఆమె జాడ తెలిసేదికాదు. బహుశా తన కూతురు చనిపోయిందనుకునేవారు, ఆ తండ్రి. కాని, గురువైన మాష్టర్ మోర్య, ఆయన సహవాసి మాష్టర్ కుతుమి ఆమెకు ఏదో విధంగా, ఎక్కడోచోట దర్శనమిస్తూ కాపాడారు.

గురువు ఆజ్ఞకోసం బ్లావట్స్కి చాలా కాలం ఎదురు చూసింది. ఆ మధ్యకాలంలో లెబనాన్‌కు చెందిన " THE DRUSES OF LEBANON " అనే ఒక రహస్య సంఘంలో చేరింది.

బ్లావట్స్కి లండన్‌లో వుండగా ఒకసారి జీవితంమీద విరక్తి కలిగి, "వాటర్ లూ బ్రిడ్జి" మీదనుంచి దూకి ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. అంతలో మాష్టర్ మోర్య ప్రత్యక్షమై ఆమెను ఆత్మహత్యా ప్రయత్నంనుంచి తప్పించి, "తొందర

పడకు. త్వరలో నీకు అన్నీ సిద్ధిస్తాయి," అని హామీ ఇచ్చారు. మహాపీఠాధిపతుల అనుమతితో దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించ దలచారు మాష్టర్ మోర్య, మాష్టర్ కుతుమి. ఆ సమాజ స్థాపనకు వారు బ్లావట్స్కీ సహాయం కోరారు.

ఆ రోజునుంచి బ్లావట్స్కీ జీవితమే మారిపోయింది. తన జీవితం కేవలం అలౌకికశక్తులమయమేకాక, ఇంకా అనేక గొప్ప సంగతులకోసం నిర్దేశింపబడివుందని గ్రహించింది. మాష్టర్ మోర్య తన జీవితాన్ని నడుపుతారనే విశ్వాసంతో, బ్లావట్స్కీ ఆనందపడింది. ఆయన అందరికీ రాజపుత్రుడుగా దర్శనమిచ్చినా, ఆమెకు అమరుడుగా, దివ్యుడుగా, సిద్ధుడుగా, శాశ్వతుడుగా కనుపించారు.

బ్లావట్స్కీ లండన్‌నుంచి అమెరికా వెళ్లి, అక్కడనుంచి గురునివాస స్థలమైన టిబెట్ వెళ్ళాలనుకుంది. కాని, గురువు నిర్దేశించిన సమయంరాక, నేపాల్‌దాటకుండానే తిరిగి లండన్ చేరుకుంది. అక్కడనుంచి ఉత్తర, దక్షిణ అమెరికాలు వెళ్లింది. అక్కడనుంచి కెనడా, న్యూ ఆర్లియన్స్, వెస్టిండీస్, జపాన్ మీదుగా 1852 చివరలో ఇండియా వచ్చింది. ఇండియాలో రెండేళ్ళు వుండి, రష్యా వెళ్లింది. అప్పటికి ఆమె స్వదేశం వదలి తొమ్మిదేళ్ళు అయింది. రష్యాలో రెండేళ్ళువుండి, "టిఫ్లిస్" వెళ్లి, వృద్ధురాలైన అమ్మమ్మను చూసింది. ఆమె తిరిగిన ప్రతిచోటా మహాత్ములీన్నీ, ప్రతిభావంతులీన్నీ, మేధావంతుల్నీ కలుసుకుంది. రష్యాలోవుండగా మాష్టర్ మోర్య కనుపించి, టిబెట్ వెళ్ళమన్నారు. బ్లావట్స్కీ ఇండియా వచ్చి, కాశ్మీర్ లడక్‌మీదుగా టిబెట్ వెళ్లి, మాష్టర్ కుతుమి పర్యవేక్షణలో నిగూఢ శాస్త్రరహస్యాల్ని తెలుసుకుంది. తన శారీరక, మానసిక శక్తుల్ని ఆధీనంలోకి తీసుకుని అద్భుతాలను

చేయగల శక్తి సంపాదించింది. మనోశక్తితోపాటు ఆమెకు యోగదృష్టి లభించింది. టిబెట్‌లో మూడేళ్ళుండి, (1867-70) అనేక విషయాల్ని కూలంకషంగా తెలుసుకుంది. అనేక విద్యలతో పాటు అలౌకిక శక్తుల్ని కూడా సంపాదించింది.

బ్లావట్స్కీ టిబెట్‌నుంచి సైప్రెస్, అలెగ్జాండ్రియా, ఈజిప్టు, సిరియా, లెబనాన్, కాన్‌స్టాంటినోపిల్‌లలో కొన్నాళ్ళు వుంది. ఆమె "ఒడెస్సా"లో వుండగా మళ్ళా గురు దర్శనమైంది. ఆయన ఆదేశానుసారం ది. 7-7-1873 న అమెరికా వెళ్లి కర్నల్ ఆల్కాట్‌ను కలుసుకుంది. చేతిలో ఏమాత్రం డబ్బు లేకుండా అమెరికాలోవుండి బట్టలు కుట్టి బ్రతికింది. గురువు ఆజ్ఞానుసారం నడచుకుంది.

1873 లో పారిస్‌వెళ్లి, సంగీతం-సాహిత్యం-చిత్రలేఖనం మొదలైన కళలలో మంచి తర్ఫీదు పొంది "కళాతపస్వి" అనే బిరుదు పొందింది. అనేక వ్యాపారాల్ని చేపట్టింది. ఒక వ్యాపారంలో నష్టంవచ్చింది. ఆ కష్టకాలంలోనే ఆమె, తండ్రి మరణవార్త విన్నది. అంతలో ఆమెకు సిద్ధపురుషుల నుంచి గట్టి ఉత్తరువులు వచ్చాయి, "ప్రపంచాన్ని ఉద్ధరించేందుకు త్వరలో జగద్గురువు అవతరించబోతున్నారు. వారిని ఆహ్వానించేందుకు "దివ్యజ్ఞాన సమాజం" అని ఒక సమాజాన్ని స్థాపించండి," అని.

ఆ సందర్భంలో బ్లావట్స్కీ ఆల్కాట్‌ను కలుసుకుంది. ఆయన పూర్తిపేరు హెన్రీ స్టీల్ ఆల్కాట్. ఆయన 1832 ఆగస్టు 2వ తేదీన అమెరికాలో జన్మించారు. మొదట ఆయన న్యాయవాది వృత్తి స్వీకరించి, తర్వాత అమెరికా అంతర్యుద్ధంలో పాల్గొని, మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. ఆయనకు జర్నలిజమ్‌లో కూడా ప్రవేశముంది.

ఆయన గొప్ప వక్తే కాక, గొప్ప రచయిత కూడా. అన్ని రంగాలలో ఆయన కడు సమర్థులు. 1860 లో వివాహం చేసుకుని, ఇదరు కొడుకులు పుట్టిన తర్వాత, దాంపత్య సఖ్యత లేక, భార్యతో విడిపోయారు. అలౌకికశక్తుల సంపాదనలో మునిగివున్న సమయంలో ఆయనకు బ్లావట్స్కీతో పరిచయమైంది. ఆమె సహాయంవల్ల మహాత్ముల దర్శనభాగ్యం కలిగింది. క్రమంగా ఆయన మహాత్ముని శిష్యులై, సమస్తాన్ని పరిత్యజించారు. అలౌకిక శక్తుల్ని సంపాదించారు.

గురువాజ్ఞానుసారం బ్లావట్స్కీ, ఆల్కాట్, డబ్లియు. క్యూ. జడ్జి, ఒక ఐరిష్ లాయరు — ఆ నలుగురూ కలిసి ది. 17-11-1875 న, దివ్యజ్ఞాన సమాజాన్ని న్యూయార్క్‌లో స్థాపించారు. ఆ సమాజానికి ఆల్కాట్ ప్రెసిడెంట్. బ్లావట్స్కీ సెక్రటరీ. ఆ సమాజంలో అందరికీ ప్రవేశార్హత వుంది. దాని లక్ష్యాలు : విశ్వశక్తుల పరిశోధన — పురాతన గ్రంధ ప్రచురణ—విశ్వాన్ని పాలించే ధర్మాన్నీ, జ్ఞానాన్నీ కేంద్రీకృతంచేసి, ఆ విజ్ఞాన సర్వస్వాన్ని ప్రజలకు అందించి, వారిని మేల్కొల్పడం.

దివ్యజ్ఞాన సమాజ స్థాపనతో బ్లావట్స్కీ జీవిత విధానం పూర్తిగా మారిపోయింది ఆసమాజం బ్రాంచి ఒకటి లండన్‌లో పెట్టారు. సమాజ సంరక్షణ బాధ్యత, సిద్ధపురుషుల చేతుల్లో వుంచారు.

దివ్యజ్ఞాన సమాజంవారు ఏ భేదభావం చూపకుండా అందర్నీ సౌదర-సోదరీ బావంతో తీసుకున్నారు. మతైక, తాత్విక, శాస్త్రాభివృద్ధితోపాటు, ప్రకృతి ధర్మాల్ని తెలుసుకోవాలనీ, మనిషిలోని నిగూఢ శక్తుల్ని వెలికి తీసుకురావాలనీ దివ్యజ్ఞాన సమాజం గట్టిపట్టుదలతో పనిచేసింది.



బ్లావట్స్కీ



ఆల్కాట్



లెడ్‌బీటర్



కృష్ణమూర్తి

బ్లావట్స్కీ అమెరికానుంచి ఇండియావచ్చి, అలహాబాద్‌లో కొన్నాళ్ళు వుంది. ఆమె వున్న ఇంటిపేరు "క్రోస్‌నెస్ట్" ఆమె ఉదయమే లేచి, ఏదో ఒకటి రాసుకుంటూ వుండేది. ఆ సమయంలో ఎవరైనా ఆమెను చూడ్డానికి వెడితే, వారిని ముందు వరండాలో కూర్చొబెట్టి, మాట్లాడి పంపించేది. ఆమెను కలుసుకోవడానికి రోజూ ఎంతోమంది వచ్చేవారు. ఒక్కోసారి ఆమె కొందర్ని తరిమేసేది. పనివాడు 'బాబుల్' అంటే ఆమెకు ఎంతో ఇష్టం. రోజులో చాలాసార్లు అతన్ని ప్రేమగా పిలిచేది. అతనికి ఏదో ఒక పని చెప్పేది. అతడూ ఆమె యెడల భయ-భక్తులతో, గౌరవ-మర్యాదలతో మెలిగేవాడు. బాబుల్ పేరుతో ఇల్లు మారుమోగేది. ప్రతి విషయానికీ అతను ఆమె చెంత వుండవలసిందే!

బ్లావట్స్కీ ఏ పండితునితోనో, మతాధిపతులతోనో, సమాజ సభ్యులతోనో-హిందూమతంగురించో, సమాజం గురించో దీర్ఘంగా చర్చించేటప్పుడు-ఒక్కోసారి అంతమందిలోనూ ఆమెకు మాత్రమే ఒక వాణి వినిపించేది. ఆమె వెంటనే లేచి, మరో గదిలోకి వెళ్ళి ఆ వాణికి సమాధానం ఇచ్చి, అవసరమైన విషయమైతే చర్చించి, మళ్ళా ఎప్పటికో ఆగదిలోంచి తిరిగి వచ్చేది. ఆమెతో ఆ విధంగా రహస్యంగా మాట్లాడినవారు ఏ మహాత్ములో లేక తనవంటి సోదర - సోదరీ సాధకులో అయి వుండేవారు. వారితో మాట్లాడేప్పుడు ఆమె తక్కిన విషయాలన్నీ మరచిపోయేది. ఆ క్షణంలో ఆ మహాత్ములే ఆమె లోకం. వారు ఒక్కోసారి ఆమెకు అప్రాకృత రూపాల్లోనో, ఒక్కోసారి భౌతిక దేహాలతోనో దర్శనమిచ్చేవారు.

దివ్యజ్ఞాన సమాజ స్థాపనానంతరం, బ్లావట్స్కీ రచనలకు పూనుకుంది. ప్రాచీన గ్రంథాల్లోంచి ఏదైనా ఒక అసాధారణ అంశాన్ని తెలుసుకోవాలనుకుంటే, వెంటనే ఆవిషయం ఆమెకు

ప్రత్యేక దివ్యకాంతిలో స్పష్టంగా గోచరమయ్యేది. ఆవిధంగా ఆవిషయాన్ని పూర్తిగా అవగాహన చేసుకునేది. ఆమె తూర్పు దేశాల సమస్త గ్రంథాలను మథించి, వాటి సారాంశాలను గ్రహించి, అనేక గ్రంథాల్ని రచించింది. 1877 లో "ఐసిస్ అన్వీల్డ్" అనే పుస్తకం న్యూయార్క్‌లో అచ్చయింది. అది ప్రాచీన, ఆధునిక వేదాంత శాస్త్రాల రహస్యాల్ని వ్యక్త పరచే గ్రంథం. ఆ గ్రంథం వెలువడిన తర్వాత దివ్యజ్ఞాన సమాజం బాగా అభివృద్ధి చెందింది. ఆ గ్రంథం చదివినవారు, ఆమె అద్భుతశక్తిని గుర్తించి, ఆశ్చర్యపోయారు. అది మత శాస్త్ర విజ్ఞానమయ గ్రంథం.

1878 లో బ్లావట్స్కీకి అమెరికా పౌరసత్వం లభించింది. ఆ సంవత్సరం ఆల్కాట్‌తో కలిసి ఆమె ఇండియా వచ్చింది. వారు బొంబాయిలో దిగగానే అలహాబాద్‌నుంచి వెలువడే "ది పోయినీర్" అనే పత్రిక ఎడిటరైన ఎ. పి. సిన్నెట్ వచ్చి కలుసుకున్నారు. బ్లావట్స్కీ ఆయనకు సిద్ధపురుషుల్ని పరిచయం చేసింది.

వారి పరిచయంతో సిన్నెట్ 1880 నుంచి 1884 వరకు సిద్ధపురుషులతో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించారు. ఆ ఉత్తరాలు నేటికీ బ్రిటీష్ మ్యూజియంలో వున్నాయి. ఆ తర్వాత ఆ ఉత్తరాల్ని "ది మహాత్మా లెటర్స్" అనే పేరు మీద అచ్చువేశారు. అలాగే సిద్ధపురుషుల బోధల్ని ఆధారంగా తీసుకుని సిన్నెట్ మరో రెండు గ్రంథాలు రాశారు—1881 లో "ది అకల్ట్ వరల్డ్", 1883 లో "ఎసోటిరిక్ బుద్ధిజం" అనేవి.

బ్లావట్స్కీ ఇండియా అంతా తిరిగి బొంబాయిచేరి, "ది థియాసఫిస్ట్" అనే పత్రిక స్థాపించింది. దానికి ఆమే

ఎడిటర్. ఆ పత్రికకు కావలసిన సమాచారాన్నంతా సిద్ధపురుషులు అందజేసేవారు. ఆ రోజుల్లో ఆమె రష్యన్ భాషలో అనేక గ్రంథాలు రాసింది. పలుచోట్ల గౌరవాలు పొందింది.

బ్లావట్స్కీ, ఆల్కాట్ ఇద్దరూ ఇండియా నుంచి సిలోన్ వెళ్ళారు. అక్కడనుంచి అమెరికా వెళ్ళి, దివ్యజ్ఞాన సమాజంలో " అంతరంగ శాఖ " అని ఒక శాఖను ఏర్పాటు చేశారు. కాని, ఆమెకు అమెరికా అంటే విసుగెత్తింది. దివ్యజ్ఞాన సమాజ వికాసానికి అమెరికా ఏమాత్రం అనువైనది కాదని అభిప్రాయ పడి, ఆ విషయం సమాజ సభ్యులకూ, మహాత్ములకూ చెప్పి, దీర్ఘ చర్చలు జరిపింది. వారి చర్చల ఫలితంగా దివ్యజ్ఞాన సమాజ కేంద్ర కార్యాలయాన్ని న్యూయార్క్‌నుంచి ఇండియా తరలించడానికి నిర్ణయం జరిగింది.

మొదటినుంచీ దివ్యజ్ఞాన సమాజంవారి నమ్మకం ఏమిటంటే, నూతన మత ప్రబోధం కోసం, లోకసంరక్షణార్థం మహాత్మా మైత్రేయ మూడవసారి తమకు అనువైన మానవ దేహంలో జగద్గురువుగా అవతరిస్తారనీ, ఆయన్ని గుర్తించి ఆహ్వానించాలనీ. ఆ సంగతి బ్లావట్స్కీ తరచు సమాజ సభ్యులకు గుర్తుచేసేది ఆమె మాటల్ని సభ్యులందరూ నిస్సంశయంగా విశ్వసించారు. అప్పటికే దివ్యజ్ఞాన సమాజ కేంద్రాలు ప్రపంచంలో పలుచోట్ల ఏర్పాటై వున్నాయి.

బ్లావట్స్కీకి మొదటినుంచీ ఇండియా అంటే ఇష్టం, ప్రాణం, ప్రేమ. అందుచేత ఆమె, ఆల్కాట్ మరికొంతమంది కలిసి ఇండియాలో దివ్యజ్ఞాన సమాజ కేంద్రకార్యాలయ స్థాపనకు అనువైన స్థలాన్వేషణకు వచ్చారు. వారు బొంబాయిలో ఓడదిగి, ఇండియా భూభాగం మీద అడుగుపెడుతూ, " ఇది

పవిత్ర పుణ్యభూమి. మహాత్ముల నివాస స్థలం. సిద్ధ పురుషుల నిలయం. మతాలకు పుట్టినిల్లు." అంటూ నమ్రతగా ప్రవేశించారు. వారి రాకతో ఇండియాలో పెద్ద సంచలనం బయలు దేరింది. ఆ బృందం "ది థియాసఫిస్ట్" అనే పత్రిక ద్వారా తమ సమాజ ఆశయాల్ని, ఆదర్శాల్ని ప్రజలకు వివరించి, తెలియపరిచేవారు. అది కొత్త మతం కావడం వల్లా, దాని విధానం ప్రత్యేకంగా వుండటం చేతా కొందరు భారతీయులు ఆ సమాజంలో సభ్యులుగా చేరారు.

బ్లావట్స్కీ మహాత్ముల సహాయంతో సమాజ సభ్యులకు, ప్రజలకు కొన్ని మహాత్యాలు చేసి చూపించింది. అనేక సంగతులు వివరించి చెప్పింది. కాని, కొందరు స్వలాభాపరులైన ప్రజలు, సమాజ సభ్యులు తమకు ఎంతకీ ఎటువంటి ఫలితం, ప్రయోజనం కనుపించకపోయేప్పటికి, ఆమె చేసే మహాత్యాల్ని గారడీగా, పైశాచిక శక్తులుగా, హస్తలాఘవం వంటి విద్యగా జమకట్టి కొట్టేశారు. చివరికి ఆమె ఆదర్శాల్ని ఉత్తి మోసంగా నిర్ణయించారు. అంతేకాక, అమాయకపు ప్రజల్ని అమెరికా డబ్బుతో వశపరచుకుంటోందని ప్రచారం చేశారు. ఆమె ఆశయాల్ని దుయ్యబట్టారు. కొందరు సభ్యులు సమాజంనుంచి బైటికి వచ్చేశారు. భారతజాతికి భ్రష్టత్వం కలిగిస్తోందని ఆమెపై నిందలు మోపారు. ఆమె వ్యవహారమంతా బూటకమన్నారు. మహాత్ముల సంగతి ఉత్తనాటకమన్నారు. ఆ విధంగా ఆమెతో ప్రజలు విరోధిస్తే, ఇంగ్లీషు ప్రభుత్వం ఆమెను రష్యన్ గూఢచారిగా భావించింది. భారతదేశ ప్రజల్ని రష్యావైపు తిప్పడానికి ప్రయత్నిస్తోందనే అనుమానంపై అప్పటి గవర్నరు జనరల్ లిట్టన్, ఆమె వెనక సి.ఐ.డి. ఆఫీసర్లను నియమించారు. కాని, బ్లావట్స్కీ అచంచల విశ్వాసంతో ముందుకు సాగింది. సి. ఐ. డి. ఆఫీసర్ల రిపోర్టు ప్రకారం, ఆమె రష్యా గూఢచారి కాదనీ, ఆమె కేవలం

సదుద్దేశ్యంతోనే ఇండియా వచ్చిందనీ, దివ్యజ్ఞాన సమాజ స్థాపనా, ఆ సమాజ విస్తరణే ఆమె లక్ష్యమనీ, ఆమెకూ, దేశరాజకీయాలకూ ఎటువంటి సంబంధం లేదనీ, ఆధ్యాత్మిక జీవనమే ఆమె జీవిత విధానమనీ చెప్పగా, ప్రభుత్వం ఆమెను గుర్తించింది. దానితో ఆమె కీర్తి, దివ్యజ్ఞాన సమాజ ప్రతిష్ట దేశంలో మరింత బలపడ్డాయి. ఆ బృందం దేశమంతా తిరుగుతూ గుంటూరు వచ్చిన సందర్భంలో వారికి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు. ఆ బృందం ఇండియా అంతా తిరిగి చివరికి "అడయార్"ను దివ్యజ్ఞాన సమాజ కేంద్రకార్యాలయ స్థాపనకు ఎన్నిక చేశారు.

1882 డిశంబరులో దివ్యజ్ఞాన సమాజ కేంద్రకార్యాలయాన్ని అమెరికానుంచి అడయార్‌కు తరలించారు. దివ్యజ్ఞాన సమాజానికి సనత్‌కుమారును ప్రధాన గురువుగా భావించారు. ఆ తర్వాత బుద్ధుడు, మహాత్మా మైత్రేయ, మహాచోహన్‌లను మహాత్ములుగా నిర్ణయించారు.

అడయార్ చాలా అందమైన ప్రదేశం. అక్కడనుంచి ఒక నది ప్రవహించి సముద్రగర్భం చేరుతుంది. ఆ సాగర సంగమంవద్దవున్న విశాలమైన రెండువందల అరవై ఎకరాల భూమిని దివ్యజ్ఞాన సమాజంవారు కొన్నారు. ఆ ఆవరణ మధ్యలో బ్రహ్మాండమైన ఒక మర్రిచెట్టు వుంది. ఆ ఆవరణ అంతటా పచ్చని చెట్లు. చెట్లమధ్య ప్రార్ధనా మందిరాలు, నివాస గృహాలూ నిర్మించారు.

బ్లావట్స్కీ ప్రతిభా, ప్రభావంవల్లా, సిద్ధపురుషుల ప్రత్యుత్తరాలవల్లా, అనేక దివ్యదర్శన నిదర్శనాలవల్లా దివ్యజ్ఞాన సమాజం త్వరలో మరింత ప్రాపకంలోకి వచ్చింది. ఆవరణ అంతటా అనతికాలంలోనే అనేక అందమైన భవనాలు

లేచాయి. సమాజంలో ఎందరో కొత్త సభ్యులు చేరారు. చేరిన వారిలో కొందరు ఆవరణలోకాని, కార్యాలయానికి దగ్గరలోకాని నివాసాలు ఏర్పాటుచేసుకున్నారు. ఆవిధమైన విస్తరణ ముందుకాలంలో జరగబోయే మహానాటకానికి అడయార్ రంగ స్థలం కాబోతోందని కొంతమంది మేధావులకు సూచనప్రాయంగా గోచరమైంది, ఆనాటకానికి సూత్రధారులు మాష్టర్ మోర్య, మాష్టర్ కుతుమి, జ్వాలకుల్. వారు సమాజ సభ్యులకు దీక్షలు ఇచ్చి నడిపారు. దివ్యజ్ఞాన సమాజానికి గుండెవంటిదైన అంతరంగశాఖను బ్లావట్స్కీ నడిపేది. సమాజంలో రెండేళ్ళు నిజాయితీగా, శ్రద్ధగా,గట్టిగా పనిచేసిన ప్రతివారికి, ఆసెక్షన్‌లో ప్రవేశార్హత లభించేది.

1884 లో బ్లావట్స్కీ, లండన్ వెళ్ళింది. అక్కడ ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆర్థికంగాకూడా ఆమె బాగా చితికి పోయింది. ఆమె జీవితంలోనే చాలా నలిగిపోయింది. కాని, ఆ సంవత్సరమే ఆమె మహోన్నత గ్రంథమైన " The Secret Doctrine" (రహస్య గ్రంథం) పూర్తి చేసింది. ఆనవంబరులో ఆమె మళ్ళా అడయార్ వచ్చింది. కాని అక్కడ పరిస్థితులు అనుకూలంగా లేవు. మిత్రులు, హితులు, సన్నిహితులు అనుకున్నవారే ఆమెకు ఎదురు తిరిగారు. అపవాదులు వేశారు. అసహ్య ఆరోపణలు చేశారు. అయినా ఆమె నిర్భయంగా, నిశ్చలంగా నిలబడి, " ప్రజలు కోపంగా, ఈర్ష్యగా వుండి ముడుచుకుపోతున్నా, నేను వారిలో దివ్యత్వాన్నే దర్శిస్తాను. వారు తమలోని ప్రకాశాన్ని కప్పేసుకుని నిగూఢంగా నికృష్టంగా తిరుగుతున్నా, నేను వారిలోని మహనీయమైన మానవత్వాన్నే చూస్తాను. వారిని నిరాకరించడానికి నేనెవరిని ? వారి జీవన మార్గంలో ప్రవేశించడానికి నాకు ఏం అధికారం వుంది ?

'భయంకరమైన విషనాగుకు కూడా తిండిపెట్టకుండా వదలకు, అది నీచేయి కరచినా సరే:' అన్న బుద్ధుని మాటలు నన్నెప్పుడూ వెంటాడుతూనే వుంటాయి," అన్నది బ్లావట్స్కీ.

1885లో బ్లావట్స్కీ అడయార్‌నుంచి వెళ్ళి, మళ్ళా ఇండియా రాలేదు. 1887లో ఆమె బాగా జబ్బుపడింది. ఆ మరుసటి సంవత్సరం ఆమె మహోన్నత గ్రంథం - "రహస్య గ్రంథం" మొదటి రెండు భాగాలూ చందాలపై అచ్చయ్యాయి. ఆ గ్రంథాన్ని మాస్టర్ మోర్య, మాస్టర్ కుతుమ, బ్లావట్స్కీ ముగ్గురూ కలిసి తయారుచేశారనవచ్చు. ఆ గ్రంథం ద్వారా గుప్త విద్య, సమస్త శాస్త్రాలు, విశ్వరహస్యాలు, ధర్మాలు, విజ్ఞానం మొదలైనవి ఎన్నో వెలుగులోకి వచ్చాయి. ఆ గ్రంథం చదవాలంటే, ఎంతో ఓపిక అవసరం. అనేక కాలాల, మతాల, సాంప్రదాయాల, తత్వశాస్త్రాలకు చెందిన పరిభాషలలోని పదాల్ని, మాటల్ని, వాటి అర్థాల్ని, ప్రయోజనాల్ని వివరిస్తూ వ్రాసిన గ్రంథం, "రహస్యగ్రంథం".

"రహస్యగ్రంథం" ఆధునిక పరిశోధనా శాస్త్రవేత్తకు ద్వారాలు తెరిచింది. విశ్వ విజ్ఞానాన్ని అవగాహన చేసుకోవాలనే ఆకాంక్ష, ఉత్సాహం, దీక్ష, సాధన, శ్రమ, ప్రేమ చూపే వారందరికీ ఆ గ్రంథం ఉత్సాహాన్నీ, ప్రోత్సాహాన్నీ ఇస్తుంది. ఆ గ్రంథం ప్రపంచానికి ఎంతో విజ్ఞానాన్ని అందిస్తోంది. అది ఏనాటికీ విజ్ఞాననిధి, నిఘంటువు. ముఖ్యం, ఆనాటి జనబాహుళ్యానికి తెలియని అనేక అంతరంగిక సూత్రాలూ, సిద్ధాంతాలూ ఆ గ్రంథంలో వున్నాయి. గుప్తవిద్యకు సంబంధించిన విషయాలు ప్రతి తరంలోనూ తగుమాత్రంగా బహిర్గతమౌతూనే వున్నాయి.

1888 లో బ్లావట్స్కీ తన వారసురాలిగా అనీబిసెంట్‌ను సూచించింది. ఆ తర్వాత బ్లావట్స్కీ రాసిన రహస్యగ్రంథాన్ని ఇంగ్లండు దేశపు "పాల్‌మాల్‌గెజిట్" లో "సర్వదేశీయ సనాతన జ్ఞానసంపదను ఆధునిక యుగానికి అందించిన,- సృష్టి రహస్యాలు వివరించిన–గ్రంథం," రహస్య గ్రంథం. "అది మేధావులకే మహారణ్యప్రయాణం వంటిది," అని సమీక్ష చేసింది అనీబిసెంట్.

1889 లో బ్లావట్స్కీ రాసిన "ది కీ టు థియాసఫీ" అనే పుస్తకం అచ్చయింది. ఆ తర్వాత "ది వాయిస్ ఆఫ్ సైలెన్స్" అనే పుస్తకంలో బ్లావట్స్కీ తాను టిబెట్‌లో గురువుల వద్ద నేర్చుకున్న శాస్త్రాల్ని అనువదించింది.

బ్లావట్స్కీ అంత గొప్పస్థితిలోవున్నా, కొందరు ఆమెను వృత్తి మోసంగా, కపటురాలుగా, దగాకోరుగా కొట్టేశారు. కాని, కొందరు ఆమెను గొప్ప మహిమాన్వితురాలుగా, పైలోకం నుంచి శక్తులు పొందిన మహాత్మురాలుగా చెప్పుకునేవారు.

బ్లావట్స్కీ కన్న సుందర స్వప్నాన్ని, జీవితాశయాన్ని అడయార్ దివ్యజ్ఞాన సమాజకేంద్ర కార్యాలయం రూపంలో చూసి చాలా సంతోషించింది. ఆమె నిర్మల జీవితం, నిర్భయత్వం, నిశ్చలత్వం, నీతి, నిజాయితీ మొదట ఆమె జీవితాన్నే చిందరవందర చేసి, కష్టాలపాలుచేసినా, అశాంతిమయం చేసినా, చివరకు ఆమె జీవితం ఆనందంగా సాగింది. ఆమెది నిష్కల్మషమైన మనసు. విశాలమైన హృదయం. ఆమె ఆధ్యాత్మిక దృష్టి, అందరియెడలా సోదరభావం, గురువులయెడ గౌరవం, ప్రేమ, సత్యంయెడల నమ్రత, తాను నమ్మినదాన్ని నిర్మొహమాటంగా నిర్భయంగా చెప్పగలగడం, విపరీతమైన చురుకుదనం, ఆతృత, ఆరాటంతో కూడిన

బుద్ధికుశలత, దీనుల-దుఃఖితుల – నిర్ధనుల యెడ దయ, మానవజాతి పరిపూర్ణతకై పాటుపడటం ఆమెలోని ఉన్నత గుణాలు. ఆమె ఆశావాదిగా కనిపించినా, మానవుల మధ్య జాతి-మత వైషమ్యాల్ని నిర్మూలించి మానవుల్ని ఉన్నత పథాన నడిపించాలనే ఆకాంక్ష, దానికై ఆమె యత్నం, బ్రతుకంతా ఆమెపడ్డ కష్టం అనన్యాహ్యం.

1891 మే-ఎనిమిదవ తేదీన బ్లావట్స్కి లండన్‌లో మరణించింది. ఆమె చనిపోయేముందు "దివ్యజ్ఞాన సమాజ స్థాపనోద్దేశం, రాబోయే జగద్గురువును ఆహ్వానించి అనుసరించడం," అన్నది. అల్లాగే, తాను చనిపోయిన తేదీనాడు ప్రతి సంవత్సరం తన మిత్రులు సమావేశమై "THE LIGHT OF ASIA" అనే గ్రంథం నుంచి ఒక అధ్యాయాన్ని, భగవద్గీత లోంచి ఒక అధ్యాయాన్ని చదవవలసిందిగా కోరింది. ఆ రోజును "వైట్ లోటస్ డే" అని పిలవాలి అనేది ఆల్కాట్ అభిమతం. ఆమె అస్తికల్ని అమెరికా, ఇంగ్లండు, ఇండియాలకు పంచారు.

పంధొమ్మిదవ శతాబ్దానికి బ్లావట్స్కి కాంతి ప్రదాతగా పేరు పొందింది. ఆమె సామాన్యమైన స్త్రీ. ఆశ్చర్య చకితుల్ని చేసే ఆమె అద్భుతమైన మనోశక్తి, ఆమె చుట్టూ చేరినవారి జీవితాల్లో గొప్ప మార్పు తీసుకొచ్చింది. మెరిపించే ఆమె ప్రజ్ఞ, శక్తి-సామర్థ్యాలు, మాటకారితనం, సంభాషణా చాతుర్యం, విస్తార ప్రపంచయాత్ర, అసాధారణమైన సాహస కృత్యాలు, సమస్త విషయాలపై ఆమె నిశితదృష్టి, పవిత్ర జీవనం, విశాల హృదయం, నిర్మల మనస్సు, మూతపడని ఆధ్యాత్మిక దృష్టి, ఆమెను దివ్యజ్ఞాన దేవాలయ ప్రాంగణానికి చేర్చాయి.

• • •

1847 ఫిబ్రవరి, 17వ తేదీన చార్లెస్ లెడ్‌బీటర్ లండన్‌లో "స్టాక్ ఫోర్ట్ చెషైర్" లో జన్మించారు. ఆయన తండ్రి రైల్వే కాంట్రాక్టరు దగ్గర క్యాషియర్‌గా పనిచేస్తూ బ్రెజిల్‌లో మరణించాడు. అప్పుడు లెడ్‌బీటర్ తల్లిదగ్గర వున్నాడు. అతని వయసు ఎనిమిదేళ్ళు. విచ్ఛిన్నమైన ఆ కుటుంబానికి కొన్నాళ్ళు బంధు మిత్రులు సహాయం చేశారు. లెడ్‌బీటర్ కేంబ్రిడ్జిలో చేరాడేకాని సమయానికి డబ్బు సర్దుబాటుకాక, చదువు మానేసి, బ్యాంకులో గుమాస్తాగా చేరాడు. కాని, అతనికి మతమంటే ఎంతో ఆసక్తి. చర్చి కార్యక్రమాల్లో శ్రద్ధగా పాల్గొని పనిచేయడంవల్ల, 1879లో ప్రీస్ట్‌గా నియమితుడైనాడు. ఆ తర్వాత అనేక శాస్త్రాలు, గ్రంథాలు చదివి జీవితం గురించి పూర్తిగా తెలుసుకోవాలనే గట్టి పట్టుదలతో అనేక చోట్లకు వెళ్ళి, ఎన్నో కష్టాలు, బాధలు పడ్డాడు. ఆ సందర్భంలో అలౌకిక శాస్త్రాల్లో ముఖ్యులైన బుల్‌వర్, లిటన్‌లతో అతనికి పరిచయమైంది.

"డైలీ టెలిగ్రాఫ్" అనే పత్రికలో ఓ వ్యాసం చదివి, సహాయంతో ముక్కాలుపీట మీదకు అలౌకిక శక్తుల్ని ప్పించి, వాటి ద్వారా కొన్ని సమాధానాలు పొందాడు డ్‌బీటర్. ఆవిధంగా కొంత సమాచారాన్ని సేకరించాడు. న్ని సందేహాలు తీర్చుకున్నాడు.

1882లో తల్లి చనిపోవడంతో లెడ్‌బీటర్ జీవితాంతం మరెవరితోనూ ప్రత్యేక వ్యక్తిగత సంబంధం పెట్టుకోలేదు. కాని, అప్పటి దివ్యజ్ఞాన సమాజం వైస్ ప్రెసిడెంట్ ఎ.పి. సిన్నెట్‌తో లేడ్‌బీటర్‌కి స్నేహమేర్పడింది. సిన్నెట్ రాసిన రాల్ని, బ్లావట్స్కీ రాసిన "ది అకల్ట్ వరల్డ్" అనే ాన్ని శ్రద్ధగా చదివి, అనేక అలౌకిక శక్తులు సంపాదిం

చాడు. సిన్నెట్ ద్వారా లెడ్‌బీటర్‌కు ఒకటి, రెండు అనుభవాలు కలిగాయి. దానితో అతను 1883 లో దివ్యజ్ఞాన సమాజంలో చేరాడు.

సిద్ధ పురుషులు దివ్యజ్ఞాన సమాజ సభ్యులకు సలహాలిచ్చి, సహాయాలు చేయడం చూసి లెడ్‌బీటర్ సమాజానికి మరింత గట్టిగా ఆకర్షితుడయ్యాడు. ఆ సమయంలో అతను మాష్టర్ కుతుమి నుంచి ఓ ఉత్తరాన్ని అందుకున్నాడు. ఆ ఉత్తరం అతని జీవితాన్నే మార్చేసింది.

సిన్నెట్ ద్వారా లెడ్‌బీటర్‌కు బ్లావట్స్కితో పరిచయమైంది. అతను ఆమె శిష్యుడై, ఇంగ్లండును పూర్తిగా వదిలేశాడు. శాఖాహారియైనాడు. ఆమె ప్రభావంవల్ల ఆధ్యాత్మికంవైపు దృష్టి మరల్చాడు. కాని, కొన్నాళ్ళు ఆమెకు దూరంగా వున్నాడు. అయినా సిద్ధ పురుషులు అతన్ని వదలక "బ్లావట్స్కితో మీరు కూడా ఇండియా పర్యటనకు వెళ్ళండి," అంటూ ఉత్తరం రాశారు.

1884 లో లెడ్‌బీటర్ బ్లావట్స్కితో కలిసి, ఇండియా వచ్చి, దివ్యజ్ఞాన సమాజ కేంద్ర కార్యాలయంలో నదికి దగ్గరలో వున్న భవనంలో వున్నారు. అక్కడ వున్న ఏడు వారాల కాలంలో, అతను పూర్తిగా మారిపోయాడు.

లెడ్‌బీటర్ అడయార్ నుంచి సిలోన్ వెళ్ళారు. అక్కడ బౌద్ధుల పిల్లలకు చదువులు చెప్పారు. బౌద్ధ ధర్మ ప్రబోధంలో చాలా శ్రద్ధ తీసుకున్నారు. ఆ సందర్భంలో సిలోన్‌లో ఒక కళాశాలను స్థాపించారు. అంతలో ఎ. పి. సిన్నెట్ తన కొడుక్కి చదువు చెప్పడానికి ఇంగ్లండు రావలసినదిగా లెడ్‌బీటర్‌కి ఉత్తరం రాశాడు.

లెడ్‌బీటర్ ఇంగ్లండు వెడుతూ వెంట "సి. జినరాజదాస" అనే ఒక సిలోన్ అతన్ని తీసుకు వెళ్ళాడు. అతన్నే "రాజా" అంటారు. అతను 16-12-1875 న, సిలోన్‌లో ఒక బౌద్ధ కుటుంబంలో జన్మించాడు. అతడు చాలా చురుకైనవాడు. ఆకర్షవంతమైన ముఖకవళికలు కలవాడు. అనేక భాషలలో పరిజ్ఞానం కలవాడు. గొప్పవక్త. పట్టభద్రుడై సిలోన్‌లో 1901-1902 మధ్య ఆనంద కళాశాలలో వైస్ ప్రిన్స్‌పాల్‌గా పని చేశాడు. తర్వాత దివ్యజ్ఞాన సమాజంలో చేరి, క్రమంగా సమాజ సభ్యుల్లో ప్రముఖుడై, అధ్యక్షుడు కూడా అయ్యాడు.

లెడ్‌బీటర్ ఆల్కాట్‌తో కలసి బర్మా వెళ్ళి, అక్కడనుంచి అడయార్ వచ్చాడు. మహాత్ముల అనుగ్రహంవల్ల దివ్యదృష్టి సంపాదించి, కుతుమి చెప్పిన పనుల్ని సులభంగా చేయగలిగాడు. జీవితాన్ని చాలాచురుకుగా, శక్తివంతంగా పనిచేయించాడు. ఉపన్యాసాలివ్వడం, అలౌకిక శక్తుల పరిశీలన, పరిశోధన మొదలైన పనులు సాదనగా పెట్టుకున్నాడు. మానవుల పూర్వా-పర జీవితాలను తెలుసుకోగల శక్తి సంపాదించాడు. ఎప్పుడూ చిత్ర, విచిత్రమైన పరిశోధనలు చేస్తూ వుండేవాడు. అలాగే గ్రహ గమనాలు, వాటి పుట్టు పూర్వోత్తరాల గురించీ ప్రత్యేకంగా చదివి, ఎంతో విజ్ఞానాన్ని ఆర్జించాడు. ఇంకా ఎన్నో శాస్త్ర విషయాలు స్పష్టంగా తెలిసిన ప్రతిభావంతుడు లెడ్‌బీటర్. ఒక్క మాటలో చెప్పాలంటే, అతను బహుముఖ ప్రజ్ఞాశాలి.

తాను చేసే పనులు ఒక్క దివ్యజ్ఞాన సమాజ వికాసానికే కాక, మానవాళికే ఉపయోగపడేటట్లు చూసేవాడు లెడ్‌బీటర్. అవసరమైన వారికి సహాయాలు చేసేవాడు. ముఖ్యం యువకులకు విద్య, పరిశ్రమ ముఖ్యమని పదే పదే నొక్కి చెప్పేవాడు. యువకులలో పరిణామం తీసుకురావాలనేదే జీవితాశయంగా పెట్టు

కున్నాడు. మొదటినుంచీ యువకుల మీద దృష్టి పెట్టి, వారికి అనేక సంగతులు తెలియజెప్పి, నేర్పించాడు. అలౌకిక శక్తుల గురించి కూడా వారికి చెప్పేవాడు.

లెడ్‌బీటర్ తన మనోశక్తిచేత యువకుల్లో కొట్టవచ్చేటట్లు కనుపించే గుణాల్ని వాటిల్లో శక్తివంతమైన వాటిని గమనించేవాడు. మొదట తాను జినరాజదాస విషయంలో ఆ సంగతి గమనించాడు. తర్వాత తన వద్ద చదువుకున్న అరండల్ విషయంలో తెలుసుకున్నాడు. అతని శిక్షణ కింద వారిద్దరూ ఎంతో ఉన్నతులైనారు, గొప్ప వక్తలు, రచయితలు కూడా అయ్యారు. చివరికి వారిద్దరూ దివ్యజ్ఞాన సమాజ అధ్యక్ష పదవుల్ని కూడా అలంకరించారు.

లెడ్‌బీటర్ లండన్ దివ్యజ్ఞాన సమాజంలో వుండగా 1890 లో అనీబిసెంట్‌ను కలుసుకున్నాడు. ప్రథమ పరిచయంతోనే అతనికి ఆమె అంటే భక్తిభావం ఏర్పడింది. అతనంటే ఆమెకు గౌరవ భావం ఏర్పడింది. అతను చేస్తే పరిశోధనలలో ఆమె కూడా ఆసక్తి చూపడమేకాక, అతన్నితో పాటు అనేక పరిశోధనలు చేసింది. వారిద్దరూ కలసి అనేక అలౌకిక శక్తుల సాయంతో సిద్ధపురుషుల్ని సూక్ష్మశరీరాలతో దర్శించేవారు. అనీబిసెంట్‌కు మాష్టర్ మోర్య గురువైతే, లెడ్‌బీటర్‌కు మాష్టర్ కుతుమి గురువు.

లెడ్‌బీటర్‌లో గొప్ప ధైర్యం, శక్తీ, ఆకర్షణా వున్నాయి. రచయితగా, వక్తగా, భవిష్యత్తు చెప్పడంలో దిట్టగా, దివ్యదృష్టికల ద్రష్టగా, మహాత్ముడుగా, గురువుగా మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. అటువంటి వ్యక్తిపై అశ్లీల అభియోగం మోపారు, ఇంగ్లండులో. దానితో అతను పెను తుఫానులో చిక్కుకున్నాడు.

అసలేం జరిగిందంటే, లెడ్ బీటర్ యువకులయెడ ప్రత్యేకమైన శ్రద్ధచూపి, దగ్గరకు చేరదీయడంవల్ల అతని చుట్టూ ఎప్పుడూ ఎంతోమంది యువకులు విడవకుండా వుండే వారు. వారికి ఎన్నో సంగతులతోపాటు సెక్స్ విషయాలు కూడా చాలా విపులంగా తెలియజెప్పేవాడు. అందుచేత అతని మీద అపవాదులు, అభాండాలు, అపోహలు, అనుమానాలు బయలుదేరాయి. అతనిపై అసభ్యకరమైన విమర్శలు చేయ నారంభించారు. యువకులతో అతను అశ్లీల సంబంధాలు పెట్టుకుంటాడని వదంతులు పుట్టించారు. ఆత్మవిశ్వాసం కల లెడ్‌బీటర్ అర్ధంలేని ప్రజాభిప్రాయాల్ని పట్టించుకోక పోవడంవల్ల ఆతనిపై నిందలు మోపడమేకాక, అతన్ని చేరి యువకులు పిచ్చివాళ్ళవుతున్నారనీ, జీవితంలో పనికిరాకుండా చెడిపోతున్నారనీ గోలపెట్టారు ప్రజలు, సమాజసభ్యులు.

దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులైన ఆల్కాట్ సమక్షంలో అతను సంజాయిషీ చెప్పుకోవాలన్నారు. ఆ గోల, అలజడి, ఆందోళనతో ఆతని మనసు విరిగి, దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వానికి రాజీనామా చేశాడు. అతని రాజీనామా అనీబిసెంట్‌కి పెద్ద దెబ్బ. ఎందుకంటే, వారిద్దరూ కలసి అప్పటికే అనేక పరిశోధనలు జరిపారు. అతను దివ్యజ్ఞాన సమాజంనుంచి తప్పుకోవడంతో ఆల్కాట్‌కూడా అతన్ని వ్యతిరేకించాడు. కాని, లెడ్‌బీటర్ యూరప్‌లోవుండి తన పరిశోధనలు చేసుకుంటూ కాలం గడిపాడు.

1907 ఫిబ్రవరి 17న ఆల్కాట్ మరణించారు. అనీబిసెంట్ దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలైంది. లెడ్‌బీటర్ తిరిగి దివ్యజ్ఞాన సమాజంలో చేరాడు. అనీబిసెంట్ అడయార్ వచ్చిన

కొన్నాళ్ళకు లెడ్‌బీటరుకూడా అడయార్ వచ్చాడు. లెడ్‌బీటర్ నిటారుగా, పొడవుగా, తెల్లగెడ్డంతో, విశాలమైన నుదురుతో, మెరిసే కళ్ళతో ప్రాచీన హిందూ ఋషుల్ని పోలి వుండేవాడు.

• • •

**1847** అక్టోబరు ఒకటవ తేదీన అనీబిసెంట్ ఐర్లండ్‌లో ధనవంతుల ఇంట జన్మించింది. సహృదయులు, వివేకవంతులైన బంధు మిత్రుల మధ్య పెరిగింది. చిన్నప్పటినుంచీ ఆమె గంభీరమైనది. ఇరవయ్యోఏట ప్రొటెస్టెంట్ మతాచార్యుడైన ఫ్రాంక్‌బిజెంట్‌ను వివాహమాడి, ఒకకొడుకు, ఒక కూతురు పుట్టిన తర్వాత క్రైస్తవమత వేదాంతశాస్త్రంమీద విరక్తి, విసుగు అవిశ్వాసం కలిగి ఇరవైఆరవఏట విడాకులిచ్చి, తనపేరు బిజెంట్ నుంచి బిసెంట్‌గా మార్చుకుంది. విడాకుల వ్యవహారంతో పిల్లలుకూడా దూరమయ్యారు.

అనీబిసెంట్ లోకంముందు నిర్భయంగా నిలబడి కాంబికల్ని, డాబురేకుల్ని తుడిచి పారేసింది. జీవిత సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కొన్నది. సాంఘిక సమానత్వంకోసం, ప్రజల హక్కులకోసం, స్త్రీ స్వేచ్ఛకోసం పోరాడింది. ఆమెలో మొదటినుంచీ ఆ స్వభావం వుంది. క్రమంగా నాస్తికత్వం వైపు మొగ్గింది. బెర్నార్డ్‌షా, హెచ్. జి. వెల్స్, వెబ్స్, రార్బట్ బరోస్, చార్లెస్ బ్రాడ్లా వంటి ప్రముఖులతో కలసి అనేక సాంఘిక సంస్థల్లో పనిచేసింది. తాను కోరిన సత్యానికీ, ఆత్మవికాసానికీ, సర్వస్వాన్ని తృణప్రాయంగావొడ్డి, ప్రపంచమంతా తిరిగి, ఎందరో మహాత్ముల్ని దర్శించింది. ఎన్నో సాధనామార్గాల్ని తీవ్రంగా అనుష్టించింది. కాని, తాను ఆశించిన సత్యసందర్శనం కాలేదని నిరుత్సాహపడక జీవితాన్ని అనాథల, దీనుల, నిస్పృహాయుల సేవలో గడపాలని నిశ్చయించుకుంది.

ఆ ప్రయత్నంలో వుండగా బ్లావట్స్కి రాసిన "ది సీక్రెట్ డాక్ట్రిన్," చదివి రివ్యూ చేయమని "W. T STEAD" అనే ఆయన అనీబిసెంట్‌ను కోరాడు. ఆమె గ్రంధం చదివి, ఉత్తేజితురాలై బ్లావట్స్కిని కలుసుకుని, ఆమె శిష్యురాలై, ది. 5–10–1889 న, దివ్యజ్ఞాన సమాజంలో చేరింది. అప్పటి వరకు ఆవేశాలతో, ఆరాటాలతో, ఆందోళనతో, ఆతృతలతో నిండివున్న ఆమె జీవితం, మరో మలుపు తిరిగింది. ఆ తర్వాత ఆమెకు ఆధ్యాత్మిక, తాత్విక, మార్మిక మార్గాలు చాలా తేలికగా అవగాహన అయ్యాయి. ఆమె జీవితమే వికసించింది.

1889 లో అనీబిసెంట్ మొదటిసారిగా ఇండియా వచ్చింది. ఇక్కడి మతాలు, ఆధ్యాత్మిక దృక్పధం, విజ్ఞానం ఆమెను ఎంతగానో ఆకర్షించాయి. సంస్కృతం నేర్చుకుంది; బాబు భగవాన్‌దాస్ పర్యవేక్షణలో. త్వరలోనే ఆ బాషలో అసమాన పాండిత్యం సంపాదించింది. తత్ఫలితంగా భగవద్గీతను ఇంగ్లీషులోకి అనువదించింది.

హిందూ గ్రంధాల్ని పూర్తిగా చదివి, మతాధిపతులతో, మఠాదిపతులతో, పండితులతో దీర్ఘ చర్చలు జరిపింది, ఎందరో మహాత్ముల్ని దర్శించి, వారిని అనుసరించింది. పురాణ, ఇతిహాసాల గురించి ఎన్నో ఉపన్యాసాలిచ్చింది. తర్వాత అవన్నీ పుస్తక రూపంలో వచ్చాయి. బెనారస్‌లో వున్నప్పుడు ఒక ఇంట్లో అద్దెకు వుండేది. దాని పేరు "శాంతకుంజ". కాశీలో పండితులు ఆమె శక్తి సామర్ధ్యాలు గ్రహించి "శ్వేత సరస్వతి" అని బిరుదు ఇచ్చి గౌరవించారు. ఆతర్వాత వేదాల్ని, శాస్త్రాల్ని అధ్యయనంచేసి, రామాయణ, భాగవతాల్ని ఆంగ్లంలో రచించింది.

బ్లావట్స్కీ పరిచయంతో అనిబిసెంట్ జీవన విధానమే పూర్తిగా మారిపోయింది. మాష్టర్ మోర్యను గురువుగా ఎన్నుకుంది. ఆ తర్వాత లెడ్‌బీటర్‌ను కలుసుకుంది.

ఆ సమయంలో మదనమోహనమాలవ్యాగారు కాశీలో హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలనుకున్నారు. కాని, అప్పటికే అనీబిసెంట్ కాశీలో సెంట్రల్ హిందూకాలేజీ స్థాపించింది. ఆమె మాలవ్యాగారి అభిప్రాయం గ్రహించి, తాను నిర్వహిస్తున్న కాలేజీని, దానికి సంబంధించిన యావత్తు ఆస్తులనూ, యాభై వేల రూపాయలను వారి ఇష్టానికి ఇచ్చేసింది. దానితో ఆయన ఐదు చదరపుమైళ్ళ విస్తీర్ణంలో కాశీ విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు.

అనీబిసెంట్ ఇండియాలో వున్నప్పుడు తెల్లచీర కట్టుకనేది. పశ్చిమ దేశాల్లో పొడుగాటి తెల్లగౌను వేసుకునేది. దానికి తోడు ఆమెది తెల్లని పొట్టి జుట్టు. ఆమె సామాన్యమైన ఎత్తు. ఎంతటి వారినీ క్షణంలో ఆకర్షించే గొప్ప వర్చస్సు ఆమెది. ఆమె ఉపన్యాసం విన్న లెడ్‌బీటర్ "అనీబిసెంట్ నిశ్చయంగా ప్రపంచంలో గొప్ప వ్యక్తుల్లో ఒకరు" అన్నారు. ఆ మాటనే జేగ్‌నాల్డ్ 'అనీబిసెంట్ వేదిక మీదకు వచ్చినప్పుడు గొప్పశక్తితో జ్వలిస్తుంది. ఆ శక్తి నలువైపులకూ వ్యాపిస్తుంది,' అన్నారు. ఆమె వాగ్ధాటికి నెహ్రూ ముగ్ధుడై, తండ్రితో చెప్పి, దివ్యజ్ఞాన సమాజంలో చేరాడు. అనీబిసెంట్ అతనికి దీక్ష కూడా ఇచ్చింది. ఆ తర్వాత అతను అనేక దివ్యజ్ఞాన సమాజ సమావేశాలకు హాజరైనాడు. మూడేళ్ళు మాత్రమే దివ్యజ్ఞాన సమాజంలో వున్నాడు.

అనీబిసెంట్‌లో మార్పు చూసి కొందరు పాత మిత్రులు ఆమెను వదిలేశారు. కొందరు ఆమెకు దూరమయ్యారు. ఆ సందర్భంలో ఆమె అంటుంది, "నేను సత్యాన్వేషణే ధ్యేయంగా పెట్టుకున్నాను. ఎవరు వున్నా, లేకపోయినా, ఏమైనా నేను చివరి వరకు బ్లావట్‌స్కీని పూర్తిగాఅనుసరిస్తాను; ఆమె నన్ను నరికినా, నాశనం చేసినా" అని.

**అడయార్‌లో** దివ్యజ్ఞాన సమాజ కేంద్రకార్యాలయం స్థాపించిన తర్వాత ఎందరో కొత్త సభ్యులు చేరారు. వారిలో జిడ్డు నారాయణయ్య ఒకరు. ఆయన స్మార్తశాఖకు చెందిన బ్రాహ్మణులు. రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లో డిప్యూటీ తహసిల్‌దారుగా పని చేశారు. ఆయన భార్యపేరు సంజీవమ్మ. ఆమె కృష్ణ భక్తురాలు. ఆమె తన కాలమంతా పూజలతో, భక్తి పాటలతో గడిపేది. రోజూ గ్రంధపరనం చేసేది. నారాయణయ్యకు తరచు బదిలీలు అయ్యేవి. ఆయన మదనపల్లిలో పనిచేస్తుండగా, సంజీవమ్మ అష్టమగర్భాన 11–5–1895 తేదీ రాత్రి 12–30 నిమిషాలకు ఒక మగ పిల్లవాడు పుట్టాడు. అతనికి "కృష్ణమూర్తి" అని నామకరణం చేశారు. ఆ తర్వాత ఆ దంపతులకు మరో ముగ్గురు పిల్లలు కలిగారు. 1898 లో, కలిగిన వానిపేరు నిత్యానందం. కాని, చివరకు ఆరుగురు పిల్లలే మిగిలారు.

1897 లో, నారాయణయ్యకు కడప బదిలీ అయ్యింది. అక్కడ కృష్ణమూర్తికి మలేరియా జ్వరం పట్టుకుంది. అతడు దాన్నించి బ్రతికి బైట పడ్డాడు కాని, శారీరకంగా చాలా బలహీనమైనాడు.

1901 లో నారాయణయ్య కదిరిలో వుండగా కృష్ణమూర్తికి శాస్త్రోక్తంగా అక్షరాభ్యాసం, గాయత్రీ మంత్రోపదేశంతో ఉపనయనం చేశారు. నిత్యానందం మూడేళ్ళవాడు. అతడు కృష్ణమూర్తి వెంట స్కూలుకు వెళ్ళేవాడు. వారిద్దరూ ఎప్పుడూ

కలిసేవుండేవారు. కాని, మొదటినుంచీ వారిద్దరి మన స్తత్వాలు ఒకరి నుంచి ఒకరికి పూర్తి బిన్నం. నిత్యానందం తెలివైనవాడు. చురుకైనవాడు. కృష్ణమూర్తి అనారోగ్యవంతుడు.

నారాయణయ్య ఇంట్లో అనీబిసెంట్ ఫోటో వుండేది. ఆయన ఆమె గురించి భార్యకు ఎన్నో సంగతులు చెప్పేవాడు. ఆమె కృష్ణమూర్తికి రామాయణ, మహాభారత గాధలతోపాటు అనీబిసెంట్ గురించీ చెప్పేది.

1903 లో నారాయణయ్యకు మళ్ళా కడప బదిలీ అయింది. అక్కడ ఆయన కూతురు ఇరువై ఏళ్ళది, చని పోయింది. ఆమె ఆత్మతో సంజీవమ్మ మాట్లాడేది. ఒకసారి ఆమె కృష్ణమూర్తిని పెరటిలోకి తీసుకువెళ్ళి, "ఆ చెట్టు దగ్గర నీకు అక్కయ్య కనిపిస్తోందా?" అని ఓ చెట్టును చూపి, అడిగింది. కృష్ణమూర్తి అక్కను చూసి మొదట భయపడి తల్లి కొంగులో దాక్కున్నాడు. కాని, ఆ తర్వాత క్రమంగా అతనిలో భయంపోయి, తల్లితోపాటు అక్కను చూసి, ఆమెతో *మాట్లాడ నారంభించాడు.

1905 లో, సంజీవమ్మ మరణించింది. నారాయణయ్య పిల్లల్ని ప్రేమగా, ఆప్యాయంగా చూసేవాళ్ళు లేకపోయారు. పిల్లలు తల్లికోసం ఒకటే ఏడ్చేవారు. కాని, కృష్ణమూర్తి మాత్రం ఏడ్చేవాడు కాదు. తోటలోకి వెళ్ళి, ఒంటరిగా కూర్చునేవాడు. అక్కడ అతనికి తల్లిరూపం స్పష్టంగా కనుపించేది. అక్క ఆత్మతో మాట్లాడినట్లే, తల్లితోనూ మాట్లాడేవాడు. ఆ శక్తులు

---

* నోట్ :- ఈ లోకంలో మరణించినవారు ఇంకొక లోకంలో జీవించి వుంటారనీ, వారు మనకు అవసరమైనప్పుడు సహాయ పడగలరనీ దివ్యజ్ఞాన సమాజంవారు నమ్ముతారు.

అతనికి ఎట్లా కలిగాయో ఎవరికీ తెలియదు. బహుశా కృష్ణమూర్తికీ తెలియకపోవచ్చు. పిల్లల్ని మేనత్త పెంచింది. అనారోగ్యం వల్ల కృష్ణమూర్తి స్కూలుకు వెళ్ళక చాలా రోజులు ఇంటి దగ్గరే వుండిపోయేవాడు.

1907 ఫిబ్రవరి - పదిహేడవ తేదీన ఆల్కాట్ మరణించే ముందు, "నా అనంతరం అనీబిసెంట్ దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షురాలు కావాలన్నది సిద్ధపురుషుల అభీష్టమనీ, లెడ్‌బీటర్ నిర్దోషి కాక, మహాత్ముడనీ - ఆ సంగతి కూడా సిద్ధపురుషులే చెప్పారనీ," చెప్పాడు. సిద్ధపురుషుల అభీష్టానుసారం అనీబిసెంట్ అధ్యక్షురాలైంది. అప్పటి వరకు ఆమె కేంద్రం కాశీయే. ఆ తర్వాత అడయార్‌కు మకాం మార్చింది.

లెడ్‌బీటర్ విషయం సిద్ధపురుషులు ఎందుకు చెప్పారంటే, యూరప్‌లో ఆయన మీద అవినీతి ఆరోపణలు రావడం, వాటిని ఒక కమీషన్ ముందు విచారణ చేయబూనడం, లెడ్‌బీటర్ దివ్యజ్ఞాన సమాజానికి రాజీనామా చేయడం జరిగింది. అందుచేత లెడ్‌బీటర్ విషయం ప్రపంచానికి తెలియజెప్పవలసిన బాధ్యత సిద్ధపురుషులు తీసుకున్నారు. ముందుకాలంలో లెడ్‌బీటర్‌తో వారికెంతో పని వుండివుంటుంది.

ఆ సంవత్సరమే నారాయణయ్య రిటైరైనాడు. చాలీ చాలని పెన్షన్‌తో, ఆరుగురు పిల్లలతో ఏం చేయడానికీ, ఎటు పోవడానికీ ఏమీ తోచక, "నేను రిటైరై మదనపల్లిలో వుంటున్నాను. నా శేష జీవితం దివ్యజ్ఞాన సమాజ సేవకు వినియోగించదలిచాను. మీరు అనుమతి ఇస్తే, అడయార్ వచ్చి, మీతో కలిసి పనిచేయడానికి సిద్ధంగా వున్నాను;" అని కేంద్ర కార్యాలయంవారికి రాశాడు.

అనీబిసెంట్ దివ్యజ్ఞాన సమాజ విస్తరణకే కాక, భారతీయులకు అనేక విధాల సేవ చేసింది. నిద్రపోతున్న భారతజాతిని మేల్కొల్పి, చైతన్యవంతం చేసింది. ఇండియా తన ఆధ్యాత్మిక నివాసస్థలం చేసుకుంది. భారతీయులకు గొప్ప సాంప్రదాయం, సంస్కృతీ, నాగరికతా గతంలో వున్నాయనీ, అంతకన్నా గొప్ప భవిష్యత్తు కలదనీ ఆమె గ్రహించి, ఇండియా అంతా తిరిగి, ఆ సంగతి ప్రచారంచేసి, నూతన శకానికి ప్రారంభోత్సవం చేసింది. ఆమె ప్రతిభవల్ల దివ్యజ్ఞాన సమాజం ప్రపంచమంతటా విస్తరించి, బహుళ ప్రచారంలోకి వచ్చింది.

1908 నవంబరులో లెడ్‌బీటర్ తిరిగి దివ్యజ్ఞాన సమాజంలో చేరాడు. నారాయణయ్య దరఖాస్తు పెట్టుకున్న రెండేళ్ళకు కేంద్రకార్యాలయంలో ఒకతను అవసరమై "మీరు ఆఫీసులో పనిచేస్తూ, ఆవరణ బైట మకాం వుండటానికి అంగీకరిస్తే, వెంటనేవచ్చి, పనిలో చేరవచ్చు," అని అడయార్ ఆఫీసువారు రాశారు. నారాయణయ్య వారి షరతుకు అంగీకరించి 23-1-1909 తేదీన అడయార్ వచ్చాడు.

నారాయణయ్య వచ్చిన మూడు వారాలకు లెడ్‌బీటర్ కొంతమంది సెక్రటరీలతో అడయార్ వచ్చాడు. ఆయన పూర్వం బ్లావట్స్కీతో వచ్చినప్పుడు వున్న బంగళాలోనే వున్నాడు.

లెడ్‌బీటర్ అడయార్‌లోవున్న ఐదేళ్ళూ, ఎప్పుడూ ఏదో ఒక పరిశోధన చేస్తూ వుండేవారు. ఆయన కీర్తి విని, ప్రపంచం నలుమూలలనుంచీ ఎంతోమంది ఉత్తరాలు రాసేవారు. ఆయనకు వచ్చే ఉత్తరాలలో చాలావరకు చనిపోయిన తమ బంధు

మిత్రుల గురించి తెలుసుకోవాలనే కుతూహలంకొద్దీ రాసినవే: మనిషికి అదృశ్యశక్తులు ఏవిధంగా సహాయం చేస్తాయో చెప్ప మని కొందరూ, తాయత్తులు పంపమని కొందరూ, తమ భయాలు పోగొట్టమని మరికొందరూ రాసేవారు. అవసరమైన వాళ్ళకు తాయత్తులు తయారుచేసి పంపేవాడు. ఆయనకు వచ్చిన ఉత్తరాల్లో ఒకటి—ఒకతను ఎక్కడకు వెడితే అక్కడ, బహుచిత్రంగా మంటలు రేగి, వస్తువులు కాలిపోయేవి. దానికి జవాబుగా ఆయన అతనికి ఒక మంత్రంరాసి పంపాడు. అతను ఆ మంత్రాన్ని నిష్టగా, నియమంగా, జపించ నారంభించినప్పటి నుంచీ, అతను వెళ్ళినచోట మంటలు రేగడం మానాయి. ప్రజలంటే లెడ్‌బీటర్‌కి ఎంతో ప్రేమ. వాళ్ళు బాధపడుతున్నా రంటే, ఆయన హృదయం కరిగిపోయేది.

లెడ్‌బీటర్ రోజూ ఉదయం ఐదుగంటలకు నిద్రలేచి, కాల కృత్యాలు తీర్చుకుని, ఆరున్నర గంటలకు ఒక కప్పు కాఫీ తాగి, తన పనిలో నిమగ్నులయ్యేవారు. పదిగంటలకు బోజనం చేసేవాడు. భోజనానంతరం మళ్ళా ఏదో ఒక పని చేసేవారు. మధ్యాహ్నం రెండు గంటలకు టీ, రొట్టె తీసుకునే వాడు. సాయంత్రం ఐదుగంటలకు తప్పనిసరిగా సముద్ర స్నానం చేసేవాడు. సముద్రంలో ఈతలు కొట్టడం ఒక్కటే ఆయన శారీరక శ్రమ. రాత్రి ఏడు గంటలకు కొంచెం జావ తాగి, రోజంతా తనతో కలసి పనిచేసిన కార్యదర్శులతో ఆనాటి విషయాలపైనా, ఇంకా అనేక ఇతర సంగతులపైనా చర్చలు జరిపేవాడు. ఆ సమావేశానంతరం ఓపావుగంట ధ్యానంచేసి, తిరిగి తన కార్యక్రమంలో మునిగిపోయేవాడు.

ఒకో్కరోజు రాత్రి ఆయన నిద్రపోయేప్పటికి ఒంటిగంటా రెండు అయ్యేది. ఏరోజుపని ఆరోజు పూర్తికావాలన్న

పట్టుదలకల మనిషి, లెడ్‌బీటర్. ఆయన ఎప్పుడూ రాస్తూనో, చదువుతూనో, పరిశోధన చేస్తూనో వుండేవారు. ఎటువంటి పనైనా ఆయన చేతిలో కీలుబొమ్మే : ప్రతి పనినీ శ్రద్ధగా, ఓర్పుగా, నేర్పుగా, నిదానంగా, ప్రేమగా, సంతోషంగా చేసే వారు. అయినా అప్పుడప్పుడూ కొన్నిపనులు ఆయనకే గడ్డుగా వుండేవి. ఒక్కొకసారి క్లిష్టపరిశోధనలు చేసేప్పుడు, అలిసిపోయి, ఐదునిమిషాలు నిద్రపోయి, లేచి, మళ్ళా ఆ పనిలో నిమగ్నులయ్యేవారు. బాగా రాత్రయి నిద్రవస్తే, ఆనిద్ర ఆపుకునేందుకు గదిలో అటూ, ఇటూ తిరిగేవారు. అలాగే కార్యదర్శులతో కలసి పనిచేసేటప్పుడు వాళ్ళతో మాట్లా డుతూ, మాట్లాడుతూ మంచంమీద ఒరిగి, నిద్రపోయి, లేచి, "చివరలో నేను ఏం చెప్పాను ?" అని ప్రధాన కార్యదర్శి ఎర్నెస్ట్‌వుడ్‌ని అడిగితే, దానికి అతడు తాను చివరలో ఏం రాశాడో అది చెపితే, "అంతేకాదు, నేను ఇంకా చాలా చెప్పాను," అనేవారు లెడ్‌బీటర్.

"అంతకు మించి మీరేం చెప్పలేదు. మంచంమీద పడు కుని నిద్రపోయారు," అని అంటే, "సరే, ఇప్పుడు ఆ భాగ మంతా రాసుకోండి," అని చెప్పి రాయించేవారు ఆవిధంగా ఆయన రాత్రింబవళ్ళు ఎంతో పనిచేసేవారు.

లెడ్‌బీటర్ అడయార్ వచ్చిన రెండు నెలలకు అనీబిసెంట్ అమెరికా, యూరప్ పర్యటనకు వెళ్ళింది. ఆమె చికాగో మీటింగులో మాట్లాడుతూ, ఈసారి జగద్గురువు పశ్చిమదేశాల్లో అవతరిస్తారు. ఆయన వ్యక్తమయ్యేందుకు ఒక మానవదేహం ఎన్నుకోబడింది. అది, ఎక్కడోకాదు — చికాగో నగరానికి చెందిన డాక్టర్ వేన్‌హుక్ (అమెరికా దివ్యజ్ఞాన సమాజ శాఖకు జనరల్ సెక్రటరీ) కొడుకైన హ్యూబర్ట్. అతడు సౌమ్యుడు,

సహృదయుడు. ఇప్పుడు అతని వయసు పదమూడేళ్లు" అని ప్రకటించింది. ఆ విషయాన్ని అనేకమంది దివ్యజ్ఞాన సమాజ సభ్యులు ముఖ్యం, లెడ్‌బీటర్ వంటి అలౌకికశక్తి సాధకులు సహితం, అంగీకరించి, ప్రపంచమంతా ప్రచారం చేశారు.

ప్రభువు మైత్రేయ అవతరణకు హ్యూబర్ట్ దేహం అనువైనదనీ, ఆ సంగతి తనకు అనేక పరిశోధనల ఫలితంగా నిరూపణ అయిందనీ అనీబిసెంట్ చెప్పింది. ఆ అబ్బాయికి ఆధ్యాత్మిక మార్గంలో శిక్షణ ఇచ్చేందుకు ఇండియా తీసుకు రావలసినదిగా అతని తల్లిదండ్రులకు చెప్పింది. అనీబిసెంట్ ఆదేశానుసారం వారు ఇండియా వచ్చే ప్రయాణ సన్నాహంలో వున్నారు.

  

**కృష్ణమూర్తి,** నిత్యానందం అడయార్ ఎలిమెంటరీ స్కూల్లో చేరారు. కృష్ణమూర్తి ఉపాధ్యాయులు చెప్పేది శ్రద్ధ పెట్టి వినేవాడు కాదు. అసలు చదువంటేనే లక్ష్య పెట్టేవాడు కాదు. రోజూ అతన్ని ఉపాధ్యాయులు చావగొట్టేవారు. ఎంత కొట్టినా అతను చదువు మీద దృష్టి పెట్టేవాడు కాదు. ఆ దెబ్బలకు అతను స్కూల్లోనే చనిపోతాడనుకునేవారు, చూసినవారు. అయినా అతను చదివేవాడు కాదు. స్కూలూ, ఇట్లా ఎప్పుడూ అతని మనస్తత్వానికి సరిపడేవికావు. వీలు చిక్కినప్పుడల్లా నిత్యానందాన్ని వెంటబెట్టుకుని సముద్రం ఒడ్డుకు వెళ్ళి పిల్లలతో కలసి, చీకటి పడేవరకు ఆడుకుని ఇంటికి వెళ్ళేవాడు. అన్నదమ్ములిద్దరూ ఎప్పుడూ కలిసే వుండేవారు. వారికి ఒకరి మీద ఒకరికి అంత పట్టు, ప్రాణం, ప్రేమ.

కృష్ణమూర్తి చిన్నప్పటినుంచీ దిగులు గొలిపే చూపులతో, దూరపు కలలు కంటో వుండేవాడు. అతని రూపం వింతగా వుండేది – పళ్ళు వంకర, ఒళ్ళు మురికి, తల ముందుభాగం నున్నగా గొరిగి వుండేది. వెనక జుట్టు పొడుగ్గా, మెడ మీద పడేది. ఆ జుట్టు నిండా పేలు. ఎప్పుడూ దగ్గుతూ, ఒంగినడుస్తూ వుండేవాడు.

ఒకరోజు సాయంత్రం లెడ్‌బీటర్ సముద్ర స్నానం చేస్తూ ఒడ్డున ఆడుకుంటున్న కృష్ణమూర్తిని చూశాడు. చూడగానే ఏదో ప్రత్యేకత కనుపించింది. క్రమంగా అతని కళ్ళల్లో వెలుగు, అతని చుట్టూ కాంతి కనుపించాయి. అతనిలోని లోక గురువును చూశారు. ఆ సంగతి తన ప్రధాన కార్యదర్శి

ఎర్నెస్ట్‌వుడ్‌తో చెపితే, అతను నవ్వాడు. ఎందుకంటే, అతనికి ఆ కృష్ణమూర్తి బాగా తెలుసు. రోజూ అతనికి చదువు చెప్పే వాడు ఎర్నెస్ట్‌వుడ్. అటువంటి మందకొడి, మురికి, బలహీనం అయిన కృష్ణమూర్తిని ప్రభువు మైత్రేయ అవతరణకు అనువైన దేహం కలవాడు అని లెడ్‌బీటర్ వంటి వ్యక్తి అనడం అతనికేకాక, తక్కిన సమాజసభ్యులకూ ఆశ్చర్యాన్ని కలిగించింది ఎంత చూసినా ఎవరికీకూడా కృష్ణమూర్తిలో ఎటువంటి వికాసం, కాంతీ కనుపించలేదు, అతని దుర్బల దేహం తప్ప. అయినా లెడ్‌బీటర్ కృష్ణమూర్తి విషయంలో గట్టి నమ్మకంతో వున్నారు. ఒకసారి మాటల్లో "కృష్ణమూర్తి భవిష్యత్తులో నిశ్చయంగా అనీబిసెంట్ కన్నా గొప్ప వక్త, తత్వవేత్త అవుతాడు," అని లెడ్‌బీటర్ ఎర్నెస్ట్‌వుడ్‌తో అన్నారు.

ఆ నమ్మకంతోనే లెడ్‌బీటర్ నారాయణయ్యను ఒకసారి తన బంగళాకు రమ్మని పిలిచి "మీరు అనుమతిస్తే, నేను మీ అబ్బాయి జీవితాన్ని పరిశోధించాలనుకుంటున్నాను", అని అడిగారు. దానికి ఆయన అంగీకరిస్తో, ఆ అవకాశాన్ని ఆసరాగా తీసుకుని కృష్ణమూర్తి శారీరక, మానసిక పరిస్థితిని విన్నవించు కున్నాడు.

కృష్ణమూర్తి విషయం వినగానే లెడ్‌బీటర్ హృదయం కరిగి, "ముందు కృష్ణమూర్తిని నా దగ్గరకు పంపించండి," అన్నారు. అప్పటికే అనీబిసెంట్ అనేకమంది దిక్కులేని పిల్లల్ని చేరదీసి తిండి, బట్ట, వసతి ఇచ్చి, చదువులు చెప్పిస్తోంది. అటువంటి ఆమె కృష్ణమూర్తి వంటి వానికి సహాయం చేయ్యడంలో వెనుకాడదని లెడ్‌బీటర్ విశ్వాసం.

కృష్ణమూర్తిని నిశితంగా పరిశీలించేందుకు ఆతన్ని తన గదికి రమ్మన్నారు లెడ్‌బీటర్. అతను ఆయన గది దగ్గరకు వెళ్ళేడేకాని, లోపలకు వెళ్ళడానికి మొదట జంకాడు. చివరికి వెళ్ళాడు. లెడ్‌బీటర్ కృష్ణమూర్తిని చూసి, పరిశీలించి, అంత వరకు అనీబిసెంట్, తానూ కలిసి హ్యూబర్ట్ రాబోయే జగద్గురువుగా భావించి చెప్పడం పొరపాటనీ, కృష్ణమూర్తే శ్రీకృష్ణుడు, జీసస్ అడుగుజాడల్లో వచ్చిన జగద్గురువనీ, అంతేగాక అతడు సాక్షాత్తూ మహాత్మా మైత్రేయుని మూడవ అవతార అవతరణకు అనువైన దేహం కలవాడనీ గ్రహించి, ఆసంగతి సమాజ సభ్యులందరికీ చెప్పి, వెంటనే అతనిగురించి అనీబిసెంట్‌కు రాశారు. అప్పుడు ఆమె అమెరికా, యూరప్ పర్యటనలో వుంది.

లెడ్‌బీటర్ మాటలు అందరికీ అతిశయోక్తులుగా తోచాయి. కృష్ణమూర్తిలో ఎప్పుడూ, ఏమాత్రం వికాసం చూడని వారు, ఆశ్చర్యపోయారు. లెడ్‌బీటర్ నిర్ణయంతో దివ్యజ్ఞాన సమాజ సభ్యుల్లో గుసగుసలు బయలు దేరాయి. మొత్తం మీద కృష్ణమూర్తి సమాజ ఆవరణ ప్రవేశంతో సమాజంపై ఒక కొత్తరకం తెర కప్పబడింది. కృష్ణమూర్తిని, నిత్యానందాన్ని మాష్టర్ కుతుమి శిక్షణ కింద వుంచారు, లెడ్‌బీటర్.

లెడ్‌బీటర్ ఉత్తరానికి సమాధానంగా, " వెంటనే ఆ పిల్లలు ఇద్దర్నీ సమాజ కేంద్రంలో చేర్చండి. వారికి అవసర మైన సహాయాలు ఏర్పాటు చేయండి." అని అనీబిసెంట్ రాసింది. అంతటితో హ్యూబర్ట్ సంగతి సమాప్తమైంది.

అనీబిసెంట్ ఆజ్ఞానుసారం లెడ్‌బీటర్ కృష్ణమూర్తిని, నిత్యానందాన్ని సమాజకేంద్రంలో చేర్చారు. సమాజ సభ్యులు

కొందరు వారికి చదువులు చెప్పేవారు — బెల్‌ఫోర్‌క్లార్క్ - ఇంగ్లీష్, ఎర్నెస్ట్‌వుడ్, రాసపోలి, సుబ్రహ్మణ్యం మొదలైన వారు ఇతర సబ్జక్ట్సు చెప్పేవారు. ఇంగ్లీషు మాత్రం కృష్ణమూర్తికి ప్రత్యేకంగా చెప్పేవారు. వారిద్దరిపై లెడ్‌బీటర్ ఎంతో శ్రద్ధ చూపేవారు. వారిలో భయాలు పోగొట్టేవారు. వారి ఆహార-విహారాల్ని పరిశీలించేవారు. ముఖ్యం, వారి స్నానం విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుని తొడలమధ్య, గజ్జలలో శుభ్రంగా తోమి స్నానం చేయించేవారు. వారిని ఆవిధంగా దిస మొలలతో స్నానం చేయించడం సమాజ సభ్యుల్లో కొంత కలవరాన్ని కలిగించింది. కాని, లెడ్‌బీటర్ అంటే కృష్ణమూర్తికి ఎంతో గౌరవం. ఆ ఇద్దరు పిల్లలంటే, ఆయనకు చాలా ప్రేమ. అందుచేత కృష్ణమూర్తి, నిత్యానందం రాత్రిం-బవళ్ళు లెడ్‌బీటర్‌కి చేరువలో వుండేవారు.



అనిబిసెంట్ అమెరికా, యూరప్‌లలో ఏడునెలలు పర్యటించి, తిరిగి ది. 27-11-1909న మద్రాసు చేరుకుంది. ఆమెకు సెంట్రల్ స్టేషన్‌లో ఘనస్వాగతం ఏర్పాటు చేశారు, దివ్యజ్ఞాన సమాజంవారు. లెడ్‌బీటర్ తన పక్కనవున్న కృష్ణమూర్తిని అనీబిసెంట్‌కు పరిచయం చేశారు. కృష్ణమూర్తిని అనీబిసెంట్‌కు పరిచయం చేశారు. కృష్ణమూర్తి ఆమె మెడలో గులాబీ పూలమాల వేశాడు. అక్కడనుంచి అందరూ అడయార్ వెళ్ళారు. ఆతర్వాత సమాజ ఆవరణలో ఒక అందమైన నిర్మాణానికి ప్రారంభోత్సవం జరిగింది.

దివ్యజ్ఞాన సమాజంవారందరి దృష్టి కృష్ణమూర్తిపై కేంద్రీకరింపబడి వుండటం, అనీబిసెంట్ గమనించింది. కొద్ది

కాలంలోనే వారందరికీ కృష్ణమూర్తి ఆరాధ్యమూర్తి అయ్యాడు. అతడు అనీబిసెంట్‌కు సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆమె అతన్ని లేవనెత్తి, కావిలించుకున్నది. ఆరోజునుంచి కృష్ణమూర్తి, నిత్యానందం రోజూ అనీబిసెంట్‌ను చూడ్డానికి ఆమె గదికి వెళ్ళే వారు. ఆమె వారిని దివ్యజ్ఞాన సమాజ సభ్యుల సమావేశాలకు సైతం హాజరు కానిచ్చేది.

డిశంబరు నెలాఖరున మాష్టర్ కుతుమి కృష్ణమూర్తిని చూసి, "ఇతన్ని నీ చేతుల్లోకి తీసుకుని, సంస్కరించి పూర్ణ మానవునిగా తయారుచేయ" మని లెడ్‌బీటర్ని ఆజ్ఞాపించారు.

సిద్ధపురుషుల ఆదేశానుసారం కృష్ణమూర్తి, నిత్యానందా లను తండ్రినుంచి పూర్తిగా తీసుకుని దివ్యజ్ఞాన సమాజ కేంద్రంలో ప్రత్యేకంగా వుంచారు. అనీబిసెంట్ వారిపై ప్రత్యేక శ్రద్ధ, ప్రేమ చూపడంతో, సభ్యులందరూ వారిని ప్రేమగా చూసేవారు.

ఒకరోజు రాత్రి లెడ్‌బీటర్, కృష్ణమూర్తి గత జన్మల మీదా, ప్రస్తుత జీవితంమీదా పరిశోధనలు జరిపారు. తత్ఫలితంగా కృష్ణమూర్తి కృత్తికా నక్షత్రానికి చెందినవాడని తేలింది. దానికి సంబంధించిన గత ముప్పై జన్మలనూ ఆయన పరిశోధించాలనుకున్నారు. అందులో ఇరవై ఎనిమిది అవతారాలను లెడ్‌బీటర్ పరిశోదించారు. తక్కిన రెండు అవతారాలను లెడ్‌బీటర్ సహాయంతో అనీబిసెంట్ పరిశోధిం చింది. ఆ ముప్పై జన్మలలో పదకొండు జన్మలు స్త్రీగను, పందొమ్మిది జన్మలు పురుషుడుగను జన్మించెనని తేలింది. లెడ్‌బీటర్ రోజుకొక అవతారం చొప్పున పరిశోధనచేసి, తత్సం బంధమైన సమాచారాన్ని ఎర్నెస్ట్‌వుడ్‌కి చెప్పి, రాయించారు.

మొదటిరోజు పరిశోధన పూర్తయిన తర్వాత, "ఈరోజు బుద్ధ భగవానులు దర్శనమిచ్చి, అగ్ని గురించి చెప్పారు," అన్నారు, లెడ్‌బీటర్. ఆ పరిశోధనల ఫలితంగా కృష్ణమూర్తి గత జన్మల్లో బుద్ధుని శిష్యుడని తేలింది. కృత్తికా నక్షత్రానికి సంబంధించి అవతరించిన అతని వయసు, అప్పటికి పదమూడు సంవత్సరాలని నిర్ధారణ అయింది. అప్పటికి కృష్ణమూర్తి వయసు కూడా పదమూడేళ్ళే.

ఆ ముప్పై అవతారాల సమాచారాన్ని దివ్యజ్ఞాన సమాజ పత్రికైన "థియోసఫీ"లో వరసగా ప్రకటించారు. కృత్తికా నక్షత్రానికి చెందిన మొదటి అవతారం క్రీస్తుపూర్వం 11(22 సంవత్సరాలనీ, చివరి అవతారం క్రీస్తుశకం 624 అనీ పరిశోధనలవల్ల తేలింది. కృష్ణమూర్తి గత జన్మల్ని దృష్టిలో పెట్టుకుని "The Lives of Alcyone" అనే పుస్తకం రాశారు. లెడ్‌బీటర్. "ఆల్సియోన్" అంటే, "ప్రకాశవంతమైన నక్షత్రం" అని అర్థం.

లెడ్‌బీటర్ కృష్ణమూర్తి భవిష్యత్తునుకూడా పరిశోధించి ఒక నిర్దిష్టమైన అభిప్రాయానికి వచ్చారు, "కృష్ణమూర్తి నిశ్చయంగా మహాత్ముడనీ, రాబోయే జగద్గురువనీ, తిరిగి వస్తానన్న ఏసుప్రభువనీ", "Krishna Murty - The Vehicle of the new world Teacher - The Lord Maitreya" అని నిర్ణయించుకున్నారు, లెడ్‌బీటర్.

దివ్యజ్ఞాన సమాజ కేంద్రంలో కృష్ణమూర్తి,నిత్యానందం హాయిగా, ఆనందంగా వున్నారు, సమాజ సభ్యులు వారిద్దర్నీ ఎంతో ప్రేమగా చూసుకునేవారు. క్రమంగా కృష్ణమూర్తిలో

ఎన్నో గొప్ప గుణాలు వెలుగులోకి వచ్చాయి. అటువంటి మహాత్ముడు తనను వెతుక్కుంటూ వచ్చినందుకు అనీబిసెంట్ ఆనందపడింది. అతని ఔన్నత్యాన్ని అనేక కోణాలనుంచి చూసి, పదే పదే పరిశోధనలు జరిపి, అతడు నిశ్చయంగా తిరిగి వస్తానన్న ఏసుప్రభువేనన్న సంతోషంతో అనీబిసెంట్ ఉప్పొంగి పోయింది. తన జీవితాశయమే నెరవేరినట్లూ, జీవితమంతా ఎదురు చూసిన వెలుగే కృష్ణమూర్తిగా తన కళ్ళముందు ప్రత్యక్షమైనట్లూ భావించి సంతుష్టి చెందింది.

కృష్ణమూర్తి ప్రవక్తనీ, తిరిగి వస్తానన్న ఏసుప్రభువనీ కృష్ణుడు బుద్ధుడు ఏసు తర్వాత కృష్ణమూర్తే ప్రజల్ని సరైన మార్గాన నడపడానికి అవతరించిన జగద్గురువనీ, ఆ సంగతి తమకు అనేక విధాల నిరూపణ అయిందనీ అనీబిసెంట్ ప్రచారం చేసింది. ఆ రోజుల్లో ఆమె మాటకు ఎంతో విలువ వుండటం చేత, ప్రజలు, సమాజ సభ్యులు ఆమె మాటలు విశ్వసించారు. తమ జీవితాలు తరించనున్నవని సంతసించారు.

కాని, తాను ఆశించినంత త్వరగా కృష్ణమూర్తిలో ఆధ్యాత్మిక అభివృద్ధి కనుపించకపోయేటప్పటికి లెడ్‌బీటర్ అతన్ని ఓకంట కనిపెడుతూ, అనేక సంగతులు ప్రత్యేకంగా విశదపరచడమేకాక, ప్రతిరాత్రి, కృష్ణమూర్తిని సూక్ష్మశరీరంలో టిబెట్‌లో వుంటున్న మాష్టర్ కుతుమి నివాసానికి తీసుకువెళ్ళి, ఓ పదిహేను నిమిషాలు ఉపదేశం ఇప్పించేవారు. ఆవిధంగా కృష్ణమూర్తికి దీక్ష ఇచ్చేందుకు అర్హత త్వరితం చేశారు. లెడ్‌బీటర్ ఇచ్చిన శిక్షణా ఫలితంగా కృష్ణమూర్తిలో దయ, ప్రేమ, సత్యం, సమత్వం, సత్ప్రవర్తన, పవిత్రత, ధైర్యం, శారీరక - మానసిక ఆరోగ్యం, భూతదయ, నిస్వార్థం మొదలైన గుణాలు పెంపొందడంవల్ల మాష్టర్ కుతుమి అతనికి మరిన్ని సంగతులు బోధించారు.

ఆ విధంగా ఐదు నెలలు ప్రతిరోజూ కృష్ణమూర్తిని సూక్ష్మ శరీరంలో మాస్టర్ కుతుమి దగ్గరకు తీసుకు వెళ్ళారు, లెడ్‌బీటర్ కృష్ణమూర్తి, తన కిచ్చిన ఉపదేశాన్నంతా క్లుప్తంగా రాసుకున్నాడు. అదే " at the feet of the master " 'పరమగురు చరణ సన్నిధి' అనే పుస్తకంగా రూపొందింది.

కృష్ణమూర్తిలో ఒక విచిత్రమైన గుణం వుండేది - చనిపోయిన వారి ఆత్మలతో రాత్రి నిద్రలో మాట్లాడేవాడు. ఆ మాటలు దగ్గర వున్నవారికి స్పష్టంగా వినిపించేవి. అతనికి చేరువలో లెడ్‌బీటర్ వుండేవారు గనుక, ఆయన ఆ మాటల్ని శ్రద్ధగా విని, అవి అద్భుతమైన సంగతులని గ్రహించి, వాటిని తనకు అవసరమైన చోట అంటే, రచనల్లో, ఉపన్యాసాల్లో, ఉత్తరాల్లో, సంభాషణల్లో, చర్చల్లో ఉపయోగించేవారు. రాత్రి తనకు కలిగిన అనుభవాల్ని కృష్ణమూర్తి ఉదయమే ఒక పుస్తకంలో రాసుకునేవాడు. మొత్తం మీద కృష్ణమూర్తి ద్వారా వెలువడిన అనేక అమూల్యమైన సంగతుల్ని లెడ్‌బీటర్, కృష్ణమూర్తి ఇద్దరూ భద్రపరిచారు.

కృష్ణమూర్తి, నిత్యానందం దివ్యజ్ఞాన సమాజంలో చేరిన తర్వాత వారిలో హిందూ సాంప్రదాయ పద్ధతులు పూర్తిగా పోయాయి. వేద మంత్రాల స్థానంలో ఇంగ్లీషు చోటు చేసుకుంది. చక్కని క్రాపు, దుస్తులు, ఆహార - విహారాల్లో పూర్తి మార్పు వచ్చింది. బ్రిటీష్ పద్ధతులన్నీ అలవాటైనాయి.

క్రమంగా కృష్ణమూర్తి పరిశుభ్రం, పరిపూర్ణం అయ్యాడు. ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడేవాడు. అతనికి ఓ నిర్ణీత కార్యక్రమం ఏర్పాటుచేయబడింది. ఆ ప్రకారమే అతడు నడచుకోవాలి. ఉదయం ఐదు గంటలకు నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని, బావిదగ్గర స్నానంచేసి, ప్రార్థన-ధ్యానం చేయాలి.

ఆ తర్వాత లెడ్‌బీటర్ దగ్గర చదువుకోవాలి. చదువుతోపాటు కొన్ని సంగతులు చర్చించి తెలుసుకోవాలి. ఆ తర్వాత వ్యాయామంచేసి, మళ్ళా వేడినీళ్ళస్నానంచేసి, శుభ్రమైన బట్టలు ధరించి చదువుల్లో ప్రవేశించాలి.



అనీబిసెంట్ ఆదేశానుసారం దివ్యజ్ఞాన సమాజ సభ్యులందరూ రాబోయే జగద్గురువును సహృదయంతో ఆహ్వానించి తీసుకోవడానికి సిద్ధంగా వున్నారు.

కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సమాజ అంతరంగశాఖ సభ్యుడైన మూడు వారాలకు కుతుమి అతన్ని తన శిష్యునిగా తీసుకున్న సంగతి లెడ్‌బీటర్‌కీ, అనీబిసెంట్‌కీ చెప్పారు.

ఆ రోజుల్లో అనీబిసెంట్ తరచు బెనారస్ వెళ్ళేది. అక్కడ అనేకమంది గురువుల్ని, మఠాదిపతుల్ని, మఠాధిపతుల్ని, మహాత్ముల్ని, యోగుల్ని, సాధువుల్ని, సన్యాసుల్ని దర్శించి, వారితో అనేక విషయాలు చర్చించేది. వారంతా ప్రాచీన యోగ – తాంత్రిక – ఆధ్యాత్మిక శాస్త్రాల్లో ఎంతో ప్రవేశమున్నవారు. 1910 – జనవరి మొదటి వారంలో అనీబిసెంట్ బెనారస్ వెళ్ళింది. ఆమె అక్కడ వున్న సమయంలో, ఆమె అభీష్టానుసారమే అడయార్‌లో కృష్ణమూర్తికి 'దీక్ష' ఇవ్వడం జరిగింది. జనవరి పదకొండు, పన్నెండు తేదీలలో సూర్యుని ("మిత్ర") సమక్షంలో, అనీబిసెంట్ గదిలో కృష్ణమూర్తి జ్ఞాన దీక్షా ప్రదానం జరిగింది. ఆ సూర్యుడు మైత్రేయుని వారసుల్లో ఒకరు. ఆ దీక్షా విధానమంతా ఒక తంతు. ఆ సంగతంతా కృష్ణమూర్తి స్వయంగా అనీబిసెంట్‌కు ఒక ఉత్తరంలో రాశాడు.

"దీక్ష ఇవ్వబడిన రాత్రి నేను సూక్ష్మ శరీరంలో మాష్టర్ కుతుమి నివాసానికి వెళ్ళాను. అక్కడ ఆయనా, మాష్టర్ మోర్య, మాష్టర్ జ్వలకుల్ మొదలైనవారు వున్నారు. వారు నాతో ఎంతో సేపు చాలా దయగా మాట్లాడారు. దీక్ష గురించి నాకు చెప్పారు.

"వారితో కలిసి నేను ప్రభువు మైత్రేయుని దగ్గరకు వెళ్ళాను. అంతకుముందు నేనోసారి ప్రభువు మైత్రేయుని దర్శించాను. మేము వెళ్ళేప్పటికి మైత్రేయుని చుట్టూ ఎందరో గురువులు, మహాత్ములు, సిద్ధపురుషులు అర్ధచంద్రాకారంలో నిలబడి వున్నారు. కుతుమి నా కుడిచెయ్యి పట్టుకుని, నన్ను మైత్రేయుని ముందుకు తీసుకుని వెళ్ళారు. మీరూ(అనీబిసెంట్) లెడ్‌బీటర్ నాకు దగ్గరగా నిలబడివున్నారు. మైత్రేయులు నన్ను చూసి చిరునవ్వు నవ్వారు. ఆయన నన్ను చూపుతూ, "ఇతనెవరు ?" అని మాష్టర్ కుతుమిని అడిగారు.

"మన సంఘంలో చేరడానికి ఇతనొక అభ్యర్ధి," అన్నారు మీరు.

"చేర్చుకోవడానికి నాకేం ? అర్హుడని నువ్వు హామీ ఇస్తావా?" అని మైత్రేయులు మిమ్మల్ని అడిగారు.

"ఇస్తాను" అన్నారు మీరు.

"అయితే అతన్ని చివరివరకు నడుపుతావా?" అని మళ్ళా అడిగారు.

"నడుపుతాను," అన్నారు మీరు హామీగా, ధీమాగా.

"ఈ సంస్థ సంప్రదాయం ప్రకారం ప్రతి కొత్త అభ్యర్ధికి ఇద్దరు పాతసభ్యులు జామీనుదారులుగా వుండాలి," అన్నారు.

"రెండో జామీనుదారుగా నేనుంటాను," అని వెంటనే అన్నారు జ్వలకుల్.

"అభ్యర్థి చిన్నవాడు. ప్రపంచంలో ఎప్పుడూ అతని వెంటవుండి చూసుకునేవారు మరికొందరు కావాలి," అన్నారు మైత్రేయులు.

"ఆ విధంగా అతన్ని చూసుకోవడానికి మేము సిద్ధంగా వున్నాం," అంటూ మీరూ, లెడ్‌బీటర్ ముందుకు వచ్చారు.

"అతనంటే నిజంగా మీకు అంత గొప్ప ప్రేమవుందా?" అని మళ్ళా అడిగారు.

"అవును. అతనంటే మాకు నిజంగా ఎంతో గొప్ప ప్రేమ వుంది," అని మీరిద్దరూ అన్నారు.

అప్పుడు ప్రభువు మైత్రేయ మొదటిసారిగా నాతో మాట్లాడారు.

"వీళ్ళంటే నీకు ప్రేమేనా? వాళ్ళు చెప్పినట్లు వింటావా?" అని మిమ్మల్ని చూపించి నన్ను అడిగారు.

"నాహృదయ మంతటితో వారిద్దర్నీ ప్రేమిస్తున్నాను," అన్నాను.

"ఈ సౌభ్రాతృత్వపు సంస్థ అనాదిగా వుంది. అంతం వరకు వుండబోతోంది. నువ్వు ఇప్పుడు ఈ సంస్థలో చేరదలి చావు. అవునా?" అన్నారు.

"అవును. అర్హుడనైతే చేరదలచాను," అన్నాను.

"ఈ సంస్థ ఆదర్శం నీకు తెలుసా,? అని అడిగారు.

"ఈ సూర్య మండలాన్ని పాలించే త్రిమూర్తిత్వాన్ని గౌరవించి, దానితో సహకరించి, లోకోద్ధరణకు పనిచేయడం," అన్నాను.

"నిన్ను నీవు మరచి, నీ జీవితాన్నీ, శక్తినీ ధార పోస్తావా? అంతా ప్రభువుగా భావించి నీ జీవితాన్ని ప్రేమ మయం చేసుకోవాలి," అన్నారు మైత్రేయులు.

'పెద్దల సహాయం, సహకారంతో అట్లాగే నడుచుకుంటాను,' అన్నాను.

' ఇదంతా ఎవరికీ చెప్పనని ప్రమాణం చేస్తావా ? ' అన్నారు. ' చేస్తాను, ' అన్నాను.

" ఆ తర్వాత నాకు ఎన్నో గొప్ప వస్తువులు చూపారు. అవేమిటో చెప్పమన్నారు. సరిగ్గా చెప్పాను. కొన్ని ఫిర్యాదులు, సమాచారాలు చెప్పి, వాటి విషయంలో నా అనుభవంతో, వివేకంతో ఎట్లా తీర్పు ఇస్తానో అడిగారు. నన్ను చిన్నప్పుడు స్కూల్లో కొట్టిన టీచర్ని చూపి, " ఈయన అంటే నీకు విరక్తి భావం, శత్రుత్వం వుండేది. అవసరమైతే ఈయన్ని కూడా ప్రేమతో తీసుకుంటావా ? కావలిస్తే, వారికి సహాయం చేస్తావా?" అని అడిగారు. ' తప్పక సహాయం చేస్తాను,' అన్నాను.

ఆ తర్వాత మైత్రేయులు అంధరి సిద్ధపురుషుల వంక చూసి, 'మీరు ఇతన్ని సంస్థలో చేర్చుకోవడానికి ఆమోదించారా? ' అని అడిగారు. అందరూ అంగీకరించామన్నారు.

అప్పుడు మైత్రేయులు శంబాలా * వైపు తిరిగి ఇట్లా ప్రార్థించారు: 'జీవితానికి ప్రభువైన ఓదేవా! నీ పేరు మీదుగా, నీ కోసం ఇది చేస్తున్నాను,' అని అనగా ఒక్కసారిగా శంబాలా వున్న దిశను ఒక పెద్ద నక్షత్రం ధవళ కాంతితో మెరుస్తో ప్రకాశించింది.

---

* శంబాలా :

బ్లావట్స్కి ప్రకారం "శంబాలా" - ఆదిగోబీ ఎడారి. టిబెట్ వారి కథనం ప్రకారం, అది సెంట్రల్ ఆసియా ప్రాంతం. శంబాలాను 'శ్వేతదీపం' అని కూడా అంటారు. అదొక అదృశ్యఒయాసిస్-కల్పనా జగత్తు.

"ఆకాశంలో ప్రకాశిస్తోన్న ఆ నక్షత్రం ప్రక్కన గౌతమ బుద్ధుడు, మహాచోహన్ (సూర్యమండల ప్రభువు రూపాల్లో మహాచోహన్ ఒకరు), మాష్టర్ మోర్య, మాష్టర్ కుతుమి కనుపించారు.

"ఆతర్వాత మహాత్మా మైత్రేయులు నన్ను పిలిచి, నా తలపై చేయివేసి, నిన్ను మా సంస్థలో చేర్చుకుంటున్నాం. నువ్వు త్వరలో అవతల తీరం చేరుకోగాక!" అని దీవించారు.

"మహాత్మా మైత్రేయులు అలా అని, జ్ఞానతాళం చెవి నా చేతికి ఇచ్చారు. దాని సహాయంతో సిద్ధపురుషుల్ని దర్శించ వచ్చు, కలుసుకోవచ్చు.

"ఆతర్వాత ఒక్కొక్క సిద్ధపురుషుడే వచ్చి, నా తలపై చేయివేసి, నన్ను దీవించి, ఆశీర్వదించారు.

---

* 'శంబాలా' అనేది కేవలం ఒక భావన మాత్రమే. అది కంటికి కనుపించేది కాదు. అందు ప్రవేశం సిద్ధపురుషులకే సాధ్యం. అది అలౌకిక - మార్మిక - తాంత్రిక శక్తుల చక్రవర్తి నివసించే ప్రదేశమంటారు, మరి కొందరు.

'శంబాలా' భూమండలానికి నాభిస్థానమనీ, స్వర్గలోక వాసుల్ని - భూలోక వాసుల్ని కలిపే కొక్కెమనీ కొందరి భావన. అది గుప్త విద్యా రాజ్యం. పంచభూతాల కేంద్రీకృతశక్తి స్వరూపమే 'శంబాలా' అంటారు ఒక వర్గం వారు. దాని చుట్టూ అతీత శక్తులు వుండటంచేత అందు ప్రవేశం బహు కష్టమంటారు. కేవలం పవిత్ర హృదయులు, ఏకాగ్రచిత్తులు, నిష్కల్మషమనస్కులు, సత్యాన్వేషకులు మాత్రమే ప్రయత్నించి అందు ప్రవేశించగలరంటారు.

శంబాలా గురించిన గాథలు, సమాచారాలు ప్రపంచమంతటా అనాటినుంచి, ఈనాటివరకు విరివిగా వస్తూనే వున్నాయి. ప్రపంచంలో తీవ్ర సంక్షోభం ఏర్పడినప్పుడు, మానవ జాతిని కాపాడి, రక్షించేది, ఆ శంబాలా వాసులే నంటారు.

మైత్రేయులు కూడా నన్ను దీవించి, ఆశీర్వదించారు.

"అప్పుడు ఆ నక్షత్రం అదృశ్యమైంది. మేమంతా వెళ్ళిపోయాం,

"అంతలో నాకు మెలకువ వచ్చింది. తెలియని ఆనందంలో వున్నాను.

మళ్ళా వెంటనే నిద్రపోయాను.

"ఆరోజంతా నాకు దేహస్ఫురణలేదు. నాలోపల ఏవో జరిగాయి.

"మర్నాడు శంబాలా చక్రవర్తి సనత్‌కుమార్ దర్శన భాగ్యం కలిగింది. ఆయన నాఅంత చిన్నవారు. స్ఫురద్రూపి. ప్రకాశవంతంగా వెలుగుతూ కనుపించారు. ఆయన నవ్వితే, అది సూర్యకాంతివలె వుంది. ఆయన సముద్రమంత గాంభీర్యుడు, మేరువంత బలాడ్యుడు. ఏదీ ఆయన ముందు ఓక్షణం కూడ ఘనంగా నిలవలేదు. అయినా ఆయన ఏమీ కాదు, ప్రేమమయుడు. అందుచేత ఆయన ముందు నాకేమీ భయమనిపించలేదు. అంతకుముందు నేను చూసిన ధవళ నక్షత్రం ఆయనలో ఒక భాగం. ఆయనే ఈ విశ్వమంతా. మేము చూసేందుకు వీలుగా ఆక్షణాన ఆయన అక్కడ వున్నారు. అంతే! ఆ క్షణాన అక్కడేకాదు, అంతటా వున్నది ఆయనే!

"గతంలో చాలా చేశాను. ముందుకాలంలో ఇంకా గొప్పగా చేయబోతున్నాను," అన్నారాయన.

ఆయన శక్తి ఎప్పుడూ నావెనకవుంది. ఆయన నక్షత్రం నామీద నిలిచి వెలిగింది. ఆయన చేయెత్తి నన్ను దీవించారు. మేము వెళ్ళిపోయాము.

ఆయన వెనక ఇంకా ముగ్గురు నిలబడి వున్నారు. కాని, నా కళ్ళు ఆయన్నించి తప్పించుకోలేకపోయాయి. నేను ఇంకా ఆయన గురించే యోచిస్తో "అంటూ కృష్ణమూర్తి ఉత్తరం పూర్తి చేశాడు.

కృష్ణమూర్తి ఉత్తరం ప్రకారం చూస్తే, ప్రభువు మైత్రేయ కృష్ణమూర్తి దేహాన్ని నిశ్చయంగా తన వాహనంగా తీసుకున్నారనిపించక మానదు.

లెడ్‌బీటర్, అనీబిసెంట్ ఇద్దరూ రెండేళ్ళు కృష్ణమూర్తిని జాగ్రత్తగా, శ్రద్ధగా, పరిశుభ్రంగా, కఠిన శిక్షణతో తీర్చి దిద్దారు. కాని, ఆ విషయమై అనీబిసెంట్ ఒకసారి 'మహాత్మా మైత్రేయ భౌతికంగా అవతరించడమనేది జరగదు కాని, ఆయన శక్తి, ఆయన బోధ అవతరణ జరుగుతుంది. దానికి అనువైనది కృష్ణమూర్తి దేహం,' అని నమ్మానని అన్నది.

జ్ఞాన దీక్షానంతరం కృష్ణమూర్తిలో శారీరకంగా, మానసికంగా మార్పు కనుపించింది. ఆ సందర్భంలో అతనికొక ఫోటో తీశారు. అతని ముందు మాష్టర్ కుతుమి, మాష్టర్ మోర్య ఫోటోలు వుంచి, " వీరిలో ఎవరిని గురువుగా తీసుకుంటావు? " అని కృష్ణమూర్తిని అడిగితే, మాష్టర్ కుతుమి ఫోటో చూపాడు.

అనీబిసెంట్ అడయార్‌లో లేని సమయంలో కృష్ణ మూర్తికి ఆమె గదిలో జ్ఞానదీక్ష ఇవ్వబడింది. దీక్షానంతరం కృష్ణమూర్తి రాకకోసం ఆ గది బైట సమాజ సభ్యులు, నారాయణయ్య, నిత్యానందం ఎదురు చూస్తూ వున్నారు. తనకు ఇవ్వబడిన దీక్ష గురించి కృష్ణమూర్తి స్వయంగా అనీబిసెంట్‌కి ఉత్తరం రాసినా, అనీబిసెంట్ పరిచారకుడు లక్ష్మణ్, కృష్ణ మూర్తికి దీక్ష ఇవ్వబడిన రెండు రోజులలో జరిగిన సంగతులు తాను స్వయంగా చూసినట్లు నారాయణయ్యకు ఫిర్యాదుగా చెప్పాడు. అతని కథనం ప్రకారం: అనీబిసెంట్ బెనారస్ వెడుతూ కృష్ణమూర్తి, నిత్యానందాలను తన కుటీరంలో వుండ మన్నది. దీక్ష ఇవ్వబడిన రెండు రాత్రులూ, ఒక పగలూ లెడ్ బీటర్ పర్యవేక్షణలో వున్న కృష్ణమూర్తిని, అనీబిసెంట్ పడక గదిలో వుంచి, తలుపులు మూసేశారు. కృష్ణమూర్తి, అనీబిసెంట్ మంచంమీద వివస్త్రుడై పడుకున్నాడు. లెడ్‌బీటర్ కూడా నగ్నంగా వుండి, అతని వెనక తిరుగుతూ అసభ్యంగా, అశ్లీలంగా ప్రవర్తిం చాడు. అవన్నీ నేను చూశాను," అన్నాడు.

ఆ సంగతులన్నీ విని నారాయణయ్య చాలా గొడవ పడ్డాడు. అతనికి ఏమీతోచక తికమకపడ్డాడు. దానికి తోడు కృష్ణమూర్తి, నిత్యానందం తల్లి తద్దినానికి ఇంటికి వెళ్ళలేదు.

అనీబిసెంట్ బెనారస్ నుంచి తిరిగి అడయార్ రాగానే, నారాయణయ్య ఆమెకు తాను లక్ష్మణ్ ద్వారా విన్న సంగతులు చెప్పాడు. అతడు అంతటితో వూరుకో లేదు. ఆమెకు లీగల్ నోటీసు ఇచ్చాడు - వెంటనే తన కొడుకు లిద్దర్నీ లెడ్‌బీటర్ నుంచి దూరంగా వుంచకపోతే, కోర్టుకు వెడతానని బెదిరించాడు. తన కొడుకులయెడ జరుగుతున్న అర్థంలేని వెట్టి పనుల్ని ఆపు జేయకపోతే వూరుకోనన్నాడు.

ఆ విషయమై అనీబిసెంట్ విచారణ చేయగా 'దీక్ష ఇవ్వ బడిన రెండురాత్రులూ, ఒక పగలూ లెడ్‌బీటర్, కృష్ణమూర్తి అనీబిసెంట్ గదిలో వుండి, లోపల గడియ పెట్టుకున్నారు. కృష్ణమూర్తి అనీబిసెంట్ మంచంమీద పడుకున్నాడు. లెడ్‌బీటర్ నేలమీద పడుకున్నాడు. ఆ రెండు రోజులూ కృష్ణమూర్తి నిద్ర లేవగానే, 'నేను జ్ఞాపకం వుంచుకున్నాను,' అనేవాడు. దానికి లెడ్‌బీటర్, 'నీకేం జ్ఞాపకం వుందో, అదంతా రాసివుంచు' అన్నారు. కృష్ణమూర్తి తాను మైత్రేయుని, గౌతముని సమక్షంలో జీసస్ క్రైస్ట్‌ని చూసి, వారితో సంభాషణలు జరిపాడు. ఆ సంభాషణల సారాంశాన్నంతా వెంటనే వివరంగా అనీబిసెంట్‌కు రాశాడు.

ఆ గడ్డు సమస్యను అనీబిసెంట్ కడు చాకచక్యంతో, నేర్పుగా, తెలివిగా, యుక్తిగా పరిష్కరించింది. ఎందుకంటే, నారాయణయ్య లేవదీసిన విషయం, లెడ్‌బీటర్ మీద యూరప్‌లో మాదిరిగా పెద్ద దుమారం రేపుతుందని ఆమెకు తెలుసు. అందు చేత ఆమె బాగా ఆలోచించి, నారాయణయ్య చేత 6-3-1910న, ఒక డాక్యుమెంట్ రాయించుకుంది: "కృష్ణమూర్తి, నిత్యానందం అనీబిసెంట్ సంరక్షణకింద ఇంగ్లండులో చదువు కునేటట్లూ, ఆమె మరణానంతరం ఆ డాక్యుమెంట్ రద్దయి, తిరిగి వారిద్దరూ తండ్రి అధీనంలో వుండేటట్లూ," అని. ఆ డాక్యుమెంట్ ప్రకారం కృష్ణమూర్తికి, లెడ్‌బీటర్‌కి ఎటువంటి సంబంధం వుండదు. అదంతా అనీబిసెంట్ తెలివిగా చేసిన పని.

ఆ క్షణాన నారాయణయ్య అనీబిసెంట్ మాట కాదనలేక, కనీసం ఆ ఇద్దరు కొడుకులైనా ఆమె సంరక్షణ కింద చదువు కుని, అభివృద్ధిలోకి వస్తారని ఆశించి, సంతోషంతో ఆమె కోరిన విధంగా డాక్యుమెంట్ రాసి ఇచ్చాడు. ఆ విధంగానైనా పిల్లలు

లెడ్‌బీటర్‌నుంచి దూరమౌతారని ఆశించాడు. కాని, కృష్ణమూర్తి విషయమై లెడ్‌బీటర్‌పై అనుమానంపోలేదు, కొందరికి. కొందరు సమాజ సభ్యులు లెడ్‌బీటర్ యెడల ఆగ్రహంతో వున్నారు. కొందరు ఆయన్ని బహిరంగంగా విమర్శించి, నిందించి, హేళన చేశారు. ఆ సంగతి లెడ్‌బీటర్ జీవితాన్నే కృంగదీసింది. యూరప్‌లో వలె, ఇండియాలో కూడా ఆయనపై అభాండమే పడింది.

• • •

అనీబిసెంట్ బెనారస్ వెడుతూ కృష్ణమూర్తి, నిత్యానందాన్ని వెంటతీసుకువెళ్ళింది. అక్కడ అనేకమంది ప్రముఖులు, మేధావులు కృష్ణమూర్తిని చూసి, విస్మయంచెంది అనేక ప్రశ్నలు వేశారు. వాటన్నింటికి కృష్ణమూర్తి వివేకవంతమైన జవాబులు ఇచ్చాడు. ఆ పెద్దలలో జార్జి అరండేల్ కూడా వున్నారు. అతని పూర్తిపేరు జార్జి సిడ్నీ అరండేల్. అతను ది. 1-12-1878 లో బ్రిటన్‌లో జన్మించాడు. అతని చిన్నప్పుడే తల్లి చనిపోయింది. అతను అనీబిసెంట్‌ను విని, ప్రభావితుడై 1902 లో ఆమె శిష్యుడైనాడు. అతను మొదట సెంట్రల్ హిందూ కాలేజీలో లెక్చరర్‌గా చేరి, తర్వాత ప్రిన్సిపాల్ అయ్యాడు. ఆ కాలేజీని మదనమోహన మాలవ్యా చేపట్టిన తర్వాత, అరండేల్ అడయార్ వచ్చి (1913), అనీబిసెంట్‌ను అనుసరించి, ఆమె కార్యక్రమాల్లో పాల్గొని, ఎంతో సహాయం చేశాడు. ఆమె ఆశీర్వాదంతో 1920 లో రుక్మిణీదేవిని వివాహం చేసుకున్నాడు.

కృష్ణమూర్తిని కొన్నాళ్ళు సూక్ష్మశరీరంతో మాస్టర్ కుతుమి నివాసానికి తీసుకువెళ్ళాడు, లెడ్‌బీటర్. అతను పరమ గురుబోధలను శ్రద్ధగా విని, దాన్నంతా జ్ఞప్తిలో వుంచు

కుని, తెల్లవారిన తర్వాత ఆ విషయాలన్నింటినీ చిన్న చిన్న కాగితాలపై రాసుకుంటూవుండేవాడు, కృష్ణమూర్తి. అప్పుడు అతని వయసు పదమూడేళ్ళు.

మాష్టర్ కుతుమి ఉపదేశ సారాంశాన్ని కృష్ణమూర్తి "At the feet of the Master పరమ గురుచరణ సన్నిధి" అనే పుస్తకంగా తయారుచేశారు. అనీబిసెంట్ బెనారస్‌నుంచి లెడ్‌బీటర్‌కి ఉత్తరం రాస్తో "కృష్ణమూర్తి రాసి, దాచివుంచిన కాగితాలు సరిచూసి పంపండి" అన్నది. ఆ ప్రకారం ఆయన వాటిని సరిచూసి, అవి పరమగురు బోధలు కనుక వాటిని ముందుగా మహాత్మా మైత్రేయులకు చూపి, వారి ఆమోదం పొందారు; అచ్చువేయించడానికి. దానితోపాటు "ఆల్కియోన్" జీవితాలు కూడా ప్రపంచానికి పరిచయం చేయమని వారు ఆదేశించారు.

లెడ్‌బీటర్ సరిచూసిన కృష్ణమూర్తి రచనలను 1916 డిశంబరులో బెనారస్ మిత్రులు అచ్చువేయించారు. అదే "at the feet of the master". వారు ఆ పుస్తకాన్ని లెడ్‌బీటర్‌కు పంపిస్తూ, "ఈ పుస్తకంలో వున్న సంగతులే, విషయాలే, సత్యాలే, సూక్తులే మీ ఉత్తరాల్లో, ఉపన్యాసాల్లో, పుస్తకాల్లో, సంభాషణల్లో కనుపించడంలోని నిజానిజాలు మాకు తెలియపరచ గలరు," అని రాశారు. దానికి లెడ్‌బీటర్, "ఆ సంగతులన్నీ కృష్ణమూర్తి నిద్రలో మాష్టర్ కుతుమితో మాట్లాడిన విషయాలు. అతను నాగది ప్రక్కనే పడుకునేవాడు. నేనామాటల్ని శ్రద్ధగా విని, జ్ఞాపకం వుంచుకుని, నాకు అవసరమైన వాటిని ఉపయోగించుకున్నాను," అని జవాబు రాశారు. లెడ్‌బీటర్‌వంటి వ్యక్తులు లోకంలో చాలా అరుదుగా వుంటారు. వాస్తవానికి ఆపుస్తకాన్ని లెడ్‌బీటరే రాసి వుంటారని కొందరి అనుమానం.

ఆ పుస్తకానికి కృష్ణమూర్తి చిన్న పరిచయం రాశారు: "ఇవి నా మాటలు కావు. ఇవన్నీ నా గురువు మాష్టర్ కుతుమి చెప్పిన సంగతులు. ఆయన లేనిది, నేనేమీ కాను. మీరు కూడా ఈ మార్గంలో నడవదలచుకుంటే, నా గురువు నాకు సూచించిన సంగతులు మీకూ సహాయపడతాయి. అవి కేవలం సూక్తులు కావు. పరమ సత్యాలు. ఆయన చెప్పినట్లు నడచు కుంటే, ఎటువంటివారైనా వికాసం చెందగలరు. జీవితంలో దేనినైనా సాధించగలరు. భోజన పదార్థాలు తినకుండా, అవి బాగా వున్నాయంటే, ఆకలి తీరుతుందా? గురువచనాలు వినడం చాలదు. వాటిని తు. చ. తప్పకుండా అనుక్షణం అనుష్టిస్తో, ఆచరణలో పెట్టాలి. ఆయన ఏ సంగతీ రెండుసార్లు చెప్పరు. ఆయన చెప్పిన ఏ ఒక్కమాటనైనా శ్రద్ధగా వినక పోతే, మనం ఎప్పటికీ నష్టపడే వుంటాం," అని రాసి, తన గురువు దివ్యత్వాన్ని వ్యక్తం చేశారు, కృష్ణమూర్తి.

ఆ పుస్తకంలో "వివేకం, వైరాగ్యం, సత్ప్రవర్తన, ప్రేమ" అనే నాలుగు ముఖ్యాంశాలున్నాయి.

## వివేకం

మనిషి ఏ కుల - మత - వర్గానికి చెందిన వాడని కాదు, మనం చూడవలసింది, ఈశ్వరుని యెడల అతని ఉద్దేశ్యం ఏమిటో తెలుసుకోవడం, ముఖ్యం. సత్యాన్ని తెలుసుకోవాలనే యత్నమే, మానవునిలో పరిణామం.

సత్యాన్వేషకు లెప్పుడూ ఆత్మ వికాసం కోసం శ్రమిస్తారు కాని, స్వార్థంతో ఏదీ చేయరు. వారు విశ్వ సౌందర్యంలో లీనమై జీవిస్తారు. తక్కిన వారు, జీవితంలో అవాస్తవం, అశాశ్వతం అయిన వాటిని అనుసరించి, అనేక దాహలు వెతుక్కుంటూ, స్వార్థంతో అజ్ఞానంలో బ్రతుకుతారు.

జీవితమంతా సత్యా సత్యాల్ని వివేకంతో తెలుసుకుంటో ముందుకు సాగడమే సాధన. ఆ సాధనే మానవుని ఒక క్రమ మార్గంలో వుంచుతుంది. ఆ సాధనా సమయంలో దేహం దేనినైనా వాంఛిస్తే, వెంటనే ఆగి, ఆ విషయమై తీవ్రంగా యోచించాలి. ఎందుకంటే, మనమంటే 'దేహం - నేను' అనే రెండింటి కలయిక వల్ల ఏర్పడ్డ వాళ్ళం. ఆ రెండింటిలో ఒకటైన దేహం, దేనినో కోరుతోంది. ఆ దేహ వాంఛతో రెండవదైన "నేను" ఏకీభవించవచ్చు, లేదా, ఏకీభవించకపోవచ్చు.

"స్థూల శరీరం, సూక్ష్మ శరీరం, కారణ శరీరం" అనే శరీర త్రయం తమ తమ వాంచల్ని నెరవేర్చుకోవడానికి ప్రతి ఒక్కటీ "నేను"గా నటిస్తాయి. కాని, అవి 'అసలు నేను' కాదు. కనుక మనం వాటి యజమానిగా ప్రతిక్షణం, ప్రతిదాని విషయంలో వాటి - వాటి వాంఛల్ని, విముఖత్వాల్ని గమనిస్తో వుండాలి. వాటి - వాటి కోర్కెలు 'అసలు నేను' కాదని తెలుసుకున్న వాడు, కోర్కె కలిగిన వెంటనే అది ఎటువంటి కోర్కె అయినప్పటికీ ఆగి, ఆలోచిస్తాడు.

స్థూల శరీరమంటే, మనం ఎక్కి స్వారీచేసే గుర్రం వంటిది. దానిపై స్వారీచేయడానికి మనం జాగ్రత్త తీసుకోవాలి. దాన్ని ఆదరంగా చూసుకుని, ఉపయోగించుకోవాలి. దానిచేత అమితంగా పనిచేయించకూడదు. దాన్నెప్పుడు శుభ్రంగా వుంచాలి. దానికి మితాహారమే పెట్టాలి. అది ఆరోగ్యంగా లేకపోతే, సరిగా నడవదు. దాన్నెప్పుడు అదుపులో వుంచుకోవాలేగాని, మనం దాని ఆధీనంలో వుండకూడదు.

సూక్ష్మశరీరం యొక్క కోర్కెలు అపారం. ఆ కోర్కెల ద్వారా మనకు హాని కలిగించాలని కాదు, దాని ఉద్దేశ్యం. అది కోరుకునే వాటిని మనం సహజంగా కోరుకోము. దాని కోర్కెల్ని

వివేకంతో తెలుసుకోకపోతే, కోపం, అసూయ, ఈర్ష్య, ద్వేషం, అత్యాశ, విచారం, మానసికంగా కృంగిపోవడంవంటి గుణాలు కలిగి, మనం వాటిల్లో పడి కొట్టుకునేటట్లు చేస్తుంది. అది దాని స్వభావం, నిరంతరం మారడం దానికి ఇష్టం.

కారణ శరీరం ఎప్పుడూ అహంతో నిండివుంటుంది. అది తన గురించి అధికంగా యోచించుకుంటుంది. ఇతరమైనవాటి గురించి అల్పంగా, స్వల్పంగా యోచిస్తుంది. మనం భౌతిక విషయాలనుంచి మళ్ళితే, అదీ అటు తిరిగి, "నువ్వు ఏం సాధన చేస్తున్నావు? ఆ సాధనా మార్గంలో నువ్వు ఎంత ముందుకు వెళ్ళావు? ఏం సాధించావు?" అనే ప్రశ్నలు రేపి తీవ్రంగా ఆలోచింపజేస్తుంది. మనం ధ్యానానికి కూర్చుంటే, అది అనేకం ఆలోచించేటట్లు చేస్తుంది. మనం సదా దాని ఎరుకలో వుండక పోతే, దాని అహంకారంలో అణగిపోతాం. అందుచేత మనం ఎప్పుడూ శాంతంగా, సాధు స్వభావంతో, త్రికరణశుద్ధిగా వుండాలి. అన్నివేళలా మన హృదయంలో అన్నింటికీ, అంద రికీ చోటివ్వాలి.

మనకు స్పష్టంగా తెలియనప్పుడు ఇతరుల గురించి ఏమీ యోచించకూడదు. ఇతరులు మనగురించి ఆలోచిస్తున్నారనీ ఆలోచించకూడదు. వాళ్ళు మనకేదో చెడు తలపెడుతున్నా రనీ, మనయెడల దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నారనీ మనం వెంటనే ఒక నిర్ణయానికి రాకూడదు. ఎవరి బాధలు, ఎవరి ఆలోచనలు వారికి వుండనే వుంటాయి. ఇతరులు మనయెడల కోపంగా, ఈర్ష్యగా వుండి, మనం గాయపడేటట్లు మాట్లాడు తున్నారనుకోవద్దు. బహుశా వారి కోపం, ఈర్ష్య, ఆ క్షణంలో మన వైపు తిరిగి వుంటుంది. అంతే! ఒకరు మనయెడల తెలివితక్కువగా ప్రవర్తించవచ్చు. అంతమాత్రంచేత మనం

వారి విషయంలో అసత్యంగా, ఆలోచించకూడదు. ఒకరిగురించి ఒక కథ వింటే, దాన్ని తిరిగి ఎవరికీ చెప్పకు. ఎందుకంటే, అది నిజం కాకపోవచ్చు. ఏదైనా మాట్లాడేముందు బాగా ఆలోచించాలి. చేతనైతే మౌనంగా వుండటం మంచిది.

ఈ మార్గాన నడిచేవారు ముందు తమ గురించి తాము ఆలోచించి, తెలుసుకోవాలి. అదే ఆత్మవిచారణ మార్గం.

మనం ఏంచేస్తున్నా, ఎప్పటికీ మనం మనంగానే వుండాలి. "ప్రతి దాంట్లో సత్యం, దైవత్వం వుందా? లేదా?" అని వివేకంతో చూడ్డం నేర్చుకోవాలి. దైవత్వమనేది బైటికి కనుపించే విషయంకాదు. అది పై పై జరిగే సంగతీకాదు. కనుక ప్రతిదాని విషయంలో లోతుగా చూసి, వివేకంతో మసలుకోవాలి. అదే దివ్యజీవనం. అదే అసలు సత్యం.

# వైరాగ్యం

ఎంత ఉన్నతమైన కోర్కె అయినా బంధమే. కోర్కెలన్నీ పోయిన తర్వాత వచ్చే ఫలితం ఏమిటో తెలుసుకోవాలనే కోర్కె కలగడం కూడా సహజమే. కనుక మనం ఎప్పుడూ ఫలితంకోసం చూడకుండా న్యాయం కోసం, ధర్మంకోసం, కర్మ జరగడం కోసం పనిచెయ్యాలి.

నిత్యజీవితంలో ప్రతివారూ, ప్రతి క్షణం అల్పమూ, స్వల్పమూ అయిన కోర్కెలనుంచి జాగ్రత్త పడాలి. ఎందుకంటే, ఎంత ఉత్పన్నమైన కోర్కెఅయినా మనల్ని స్వేచ్ఛగా వుండనీయదు.

గొప్పవాళ్ళం కావాలని ఎప్పుడూ కోర్కె పడకూడదు. లోకం ముందు గొప్పగా కనపడాలని అనుకోకూడదు. ప్రజల ముందు గొప్పగా మాట్లాడి, మెప్పుపొందాలనుకోకూడదు. మాట్లాడటంకన్నా, మౌనం గొప్ప సంగతి. మాట్లాడేది సత్యమో, కాదో తెలియనప్పుడు, అసలు మాట్లాడకపోవడం మంచి సంగతి. మాటల్లో ఎప్పుడూ మూడో వ్యక్తి ప్రసక్తి రాకూడదు. ఉత్త మాటలు మాట్లాడుకోవడం కన్నా, మౌనంగా వుండటం మంచిది. మాట్లాడటంకంటే, వినడం మంచిది. ఇతరులు మనల్ని సూటిగా ఏదీ అడక్కపోతే, మన అభిప్రాయాల్ని వాళ్ళముందు పెట్ట కూడదు. మౌనంయొక్క గొప్పతనాన్నీ, శక్తినీ స్వానుభవంతో తెలుసుకోవాలి.

ఇతరులలోని తప్పుల్ని వారికి తెలియపరచాలనుకుంటే, చాలా మర్యాదగా చెప్పాలి. వాళ్ళను శాంతంగా ఒప్పించాలి. గట్టిగా యోచిస్తే, వాళ్ళకు తెలియజెప్పడం ఒప్పించడం రెండూ అనవసరమే.

ఒకరి స్థానంలో మనం బోధకులుగా నియమింపబడితే, శాంతంగా చెప్పాలి. పసివాళ్ళ విషయంలో, పశువుల విష యంలో అన్యాయం జరుగుతోవుంటే, కలగజేసుకోవడం ధర్మం. కాని, ఎప్పుడూ మనం మన పనుల్లో నిమగ్నులమై వుండాలి.

మనకు సిద్ధులూ, శక్తులూ అవసరమైతే, ఆయనే అనుగ్రహిస్తారు. కాని, అవి కలిగినవారు చాలావరకు తప్పు దోవలు తొక్కుతారు. క్రమంగా గర్వితులై తాము తప్పులు చేయడంలేదనుకుంటారు.

సిద్ధులూ, శక్తులూ లేకపోయినా ఫరవాలేదు. అవి రావా లని, కావాలని ఆశపడకూడదు. అవి లేవని గొడవపడకూడదు.

వాటిని ఎట్లాగైనా సంపాదించాలని ప్రయత్నించకూడదు. ఆత్మాభివృద్ధితోపాటు సమయమైనప్పుడు అవి తప్పక లభిస్తాయి. వాటిని అనుగ్రహించినవారే, వాటి గురించి వివరిస్తారు. అప్పటి వరకు మనం వేచివుండాలి.

# సత్ప్రవర్తన

వివేకం చెప్పినట్లు మనం సూక్ష్మశరీరాన్ని స్వాధీనంలో పెట్టుకుంటే, కారణశరీరం యొక్క స్వభావానికి ఎరుకలో వుండి దాన్ని కూడా అదుపులో పెట్టుకుంటే, అప్పుడు మన ఆలోచనలు నిర్మలంగా వుంటాయి. మనసు నిశ్చలమై, శక్తివంతమౌతుంది. ఆ మనసు సహాయంతో మనం చేసే సాధనలో ఎదురయ్యే కష్టాల్ని నిర్భయంగా ఎదుర్కొగలుగుతాము. ఏ వేదనలూ లేక శాంతంగా జీవించగలుగుతాము.

"ఆలోచనల్ని అదుపులో పెట్టడం - వాటిని ఆపుజేయడం" అనే సాధన ఒకటి వుంది. ఏపని చేస్తున్నా ఆలోచన అంతా దానిపై కేంద్రీకరించి పని చెయ్యాలి. ఎవరి పనుల్ని వారిని చేసుకోనివ్వాలి. ఇతరుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోకూడదు. ఇతరులకు మన సహాయం అవసరమైతే సాయపడడానికి సిద్ధంగా వుండాలి. కాని, ఎప్పుడూ ఇతరుల గొడవల్లో తలదూర్చరాదు.

మనసును సోమరిగా వుండనీయకూడదు. అజ్ఞానంవల్ల కలిగే అహంభావంనుంచి మనసును దూరం చెయ్యాలి. అజ్ఞానం వల్ల తాము అధికులమనుకుంటారు, అవివేకులు. ఇతరులను ఎప్పుడూ, దేనికీ ఖండించకూడదు, విమర్శించకూడదు. వాళ్ళ పనుల్ని వాళ్ళను చేసుకోనివ్వాలి. అన్నింటియందూ దయగా, ప్రేమగా, మర్యాదగా, సహన భావంతో వుండాలి.

గొప్పపనులనుకుని కొత్తగా దేనినీ చేపట్టకూడదు. నిత్యకృత్యాల్ని, స్వధర్మాల్ని విస్మరించకూడదు. కొత్తగా తీసుకున్న వాటిని సంపూర్ణంగా నిర్వహించాలి. ఎప్పుడూ మనం, మనంగానే వుండాలి. ప్రతి పనినీ సంతోషంతో చేయాలి. కష్టమైనా, నష్టమైనా ఫలితాన్ని భరించాలి. ఏక్షణానైనా స్వాధీనంలో వున్న వాటిని అన్నింటినీ వదలడానికి సిద్ధంగా వుండాలి.

ఎవరైనా బాధల్లో, కష్టాల్లో, దుఃఖాల్లో వుంటే, వారి గురించి ప్రేమగా ఆలోచించాలి. అన్నింటియందూ సమభావం, సహనం చూపాలి. మతసహనాన్ని సాధించే ముందు, స్వమతమందు మూఢనమ్మకాలు, అంధ విశ్వాసాలు, దురభిమానాలు పోవాలి. ప్రతిదాన్ని అవగాహన చేసుకోవాలి.

నిత్యజీవితంలో ఎప్పుడు, ఏ సమస్య ఎదురైనా, అది ఎంత ముఖ్యమైనదైనా గురువు చెప్పిన పనిని ముందుగా చేయడం మరచిపోకూడదు. గురువు చెప్పిన పనిని భక్తి-శ్రద్ధలతో నిస్వార్థంగా చేయాలి. గురుసేవలో ఏ ఆకర్షణలూ, వాంఛలూ, శారీరక సుఖాలూ ఏవీ మనల్ని లక్ష్యంనుంచి మళ్ళించకూడదు. గురువులో పూర్తి విశ్వాసముంచాలి. అంతకంటే ముందు, మనమీధ మనకు నమ్మకం వుండాలి. అటువంటి విశ్వాసంలేనినాడు ప్రేమ అసంభవం.

"నువ్వు" అంటే, అసలైన నువ్వు. ఈశ్వరాగ్నిలో రవ్వవైన నువ్వు. సర్వశక్తివంతుడైన పరమేశ్వరునితో నిండివున్న నువ్వు. కాని, నువ్వు చెయ్యాలనుకున్నదాన్ని నువ్వు చేయలేవు. ఆయన ద్వారా తప్ప ఏదీ జరగదు.

## ప్రేమ

ప్రేమంటే, ఒక నిర్ధారణే కాని, సంకల్పం — ఇచ్ఛవంటి కోర్కె కాదు. దైవమే ప్రేమ. సర్వేశ్వరునిలో లీనమై జీవించాలనే సంకల్పమే ప్రేమ. ప్రేమతో నిండివుండటమే, ఈశ్వరునిలో లీనమై జీవించడం.

ఏ ప్రాణికీ, ఎప్పుడూ హాని కలిగించకుండా వాటికి సహాయంచేసే సదవకాశంకోసం కాచుకుని వుండటం జీవితంలో గొప్ప సంగతి.

ఎంత జాగ్రత్తగా ఆలోచించి చేసినా, అనాలోచితంగా చేసినా కర్మ, ఫలితాన్ని ఇవ్వడం ఎప్పుడూ మరచిపోదు. మనం చెప్పే కారణాల్ని, కర్మ తీసుకోదు. ఒక మార్గాన ప్రవేశించేముందు, దాని పర్యవసానాల్ని కూడా బహుముఖంగా యోచించాలి.

ఈశ్వరునిలో ఐక్యం కావడం కేవలం మన క్షేమంకోసమే కాక, మనవంటివారి హృదయాల్లో ప్రభువు ప్రేమ ప్రవహించేందుకు మనం ఒక మార్గం కావడం. ఆ మార్గంలో మనం వుండటం మనకోసం కాదు, ఇతరులకోసం. ఆమార్గాన నడిచేవారు తమను తాము పూర్తిగా మరచిపోవాలి. ప్రేమతో నిండినవాడు, ప్రభువు చేతిలో కలం మాదిరిగా వుంటాడు. అతనిలోంచి ఆయన ఆలోచన, సంకల్పం, ఇచ్ఛ అనేవి వెలువడతాయి అతని హృదయాన్ని నింపిన ప్రేమ, ప్రపంచంమీద ప్రతిబింబిస్తుంది. అతడొక సజీవమైన వెలుగు రవ్వ. "ప్రేమ, సంకల్పం, జ్ఞానం," ఈమూడూ భూమిమీద అవతరించిన ఈశ్వరోత్త్రాలు.

• • •

కృష్ణమూర్తి అంత చిన్నవయసులో అంత గొప్ప పుస్తకం రాయడానికి కారణం కేవలం సిద్ధపురుషుల అనుగ్రహమనే చెప్పవచ్చు. ఆ పుస్తక ప్రచురణతో కృష్ణమూర్తి అనేకమంది పెద్దల మన్ననలను అందుకున్నాడు. అది చదివి, ప్రపంచంలో ఎందరో తమ జీవిత విధానాలను మార్చుకున్నారు. కాని, కొందరు అనీబిసెంట్ మిత్రులు, సన్నిహితులు, అనుచరులు, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు, "ఏమీ కాని ఒక చిన్న కుర్రవాడిని దగ్గరకు చేరదీసి, గొప్ప చేయడం ఏమీ బాగాలేదు," అని ఆమెను మనసుల్లో వ్యతిరేకించారు. వారిలో ప్రముఖులూ వున్నారు. అయినా అనీబిసెంట్ పర్వతం మాదిరిగా మహాత్ముల మాటమీద అచంచల విశ్వాసంతో ధైర్యంగా నిలబడింది.

ఆ తర్వాత ఆ పుస్తకం అనేక ముద్రణలు అయింది. అది ఎన్నో భాషల్లోకి అనువదించబడి, మరెన్నిసార్లో అచ్చయింది.

దీక్షానంతరం కృష్ణమూర్తి జీవితగాథ పెద్ద మలుపు తిరిగింది. మహాత్మా మైత్రేయులు జగద్గురువుగా అవతరించబోతున్నారనీ, వారిని ఆహ్వానించి తీసుకునేందుకు జార్జి అరండేల్ ఆధ్వర్యాన బెనారస్‌లో 11-1-1911 లో ఒక సంఘం స్థాపించబడింది. ఆ సంఘం పేరు, " The Order of the Rising Sun— తారక సంఘం ". అందు అన్ని దేశాలవారు సభ్యులుగా వుండవచ్చు. దానికి కృష్ణమూర్తిని అధిపతిగా చేశారు. జార్జి అరండేల్, కృష్ణమూర్తికి ప్రైవేట్ సెక్రటరీగా నియమింపబడ్డాడు. ఆ సంస్థను అనీబిసెంట్, లెడ్‌బీటర్ తమ చేతుల్లోకి తీసుకుని వృద్ధి చేశారు. త్వరలో ఆ సంస్థను అంతర్జాతీయ సంస్థగా రూపొందించి - " The Order of the Star in the East "గా దాని పేరు మార్చారు. దానికి ఎటువంటి నియమ, నిబంధనలు లేవు. చందాలు లేవు. అందు ప్రపంచ దేశాల పెద్దలు, మేధావులు, ప్రముఖులు, సభ్యులుగా చేరారు. రాబోయే జగద్గురు విషయంలో ప్రజాభిప్రాయాన్ని, వాళ్ళలో ఏకీకరణాన్ని తీసుకురావాలనే ఉద్దేశ్యంతో ఆ సంస్థ తీవ్ర కృషి చేసింది. ఆ సంస్థ తరపున " Herald of the Star " అనే పత్రిక స్థాపించి, దానికి నామ మాత్రపు ఎడిటర్‌గా కృష్ణమూర్తిని నియమించారు. అది త్రైమాసిక పత్రిక. ఆ పత్రిక మొదటి సంచిక 1911 - జనవరిలో వెలువడింది.

ప్రపంచ సంస్థకు కృష్ణమూర్తి సర్వాధికారి కావడంతో ఆయనకు ఎందరో అనుచరులూ, అభిమానులూ ఏర్పడ్డారు. "దివ్యజ్ఞాన సమాజం వుండగా మళ్ళా ఈ సంస్థను ఎందుకు స్థాపించారు ? పెద్దలైన మీరు ( అనీబిసెంట్, లెడ్‌బీటర్ ) ఎందుకు దాన్ని ప్రోత్సహిస్తున్నారు ? " అని కొందరు దివ్యజ్ఞాన సమాజ సభ్యులు వారిని అడిగారు. దానికి అనీబిసెంట్ " రాబోయే జగద్గురువును ఆహ్వానించి, తీసుకునేందుకు, " అని సమాధానమిచ్చింది.

• • •

1911 ఫిబ్రవరిలో అనీబిసెంట్ కృష్ణమూర్తిని బర్మా తీసుకువెళ్ళింది. అతను అక్కడ ఎన్నో బుద్ధవిగ్రహాలు చూశాడు. అవి అతని జీవితంలో అందమైన సంగతులుగా నిలిచాయి.

ప్రపంచ సంస్థ స్థాపనతో అనీబిసెంట్‌లో నూతనోత్సాహం కలిగి కృష్ణమూర్తి జగద్గురువనీ, అతని ద్వారా ప్రపంచానికి సద్బోధ జరుగుతుందనీ, అతనివల్ల సర్వమానవాళీ తరిస్తుందనీ ఆ సంగతి తమకు అనేకమంది మహాత్ములు దర్శనమిచ్చి చెప్పారనీ – ఈ అశాంతిమయ ప్రపంచానికి కృష్ణమూర్తే శాంతిదూతనీ అతనే ప్రజలకు సరైన జ్ఞానమార్గం చూపుతాడనీ అనీబిసెంట్ ప్రపంచమంతా తిరిగి ప్రచారం చేసింది. తత్ఫలితంగా పదహారువేలమంది సభ్యులు కల ఆ సంస్థలో 1928 నాటికి నలభై వేలమంది చేరారు.

కృష్ణమూర్తి ఇంగ్లండులో చదవాలనేది సిద్ధపురుషుల ఆదేశమని, అందుచేత వారికి కావలసిన ఇంగ్లీషు పద్ధతి దుస్తులు బెనారస్‌లో కొన్నారు. అనీబిసెంట్, అరండేల్, కృష్ణమూర్తి, నిత్యానందం ఆ నలుగురూ యూరప్ వెళ్ళారు. ఆమె ఆంతర్యంలో దివ్యజ్ఞాన సమాజ కేంద్రకార్యాలయాన్ని అడయార్ నుంచి ఇంగ్లండుకు తరలించాలనే తలంపు వుందనే వాదం ఒకటి లేకపోలేదు; ఆనాడు.

జగద్గురువు వస్తున్నారనీ, తిరిగి వస్తానన్న ఏసు ప్రభువును దర్శించాలనీ లండన్‌లో చారింగ్ క్రాస్ స్టేషన్‌లో స్వాగతం చెప్పడానికి ఎందరో దివ్యజ్ఞాన సమాజ సభ్యులు, ఇంకా అనేక మంది ప్రముఖులు. ది. 5-5-1911 న చేరారు. వారిలో లేడీ ఎమిలీ ఒకరు. ఆమె భర్త న్యూఢిల్లీ నగరాన్ని తీర్చిదిద్ది కట్టించిన మేధావి. ఆమెకు పెళ్ళయిన పదమూడేళ్ళకు ఐదుగురు

పిల్లలు కలిగారు. భర్త నిరంతరం నిర్మాణాత్మక కార్యక్రమాలతో దేశాలు తిరిగేవాడు. ఆమె అనేక సాంఘిక కార్యక్రమాల్లో నిమగ్నురాలయ్యేది. అయినా ఆమె జీవితం సామాన్య గృహ జీవనంగా మిగిలిపోవడంతో తృప్తి కనపడలేదు ఆమెకు. ఆమె ఎన్నో గ్రంధాలను చదివింది. ఎంతో విజ్ఞానాన్ని ఆర్జించింది. ఆమెలో స్వతస్సిద్ధంగా వున్న భావాల, మోహాల, వ్యాకులతలకూ, తన మేధాసంపత్తికీ అవసరమైన వాటికోసం మరోమార్గం అన్వేషిస్తున్న సమయంలో కృష్ణమూర్తిని కలుసుకుంది. ఆ తర్వాత ఆమెకు ఆధ్యాత్మికత మీదకు దృష్టి మళ్ళింది. ఆమె కృష్ణమూర్తిని చూసిన మొదటి క్షణంలోనే తన్మయత్వంలో పడిపోయింది.

కృష్ణమూర్తిని, నిత్యానందాన్ని తన మిత్రురాలైన "బ్రైట్" ఇంట్లో వుంచింది, అనీబిసెంట్. మూడురోజుల తర్వాత లండన్‌లో దివ్యజ్ఞాన సమాజ సమావేశం ఏర్పాటు చేయబడింది. ఆ సమావేశంలో అనీబిసెంట్ మాట్లాడుతూ, "ది ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్ ది ఈస్ట్" అనే సంస్థలో ఎవరైనా సభ్యులుగా చేరదలచుకుంటే, ముందుగా జార్జి ఆరండేల్‌కు దరఖాస్తులు పెట్టుకోవలసినదిగా కోరింది. వెంటనే లేడీ ఎమిలీ ఆ సంస్థలో సభ్యురాలుగా చేరింది.

మే, ఎనిమిదో తేదీన లండన్‌లో జరిగిన దివ్యజ్ఞాన సమాజ సమావేశంలో కృష్ణమూర్తి మొదటిసారిగా బహిరంగ సభలో ఉపన్యసించాడు. అరండేల్, అనీబిసెంట్ ముందుగా అతనికి ఎన్ని చెప్పి, ఎంత తయారు చేసినా, కృష్ణమూర్తి వేదికమీద వొణికాడు. చెప్పదలచుకున్నది, భయంతో మరిచాడు. కాని అతని కంఠమాధుర్యానికీ, సరళమైన భాషకూ, ముఖ వర్చస్సుకూ, చెప్పే విధానానికీ శ్రోతలు ముగ్ధులై చాలా సంతోషించారు.

కృష్ణమూర్తి యూరప్‌లో వున్న నాలుగు నెలలూ, లేడీ ఎమిలీ అతనికెన్నో అవకాశాలు కల్పించి, ఎంతో సహకరించి సహాయం చేసింది. ఆమె మొదటినుంచీ అతన్ని ప్రేమగా చూసుకుంది. వారు అనేక సంగతులు చర్చించుకున్నారు. ఒకసారి మాటల్లో, "వీళ్ళంతా నన్ను ఎందుకు జగద్గురువుగా ఎన్నుకున్నారు ?" అని ఆమెను అమాయకంగా అడిగాడు, కృష్ణమూర్తి.

ఆ సమయంలో నిత్యానందం కంటికి జబ్బుచేసింది. ఆ జబ్బు లండన్‌లో కుదరలేదు. చివరికి కన్నుపోయింది.

మాష్టర్ కుతుమి ఆజ్ఞానుసారం, కృష్ణమూర్తికి చాలా బలవత్తరమైన ఆహారం పెట్టేవారు. రోజూ అతని భోజన పళ్ళాన్ని ఆనీబిసెంట్ పరీక్షగా చూసేది. ఒకరోజు రాత్రి కృష్ణమూర్తి కడుపునొప్పితో బాధపడటం చూసి, మర్నాడు కృష్ణమూర్తి భోజనంచేయబోయే పళ్ళాన్ని లేడీ ఎమిలీ లాగెయ్యాలని చూసింది.

కృష్ణమూర్తి యూరప్‌లో అనేక సంగతులు చూసి తెలుసుకుని, ఆ అనుభవాల్ని ఇట్లా వర్ణించాడు : "నేను యూరప్‌లో ఉన్నంతకాలం ధనవంతుల, విద్యావంతుల మధ్య మసిలాను. రాజకీయవేత్తలతో, ఉన్నతాధికారులతో కలిసి తిరిగాను. వారందరి పరిచయం, సంబంధం నాకెటువంటి తృప్తినీ ఇవ్వలేదు. అక్కడి పరిస్థితులు గమనించిన తర్వాత, నాలో తిరుగుబాటు లేచింది. ప్రశ్నలూ రేగాయి.

'దివ్యజ్ఞాన సమాజ సభ్యుల సమావేశంలో ఉపన్యాసకు లందరూ చెప్పిందే చెప్పారు. వాళ్ళ అస్పష్టమైన మాటలు నాకు అసహ్యంగా ధ్వనించాయి. జీవితమంటే వాళ్ళిచ్చిన

వ్యాఖ్యానాలవల్లా, నిర్వచనాలవల్లా, అర్థాలవల్లా నాకు వారిపై విముఖత్వం కలిగింది. వాళ్ళతో, వారి మాటలతో నాకేమీ తృప్తి కలగలేదు. చివరికి ఆ సమాజ సభ్యుల మీదకూడా నాకు తిరుగుబాటు భావం కలిగింది. ప్రతీదీ నాకు నేను తెలుసుకోవాలనుకున్నాను.

“ వీధుల్లో తిరుగుతూ ప్రజల ముఖాలు చూసి, పరీక్షించి, వాళ్ళ పరిస్థితుల్ని పరిశీలించాను. కొన్ని సినీమాలూ చూశాను. అక్కడి ప్రజలు తమలోని అశాంతిని ప్రయత్నపూర్వకంగా విలాస, వినోదాల ద్వారా ఎట్లా మరచిపోజూస్తున్నారో గమనించాను. అన్నీ చూసి, ఎంతో అనుభవం గడించాను. మొత్తం మీద యూరప్‌లో ప్రజలు ఒకరకం సుఖంనుంచి, మరోరకం సుఖానికీ, సంతోషానికీ మారుతూ జీవిస్తున్నారు.

‘ కమ్యూనిస్టుల సభలకు వెళ్ళాను. అవి మొదట్లో బాగానే వున్నాయి. కాని, అవి కూడా నాకు తృప్తిని ఇవ్వలేదు. ప్రతి ఒక్కరిలో బైటికి కనుపించని అశాంతి అగ్నిపర్వతం మాదిరిగా వుంది. నేను కూడా ఒక సంతోషంనుంచి, ఒక రకం సుఖం నుంచి మరోదానికి మారుతూ, వాటిల్లో అంతర్లీనంగావున్న ఆనందాన్ని పొందలేకపోతున్నానని తెలిసి బాధపడేవాడిని. యువకులు కూడా శాంతిగా, ఆనందంగా లేరు. నేను వెదికే శాంతినీ, ఆనందాన్నీ వాళ్ళూ అనుభవిస్తున్నట్లు లేదు. ఎవరూ సంపూర్ణజీవితం గడపడం లేదనిపించింది. అనాథులకు, దరిద్రులకు, దుఃఖితులకు సేవ చెయ్యాలనుకున్నవారే, నిస్సహాయులుగా తోచారు. ధనంలో ఇరుక్కున్నవారికి జీవితం లేకుండా పోయింది. మతగ్రంథాలూ, తత్వశాస్త్రాలూ, మహాత్ముల జీవిత చరిత్రలూ చదివాను. కాని, నేను కోరే ఆనందాన్ని పొందలేకపోయాను.

"యూరప్‌లో నాలుగు నెలలుండి, తిరిగి ఇండియా వచ్చాను. ప్రజలు యథాప్రకారం వారి వారి సాంప్రదాయాల్ని పాటిస్తోనేవున్నారు. ఇండియాలో అతి ప్రాచీన గ్రంథాలే వుండవచ్చు. అవి గొప్ప శాస్త్రాలే కావచ్చు. కాని, అవి కూడా నేను కోరే ఆనందాన్ని ఇవ్వలేదు. ఇండియా, యూరప్‌లలో ఏదీ నాకు తృప్తిని ఇవ్వలేదు.

"నా అంతరాంతరంలో వున్న కోర్కెను ఎట్లా వర్ణించగలను? మనం మొగ్గను అడగలేము, "నువ్వు ఎప్పుడు, ఎట్లా విచ్చుకుంటావు? ఏ విధంగా పరిమళం విరజిమ్ముతావు? ఉదయకాలంలో ఏక్షణాన వికసిస్తావు?" అని. కాని, మనం జాగ్రత్తగా, దగ్గరగా పరిశీలిస్తే, దాని సౌందర్యాన్ని, సంపూర్ణత్వాన్ని కనుక్కోగలం.

అక్టోబరు ఏడవ తేదీన అనీబిసెంట్ బృందం తిరిగి అడయార్ చేరుకుంది. యూరప్‌లో వున్న నాలుగు నెలలూ కృష్ణమూర్తి అజీర్ణంతో, కడుపునొప్పితో బాధపడ్డాడు. రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపోయేవాడు కాదు. అతని దేహం చాలా యాతనలు పడింది.



డిశంబరు ఇరవై ఎనిమిదో తేదీన బెనారస్‌లో దివ్యజ్ఞాన సమాజ సభ ఏర్పాటు చేయబడింది. ఆ సభలో "ప్రపంచ సంస్థ సభ్యులకు కృష్ణమూర్తి స్వయంగా, సర్టిఫికెట్స్ ఇస్తారు," అనే కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. ఆ సమావేశానికి దేశ విదేశాలనుంచి హాజరైన నాలుగు వందలమంది కృష్ణమూర్తి చేతినుంచి పత్రాలు అందుకుని, భక్తి-శ్రద్ధలతో అతని పాదాల మీదపడి సాష్టాంగ నమస్కారాలు చేశారు. కృష్ణ

మూర్తి ద్వారా దివ్యశక్తి తమలోకి ప్రసరించినట్లు భావించారు. ఆ సందర్భంలో 'కృష్ణమూర్తి నిశ్చయంగా బోధిసత్వ మైత్రేయుని అవతరణకు అనువైన దేహం కలవాడు,' అని అనీబిసెంట్ మరొకసారి ధైర్యంగా చెప్పింది.

తాను ముసలివాడూ, బీదవాడూ కావడంవల్లా, కనీసం కృష్ణమూర్తి - నిత్యానందం అయినా అనీబిసెంట్ సంరక్షణ కింద అభివృద్ధిలోకి వస్తారని ఆనాడు ఆశించి అనీబిసెంట్‌కు డాక్యుమెంట్ రాసి, ఇచ్చిన నారాయణయ్య, కొన్ని నెలలు గడచిన తర్వాత తన పిల్లలిద్దర్నీ ఆమె పెంచే విధం చూసి, చాలా బాధపడి, వారిని తిరిగి తనకు అప్పగించవలసినదిగా అనీబిసెంట్‌ను అడిగాడు. నారాయణయ్య ఆమెను అడిగాడే కాని, అతను ఆమెతో తగాదాపడి, ఆ పిల్లల్ని తిరిగి తీసుకుని పెంచలేడు. పిల్లలకు కొత్తగా అలవాటైన పద్ధతుల్ని మార్చలేడు. కాని, కన్నకడుపు ఊరుకోలేదు కదా? పిల్లల విషయంలో అతను గొడవపడటంలో ఆశ్చర్యంలేదు.

పిల్లలందరి మాదిరిగా కృష్ణమూర్తికి సమాజంవారు మామూలు చదువులు చెప్పించడం లేదు. కాయకష్టం చేసే అవకాశమూ కల్పించడం లేదు. అతన్ని ఒక ఆసనంమీద కూర్చొబెట్టి, జగద్గురువని సోమరిగ తయారుచేయడం నారాయణయ్యకు ఇష్టం లేదు. ఎందుకంటే, అతను పెదవాడయ్యాక కాని, అనీబిసెంట్ మరణానంతరం కాని, అతని బ్రతుకు, అతను బ్రతకలేడు. దానికి తోడు అతని యెడల లెడ్‌బీటర్ అసభ్యంగా, అవినీతికరంగా, అశ్లీలంగా ప్రవర్తించాడనే వదంతీ ఒకటి వుంది. మొత్తంమీద ఆ విధమైన పెంపకం తమ జాతి - మత - కుల - సాంప్రదాయాలకు విరుద్ధం గనుక, తన కొడుకులిద్దర్నీ తిరిగి తనకు అప్పగించమనీ, అలా అప్పగించని పక్షంలో తాను కోర్టులో దావా వేస్తాననీ బెదిరించాడు, నారాయణయ్య.

అనీబిసెంట్, నారాయణయ్యను పిలిచి కొందరు పెద్దల సమక్షంలో "అసలు మీ ఉద్దేశ్యం ఏమిటి? ఎందుకు పిల్లల్ని తిరిగి ఇవ్వమంటున్నారు?" అని అడిగింది. దానికి నారాయణయ్య, "లెడ్‌బీటర్‌కూ, తన కొడుకులకూ మధ్య ఎటువంటి సంబంధం వుండకూడదు," అని ఖచ్చితంగా చెప్పాడు.

నారాయణయ్య షరతుకు అనీబిసెంట్ అంగీకరించింది. ఆ తర్వాత నారాయణయ్య 'తన కొడుకు లిద్దరూ అనీబిసెంట్‌తో కలిసి, ఇంగ్లండువెళ్ళి, అక్కడ చదువుకోవచ్చు,' అని మరొక అనుమతి పత్రం రాసి ఇచ్చాడు, ది. 19-1-1912 న.

ఫిబ్రవరి – పదహారవ తేదీన అనీబిసెంట్, కృష్ణమూర్తి నిత్యానందం లండన్ వెళ్ళారు. వారి వెంట జినరాజదాస, క్లార్క్ వెళ్ళారు. ఆ తర్వాత జార్జి అరండేల్ వెళ్ళారు. మహాత్ముల వద్ద దీక్ష పొందినవారే, వారికి చదువులు చెప్పే అర్హత కలిగివుంటారన్నారు లెడ్‌బీటర్.

ఆ వెళ్ళడం, వెళ్ళడం కృష్ణమూర్తి యూరప్‌లో పదేళ్ళున్నాడు. ఎక్కడ, ఎట్లావున్నా కృష్ణమూర్తి విడవకుండా అనీబిసెంట్‌కూ, లెడ్‌బీటర్‌కూ ఉత్తరాలు రాసేవాడు. ఆ సందర్భంలో కృష్ణమూర్తి మహాత్ముల గురించి రాసిన ఉత్తరాలు కూడా వున్నాయి. ఆ ఉత్తరాలకు అనీబిసెంట్ రాసిన జవాబులు చూస్తే, ఆమె జీవిత లక్ష్యం, కృష్ణమూర్తే అయినట్లు తోస్తుంది.

కృష్ణమూర్తి, నిత్యానందాలను జార్జి అరండేలుకు జినరాజదాసకూ అప్పగించి, వారిని శ్రద్ధగా చూసుకుంటూ, చదువులు చెప్పమని చెప్పింది, అనీబిసెంట్. ఎందుకంటే, అరండేల్, జినరాజదాస ఇద్దరూ మహాత్ముల వద్ద దీక్ష పొందిన

వారు. కొన్నాళ్ళు కృష్ణమూర్తి, నిత్యానందాలను "రోసెస్టర్" స్కూలుకు పంపించారు. ఆ స్కూలు పిల్లలు వారిద్దర్నీ ఒకటే వెక్కిరించి, హేళన చేసేవారు.

ఆ రోజుల్లో కృష్ణమూర్తి కలలు కంటున్నట్లుగా, విధేయతగా, బిడియంగా, సంకోచంగా, నిరహంకారంగా, ప్రేమగా, దయగా వుండేవాడు. లేడీ ఎమిలీ అతనికి కీట్స్, షెల్లీ, షేక్స్పియర్ పుస్తకాలు చదివి వినిపించేది. కృష్ణమూర్తికి పి. జి. వోడ్‌హౌస్, స్టీఫెన్‌లీకాక్, అభిమాన రచయితలు. కృష్ణమూర్తికి "గోల్ఫ్" ఆట చాలా ఇష్టం. విరామసమయంలో ఏదో ఒక మెకానిజం చేస్తూ వుండేవాడు. సాయంత్రం మోటారు సైకిల్‌పై చాలాదూరం వెళ్ళేవాడు.

ఇండియానుంచి జమ్నాదాస్ ద్వారకదాస్ అనే ఆయన బొంబాయినుంచి కృష్ణమూర్తిని చూడ్డానికి లండన్ వెళ్ళాడు. ఆయన ప్రత్తి వ్యాపారి. ఆయన 1912 లో, దివ్యజ్ఞాన సమాజంలో చేరాడు. కృష్ణమూర్తి తన బూట్లు తాను పాలిష్ చేసుకుంటున్నారే! అని ఆశ్చర్యంగా అడిగితే, "పనివాళ్ళ కంటే నేనే, చాలా బాగా బూట్లు పాలిష్ చేయగలను, ఇస్తే, మీ బూట్లు కూడా పాలిష్ చేస్తాను," అన్నాడు కృష్ణమూర్తి.

జమ్నాదాస్‌కి గుర్రపు పందేలంటే సరదా. ఆ నవంబరులో "K. J" అనే అక్షరాలు కల గుర్రంమీద అతను పందెం కట్టాలనుకున్నాడు. ఎందుకంటే, ఆ అక్షరాలు [K. J] "J. K" అనే అక్షరాలకు ముందు, వెనుక అక్షరాలుగా భావించాడు. K. J అంటే, KING JOHN. "J K" అంటే "జిడ్డు కృష్ణమూర్తి"అని. పందెంరోజు నిత్యానందాన్ని వెంట తీసుకువెళ్ళాడు. ఆరోజు పందెంలో ఎంతో డబ్బు గెలిచాడు ద్వారకదాస్. ఆడబ్బుతో వారు రాత్రి ఇంటికి తిరిగివస్తే, అప్పటి వరకు వారికోసం

ఎదురుచూసిన కృష్ణమూర్తి "మీరు చాలా మురికిగా వున్నారు. వెళ్ళి స్నానం చేయండి," అన్నాడు వారితో. తాము పందెంలో ఎంతో డబ్బు గెలిచిన సంగతి చెపితే, "అందుకే మీరు మరింత మురికిగా వున్నారు. త్వరగా స్నానం చేయండి," అన్నాడు.



కృష్ణమూర్తి "సిసిలో" లో "టార్మినా" లో, వుండగా అతనితో లెడ్‌బీటర్, జార్జి అరండేల్, జినరాజదాస వున్నారు. అక్కడ కృష్ణమూర్తికి రెండవ జ్ఞానదీక్ష ఇవ్వడం జరిగింది. ఆతర్వాత వారంతా తిరిగి లండన్ వచ్చేప్పటికి, నారాయణయ్య నుంచి అనీబిసెంట్‌కు ఒక ఉత్తరం వచ్చింది, "నేను రాసిన డాక్యుమెంట్ రద్దుచేసుకుంటున్నాను. నా పిల్లలిద్దర్నీ తిరిగి నాకు అప్పగించవలసినదిగా కోరుతున్నాను. దానికి ప్రధాన కారణం "టార్మినా'' లో కృష్ణమూర్తితో లెడ్‌బీటర్ వుండటం," అని.

నారాయణయ్య ఉత్తరానికి అనీబిసెంట్ సమాధానం ఇవ్వలేదు. ఆమె తన విదేశ పర్యటన ముగించుకుని ఆగస్ట్‌లో అడయార్ రాగానే, నారాయణయ్య తన కొడుకులిద్దర్నీ తిరిగి తనకు అప్పగించవలసినదిగా కోరుతూ మద్రాసు హైకోర్టులో ది. 24-10-1912 న, దావా వేశాడు. ఆ దావాలో తన పిల్లలైన కృష్ణమూర్తి, నిత్యానందాలకు అనీబిసెంట్ సంరక్షకురాలుగా వుండేందుకేగాని, ఆమె ఆ అధికారాన్నీ, హక్కునీ మరొకరికి అప్పగించేందుకు, కాదు. ఎదిగిన తన పిల్లలతో, లెడ్‌బీటర్ అక్రమ సంబంధం పెట్టుకుంటాడనీ, అంతకు పూర్వం ఆ లెడ్‌బీటర్‌పై యూరప్‌లో అటువంటి అభియోగాలు మోపబడి వున్నాయనీ, కనుక కోర్టువారు తన కొడుకులిద్దర్నీ అనిబిసెంట్ నుంచి తిరిగి తనకు అప్పగించవలసినదిగా కోరాడు. అంతేకాక,

తన కొడుకు కృష్ణమూర్తి "క్రైస్ట్" అవతారమని అనీబిసెంట్ ప్రపంచమంతా ప్రచారం చేయగా, పెద్దలు, గొప్పవారు సహితం అతని కాళ్ళకు మొక్కడం, "పరమగురుచరణ సన్నిధి" వంటి గొప్ప గ్రంథాన్ని పదమూడేళ్ళ కృష్ణమూర్తే రాశాడని ప్రచారం చేయడం మొదలైన విషయాలు అతిశయోక్తులుగా వున్నాయని కూడా నారాయణయ్య తన ఫిర్యాదులో నమోదు చేశాడు.

5-1-1913న, కృష్ణమూర్తి అనీబిసెంట్‌కు ఉత్తరం రాశాడు.

MY OWN DEAREST MOTHER,

నువ్వు చాలా కష్టాల్లో వున్నావు. ఇటువంటి సమయంలో నేను నీ దగ్గర వుండాలనుకుంటున్నాను. ఈ వయసులో అటువంటి అవివేకులతో పోరాడ్డం చాలా శ్రమతో కూడిన పని. త్వరలోనే ఇవన్నీ చక్కబడవచ్చుననుకుంటున్నాను. ఏమైనా, నాకు నీ మీద వున్న ప్రేమాభిమానాలు, భక్తి-గౌరవాలు నీకు తెలుసు. నిన్ను నేను ఎంతగానో ప్రేమిస్తున్నాను. నువ్వు నా ప్రియాతి ప్రియమైన తల్లివి. ఈ ప్రపంచమంతా నీకు ఎదురు తిరిగినా-ఒకరు మాత్రం నిన్ను ఎప్పటికీ తల్లిగా ప్రేమించేవారున్నారు-ఆ ఒక్కరూ నేనేనమ్మా!

*Dearest and Devoted son Krishna*

అనీబిసెంట్ మద్రాసు హైకోర్టుకు హాజరై "కృష్ణమూర్తి-నిత్యానందం ఇద్దరూ ప్రస్తుతం నా సంరక్షణ కింద యూరప్‌లో చదువుకుంటున్నారు. మూడేళ్ళ క్రిందట సదరు నారాయణయ్య నాకు వ్రాత మూలకమైన ఒక డాక్యుమెంట్ రాసి, ఇచ్చి వున్నారు. ఆయన ఈనాడు అభియోగం మోపిన వ్యక్తి, లెడ్ బీటర్ కొన్నాళ్ళుగా ఇండియాలో వుంటున్నారు. ఆయనకూ, ఆ పిల్లలిద్దరకూ ఎటువంటి సంబంధం లేదు, వారిద్దరూ నా సంరక్షణ క్రింద వున్నారుగనుక, వారి బాధ్యత నాది. వారి సంగతి చూసుకునేది, నేను.

"న్యాయమూర్తులు పిల్లల భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని న్యాయనిర్ణయం చేయవలసినదిగా కోరుతున్నాను. కృష్ణమూర్తి, నిత్యానందం ప్రస్తుతం యూరప్‌లో ప్రముఖుల, విద్యావేత్తల, పెద్దల సాన్నిధ్యంలో అధ్యయనం చేస్తున్నారే కాని, చెడిపోవడంలేదు చెడిపోవడానికి వారు మరీ చిన్నపిల్లలు కారు. ఐదారు వారాల్లో కృష్ణమూర్తి మేజరు కాబోతున్నాడు. ప్రపంచ సంస్థకు అతను గౌరవాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు. వారిద్దర్నీ అందరూ ఎంతో ప్రేమగా చూసుకుంటున్నారు," అని సమాధానం ఇచ్చింది.

కాని, మద్రాసు హైకోర్టు కృష్ణమూర్తి, నిత్యానందాలను తిరిగి తండ్రికి అప్పగించవలసినదిగా అనీబిసెంట్‌కు, ఆదేశమిస్తూ, లెడ్‌బీటర్‌పై మోపిన ఫిర్యాదును కొట్టేసింది. ఆ న్యాయనిర్ణయంతో అనీబిసెంట్, కృష్ణమూర్తి, నిత్యానందాలపై గార్డియన్‌షిప్ కోల్పోయింది. హైకోర్టు ఆదేశానుసారం ది. 15-2-1913 న, పిల్లలిద్దర్నీ తండ్రికి అప్పగించవలసివుంది.

కృష్ణమూర్తి, నిత్యానందం యూరప్‌లోవుండి చదువుకునేందుకు నిశ్చయించుకున్నారు గనుక, వాళ్ళ అనుమతిలేకుండా చదువులు మాన్పించి, వాళ్ళను బలవంతంగా ఇండియా తీసుకొస్తే, అనీబిసెంట్‌పై " Writ of Habea Corpus " చర్య తీసుకోబడుతుంది గనుక, వారిని తండ్రికి అప్పగించే ప్రయత్నం ఆమె విరమించుకుంది.

ది. 25-5-1913 లోగా కృష్ణమూర్తి, నిత్యానందాలను తండ్రికి అప్పగించవలసినదిగా మద్రాసు హైకోర్టు అనీబిసెంట్‌కు ఒక ఉత్తరువు జారీ చేసింది. ఆ ఉత్తర్వుతో ఆమె పూర్తిగా ఆ కేసులో ఓడిపోయిందని తేలిపోయింది. కాని, ఆమె కృష్ణమూర్తిపై ఎన్నో ఆశలు పెట్టుకుని, ప్రపంచ సంస్థ

స్థాపించి, దానికి అతన్ని సర్వాధికారినిచేసి, "తిరిగి వస్తానన్న ఏసుప్రభువే, కృష్ణమూర్తి" అని ప్రచారం చేసింది. ఆ కృష్ణమూర్తి, జగద్గురువు తన కళ్ళముందు మామూలు మనుష్యుల్లో కలిసిపోతే, అనే ఆలోచనవచ్చి, జీవితం శూన్యమైనట్లు తోచి అనీబిసెంట్ తల్లడిల్లింది. అంత గట్టి ప్రచారం చేసిన తర్వాత, తిరిగి ఆమె ప్రజలముందు ఏవిధంగా తలెత్తుకుని తిరగగలదు ?

మద్రాసు హైకోర్టు తీర్పుతో అనీబిసెంట్ నిలువునా కృంగిపోయినా, ఏవిధంగానైనా కృష్ణమూర్తి, నిత్యానందాలను తిరిగి తండ్రికి అప్పగించకూడదనే గట్టి నిశ్చయానికి వచ్చి, అ కేసును లండన్ ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలుచేసుకునే అవకాశం ఇప్పించవలసినదిగా మద్రాసు హైకోర్టు వారిని కోరింది. వారు దానికి అంగీకరించారు.

20-2-1914న, లెడ్‌బీటర్ సిడ్నీ వెళ్ళిపోయారు. అక్కడ ఎందరో యువకులు ఆయనకు ఆకర్షితులైనారు. ఆయన వారికి అనేక విధాల సహాయాలు చేశారు, సలహాలు ఇచ్చారు. ఆయన జీవితం మళ్ళా వికసించింది.

నారాయణయ్య - అనీబిసెంట్‌ల కేసు లండన్ ప్రీవీ కౌన్సిల్‌లో విచారణ జరగడానికి సంవత్సరం పట్టింది. అప్పటికి కృష్ణమూర్తి మేజరైనాడు. ఆ కాలమంతా కృష్ణమూర్తి చదువులతో గడిపాడు. ఆ రోజుల్లో అతడు కవిత్వాలు రాసేవాడు.

"మిస్. డాడ్జి" అనే ఆమె కృష్ణమూర్తికి నెలకు ఐదు వందల పౌండ్లు ఇవ్వడానికి ఏర్పాటు చేసింది. దానితోపాటు కృష్ణమూర్తి స్వంతఖర్చుల నిమిత్తం, అనీబిసెంట్ నెలకు నూట ఇరవై ఐదు పౌండ్లు ఇచ్చేది.

ఎవరు తమ సంరక్షకులుగా వుండటం సమ్మతమో ఆ నిర్ణయాన్ని కృష్ణమూర్తి-నిత్యానందాలకు ఒదులుతూ 5-5-1914న, ప్రీవీ కౌన్సిల్ తీర్పు ఇచ్చింది. దాని ప్రకారం వారిద్దరూ అనీబిసెంట్‌ను తమ సంరక్షకురాలిగా ఎన్నుకున్నారు. ఆనాటితో వారికి తండ్రితో సంబంధం శాశ్వతంగా తెగిపోయింది.

కృష్ణమూర్తి, నిత్యానందాల నిర్ణయానికి అనీబిసెంట్ ఎంతో సంతోషపడింది. కేసు అనీబిసెంట్ పక్షం కొట్టేస్తో, నారాయణయ్య ఖర్చులు ఇచ్చుకోవాలన్నారు ప్రీవీ కౌన్సిల్ వారు. కాని, ఆమె ఆయన్నించి ఏమీ తీసుకోలేదు. తమ కోసం అష్టకష్టాలు పడి, విజయం సాధించినందుకు బహుమతిగా "హేటన్ గార్డెన్"కు వెళ్ళి ఒక ముత్యాల బ్రోచ్ కొని అనీబిసెంట్‌కు ఇచ్చాడు, కృష్ణమూర్తి.

ప్రీవీ కౌన్సిల్ తీర్పు తర్వాత కృష్ణమూర్తి, నిత్యానందం అనీబిసెంట్‌తో కలిసి పారిస్ వెళ్ళి మూడు రోజులు వున్నారు. ఆమె ఎంత గట్టి ప్రయత్నం చేసినా కేంబ్రిడ్జి, ఆక్స్‌ఫర్డ్, లండన్ యూనివర్సిటీలవారు వారిద్దర్నీ తమ యూనివర్సిటీలలో చేర్చుకోవడానికి నిరాకరిస్తో, తమ యూనివర్సిటీలు జగద్గురువులకు చదువులు చెప్పే విద్యా సంస్థలు కావనీ, తన కొడుక్కి మరొకనితో అక్రమ సంబంధం వుందని తండ్రే స్వయంగా ఫిర్యాదు చేయడం వంటి అవమానకరమైన విషయాలు కలవారిని తాము చేర్చుకోమనీ అన్నారు. అయినా అనీబిసెంట్ వారి చదువుల విషయంలో శ్రద్ధ వహించి, అన్ని ఏర్పాట్లూ చేసి, ఆ వేసవి ఇండియా వచ్చింది.

జూన్ ప్రాంతంలో కృష్ణమూర్తి, నిత్యానందం - జార్జి అరండేల్ దగ్గర చదువుకున్నారు. జూలైలో అనీబిసెంట్

శివరావును సంస్కృతం నేర్పమని కృష్ణమూర్తి దగ్గరకు పంపిం చింది. శివరావు మొదట కృష్ణమూర్తిని 1910లో, బెనారస్‌లో చూశాడు. తర్వాత లెడ్‌బీటర్ రచనలలో సహాయం చేయడానికి అడయార్ వచ్చినప్పుడు కృష్ణమూర్తిని పూర్తిగా అర్థం చేసుకున్నాడు.

అనీబిసెంట్ బెనారస్‌లో నాలుగు ఉపన్యాసాలిచ్చింది. ఆ ఉపన్యాసాల్ని లేడీ ఎమిలీ విని, "అవి అంతరాత్మ ప్రబోధాల వలె వున్నాయి," అన్నది. ఆ ఉపన్యాసాల్ని శ్రోతలందరూ శ్రద్ధగా, ఆసక్తితో విన్నారు.

కృష్ణమూర్తికి ఎందరో అనేక విధాల సహాయాలు చేశారు. కొందరు ఆస్తి, కొందరు భూములు, కొందరు భవనాలు, కొందరు ధనం ఇచ్చారు. కాని, అతనికి ఆ సమయంలో క్షయరోగం ఆరంభమైంది. అయినా అతను ఎంతో ఉత్సాహంగా వుండేవాడు.

కృష్ణమూర్తీ, నిత్యానందం "వింబుల్డన్"లో వుంటున్న "మిస్ డాడ్జి" ఇంట్లో వుండేవారు. ఆమె అమెరికన్. ధనవంతురాలు. దయాపరురాలు. కీళ్ళ జబ్బువల్ల అంగవైకల్యం పొంది, కుంటిది అయింది. లేడీ ఎమిలీ ఆమెను అనీబిసెంట్‌కు పరిచయంచేసింది. ఆ తర్వాత మిస్ డాడ్జి దివ్యజ్ఞాన సమాజంలో చేరి, ఎంతో ధన సహాయం చేసింది. ఆమె వద్ద కృష్ణమూర్తి, నిత్యానందం రాజభోగాలు అనుభవించారు.

కృష్ణమూర్తి ఇంగ్లండులో శ్రద్ధగా చదువుతూ, మంచి మంచి బట్టలు ధరిస్తో, సాయంత్రాలు మోటారుసైకిల్‌పై తిరుగుతూ, ఎప్పుడూ అప్పుడే పూసిన పువ్వంత శుభ్రంగా వుండేవాడు. అయినా అతను అన్ని విషయాల్లో ఎప్పుడూ పూర్తి అనాసక్తతతో వుండేవాడు. ఎప్పుడూ ఎవరినీ, దేనికీ విమర్శించే వాడు కాదు, ఖండించేవాడు కాదు.

మొదటి ప్రపంచయుద్ధం ఆరంభమైంది. కృష్ణమూర్తి కొంతమంది మిత్రులతో కలసి "BUDE - బుడే"లో వున్నాడు. అక్కడనుంచి అనీబిసెంట్‌కు ఉత్తరం రాస్తో, "పేపర్లు ఆడిపోస్తున్నంత చెడ్డవాళ్ళు కాదు, జర్మనీవారు. వాళ్ళు చాలా ధైర్యవంతులు. వారంటే నాకెంతో అభిమానం," అన్నాడు కృష్ణమూర్తి.

1914 సెప్టెంబరు నాటికి లేడీ ఎమిలీ జీవితం పూర్తిగా కృష్ణమూర్తి మయమైపోయింది. ఆమెకు భర్త, పిల్లలు, సంసారం, సమస్తం కృష్ణమూర్తి తర్వాతే. అందు చేత "కృష్ణమూర్తి బుడేలో వున్నంతకాలం లేడీ ఎమిలీ అక్కడకు రాకూడదు" అనేవి రాజా, జార్జి అరండేల్‌ల అభిప్రాయం. ఎందుకంటే, కృష్ణమూర్తి యెడల ఆమె ప్రవర్తన మహాత్ముల సంకల్పానికే విఘాతం కలిగించేదిగా వుందని వారి భావన.

కృష్ణమూర్తి బుడేనుంచి లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "ఇక్కడ నా వయసు వారెవరూ లేరు. వున్న నిత్యానందం కూడా చదువంటూ వెళ్ళిపోయాడు," అన్నాడు.

ఆ ఉత్తరంచూసి లేడీ ఎమిలీ తన పిల్లల్ని తీసుకుని బుడే వెళ్ళింది. అక్కడ ఆమె కృష్ణమూర్తితో కలసి తిరుగుతూ వుండేది. ఆమె కృష్ణమూర్తి కంటే పదిహేడేళ్ళు పెద్దది.

ఆ రోజుల్లో కృష్ణమూర్తి ఒకటే నవ్వేవాడు. భోజనానికి తప్ప నిలకడగా కూర్చునేవాడు కాదు. ఎప్పుడూ నిలబడే వుండేవాడు. లేడీ ఎమిలీ పిల్లలతో కలసి ఆడుకునేవాడు. అతనికి నవ్వుఅంటే ఎంతో ఇష్టం. అటువంటి నవ్వు, నవ్వుకోవడానికి కూడా బుడేలో అవకాశం లేకుండా చేశారు పెద్దలు. ప్రేమగా నవ్వే లేడీ ఎమిలీని నవ్వకూడదని శాసించారు, ఆ పెద్దలు. అక్కడ ఆమె ఒక్కత్తే, స్త్రీ. అరండేల్ ఆమెను రుస, రుసా చూడ్డం కృష్ణమూర్తి గమనించకపోలేదు.

అడయార్‌లో లెడ్‌బీటర్ ఆల్కియోన్ జీవితాలు రాసే రోజుల్లో "బి. శివరావు" అనే ఆయున, ఆయునకు సహాయం చేస్తూ, కృష్ణమూర్తి, నిత్యానందాలను గమనించేవాడు. ఆ తర్వాత అతన్ని కృష్ణమూర్తికి సంస్కృతం నేర్పేందుకు జూలైలో ఇంగ్లండు పంపించింది, అనీబిసెంట్.

కృష్ణమూర్తి యూరప్ వెళ్ళినప్పటినుంచీ లేడీ ఎమిలీ అతన్ని గురువుగా భావించి, ప్రేమించి, ప్రతిక్షణం అతన్ని అనుసరించి, కన్నకొడుకను చూసుకున్నట్లు అన్నివిధాలా ఆదుకుంది. ఆమె "హెరాల్డ్" పత్రికకు ఎంతో సహాయం చేసింది. ఆమె బుడేలో కృష్ణమూర్తితో వుండటంతో మిత్రులలో గుసగుసలు బయలుదేరాయి. ఆమె కృష్ణమూర్తిని ప్రేమించే విధానాన్ని అపార్థంచేసుకున్నారు. చివరికి అనీబిసెంట్‌కూడా అపార్ధంచేసుకుని, "సాధన విషయంలో శ్రద్ధ, మెలకువ వుండాలి. ఏరకమైన ఉద్రేకమూ పనికిరాదు. కనుక నువ్వు లేడీ ఎమిలీకి దూరంగా వుండగలవు," అంటూ కృష్ణమూర్తికి హెచ్చరికగా ఒక ఉత్తరం రాసి, అదే విషయాన్ని దృష్టిలో పెట్టుకుని లేడీ ఎమిలీకి కూడా ఒక ఉత్తరం రాసింది, చాలా కటువుగా. ఆ ఉత్తరం చూసి ఆమె చాలా బాధపడింది.

లేడీ ఎమిలీయేకాక, ఇంకా ఎంతోమంది వయసు మళ్ళిన ఆడవాళ్ళుకూడా కృష్ణమూర్తి సన్నిది కోరేవారు. స్త్రీ సంబంధంలో అతని అయిష్టత చూసి కొందరు ఆడవాళ్ళు బాధ పడ్డారు. అలాగే అందమైన ఆడపిల్లలు వెంట పడితే వాళ్ళను నిరాకరించడం, తప్పించుకుని తిరగడం చూసి, అతన్ని వింత మనిషిగా కొందరు జమకట్టారు.

8-2-1915న, కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి ఒక ఉత్తరం రాశాడు, తన బలహీనాలు, చదువులు, మిత్రులు మొదలైన విషయాలతో. ఆ సందర్భంలో లెడ్‌బీటర్‌కు రాసిన ఒక ఉత్తరంలో లేడీ ఎమిలీ విషయం ప్రస్తావించాడు: "ఆమె అంటే నాకు అమితమైన ప్రేమ. ఆమె నన్ను తన కన్నకొడుకుగా చూసుకుంటోంది. ఆ దృష్టితోనే నన్ను ప్రేమిస్తోంది. ఈ మా ప్రేమ విషయమై కొన్ని అపోహలు, అనుమానాలు పుట్టాయి, ముఖ్యం మిత్రులలో. కొందరు మాపై అభాండాలు కూడా

వేశారు. ఈపాటికి అవి మీ చెవి వరకు వచ్చి వుంటాయి. ఒకసారి అనీబిసెంట్ కూడా మా ఇద్దర్నీ గట్టిగా మందలించింది, " మీరు మరీ అంత విచ్చలవిడిగా, విశృంఖలంగా, బహిరంగంగా వుండటం మంచిదికాదు. అలా వుంటే, సంఘంలో, సంస్థలో కలవరం, కలతలు వస్తాయి, " అంటూ.

'మా గురించి మీకు తెలుసు. నేను మిమ్మల్నీ, అనీబిసెంట్‌నూ ప్రేమిస్తున్నంతగా లేడీ ఎమిలీని ప్రేమిస్తున్నాను. మీరు నాకు పెద్దన్నగారివంటివారు. ఆమెకూ, నాకూ ఈ విషయంలో మీరు సహాయం చేయండి. ఏనాడూ, ఏవిషయంలోనూ అందరూ అనుకునేంత స్వార్థం ఆమెలో లేదు,' అని.

ఆ తర్వాత కృష్ణమూర్తి, లేడీ ఎమిలీ విడిపోయి దూరంగా వున్నారు. కాని, ఒకరి కొకరు విడవకుండా ఉత్తరాలు రాసుకునే వారు. 19-11-1916న, కృష్ణమూర్తి ఒక ఉత్తరం రాశాడు.

MY DEAR MUMMY,
నిన్ను వదలి వుండటం నాకు విషాదంగా వుంది. నువ్వు విచారంగా వుండి, వుంటావని నాకు తెలుసు. నేను బాగాలేను, జీవితంలో ఎన్నో వియోగాలు, విషాదాలు వుంటాయి. మనం సుఖంగా వుండాలంటే, వాటన్నింటినీ పూర్తిగా అనుభవించాలి.

అసలు జీవితమే ఒక పెద్ద వియోగం. ఈ జీవితంలో మనం ఇతరులకోసం జీవించాలి. స్వార్థం పనికిరాదు. నన్ను గురువు ఆజ్ఞమేరకు పనిచేయమని ప్రోత్సహించావు. సంతోషం. నేను పవిత్రంగా జీవించేటట్లు చేశావు. నువ్వు నాకు జీవితంలో ఎంతో, ఎన్నోవిధాల సహాయం చేశావు నువ్వు నిజంగా నా ప్రియమైన తల్లివి. నేను నీకు సహాయపడాలనుకుంటున్నాను. నీకోసం నేను ఏమైనా చేస్తాను. కాని నాకోసం నువ్వు గొడవ పడకు. నేను ఎప్పుడూ నిన్నే తలుస్తాను.

నీ ప్రియమైన బిడ్డ-కృష్ణ

కృష్ణమూర్తి హాలెండ్ వెడితే అక్కడ "హెలెన్" అనే అమ్మాయితో పరిచయమైంది. దానితో అతను ఆమె ప్రేమలో పడ్డాడనే అపవాదు వచ్చింది. ఆ తర్వాత "జార్జి, రూత్, రోజలిండ్" అనే అమ్మాయిలతో చనువుగా మాట్లాడేప్పటికి మిత్రులు కృష్ణమూర్తిని తప్పుపట్టారు.

కృష్ణమూర్తి మొదటిసారి యూరప్ వెళ్ళినప్పటినుంచీ సిరి గల అతని వర్చస్సు చూసి ఎందరో ఆడవాళ్ళు ఆకర్షితులై, అతన్ని వదలకుండా చుట్టూచేరి, ఆరాదించనారంభించారు. అయస్కాంతంలాంటి అతని ఆకర్షణ, మధురమైన అతని కంఠ స్వరం వారిని తన్మయుల్ని చేసింది. కృష్ణమూర్తి వారిని అంత ప్రేమగానే తీసుకున్నాడు. చివరికి ఆ వ్యవహారాలు కలతలకు, కలహాలకు, ఈర్ష్యలకూ, ద్వేషాలకూ, దారితీశాయి. కృష్ణమూర్తి ఎంత చెప్పినా వారిలో మార్పురాలేదు. అతనికి అందరిమీదా ఒకే రకం ప్రేమ. తాను ప్రేమిస్తున్న సంగతి ఎవరి విషయంలోనూ ఎప్పుడూ ఎక్కడా దాచలేదు. ప్రేమ విషయమై అతను ఏనాడూ భయపడలేదు.

ఏమైనా అటువంటి అసహ్యకరమైన విషయాలతో కూడిన దివ్యజ్ఞాన సమాజ సభ్యులనుంచీ, అసలు ఆ సంస్థనుంచీ దూరంగా తొలగి చదువులమీద దృష్టి పెట్టాడు, కృష్ణమూర్తి. అప్పటికే అతను ఒకసారి మెట్రిక్యులేషన్ పరీక్ష తప్పాడు.

ఆ యుద్ధకాలంలో కృష్ణమూర్తి ఒక ఆసుపత్రిలో పని చేయడానికి చేరాడు. కాని "ఇండియన్స్" అంటే ఇష్టంలేక అధి కారులు అతన్ని పనిలోంచి తొలగించారు. ఎంత ప్రయత్నించినా కృష్ణమూర్తికి ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. చివరకు అనీబిసెంట్‌కూ, లెడ్‌బీటర్‌కూ ఉత్తరాలు రాశాడు, "ఇక్కడ

మమ్మల్ని ఎవరూ ఇష్టపడి ఏపనిలోనూ చేర్చుకోవడంలేదు. మేము చదువుకుంటాము. ఒంటరిగా ఉండటంచేత ఆలోచనలు వస్తున్నాయి. నిత్యానందం చిన్నవాడుగనుక దిగులుపడు తున్నాడు," అని.

ది. 11-11-1916 న, జినరాజదాసకు వివాహమైంది, "దరోథో గ్రహమ్," తో.

కృష్ణమూర్తి విషయమై సిద్ధపురుషులకు హామీ ఇచ్చిన ఇద్దరు వ్యక్తులలో ఒకరైన అనీబిసెంట్ ఇండియా రాజకీయాలలో పూర్తిగా నిమగ్నురాలైంది. ఇండియాలో 'హోమ్‌రూల్' ఉద్యమంలో చేరి, తీవ్రంగా పనిచేసింది. "న్యూ-ఇండియా" అనే పత్రికకు ఎడిటర్‌గావుండి, నిద్రపోతున్న భారతజాతిని మేల్కొల్పి, చైతన్యవంతం చేసింది. 1917 లో జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలై, ఇండియాకు స్వతంత్రం రావడమే తన జీవితాశయంగా పెట్టుకుంది, అనీబిసెంట్. స్వాతంత్ర్యోద్యమాన్ని ఉధృతం చేసింది. ఆమె అరెస్టయి మూడు నెలలు నిర్బంధంలో వుంది. భారతీయులు తమ దేశాన్ని తమ సాంప్రదాయం ప్రకారం పరిపాలించుకునే అవకాశాన్ని కల్పించమని బ్రిటీష్ పార్లమెంటుకు ఒక వినతి పత్రాన్ని సమర్పించింది. భారతీయులకు గొప్ప సాంప్రదాయం, సంస్కృతి, నాగరికతా గతంలో వున్నాయనీ, అంతకన్నా గొప్ప భవిష్యత్తు కలదనీ గ్రహించి, ఇండియా అంతా తిరిగి, ప్రచారంచేసి ఓ నూతన శకానికి ప్రారంభోత్సవం చేసింది. "స్కౌట్" ఉద్యమాన్ని ప్రారంభించి, విద్యార్థులలో క్రమశిక్షణ పెంపొందించింది.

కృష్ణమూర్తి విషయమై సిద్ధపురుషులకు హామీఇచ్చిన రెండవ వ్యక్తి లెడ్‌బీటర్, సిడ్నీ వెళ్ళిపోయారు. కృష్ణమూర్తి ఒంటరిగా మిగిలిపోయాడు. ఆ సమయంలోనే అతనికి చిన్న చిన్న రోగాల్ని నయంచేసే శక్తి వచ్చింది. రాజా వివాహం చేసుకుని వెళ్ళిపోయాడు. అరేండేల్ ఆస్ట్రేలియా వెళ్ళిపోయాడు. ఆవిధంగా నలుగురూ ఆతనికి దూరంగా వున్నారు. ఇండియా రాజకీయాల్లోపడి అనీబిసెంట్ దివ్యజ్ఞాన సమాజాన్ని, జగద్గురువునీ అన్నింటినీ విస్మరిస్తోందని కొందరు సభ్యులు వాపోయారు.

1917 నాటికి కృష్ణమూర్తికి స్టార్‌సంస్థలో, దివ్యజ్ఞాన సమాజంలో ఆ సక్తిపోయింది.

అది యుద్ధసమయంగనుక తాను మిలిటరీలో చేరి ప్రజా సేవ చేయాలనుకున్నాడు, కృష్ణమూర్తి. కాని, అనీబిసెంట్ అందుకు అంగీకరించక, కృష్ణమూర్తిని శ్రద్ధగా చదువుకోమని సలహా ఇచ్చింది. దానికి కృష్ణమూర్తి, "నేను ఇంతవరకు నా జీవితాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. ఇప్పటినుంచి చాలా సీరియస్‌గా తీసుకోబోతున్నాను," అని అనీబిసెంట్‌కు ఒక ఉత్తరం రాసి, తన దృష్టి చదువు మీదకు మళ్లించాడు, ఏ విధంగానైనా ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి, లండన్ యూనివర్సిటీలలో చేరాలని. కాని, వారు అతన్ని చేర్చుకోలేదు.

కృష్ణమూర్తి తమ్మునితో కలిసి మెట్రిక్యులేషన్ పరీక్షకు హాజరై, తప్పిపోయాడు. నిత్యానందం పరీక్ష పాసై, "లా కోర్సు"లో చేరాడు. కాని, కళ్ళ జబ్బువల్ల అతని ఆరోగ్యం ఏమీ బాగుండేదికాదు. కృష్ణమూర్తి మెట్రిక్యులేషన్ పరీక్షకు ఎన్నిసార్లు హాజరైనా ఉత్తీర్ణుడు కాలేకపోయాడు. అందుచేత కృష్ణమూర్తి దేశీయభాషలైనా నేర్చుకోవడం మంచి దని అనీబిసెంట్ అతన్ని పారిస్ పంపించింది. అక్కడ అతను అనీబిసెంట్ మిత్రుల ఇంటవుండి చదువుకున్నాడు. వారి సహాయ, సహకారాలతో ఫ్రాన్స్‌లో గల పండితుల్ని, విద్వాంసుల్ని, కళాకారుల్ని, చిత్రకారుల్ని కలుసుకుని, పరి చయం చేసుకోవడంతో కృష్ణమూర్తిలో నూతనోత్సాహం కలి గింది. దానితో తన భుజాలపైన మోపిన జగద్గురు భారాన్ని తొలగించుకోవాలని చూశాడు. తరచు బుద్ధుని దృష్టిలో పెట్టు కుని ధ్యానం చేసేవాడు.

అపవాదు కారణంవల్ల లేడీ ఎమిలీ కొన్నాళ్ళుగా కృష్ణమూర్తితో మాట్లాడటం మానేసింది. దానితో అతని మనస్సెంతో గాయపడింది. ఆ విషయంలో కృష్ణమూర్తి చాలా దిగులు పడ్డాడు. కాని, పారిస్ మిత్రుల సాంగత్యం వల్ల కొంత తేరుకోగలిగాడు.

1919 ఏప్రిల్‌లో జార్జి అరండేల్, రుక్మిణీదేవిని వివాహం చేసుకున్నాడు. అప్పుడు ఆమె వయసు పదహారేళ్ళు. ఆ పెళ్ళికి పెద్దలు అంగీకరించలేదు. ఎందుకంటే వారు సాంప్రదాయ బ్రాహ్మణ కులస్థులు కావడంవల్ల. అయినా ఆమె ధైర్యంచేసి అతన్ని వివాహం చేసుకుంది.

రుక్మిణీదేవి 29-2-1904న, జన్మించింది. ఆమె తండ్రి, సోదరులు దివ్యజ్ఞాన సమాజ సభ్యులలో ముఖ్యులు, అనీబిసెంట్‌కు సన్నిహితులు. వివాహానంతరం ఆమె భర్తతో ప్రపంచ పర్యటన చేసింది. పడుచువారిలో ఆధ్యాత్మిక దృక్పథం పెంపొందించే ఉద్దేశ్యంతో "యంగ్ థియాసఫిస్ట్" అనే ఉద్యమాన్ని చేపట్టింది. దానికి ఆమె నలభై సంవత్సరాలు అధ్యక్షురాలుగా పనిచేసింది.

జూన్ నాలుగు నుంచి కృష్ణమూర్తి "స్టార్" సభల్ని నిర్వహించాడు. జూలైలో జినరాజదాస ఇండియానుంచి యూరప్ వెడుతూ 'రాజగోపాల్' అనే అతన్ని తీసుకువెళ్ళాడు. అతను, కృష్ణమూర్తిని అక్టోబరులో కలుసుకున్నాడు. లెడ్‌బీటర్, రాజగోపాల్ని చూసి, అతని తెలివికి సంతోషించి, అవసరం అవుతాడని భావించి, చేరదీశాడు, 1913-డిశంబరులో అతడు శ్రద్ధగా చదివి "లా పరీక్ష"లో ఉత్తీర్ణుడయ్యాడు, ఆ తర్వాత అతడూ, కృష్ణమూర్తీ, నిత్యానందం మంచి మిత్రులయ్యారు.

కృష్ణమూర్తి క్రమంగా తన మనోస్థితిని తాను తెలుసుకున్నాడు. తనను రాబోయే జగద్గురువుగా, గొప్పగా చూడ్డం అతనికి ఇష్టం లేదు. దానితో అతనిలో తిరుగుబాటుభావం రేగి, ఒకసారి ఆ సంగతంతా అనీబిసెంట్ - లెడ్‌బీటర్ - జనరాజదాస మొదలైన పెద్దల సమక్షంలో స్పష్టంగా, తీవ్రంగా, పూర్తిగా చర్చించాలనుకున్నాడు. కాని, చివరికి తానొక స్వంత విధానాన్ని అనుసరించాలనే గట్టి నిర్ణయానికి వచ్చి, లండన్ నుంచి అనీబిసెంట్‌కు ఒక ఉత్తరం రాశాడు: "నువ్వు చాలా కాలానికి ఇక్కడికి వస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. నేనెంతో మారాను - ఒక్క విషయంలో తప్ప - నీ మీద ప్రేమ - భక్తిలో. అదెప్పటికీ మారదు. ఈ నా మార్పు, నాకు నూతన జీవితమనే చెప్పాలి. 'జీవితం' అంటే ఏమిటో నాకు ఓ నూతన దృక్పథం ఏర్పడింది. మానవ స్వభావం గురించిన విషయమై నాలో పూర్తి మార్పు వచ్చింది," అని.

24-1-1920న, కృష్ణమూర్తి పారిస్ వెళ్ళాడు. నిత్యానందం లండన్‌లో వున్నాడు. ఆ మర్నాడు లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, 'అమ్మా! నిన్ను చూడక, నా జీవిత శాశ్వత ఆత్మబంధువు లేక దుఃఖంతో ముసలివాడినై నాను. "సుఖంగా- సంతోషంగా - ఆనందంగా వున్నావా?" అని నన్ను అడుగుతున్నావా? తమ ప్రియతముడైన సూర్యుడు లేక పువ్వులు ఎట్లా సంతోషంగా, ఆనందంగా వుంటాయి? అట్లా నేనూ, నువ్వు లేక దిగులుగా వున్నాను,' అన్నాడు.

కృష్ణమూర్తి పారిస్‌లో ఎంతోమంది మిత్రులను కలుసుకున్నాడు. ఒకసారి "మాంటికార్లో"లో ఒకామె కృష్ణమూర్తిని తన గదికి ఆహ్వానించి తీసుకు వెళ్ళి, ఒకటే ముద్దులు పెట్టింది. ఆ విధంగా చాలామంది ఆడవాళ్ళు కృష్ణమూర్తిలో ఆకర్షణ పడేవారు. కొందరు హద్దు మీరేవారు.

ఆడవాళ్ళ విషయంలో, కృష్ణమూర్తి ఎప్పుడూ బిడియంగా సాధువుగా, అమాయకంగా వుండేవాడు. అతని ప్రవర్తన కొందరు ఆడవాళ్ళకు బాధాకరంగా వుండేది, తమనూ, తమ ప్రేమనూ ఉపేక్ష చేస్తున్నాడని.

ఆడవాళ్ళ విషయంలో నేనెప్పుడూ, ఎటువంటి సాహస కృత్యాలూ చేయలేదని ఒకసారి కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి చెప్పాడు. "నేను ఆడవాళ్ళకు దూరంగా వున్నాను. నేను వారిపై దృష్టి పెట్టలేదు. ప్రత్యేకించి నేను ఎవరినీ కోరలేదు. వాళ్ళను జాగ్రత్తగా తప్పించుకుని తిరిగాను," అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి పారిస్‌నుంచి మిత్రులతో కలిసి, 'ఫాన్ టైన్ బ్లూ' అనే పర్వతాలనూ, మరొకసారి 'వెర్ సెయిల్స్' చూసి ఎంతో సంతోషపడ్డాడు.

1920లో, కృష్ణమూర్తి పారిస్‌లో మేడమ్ డి. మాంజియర్లీస్ కుటుంబంతో వున్నాడు. వారు క్రమంగా మంచిమిత్రులు అయ్యారు. ఆమెకు ముగ్గురు కూతుళ్ళు, ఒక కొడుకు. ఆమె కృష్ణమూర్తికి ఎంతో సహాయం చేసింది. ఆమె రష్యన్. చాలా అందమైన ఆవిడ. ఫ్రెంచి అతన్ని పెళ్ళి చేసుకుంది.

ఆ కుటుంబం వాళ్ళంతా స్టార్ సంస్థ సభ్యులు. ఆమె పిల్లలు కృష్ణమూర్తితో చాలా చనువుగా వుండేవారు. కృష్ణమూర్తి వాళ్ళకు ఒక జ్యోతిలాగ కనుపించేవాడట. కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, 'నేను మార్‌సెల్లీని ఎంతగానో ప్రేమిస్తున్నాను. నువ్వు ఈర్ష్యపడవు కదూ? గత ఎనిమిదేళ్ళుగా నేను నిన్ను గొప్పగా ప్రేమిస్తున్నాను,' అన్నాడు.

కృష్ణమూర్తి తిరిగి ఇంగ్లండు వచ్చేప్పటికి జమ్నాదాస్, నిత్యానందం ఇద్దరు కలిసి వ్యాపారం ప్రారంభించారు. ఆ సందర్భంలో వారిద్దరూ పారిస్ వెళ్ళారు. కృష్ణమూర్తి ఆరోగ్యం బాగా లేదని తెలిసి, "నువ్వు ఇంగ్లండులో వుండి, కృష్ణమూర్తిని చూసుకో,' అని అనీబిసెంట్ నిత్యానందాన్ని ఆజ్ఞాపించింది. అది నిరంకుశత్వమని నిత్యానందం, అనీబిసెంట్‌ను మనసులో వ్యతిరేకించాడు.

మే, నెలలో నిత్యానందానికి క్షయరోగం ఆరంభమైంది. మొదట అతనికి పారిస్‌లో ప్రకృతివైద్యం చేయించారు. తర్వాత స్విట్జర్లాండులో వైద్యం చేయించారు.

పదేళ్ళ తర్వాత కృష్ణమూర్తి, నిత్యానందం ఇండియా వచ్చారు.

చదువుల నిమిత్తం యూరప్ వెళ్ళిన కృష్ణమూర్తి, నిత్యానందం పెద్దవారై ది. 3-2-1921న, ఇండియా వచ్చి, అనీబిసెంట్‌తో కలిసి ఆగ్రా, బెనారస్, కలకత్తా వెళ్ళి, అక్కడ నుంచి అడయార్ చేరుకున్నారు. వారు పాశ్చాత్య దుస్తులు తీసేసి, ఇండియా దుస్తులు ధరించారు. దివ్యజ్ఞాన సమాజ కేంద్రకార్యాలయ ఆవరణలో కృష్ణమూర్తి, నిత్యానందంకోసం ప్రత్యేకంగా ఒక పెద్ద గది కట్టించారు.

ఆ పన్నెండవ తేదీన కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి రాశారు, ఇండియా రమ్మని. ఆమె వచ్చింది. ఆమెను ఆహ్వానించి తీసుకురావడానికి కృష్ణమూర్తి, నిత్యానందం బొంబాయి వెళ్ళారు ఆమె వారిద్దర్నీ ఇండియా దుస్తుల్లో చూసి, ఆశ్చర్య పోయింది. ఆమె, ఇండియా గవర్నమెంటువారు ఏర్పాటు చేసిన బంగళాలో వుండక, బెనారస్‌లో జరిగే దివ్యజ్ఞానసమాజ సమావేశాల్లో పాల్గొనేందుకు కృష్ణమూర్తితో కలసి బెనారస్ వెళ్ళింది.

డిశంబరులో ఒకరోజున కృష్ణమూర్తి, నిత్యానందం మద్రాసు "ట్రిప్లికేన్"లో వుంటున్న తమ తండ్రిని చూడ్డానికి వెళ్ళారు. వారు, తండ్రి కాళ్ళకు సాష్టాంగ నమస్కారం చేయబోతే, ఆయన తన కాళ్ళను వెనక్కి లాక్కున్నారు. ఆ తర్వాత వారు వెళ్ళిపోయారు.

సిద్ధపురుషులైన ఋషి అగస్త్య ఆదేశానుసారం అనీబిసెంట్ ఇండియా రాజకీయాల్లో ప్రవేశించింది. ఆమె అప్పటికే గొప్ప వక్తగా, ప్రజ్ఞాశాలియైన వ్యక్తిగా, సంఘ సంస్కర్తగా భారతీయులకు పరిచయస్తురాలు. ఆమె రాజకీయాలలో ప్రవేశించడంతో, మహాత్ములతో సంబంధం, అలౌకిక శక్తుల ప్రాబల్యం క్రమంగా తగ్గాయి. ఆమె కూడా

శారీరకంగా, మానసికంగా బలహీనురాలైంది. అది గమనించి కొందరు దివ్యజ్ఞాన సమాజ సభ్యులు తమకు అలౌకిక శక్తులు వున్నట్లు తలెత్తి తిరగనారంభించారు.

జార్జి అరండేల్, వెడ్జివుడ్ ఇద్దరూ తమకు సిద్ధపురుషులతో సన్నిహిత సంబంధం వున్నట్లు విదేశాల్లో చెప్పనారంభించారు. ఒక్కరోజులో తనకు నాలుగు దీక్షలు ఇవ్వబడ్డట్లు రుక్మిణీదేవి చెప్పుకుంది. ఆవిధంగా దివ్యజ్ఞాన సమాజ సభ్యులు ఎవరికి వారు తమ తమ ఆధిక్యతలకోసం తంటాలు పడ్డారు.

కృష్ణమూర్తి అడయార్ దివ్యజ్ఞాన సమాజ కార్యాలయంలో వుంటూ హెరాల్డ్ పత్రికకు సంపాదకీయాలు రాసేవాడు. అతనికి రోజూ ఎన్నో ఉత్తరాలు వచ్చేవి అనేకచోట్లనుంచి ఎంతోమంది అతని దగ్గరకు వచ్చి, మాట్లాడి, సలహాలు తీసుకునే వారు. అనేక విషయాలు చర్చించేవారు. కృష్ణమూర్తి రోజూ టెన్నిస్ ఆడేవాడు. సూర్యాస్తమయం అతనికి ఎంతో ఇష్టం. సాయంత్రాలు షికారుకు వెళ్ళేవాడు. ఆ సందర్భంలో లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తూ, "ఈ అడయార్ జీవితం దుర్భరంగా వుంది. నేనో ప్రత్యేకమైన జీవన విధానాన్ని కలలు కంటున్నాను. ఒక్కోసారి ఆ నా కోర్కె వ్యర్థం, శూన్యమని నాకు తెలుసు. నేను ఎటువంటి జీవితంలోంచి నడుస్తున్నానో నువ్వు ఊహించుకోలేవు. నాలో తిరుగుబాటుభావం తేన్తోంది. దేనికో తెలియదు. నిరంతరం నాలో ఘర్షణ, సంఘర్షణ. నాకు ఏడ్వాలని వుంది. ఓదార్పుకోసం ఎంతో ఏడ్వాలని వుంది. ఎందుకంటే, ఈ నా మనోఘర్షణ పోతుందేమోనని. ఏం లాభం ?

"అమ్మా ! నేనెంతో సుదూరాలకు వెళ్ళిపోవాలని వుంది. అక్కడ ఒంటరిగా, ఏకాంతవాసం గడపాలని వుంది. అందరికీ, అన్నింటికీ దూరంగా వుండాలనుకుంటున్నాను. ఓ అందమైన, చల్లని ప్రదేశం, చేరుకోవాలని వుంది," అన్నాడు.

ది. 23-7-1921 నుంచి, ఇరవై ఆరవతేదీవరకు పారిస్‌లో జరిగే దివ్యజ్ఞాన సమావేశాలకు కృష్ణమూర్తి, అనీబిసెంట్ వెళ్ళారు.

ఆ తర్వాత "ది ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్‌ది ఈస్ట్" సంస్థ తాలూకు వ్యవహారమంతా కృష్ణమూర్తి చేతుల్లో పెట్టారు.

ఆ డిశంబరులో కృష్ణమూర్తి బెనారస్‌లో నాలుగు ఉపన్యాసాలు ఇచ్చాడు.

తన ప్రథమ గురువరేణ్యులైన లెడ్‌బీటర్ని చూసి పదేళ్ళు అయిందని కృష్ణమూర్తి, నిత్యానందం సిడ్నీ వెళ్లారు. అప్పుడు అక్కడ జరిగే దివ్యజ్ఞాన సమాజ సమావేశాలకు కృష్ణమూర్తి హాజరయ్యాడు. లెడ్‌బీటర్, కృష్ణమూర్తి ఒకరిని చూసుకుని ఒకరు చాలా సంతోషపడ్డారు. కాని, సిడ్నీ ప్రజలు ఋషి పుంగవులైన లెడ్‌బీటర్ని అర్థంచేసుకోకపోగా, చాలా ఏళ్ల క్రిందట అడయార్‌లో కృష్ణమూర్తి, లెడ్‌బీటర్ విషయమై నారాయణయ్య అసభ్యంగా ప్రచారంచేయడం, ఆ సంగతి హైకోర్టులో ఫిర్యాదుగా రావడం వంటి సంగతుల్ని ఆధారంగా తీసుకుని వారిద్దర్నీ బాహాటంగా హేళన చేశారు. అది చూసి కృష్ణమూర్తి చాలా నొచ్చుకున్నాడు. ఆ సంగతులన్నీ కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి రాస్తూ, "పెర్త్"లో నాకు ఘన సన్మానం చేశారు. ఎందుకు ? నాలో ఏముంది ? ఇవన్నీ నాకు సమ్మతం కావు. నేను పారిపోయి నీదగ్గర వుండాలని వుంది. ఈ బోధలూ, ఉపన్యాసాలు, సభలు, చర్చలు, సంప్రదింపులు - ఏవీ నాకు నచ్చవు. నేను ఇటువంటి వాటికి తగిన వాడను కాను.

"చాలా కాలానికి లెడ్‌బీటర్ని చూశాను. ఆయన ఎప్పటి మాదిరిగా దివ్యజ్ఞాన సమాజ సభ్యులకు, స్టార్ సభ్యులకు, ఇతర యువకులకు బోధిస్తూనే వున్నారు. సంతోషంగా నవ్వుతూ

వున్నారు. నన్ను ప్రేమగా తీసుకున్నారు. నన్ను తన మిత్రు లందరికీ పరిచయం చేశారు. ఆయన్ని చూడ్డం నా కెంతో సంతో షంగా, ఆనందంగా వుంది. పదిహేడేళ్ళ అమ్మాయి 'రూత్' నాకు పరిచయమైంది. 'అప్పుడే ఆమె ఆకర్షణలో పడ్డాడు కృష్ణమూర్తి' అనే వదంతి కూడా పుట్టింది. రూత్ చాలా అందమైన అమ్మాయి. ఆమె అంటే నాకెంతో ఇష్టం. నేను ఆమె ప్రేమలో పడ్డానా? నేనట్లా పడగలనా? ఇలాగే పూర్వం "హెలెన్" అనే అమ్మాయి విషయంలోనూ అభాండం వచ్చి పడింది.

'కాని, ఇక్కడ లెడ్‌బీటర్ బిషప్ వేషంవేశారు. ముఖంలో వయసు కనపడుతోంది. ఎర్రటి అంగరకా వేసుకుని, మెడలో క్రాస్ ధరించారు. బిషప్‌రింగు పెట్టుకున్నారు. రోజులో చాలా భాగం మతపరమైన విషయాలతో కాలంగడుపుతున్నారు,' అన్నాడు.

కృష్ణమూర్తి సిడ్నీ వీధుల్లో తిరుగుతూవుంటే, ప్రజలు అతన్ని "జగద్గురువు, మెసయ్యా" అంటూ పెద్దగా గోలచేశారు. అతని విషయమై చివరికి పేపర్లుకూడా ఆడిపోసుకున్నాయి. కృష్ణమూర్తి సిడ్నీనుంచి వెళ్ళిపోయేముందు, అనీబిసెంట్, లెడ్‌బీటర్ ఎన్నో సంగతులు రహస్యంగా, దీర్ఘంగా చర్చిం చారు. తాను "శాన్‌ఫ్రాన్‌సిస్కో"లో వుండి ఫిలాసఫీ, ఎకనామిక్స్, సూత్రం, విద్య మొదలైన విషయాలగురించి చదివి తెలుసుకోవాలనుకుంటున్నానని కృష్ణమూర్తి వారితో చెపితే, వారు సంతోషించారు. కృష్ణమూర్తి, లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "మనకు వున్నవారందరిలో అనీబిసెంట్ చాలా ఉన్న తురాలు," అన్నాడు.

1912–1922 మధ్యకాలంలో "కృష్ణమూర్తే జగద్గురువు, తిరిగి వస్తానన్న ఏసుప్రభువు," అనే భావం అనీబిసెంట్ ఆరాధకుల్లో చింతామణిగా మారింది. తత్ఫలితంగా వారందరూ

కలసి ధ్యానంచేయ నారంభించారు. కృష్ణమూర్తిపై కొందరు వ్యాసాలు రాశారు. కొందరు తమ నమ్మకాలకు బలం ఇచ్చి, ప్రకటించుకున్నారు. వారు కొద్దిమందే అయినా ప్రపంచం ఆ కొసనుంచి, ఈ కొనవరకూ వున్నారు. తరచు యూరప్ దేశాల మధ్య ముఖ్యపట్టణాల్లో చర్చలూ, సమావేశాలు జరిపారు. రాబోయే జగద్గురువును ఉద్దేశించి ప్రార్ధనలు చేశారు.

ఆ రోజుల్లో కృష్ణమూర్తి చుట్టూ విడవకుండా ఎంతోమంది ఆడవాళ్లు - ముఖ్యం పడుచువారు చేరడంవల్ల ఎన్నో గొడవలు బయలుదేరాయి. అతనిచుట్టూ చేరిన ఆడవాళ్లు తాము గోపికల మనుకొనేవారు. లేడీ ఎమిలీ కూతుళ్లు మేరీ—బెట్టీలు, తమ తల్లిని చూసి ఈర్ష్య పడేవారు, కృష్ణమూర్తి ప్రేమనంతా ఆమె పొందగలిగిందని. ఆ ఆడవాళ్లంతా కృష్ణమూర్తి ఎక్కడకు వెడితే అక్కడకు వెళ్లేవారు. లేడీ ఎమిలీని అయితే అనీబిసెంట్ మందలించింది కాని, అంతమంది అమ్మాయిల్ని ఆమె ఎట్లా మందలించగలదు ?

ఇన్ని జరుగుతున్నా కృష్ణమూర్తి గోల్ఫ్ ఆడుతూ, మోటారు సైకిల్‌పై తిరుగుతూ, ప్రముఖ వ్యక్తులతో చర్చిస్తో, ధనవంతులు ఇచ్చే ఆస్తులు తీసుకుంటో హాయిగా, ఆనందంగా వున్నాడు. అతను వెళ్లిన ప్రతిచోటా సమావేశాలు ఏర్పాటు చేయబడేవి. అప్పుడప్పుడూ ఆధ్యాత్మిక గోష్టులు జరిపేవారు. కృష్ణమూర్తి తరచు ప్రపంచయాత్రలు చేసేవాడు. కాని, ఎప్పుడూ ఒంటరిగా ధ్యానం చేసుకుంటూ వుండేవాడు. చాలా సున్నితమైన ఆరోగ్యం కావడం చేత అతనికి ఎప్పుడూ ఏదో ఒక జబ్బు చేసేది. ఏదో తెలియని ఆవేదనతో రాత్రులు సరిగ్గా నిద్రపోయేవాడు కాదు. అతనికి అనేక చిత్ర - విచిత్రమైన దృశ్యాలు గోచరమయ్యేవి.

చాలా కాలానికి లెడ్‌బీటర్ని చూడ్డం కృష్ణమూర్తికి పరమానందంగా వున్నా, అన్నీ తెలిసిన ఆయన మళ్ళా "బిషప్"గా వేషం మార్చడం, చర్చి తంతులు జరపడం కృష్ణమూర్తికి ఇబ్బందిగా తోచాయి.



అంతలో నిత్యానందానికి జబ్బు ఎక్కువైంది. రోగం ఎంతకీ, ఎక్కడా నయం కాలేదు. వారు తిరిగి యూరప్ వెళ్ళిపోతూ వుంటే, "ఎ. పి. వారింగ్‌టన్'' అనే అమెరికా దివ్యజ్ఞాన సమాజ సభ్యులొకరు కృష్ణమూర్తిని, నిత్యానందాన్ని అమెరికాకు ఆహ్వానించాడు. అక్కడ వారికి వసతి సౌకర్యాలు ఏర్పాటు చేస్తానన్నాడు. అందుచేత కృష్ణమూర్తి, నిత్యానందాలను ''ఒహై" లోయకు పంపించాలనుకున్నారు అనీబిసెంట్, లెడ్‌బీటర్. నిత్యానందాన్ని మొదట వైద్యం నిమిత్తం స్విట్జర్లాండు తీసుకువెళ్ళారు. అక్కడనుంచి వారు ఒహై వెళ్ళారు. అది శాంతా బార్‌బరాకి దగ్గరలోవుంది.

''ఒహై'' లోయ ఒక ఆరోగ్యకేంద్రం. అది "శాన్‌ఫ్రాన్సిస్కో"కి దాదాపు నాలుగువందల కిలోమీటర్ల దూరంలోవున్న కొండప్రాంతం. అది సముద్ర మట్టానికి పదిహేనువందల అడుగుల ఎత్తున వుంది. అక్కడ అమెరికా దివ్యజ్ఞాన సమాజ జనరల్ సెక్రటరీ వారింగ్‌టన్, కృష్ణమూర్తి, నిత్యానందాలకు ఒక కుటీరం ఇచ్చాడు. తరచు వారిని చూస్తూ వుండేవాడు. ఆ సందర్భంలో ఇంగ్లండులో "బ్రదర్స్ ట్రస్ట్" అని ఒక ట్రస్ట్ ఏర్పాటుచెసి, కొంత డబ్బు పోగుజేసి, కృష్ణమూర్తి వుండేందుకు ఒక కుటీరం, ఆరు ఎకరాల భూమీ కొన్నారు. ఆ కుటీరమే ''పైన్‌కాటేజి''. ఆ కుటీరంచుట్టూ నారింజ, ఏవకాడో చెట్ల తోపులు.

ఆ ప్రదేశం చూసి కృష్ణమూర్తి, నిత్యానందం మురిసిపోయారు. నిత్యానందానికి సేవచేసే నిమిత్తం "రోజలిండ్" అనే అమ్మాయి ఒహై వెళ్ళింది. ఆ కొండలమధ్య కృష్ణమూర్తి నిత్యానందం తమ పనులు తాముచేసుకుంటో కాలం గడిపేవారు. అక్కడకు వెళ్లిన తర్వాత నిత్యానందం జబ్బు ఎక్కువైంది. రెండు ఊపిరితిత్తులూ చెడిపోయాయి.

రోజలిండ్ చాలా చురుకైనది, తెలివైనది. ఎప్పుడూ హుషారుగా, సంతోషంతో గెంతుతూ వుండేది, ఆ కొండల్లో.

నిత్యానందం పరిస్థితి రోజురోజుకీ విషమించడంతో కృష్ణమూర్తి చాలా గొడవపడేవాడు. కాని, ఒహై వెళ్లిన ఐదు వారాల తర్వాత, ఆగస్ట్ పన్నెండవ తేదీన లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "నేను రోజూ ఉదయం గం. 6-45ని॥ నుంచి గం. 7-20 ని॥ల వరకు ధ్యానం చేస్తున్నాను. రాత్రి నిద్రపోయేముందు పది నిమిషాలు ధ్యానం చేస్తున్నాను. మొదట్లో కష్టంగా వున్నా, క్రమంగా తేలికగా వుంది," అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి మదిలో హెలెన్ మధురంగా నిలిచివుంది. అతను ఆమెకు తరచు ప్రేమలేఖలు రాసేవాడు,

ఆ ఏకాంతవాసంలో కృష్ణమూర్తి మూడు రోజులు (ఆగస్ట్ 17 నుంచి 20 వరకు) మానసికంగా ఎంతో యాతన పడ్డాడు. ఆ మూడురోజులూ అతను అంతర్ముఖుడై కాలం ఎట్లా గడిపాడో, దాన్నంతా అతనే వర్ణించాడు :

"సిద్ధపురుషులైన మాష్టర్ కుతుమి ఆదేశానుసారం నేను ఉభయ సంధ్యల్లో ఏకాగ్రచిత్తంతో ధ్యానం చేశాను. మొదట్లో ధ్యానం కష్టమనిపించింది. వారం గడిచాక, నేనెక్కడ తప్పానో, ఎక్కడ జారిపడ్డానో తెలుసుకోగలిగాను. నన్ను నేను

లోపలా-బైటా గమనించాను. త్రిశరీరాలూ సఖ్యతగా పని చేయడానికి ప్రయత్నించాను. అదే నా సాధన. మైత్రేయుని దృష్టిలో పెట్టుకుని ధ్యానం చేశాను. ఎప్పుడూ లక్ష్య సిద్ధికై ఎదురు చూసేవాడిని. దానితో నా జీవిత విధానమే పూర్తిగా మారిపోయింది. ఆ సమయంలో కొన్ని అలౌకికానుభవాలు కలిగాయి.

"పదిహేడవ తేదీన నా మెడ దగ్గర విపరీతమైన బాధ ప్రారంభమైంది. ధ్యానం పావుగంట సేపు తగ్గించాను. ఆ మూడు రోజులూ నాకు తిండి సహించలేదు. ఎవరినీ చూడాలని పించేది కాదు. ఎవరైనా నన్ను తాకితే, భరించలేకపోయేవాడిని. సాయంత్రానికి చాలా అలసటగా వుండేది. ఒక్కోసారి స్పృహ వుండేది కాదు. పడుకునేవాడిని. ఒక్కోసారి నాకు తెలియకుండానే "అమ్మా!" అని గట్టిగా మూలిగే వాడిని. మానసికంగా ఎంతో యాతన పడ్డాను. దెయ్యం పట్టినవానిమాదిరిగా, వుండే వాడిని. ఎవరో పిలిచినట్లు నిద్రలో లేచి, కిందపడేవాడిని. ఒళ్ళంతా సూదులతో పొడిచినట్లు వుండేది. తలలో ఎప్పుడూ బాధగా వుండేది. మెడ దగ్గర విపరీతమైన నొప్పి. రోజూ పడుకునే నా మామూలు పక్క, నాకే అసహ్యంగా, కఠినంగా కనుపించేది. అందుచేత నేలమీద కూర్చునేవాడిని, ఏ శబ్దం భరించలేకండా వుండే వాడిని. ఒంటరిగా వుండాలనిపించేది. నా కళ్ళముందు నేను ప్రేమించే గురువులు దర్శనమిచ్చేవారు. వారిని చూస్తో గంటల తరబడి వుండిపోయేవాణ్ణి. అశాంతి, ఆరాటం అధికమైంది. కళ్ళు తెరచివున్నా, దేన్నీ గమనించి తీసుకునేవి కావు.

"క్రమంగా నా అంధకారం తొలగి, నా హృదయం తెరచుకుంది. నన్ను ప్రేమ చుట్టుకుంది. నేను ఈశ్వరోన్మత్తుడనైనాను, ఆ మూడు రోజులూ ఆనందసాగరంలోని నీటిని రుచి చూశాను.

"పదేళ్ళు గాలి తగలని చీకటి కూపంలో బ్రతికి సూర్య కాంతిలోకి వచ్చినట్లు అనిపించింది. నాలో పూర్తి మార్పు వచ్చినట్లు నాకే తెలిసింది. నావలె, నా మిత్రులు కూడా మారా లనుకున్నాను. వాళ్ళూ ఆ పవిత్ర పర్వత శిఖరాన్ని అధిరోహించాలనుకున్నాను. ప్రపంచానికి ఎంతో సహాయ పడాలనిపించింది.

"ఆమూడు రోజుల్లో జరిగిందేమిటంటే, నన్ను నేను తెలుసుకున్నాను. ఇప్పుడు నా అంతరాత్మ నిశ్చలమైన, నిర్మలమైన ఆలోచనలతో శక్తివంతంగా వుంది. నిశ్చయంగా నా అహం కూలిపోయిందని నేను గట్టిగా చెప్పగలను. ఇదంతా ఆ మూడు రోజుల అనుభవం," అన్నాడు.

కృష్ణమూర్తి ఆ సంగతులన్నీ అనీబిసెంట్‌కు రాస్తో, "అమ్మా! నేనెంతో మారాను. నా మార్పుతో నా మిత్రుల్ని ఏమార్చాలనుకుంటున్నాను.. నన్ను ఏంచేయమంటావు ?" అని అడిగాడు.

కృష్ణమూర్తికి జరిగిన సంగతుల్ని నిత్యానందం ఇట్లా రాశాడు: ప్రతిరోజూ సాయంత్రం కృష్ణమూర్తి ధ్యానంలో వుండేవాడు. అతని చూపులో ఎంతో మార్పు కనుపించింది. మమ్మల్ని చూస్తున్నా, ఆ చూపు ఆక్కడ లేదు. ఆ చూపు మమ్మల్ని ఎరగనట్లే వుండేది. ఏ లోకానికో, ఏ కాలానికో చెందిన చూపు అది. అతను సరిగ్గా నడవలేకపోతే, ఎవరైనా పట్టుకోబోతే, "నన్ను ముట్టుకోకండి. ముట్టుకుంటే బాధగా వుంటుంది," అనేవాడు. ఇతరులకు అతని మాటలు, చూపులు, పనులూ పిచ్చిగా వుండేవి. అది దేహసంబంధమో, యోగ సంబంధమో లేక ఆ దేవాలయంలో జరిగే పవిత్ర కార్యకలాపమో! ఏమో! మాకేమీ తెలియదు, కాస్సేపటికి ఎంతో తేరుకున్నట్లు

చూసి, "నేనిప్పుడు బావున్నాను. మామూలుగానే వున్నాను," అని, రెండు అడుగులు వేసి నిలువునా బోర్లా పడిపోయేవాడు. ఎక్కడో దెబ్బతగిలి, స్పృహ తప్పేది. ఎప్పుడూ అన్నింటికీ ఎరుకలో వుండేవాడుకాదు. లేదా, మంచంమీద కూర్చుని ఏదో గొణుగుతూ వుండేవాడు. "వెన్నెముకలో బాధ" అనే వాడు. ఏ శబ్దం భరించలేక, "నన్ను ఒంటరిగా వదలండి," అనేవాడు.

"ఆ సమయంలో అక్కడ రోజలిండ్, రాజగోపాల్, వారింగ్టన్ కూడా వున్నారు. కృష్ణమూర్తిలో ఏదో పెద్ద మార్పు జరుగుతోందనుకున్నాం. ఇరవయ్యో తారీఖున కృష్ణమూర్తి ఓ చెట్టుక్రింద కూర్చుని, ధ్యానంలో మునిగి పోయాడు. ఆ తర్వాత మాతో, "నా ముందు నా దేహం నిలి చింది. నా తలపై నక్షత్రం ప్రకాశవంతంగా, స్పష్టంగా వుంది. బుద్ధభగవానుని అనుగ్రహ వీక్షణాల్ని అనుభవించాను. బైట ప్రతిదీ అన్నీ-అంతా "నేనే" అయినట్లు అనుభూతి కలి గింది. అన్నింటితో తాదాత్మ్యభావం కలిగింది. సర్వవ్యాప కత్వం వలె నేను విస్తరించినట్లు అనిపించింది. అంతా నాలో, నాతో, నా చుట్టూవున్న బావం కలిగింది," అన్నాడు.

"అతని మాటల్ని గమనిస్తే, ఒకసారి దేహంలోంచి, మరొకసారి మరెక్కడినుంచో పస్తున్నాయనుకునేవాళ్ళం. ఓరోజు కృష్ణమూర్తి "అమ్మా!" అని పిలిచి, నాతో "అమ్మను చూశావా ?" అని అడిగాడు.

'మరొకసారి' ఈ నా దేహాన్ని లక్ష్యపెట్టకండి. నేను మూలగకుండా, బాధపడకుండా వుండలేను," అని, రోజలిండ్‌ను పిలిచి, "అమ్మా! ఇకనుంచి నువ్వు నన్ను చూసుకుంటావా?

నేను సుదూరాలకు వెళ్ళిపోతున్నాను," అని స్పృహ కోల్పో యాడు. మళ్ళా లేచి, మోకాళ్ళ మీద తలపెట్టుకుని, నేలమీద చతికిలబడి, "కృష్ణా ! ఎక్కడ? తిరిగి వెనక్కిరా! " అన్నాడు.

"ఆ తర్వాత కృష్ణమూర్తి కళ్ళు జ్యోతుల్లాగ వెలగ నారంభించాయి. దేహంలో ముఖ్యం - ముఖం ఎంతో అందంగా, వింత కాంతితో వెలిగింది. అతని ఉనికిలో శాంతి, పవిత్రత వుంది. ఓ దివ్యపురుషుడు మా మధ్య తిరుగుతున్నాడను కున్నాం. ఆ రోజురాత్రి కృష్ణమూర్తి, 'ఈ రాత్రి మన ఇంటికి ఒక గొప్ప అతిధి రాబోతున్నారు. మీరు సిద్ధంగా వుండండి,' అని వెళ్లి, తన గదిలో బుద్ధుని పటంపెట్టుకున్నాడు. ఆ తర్వాత ఉపన్యాసధోరణిలో, శ్రోతల్ని ఉద్దేశిస్తున్నట్లు మాట్లాడ నారంభిం చాడు: 'నన్ను అభినందించడానికి నాలో ఏమీ లేదు, అదేదో మీకు మీరు చేసుకోవచ్చునే! చేసుకోండి,' అని, " అమ్మా! ఇప్పుడంతా భిన్నంగా వుంది. ఇకనుంచి జీవితం మనకు పాత పద్ధతిలో వుండదు. నేను ఆయన్ని చూశాను," అని ఆగి "ఇంకేం లేదు," అని, కృష్ణమూర్తి ఎవరితోనో మాట్లాడాడు. వారెవరో వారిని మేము, చూడలేదు. అతని దేహాన్ని కాపాడమని సిద్ధ పురుషులు ఎవరినో పంపించివుంటారనిపించింది. కాని, అతని దేహం దుర్బలంగా వుండటం వలన తరచు అపస్మారకంలో వుండేవాడు. ఒంట్లో బాధలు అటూ ఇటూ మారేవి. అవి క్రమంగా లోపలిభాగానికి చేరినట్లనిపించింది. భరించలేక గిల గిల లాడే వాడు. "అమ్మా!" అంటూ మూలిగి, 'కృష్ణను శ్రద్ధగా చూసు కోండి," అని రోజలిండ్‌ని హెచ్చరించేవాడు. అతనికి కుండలిని యోగం జరిగిందనిపించింది. విరాట్ స్వరూపాన్ని దర్శించాడను కున్నాం."

కృష్ణమూర్తి ఆ సంగతుల్నే లెడ్‌బీటర్‌కి రాశాడు :

"నేను దర్శించాను. నేను పరమానందంలో వున్నాను. జీవన మూలాధారంనుంచి పవిత్రోదకాన్ని సేవించాను. నా ఆర్తి - దప్పిక శాశ్వతంగా తొలగింది. ఇంక నేను ఎప్పటికీ కటిక చీకటిలో వుండను. కాంతిని దర్శించాను. శాంతిగా వున్నాను. సమస్త దుఃఖాల్ని, బాధల్ని నివృత్తిపరచే దయను దర్శించాను. అదంతా నా ఒక్కడికోసమే కాదు. ప్రపంచం అంతటికోసం అది వుంది.

"పర్వత శిఖరాన నిలబడ్డాను. మహాత్ముల్ని దర్శించాను. దివ్యకాంతిని చూశాను. సత్యసందర్శనమైంది. అజ్ఞానాంధకారం తొలగింది. ప్రేమ, నా హృదయాన్ని మధురంగా నింపింది. ప్రేమోన్మత్తుడనయ్యాను. ఇంక నా హృదయపద్మం ముకుళించదు. శాశ్వతానందాన్ని, విశ్వసౌందర్యాన్ని తిలకించాను. నేను ఈశ్వరోన్మత్తుడనైనాను.

"ఒకతను రోడ్డు మరమ్మతు చేస్తున్నాడు. ఆ పని చేసే అతను, నేనే. ఆ గడ్డపారా, నేనే. బద్దలయ్యే ఆ రాయీ, నేనే. నేలమీద వున్న మృదువైన గరికా, నేనే. చెట్టు పక్కన వున్నదీ నేనే. అన్నీ, అంతా నేనే. నాలో ఆ భావం నిండివుంది.

"చెట్లు, ఆకాశం, పక్షులు, భూమి-సమస్తం గాలి, వెలుతురు అంతా, అన్నీ నేనే. అవన్నీ నాలో భాగాలే:

"దూరాన ఒక కారు వెడుతోంది. ఆ కారు, దాని డ్రైవర్, దాని ఇంజన్-అంతా, అన్నీ నేనే.

"రోడ్డు వెంబడి వెడుతున్నది నేనే. అన్నింటిలో నేను. అంతా నాలో," అన్నాడు.

ఆ రోజులన్నీ కృష్ణమూర్తికి అట్లా గడిచాయి. అతనిలో ఏకత్వభావం కలిగింది.

ఆమూడు రోజులలో జరిగిన సంగతుల్ని, విషయాల్ని, సంఘటనలను నిత్యానందం కూడా అనీబిసెంట్‌కూ, లెడ్‌బీటర్‌కూ ఉత్తరాలలో రాశాడు :

"లోయ పైభాగాన మాకుటీరం వుంది. ఒక్క వారింగ్‌టన్ తప్ప మరెవరూ మాకు దగ్గరలో లేరు. అప్పుడప్పుడూ మేము ముగ్గురం కబుర్లు చెప్పుకునేవాళ్లం. మాతో ఒక అమెరికన్ అమ్మాయి - రోజలిండ్ వచ్చి, రెండు - మూడు వారాలు వుండి, వెడుతుంది. ఒక బిషప్ - "WALTON" అనే ఆయన తరచు మా దగ్గరకు వచ్చేవారు. ఆయనకూ ఆ దగ్గరలోనే ఒక కుటీరం వుంది.

"కృష్ణమూర్తి చాలావరకు మాకు దూరంగా, విడిగా, భిన్నంగా వుండి ఏవేవో మాట్లాడేవాడు. మేము అతని మాటల్ని శ్రద్ధగా వినేవాళ్లం. అవన్నీ మా స్మృతుల్లో చెదరకుండా, చెరగకుండా, చెడకుండా వున్నాయి. మేము అతన్ని ఎంతో జాగ్రత్తగా కనిపెట్టి వున్నాం. నేనూ, నాతోపాటు వారింగ్‌టన్ - ఇద్దరి ఆరోగ్యాలూ బాగాలేవు. ఒక్క రోజలిండ్ మాత్రం అతనికి దగ్గరగా వుండి సేవలు చేసింది.

'కృష్ణమూర్తి అప్పుడప్పుడూ పళ్లు బిగించేవాడు. గుప్పెట్లు గట్టిగా బిగించేవాడు. ఒక్కోసారి రోజలిండ్‌ని తోసేసేవాడు. అతని ముఖంలో - ముఖ్యం, కళ్లలో మార్పు వచ్చింది. తరచు వణకేవాడు. చాలాసేపు అపస్మారక స్థితిలో వుండేవాడు.

"రోజలిండ్‌ని ఒక్కోసారి దగ్గరగా రమ్మని ప్రేమగా పిలిచేవాడు, కృష్ణమూర్తి. ఆ మూడు రోజులూ రోజలిండ్ అతని చెంతనే వుండి శ్రద్ధగా, నిస్వార్థంగా ప్రేమతో సేవలు చేసింది.

"అడయార్‌నీ, అక్కడి ప్రజల్ని తలచుకుని వాళ్లంతా అప్పుడు అక్కడే వున్నట్లు మాట్లాడేవాడు.

“మూడోరోజు సాయంత్రానికి అంతా సద్దుమణిగింది. కృష్ణమూర్తి శాంతంగా వున్నాడు. తన చుట్టూ ఇరుకుగా, మురికిగా వున్నట్లు చూసేవాడు. ఇండియా అడవుల్లోకి పోతాన న్నాడు. ఒంటరిగా షికారుకు వెళ్లాలనుకున్నాడు. ఒంటరిగా వుండాలనీ, ఒంటరిగా వెళ్లాలని, తిరగాలనీ అనుకునేవాడు.

“సూర్యాస్తమయం అయిన గంట తర్వాత అందరం ఇంటిముందు వరండాలో కూర్చున్నాం, ఒకరోజున. ఏదో జరిగిపోయింది. మేమంతా నిర్మలంగా, నిశ్చలంగా, నిశ్శ బ్దంగా కూర్చున్నాం, కొండల్ని, చీకటి తెరల్నీ చూస్తో.

“ఆ తర్వాత కృష్ణమూర్తి “పెప్పర్” చెట్టుకింద కూర్చు న్నాడు. అంతలో నక్షత్రాలు వచ్చాయి. కృష్ణమూర్తి ఏదో గొణుగుతూ, చివరికి అడయార్ పూజా మందిరంలో జపించే మంత్రం జపించాడు.

“శారీరకంగా ఆ మూడు రోజులూ కృష్ణమూర్తి ఎంతో యాతన పడ్డాడు. అతని దేహం బాగా నలిగిపోయింది. అతను బాగా అలసిపోయాడు. నీరసపడ్డాడు. తిండి–నిద్ర సరిగ్గాలేవు, ఆ మూడు రోజులు. కంఠస్వరం హీనమైంది.

“ఆ తర్వాత మాతో మామూలుగా మాట్లాడాడు. చెట్టు క్రింద కూర్చున్నప్పుడు మాత్రం, మాకు బుద్ధుని మాదిరిగా కనుపించాడు. ఆయన దీవన కృష్ణమూర్తితో పాటు మాపైన కూడా నిలిచిన అనుభూతి కలిగింది మాకు.

“అంతా నిశ్చలంగా, నిశ్శబ్దంగా వుంది. పెప్పర్ చెట్టుపైన ఒక ఒంటరి నక్షత్రం ప్రకాశవంతంగా వెలిగింది. మమ్మందర్నీ ఆ కాంతి, శాంతపరచింది. ఆ క్షణాన ఆనం దంగా వున్నాం. ఆ ప్రదేశమంతా గొప్ప కాంతితో నిండింది.

"అసలు ఆయన్ని మేము చూడలేకపోతున్నా అక్కడ ఏదో-ఎవరో- ఏ అద్భుత శక్తో, వ్యక్తో, ఎవరో, ఆ క్షణాన మాతో వుందనిపించింది.

"ఆయన్ని చూశారా ?" అంటూ ఆశ్చర్యానందాలతో అడిగింది, రోజలిండ్ మమ్మల్ని. ఆమె ముఖంకూడా గొప్ప తేజస్సుతో నిండివుంది. ఆ వైభవమంతా ఆమె ముఖంలో ప్రతిబింబించింది. ఆ చీకట్లో కృష్ణమూర్తి కొంతసేపు సమాధి స్థితిలో వున్నాడు.

• • •

కృష్ణమూర్తి, నిత్యానందం తెలియజేసిన సంగతుల ఆధారంతో, "కృష్ణమూర్తికి మూడో జ్ఞానదీక్ష పూర్తి అయింది," అని అనీబిసెంట్ అన్నది.

• • •

ఆ తర్వాత కృష్ణమూర్తిని శారీరక యాతనలు ఒక నెల్లాళ్ళవరకు వదల్లేదు. పిచ్చెత్తినట్లు వుండేవాడు. రోజలిండ్ సేవలు చేసింది. కృష్ణమూర్తిని తల్లిలాగ చూసుకుంది. మిత్రులందరూ ఆనాటినుంచి కృష్ణమూర్తిని ముద్దుగా "కృష్ణాజీ" అని పిలవనారంభించారు. అప్పటినుంచే కృష్ణమూర్తి తనను తాను చెప్పుకోవలసివస్తే ".K - కె" అనేవాడు.

కృష్ణమూర్తి తన అనుభవాల్ని అనీబిసెంట్‌కీ, లెడ్‌బీటర్‌కీ రాశాడు: "మహాత్మా మైత్రేయుని దృష్టిలో పెట్టుకుని రోజులో చాలా భాగం ధ్యానం చేశాను. నా దృష్టిలో మాష్టర్ కుతుమి

మహర్షి నిలిచారు. నేను అన్నింటిలో, అన్నీ నాలోవున్న ఏకత్వభావం కలిగింది. బుద్ధుని తాలూకు శక్తివంతమైన ప్రకంపనల్ని అనుభవించాను ఆనందంగా, శాంతంగావున్నాను. నా ఆత్మ మేల్కొన్నది,'' అని.

తనకు కలిగిన అనుభవం గురించి లేడీ ఎమిలీకి రాస్తో, "నేను పూర్తిగా మారాను. నా మార్పుతో నామిత్రుల్ని మార్చాలనుకుంటున్నాను. నేను ఎంత మారానో నువ్వు ఊహించలేవు. ఆంతరంగికంగా నాకు గొప్ప శక్తి వచ్చింది,'' అన్నాడు.

ఆ అనుభవంతో కృష్ణమూర్తి దేహం, ముఖ్యం-మెదడు పరిశుభ్రమైనాయి. అతనూ పరిశుద్ధుడైనాడు. ''కుండలిని యోగం'' జరిగిందన్నారు, కొందరు. కాని, బాహ్యంగా అతనిలో ఎటువంటి మార్పూ లేదు.

మనిషి మేల్కొవడానికి స్వార్థరాహిత్యం, సత్ప్రవర్తన, నిజాయితీ జీవనం, ఉత్తమ సంకల్పం, మంచి ఆలోచనలు బాగా సహకరిస్తాయి. పూర్ణయోగానికి అవే నిజమైన మార్గాలుగా తోస్తున్నాయి. "కుండలినీశక్తి'' అన్నా, అదే. ఆ శక్తి సహాయంగా కొందరికి దివ్యదృష్టికూడా కలుగుతుందంటారు పెద్దలు. కొందరికి మహిమలు, సిద్ధులు లభిస్తాయంటారు. కాని కృష్ణమూర్తిలో శారీరకంగా, మానసికంగా ఎన్నో అద్భుతమైన మార్పులు వెంట, వెంటనే జరిగాయి. అతని ముఖంలో ఆధ్యాత్మిక తేజస్సు తాండవించింది.

ఆ తర్వాత కృష్ణమూర్తి ఎక్కువసేపు ధ్యానంలో వుండేవాడు. మూడునెలలు శారీరక యాతనలు అనుభవించాడు. ఒళ్ళంతా మండిపోతున్నట్లువుందని దగ్గరలోవున్న ప్రవాహంలో

స్నానం చేసేవాడు. దేహం బాగా అలిసిపోయేది. చిక్కి శల్యమైనాడు. అతని శారీరక బాధ, ఇతరులకు కూడా ప్రయాస కలిగించింది.

ఆవిధంగా కొన్ని రాత్రులు గడిచాయి. తన తల్లి, సంజీవమ్మ చనిపోయేముందు పడిన బాధను వర్ణించి నిత్యానందానికి, రోజలిండ్‌కి చెప్పాడు, కృష్ణమూర్తి.

రోజలిండ్‌తో, "అమ్మా ! ఇప్పుడంతా మార్పు. పూర్వం సంగతి ఒక్కటీ నాలో లేదు. నేను ఆయన్ని దర్శించాను. ఇంకేమీ మిగలలేదు నాకు," అన్నాడు.

"తన దేహం మహాత్మా మైత్రేయ ఆగమనానికి సిద్ధం చేయబడింది" అంటూ కృష్ణమూర్తే చెప్పాడు ఆ రోజుల్లో, వారిద్దరికీ.

ఆ విషయాన్నే "కృష్ణమూర్తికి మూడో నేత్రం తెరచుకుంది," అన్నాడు నిత్యానందం.

• • •

కృష్ణమూర్తి తరచు సమాధి స్థితికి వెళ్ళేవాడు. అందరితో, అతని సంబంధం లీలా మాత్రంగా వుండేది. అందరివలె రక్తితో, ఆసక్తితో బ్రతుకు సాగించేవాడు కాదు. అతనికి కలిగిన మహోజ్వల జ్ఞానోదయంతోపాటు, మెలకువతో కూడిన ప్రతీక్షణ కూడా వుండేది. అందుకే కృష్ణమూర్తి చివరి వరకూ ఉదాత్త పథంలో నడవగలిగాడు.

ఆ అనుభవంతో కృష్ణమూర్తి జీవితం మరో మలుపు తిరిగింది. అతని జీవితంలో అసలు సంగతి ఆరంభమైంది. తనకు కలిగిన, కలుగుతున్న ఆలోచనల్ని, అనుభూతుల్ని, మిత్రులకు

పెద్దలకు - ముఖ్యం లెడ్‌బీటర్‌కు ఎప్పటికప్పుడు ఉత్తరాల ద్వారా తెలియపరిచేవాడు. ఆ సంగతి తెలిసి, 'ఈ అనుభవంతో కృష్ణమూర్తికి మూడోదీక్ష ఇవ్వబడింది,' అన్నాడు లెడ్‌బీటర్.

తనకు కలిగిన అనుభవాల, కనుపించిన దివ్యదృశ్యాల తాలూకు కొన్నింటిని కృష్ణమూర్తి ఇట్లా వర్ణించాడు: "ఈ భీకర పారావారంలో నేనూ అందరి మాదిరిగా వున్నాను. కాని, అల్పమూ-స్వల్పమూ అయిన సంగతులన్నింటినీ నిరాకరించి, జీవితగమ్యాన్ని చేరుకోవాలకున్నాను. ఆ నా గమ్యమే, నా ప్రియతముడు. అదే నా ఆనందం. అదే సత్యం - శివం - సుందరం. అటువంటి శాశ్వతమైన దాన్ని పొందాలని తీవ్రంగా వాంఛించాను. ఎంతో గట్టిగా ప్రయత్నించాను. నేనే ఆ గమ్యమైపోవాలని ఆశించాను. జీవన జలధి మూలస్థానంనుంచి తనివి తీరా తాగాలని ఉబలాట పడ్డాను. అద్యంతాలను కలపాలని, ఆ లక్ష్యాన్ని నాలో మరింత గట్టిగా స్థిరపరచుకున్నాను.

"నాకూ, నా గమ్యానికీ మధ్య ఎటువంటి విభాగం వుండ కూడదనుకున్నాను. అంటే, నాకూ ఈ చరాచరా లన్నింటికీ మధ్య, విభాగమనేది నా మనసులో వుండివుంటే, అది నాలోంచి పూర్తిగా తొలగి పోయేవరకు, నేను ఏళ్ళ తరబడి నిర్మించు కున్న రాతిగోడల్ని - కల్పించుకున్న మనో అభ్యంతరాల్ని వేళ్ళతో సహా పెళ్ళగించి, అవతల పారెయ్యాలనుకున్నాను.

"నేను అనే ప్రత్యేక వ్యక్తిత్వం వున్నంతకాలం దుఃఖం, దైన్యం, కలత, సంశయం, అపనమ్మకం, అశాంతి తప్పవని పించింది. అందుచేత సంవత్సరాల తరబడి పోగుజేసుకున్న దాన్నంతా తన్నేశాను. అన్నింటినీ నిరాకరించాను. నా జీవిత లక్ష్యం వైపు పురోగమించాను.

"ఇంత చెయ్యడానికి నా వెనుక నా గురువు వున్నారు. ఆయన సహాయంతో నేను నిరంతరం ధ్యానంలో, ఒక్కోసారి సమాధి స్థితిలో వుండేవాడిని. అటువంటి సమయాల్లో నేను ఏ విషయంలో తప్పిపోతున్నానో, లేక, తప్పిపోయానో ఆ సంగతి నాకే స్పష్టంగా తెలిసేది. వెంటనే నా పొరపాటు నేనే సవరించుకునేవాడిని. ఆ కాలంలో ప్రభువు మైత్రేయుని రూపాన్ని దృష్టిలో పెట్టుకుని ధ్యానించాను. అనేక అనుభవాలు కలిగాయి. ఎన్నో దివ్య దృశ్యాలు కనుపించాయి.

"నేనొకసారి ఒకచోట నిశ్చలంగా నిలబడివున్నాను. ఓ దివ్య పురుషుడు నావేపు నడచి వస్తున్నారు. ఆయన్ని చూసి నా హృదయం అప్రయత్నంగా ఆనందంతో పరవశించింది. నా ఆత్మబలాన్ని పుంజుకుంది. నా చుట్టూ పచ్చని చెట్లు. ఎగిరే పిట్టలు. సమస్తం ఊహాతీత నిశ్శబ్దంలో వున్నాయి. ఆ నిశ్శబ్దం - ఆకాశంలోంచి పిడుగుపడ్డ తర్వాత ఏర్పడ్డ నిశ్శబ్దం లాగున వుంది. నాలోపలా, బైటా శాంతి ఆవరించింది. నన్ను చూస్తున్న ఆ దివ్యపురుషుణ్ణి నేనూ తదేకంగా చూశాను. క్రమంగా నా దృష్టి నాకు తెలియకుండా దిగంతాలు దాటింది. నా మనసు అన్నింటినీ అర్ధంచేసుకోవాలని చూసింది. ఆ క్షణాన నా హృదయంలో ఓ నూతన ప్రేమ ఉద్భవించింది. అది సమస్తాన్ని ఆలింగనం చేసుకుంది. ఓ కొత్త ప్రభావం నన్ను పులకరింపజేసింది.

"నేను ఆ దివ్యపురుషుణ్ణి అనుసరించాను. ఎగిరే పిట్టలు, పరిగెత్తే మబ్బులు, పొడవైన చెట్లు – సమస్తం ఆయన లోంచి దర్శనమిచ్చాయి. వాడిన ఆకులు సుకుమారంగా వూగుతూ నాకు స్వాగతం చెప్పాయి.

"నా కాళ్ళ కింద బురద. నా తలపై చెట్లకొమ్మలు. నా చుట్టూ మాట్లాడుకునే పల్లెటూరి వాళ్ళు. ఆకాశంలో పలకరించుకునే పక్షులు. ఆయన ఆగకుండా నడుస్తున్నారు. మొరిగే కుక్కలు ఆయనలోంచి నామీదికి దూకాయి. పూలతోట దేవలోకం మాదిరిగా, పువ్వులు దేవతల్లాగ కనుపించాయి.

"అస్తమిస్తోన్న సూర్యుడికి అభిముఖంగా నిలబడ్డాను. సంధ్యారుణ కాంతిలో వెలిగిపోతున్న ఒక బాట వెంట ఆయన నడచి వస్తున్నారు. నేను ఆయన్ని అనుసరించాను. మేమిద్దరం కొంతదూరం నడిచాం. ఆయన నాగదిముందు ఆగారు. నేను ఆయనలోంచి నా గదిలోకి వెళ్ళాను. గదిలో నేను ఎటు తిరిగితే అటూ ఆయన వున్నారు, నావంక తదేకంగా చూస్తూ. నేను ఆ క్షణాన సమస్తాన్ని ఆయనలోంచి చూశాను. గది ఆయన మహిమతో నిండింది. ఆయన ప్రభావం నన్ను చకితుణ్ణి చేసింది. అంతటా ఆయన కాంతి నా అంతరంలో శాంతి. అది సమస్తాన్ని ప్రకాశింపజేసింది. ఆయన అనంతంగా నా ముందు, వున్నారు."

• • •

"మరొకరోజు సూర్యోదయంవేళ నేనొక గదిలో ఒంటరిగా నేలమీద పద్మాసనంలో కూర్చుని ఏవేవో కలలు కంటున్నాను. నల్లని-తెల్లని మబ్బులతో నిండిన ఆకాశం కిటికీలోంచి కనుపించింది. దూరంగా పర్వతాలు. పచ్చని చెట్లపై నల్లని పక్షులు. సమస్తం సూర్యునికి స్వాగతం చెపుతున్నాయి. నా కుటీరం చుట్టూ చిన్న చిన్న కుటీరాలు.

"కొంతసేపటికి లేత ఎండనీ, నీలంపర్వతాలనూ మరచిపోయాను. పక్షులు నిశ్శబ్దమయ్యాయి. అంతటా బంగారు వర్ణపు సూర్యకాంతి. నాకు క్రమంగా దేహస్ఫురణ పోయింది.

నా అవయవాలు కదలకుండా బిగుసుకుపోయాయి. ఏబంధమూ, బాధ్యతా, భారమూ లేకుండా హాయిగా, శాంతంగా వున్నాను. అంతుతెలీని లోతుల్లోంచి గొప్ప ఆనందం నా హృదయాన్ని నింపింది. నా మనసు దేనికోసమో ఆరాటపడుతూ చురుకుగా, ఆశగా, ఆతృతతో ఎదురుచూస్తోంది. నేను ఏకాగ్రచిత్తంతో వున్నాను. క్రమంగా ప్రపంచమే నా కళ్ళ ముందు నుంచి వింతగా అదృశ్యమైపోయింది. ఆ సంగతి నాకు అద్భుతంగా, ఆశ్చర్యకరంగా వుంది.

"ఆక్షణాన నేను గొప్పశక్తితో నిండిపోయాను. అంతలో తూర్పుగాలి వీచి, అలసిన ప్రపంచాన్ని శాంతపరచింది. ప్రపంచానికి అంతకూ తెలిసిన ఒకాయన నా ఎదురుగా, ప్రశాంతంగా పద్మాసనంలో కూర్చుని వున్నారు. ఆయన కాషాయ వస్త్రాలు ధరించి, సహజసమాధిస్థితిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్నారు. ఆయనే గురువులకు గురువైన, బుద్ధభగవానులు."



"ఇంకొకసారి నేనొక మిత్రునితో కలిసి అందమైన ఒక కొండ ప్రాంతంలో తిరుగుతున్నాను. ఆ ప్రదేశం పచ్చని చెట్లతో, ప్రవహించే సెలయేళ్ళతో, పలకరించుకునే పక్షులతో ఎంతో అందంగా వుంది. కొంతదూరం వెళ్ళాక, "ఈ ప్రదేశం ధ్యానానికి అనుకూలంగా వుంది," అన్నాను అతనితో.

'అవునన్నట్లు అతడు తల వూపి, నన్ను ఒంటరిగా వదలి వెళ్ళిపోయాడు. నేను ఆ చెట్ల మధ్య కొంతసేపు తిరిగాను. అంతలో అకస్మాత్తుగా నా ముందు ఓదివ్య మంగళ స్వరూపం సాక్షాత్కరించింది. ఆయనే నా గురువు - నా ప్రియతముడు. - నా ప్రభువు - నా బోధకుడు - నా మార్గదర్శి. ఆయనే

నా ఆనందం. ఆయనే సత్యం - శివం - సుందరం. అటు వంటి విరాట్ పురుషుడు నావైపు నడచి రావడం చూశాను. అమితాశ్చర్యపడ్డాను. ఆయన సౌందర్యాన్ని తిలకిస్తూ అక్కడే నిలబడ్డాను. ఆయనలోంచి సమస్తాన్ని చూశాను. దివ్యమైన, మహిమాన్వితమైన, అసలు పరమాత్మ అయిన ఆయన ఆ క్షణాన నాకు ప్రత్యక్షం కావాలని నా అంతరాత్మలో గట్టిగా అనుకున్నాను, అంతకుముందు. దాని ఫలితమే, ఆయన దర్శనం. ఆయన అక్కడే, అట్లానే నిశ్చలంగా నిలబడ్డారు. నేను ఆయన లోంచి నడచి, నా గదిలోకి వెళ్ళాను. నాతోపాటు ఆయనా నా గదిలో ప్రత్యక్షమయ్యారు.

"ఆ క్షణాన ఆయన నా గదిలో వుండటం, ఆయనలోంచి నేను సమస్తాన్ని చూడ్డం నాకెంతో సంతోషాన్ని కలిగించింది. చెట్లు-పిట్టలు-మనుష్యులు-ఆకాశం అన్నీ-ఓ చిన్న చీమ - గడ్డి పరక - కొలనులో చేప, గాలిలో తేలియాడే సీతాకోకచిలుక, అన్నింటినీ ఆయన తన సౌందర్యంతో నింపుతున్నట్లే వుంది. శక్తివంతమైన, ఊహాతీతమైన, తీవ్రమైన అటువంటి ఆనందాన్ని పొందటం, అటువంటి అమూల్యాభరణం నాకు లభించడం, వినోదపరచి-ఉత్సాహపరిచే అటువంటి చెలికాడు నాకు శాశ్వతంగా దొరకడం నాకెంతో మహదానందంగా వుంది.

"ఆ సంతోషాన్ని ఏదో రాగాన ఆలాపించాలనిపించింది. కాని, అది చాలా కష్టం. దాన్ని చూడ్డం, తెలుసుకోవడమంటే, ఆయన మనకు దూరంగా, విడిగా, ప్రత్యేకంగా లేరనీ, ఆయన మనలోనే వున్నారనీ, ఆ సత్యాన్ని మనమంతా గుర్తించాలనీ నాకెంతో అనిపించింది. దాన్ని ఏ విధంగా మీ అందరి దృష్టికి తీసుకురాగలను ? "ఒకటే సత్యం, ఒకే దేవాలయం, ఒకరే కాంతి ప్రదాత వున్నారని నేను మీకు ఏవిధంగా చెప్పి, ఒప్పించగలను ?" అని పరి పరి విధాల ఆలోచించాను.

ఆ మరుక్షణాన నాకు మరో ఆలోచన వచ్చింది - మన మంతా కలసి ఏమార్గాన వెడితే ఆ ప్రదేశం చేరుకోగలం?" అని. కాని, మనమంతా మనకు తెలియకుండానే, మన ఇష్టం వచ్చిన మార్గాన వెడుతున్నా, మన మందరం అక్కడకే వెడుతున్నాం. కొందరు మెట్లమీదుగా, కొందరు చేతికర్రల సాయంతో, మరికొందరు రక్తంచిందే కాళ్ళతో, ఇంకొందరు సంపూర్ణ ఆరోగ్యంతో- ప్రతి ఒక్కరూ తమకు తెలిసిన, వీలైన, సులువైన దగ్గరదారి వెతుక్కుంటూ అందరూ అనంతంగా అటే వెడుతున్నారు.

"మీరూ ఆ పరమసత్యం గుర్తించాలనీ, మీకూ చాలినంత బలాన్ని, అవసరమైనంత అవగాహనాపటిమనూ ఇవ్వాలనీ, మీచుట్టూవున్నవన్నీ మీకోసమే వున్నాయనీ, మీరు వాటన్నింటినీ తెలుసుకోవాలనీ నా కోరిక. మీవైన వాటిని ఎవరూ మీనుంచి తీసుకోలేరు. ఆ అమూల్యాభరణాల్ని ఎవరూ మీ నుంచి లాక్కోలేరు.

"మన కష్టాలు, బాధలు, దుఃఖాలు, యాతనలు అన్నీ - అంతా ఆయనే. ఏదీ ఆయన్నించి విడిగా లేదు. ఆయనే సత్యం. ఆయన ఎప్పుడూ మనతోనే వున్నారు. కనుక "మనం ఎప్పుడూ ఒంటరిని - బాధితుణ్ణి," అని అనుకోకూడదు. అటువంటి అయనకోసం సమస్త ప్రపంచం, సర్వకాల సర్వావస్థల్లో ఆశతో ఎదురుచూస్తోంది గనుక, మనం ఎక్కడకు వెడితే అక్కడకు ఆయన మనతో కలిసి మిత్రుడుగా అనుసరిస్తారు. ఆయన ఎప్పుడూ మనల్ని వదలరు. స్నేహితుడుగా మనం ఆయనతో మాట్లాడవచ్చు. దైవంగా, ఆయన పాదాలు తాకవచ్చు.

''అటువంటి సదవకాశాన్ని జీవితంలో ఎవరూ జార విడుచుకో కూడదు. ఆయన తమ ఒక్కరికే కావాలని కాంక్ష పడకూడదు. ఆయన్నీ, ఆయనద్వారా పొందే ఆనందాన్నీ మనం అందరితో కలసి పంచుకోవడానికే చూడాలి. ఆయనే అంతిమజ్ఞానం. ఆయనే దివ్యతేజస్సు. మనం ఆ పరమ సత్యాన్ని తీవ్రంగా ప్రేమిస్తే, సమస్తాన్ని ప్రేమించగలం. "సత్యం" అనే దానికి శాంతి - ఆనందం - అందం - ఓదార్పు - సుఖం" అనేవి వుంటే, అవి అప్పుడు అందరికీ లభ్యమౌతాయి. అప్పుడు మనం వాటిని ఒకరితో ఒకరం పంచుకోవాలనుకుంటాం.

"నేను పొందిన ఆ దివ్యానుభూతిని కొంతసేపు ఎట్లానో పోగొట్టుకున్నాను. ఆ దివ్యానుభవమే, నా పూలతోట - నా అమూల్యాభరణం - నా ప్రియతముడు - నా లక్ష్యం, - మోక్షం. అటువంటి దాన్ని పొందేందుకు నేను ఎంత బాధ పడ్డానో! ఎంత మధన పడ్డానో!! ఆ మహదానందం నాలో లేని, ఆ క్షణకాలం, నేను ఉక్కిరిబిక్కిరై పోయాను. నాదైన దేదో అది నాలోంచి పోయిందనిపించింది. ఆ క్షణాన " మాయ " నన్ను కప్పేసిందిగావును, నేను దేన్నీ గమనించకుండా గందర గోళంలో పడ్డాను. తికమకతో ఆయనకోసం అంతటా ఒకటే వెదికాను.

" కొంతదూరం వెళ్లాక, కొంతసేపు వెదికాక, నా కళ్ల ముందు మిరుమిట్లు గొలిపే కాంతి కనుపించింది. ఓ చెట్టుముందు ఆయన ప్రత్యక్షమయ్యారు. ఆయనలోంచి చెట్లనూ, సమస్తాన్ని చూశాను. ఆయన్ని చూడ్డం, ఆయన్ని పోగొట్టుకోవడం, ఆయన కోసం విరహపడి వెదకడం, తిరిగి ఆయన్ని పొందడం అంతా ఒక అందమైన ఆటగా, ఆనందంగా వుంది. ఆనాటినుంచి ఆయన శాశ్వతంగా నాతోనే వున్నారు.

"నేను చూసినదేదో అదే మీరూ చూడాలనుకోను. ఆయన సౌందర్యాన్ని, తేజస్సును, మహిమను, వాస్తవాన్ని - మీరూ మీ కళ్లతో చూడాలనుకుంటాను. ఇంతగా నేనెందుకు చెపుతున్నా నంటే, ఆయన నాకు బాగా తెలుసు గనుక.

"నాకు తెలిసినదేదో దాన్నే నేను 'ఈశ్వరరాజ్యం,' అంటాను. మీరు కూడా ఆ ఈశ్వరరాజ్యంలో ప్రవేశించి, అందు ఎగజిమ్మే అమృత ధారలను సేవించమంటున్నాను. ఎందు కంటే, మీకు మీరే ఆనందంగా వుండేందుకు. ఈశ్వరరాజ్యంలో ప్రవేశిస్తే ఇంక మీరు ఈ ప్రపంచాన్ని కోరరు. అందుకే అంత గట్టిగా చెపుతున్నాను.

"ఈశ్వరరాజ్యమంటే, అసలు ఏమిటో అర్ధంకాకపోతే, జీవితమే వ్యర్ధం. దాన్ని తెలుసుకుంటే, శాశ్వతానందంలో జీవించవచ్చు. ఆనాడు మీకు మీరే నిజమైన సృష్టికర్తలూ, బోధకులూ, ఉపదేశకులూ అవుతారు. విశ్వప్రేమికులూ అవు తారు. కనుక మీరు ఆ పరమసత్యం కోసం గట్టిగా వెదకండి. దానికోసం బాధలు, యాతనలు, వేదనలు, పడండి. ఒక్క సత్య సందర్శనం కోసమే జీవించండి. అప్పుడే మీ అనుభవాల్ని ప్రపంచానికి అందివ్వగలుగుతారు, మీ ఆనందాన్ని అందరితో కలసి పంచుకోగలుగుతారు," అన్నాడు.

ఆ దివ్యదృశ్యాల తాలూకు అనుబవాలు కృష్ణమూర్తికి ఏమాత్రం తృప్తిని ఇవ్వలేదు. ఆ రూపాల వెనకనున్న అసలు సత్యాన్ని తెలుసుకునేందుకు ఇంకా అన్వేషించాడు, ధ్యానిం చాడు. అతని సాధన తీవ్రమయ్యేకొద్దీ, ఇంకా ఎన్నో దివ్య దృశ్యాలను చూశాడు. వాటినుంచి కూడా తృప్తి కలగక పోయేప్పటికి, వాటన్నింటినీ చిందరవందరచేసి, చివరకు వాటినే అనుమానించాడు.

కృష్ణమూర్తి తీవ్రమైన సంశయాగ్నితో తనకు దర్శనమిచ్చిన రూపాలన్నింటినీ నిర్భయంగా, నిస్సంకోచంగా పరీక్షించాడు. ఆ విధంగా తన ముందున్న మాయ తెరల్ని చింపిపారేశాడు. తన స్వంత కలల వెనక్కి వెళ్ళాడు. గట్టిగా ధ్యానించాడు. తీవ్రంగా అన్వేషించాడు. తత్ఫలితంగా విశ్వాత్మలో శాశ్వతంగా ఐక్యమైనాడు. సమస్తరూపాలూ, ప్రభువులో ఇమిడివున్నట్లు గమనించాడు. దానితో ఆ దృశ్యాలన్నీ ఎప్పటికీ తిరిగి కనపడకుండా అదృశ్యమైనాయి. తానొక్కడే సమస్త విశ్వానికీ కేంద్రంగా మిగిలాడు. ఆత్మ విచారణ వల్ల చివరకు తానూ మిగలలేదు.

కృష్ణమూర్తి ఉనికి శాంతిగా వుండటంచేత అతనిచుట్టూ ఎందరో చేరారు. అతను ఎక్కువకాలం ధ్యానంలో గడిపేవాడు. అతని ఔన్నత్యం, పరిపూర్ణత, సౌందర్యం, స్పష్టత–అన్నింటినీ మించి వుండేవి. అతనేం మాట్లాడినా ఎవరిని, దేనిని తాకినా అంతా, అన్నీ అందంగా వెలిగిపోయేవి. అతని ప్రతిమాటా స్పష్టంగా, సహజంగా వుండేవి. "సూర్యకాంతికి మొగ్గ విచ్చుకున్నంత సహజంగా ప్రియతముని చేరుకోవాలి," అనేవాడు కృష్ణమూర్తి.

"నువ్వు అన్వేషించే, ఆశించే ఆనందం, దూరాన ఎక్కడో లేదు. అది ప్రతి గులకరాయిలోనూ, ప్రతి గడ్డిపరకలోనూ వుంది," అని మహాత్ములైన మైత్రేయులు తనకు దర్శనమిచ్చి చెప్పారని చెప్పాడు, కృష్ణమూర్తి.

ఆరోజుల్లో రాజగోపాల్ కృష్ణమూర్తికి ఏవేవో చెప్పి, ఒకటే నవ్వించేవాడు. అతని తెలివికి, చురుకుదనానికీ, మాటకారితనానికీ, చమత్కారానికీ కృష్ణాజీ ఆకర్షితుడైనాడు. లేడీ ఎమిలీ అతన్ని ''సెయింట్ పీటర్''తో పోల్చింది.

కృష్ణమూర్తి బుద్ధుని ఫొటో చూసినప్పుడల్లా, "నేను ఆయన మాదిరిగా వుండబోతున్నాను" అనేవాడు. అంతేకాదు, బుద్ధుని ఫొటో చూసినా, బుద్ధుని పేరు విన్నా, ఆయన తలంపు కలిగినా కృష్ణమూర్తి పరవశించిపోయేవాడు. తన్మయత్వంలో పడిపోయేవాడు. బుద్ధుని నిరహంకార స్థితి అతనికి ఎంతో ఇష్టం. "బుద్ధుని ప్రేమకు హద్దులు, అవధులు లేవు. అది నిస్వార్థ ప్రేమ. అది బ్రహ్మాండమైనది, తిరుగు లేనిది," అన్నాడు కృష్ణమూర్తి ఒకసారి.

❁ ❁ ❁

కృష్ణమూర్తికి కలిగిన అనుభవాల సంగతి ఎవరైనా అతన్ని అడిగితే, వాటి వివరాలు తెలుసుకోవాలని ప్రయత్నిస్తే, అతను అకస్మాత్తుగా అపస్మారకంవంటి స్థితిలోకి వెళ్ళి తల వంచేసేవాడు. కాని, కృష్ణమూర్తిలో బాహ్యంగా చాలా మార్పు వచ్చింది. అతను నిరంతరం ద్యానంలో వుండేవాడు. చూసే వాళ్ళకు అతనిలో ఇంకా ఏదో సాధన తీవ్రంగా జరుగుతోందని పించేంది. ఆ సందర్భంలో "ఈ సాధనా, శోధనా, యాతనా నాకు కావలసే జరుగుతున్నట్లుంది. నేను ఈ మార్గాన నడవ వలసిందే ననుకుంటాను," అన్నాడు.

కృష్ణమూర్తి అనేక కష్టాలు, యాతనలుపడి చివరికి ఈశ్వరరాజ్యం చేరుకున్నాడు. దానికి అతని పరిభాషలో— "కరుణాసముద్రం–స్వేచ్ఛాపథం–పూలతోట–సత్యం–ఆనందం–జీవితం, మోక్షం" అని పేర్లు. అతను క్రమంగా సమస్త బంధాలనుంచీ విముక్తుడయ్యాడు. కాంతిని చేరుకుని, శాంతిని పొందాడు. ఈశ్వరరాజ్యాన్ని తనలో శాశ్వతంగా స్థాపించు కున్నాడు. ఆ మహదానందంలో, "నేను దర్శించిన ఈశ్వర రాజ్యం దగ్గరకు మిమ్మల్ని తీసుకువెళ్లాలని నేను అనుకుంటు

న్నాను. ఆ మార్గంలో నాకు కలిగిన అనుభవాల్ని మీకు చెప్పాలనుకుంటున్నాను. ఎందుకంటే, దాని విషయమై నా మనసులో వున్న ప్రత్యేకమైన భావాల్ని, స్పష్టమైన అభిప్రాయాల్ని మీకు తెలియపరచాలనే ఉద్దేశ్యంతో. అంతే! ఈశ్వర రాజ్యాన్ని తెలుసుకోవాలనుకుంటే, మీరు ఆయనలో ఒక భాగమై పోవాలి. ఆ పూలతోటలో మీరూ ఒక పూవై పోవాలి," అన్నాడు.



ఒహైలో కృష్ణమూర్తి మొదటినుంచీ తీవ్రసాధన చేశాడు. తన పనులన్నీ – ఆఫీసు ఉత్తరాలు – హెరాల్డ్ పత్రిక ఎడిటోరియల్స్ – కాలిఫోర్నియాలో స్టార్ సంస్థను అభివృద్ధి పరచడం – పరిసరాల్లో ఉపన్యాసాలు ఇవ్వడం - ఇండియాలో స్కూలు స్థాపనకు డబ్బు పోగుచేయడం వంటి పనులు స్వయంగా చేసేవాడు.

ఆ సందర్భంలో లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "నేను ఇంకా ఇంకా కోపిష్టిని అవుతున్నాను. క్షణాల మీద కోపం వస్తోంది. చాలా అలసిపోతున్నాను. నువ్వూ, మీరంతా నాకు దగ్గరగా వుండాలనుకుంటాను. ఇదంతా నాకూ, ఇతరులకూ భయంకరంగా వుంది. ఈ సమయంలో హెలెన్ ఇక్కడవుంటే బావుండుననిపిస్తోంది. కాని, అది అసాధ్యం.

నా దేహం చాలా యాతనలు పడుతోంది. నేను బాధలూ పడుతున్నాను" అన్నాడు.

సిడ్నీనుంచి లెడ్‌బీటర్ "Dr Rocke" అనే ఆమెను ఒహై పంపించారు–కృష్ణమూర్తి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక

స్థితి–గతులు తెలుసుకోమని. ఆమె ఒహై వచ్చి, కొన్నాళ్ళు కృష్ణమూర్తితో వుంది. కాని, ఆమె ఏమి గమనించి, ఏం రాసుకుందో కాని, అదేమీ తెలియరాలేదు.

❀ ❀ ❀

కృష్ణమూర్తికి సొంత ఇల్లు వుండాలంటూ 1923–ఫిబ్రవరిలో "బ్రదర్స్ ట్రస్ట్" వారు పైన్ కాటేజీకి దగ్గరలో ఒక ఇల్లూ, ఆరు ఎకరాల భూమీ కొన్నారు. ఆ ఇంటికి 'ఆర్య విహార్,' అని పేరు పెట్టారు.

హాలెండ్ దేశస్థుడైన "బెరాన్ వాన్ పల్లార్డల్" అనే అతను తనకున్న ఐదువేల ఎకరాల భూమినీ, దాని మధ్యనున్న పద్దెనిమిదవ శతాబ్దంనాటి పెద్దకోటవంటి ఒక పురాతన భవనాన్ని సర్వహక్కులతో కృష్ణమూర్తికి ఇస్తే, అతను ఆ ఆస్తి తీసుకోవటానికి నిరాకరించాడు. అప్పుడు అక్కడ ఆ ఆస్తికి ఒక ట్రస్ట్ ఏర్పడింది. దానికి కృష్ణమూర్తే ప్రెసిడెంట్. "ది ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్ ది ఈస్ట్'' అనే ప్రపంచ సంస్థ కేంద్ర కార్యాలయాన్ని ఆ భవనంలో ఏర్పాటు చేశారు. ఆ భవనాన్ని "ఎర్డే" భవనమంటారు. ఆ భవనానికి ఒక మైలు దూరంలో "ఆమ్మేన్'' అనే వూరు వుంది. అక్కడ "స్టార్'' మొదటి సమావేశం 1924 లో జరిగింది.

ఆ జూన్‌లో కృష్ణమూర్తి, నిత్యానందం ఇంగ్లండు వెడితే అక్కడ లేడీ ఎమిలీ కృష్ణమూర్తిని ఒహై అనుభవం గురించి అడిగింది. వెంటనే అతను అపస్మారకం స్థితిలో పడిపోయాడు. ఆమె కంగారుపడితే, "భయపడకండి. ఎవరు ఎప్పుడు అతన్ని ఆ అనుభవం గురించి అడిగినా, అట్లా అయిపోతున్నాడు'' అని నిత్యానందం ఆమెతో చెప్పాడు.

తాను కళ్ళారా చూసిన ఆ సంగతి లేడీ ఎమిలీ, అనీబిసెంట్‌కు రాసింది, "కృష్ణమూర్తిలో బాహ్యంగా కొన్ని మార్పులు వచ్చాయి. అతని ముఖం గొప్ప తేజస్సుతో వెలిగిపోతోంది. ప్రతి క్షణం గతించిపోతున్న వాటికి అన్నింటికీ ఎరుకలో వుంటున్నాడు. కేంద్రీకృతమైన ఏకాగ్రత అతనిలో వ్యక్తమౌతోంది. అతనిలోంచి ధారావాహినిగా గొప్పమాటలు వెలువడుతున్నాయి. చివరికి ఉపన్యాసాల్లో కూడా సులభంగా తేలికగా మాట్లాడగలుగుతున్నాడు. జీవితాన్ని గొప్ప అందంగా ఆనందంగా, ప్రేమమయంగా చక్కదిద్దుకుంటున్నాడు,''అని.

ఒక మిత్రుడు కృష్ణమూర్తిని "టైరాల్" అనే చిన్న గ్రామానికి ఆహ్వానిస్తే అతనితోపాటు మేరీ, బెట్టీ, మాంజియర్లీ, కార్డెస్, పట్వర్ధన్ దంపతులు వెళ్లారు. ఆరోగ్యం బాగాలేక పోవడంవల్ల మిస్ డాడ్జి వెళ్ళలేదు. అది చాలా అందమైన ప్రదేశం. అక్కడ ఒక చిన్న సెలయేరు పారుతోంది. అక్కడ కొంతకాలం, కృష్ణమూర్తి, అతని మిత్రులు ఆనందంగా గడిపారు. ఆ తర్వాత వారంతా కలిసి అనేక అందమైన ప్రదేశాలు తిరిగి చూశారు.

కృష్ణమూర్తి విషయంలో "హెలెన్-రూత్"ల మధ్య మన స్పర్ధలు వచ్చాయి. రూత్ చాలా అందంగా వుంటుంది. ఆమెలో ఇతరులను ఇట్టే ఆకర్షించేగుణం వుంది. కాని, కృష్ణమూర్తి హెలెన్‌తో చనువుగా వుండటం, రూత్‌కి కంటకంగా వుంది. వారి గొడవలకు అదీ కారణం.

ఆగస్ట్‌లో కృష్ణమూర్తికి మళ్ళా శారీరక యాతనలు ఆరంభమయ్యాయి. హెలెన్ రాత్రిం - బవళ్ళు కృష్ణమూర్తికి సేవలు చేసింది. కృష్ణమూర్తి అప్పుడప్పుడూ మంత్రాలు పఠించేవాడు. ఏవేమో చదివేవాడు.

ఆ శారీరక యాతనలు సెప్టెంబరులో ముగిశాయి. ఇరవయ్యో తేదీ రాత్రి, " ఇంక ఇదే చివరి రాత్రి. కాని, ఇది ఒహైలో కొనసాగుతుంది. తప్పదు. అదంతా మీ ఇద్దరి మీదా ( నిత్యానందం - రోజలిండ్ ) ఆధారపడివుంది. మీరే దీన్ని (కృష్ణమూర్తి దేహాన్ని) చూసుకోవాలి. ఎందుకంటే, ఒహైలో ఇది మరింత తీవ్రంగా వుంటుంది. దాని తర్వాతే, ఫలితం. కనుక మీరు శ్రద్ధగా పనిచేయాలి. మీరు ఏమాత్రం అశ్రద్ధ చేసినా, ఇది చెడిపోతుంది. జాగ్రత్త! " అని కృష్ణమూర్తి నిత్యానందానికి, హెచ్చరికగా చెప్పాడు.

ఆ సంగతులు నిత్యానందం లెడ్‌బీటర్‌కి రాస్తో, "ఇదంతా నాకు అయోమయంగా వుంది. నాకేం అర్థం కావడం లేదు. నా ప్రియమైన కృష్ణమూర్తికి ఏం జరుగుతుందో, ఏమో!" అన్నాడు.



కృష్ణమూర్తి తిరిగి ఒహై వచ్చాడు. అప్పుడు అక్కడ, పైన్ కాటేజి బాగుచేస్తోంటే, "దాన్ని పాడుచేస్తున్నారో!" అని గొడవ చేశాడు కృష్ణమూర్తి. ఒహైనుంచి కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "ఇదంతా నాకు కావలసే జరుగుతోంది. నేను ఈ యాతనలు పడవలసిందే! ఇదంతా ఏర్పాటై వుంది. స్త్రీ-శక్తి దీనికి అవసరం లేదనుకుంటాను. గత పదిరోజులుగా వెన్నెముక - వీపు మొత్తం - మెడ దగ్గర విపరీతమైన బాధలు. ఏదో శక్తి - దాన్ని ఏ పేరుతోనైనా పిలవవచ్చు, అది నా వెన్నెముకలోంచి మెడవరకు వచ్చినట్లు వుంది. అక్కడ అది రెండుగా విడినట్లు అనిపించింది. అవి తిరిగి నా తలలో ప్రవేశించి - ఒకటి కుడిపైపుకి - మరొకటి ఎడం వైపుకి వెళ్ళి, కనుబొమల మధ్య కలిశాయి. అక్కడ ఒక జ్వాలలాంటిది వుంది. ప్రభువును చూశాను. గురు దర్శనమైంది. ఇదంతా ఒక రాత్రి జరిగింది. అది అద్భుతమైన రాత్రి," అన్నాడు.

ఆ సంగతినే "కృష్ణమూర్తికి మూడోకన్ను తెరచుకుంది," అని అనీబిసెంట్‌కు రాశాడు, నిత్యానందం.



కృష్ణమూర్తి శారీరక పరిస్థితులు చూసి అతనికి సేవలు చేయడానికి లెడ్‌బీటర్ "డాక్టర్ రోకీ" అనే ఆమెను సిడ్నీనుంచి పంపించారు. ఆమె కథనం ప్రకారం కృష్ణమూర్తికి జరిగిన సంగతులకు లెడ్‌బీటర్ ఆశ్చర్యం వ్యక్తం చేశారు. అంతేకాదు, "కృష్ణమూర్తి ఆంతర్యంలో ఏం జరుగుతుందో గమనించడం కష్టం," అని కూడా అన్నారు, లెడ్‌బీటర్.

"కృష్ణమూర్తే రాబోయే జగద్గురువు. తిరిగి వస్తానన్న ఏసుప్రభువు," అని అనీబిసెంట్ ఆవేశంతో అనడమేకాక, "ఇప్పుడు తమకు కావలసిన ప్రధాన శిష్యులను ఎన్నుకుంటారు" అంటూ పన్నెండుమంది శిష్యుల్లో అర్హులుగా ఏడుగుర్ని ఎన్నిక చేసింది. వారు - లెడ్‌బీటర్, జినరాజదాస, జార్జి అరండేల్, ఆస్కార్ కిల్లర్ స్ట్రాక్, రుక్మిణీదేవి, వెడ్జివుడ్. వారిలో అనీబిసెంట్ ప్రధాన శిష్యురాలు. అప్పటినుంచి కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సమాజ సభ్యులకూ, ప్రపంచ సంస్థ సభ్యులకూ "ప్రిన్స్ ఆఫ్ వేల్స్," అయ్యాడు.

కృష్ణమూర్తి ఎక్కడకు వెళ్ళినా ప్రజలూ, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు, ప్రపంచ సంస్థ సభ్యులు గుమికూడి బ్రహ్మ రథం పట్టేవారు. కొన్నిచోట్ల అతనికి దారిపొడవునా పువ్వులు పరిచారు. అతన్ని ప్రధాన అతిథిగా, ప్రముఖ వ్యక్తిగా గొప్పలుచేసి, గౌరవించి, సభలు, సమావేశాలు, చర్చలు ఏర్పాటుచేసి, పూలమాలలు వేసి, ఫొటోలుతీసి, అతి వైభవంగా ఆహ్వానిస్తే, మరోపక్క "యువరాజులాగ సమస్త భోగభాగ్యాలలో పెరిగినవాడు, ఆధునిక సినీస్టార్ మాదిరి జీవితం గడిపేవాడు, దేశదిమ్మరై జిప్సీ జీవితం గడిపేవాడు, సంవత్సరానికో సారి ప్రపంచం చుట్టేవాడు, లాగుజేబుల్లో చేతులు పెట్టుకుని పేవ్‌మెంట్‌మీద హాయిగా - సరదాగా తిరిగేవాడు, టెన్నిస్ -

గోల్ఫ్ ఆడుతూ గెంతేవాడు - అటువంటి వానికేం తెలుసు దుఃఖమంటే ఏమిటో బాధ అంటే ఏమిటో? వాటిగురించి చెప్ప డానికి జీవితంలో ఇతనికి ఏం అనుభవముంది? అసలు అతనేం బాధలు, కష్టాలు, దుఃఖాలు, యాతనలు వేదనలు అనుభవించాడు? కనీసం అతనికి ఆవగింజలో అరవయ్యో వంతుకూడా తెలియదే! పోనీ తన స్వంతవాళ్లు ఎంత దారుణ మైన జీవితం గడుపుతున్నారో అదైనా తెలుసా, అతనికి? అటువంటివాడా ప్రజలకు కాంతిని చూపి, శాంతినిచ్చేది? సత్యాన్ని తెలిపేది? ప్రపంచాన్ని నడిపేది? '' అని కొందరు ఆశ్చర్యపోయేవారు.

"మూఢమైన భక్తి-విశ్వాసాలతో, ఆచారాలతో, సాంప్రదాయాలతో నిండిన సామాన్యులు అతని సంరక్షకులుగా వుండి, అతన్ని మహారాజులాగ చూసుకుంటూవుంటే, వారి రెక్కలకింద సురక్షితంగా కాలం గడిపే కృష్ణమూర్తికి ఈ ప్రపంచంలో దుఃఖం, బాధ, దారిద్ర్యం, అశాంతి ఏమర్థమౌతాయి?" అని మరికొందరు అనేవారు.

ఎందుకంటే, కృష్ణమూర్తి చూడ్డానికి బ్రాహ్మణ యువకుడుగా, పరిశుభ్రంగా, చక్కని బట్టలు వేసుకుని సంస్కారవంతుడుగా వుండేవాడు. అందుచేత కొందరికి అతని యెడల అటువంటి అనుమానాలు కలిగాయి - చాలామందికి ముఖ్యం, సమాజ సభ్యులకు కూడా అతని విషయం అనుమానంగానే వుండేది. కానీ, ఏదీ నిర్ధారణచేసి మాట్లాడలేకపోయేవారు. ఏమైనా కృష్ణమూర్తి ఏం చెపుతాడో వినడానికి మరికొందరు పెద్దలు-వివేకవంతులు-ప్రముఖులు - మేధావులు - నాగరికులు ఎదురు చూశారు. చివరికి కృష్ణమూర్తి "నేను ఏసు ప్రభువులో ఐక్యమైనాను. నేను ఆయనలో ఐక్యమైనానంటే, దానికి మీరు

ఏపేరైనా పెట్టుకోండి. దాన్ని ఏమైనా అనండి. అది మీ ఇష్టం. మీరు ఎంతకీ సత్యాన్ని తెలుసుకోవాలని మాత్రం చూడ్డంలేదని తెలుస్తోంది. సత్యమంటే ఏమిటో మీకు తెలియకపోగా, తెలిసినట్లు నటిస్తో, బతుకుతున్నారు. సాహసించి ఇతరులకు బోదించయత్నిస్తున్నారు. మీరు బందీలై హద్దులో, నిబంధనల్లో బతుకుతూ పరిమితంగా జీవిస్తో ఇతరులను విముక్తి పరచాలని చూడ్డం హాస్యాస్పదమైన సంగతి మీరు స్వేచ్ఛాపరులై, నిర్భయులై మిమ్మల్ని మీరు పూర్తిగా తెలుసుకోనిది ఏది సత్యమో, ఏది అసత్యమో మీరెట్లా నిర్ణయించగలరు ?'' అన్నాడు.

ఆ సందర్భంలో కృష్ణమూర్తి అనేక ఉపన్యాసాలు ఇచ్చాడు. "దుఃఖాతీతము, అపరిమితమూ అయిన సత్యాన్ని, ఆనందాన్ని, ప్రియతముని, ప్రభువును కనుక్కోవడమే నా జీవిత లక్ష్యంగా పెట్టుకున్నాను. ఆయనే మీకూ, నాకూ, అందరికీ–అన్ని కాలాలవారికీ సత్యం–లక్ష్యం–దైవం. ఆయన అన్ని రాళ్ళలో, కాళ్ళకింద గడ్డిపరకల్లో వున్నారు. నా ప్రగాఢ వాంఛ, ఆశయం ఏమిటంటే, మనమంతా ఆయనలో శాశ్వతంగా ఐక్యంకావడం. నేనేంతమాత్రం ఆయన్నించి విడిగావున్నానను కోవడంలేదు. ''నేను" అనే అహంభావాన్ని అంతంచేయగల శక్తి, సామర్థ్యాలు వున్నవారు మాత్రమే ఆయనలో ఐక్యం కాగలరు. నేనేది వాంఛించానో, అది సిద్ధించింది. సత్యాన్ని తెలుసుకున్నాను. ఆ సత్యాన్ని మీకు తెలియజెప్పాలని, దాన్నంతా మీకు అందివ్వాలని, అవన్నీ మీకు చూపాలనీ అనుకుంటున్నాను.

"నేనిప్పుడు ప్రొద్దుటే వీచే గాలిలో తన పరిమళాన్ని విరజిమ్మే పువ్వు మాదిరిగా వున్నాను. నా చుట్టూ ఏం జరుగుతున్నా, నాకు లక్ష్యంలేదు. మిమ్మల్ని ఆపూల పరిమళం

పిల్చమనీ, ఆనందంగా-సుఖంగా-సంతోషంగా వుండమనీ కోరు తున్నాను. కాని మీలో కొందరికి ఆ పరిమళం అవసరంలేనట్లే నిర్లక్ష్యంగా వెళ్ళిపోతున్నారు. అటువంటివారిని ఎవరూ ఆపి, బలవంతం చేయరు. దానికోసం వెదికేవారినే ఆపి, దానిగురించి చెప్పి, దాన్ని చూపి ఒప్పించగలరు. ఆ ఉద్దేశ్యంతోనే నేను మీకు ఇవన్నీ చెపుతున్నాను. మీ దుఃఖాలు, బాధలు, అల్పమూ-స్వల్పమూ అయిన మీ క్రౌర్యాలు, కష్టాలు, మీ పరిమితులు, అన్నిపోయి, మీరు స్వేచ్ఛాపరులై, ముక్తి పొంది ఈశ్వర రాజ్యంలో స్థిరనివాసులై, వుండేందుకు నేను చేయగలిగినంత సహాయం చేస్తాను. ఆయన సహాయంతో నేను ఇతరులకు సహాయం చేయగలను. నేను పొందిందీ, చూసిందీ, అనుభ వించిందీ అందరికీ సంతోషంతో అందివ్వడం నా ధర్మంగా, విధిగా, పూచీగా, ఆనందంగా భావిస్తున్నాను, ఆ ఇవ్వడం కూడా "స్టార్ సంస్థ" సర్వాధికారిగా కాని, జగద్గురువుగా కాని, ఇంకెవరిగానో కాని ఇవ్వడంలో అర్థంలేదు, విలువాలేదు.

"ఆ మహాద్భాగ్యాన్ని పొందేముందు మీరు మీదుఃఖాల్ని, బాధల్ని, సంతోషాల్ని, కష్టాల్ని, ఆనందాల్ని, మాయతెరల్ని, అనిత్యమైన కోర్కెల్ని వాటి లోతు పాతుల్ని, అన్నింటినీ పూర్తిగా తెలుసుకోండి. ఆ సత్యమే సమస్తాన్ని విశదపరచి, మీ మనసుల్ని నిర్మలం చేస్తుంది-జీవితంలో అదే విలువైన సంగతి," అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి ఆవిధంగా మాట్లాడి పెద్దలతో, ప్రముఖులతో, దివ్యజ్ఞాన సమాజ సభ్యులతో, ప్రపంచ సంస్థ సభ్యులతో, అందమైన అమ్మాయిలతో ప్రపంచం ఆ మూలనుంచి ఈమూల వరకు తిరుగుతూవుంటే, "ది ట్రావెలింగ్ సర్కస్," అని పరి హాసంగా అనేది, లేడీ ఎమిలీ, అప్పుడప్పుడూ.

ఆ మధ్యకాలంలో సమాజ సభ్యుల్లో, సంస్థ సభ్యుల్లో జరిగిన దీక్షలు, తమకు తాము ఇచ్చుకున్న అర్హతలు, అధికారాలు అన్నీ కృష్ణమూర్తికి అసహ్యంగా తోచాయి.

ఒకసారి మాటల్లో, "అసలు నువ్వు ఏదీ, ఎందుకు స్పష్టంగా చెప్పవు? నీకు జరిగినవీ, జరుగుతున్నవీ అన్నీ ఎందుకు కనీసం అనీబిసెంట్కైనా చెప్పవు?" అని లేడీ ఎమిలీ కృష్ణమూర్తిని అడిగితే, దాని కతడు, "నేను చెప్పి ఏం ప్రయోజనం? వాళ్ళు నమ్మరు,'' అన్నాడు.

ఆ సమాధానం విని, జార్జి అరండేల్, అనీబిసెంట్ను హిప్నొటైజ్ చేశాడనుకుంది లేడీ ఎమిలీ.

కృష్ణమూర్తి చాలాసార్లు ఆ విషయాలు అనీబిసెంట్తో మాట్లాడాలనుకున్నాడు. కాని, ఆమె తప్పించుకుంది. దానికి కారణం ఆమెపై జార్జి అరండేల్ ప్రభావం గట్టిగా పనిచేయడం.

❀ ❀ ❀

'త్వరలో జగద్గురువు రాబోతున్నారు,' అని సిద్ధ పురుషులు మేడమ్ బ్లావట్స్కీ ద్వారా గతంలో ప్రపంచానికి తెలియపరిచారు. అటువంటి జగద్గురువును దర్శించేందుకు మీరంతా నిర్మల మనస్సుతో, సహృదయంతో వుండండి. ఆయన మీ ఆలోచనా విధానాన్నంతా వ్యతిరేకించవచ్చు. మీకు విరుద్ధంగా మాట్లాడవచ్చు," అని అనీబిసెంట్ పదేపదే ప్రపంచమంతా తిరిగి చెప్పింది. ఒక సందర్భంలో ఆమె కూడా కృష్ణమూర్తి శిష్యురాలు కావాలనుకుంది. కాని, ఆమెకు గురువు ఆజ్ఞ ఇవ్వలేదు. ఆమె అటువంటి నిర్ణయం తీసుకున్నందుకు, దివ్యజ్ఞాన సమాజ సభ్యుల్లో అలజడి బయలు దేరింది. కొందరు ఆమెనూ, కృష్ణమూర్తినీ మనస్సుల్లో వ్యతిరేకించారు.

రాబోయే జగద్గురు విషయం అనేక సంస్థల్లో, సంఘాల్లో సమాజాల్లో, వర్గాల్లో సంచలనాన్ని, ఉత్తేజాన్ని కలిగించింది. అనీబిసెంట్ మాటల్లో విశ్వాసముంచి జిడ్డు కృష్ణమూర్తే రాబోయే జగద్గురువుగా, తిరిగి వస్తానన్న ఏసుప్రభువుగా భావించి, అతన్ని అనుసరించి, ఆరాదించనారంభించారు. ఆ సందర్భంలో అతనికి కానుకగా అనేక విధాల ఆస్తులు సమర్పించారు. అతను ప్రపంచమంతా తిరిగి ఉపన్యాసాలిచ్చే సందర్భంలో ఆయాచోట్ల అతనికి అనువైన వసతి-సౌకర్యాలు ఏర్పాటు చేశారు. ఆ రోజుల్లో కృష్ణమూర్తికి ఇంకా ఎన్నో అవకాశాలూ, ఆశలూ ఎదురైనాయి. కాని, కృష్ణమూర్తి పూర్తి పరిత్యాగం చేసి, తాను నిజమైన సన్యాసిని కావాలని అభిలషించాడు. అయినా అనేక చోట్ల అనేకమంది, "కృష్ణమూర్తే ఏసు ప్రభువు" అని - నమ్మి, ఉన్నతాసనం వేసి, ఆహ్వానించారు. మరి కొందరు ప్రముఖులే అతన్ని "ప్రవక్త" అని కొనియాడారు. కొన్ని ఆదర్శ సంస్థలు అతన్ని జగద్గురువుగా అంగీకరించి, అనుసరించి, ప్రచారం చేశాయి. కాని, కృష్ణమూర్తి దేనికీ లొంగక వాటన్నింటినీ నిరాకరించాడు. తన గురించి ప్రజలు అనుకుంటున్నది ఏదీ తాను కాదని గట్టిగా నొక్కి చెపుతూ, "నేను అన్నింటినుంచీ స్వేచ్ఛగా వుండాలని కొన్నేళ్ళుగా యాతనలు పడుతున్నాను. మీరూ నాలాగే స్వేచ్ఛ కోసం ప్రయత్నించండి. నేను ఏదీ నాశనం చేయడానికి రాలేదు. నిర్మించడానికే వచ్చాను, నిజంగా ఆనందం - సంతోషం - శాంతి కోరేవారికోసం వచ్చాను. వాళ్ళను విముక్తి పరచాలనేది నా ఆశ - అభిమతం, అభిప్రాయం. కాని, వాళ్లను చీల్చి చెండాడడానికి రాలేదు. నన్నొక గురువుగా- ప్రభువుగా - ప్రవక్తగా-అధికారిగా చేసుకుని, నన్ను వినకండి. మీకు మీరు కళ్ళు తెరచి నడవండి. ఇప్పుడు మీరు నా సహాయంతో నడిస్తే. నేను లేనప్పుడు ఎట్లా? అందుచేత మీరు మీ కాళ్ళ మీద నిలబడి, మీకు మీరు నడచి ముందుకు సాగండి.

సత్యానికి సూటైన,సరైన మార్గం వుంది. దాన్ని అనుసరించండి - ఎవరిమీదా ఆధారపడకండి. ఎవరినీ అనుసరించకండి. ఆరాదించకండి. సిద్ధపురుషుల వ్యవహారమంతా ఒక అసాధారణమైన, అద్భుతమైన సంగతి - సంఘటన మాత్రమే!" అన్నాడు కృష్ణమూర్తి.

సిద్ధపురుషుల గురించి కృష్ణమూర్తి అటువంటి అభిప్రాయం వ్యక్తపరిచేప్పటికి, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు పెద్ద షాక్ తగిలినట్లు బాధపడ్డారు. కృష్ణమూర్తిని వ్యతిరేకించారు.

ఆ అక్టోబరులో కృష్ణమూర్తి, రాజగోపాల్, రోజలిండ్ ఇంగ్లండు వెళ్ళారు. రామారావు, మేడమ్ డి. మాంజియర్లీ, నిత్యానందం సేవలో ఒహైలో వుండిపోయారు.

1925 జనవరిలో కృష్ణమూర్తి మదనపల్లి వెళ్ళి, యూనివర్సిటీ స్థాపనకు స్థలంచూసి, ఓసంవత్సరం తర్వాత అక్కడ ఓ స్కూలు స్థాపించారు. అదే ఋషీవ్యాలీ స్కూలు.

అడయార్ దివ్యజ్ఞాన సమాజ కేంద్ర కార్యాలయంలో సమాజ స్వర్ణోత్సవాలు డిశంబరు ఇరవై ఎనిమిదినుంచి నాలుగు రోజులపాటు ఏర్పాటు చేయబడ్డాయి. ఆ ఉత్సవాలకు హాజరయ్యే నిమిత్తం ఇంగ్లండునుంచి అనీబిసెంట్, లేడీ ఎమిలీ, కృష్ణమూర్తి మొదలైనవారు బయలుదేరాలనుకున్నారు. కాని, కృష్ణమూర్తికి మాత్రం ఏమాత్రం ఇష్టంలేదు. ఎందుకంటే, ఆ సమయంలో నిత్యానందం ఆరోగ్య పరిస్థితి ఏమీ బాగాలేదు, అతన్ని ఒంటరిగా వదలిరావడం కృష్ణమూర్తికి ఇష్టంలేదు. కాని, ఆ విషయంలో 1925 ఫిబ్రవరిలో కృష్ణమూర్తి కలలో మహాత్ములు కనపడి, నిత్యానందం ఆరోగ్యం బావుంటుందని హామీ ఇచ్చారు. అలాగే అనీబిసెంట్, లెడ్‌బీటర్ కూడా నిత్యానందం ఆరోగ్యం బావుంటుందని కృష్ణమూర్తితో గట్టిగా చెప్పారు. వారి హామీతోపాటు జార్జి అరండేల్ తనకు మహాత్ములు దర్శనమిచ్చి, దీక్షలు ఇచ్చినట్లు ప్రకటించారు. మహాత్ముల హామీతోపాటు అంతమంది పెద్దలు ఆ విధంగా చెప్పడంతో కృష్ణమూర్తికి ఆందోళన తొలగింది. అతను వారిని అనుసరించి అడయార్ బయలుదేరాడు. వారి ఓడ నవంబరు పదమూడవ తేదీ రాత్రికి సూయజ్‌కెనాల్లో ప్రవేశించింది. అక్కడ అనీబిసెంట్‌కు ఒక టెలిగ్రాం వచ్చింది, నిత్యానందం మరణించినట్లు. ఆమె, ఆవార్త తెల్లవారిన తర్వాత కృష్ణమూర్తి కేబిన్‌కి వెళ్లి చెప్పింది. ఆ వార్త విని కృష్ణమూర్తి ఏమీ మాట్లాడక నిశ్చలంగా వుండిపోయాడు. కాని, మరుక్షణంలో "మహాత్ముల మాటలు, పెద్దల హామీలు, దీక్షలు, దర్శనాలు, సలహాలు, దివ్యదృశ్యాలు, ప్రతిబింబాలు, కలలు అన్నీ మనో కల్పితాలు, వృత్తభ్రాంతులు. కాకపోతే ఊహలు." అనే గట్టి నిశ్చయానికి వచ్చాడు, కృష్ణమూర్తి. అనీబిసెంట్, లెడ్‌బీటర్ మాటల్లో కూడా అతనికి విశ్వాసం పోయింది.

నిత్యానందం మరణవార్త వినిన వెంటనే కృష్ణమూర్తి మొదట ఏడ్చాడు. తర్వాత మూలిగాడు, బాధపడ్డాడు, దుఃఖించాడు. ఏనాడో మాట్లాడటం మానేసిన తెలుగులో ఆ క్షణాన మాట్లాడాడు.

వారి ఓడ కొలంబో చేరగానే కృష్ణమూర్తిలో దుఃఖం పోయింది. ఆ బాధ అంతా అనుగ్రహంగా, దీవనగా, ఆశీర్వాదంగా మారింది. ఆ సమయంలో ఒక కవిత రాశాడు కృష్ణమూర్తి. అది 1926 జనవరి - హెరాల్డ్ పత్రికలో అచ్చయింది. "నేనూ, నా తమ్ముడూ కనిన కలలన్నీ కరిగిపోయాయి," అంటూ ప్రారంభించాడు.

కఠినమైన భూగర్భంలోంచి చీల్చుకుని, నెట్టుకుని, తోసుకుని ఆకాశంలోకి వచ్చిన పువ్వుమాదిరిగా వున్నాడు కృష్ణమూర్తి. ఆ బాధలోంచి బ్రహ్మాండమైన ఒక నూతనశక్తి ఉద్భవించింది. అతనిలో అవగాహనా పటిమ ఏర్పడింది.

"జీవితంలో నిజమైన అందం, ఆనందం వున్నాయని నేను తెలుసుకున్నాను. అవి దేనివల్లా చెడిపోవనీ తెలుసుకున్నాను," అన్నాడు కృష్ణమూర్తి.

నిత్యానందం మరణంతో కృష్ణమూర్తికి మహాత్ములయెడ నమ్మకం పోయింది, ఒక్క మైత్రేయునిలో తప్ప.

"కృష్ణమూర్తికి ఎప్పుడూ మహాత్ముల్లో విశ్వాసం లేకపోవడం వల్లనే, నిత్యానందం మరణించాడు," అని అరండేల్, వెడ్జివుడ్‌లు బహిరంగంగా అన్నారు.

నిత్యానందం మరణం కృష్ణమూర్తి జీవితాన్ని తునాతునకలు చేసింది. అతని అంతరంగమంతా అల్లకల్లోలమైంది. అతని ఆలోచనా విధానంలో ఎంతో మార్పు వచ్చింది.

కృష్ణమూర్తి జీవితమే పూర్తిగా మారిపోయింది. ఆ తర్వాత ఎప్పుడూ అతను సిద్ధపురుషుల ప్రసక్తి తీసుకు రాలేదు. జీవిత సత్యాన్ని ఎదుర్కోవడానికి తనకు తాను శక్తి సంపాదించ దలిచాడు. ఆ అంతర్మథనంలోంచి ఓకొత్త శక్తి ఉద్భవించింది. అతని పాత కల కరిగిపోయింది. ఓ పువ్వు మాదిరిగా కృష్ణ మూర్తిలో వికాసం కలిగింది. ఓ కొత్తరకం దృష్టి, దృక్పథం, స్ఫురణ కలిగాయి. ఓ కొత్త కాంతిని దర్శించాడు. సమస్తం అతనికి నూతనంగా దర్శనమిచ్చింది. అంతులేని అవగాహన అతనిలో చోటు చేసుకుంది.

నవంబరు పదమూడవ తేదీ ఉదయం పది-ముప్పై ఏడు నిమిషాలకు నిత్యానందం ఒహైలో మరణించాడు. నిత్యానందం స్థానంలో స్టార్ సంస్థకు రాజగోపాల్ జనరల్ సెక్రటరీగా నియ మింపబడ్డాడు. తమ్ముని మరణంతో తనలోంచి ఒక భాగం శాశ్వతంగా తొలగిపోయినట్లు బాధపడ్డాడు, కృష్ణమూర్తి. ఆ సంఘటన తన జీవితాన్ని మొదట కొంత చిందరవందర చేసింది. చాలావరకు కృష్ణమూర్తికి తలక్రిందులైనంత పని జరిగింది. తమ్మునికోసం ఒంటరిగా విలపించాడు, రోదించాడు, గట్టిగా అరచి పిలిచాడు, దిగులుగా మూలిగాడు. ఆ సందర్భంలో కృష్ణమూర్తి అన్నాడు: నేనూ, నా తమ్ముడూ ఇద్దరం ఒకే మేఘం మాదిరిగా వుండి తిరిగే వాళ్ళం. కలిసి పాడే వాళ్ళం. కలసి చదువుకునేవాళ్లం. కలసి తినేవాళ్లం. ఇద్దరం ఒకే వృక్షం మాదిరిగా పెరిగాం. ఒకే స్వరం మాదిరిగా వుండేవాళ్లం. మా ఇద్దరివీ భిన్నదృక్పథాలైనా, ఒకరి నొకరం అర్థంచేసు కున్నాం.

"నేను అతనికోసం బిగ్గరగా ఏడ్చాను, అతని కంఠం వినిపిస్తున్నట్లే వుండేది. నా పక్కనుంచి వెళ్ళేవాళ్ళలో అతని

ముఖం కనిపిస్తుందేమోనని వెదికేవాణ్ణి. వాళ్ళు నా తమ్ముణ్ణి చూశారేమోనని వెర్రిగా అడిగేవాణ్ణి. ఏ ఒక్కరూ నాకు తృప్తిగా సమాధానం ఇవ్వలేదు. అతనికోసం పూజించాను-ప్రార్థించాను. దేవతలుకూడా మౌనంగానే వుండిపోయారు. అతనికోసం బాధలు పడ్డాను. అంతటా అన్నింటిలో అతన్ని అన్వేషించాను. అతని మృతి నన్ను పూర్తిగా మార్చేసింది.''

కృష్ణమూర్తి బృందం అడయార్ చేరుకుంది. దేశ విదేశాలనుంచి దివ్యజ్ఞాన సమాజ సభ్యులు, స్టార్‌సంస్థ సభ్యులూ ఇంకా ఎందరో ప్రతినిధులు స్వర్ణోత్సవాలకు హాజరైనారు. "ఉత్సవాలు ప్రారంభమౌతున్నాయి," అన్నట్లు అనీబిసెంట్ కృష్ణమూర్తిచేత సాంప్రదాయ పద్ధతిలో కొన్నిపనులు చేయించింది. కృష్ణమూర్తి అవన్నీ ఆమెకోసం చేశాడు.

స్వర్ణోత్సవాలకు హాజరైనవారిలో భిన్నాభిప్రాయాలు, వర్గాలు వున్నాయి. లెడ్‌బీటర్ సిడ్నీనుంచి డెబ్బైమంది అనుచరులతో వచ్చి, కృష్ణమూర్తిని చూసి, "చివరికి నువ్వు ఒక్కడివే అర్హుడివిగా నిలిచావు," అన్నారు. కృషమూర్తికి దేనితోనూ సంబంధంలేదు, ఒక్క అనీబిసెంట్‌కోసం అన్నింటితోనూ వుండేవాడు.

అరండేల్, వెడ్జివుడ్ తమకు తాముగా ఇచ్చుకున్న దీక్షల్ని లెడ్‌బీటర్ అంగీకరించకపోవడంతో ముఠాలు ఏర్పడ్డాయి. వాటిని కలపాలని అనీబిసెంట్ ఆశ ప్రయత్నం.

ఆవరణ మధ్యనున్న పెద్ద మర్రిచెట్టుకింద సమావేశాలు ఏర్పాటుచేశారు. ఆ సమావేశాలకు మొదటిసారిగా "మైక్" పెట్టారు. సరిగ్గా సమావేశ సమయానికి వర్షం ఆరంభమైంది. చిరుచలి కూడా. ఏదీ, ఎవరికీ సంతోషంగా, సంతృప్తికరంగా

వున్నట్లు లేదు. ఒకరోజున అనీబిసెంట్ కృష్ణమూర్తిని తన డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకువెళ్ళింది. అప్పటికే ఆ గదిలో లెడ్‌బీటర్ - రాజా - జార్జి అరండేల్ - వెడ్జివుడ్ వున్నారు. కృష్ణమూర్తిని తనకూ లెడ్‌బీటర్ కూ మధ్యలో కూర్చోబెట్టి "ఇక్కడ వున్న మమ్మల్ని నీ శిష్యులుగా అంగీకరిస్తావా?" అని అనీబిసెంట్ కృష్ణమూర్తిని అడిగింది. దానికి కృష్ణమూర్తి, "ఒక్క అనీబిసెంట్‌ను మాత్రం శిష్యురాలిగా అంగీకరిస్తాను," అన్నాడు.

అంతలో రోజలిండ్-రాజగోపాల్ ఒహైనుంచి నిత్యానందం అస్తికలు అడయార్ తీసుకొచ్చారు. ఆ తర్వాత రాజగోపాల్ స్టార్ సంస్థకు ఆర్గనైజింగ్ సెక్రటరీగా నియమింపబడ్డాడు. అంతర్జాతీయ సంస్థకు ట్రెజరర్‌గా కూడా నియమింపబడ్డాడు. అతను తన ఆఫీసుకుగాను దివ్యజ్ఞానసమాజ కేంద్ర కార్యాలయంలోని ఒక బంగళాను ఉపయోగించుకున్నాడు.

అడయార్ సమావేశాలతో "జగద్గురు" అనే నాటకం తారస్థాయి నందుకుంది. ఆ నాటక నిర్మాత, అనీబిసెంట్. దర్శకుడు, లెడ్‌బీటర్. సమర్పణ, జార్జి అరండేల్ అండ్ పార్టీ. కథానాయకుడు, కృష్ణాజీ. జగద్గురు వచనాలు వినడానికి ప్రేక్షకులు ఆతృతతో ఎదురుచూస్తున్నారు. ఓ కొత్త విగ్రహాన్ని దర్శించడానికీ, ఆరాదించడానికీ ఏతూహల పడుతున్నారు. ఆధునిక పద్ధతిలో వున్న ఏసుప్రభువును దర్శించగోరుతున్నారు. సంస్కారవంతులూ, నాగరికులూ, విద్యావంతులూ, మేధావులూ అయిన ఆ ప్రతినిధులనూ; ఉభయ సంస్థ సభ్యులనూ ఉద్దేశించి కృష్ణమూర్తి మాట్లాడాడు :

"ఇన్నేళ్ళూ ఏమీ మాట్లాడని బొమ్మను మీరు జగద్గురువని ఆరాధించారు. కాని, ఇప్పుడా బొమ్మ మాట్లాడ నారంభిం

చెప్పటికి మీరు ఆశ్చర్యంతో, "మనం ఇన్నాళ్ళూ ఈ బొమ్మను ఆరాధించాం. ఇది మనం నిజంగా అనుకుంటున్న అంతిమజ్ఞానానికి స్థూలరూపమా? ఇప్పుడే బొమ్మ మనపై పెత్తనం చెలాయిస్తుందా? ఇది జగద్గురు స్థానంలో ప్రతినిధిగా నిలవబోతోందా? అసలు జగద్గురు ప్రేమ - దయ - ఔన్నత్యం ఒక వ్యక్తిలో ప్రత్యక్షంగా వ్యక్తమౌతాయా?" అనే సంశయాలు, సందేహాలు, ప్రశ్నలు మీ మనసుల్లో అప్పుడేపుట్టాయి. అవునా? డోస్టో విస్కీ ఓకథ చెప్పారు: తిరిగి వస్తానన్న ఏసు ప్రభువు వచ్చి, ప్రజలందరికీ బోధిస్తో 'రోమ్' నగరం వెళ్ళారు. అక్కడ "పోప్" ఆయనకు ఎదురేగి, కాళ్ళ మీద పడి, ఆరాదించి, చాలా తెలివిగా ఆయన్ని ఖైదులో పెట్టించి "మేము మిమ్మల్ని నిస్సంశయంగా జీసస్సేనని నమ్ముతున్నాం. కాని, మీరు "నేనే తిరిగి వస్తానన్న ఏసుప్రభువును" అని ప్రజల ముందుకు వెడితే, వాళ్ళు మళ్ళీ కష్టాలకు గురికావలసి వస్తుంది. ఎందుకంటే, మీరు ప్రజల్లో సందేహాలు రేపుతారు. అందుచేత మీరు ప్రపంచం తిరిగి ప్రజలకు ఏమీ బోధించకుండా వుండేందుకు మీరు ఖైదులో వుండటం మీకూ, మాకూ ప్రజలకూ శ్రేయస్కరం," అన్నారు.

"ఇన్నాళ్ళూ విగ్రహంగా భావించి, ఆరాధించిన జగద్గురువుగా, తిరిగివస్తానన్న ఏసుప్రభువుగా ఆశించిన బొమ్మ అకస్మాత్తుగా మీ కళ్ళముందు కదిలి మాట్లాడనారంభించేప్పటికి మీలో సందేహాలు పుట్టుకొచ్చాయి. అయినా మీరు ఇంకా దాన్ని ఓ విగ్రహంగా ఆరాధించబోతున్నారా? ముందు ఆ సంగతి మీకు మీరు నిశ్చయంచేసుకోండి. ఆ విషయమై తీవ్రంగా యోచన చేయండి.

"నేనూ కొన్నాళ్లు విగ్రహారాధన చేశాను. తృప్తి కనపడక మానేశాను. ఆ రూపం వెనుక ఏముందో తెలును

కోవాలనుకున్నాను. కొన్నాళ్ళు దాని కళ్ళద్వారా చూశాను. దాని మనసు ద్వారా యోచించాను. దాని హృదయంద్వారా అనుభవించాను. అయినా నాకు తృప్తి కలగకపోవడానికి కారణాలు - నా అసంతృప్తీ, నా దుఃఖాలేనని తెలుసుకున్నాను. చివరికి ఆ విగ్రహంతో ఐక్యమై, నేనే ఆ విగ్రహమైపోయాను.

"ఏ జ్ఞాని అయినా ప్రజలముందుకు వెడితే, ప్రజలు ఆయనతో తమ కష్టాలు-బాధలు-దుఃఖాలు-సంతోషాలు అన్నీ చెప్పుకుని, "మీరు సత్యాన్ని తెలుసుకున్న మహానుభావులు. మాకూ ఆ మార్గమేదో చూపి, మా కళ్ళు తెరిపించండి. మేమూ ఆ పూలతోటలోకి వస్తాం. మీ వలె ఆనందంగా వుంటాం," అంటారు. వాళ్ళకు కావలసింది, అంతేకాని, పై పై బిరుదులూ, దీక్షలూ, గుర్తులూ, పద్ధతులూ, నియమ-నిష్టలూ, శాసనాలూ, గ్రంధాలూ కాదు.

"అసలు జగద్గురువంటే ఎవరు? ఆ మాటకు అర్ధం తెలుసా? తెలుసన్నవారికి తెలుసా? జగద్గురు రూపం వెనక వుండే సత్యం ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం నాకు నేను తెలుసుకోవాలనుకున్నాను. ఆ విషయమై శ్రద్ధగా, ఆసక్తితో, నిజంగా, ఆలోచించేందుకు శక్తి - సామర్ధ్యాలు వుండాలి. హృదయం విశాలం కావాలి.

"కృష్ణమూర్తి" అని పిలువబడే నేను, మీరు అనుకుంటున్న జగద్గురువుకు ప్రతిరూపంగా వున్నానని మీలో చాలా మంది గట్టిగా భావిస్తున్నారు. ఆ సంగతి తెలిసి నేను కూడా మరింత గట్టిగా ఆలోచించాను. జగద్గురువంటే ఎవరు? జకద్గురువనే ఆయన ప్రపంచానికి విడిగా వుండివుంటే, తిరిగి

ఆయన ప్రత్యక్షం కావడంలో ఉద్దేశ్యం ఏమై వుంటుంది? కృష్ణమూర్తినైన నన్ను, మీరు ఎందుకు జగద్గురువు అనుకో వలసి వచ్చింది?

"జగద్గురు విషయమై నేను చెప్పేదే ప్రమాణం కాదు. నేను చెప్పేది మీరు వినవలసిన అవసరమూలేదు. మీరు నన్ను గుడ్డిగా అనుసరించవలసిన పనీ లేదు. కాని, నేను చెప్పేది వినదలచుకుంటే, శ్రద్ధగా, పూర్తిగా విని, నన్ను అర్ధం చేసుకోండి.

"నన్ను విని, నన్ను అర్ధంచేసుకునేముందు అసలు నే నెవరో, నేనేమిటో మీకు తెలియాలికదా? నా గురించి నేను చెప్పకపోతే, మీకెట్లా తెలుస్తుంది? ఎందుకంటే, మీరు నన్ను అడుగుతున్నారు, "మేము అనుసరించి, ఆచరించి, ఆరాదిం చేందుకు ఒక పద్ధతి చెప్పండి," అని. మీరు నన్ను జగద్గురు వుగా భావించి అడుగుతున్నారు గనుక, జగద్గురు విషయమై మనమంతా కలిసి ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చేముందు, దాన్నంతా అర్ధంచేసుకుందాం. ఆ సంగతులన్నీ ఇప్పుడో, ఎప్పుడో ఒకప్పుడు మనకు తప్పక సహాయపడతాయి.

"మా అమ్మ కృష్ణ భక్తురాలు. మా ఇంట్లో కృష్ణుని పటం వుండేది. ఆమె ఎప్పుడూ నాకు కృష్ణుని కథలే చెప్పేది. నేను చిన్నప్పుడంతా ఆ కృష్ణునే చూస్తూ వుండేవాడిని. అందమైన ఆ కృష్ణపటం నాకెంతో ఆనందాన్ని ఇచ్చేది. అందుచేత నేను ఆయన సుందరరూపాన్ని నా హృదయంలో భక్తి-శ్రద్ధలతో ప్రతిష్టించుకున్నాను. ఆయన నా మనోఫలకంమీద ఎప్పటికీ చెరగకుండా, చెదరకుండా నిలిచిపోయారు. ఆయన మీద పాటలు కట్టి, పాడుకుంటో సంతోషంగా కాలం గడిపాను.

"నేను కొంచెం పెద్దయ్యాక, అడయార్ దివ్యజ్ఞాన సమాజ కేంద్రంలో చేరాక, తరచు లెడ్‌బీటర్ని కలుసుకునే వాడిని. ఆ రోజుల్లో మాష్టర్ కుతుమిగారి దర్శన భాగ్యం కలిగింది. చాలాసార్లు ఆయన నా ముందు దయగా నిలిచారు. ఆ తర్వాత భగవాన్ మైత్రేయుని దర్శనం లభించింది. ఆయన కూడా చాలాకాలం నన్ను విడవ లేదు.

"ఇవన్నీ ఎందుకు చెపుతున్నానంటే, నేను మీపై అధికారం చెలాయించడానికి గాని; నాలో, నా మాటల్లో విశ్వాసం కుదరడానికి గాని కాదు. కేవలం మీ స్వంత నమ్మకాలు బలపరచడానికీ, మీ మనసులు – మీ హృదయాలు విశాలం కావడానికీ చెపుతున్నాను.

"ఆ తర్వాత నాకు బుద్ధ భగవానులు దర్శనమిచ్చారు. ఆయన్నీ, ఆయన మహిమనూ చూస్తో, వర్ణిస్తో సంతోషంగా, శాంతంగా కాలం గడిపాను. నేనూ ఆయనా ఎప్పుడూ కలిసే తిరిగే వాళ్ళం. నా ప్రియతముడని అంటున్నానే, ఆయనే శ్రీకృష్ణుడు,మాష్టర్ కుతుమి–ప్రభువు మైత్రేయ,బుద్ధభగవానులు. అన్నీ, అంతా ఆయనే! నేను చూసిన ఆకారాల్లోనే కాదు, సమస్త చరాచరాల్లో, విశ్వమంతటా ఆయనే నిండి వున్నారు. అటువంటి ఆయనకు ఏరూపమైతేనేం? ఏపేరైతేనేం? ఎక్కడైతేనేం? అంతా ఆయనే! ఆయనే నా ప్రియతముడు.

"ఈనాడు మీరు జగద్గురు కోసం ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. ఏ రూపంలో? కృష్ణమూర్తి రూపంలో! అవునా? ఎవరైతేనేం ఏరూపమైతేనేం? కాని ఆయన నామ – రూప రహితుడు. అటువంటి నా ప్రియతముడు తెరచుకున్న ఆకాశం, విచ్చుకున్న పువ్వు, ఆవిర్భవించిన ప్రతి మానవుడూ.

సమస్తం ఆయనే! ఆయన అన్ని కాలాల్లో, అంతటా నిండి వున్నారు. కాబట్టి, జగద్గురు ఎవరైతేనేం? అన్నీ ఆయన రూపాలే! ఆయన లేనిది, ఈ విశ్వంలో ఏదీ లేదు. ఆయనే ప్రభువు, ప్రియతముడు. ఆయనే సత్యం - శివం - సుందరం. విశ్వమే ఆయన ఆకారం ఆయనే, నా ప్రియతముడు.

"అటువంటి ప్రియతమునిలో నేనంటూ ఏ ప్రత్యేకతా లేకుండా ఐక్యమై పోయాను. అది నా స్వానుభవం. అది నేను తెలుసుకున్న సత్యం. ఆ పరమ సత్యాన్ని మీకు తెలియ పరచడం కోసం, దాన్ని మీ మనసులతో, హృదయాలతో మీకు మీరే తెలుసుకోగలందులకు నేను ఇవన్నీ చెపుతున్నాను. అదే నా ఆశయం. నా పూర్వపు కోర్కెలు, ఆశలు, ఆలోచనలు అన్నీ నాశనమైనట్లే, నాకు దర్శనమిచ్చిన ఆరూపాలన్నీ క్రమంగా అదృశ్యమైనాయి.

"అనీబిసెంట్ మాటలు నమ్మి మీరందరూ జగద్గురు కోసం ఆశతో ఎదురుచూస్తున్నారు. ఆ జగద్గురు నేనేనని, ఇన్నేళ్ళూ మీరు నాకోసం నిష్కపటమైన, నిండు మనస్సుతో, భక్తితో ఎదురు చూశారు. అవునా ? అలాగే ఇంకో ఇరవై ఏళ్ళు ఎదురు చూసినా, మీరు ఇలాగే వుంటారు. ఎందుకంటే, మీలో మూఢనమ్మకాలు, ముందుగా ఏర్పరచి, సిద్ధపరచుకున్న స్థిర నిశ్చయాలు, వున్నాయి.

"నేను జగద్గురువును," అని నేను ఎన్నడూ అనలేదు. కాని, ఆ జగద్గురువును నేనెప్పుడూ కాదనలేదు. ఆయన్ని ఎదిరించనూలేదు. "ఆ విషయం వదిలెయ్యండి. అది ఏమంత ముఖ్యమైన చర్చనీయాంశం కాదు" అని అన్నాను. అంతే ! జగద్గురు విషయమై నేనేమీ మాట్లాడబోవడం లేదు. ఆ సంగతి నాకు అనవసరమైనది, అసంగతమైనది.

"అసలు జీవితానికి గురువెందుకు ?" అని నేను అడిగితే, "ఓదారి చూపి నడిపించడానికి," అని మీరు అంటారు. ఒకరు, ఒకరికి దారి చూపి నడిపించవలసిన అవసరం ఏమిటి ? ఎందుకు? "గురువు అనుకునే ఆయన "ఇతరులు," అని కొందరిని తననుంచి విడిగాచూసి బోదించడం - అదంతా ఏమిటి ? దేనికి ?" అని నేను అడిగితే, దానికి మీరు, "ఆనందాన్ని, శాంతిని, మోక్షాన్ని, నిర్వాణాన్ని పొందేందుకూ, దారి చూపి నడిపించేందుకూ గురువు అవసరం," అంటారు.

"సత్యాన్వేషణ చేయాలన్న సంకల్పమే, గురువు. నిజమైన శ్రద్ధ వుంటే, గురువు, ఉపదేశకుడు అవసరంలేదు. దృఢమైన సంకల్పమే, అక్కడకు తీసుకుపోతుంది. సత్యాన్వేషణలో చాలామంది సహజంగా ప్రత్యేకమైన భక్తి-శ్రద్ధలు చూపేది నామ-రూప సహితమైన వ్యక్తిమీదనేగాని, అసలు సత్యంమీద కాదు. వారు చేసే సాధన అంతా శిష్యరికంకోసం, అర్హత నిశ్చయించుకోవడం కోసం, ఘనతకోసం, దీక్షకోసం. ఆ బావం ప్రజల్లో అనాదిగా అలవాటై పోయింది. దానివల్లనే వారి హృదయాలు ఇరుకై, ప్రేమకు చోటులేకుండా పోయాయి. పైగా వారిలో ఎన్నో దురభిమానాలు, పక్షపాతాలు, మిగిలాయి. అందుచేత సత్యాన్వేషకుల్లో వివేకవంతమైన, యదార్థమైన, జ్ఞానసంబంధమైన ఆలోచనలు కలగడం మానేశాయి.

"దేన్ని తెలుసుకోవాలన్నా "నేను" అనే తలంపు కలగకూడదు. "నేను" అనే మొదటి తలంపు కలగడానికి కారణాలు- మనలోని అభ్యంతరాలు, అవరోధాలు, విపరీత్వాలు, భయాలు, అడ్డంకులు. కనుక వాటి విషయంలో దురభిమానాలు, పక్షపాతాలు, తారతమ్యభేదాలు ఏమాత్రం వుండకూడదు. అప్పుడే

మనం నిజజీవితాన్ని జీవించగలుగుతాం. కాని, బాధగా వున్నప్పుడు మనకు విడిగా, భిన్నంగా బైట ఏదో ఒకటి వుండి మనల్ని బాధిస్తోందని భావిస్తాం, ఆభావంతో మనలో ఘర్షణ ఏర్పడుతుంది. ఆ బాధను ఆధారంగా తీసుకుని తీవ్రంగా యోచిస్తాం. ఏవేవో నిర్ణయాలు తీసుకుంటాం. అటువంటి పరిస్థితుల్లో ఒకరిని గురువుగా ఏరుకుని, సహాయంచేసి నడపమని ప్రాధేయ పడతాం. చివరకు మనకు మనమే ఆయనకు అర్పణ కావడంతో మన బాధా, బాధ్యతా, భారం తీరినట్లు భావిస్తాం. కాని, ప్రపంచంలో ఎవరూ, ఎవరినీ మనోఘర్షణనుంచీ, యాతనల నుంచీ, వేదనలనుంచీ తప్పించలేరు, ఒక్కతమను తాము తప్ప.

"ఎవరికి వారే చిత్రకారులు కావాలి. కుంచె-రంగులు-నారగుడ్డ ఇవ్వబడతాయి. ఆ పరికరాల సహాయంతో ఎవరికి వారు చిత్రాలు చిత్రించాలి. కాని, ఆ చిత్రించే నేర్పూ, పని తనం, శక్తీ ఒకరు మరొకరికి ఇవ్వలేరు. జ్వాలవంటి తీవ్రమైన కోర్కెవుంటే, అదే చిత్రింపదలచుకున్న చిత్రం వెనుక అనుసరిస్తుంది. మన వాంచాజ్వాలే, చిత్రించే విద్యను నేర్పుతుంది. మనం ఒంటరిగా వున్నప్పుడు అంటే, గురువంటూ ఒకరు లేనప్పుడు, మనం చిత్రించదలచుకున్న చిత్రాన్ని మనమే చిత్రిస్తాం. విద్య అనంతం. కనుక దానికో పద్ధతి లేదు.

"ఇదీ సత్యం," అని నాకు ఎవరూ, ఎప్పుడూ, ఏదీ బోధించలేదు. నేను చెప్పే సంగతులు కూడా గ్రంధాలనుంచి నేర్చుకున్నవి కావు. కాని, నేను సత్యాన్ని తెలుసుకునేందుకు తీవ్రమైన వాంఛతో ఎదురు చూశాను. అనేక యాతనలు పడ్డాను. ఎంతో బాధతో కొట్టుకున్నాను. గట్టిగా వెతికాను. 'స్వేచ్ఛగా, సహజంగా వున్నప్పుడే సత్యాన్ని తెలుసుకోగలుగుతాము' అనేది నా స్వానుభవం," అన్నాడు.

• • •

ఆ సందర్భంలో కృష్ణమూర్తి ఇచ్చిన మరొక ఉపన్యాసం:

"జగద్గురు అవతరించారనీ, ఆనందాన్ని కలగజేస్తారనీ, జీవితంలో పరిణామం తెస్తారనీ, జ్ఞానాన్ని ఇస్తారనీ, నూతన జీవితాన్నే ప్రసాదిస్తారనీ, ఉత్సాహపరుస్తారనీ, మోక్షాన్ని ఇస్తారనీ - ఇన్నేళ్ళూ మీరు ఎంతో ఎదురు చూశారు. చివరికి మీ కలలన్నీ కరిగిపోయాయి. నిరాశ చెందారు. ఇప్పుడైనా, ఈ నిరాశా, నిస్పృహ అంతటితోనైనా మిమ్మల్ని మీరు అర్థం చేసుకోరా? మీ నమ్మకాలు, విశ్వాసాలు, ఆశలు అన్నీ సమూలంగా నాశనమైన తర్వాతకూడా ఆత్మవిచారణ చేసుకోరా?

"మీరు పాతదేవుళ్ళకు బదులు, కొత్త దేవుళ్ళనూ, పాత మతాలకు బదులు కొత్త మతాలను కోరుతున్నారు. అవన్నీ విలువలేని సంగతులు. జీవితంలో అవి హద్దుల్ని, అడ్డంకుల్ని ఏర్పరుస్తాయి. ఎటూ కదలనీయకుండా చుట్టూ గట్టి రాతి గోడలు కడతాయి. ఇప్పుడు మీరు కొత్తరకం ఆధ్యాత్మిక ఘనతకోసం, కొత్త తరహా ఆరాధనా విధానంకోసం ఎదురు చూస్తున్నారు. ఆత్మోన్నతికి ఒకరిమీద ఆధ్యాత్మికంగా ఆధార పడాలని చూస్తున్నారు. ఒకరిమీద ఆధారపడితే, వారు చని పోతే, (అది సహజమే కదా!) అతని పేరుమీద మీరొక మతం స్థాపిస్తారు. ఆయన్ని దేవుణ్ణి చేసి, ఆలయం కడతారు. అందు నిత్యకర్మ క్రతువులు చేస్తారు. ఆయన చెప్పినదంతా మీ మనసుల్లో కొన్ని నియమాలుగా, నిబంధనలుగా, విధులుగా ఏర్పడతాయి. కొన్ని ప్రవచనాల్ని, సూక్తుల్ని కొత్తగా కల్పిస్తారు. ఆయన పేరుమీద తత్వశాస్త్రాల్ని సృష్టిస్తారు.

"ఒక వ్యక్తి పేరుమీద ఏదైనా ఒక నిర్మాణం జరిగితే, ప్రజలు ఆ నిర్మాణంలో ఇరుక్కుపోతారు, స్వతంత్రంగా

ఎటూ కదలకుండా, ఏమీ చూడకుండా, ఏదీ వినకుండా, ఏదీ చేయకుండా. దాంట్లోంచి వాళ్ళను బైటికి లాగడానికి మరొకరు రావాలి. ఆ ఒకరే, గురువు. కాని వాళ్ళు అలవాటు ప్రకారం ఆ గురువుకీ ఒక ఆలయం కడతారు. ఆయన్నీ ఆరాధిస్తారు. మళ్ళా ఆ గుడిలోంచీ, ఆ గూడులోంచీ ఆ ఇరుకూ, అజ్ఞానం, సంకుచితత్వంనుంచీ వాళ్ళను బైటికి లాగేందుకు మరొక గురువు అవసరమౌతారు. ఆ గురువుకీ గుడి కడతారు. ఆ విధంగా వాళ్ళ జీవితాలు గురువులు-గుడులు-గూళ్ళతోనే సరిపోతుంది.

"తమ బాధల్ని - కష్టాల్ని - దుఃఖాల్ని - సంతోషాల్ని ఎవరైతే వివేకంతో అర్థంచేసుకుంటారో, వారు ఏ అధికారానికి లోబడక, ఏ గుడినీ కట్టక, హాయిగా-ఆనందంగా బ్రతుకుతారు.

"కృష్ణమూర్తి" అనే వ్యక్తి పేరు మీద ఒక మతాన్ని, తత్వశాస్త్రాన్ని, సిద్ధాంతాన్ని నిలబెట్టి, కొన్ని నియమాల్ని - ఆచారాల్ని - పద్ధతుల్ని ఏర్పరచి, దాని చుట్టూ గిరిగీసి, దానిలోపల కూర్చుని, ఆయన చనిపోతే, దేవుణ్ణి చేసి, దేవాలయం కట్టించి అందు నిత్య కర్మకాండలు జరిపిస్తో, కొన్ని సూక్తుల్ని సృష్టించి అసలు సత్యాన్ని మరుస్తారు.

"సత్యాన్వేషణ చేయదలచుకుంటే, మీ హద్దుల్ని అతిక్రమించండి. మీ ఆలోచనల్ని, పనుల్ని మించి పనిచేయండి. ఎందుకంటే, ఆ సత్యమేదో అది మీలోనే వుంది. జీవితమే సత్యాన్ని చేరుకునే మార్గం చూపుతుంది. అదే దైవం. అటువంటి జీవితాన్ని వదిలేసి, ఎవరో వ్యక్తుల్ని - గురువుల్ని - బోధకుల్ని - మధ్యవర్తుల్ని - గ్రంధాల్ని - మతాల్ని - ఆచారాల్ని - విశ్వాసాల్ని - సాంప్రదాయాల్ని గుడ్డిగా, మూర్ఖంగా అనుసరిస్తున్నారంటే, మీరు జీవితంనుంచి ఒక మెట్టు కిందికి దిగి, అసలు సత్యాన్ని మోసం చేస్తున్నారన్నమాట.

"ముక్తి ఏక్షణాన్నైనా పొందవచ్చు. కాని, దానికోసం ప్రతిక్షణం ఎంతో ఎదురు చూడాలి. దానికై వ్యక్తుల్ని అను సరించకండి. జీవితంలో మధ్యవర్తులంటూ లేకుండా సరాసరి సత్యానికే శిష్యులుగా, అనుచరులుగా, ఆరాధకులుగా వుండండి. సత్యం, ఆశ కల్పించదు; కాని, అ వ గా హ న కలిగిస్తుంది. వ్యక్తుల్ని ఆరాదించడంలో ఆ అవగాహన దూరమౌతుంది. ఆధ్యాత్మిక పురోభివృద్ధికి ఆచారవ్యవహారాలు - ని త్య క ర్మ కలాపాలూ ఏవీ అవసరం లేదు.

'మనం వూహించనప్పుడు, ఆశించనప్పుడు, ప్రయత్నించ నప్పుడు - అప్పుడు సత్యం తనంతట తాను దొంగ మాదిరిగా వచ్చి, జీవితంలో చొరబడుతుంది. అంటే, మనిషి సహజంగా, స్వేచ్ఛగా, నిర్భయంగా వున్నప్పుడు. అందుకే నేను మిమ్మల్ని స్వేచ్ఛవైపు నడవమని, మీ చుట్టూవున్న హద్దుల్ని కూలదోయ మని, స్వతంత్రంగా బ్రతకమనీ చెపుతాను. ఆ విధమైన స్వేచ్ఛాజీవన మొక్కటే, శాశ్వత సుఖాన్ని, సంతోషాన్ని, ఆనందాన్ని, శాంతినీ ఇస్తుంది.

"సత్యాన్నో - స్వేచ్ఛనో - ఆత్మనో - ఈశ్వరుణ్ణో మీరు ఏదైతే కోరుతున్నారో దాన్ని - మీకు, మీరే స్వాను భవంతో తెలుసుకోండి. నేనూ అట్లాగే తెలుసుకున్నాను. నేనిప్పుడు చేయగలిగింది మీకు ఆ మార్గం చూపగలను. ఇష్ట మైతే మీరూ ఆ మార్గాన నడవండి. ఎవరైతే స్వేచ్ఛగా వుంటారో వారే గురువులు కాగలరు. ప్రతి ఒక్కరిలో ఆ స్వేచ్ఛా పథం నిగూఢంగా వుంది. ఆ స్వేచ్ఛే, జీవితం. "స్వేచ్ఛ" అనేది ఒక మహాజ్వాల. మీరు స్వేచ్ఛ పొందారంటే, మీరూ ఒక జ్వాల అవుతారు.

"అటువంటి స్వేచ్ఛకోసం నిత్యజీవితంలో ప్రత్యేకించి ఏ విధమైన కర్మలూ అనుష్ఠించనవసరంలేదు. స్వేచ్ఛకోసం ఆచారాలు - మర్యాదలు - సంస్కారాలు - సాంప్రదాయాలు పాటించనవసరంలేదు. వాటన్నింటినీ విడవండి.

"మీరు నన్ను ఒక అధికారిగా తీసుకోకండి. నేను ఆచారకర్మల్నిగాని, సాంప్రదాయాల్నిగాని, పద్ధతుల్నిగాని ఆక్షేపిస్తున్నాననిగాని, అంగీకరిస్తున్నాననిగాని అనుకోకండి. నేను వాటిని అక్షేపించను, అంగీకరించను. మీకు ఇష్టమైతే వాటిని పాటించండి. లేదా, వాటిని వదిలెయ్యండి. అంగీకరించడానికీ, వదిలెయ్యడానికీ ప్రతిదానికీ మీలో తగినంత కారణం వుండాలి. అసలు కష్టం, వాటికి లొంగి-అణగి వుండటం లోనూ, భయపడటంలోనూ వుంది. మీకు వాటి సంగతులు పట్టాయి నాకు సత్యం కావాలి. నాకు తెలిసిన సత్యం అందరికీ అర్ధమై, అనుభవంలోకి రావాలనుకుంటాను. కనుక నేను చెప్పేది విని, నన్ను అర్ధంచేసుకోండి. కాని, నన్ను అనుసరించకండి. మీరు ఎప్పుడూ కీర్తికోసం దాహపడకండి. నేను మీ మెప్పుల్ని, మీ అనుసరణల్ని కోరడంలేదు. అసలు నేను ఎవరినైతేనేం? నేనెవరో మీరు ఎప్పటికీ తెలుసుకోలేరు.

కాబట్టి ముందు మిమ్మల్ని మీరు తెలుసుకోండి. అదే ఆత్మ విచారణ. అదే స్వేచ్ఛా పథం. తన వాంచలకూ, కర్మలకూ, ఫలితాలకూ తానే బాధ్యుడనని గుర్తించిననాడు ప్రతీ ఒక్కడూ నిర్భయంగా వుంటాడు. నిరంతరం తాను అన్వేషించే ఆ పరమ సత్యం తనలోనే వుందని అనుభవ పూర్వంగా తెలుసుకుంటాడు. అదే ఎరుక.

"కాబట్టి నేను చెప్పేది శ్రద్ధగా విని, నన్ను అర్ధం చేసుకోండి. చిత్రకారుడు తన మానసికానందం కోసం, ఆత్మ

ఔన్నత్యం కోసం, హృదయ విశాలత్వం కోసం చిత్రాల్ని చిత్రించునట్లు; నేనీ విషయాల్ని మాట్లాడుతున్నాను. అంతే! మీనుంచి నేనేమీ ఆశించడం లేదు. నాకు సుఖాపేక్ష లేదు. అవన్నీ కావాలనుకుంటే, నేను ఆ చలిదేశాలో ఎందుకు స్థిరనివాస ముంటాను ? బుద్ధిలేని ఈ ఉపన్యాసాల్ని ఎందుకు ఇస్తాను ? నన్ను అర్థం చేసుకున్నవారు ఓ ఐదుగురు వుంటే చాలు. వాళ్ళు నన్ను విని, సజీవంగా వుంటే చాలు. దురభిమానాలు దుర్గంధాల్లో మగ్గేవాళ్ళూ, ఎప్పుడూ నూతనత్వాన్ని ఆకాంక్షించనివాళ్ళూ ఎన్ని వేలమంది వుంటే మాత్రం ఏం ప్రయోజనం ? నేను కఠినంగా మాట్లాడితే, నాకు దయ లేదనుకోకండి. నేను నిర్మొహమాటంగా మాట్లాడతాను. ఆపరేషన్ అవసరమైతే, రోగి బాధపడతాడని డాక్టర్ ఉపేక్ష చేస్తాడా? నేను సూటిగా మాట్లాడితే 'నిర్దయ' అని అనుకోకండి. మిమ్మల్ని నిరుత్సాహ పరచాలని నేను కఠినంగా మాట్లాడటం లేదు. నేను ఇవన్నీ ఎరుకలో వుండే మాట్లాడుతున్నాను. కనుక నేను చెప్పేది విని, నన్ను అర్థం చేసుకోండి. బైట ఎటువంటి అధికారం కోసం, ఆధారం కోసం ఎదురు చూడకండి.

" ఇప్పటికైనా మించిపోయింది లేదు. అన్నింటినీ దూరంగా నెట్టేసి, మీలోకి మీరు చూసుకోండి. ఆ విధంగా తమలోకి తాము చూసుకునేవారు లోకంలో బహు కొద్దిమందే వుంటారు.

"మీరు నన్నొక ఆశ్రమం పెట్టమంటున్నారు. ఎందుకు? అందు మీరు చేరడానికి. అవునా ? ఒకరు ఆశ్రమం స్థాపిస్తే, ఏ శ్రమాలేకుండా మీరు అందులో చేరాలనేకాని, మీకు మీరు ఒక ఆశ్రమాన్నో, సంఘాన్నో, సంస్థనో ఎందుకు స్థాపించ

కూడదు ? అదేదో మీరు మాత్రం చేయరు. మీ కోసం ఇతరుల్ని చేయమంటారు. మీ ఆశయాన్నో, అభీష్టాన్నో, భావాన్నో ఎవరో ఒకరు మీ కోసం చేసిపెట్టాలి. అవునా ?

"ఎవరో ఒకరు ఆశ్రమం స్థాపిస్తే, మీరు అందు చేరతారే కాని, మీకు మీరుగా ఏదీ చేయరు, ఎందుకంటే, మీమీద మీకు నమ్మకంలేదు. మీ మీద మీకు ఎందుకు నమ్మకం లేదంటే, మీకు దేని గురించి నిజంగా, శ్రద్ధగా పరిశోధన చేయలేదన్న మాట. ప్రతి దాన్ని పరిశీలించి, పరీక్షించి, పరిశోధించి, తర్కించి, ప్రశ్నించినప్పుడే మీపై మీకు విశ్వాసం ఏర్పడు తుంది. అటువంటి విశ్వాసాన్ని గురువు, గ్రంథం, ఎవరూ, ఏదీ ఇవ్వలేదు. దాన్ని ఎవరికి వారు పరిశోధనద్వారా తెలుసు కోవాలి.

"ఆ సాధనామార్గంలో మనసు అతి చురుకుగా, బహు మృదువుగా వుండటం వలన, అది అటూ, ఇటూ, అతి తేలికగా, సులువుగా వంగుతూ, వూగుతూ, మళ్ళా అతివేగంగా ముందుకు సాగుతూ వుంటుంది. ఆ మనసు ప్రతిదాన్ని తనదిగా, శ్రద్ధగా, పూర్తిగా తీసుకుని, దానిగురించి బహుముఖంగా యోచించి, అర్థంచేసుకుంటుంది. ఆ అవగాహనా ఫలితమే, ఆశ్రమం.

"ఒక ఆశ్రమాన్ని స్థాపించడంకన్నా, తనను తాను తెలుసుకోవడం ముఖ్యం. ఆశ్రమాల్లో చేరితే వాటి క్రమ శిక్షణలో-నిబంధనల్లో - నియమాల్లో - శాసనాల చిక్కుల్లో పడి పోతారు. అటువంటి బంధాల్ని ఎందుకు కోరుకుంటారంటే. తమపై తమకు నమ్మకంలేక. తమను తాము తెలుసుకోక, 'తాము ఎట్లా నడవాలో, ఎటు నడవాలో తెలియక, తికమక పడుతూ, తమను నడిపించేందుకై గురువుల్ని - గ్రంథాల్ని -

ఆశ్రమాల్ని వెతుక్కుంటారు. కాని, ఎక్కడ ఎట్లావున్నా, సత్యాన్వేషణ మాత్రం మానకూడదు. దానికై సమస్తాన్నీ పరిశోధించాలి. దానికి సంఘాలతో, ఆశ్రమాలతో పనిలేదు. సత్యం సర్వవ్యాపి గనుక, మన సంబంధమంతా ఆ పరమ సత్యంతోనే వుండాలి. సత్యాన్వేషణలో ఆశ్రమమే ప్రధానమైన దైతే, మనం మనల్ని పోగొట్టుకున్నవారమౌతాము.

"ఆశ్రమాల్లో బోధకులు, ముఖ్యులై, అన్వేషకులు అముఖ్యులౌతారు. తాము ఏరి, కోరి తీసుకున్న గురువును, తమపై అధికారిగా చేసుకుంటారు. ఆశ్రమంలోవుండి, గురువు చేట్టూ చేరి, ఆయనకు సర్వాధికారాలూ అంటగడతారు. ఓ అదికారం కింద ఆశ్రమంలో చేరితే, జీవితాన్ని నాశనం చేసుకున్నట్లే.

"ఆశ్రమాల్లోంచి బైటికి వచ్చిన వారిని చూడండి - ఎంత మందకొడిగా, మొద్దుల్లాగ, బుద్ధిహీనుల్లాగ పాలిపోయి, అలసిపోయినట్లు వుంటారో! అన్వేషణలో తృప్తినీ, మోక్షాన్నీ, సంతోషాన్నీ వెదికారా, సత్యం దూరమౌతుంది. కాబట్టి మీ సంబంధమంతా ఎప్పుడూ, ఎవరితోనూ, దేనితోనూ కాక, కేవలం మీతోనే వుండాలి. ఎందుకంటే, సత్యం ఎప్పుడూ మీలోనే, మీతోనే వుంది. కనుక మీరు మీ యెడల గౌరవంగా, మర్యాదగా, నీతిగా, నిజాయితీగా, ధర్మంగా మసలుకోండి. అంటే ప్రతిక్షణం సమస్తాన్ని పరిశోధించాలి. ఆ పరిశోధనలో ఏం జరుగు తుందోనని చూడకూడదు. ప్రతిఫలాపేక్ష లేకుండా నిరంతరం పరిశోధించాలి.

"ఆ నిష్కామకర్మే, జీవితంలో అందమైన సంగతి. మనం ఏం చెయ్యాలో ఎవరూ మనకు చెప్పనవసరంలేదు.

మనం ఎక్కడ వున్నా, మనం, మనంగానే వుండాలి. మనం మరోవిధంగా వుండకూడదు. "మనం, మనంగా వుండాలి" అని ప్రయత్నపూర్వకంగా, బలవంతంగా వుండటంకాదు. మనం ఇంకొకరిగా, ఇంకోవిధంగా, ఇంకా ఏదోగా వుండాలని ఎప్పుడూ ఆశపడకూడదు. అంటే, మనం ఎప్పుడూ మనంగా, సహజంగా వుండాలి. తీవ్రమైన పట్టుదలతో, శ్రద్ధగా పరిశీలిస్తే, దేనికైనా సరే-ఆ సత్యమేదో మనదగ్గరే, మనలోనే వుందని గ్రహిస్తాం. అదే ఎరుక. ఆ ఎరుకే బ్రహ్మానందం.

"తనను తాను తప్ప ఏసంస్థా, ఏ సంఘం, ఏ ఆరాధనా విధానం, ఏ నిర్మాణం మనిషిని స్వేచ్ఛపరచలేవు. ఈశ్వర రాజ్యంలో ప్రవేశించడానికి కొందరి వద్దే తాళం చెవులు వున్నాయనుకోకండి. ఆ తాళం చెవి ఏ ఒక్కరిదీ కాదు. అది అందరి వద్దా వుంది. అదే, ఆత్మ. అదే నేను - అహం - సత్యం - శివం - సుందరం. అదే శాంతి-ఆనందం-మోక్షం. అది అన్ని కాలాల్లో, అంతటా అందరిలో ఒకే విధంగా, ఒకటిగా వుంది. అది ఎప్పుడూ విస్తరించేటట్లూ, పవిత్రమయ్యేట్లు, చూసుకోవాలి. దాన్ని సన్మార్గంలో, సక్రమంగా ఏర్పాటు చేసుకోవడంలో వుంది, ఈశ్వరరాజ్యం. అంటే, సమస్తం మనలోనే వుంది.

"అటువంటి ఈశ్వరరాజ్యాన్ని అర్థంచేసుకుని, తెలుసుకుని, అనుభవించి, నిజంగా ఆ మార్గాన్నే నడవదలచుకున్న వాళ్ళు, ఎప్పుడూ కలిసేనడుస్తారు, దాని ప్రకాశ తీక్షణతలో. చివరికి వాళ్ళే మహాజ్వాలలౌతారు. అటువంటి వారినే నేను కోరేది. నేను చెప్పేది శ్రద్ధగా విని, నన్ను అర్థం చేసుకున్న వారు ఒక్కరైనా చాలు. ఆ మార్గాన నడిచే వారిలో ప్రేమ -

దయ-స్నేహం-సహనం-సహకారం స్థిరంగా, శాశ్వతంగా నిలిచి పోతాయి. ఆ స్థితి అన్ని అందాల కన్నా, అన్ని త్యాగాల కన్నా గొప్ప సంగతి.

" నా విషయమై కొందరు బాధపడ్డారు. కొందరు నన్ను వ్యతిరేకించారు. ఎవరేమనుకున్నా, నేను నా లక్ష్యాన్ని చేరుకున్నాను; ఎన్నో యాతనలు, బాధలు, దుఃఖాలు, కష్టాలు అనుభవించి. మీ యందు నా ప్రేమ తగ్గిందనిగాని, నేను మిమ్మల్ని ఉపేక్ష చేస్తున్నానని కాని ఎన్నడూ అనుకోకండి. నా హృదయమంతటితో మిమ్మందర్నీ మరింత సన్నిహితంగా ప్రేమిస్తాను. అసలు నేనెవరినీ ఒదులుకోను. కాని, చాలా మంది నన్నే ఒదిలేస్తారు.

"జగద్గురు విషయమై చర్చించడంగాని, "కృష్ణమూర్తి" అనే వ్యక్తి ఆవిర్భవించడంలోని ఆంతర్యాన్నిగాని, అతను గొప్పవాడని వర్ణించి చెప్పడంగాని నా అభిమతం కాదు. మీ దుఃఖాల్ని-కష్టాల్ని – బాధల్ని - అర్థంలేని నిరంకుశత్వాల్ని - సంకుచితమైన హద్దుల్ని కడిగేసుకునేందుకు కావలసినంత నీటిని అందివ్వడమే నా పని. దానితో మీరు శుభ్రంగా స్వేచ్ఛగా వుండగలరు.

"నేను మీరు అనుకునే దేవుణ్ణి లేదనడంలేదు. నేనెప్పుడూ దేవుడు లేదనడంలేదు. కాని, నేనుమాత్రం మీరనుకునే దైవాంశ సంభూతుడను కాను. కాని, సహజంగా విచ్చుకున్న పుష్పాన్ని," అన్నాడు కృష్ణమూర్తి.

• • •

కృష్ణమూర్తి ఆవిధంగా పోట్లాడి జగద్గురు వ్యవహారం నుంచి చేతులు కడిగేసుకున్నాడు. ఆ విషవలయంలోంచి కావలసి తప్పించుకున్నాడు. అతని మాటల ధోరణి, తత్వం సమాజ సభ్యు లకు, సంస్థ సభ్యులకు చాలా బాధ కలిగించింది. వాళ్ళ ఆశలు అడియాశలయ్యాయి. అందరూ నిరుత్సాహ పడ్డారు. కొంద రికి కృష్ణమూర్తిపై కోపంవచ్చింది. కొందరు అతన్ని వదిలే శారు. కొందరు వ్యతిరేకించారు. అనీబిసెంట్ వంటి మేధావులు చెప్పేది నిజమో, లేక తనకు తానుగా కృష్ణమూర్తి గట్టిగా నొక్కి చెప్పేది నిజమో తెలియక కొందరు అయోమయస్థితిలో పడ్డారు. మరికొందరు కృష్ణమూర్తిని చూసి, విని, వదలలేక ఆకర్షణలో పడి అసలు సంగతి ఏనాటికైనా అతనినుంచే విని, తెలుసుకోవా లనే గట్టి పట్టుదలతో వున్నారు. కాని, అనీబిసెంట్ మాత్రం పట్టువదలలేదు. ఆమె కొంతమంది పెద్దల్ని, ప్రముఖుల్ని, మేధావుల్ని ప్రాధేయపూర్వకంగా అడిగింది, "కృష్ణమూర్తిని చివరివరకు శ్రద్ధగా విని అనుసరించండి," అని. కాని, ఆమె కూడా అంతర్యంలో కలవరపడింది-తాను కనిన కలలు, పెంచు కున్న ఆశలు, పెట్టుకున్న ఆశయాలు, నిలుపుకున్న విశ్వాసాలు అన్నీ చెల్లాచెదురై పోయినట్లూ, తాను నిర్మించిన సురక్షితమైన రాతిగోడల భవనంలోంచి కృష్ణమూర్తి బైటికి వెళ్ళిపోయినట్లూ బాధపడింది.

కృష్ణమూర్తి తన ఆలోచనల్ని, తాను చెబుతున్న సంగ తుల్ని ఎప్పటికప్పుడు లెడ్‌బీటర్‌కి తెలియపరిచేవాడు. ఆయన వాటిని ఆమోదిస్తో "నువ్వు ఇప్పుడు పూర్ణమానవుడవు. నీకు జరగవలసినవన్నీ జరిగాయి," అని, ప్రపంచాన్ని ఉద్ధరించేం దుకు త్వరలో జగద్గురువు అవతరించబోతున్నారన్న సిద్ధ పురుషుల మాట, నిశ్చయంగా, కృష్ణమూర్తిని ఉద్దేశించినదే" అనే నిశ్చయానికి కూడా వచ్చాడు.

స్వర్ణోత్సవాల ముగింపు సమావేశంలో, "కృష్ణమూర్తి నిశ్చయంగా రాబోయే జగద్గురువు. మహాత్మా మైత్రేయుని అవతరణకు అనువైన దేహం కలవాడు. మనము దీనికోసమే ఇన్నాళ్ళూ ఎదురు చూశాము. దీనిపై వ్యతిరేక భావాలు వుండటం సహజం," అన్నది, అనీబిసెంట్. ఆ తర్వాత థియసాఫికల్ పత్రికలో "డిశంబరు ఇరవై ఎనిమిదవ తేదీన అడయార్ దివ్యజ్ఞాన సమాజ ఆవరణలో మర్రి చెట్టు కింద కృష్ణమూర్తి మాట్లాడింది అద్భుతంగా వుంది. జగద్గురువే మాట్లాడుతున్నట్లుంది. మన నిరీక్షణకాలం గడచిపోయింది. దిగంతాల పైన ఉదయ తార ప్రకాశిస్తోంది," అని రాసింది అనీబిసెంట్.

లెడ్‌బీటర్ సిడ్నీ నుంచి రాస్తో, "1911లో, 1925 డిశంబరు ఇరవై ఎనిమిదవ తేదీన - రెండు సార్లు కృష్ణమూర్తి ద్వారా మహాత్మా మైత్రేయ మట్లాడారనిపించింది. ఇకనుంచి మైత్రేయ కృష్ణమూర్తి దేహాన్ని ఉపయోగించుకుంటారనిపిస్తోంది," అన్నారు.

1926 జనవరి నెలాఖరు నాటికి అడయార్‌లో దివ్యజ్ఞాన సమాజ స్వర్ణోత్సవాలు పూర్తిగా ముగిశాయి. కొందరు లెడ్ బీటర్‌తో కలిసి సిడ్నీ వెళ్ళారు. లేడీ ఎమిలీతో కొందరు యూరప్ వెళ్ళారు. కృష్ణమూర్తి బెనారస్ వెళ్లాడు. మొత్తంమీద స్వర్ణోత్సవాలకు హాజరైన వారిలో కొందరు కృష్ణమూర్తి విషయమై ముభావంగా వుండిపోయారు. మరి కొందరు అయిష్టత చూపారు. చివరికి 'ఎవరికి వారే, యమునా తీరే!' అన్నట్లు వెళ్లిపోయారు.

కృష్ణమూర్తికి ఎప్పుడూ, దేనిమీదా అనుమానమంటూ లేదు. కాని, ఊటీనుంచి లెడ్‌బీటర్‌కి వ్రాస్తూ "ఈ

అపోస్టల్స్ వ్యవహారం, వారి దీక్షలు నాకు అసహ్యంగా వున్నాయి. వాటిల్లో నాకు నమ్మకం లేదు. వాటి గురించి ఎవరు మాత్రం గొడవ పడటం వ్యార్థమనుకుంటాను. ఇదంతా జార్జి ప్రభావమనిపిస్తోంది. వెడ్జివుడ్ దీక్షా ప్రదానాలు జోరుగా సాగిస్తున్నారుట. "దీక్ష" ఒక జోక్‌గా తయారైంది," అన్నాడు.

ఒకసారి కృష్ణమూర్తి మాటల్లో మిత్రులతో, "నా పాతకల పూర్తిగా కరిగి, ఊడ్చుకుపోయింది. కొత్త కల ఆరంభమైంది. అంతా శుభ్రంగా, స్పష్టంగా, స్వచ్ఛంగా వుంది. డిశంబరు ఇరవై ఎనిమిదినుంచి నేనూ స్వేచ్ఛగా వున్నాను. సహజంగా వున్నాను," అన్నాడు.

ఆ తర్వాత దివ్యజ్ఞాన సమాజంలో వర్గాలు ఏర్పడ్డాయి.

కృష్ణమూర్తిలో మార్పు వచ్చిన తర్వాత ఆయనున్నుంచి వెలువడిన ప్రతి మాటా స్పష్టంగా, అర్థయుక్తంగా, స్వేచ్ఛగా, గంభీరంగా, ఊహాతీతంగా, నిశ్చయంగా, నిర్భయంగా, అద్భుతంగా వుండటం వల్ల శ్రోతలు విస్మయం చెందారు. ఆ మాటలు వాస్తవంగా, వివేకవంతంగా వుండి, శ్రోతల హృదయాల్ని సూటిగా తాకడంవల్ల ప్రతివారూ మరింత ఆసక్తితో, ఆశ్చర్యంతో కృష్ణాజీని శ్రద్ధగా విననారంభించారు.

చాలామంది పాతమిత్రులు కృష్ణమూర్తిని వదిలేశారు. కొందరు అతన్ని చాలా ఇబ్బంది పెట్టారు. కాని, ఎంతో మంది, వివిధ దేశాల వారు అధిక సంఖ్యలో అతన్ని అనుసరించారు. అతని ఉనికిలో శాంతిని పొందారు.

• • •

జీవితంలో ప్రతి ఒక్కరూ తమ చదువుల-సంస్కారాల-సాంప్రదాయాల-పరిస్థితుల-ప్రభావాల ఫలితాలకు అనుగుణంగా తమకు ఏమాత్రం తెలియని సత్యాన్నో-ఆత్మనో - ఈశ్వరుణ్ణో ఏదో విధంగా తెలుసుకోవాలని ప్రయత్నిస్తారు. దాన్ని దృష్టిలో పెట్టుకుని, ఓమార్గం ఏర్పరచుకుని ఆ లక్ష్యంవేపు పురోగమిస్తారు.

ఆ విధంగా ఆశా, ప్రయత్నాలతో పురోగమించేముందు ఎవరికి వారు తమను తాము లోపలా-బైటా వివేకంతో, హేతువాదంతో తర్కించుకోవాలి, విమర్శించుకోవాలి. అదే ఆ సాధనా మార్గంలో ముఖ్యమైన సంగతి. జీవితంలో మనం చేయవలసిన పని ఏమిటి ? అసలు జీవితోద్దేశ్యం ఏమిటి ? ఇన్నాళ్ళూ మనం ఏం చేశాం ? మన యెడల మనం ఎట్లా ప్రవర్తించాం ? ఈ జీవితానికి అర్థం ఏమిటి ? ఒక వేళ మనం కోరే ఆఆత్మనో, సత్యాన్నో, ఈశ్వరుణ్ణో మనం దర్శిస్తే, దాన్ని మనం మరొకరికి చూపగలమా ? దానిగురించి ఇతరులకు వివరించి చెప్పగలమా ? వాళ్ళూ ఆ సత్యాన్ని తెలుసుకునేందుకు మనం సహాయపడగలమా ? మనకు కలిగిన అనుభవంతో ఇతరులను దుఃఖంనుంచి, బాధలనుంచి, కష్టాలనుంచి తప్పించి, ఆనందాన్ని ఇవ్వగలమా ? వాళ్ళను పరమోన్నతమైన స్థితికి తీసుకుపోగలమా ? " అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి.

"ఆ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు కావాలంటే, మీరు నాదగ్గరకు రండి," అంటూ కృష్ణమూర్తి ఎన్నో ఉపన్యాసాలిచ్చాడు-ముఖ్యం స్టార్ సభ్యులకు ;

"నా శాశ్వత నివాస స్థలమైన పూలతోట ఆ ప్రశ్నలన్నింటికీ సమాధానం ఇస్తుంది. ఆ సమాధానాలను బట్టి అసలు మీరేమిటో, మీ రెట్లా జీవిస్తున్నారో, మీకే అర్థమౌతుంది.

నేను ఈ విశాల విశ్వంలోకి పెద్ద గేట్ తెరిచాను. బహుశా మీరు మీ చిన్న కిటికీలోంచి అనంత ఆకాశంలోని ఓ చిన్న భాగాన్ని మాత్రమే చూస్తూ వుండవచ్చు. నేను విశ్వ సౌందర్యాన్ని విశాలంగా చూడ్డంవల్ల అది నాకు మరింత స్పష్టంగా కనుపిస్తోంది. అందుచేత మిమ్మల్ని నా దగ్గరకు రమ్మనీ, ఆ సౌందర్యాన్ని దర్శించమనీ, ఆనందించమనీ నాహృదయ మంతటితో ఆహ్వానిస్తున్నాను.

"మీరు మీ చిన్న కిటికీ వదిలేసి, పెద్ద గేటుల్లోంచి అనంత ఆకాశాన్ని చూడమంటున్నాను. అలా చూసే ముందు మీలో ఎటువంటి దురభిమానాలు, ప్రత్యేకాభిప్రాయాలు, ముందుగా ఏర్పరచుకున్న నిర్ణయాలు ఏమాత్రం వుండకుండా చూసుకోండి. నేనూ మీ మాదిరిగానే చూస్తాను, వింటాను, అర్థంచేసుకుంటాను, అనుభవిస్తాను. నేను నిజంగా ఏది అనుభవిస్తున్నానో, ఏది వాంఛిస్తున్నానో దాని గురించే మాట్లాడతాను. అందుచేత నన్నెవరూ గుడ్డిగా, అనాలోచితంగా అనుసరించవద్దంటున్నాను. నేను చెప్పింది విన్న తర్వాత, మీ సంగతి మీరె నిర్ణయించుకోండి.

"మనలో ప్రేమ వున్ననాడు, అది జీవితంలో ఎట్టైనా మళ్ళుతుంది. ఆనాడు మనం విశ్వాన్నంతనీ ప్రేమించగలుగుతాము. మనలో నిజంగా ప్రేమ వుంటే, మన చుట్టూ ఎటువంటివాళ్లు ఎంతమందివున్నా, మనని ఏదీ అంటదు. వీచే గాలివల్ల నిర్మల తటాకంలోని నీరు కదిలి, చెదిరి, అలలు రేగవచ్చు. అదంతా నీటి ఉపరితలాన మాత్రమే! కాని తటాకం లోపల స్థిరత్వం, దృఢత్వం, శాంతం, నిశ్చలత్వం వుండనే వుంటాయి. అలాగే మన చుట్టూ ఎన్ని వున్నా ఎందరువున్నా వాళ్లు మనల్ని ద్వేషించినా, ప్రేమించినా మనల్ని కలవర

పరచవు. కాని, ఇతరులు బాధపడుతోవుంటే, చూసి భరించ లేము. వారికి ఏదోవిధంగా సహాయపడాలని చూస్తాము. అందుకే నేను మిమ్మల్ని నాపూలతోటకు రమ్మనీ, దాని అందాన్ని చూసి, ఆనందించమనీ వేడుకుంటున్నాను. రండి. వచ్చి, దాని గురించి బాగా యోచన చేయండి. కానీ, నాతో, మాత్రం అనకండి, "నువ్వు ప్రత్యేకమైన వాడివి. నువ్వు పర్వత శిఖరాన వున్న యోగివి," అని.

"మీరు నన్ను ఆవిధంగా పొగిడి, నా సత్యాన్ని మీ మాటలతో కప్పాలని చూడకండి. నేను మీ నమ్మకాలను, కూలతొయ్యాలనుకోవడంలేదు. మీరు సరైనవి కావనుకున్న వాటిని, నేను చేయమనను. కాని, "మీలో ఎవరైనా నిజంగా సుఖంగా - సంతోషంగా - హాయిగా - ఆనందంగా వున్నారా? శాశ్వతమైన-దివ్యమైన ఆ పరమసత్యాన్ని మీలో ఎవరైనా దర్శించారా? అమరత్వం, అక్షయం అంటే, ఏమిటో మీకు తెలుసా?" అని నేను మిమ్మల్ని అడుగుతాను. ఎందుకంటే, దానివల్ల అసలు మీరేమిటో నిర్ణయింపబడతారు.

"ఏ పేరూ దేనికీ పెట్టకండి. దేనితోనూ సత్యాన్ని కప్పాలని చూడకండి. ఏదీ శాశ్వతం కాదు. అన్నీ అశాశ్వతం. సత్యం ఒక్కటే, శాశ్వతం. మీరు కల్పించే వాటికీ, మీరు కప్పేవాటికి బలం లేదు. అవి నిజమైన శక్తిని, ఆనందాన్ని ఇవ్వవు.

"వాస్తవం-శాశ్వతం-సత్యం" అయిన ఆ నాపూలతోటకు రావడానికి మీరెందుకు సందేహిస్తున్నారు." అని నేను మిమ్మల్ని ప్రేమతో అడుగుతానేకాని, నన్ను అనుసరించ మనను. స్టార్ సంస్థ సభ్యులైన మీరు నన్ను మీ నమ్మకాల్ని

అనుసరించేటట్లూ, మీ పద్ధతులపై నేను నడిచేటట్లూ నన్ను మార్చాలనుకున్నారు, అవునా? మీరు మీ నిర్ణయమే సరైనది అనుకుంటున్నారు. మీరు మీ మార్గాన్ని మాత్రం వదలరు. కాని, నన్ను మీ తోవన నడవమంటున్నారు. మీ భావాలతో, స్వభావాలతో నన్ను ఏకీభవించమంటున్నారు. కాని, మీకు ఇప్పుడు సమయం వచ్చింది-ఏదారిని నడవాలో మీరే నిర్ణయించుకోవడానికి. నేను దేనికీ చెందినవాడను కాను. అందరివాడను. నిజంగా ప్రేమించేవారికీ, బాధలుపడేవారికి-అందరికీ సంబంధించిన వాడిని.

"మీకు నడవాలనిపిస్తే, నా వెంటరండి. మీకు అర్ధం చేసుకోవాలనిపిస్తే, నామనసుతో యోచించండి. మీకు అను బవం కావాలంటే, నా హృదయంతో దర్శించండి. ఎందుకంటే, నేను నిజంగా మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీరూ ప్రేమిం చండి అంటున్నాను. నేను ఆనందాన్ని అనుభవిస్తున్నాను. మీరూ ఆపరమానందాన్ని అనుబవించాలనుకుంటాను. అలాగే మీరూ అన్నింటినీ హృదయ మంతటితో స్వీకరించమంటున్నాను. అదే నిజజీవితం. అదే సత్యం. జీవితంలో అదొక్కటే అన్నింటికన్నా ఘనంగా పొందదగింది.

"నేను చిన్నప్పటినుంచీ ప్రతిదానికీ ఎదురుతిరిగేవాణ్ణి. అంటే, ఇతరుల అదికారంమీదా, వాళ్ళ ఉపదేశాలమీదా విముఖత చూపేవాణ్ణి. కాని, ఏంచేసినా తృప్తి కలగలేదు. నేను కోరిన శాంతి లభించలేదు.

"జీవితంలో నేను చదివి-విని-చూసి-తెలుసుకున్న కొన్ని సంగతుల్ని, విషయాల్ని, పద్ధతుల్ని అనుసరించాను; అనుష్ఠించాను, శ్రద్ధగా పరిశీలించాను, కొన్నింటిని ఆచరించాను; మరి

కొన్నింటిని ఆదరించి పాటించాను. అయినా నాకు తృప్తి కలగ లేదు. ఆనందమూ లభించలేదు. కాని, వాటికి అతీతంగా ఏదో వుందనిపించింది. దాన్ని తెలుసుకోవాలనుకున్నాను. దాన్ని తెలుసుకోవడానికి ఎవరిమీదా, దేనిమీదా ఆదారపడకూడ దని గట్టి నిశ్చయం చేసుకున్నాను. నేనెన్నడూ ఇతరుల భావాల్ని వ్యతిరేకించలేదు కాని, అధికారాన్నీ, జీవిత పద్ధతినీ అంగీకరించలేదు. నాకు నేనే ఆ పరమ సత్యాన్ని తెలుసుకోవాలను కున్నాను. ఒకరి అధికారం క్రిందగాని, ఒకరిని అనుసరించి గాని, ఒకదాన్ని ఆచరించిగాని, ఓ గ్రంధాన్ని చదివిగాని, ఓ సాంప్రదాయాన్ని పాటించిగాని, ఓ మతాన్ని అనుష్టించిగాని, దేన్నీ ఆధారంగా తీసుకునిగాని నేను సత్యాన్వేషణ చేయదలచు కోలేదు. అన్ని మతాల, అన్ని నమ్మకాల, సిద్ధాంతాల, పద్ధతు లతో అసంతృప్తుడనయ్యాను. వాటి వెనుకనున్న సత్యాన్ని స్వయంగా తెలుసుకోవాలనుకున్నాను.

"ఈ ప్రపంచాన్ని పూర్తిగా విస్మరించినవానికి నిజమైన సంతుష్టి వుంటుందనీ, అతడు జీవితాన్ని ఆనందంగా అను భవించగలడనీ నేను మొదట తెలుసుకున్నాను, ఆ స్థిర నిశ్చ యంతో మూసిన తలుపులన్నింటినీ తట్టాను - తెరచుకోమనీ, ఆనందాన్ని ఇవ్వమనీ. ఎవరైనా ఒకసారి ఆ పరమ సత్యాన్ని తెలుసుకుంటే, జీవితంలో ఇంక దేన్నీ కోరుకోము. దేనికీ భయ పడము. ఏ ప్రయత్నమూ చేయము. అసలు దేనికీ ఆశపడము.

"నా లక్ష్యం దూరాన మిణుకు మిణుకు మంటూ కనిపించ డం వల్ల, దాన్ని ఆధారంగా తీసుకని అనేక ఊబుల్లోంచి, ఎంచించడం కోసం తవ్వి మూసిన గోతుల్లోంచి, కష్టాల్లోంచి, దుఃఖాల్లోంచి నడిచాను. దారి పొడవునా బాధలు పడ్డాను. ఏమైనా దాన్ని సహజంగా పొందాలనుకున్నాను. నన్ను

బంధించే వాటినుంచి విముక్తికై గట్టిగా పెనుగులాడాను. సత్యాన్ని తెలుసుకోవడమే జీవితలక్ష్యంగా పెట్టుకుని కొన్నాళ్ళు కఠిన సాధనలు చేశాను. బైటనుంచి ఎప్పుడూ, ఎటువంటి సహాయమూ కోరలేదు. మధ్యలో నా సాధన ఆగలేదు. నా కోర్కెలు ఆశలు, సంవత్సరాల తరబడి నేను పడ్డ బాధలు; యాతనలు అనే రాతి గోడలు; ఇంకా అనేక అడ్డంకులు, అభ్యంతరాలు పూర్తిగా కూలి నేలమట్టం అయ్యేవరకు పట్టువిడవలేదు.

"చివరికి సత్యాన్ని తెలుసుకున్నాను. నేను ఆయనలో ఐక్యమయ్యాను. ఇప్పుడు నా మనసు నిర్మలంగా, హృదయం శాంతంగా వున్నాయి. మీరు కూడా ఆ సత్యాన్ని తెలుసుకోవాలని నా ఉద్దేశ్యం. మీకు మీరే ఆ మార్గాన నడవాలని నా అభిలాష. అది మీ స్వానుభవం కావాలని నా కోర్కె. ఇప్పుడు మీకు ఆ నా మార్గం చూపుతానంటున్నాను. అంతే! ఎందుకంటే, మీరు బాధల్లో, దుఃఖాల్లో, కష్టాల్లో, సందేహాల్లో, తికమకల్లో వున్నారు. నేనిప్పుడు కేవలం రోడ్డు పక్క దారి చూపే స్తంభం మాదిరిగా వున్నాను," అన్నాడు కృష్ణమూర్తి.

* * *

"ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు. అన్నింటికీ అంతంవుంది. ఈ చరాచరాలన్నీ తిరిగి ఆ ధూళిలో కలసిపోవలసిందే! సత్యం ఒక్కటే, శాశ్వతమైనది. సత్యమే, దైవం, వాస్తవం. అదే పూలతోట - ఆనందసాగరం - ఈశ్వరరాజ్యం. సత్యమంటే ఆది - అంతాలు లేని అమరత్వం. అదే అమృతం - అక్షయం - మోక్షం - జ్ఞానం. అది అపారనిధి. అటువంటి పరమ సత్యాన్ని మానసికంగా వికసించిన విశాల హృదయులే దర్శించగలరు. దాన్ని మీరొకసారి దర్శిస్తే, ఆ అమృతాన్ని మీరొకసారి

రుచి చూస్తే, ఆ పరిమళాన్ని మీరొకసారి ఆఘ్రాణిస్తే " అదే శాశ్వతం - అక్షయం - సత్య - శివం - సుందరం, " అని మీకు మీరే తెలుసుకుంటారు.

"సత్యమంటే ఏమిటో తెలియనివాళ్ళు, దాని గురించి ఏమీ చెప్పలేరు. జీవితంలో అనేక బాధలూ-కష్టాలు-సుఖాలు-సంతోషాలు-పరమానందాలు-యాతనలు, దుఃఖాలు అనుభవించిన వారు మాత్రమే, సత్యమంటే ఏమిటో కొంతవరకు మాటల్లో వర్ణించి చెప్పగలరు. అదీ అస్పష్టంగానే! ఎందుకంటే, మాట సత్యం కాదు కనుక, శాశ్వతమైన ఆ పరమ సత్యాన్ని ఎవరికి వారు తమ ఆలోచనల,అనుభవాల, భావాలతో, ఆత్మ విశ్వాసంతో, నిర్మల మనస్సుతో, పవిత్ర హృదయంతో తెలుసుకోవాలి.

"ఒక్క సత్య సందర్శనం తప్ప, ఈ ప్రపంచంలో ఏదీ తృప్తిని ఇవ్వదు. అటువంటి సత్యాన్ని తెలుసుకోవాలంటే, ఈ విశాల విశ్వానికి విడిగా, ప్రత్యేకంగా మనలో నిరంతరం "నేను-నేను" అని అంటున్న ఆ 'మిథ్యా నేను' తిరిగి తలెత్త కుండా నాశనంకావాలి. అప్పుడే మన చుట్టూ వున్నవాటికీ, మనకూ, మధ్య నున్న సంబంధాన్ని స్పష్టంగా తెలుసుకోగలుగుతాము. ఆ విధంగా అన్నింటినీ తెలుసుకోగలిగిననాడు ప్రతీదీ కొత్త అర్థాన్ని, కొత్త సంతోషాన్ని, కొత్త ఆనందాన్ని ఇస్తుంది. ప్రతి ఒక్కటీ నూతన రాగాలాపన చేస్తుంది. మనలోనూ నూతనత్వమే పలుకుతుంది. మనము అన్నిటిలో ఐక్యమై కొత్త గాలులు పీలుస్తాం. అప్పుడే జీవితం అందంగా, ఆనందంగా వుంటుంది. మన కళ్ళ ఎదుట ఎప్పుడూ ఆ దృశ్యమే నిలిచి వుంటుంది. మన కళ్ళ ద్వారా ఆయన చూసినప్పుడు, మన నోటిద్వారా ఆయన వాక్కు వెలువడినప్పుడు, మనమంతా ఆయనే అయిన ప్పుడు-అప్పుడు ప్రతి చెట్టుపాటా, ప్రతి నక్షత్రపు కాంతీ, మనవే అవుతాయి, ప్రతి మానవుడు, మన ప్రేక్షకుడౌతాడు.

"కాని, మనం జీవితంలో వుండవలసినంత ఆనందంగా వుండటంలేదు. కుటుంబం-స్నేహితులు - విచారాలు - వచ్చీ, పోయే, ఆలోచనలు....ఇంకా,ఇంకా, ఎన్నెన్నో విషయాలతో, బాధలతో వుంటున్నాం. కనుక మనం ఒకసారి ఆ పూలతోట లోకి వెళ్ళివస్తే, అవన్నీ వాటంతట అవే తొలగిపోతాయి. మనం ఆ పూలతోటలో నిలవగలిగిననాడు, ప్రపంచానికి సహితం ఆనందాన్ని, సంతోషాన్ని అందివ్వగలుగుతాము. కాని, ఇతరులకు ఇచ్చేముందు, మనం ఎంతో పోగుజేసు కోవాలి కదా ?

"నేను-నాది" అనేవి దుఃఖకారణం. సత్యం, శాశ్వత మైనది. అది ఈశ్వర రాజ్యానికి చెందినది. "నేను" కీ, ఆ సత్యానికీ మధ్య అంత బేదం వుంది. ఈశ్వరరాజ్యం చేరుకోవాలనుకున్నవాడు, ఎంత కష్టమైనా, అసాధ్యమైనా, అలసట కలిగినా, బాధాకరమైనా "నేను" అనే తలంపును సమూలంగా నాశనం చేయాలి. "నేను" లేని స్థితిలో ఏ ప్రత్యే కతా వుండదు. అప్పుడు మనం అన్నింటిలో ఐక్యమౌతాం.

"ఈ ప్రపంచం దట్టమైన అడవి వంటిది. అందున్న చెట్లే, సమస్త వస్తు సముదాయం. ఆ అడవిలోంచి నడచి ముందుకు వెళ్లాలంటే, దారికి అడ్డువచ్చే ఎండుకొమ్మల్ని, ముళ్ళ తీగల్ని విరుచుకుంటో, కాల్చుకుంటో వెళ్ళాలి. నేను ఆవిధంగా వెళ్ళి, సమస్తానికీ మూలమైన శాశ్వతత్వాన్ని దర్శిం చాను. అమృతాన్ని రుచిచూశాను. ఆనందాన్ని అనుభ వించాను. కనుక మీరూవచ్చి, ఆ మాధుర్యాన్ని చవిచూడ మంటున్నాను.

"ఇది కేవలం నా స్వప్నమే, నా ఆనందమే, నా సంతోషమే కావచ్చు. కాని, ఆ పరిమళమారుతాన్ని పీల్చేందుకూ, "నేను" లేని స్థితిని అందుకునేందుకూ, విశ్వసౌందర్యాన్ని చూసి ఆనందంలో ఓలలాడేందుకూ మీలో శక్తీ, విశాలత్వం, బలం, ధైర్యం వుండాలి కదా? వాటి సహాయంతో మీలో అనాదిగా వున్న దురభిమానాల్ని, క్షపపాతాల్ని, నాశనం చేసుకోవాలి. ఎందుకంటే, మీరు చూడబోయేది పరమసత్యాన్ని. అది బుద్ధి-స్వభావం-ఆలోచన-భక్తి- ప్రేమ - మనో ఉద్రేకాల సారం. అటువంటిదాన్ని మనం మన మానసిక త్రిప్పటలతో, పక్షపాతాలతో, దురభిమానాలతో దర్శిస్తే, దాని సౌందర్యం, ఔన్నత్యం, ఔదార్యం కనుపించవు. రంగు అద్దాలు సూర్యకాంతిని మసక జేయునట్లు, మన గుణాలు, స్వభావాలు, సంకుచితతత్వాలే ఆ దివ్యదృశ్యాన్ని, ఆ సత్యాన్ని వక్రంగా, మలినంగా చూపించి అపార్థాన్ని కలిగిస్తాయి. కనుక మనం దాన్ని దర్శించేముందు మనలో వున్నవాటినన్నింటినీ చెల్లాచెదురుచేసి, సర్వనాశనం చేయాలి. అంతకంటే ముందు అంతర్వాణి ఆజ్ఞ శిరసా వహించాలి. కాబట్టి ప్రతిక్షణం ఆ సత్యంలో జీవించాలి. ఆ పరమానందంలో లీనం కావాలి. దాన్నో అమూల్య ఆభరణంగా హృదయపేటికలో దాచుకోవాలి.

"వివేకంతో మనసునీ, హృదయాన్ని పవిత్రంగా నిర్మలంగా వుంచుకుంటే, మనం, నిత్యం చూసే భౌతిక దృశ్యాలన్నీ —సూర్యాస్తమయ కాంతి, ఆ కాంతిలో కొండ, దాని నీడలో లోయ, గాలిలో ఎగిరే పక్షి, నీళ్ళలో ఈదే చేప-వాటి అందమంతా మనలో శాశ్వత ముద్రపడుతుంది. కాని, మనం ఎప్పుడూ అశాశ్వతమైనవాటినే, శాశ్వతమైనవిగా భావిస్తాం. ఆ అశాశ్వతమైనవి మనల్ని ముట్టడించి, అధిగమించి, పాలించడం వల్ల నీలాకాశంలో సంధ్యాసూర్యుణ్ణి, ఎగిరే పిట్టల్నీ, తేలియాడే

మబ్బులోన్నీ - దేనిని చూసినా, ఏది విన్నా, ఆ ఆనందాన్ని పొందలేకపోతున్నాం. క్రమంగా మన జీవితంలో ఔదార్యం, ఔన్నత్యం, విశాలత్వం అరుదై, మరుగై పోతున్నాయి.

"మన మొకసారి ఆ ఆనందాన్ని-మోక్షాన్ని-స్వర్గాన్ని-నిర్వాణాన్ని - పూలతోటను - ఈశ్వరరాజ్యాన్ని - అదే అసలు వున్నదాన్ని-సత్యాన్ని-ఆత్మను-"నేను"ను-ఒకసారి దర్శిస్తే; అది ఒక క్షణమైనా మన అనుభవంలో వుంటే, సత్యమంటే ఏమిటో తెలుస్తుంది.

"ఉన్నది సత్యమొక్కటే అన్నీ, అదే. అదే అన్నింటికీ శాశ్వత నివాస స్థలమని అనుభవ పూర్వకంగా తెలుసుకున్ననాడు వియోగానికీ, ఒంటరితనానికీ తావు వుండదు. కనుక మన చుట్టూ అనుక్షణం అందమైన పూలతోటను పెంచుకోవాలి.

"ఆ తోటంతా అందంగా పూయాలంటే, దాన్ని పాడు చేసే ముళ్ళ చెట్లనూ, అసహ్యపరిచే రాళ్ళనూ ఏరి, పారేసి పరిశుభ్రంగా వుంచుకోవాలి. అదే మనం చేయవలసిన పని. ఆ పూల పరిమళం పీలుస్తున్నంతసేపూ మనని ఏమాయా కప్పలేదు. మనకూ ప్రత్యేక వ్యక్తిత్వం అంటూ వుండదు. అప్పుడు మనం కూడా ఆ తోటలో ఒక పువ్వు మాదిరిగా వుంటాం.

"ఆ పూలతోటే, ఆనందవనం. మన మొకసారి ఆ పూల తోటలోకి వెళ్ళి వస్తే, ఇంక ఎప్పటికీ నిరభ్యంతరంగా వెళ్ళి, వస్తూ వుండవచ్చు. ఎందుకంటే వెళ్ళి - వచ్చే ఆ దారి మనకు తెలుసుగనుక. అప్పుడు నిత్య జీవితంలో కోపతాపాలు, కష్టాలు, బాధలు, వేదనలు, సంతోషాలు, దుఃఖాలు, దురదృష్టాలు ఎన్ని వున్నా; బ్రతుకు భారంగా, బాధామయంగా వున్నా, ఆ పూల తోటలోకి వెళ్ళి రావడానికి ఎటువంటి అభ్యంతరమూ వుండదు.

అసలు అన్నింటి కన్నా ఆ ఈశ్వరరాజ్యాన్ని పొందడమే యోగ్యమైన సంగతి. కనుక అందరూ ఆ పూలతోటలోకి వెళ్లి, దాని సౌందర్యాన్ని అనుభవించాలి. ఆ దివ్యానుభవం బ్రతుకం తనూ అందంగా, నూతనంగా మార్చి, జీవితాన్ని వాడిపోనీయ కుండా శాంతంగా ఆనందంగా వుంచుతుంది. మన మొకసారి ఆ స్వర్గధామంలో ప్రవేశిస్తే, మనం దాంట్లో ఓ భాగమైపోతాం. తిరిగి దాన్ని పోగొట్టుకోవడమనేది వుండదు. మనం క్రమంగా ముందుకు సాగిపోతాం.

"ఆ తోటా, అందున్న పువ్వులూ, వాటి పరిమళం గురించి తెలియని వాళ్ళకు, వెళ్ళి-వచ్చినవారు చేతులునిండా పువ్వులు తెచ్చి, అందరికీ అందివ్వవచ్చు. వాళ్ళూ ఆ పూల పరిమళాన్ని ఆఘ్రాణించి ఆనందంగా, హాయిగా వుంటారు.

"అనాదిగా కాలంతోపాటు ఆరని ఓ జ్వాల వుంది. దాంట్లోంచి అనంతంగా రవ్వలు లేచి పడుతున్నాయి. ఆ మహా జ్వాల అణగడం, ఆరడమంటూలేదు. దాన్నించి అనుక్షణం రవ్వలు పైకిలేచి, తమ శక్తి సామర్థ్యాల్నిబట్టి ప్రకాశిస్తాయి. ఆ రవ్వలు కొంతకాలం ఆకాశంలో నిలిచి, ప్రకాశించి, తిరిగి ఆ మహాజ్వాలలో నామ-రూపం లేకుండా కలిసిపోతాయి. ఆ విధంగా పైకిలేచిన రవ్వలు అనంతం. వాటి జీవితకాలం, అనంతకాలంలో అతిస్వల్పం. ఆ మహాజ్వాలనుంచి కొన్నాళ్ళ క్రిందట ఓ వెలుగురవ్వ పైకిలేచి, ఆకాశంలో నిలిచింది. దాన్ని మహాజ్వాలనుంచి విడి చేసి,"కృష్ణమూర్తి" అని పిలుస్తున్నారు.

"కృష్ణమూర్తి నాకు బాగా తెలుసు. నేను అతన్ని స్వయంగా పరీక్షించాను. తక్కిన వారికి మల్లేనే, అతనికీ ఒక కోరిక వుండేది. అది భౌతిక వాంఛ. అతడు కొంత ఎదిగిన తర్వాత కూడా భౌతిక సుఖాల్నే ఆ వాంఛల్నే ముఖ్య విషయాలుగా తీసుకున్నాడు, మరికొన్నాళ్ళు గడిచాక, దుఃఖాల్లోంచి నడిచాక, నియమాల్ని, ధర్మాల్ని, అనుసరించి, పరిశీలించి పాటింపక, "సత్యం అంటే ఏమిటి ?" అనే ప్రశ్న పెద్ద అలగా, పెనుతుఫానుగా, అతివేగంగా, బ్రహ్మాండంగా అతనిలోంచి బయలుదేరింది.

"ఎడతెగని బాధలవల్లా, దుఃఖాలవల్లా అప్పటివరకు ముఖ్యమనుకుని పోగుజేసుకున్నవాటినన్నింటినుంచీ పారిపోవాలని చూశాడు. ఆ సందర్భంలో ఎన్నోసంగతులు తెలుసుకున్నాడు. ఎందర్నో కలుసుకున్నాడు. కాని ఎక్కడికి వెళ్ళినా, ఏంచేసినా, ఎట్లా జీవించినా దుఃఖం తప్పదని గ్రహించాడు. అతనికి లోపలా, బైటా సంక్షోభం బయలుదేరింది.

"ఆ అశాంతినుంచే తప్పించుకుని పారిపోవడానికి గట్టి ప్రయత్నం చేశాడు. ఏది శాశ్వతం? ఏది అశాశ్వతం? అని తనలో తాను ప్రశ్నించుకుని, సత్యాన్వేషణ చేయ నారంభించాడు.

"ఆ కృష్ణమూర్తి నాకు బాగా తెలుసు. అతను ఆనందం కోసం, ప్రేమకోసం, భక్తి-దయ-విశ్వాసం కోసం కొన్నాళ్ళు ఇతరులమీద ఆధారపడ్డాడు. దేవాలయాలకు వెళ్ళాడు. దేవతల్ని ఆరాధించాడు. ఆచారాల్ని పాటించాడు. కాని, తృప్తి కలగలేదు. ఆశించిన శాంతి లభించలేదు. సత్య సందర్శనమూ కాలేదు. అతని ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. తాను ఆశించి, ఆరాధించే రూపాల, ప్రతిమల, విగ్రహాల పటాల వెనుక ఏముందో తెలుసుకోవాలనే తీవ్రవాంఛ కలిగింది. గట్టి సాధన చేశాడు. అయినా సత్యసందర్శనం కాలేదు.

"అతడు ఇంకా, ఇంకా ఆరాధించాడు, అనుష్టించాడు, అన్వేషించాడు. ఆజ్ఞల్ని పాటించాడు, కాలం గడిచేకొద్దీ అతనికి బాధలు ఎక్కువయ్యాయి. అయినా పట్టువిడవక తీవ్ర అన్వేషణ చేశాడు. తత్ఫలితంగా తాను ఆశించిన సత్యాన్ని దర్శించాడు. ఆ దివ్యానుభవంతో మాట్లాడ నారంభించాడు. తాను పొందిన జ్ఞానాన్ని, అనుభవాల్ని, ఆనందాన్ని అంద రికీ అందివ్వాలని చూశాడు. కాని, అతను కోరేది బలవంతుల్ని. బలమంటే శారీరక బలంకాదు, మానసికంగా గొప్ప శక్తివంతుల్ని, విశాలహృదయుల్ని.

"ఆ కృష్ణమూర్తినైన నేను పొందిన అనుభవజ్ఞానాన్ని మీకు అందివ్వాలనే బలవత్తరమైన ప్రోద్బలం నాలో నిరంతరం రగులుతోంది. నేను ఈ విధంగా చెప్పి, మీ మీద అధికారం

చెలాయించాలని చూడ్డం లేదు. కాని, మిమ్మల్ని మీ స్వంత విలువలకు ఒప్పించాలనుకుంటున్నాను. నేను ఇవన్నీ చెప్పడం, మీకు మీరు బలాన్ని తెచ్చుకోవడానికే! దానితో మీరు కోరే సత్యాన్ని, మీరే తెలుసుకోగలుగుతారు. ఆ సత్యాన్ని మీరు ఇతరులకూ ఇవ్వగలుగుతారు, చూపగలుగుతారు. కాబట్టి ఎవరికి వారు విశ్వమంతా నిండివున్న సత్యాన్ని అనుభవపూర్వకంగా పొందడానికీ, దాన్ని స్థిరంగా నిలుపుకోవడానికీ ప్రతి ఒక్కరిలో శక్తి, సామర్థ్యాలుండాలి.

"ఆ మహాజ్వాలలోంచి లేచిన వెలుగురవ్వలన్నీ తమ, తమ జీవితాలు ప్రారంభించి, అనుభవాల్ని పోగుజేసుకుని, తిరిగి ఒకనాడు ఆ మహాజ్వాలలో నామ - రూపం లేకుండా కలిసిపోతాయి. అంటే, "నేను" అనే తలంపూ, ప్రత్యేక వ్యక్తిత్వమూ అంతమౌతుంది.

"పరమోన్నతమైనదీ, శాశ్వతమైనదీ అయిన సత్యం మనకు అన్యంగా, బిన్నంగా లేదనీ, అది మనలోనే వుందనీ తెలుసుకుని, ముందు మనని అనుభవపూర్వకంగా తెలుసుకోవాలి. అంటే, మనమే అసలు సత్యమని తెలుసుకోవడం. పువ్వులో పరిమళం మాదిరిగా, ప్రతి ఒక్కరిలో సత్యం వుంది.

"నేను సూచించే సత్యం గురించి మీరు తెలుసుకోవాలనుకుంటే, ముందు మీ వ్యక్తిత్వాలను ఒదులుకుని, నా భావాలతో, తలంపులతో, అనుభవాలతో, ఆలోచనలతో మీ జీవితాల్లో ప్రవేశించండి. అంటే, మీరు మీ వ్యక్తిత్వాలనుంచి, బైటపడాలి. అప్పుడే మిమ్మల్ని మీరు ఏ అరమరికా లేకుండా పరీక్షించుకుని, అర్థం చేసుకోగలుగుతారు. మీకు మీరే సత్యాన్ని తెలుసుకు

నేందుకు నేను దారి చూపుతాను. సత్యాన్ని తెలుసుకోవడానికి గట్టిశ్రమపడాలి. సత్యాన్వేషకులలో విశాలత్వం, ఔన్నత్యం, ఔదార్యం, తపన వుండాలి. అవన్నీ మీలోంచి పెల్లుబికిరావాలి.

“కాని, సత్యంకోసం కొందరు కొండల్లో, కొందరు అడవుల్లో అన్వేషిస్తారు. కళాకారుడు తన కళలో, మేధావి తన కల్పనలో దర్శిస్తారు. ఆ అన్వేషణలో అవాస్తవిక, ప్రాపంచిక విషయ వలయంలో చిక్కుకుని, ఏదో ఒక కర్మ చేస్తారు. ఎంతటివారూ కర్మనుంచి తప్పించుకోలేరు. కర్మ చేయకుండా ఎవరూ క్షణం వుండలేరు. ఆ కర్మ ఫలితాన్ని ఇవ్వకుండా వూడుకోదు. ఆ ఫలితాన్ని అనుభవించకుండా ఎవరూ తప్పించుకోలేరు. ఆ ఫలితాలు ఒకనాడు మనం చల్లిన విత్తనాల పంటేనని మరచిపోకూడదు. మనిషి ఎప్పుడూ ఏదో ఒక కర్మ చేస్తో, ఒక దుఃఖంనుంచి మరో దుఃఖానికి, ఒక బాధనుంచి మరో బాధలోకి పోతాడు. అప్పుడప్పుడు అల్ప సంతోషాలనుంచి, మహదానందంలోకీ పోతాడు. కర్మాచరణవల్ల కలిగే సుఖ-దుఃఖాలే, మానవుణ్ణి పంజరంలో బంధిస్తాయి. అందుచేత అతడు ఆశించే సత్య సందర్శనం ఎంత ప్రయత్నించీ అన్వేషించీ ఏ సాధనచేసీ పొందలేకపోతున్నాడు. కాని, అతడు ఆశతో అన్వేషణ సాగిస్తూనే వున్నాడు.

“అతని అన్వేషణాయాత్ర అనంతంగా సాగుతూ వుంటుంది. గట్టిగా యోచిస్తే, ఆ యాత్ర ఎక్కడికీకాదు. అతడు అన్వేషించేది ఏదోకాదు. అది ఎక్కడో లేదు. ఆయాత్ర అక్కడికే-ఆ క్షణానికే; అంటే, కాలమూ-దూరమూ లేని; నామ-రూపం లేని, ఏదీకాని, ఏమీలేని, అంతాఅయిన తన అంతరాత్మలోకే! కాని, దాన్ని తెలుసుకుని చేరుకోవడానికి ఎంతకాలమో పడుతుంది. ఆయాత్రలో అతడెన్నో కష్టాలు, యాతనలు,

వేదనలు పడతాడు. బలహీనులు ఒక్కచోట ఆగి, సేదదీర్చుకుని, ఆలోచించి, మళ్ళా బయలుదేరతారు. కొందరు మార్గాలు మారుస్తారు. ఆ విధంగా ఆ యాత్ర ఎన్నో మజిలీలతో సాగుతుంది.

"సత్యాన్వేషణకు గొప్ప ఆలోచనాశక్తీ, క్రమశిక్షణా, ఆత్మపరీక్ష, ఆత్మవిమర్శ, ఆత్మనిష్ట, ఆత్మనిగ్రహం అవసరం. అంటే, ప్రతిఒక్కరూ అంతర్ముఖులు కావాలి. కాని, కొందరే అంత తీవ్రసాధన చేయగలరు. వారికే ఫలితం దక్కుతుంది. తక్కినవారు ప్రవాహంలోపడి కొట్టుకుపోతూవుంటారు.

"సత్యమెక్కడో పర్వతశిఖరాన వుందని భ్రమించి, "తమను ఎవరైనా అక్కడకు అతి త్వరగా, సులభంగా, సుఖంగా, మహాత్యం చేసి అయినా తీసుకుపోకూడదా?" అని అనుకుని, ఆశపడి, ఆలయాలు దర్శించి, ఆశ్రమాలుచేరి, గురువుల్ని, మతాల్ని, మతాధిపతుల్ని, మఠాదిపతుల్ని ఆశ్రయించి, వారి అదికారాలకు, అనుగ్రహాలకు, ఆగ్రహాలకు గురై, సహజత్వాన్ని చంపుకుని, గ్రంధాలు చదివి, శరీరాన్ని శుష్కింపజేసుకుని, ఆత్మను అణచి, హృదయాన్ని మూసి, మనసును హింసించి గుడ్డిగా అనుసరిస్తో, ఆశించిన దానికోసం అర్రులుచాస్తో, అనాలోచితంగా ఎవరేమిచెపితే అది ఆచరిస్తో, అవివేకంతో అగచాట్లు పడుతూ మళ్లా అతి కష్టంమీద లేస్తో, పోతూవుంటారు. అదే అనేకమంది చేసే సత్యాన్వేషణ.

"దేవాలయాలు కట్టించినా, దేవుళ్ళను ప్రతిష్టించినా, రాత్రింబవళ్ళు ప్రార్ధించినా, సర్వకర్మల్ని అనుష్టించినా, అనుక్షణం ఆరాదించినా, విడవకుండా నామజపం చేసినా సత్యాన్ని తెలుసుకోలేరు. మనలో భయాలన్నీపోయి,

అంతర్ముఖులై, స్వేచ్ఛగావుండి అన్నింటినీ ప్రేమతో హృదయానికి హత్తుకుని, సమస్తాన్ని అవగాహన చేసుకున్ననాడే జీవితానికి శాంతి, ఆనందం. అవన్నీ నేనూ పడ్డాను. కాని, ఆ వెలుగు రవ్వ, అశాశ్వతమైన ఆ కృష్ణమూర్తి, ఆ మహాజ్వాలలో - మోక్షాగ్నిలో ఒకనాడు కలిసిపోయాడు. ఆ కృష్ణమూర్తిని నేను బాగా ఎరుగుదును.

"ఆ కృష్ణమూర్తినే అయిన నేను, మీకు ఆమార్గం చూపాలని నా ఉద్దేశ్యం. విశ్వసౌందర్యానికి మీ హృదయాలు తెరవాలని నా సంకల్పం. మీరు మీ హృదయ కవాటాలద్వారా ఈశ్వరరాజ్యంలో ప్రవేశించి మీలోవున్న సత్యాన్ని దర్శించాలని నా తలంపు. దానికై మీరు సమస్తాన్ని పరిత్యజించాలి. అంటే, ముఖ్యం-మీ గ్రంథాలు-తత్వశాస్త్రాలు-సాంప్రదాయాలు - నిత్యకర్మలు - స్నేహితులు - సంసారం - బంధువులు అన్నింటినీ విడవాలి. ఎందుకంటే, అవన్నీ మనం ఏరి, కోరి తెచ్చిపెట్టుకున్నవి. కనుక వాటితో మనం, మనలోకి సులభంగా ప్రవేశించలేము. వాటి పరిమితులే, హద్దులే, సంకుచితత్వాలే అసలు సత్యాన్ని తెలుసుకనేందుకు ప్రతిబంధకాలు అవుతాయి. కాని, వాటి అన్నింటి వెనకా దాక్కోవడం మనిషికి ఎంతో ఇష్టం-సుఖం-సంతోషం-అది చాలా సులభమైన పని. అందుకే అతడు అంత తొందరగా వాటిల్లో చొరబడతాడు.

"ఆశాశ్వతమైన వాటి అన్నింటినీ వదిలి, అంతర్ముఖులై తమను తాము తెలుసుకున్నవారే, సత్యాన్ని దర్శించగలరు. అదే ఆత్మసాక్షాత్కారం-ఈశ్వర దర్శనం. దాన్ని పొందినవారికి, ఇంకే అధికారమూ అవసరంలేదు. కాని, తక్కినవారు-కుంటివాడు చంక కింద పెట్టుకునే కర్రలకోసం వెతుకుతున్నట్లు, నిత్యజీవితంలో అధికారాల్నీ, ఆధారాల్నీ, అనుగ్రహాల్నీ

కోరతాడు. అన్నింటినీ వదలడం, అందరికీ సాధ్యంకాదు. అందుచేత సత్యాన్ని దర్శించడం అంతకష్టమౌతోంది. నిజంగా ఆ మార్గాన నడవదలచుకున్నవారిలో దృఢనిశ్చయం, గొప్ప సంకల్పశక్తి, పరవశత్వం వుండాలి.



"అన్నింటికన్నా ఎత్తుగా ఒక పర్వతం వుంది. దాని శిఖరం మబ్బుల్లో వుంది. దాని చుట్టూ లోయలు, అడవులు, పల్లెలు. దాని శిఖరం చేరుకోవాలని అనేకులు-అనేకరకాలవారు-దాని చుట్టూ చేరారు. చేరిన వారిలో కొందరు ఆ పర్వత భాగమైన ఒక పూలతోటనూ, దాని కీర్తికిగల కారణాన్నీ పరీక్షించారు. మరి కొందరు ఆ పర్వతం పొడవు - వెడల్పు - ఎత్తు కొలిచి ఉభయ సంధ్యల్లో దానినీడ ఎంతెంతదూరాన పడుతుందో శాస్త్ర పరిశోధన చేశారు. ఇంకా కొందరు దాన్ని దైవంగా భావించి, ప్రదక్షిణలు చేసి, ప్రార్థించి, పూజించారు. కొందరు ఆరాధించారు. కొందరు తమ తమ మధుర స్మృతులతో మరలిపోయారు. కొందరు ఫోటోలు తీశారు. కొందరు దాన్ని రంగుల్లో చిత్రించారు. దాని గొప్పతనం గురించి రాసి, పత్రికల్లో ప్రకటించారు. ప్రచారం చేశారు. దాని ఔన్నత్యాన్ని కీర్తించారు, స్తుతించారు, గ్రంథాలుగా రచించారు. ఆ పర్వత భాగాల్ని పవిత్ర చిహ్నాలుగా తీసుకువెళ్ళి, పుణ్యప్రదంగా పూజించారు. దాన్ని దర్శించిన వారిలో కొందరు కొన్ని కథలు చెప్పారు - వాటిల్లో కొన్ని విన్నవీ, కొన్ని చూసినవీ, కొన్ని చదివినవీ. కొందరు కేవలం దాని పాద సన్నిధి జ్ఞానార్జనకై చేరారు. అది తమ కష్టాల్ని, సమస్యల్ని తీరుస్తుందనీ, తమ శారీరక, మానసిక అనారోగ్యాల్ని నయం చేస్తుందనీ ఆశతో కొందరు దాన్ని ఆశ్రయించి పడివున్నారు.

"కాని, ఆ పర్వత శిఖరం చాలా ఎత్తున వుంది. శిఖరం చేరుకోవడం, ఎంతటివారికీ అసాధ్యం. చాలా శ్రమ. బహు కొద్దిమంది మాత్రమే శిఖరం చేరుకోగలరు. శిఖరం చేరినవారే, దాని చుట్టూ వున్న లోయల్నీ, మైదానాల్నీ, అడవుల్నీ, పల్లెల్నీ - అందున్న మనుషుల్నీ - అన్నింటినీ స్పష్టంగా చూడగలరు.

"పర్వత శిఖరంనుంచి పర్వతాన్నీ - శిఖరాన్నీ విడి, విడిగా చూస్తే, ఏమీ తెలియదు. శిఖరం ఒక్కటీ ఏమీ కాదు. పర్వతం, శిఖరం రెండింటినీ ఒకేసారి ఒకటిగా చూసినప్పుడే, దాని ఔన్నత్యం తెలుస్తుంది. దాని గొప్పతనాన్నీ, అందాన్నీ చూడాలంటే, శిఖరం చేరుకోవలసిందే. అక్కడనుంచి చూసినప్పుడు పర్వతం యొక్క గంభీరత, సహజత్వం తెలుస్తుంది.

"పర్వత శిఖరమే, సత్యం. అది అశాశ్వతమైనవాటి అన్నింటికీ అతీతంగా, అత్యున్నతంగా వుంది. దాన్ని చేరుకోవాలన్నా, దర్శించాలన్నా శక్తి కావాలి. శక్తి అంటే మనోశక్తి. ఆ శక్తికి తోడు హృదయ విశాలత్వం, పరిపూర్ణత వుండాలి. మంచి దృష్టికల కళ్ళకే ఆ దివ్యదృశ్యం స్పష్టంగా కనిపిస్తుంది. చూసినవారే, దాని గొప్పతనాన్నీ, మహిమనూ తెలుసుకోగలుగుతారు.

"జీవితంలో ప్రతి ఒక్కరూ అనేక విధాల అవాస్తవం, అశాశ్వతం అయిన వాటినే, ముఖ్యమైనవిగా, సత్యమైనవిగా, శాశ్వతమైనవిగా భావించి పోగుజేసుకుంటారు. తరతరాలనుంచి మానవుడు వాటినన్నింటినీ తన శారీరక సుఖంకోసమే పోగు జేసుకుంటున్నాడు. ఆవిధంగా పోగుజేసుకోవడమే అతని

ఆశయం. అతని దృష్టిలో అంతకుమించి మరో అందమైన అర్ధంలేదు. అంతకు మించిన ఉన్నతాశయంతో అతను ఏనాడూ వాటిని చూడలేదు. చూడడు కూడాను. అవన్నీ ఒకనాడు అతని దేహంతోపాటు అంతమౌతాయి. అయినా అతడు వాటిని పోగుజేసుకోవడం మానలేదు, మానడు. ఇంతవరకు వాటి నుంచి తృప్తీ, సుఖం, శాంతి, ఆనందం అతనికి లభించలేదు.

"ఆ విధంగా పోగుజేసుకోవడమే, కర్మ. ఆ కర్మే పర్వత శిఖరారోహణంలో బంధం-భారం అవుతుంది. కాని, శ్రద్ధగా, నిజమైన ఆసక్తితో, పట్టుదలతో పైపైకి పోయేకొద్దీ, ఆ భారాలూ బంధాలూ మెల్లి మెల్లిగా ఒదులై, జారుకుంటాయి. ఇంకా, ఇంకా పైకి పోయే కొద్దీ అన్నీ ఒదిలి భారరహితంగా, సహజంగా వుంటారు. వెలుగు రవ్వ మహాజ్వాలలో - మోక్షాగ్నిలో కలసిపోవడమే, ఆది-అంతాలు ఏకం కావడం. అన్ని బాధలూ-బంధాలూ, భారాలూ ఒదిలిపోవడమే, శిఖరం చేరుకోవడం. అదే సత్యసందర్శనం.

"ఒకసారి శిఖరానికి వెళ్ళివచ్చినవారికి, దాని దగ్గరదారి తెలుస్తుంది. వారు తిరిగి ఏక్షణాన్నైనా శిఖరానికి వెళ్ళగలరు. వెళ్ళాలనుకునే ఇతరులనూ తాము వెళ్ళిన దారిని తీసుకుని వెళ్లగలరు. అవసరమనుకుంటే, వారు శిఖరం వద్ద స్థిరంగా వుండిపోగలరు. వారు వెళ్ళిన దారి ప్రమాదకరమైనదే కావచ్చు, మధ్యలో విఘ్నాలూ కలగవచ్చు. ఆటంకాలూ రావచ్చు, అక్కడక్కడా అగాధాలే వుండవచ్చు. కాని, పర్వత శిఖరం చేరుకోదలచుకున్న ప్రతివారూ ముందు తమ శక్తి - సామర్థ్యాలు చూసుకుని మరీ యాత్ర సాగించవలసి వుంటుంది, వారు తమలోంచే బలాన్ని పుంజుకోవాలి. తీవ్రమైన కోర్కె, వారిని శిఖరానికి చేరుస్తుంది.

"శిఖరం చేరి, చుట్టూ చూసి తమలో కలిగే ఆలోచనల్ని, ఆ తర్వాత తాము చేసే పనుల్ని అన్నింటినీ జాగ్రత్తగా కని పెట్టి చూసుకోవాలి. ఎందుకంటే, అవి పవిత్రంగా, నిర్మలంగా, శక్తివంతంగా, స్పష్టంగా లేకపోతే, శిఖరం చేరిన వారిని సహితం, హద్దుల్లో-బంధాల్లో-ఇరుకుల్లో-ఇబ్బందుల్లో-పెడతాయి. "ఒంటరిగా శిఖరాన వుండటంకంటే, భూమిమీద ఓ శిధిలాలయంలో వుండటం సులభం, సుఖం," అని భావిస్తారు, చాలా మంది. కనుక ఏ ఒక్కరూ పర్వతపాదం వదలి, శిఖరానికి పోయే సాహసం చేయరు. అసలు అటువంటి ఆలోచనకే అవకాశం ఇవ్వరు. అప్పుడప్పుడూ ఏదో ఒక కారణంచేత ఓ క్షణం శాంతం, నిర్మలత్వం, ఆనందం తళుక్కున మెరసినా, మనసు-హృదయం కలసినా, మామూలు జీవితాన్ని ఏమాత్రం ఒదులుకోవడం చాలామందికి ఇష్టంవుండదు.

"శిఖరాగ్రాన ప్రకాశించే సత్యాన్ని "అంధకారం - దురభిమానం" అనే మబ్బుతెరలు కప్పకుండా ప్రతిక్షణం జాగ్రత్త పడాలి. దుఃఖాలతో అనుభవాలతో, బాధలతో, అవగాహనలతో అన్నింటినీ తీసుకోవడంతో ఆ మబ్బుతెరలు క్రమంగా చెదిరిపోతాయి. అప్పుడే అసలు సత్యం దర్శన మిస్తుంది.

"అటువంటి సత్యాన్ని దర్శించిననాడు, మీ కళ్ళల్లోని తేజస్సును చూసి, మీలో ఏమిటీ కాంతి? మీ చుట్టూ ఏమిటీ శాంతి?" అని ఇతరులు మిమ్మల్ని అడుగుతారు. దానికి మీరు, "ఫలానా వారు వున్నారు. మహాత్ములు. వారు నా కళ్లు తెరిపించారు. జ్ఞానమిచ్చారు. మీరూ ఆయన దర్శనం చేసుకుని, వారిని ఆశ్రయించి, అనుసరించి, జ్ఞానాన్ని పొందండి," అని అంటారు. కాని, అట్లా అనకండి. ఎందు

కంటే, దానివల్ల మీకూ, వారికీ ఏమాత్రం ప్రయోజనం వుండదు. మీరు ఇతరులకు సహాయపడదలచుకుంటే, పేర్లు - గుర్తులు - చిహ్నాలు - సంఘాలు - సంస్థలు ఇవే మీ ఉపయోగపడవు. తృప్తినీ ఇవ్వవు. కనుక సిద్ధాంతాలతో, బలవంతపు విశ్వాసాలతో, మతాలతో తృప్తిపడకండి.

"మనలో వివేకజ్ఞానం, అవగాహనా పటిమ, ప్రేమ, దయ వాత్సల్యం వున్నప్పుడే సత్యాన్ని తెలుసుకోగలుగుతాము. అప్పుడు ఇతరులకూ సహాయపడగలం. మనమే చిక్కుల్లోవుంటే, ఇంక ఇతరులకు ఏం సహాయం చేయగలం ?

"సముద్రగర్భం చేరేలోపల, నది తనమీద ఆధారపడి జీవించే సమస్త ప్రాణికోటిని ఏ భేదం చూపకుండా పోషిస్తుంది. కాని, మానవుడు ఆ నదీజలాన్ని యంత్రాలతో కలుషితంచేసినా, స్వార్ధంతో అపరిశుభ్రంచేసినా, ఆ నది తనకేమీపట్టనట్లు తన దారిని తాను ప్రవహిస్తూ, మూలస్థానాన్ని సజీవంగా వుంచుకుంటుంది. అట్లాగే మీరూ, మీ సాధనా మార్గంలో, నిత్యజీవన యాత్రలో ఎన్నెన్ని విపత్కర పరిస్థితులు ఎదురైనా ఏమాత్రం లక్ష్యపెట్టకుండా మూలాన్ని దృష్టిలో పెట్టుకుని స్థిరంగా వుండాలి. ఇతరులకు సహాయంచేసేముందు మీలో సత్యానికి సంబంధించిన విషయాలపై అపార్ధాలను, సంకుచిత నిర్ణయాలను హద్దులను కూలదోసి, నాశనం చేసుకోవాలి. అప్పుడే మీరు ఇతరులకూ సాయపడగలరు. ఇతరుల దప్పికనూ, ఆకలిమంటలనూ తీర్చగలరు, ఆర్చగలరు.

"ఇంతచేయడానికి ముందు మీరు మీ ముసుగుల్ని, అర్ధంలేని సంగతుల్ని, సిద్ధాంతాల్ని, నియమాల్ని చిక్కు

మార్గాల్ని దూరంగా నెట్టి, సహజంగా వుండాలి. అంటే, నిర్మల నీలాకాశంలో నక్షత్రం మాదిరిగా వుండాలి. విశ్వసౌందర్యాన్ని తిలకించేముందు మీ కళ్ళమీది ముసుగును చింపిపారెయ్యాలి.

"ఆ విధంగా మీరు అంతర్ముఖులై, మిమ్మల్ని మీరు నిజంగా తెలుసుకోవాలి. ఆ సాధనా మార్గాన ప్రవేశించిన తర్వాత, మీరు చేసే పనుల్నీ, మీకు కలిగే ఆలోచనల్ని గట్టిగా సందేహించండి. ప్రతిదాన్ని తీవ్రంగా, నిష్కర్షగా విమర్శించి, పూర్తిగా పరిశోధించండి. ఇదంతా ఈశ్వరరాజ్యం చేరుకు నేందుకు సహాయపడుతుంది. అసలు సత్యం తెలిసేవరకూ, తృప్తి పడకూడదు. మధ్యలో ఆగకూడదు. మార్గం మార్చ కూడదు.

"సూర్యోదయం అయిన తర్వాత నేలంతా కమ్మిన పొగమంచు క్రమంగా కరిగిపోవునట్లు, ఆకులు రాల్చిన చెట్లు కొత్త చిగుళ్ళు తొడిగినట్లు, మనలోని కల్మషాలూ, పోగుజేసు కున్న విషయ వాసనలూ కడిగేసి, శుభ్రం చేసుకున్న తర్వాతనే సత్య సందర్శన భాగ్యం కలుగుతుంది.

"ఆ తర్వాత మీరు ఎక్కడైనా వుండండి. ఎట్లాగైనా వుండండి. సత్యం మీలో వుంటే, మీరు జీవితంలో ఒంటరిగా వుండరు, అణగారిపోయీ వుండరు, కృంగిపోయీ వుండరు, అప్పుడు మీరు ఒక్క సత్యాన్ని తప్ప, ప్రపంచంలో మరి దేనినీ ఆపేక్షించరు," అన్నారు కృష్ణాజీ.

కృష్ణమూర్తి అద్భుతంగా మాట్లాడటం చూసి, ప్రభువు మైత్రేయ కృష్ణమూర్తి దేహంలో ప్రవేశించేందుకు ఆ దేహాన్ని చాలాకాలంనుంచి అనేక విధాల తయారు చేశారనీ, అతని ద్వారా మైత్రేయ అప్పుడప్పుడూ మాట్లాడతారనీ కొందరు అనుకునే వారు.

ఆ రోజుల్లో కృష్ణమూర్తి బాహ్యంగా ఎంతో అందంతో వెలిగిపోయేవాడు. అతని ముఖ కవళికల్లో కూడా ఎంతో మార్పు వచ్చింది. చిన్నప్పనుంచీ పరిచయమున్న "KIRBBY - కిర్బీ" అనే ఆమె కృష్ణాజీని విని, "ప్రభువు మాట్లాడుతున్నారన్న అనుభూతి కలిగింది. నేను కృష్ణమూర్తిని మొదటినుంచీ వింటు న్నాను. గనుక, నాకు బాగా తెలుస్తోంది, అతనిలో మార్పు. ఇప్పుడు అతనిలో గొప్ప శక్తి, సౌందర్యం, గంభీరత, ప్రేమ, దయ వ్యక్తమౌతున్నాయి," అన్నది.

కృష్ణమూర్తి ఎంతో శక్తితో నిండివున్నట్లూ, ప్రభువు మైత్రేయే మాట్లాడుతూ వున్నట్లు వుందన్నారు లెడ్‌బీటర్.

ఒకసారి కృష్ణమూర్తి అనర్ఘళంగా, అమోఘంగా మాట్లాడుతుండగా వెడ్జివుడ్ చూసి, "అదేదో భూతపిశాచాల శక్తిలా వుంది," అని నిండు సభలో, అనీబిసెంట్ చెవిలో చెప్పాడు. ఉపన్యాసానంతరం కృష్ణమూర్తిని తన గదిలోకి తీసుకుని వెళ్ళమని ఆమె రాజగోపాల్‌తో చెప్పింది. అతడు కృష్ణమూర్తిని అనీబిసెంట్ గదిలోకి తీసుకు వెళ్ళాడు. కృష్ణ మూర్తి గదిలో వుండగా అనీబిసెంట్ వెళ్ళి, "ఈరోజు నీ ఉపన్యాసం వెనుక ఏదో దైవశక్తే కాక, ఇంకా ఏదో పైశాచిక శక్తీ వున్నట్లు తోచింది," అన్నది. దానికి కృష్ణమూర్తి "దాన్ని నువ్వు నిజంగా అట్లాగే నమ్మితే, ఇంక నేను జీవితంలో ఎప్పుడూ బహిరంగ సభల్లో మాట్లాడను" అన్నాడు.

'అయితే, సరే, నీ ఇష్ట ప్రకారమే కానియ్యి,' అంది అనీబిసెంట్.

ఒకసారి కృష్ణమూర్తి ఈవిధంగా ఉపన్యాసాలివ్వడాన్ని నేను ఎంత ప్రయత్నించీ తగ్గించుకోలేకపోతున్నాను," అన్నాడు. దానితో మిత్రులు మరింత నిశ్చయం చేసుకున్నారు, ఆ మాట్లాడేది ప్రభువేనని.

"కృష్ణమూర్తే శ్రీకృష్ణుడు, బుద్ధుడు" అంటూ అతని చుట్టూ విపరీతంగా గుంపులుచేరి, అనేక ప్రశ్నలు వేసీ, వేధించి, తమకు ఏదైనా బోధించమని కొందరు కోరారు. కృష్ణమూర్తి విషయమై అనీబీసెంట్ చేసిన ప్రచారం, స్థాపించిన సంస్థా, అతనికోసం పలుచోట్ల ఏర్పాటుచేసిన శిబిరాలూ, అనేకచోట్ల నిర్మించిన కేంద్రాలూ, ప్రజలు గుంపులుగాచేరి వేసే ప్రశ్నలూ, అతన్ని గుడ్డిగా అనుసరించే సంస్థలూ – అన్నీ అతన్ని చాలా ఇబ్బంది పెట్టాయి. వాళ్ళంతా స్వలాభాపేక్షతో అనుసరిస్తున్నారే కాని, నిజంగా తమను తాము తెలుసుకోవడానికీ, సత్యాన్ని తెలుసుకోవడానికీ కాదు. అందుచేత వాళ్ళ అభిప్రాయాల్ని, ఆలోచనల్ని, ఆశల్ని, అనుసరించే విధానాల్ని, చేసే ప్రయత్నాల్ని, ప్రశ్నించే పద్ధతుల్ని పురస్కరించుకుని కృష్ణమూర్తి ఎంతో మాట్లాడాడు.

దివ్యజ్ఞాన సమాజంలో, స్టార్ సంస్థ సభ్యులలో గొడవలు, రాజకీయాలు, కుయుక్తులు, ఈర్ష్యలు, దురాలోచనలు చూసి, విసుగెత్తి, తాను దివ్యజ్ఞాన సమాజ ప్రెసిడెంట్ పదవికి రాజీనామా చేసి, కృష్ణమూర్తిని అనుసరించాలనుకుంది; అనీబిసెంట్. ఆ విషయం లెడ్‌బీటర్‌కు రాస్తే, "గురువు ఆజ్ఞ లేనిదే ఏమీ చేయకూడదు," అనే సమాధానం ఆయనన్నించి వచ్చేలోపల,

ఆమె కృష్ణమూర్తితో కలసి, అమెరికా వెళ్ళింది. అక్కడ ఆమె ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడ్డాయి. ప్రతి ఉపన్యాసానికి వెయ్యిడాలర్లు ఇచ్చారు. ఆమె తిరుగు ప్రయాణంలో వేల్స్-స్కాట్‌లాండ్ - ఐర్లాండులలో పర్యటించి, జగద్గురువు గురించి చెప్పింది.

1926 జూలైలో ప్రపంచసంస్థ సభ్యులు "ఆమెన్"లో క్యాంప్ ఏర్పాటు చేశారు. కృష్ణమూర్తితోపాటు కొందరు స్టార్ సంస్థ సభ్యులు "ఎర్డీభవనం" చేరుకున్నారు. అనీబిసెంట్ కూడా వెళ్ళింది, ఆ సమావేశాలకు. ప్రపంచదేశాలనుంచి దాదాపు నాలుగువేలమంది ప్రతినిధులు హాజరయ్యారు. పందిళ్ళు వేశారు. గుడారాలు వేశారు. ప్రథమ చికిత్సా కేంద్రం తెరిచారు. విచారణ కార్యాలయం పెట్టారు. భోజనాలకూ విశ్రాంతికీ విడిగా వసతులు ఏర్పాటుచేశారు. పోస్టాఫీసు, బుక్—షాప్ తెరిచారు. కొన్ని శాశ్వత కుటీరాలు కట్టారు. ప్రతినిధులకు సమస్త సౌకర్యాలు సమకూర్చారు. ఆ సాయంత్రం కృష్ణమూర్తి ఇండియా దుస్తులు ధరించి, వేదమంత్రాలు పఠించి, అగ్నిముట్టించి, అగ్నిస్తోత్రం చదివి, అనంతరం ఉపన్యాసం ప్రారంభించారు.

"నా నిస్వార్థమైన, ఉన్నతమైన కోర్కె ఏమిటంటే, మీరందరూ ఈశ్వరరాజ్యం చేరుకోవాలని. ఈశ్వరరాజ్యమంటే, మరుగునవున్న పూలతోట. దాన్ని ఏ ఒక్కరో దర్శించడంకాదు, అందరూ చూడాలనేది నా అభిలాష. అది ఒక నిర్ణీతమైన స్థలానికీ, పరిమితమైన కాలానికీ, చెందిందికాదు. అది అందరిలో, అన్ని కాలాల్లో, అంతటా వున్నదే! దాన్ని తెలుసుకునేందుకు మనం, మన మనసును, హృదయాన్ని ఉపయోగించుకోవాలి. ఎందుకంటే, మనస్సే సర్వాధికారియై,

తుది నిర్ణయాలు చేస్తుంది. ఆ మనస్సే సత్యాన్ని తెలుసుకు నేందుకు సహాయపడుతుంది దాన్ని దుర్వినియోగం చేసు కుంటే, అది మనపాలిట నాశనకారి అవుతుంది. దాన్ని సక్ర మంగా ఉపయోగించుకుంటే, జీవితంలో అద్భుతమైన పరిణామం తెస్తుంది. మనస్సును మించిన శక్తి మరొకటిలేదు.

"అనంతంగా ప్రయాణంచేసి, దిగంతాల అవతలకు వెళ్ళి, వెదికి, తెలుసుకునేందుకూ, అందు ప్రవేశించేందుకూ "ఈశ్వరరాజ్యం" ఒక మామూలు సామ్రాజ్యం కాదు. దాని ద్వారాలు తెరిచేందుకు తాళంచెవి వెదకాలి. ఆ తాళంచెవి సహాయంతో అందు ప్రవేశించాలి. ఆ తాళంచెవే, అంతర్వాణి.

"పవిత్రమైన, స్పష్టమైన అంతర్వాణి వున్ననాడు ఏ పాటనైనా మధురంగా, సంపూర్ణంగా, స్పష్టంగా పాడవచ్చు. కాని, ఆ అంతర్వాణి అనేక అనుభవాల, దుఃఖాల, పరమానందాల, కష్టసుఖాల, యాతనలలోంచి ఆవిర్భవించిన అమరవాణై వుండాలి. ఆ వాణికి అణకువగా వున్నవారికీ, దాన్ని సంపూర్ణంగా అభివృద్ధిచేసుకున్నవారికీ ఈశ్వరరాజ్యం అందు బాటులో వుంటుంది.

"ఈశ్వరరాజ్యం ప్రవేశించేప్పుడు, సముద్రగర్భంచేరే నది చేసే నాట్యంవలె వుంటుంది, జీవితం. ఆ నదీ ప్రవాహానికి ఎదురుకొట్టుకునే ప్రతి గులకరాయీ, ఓ కొత్తపాట పాడుతుంది. ఏటిఒడ్డున ప్రతి మలుపులో కెరటం విరిగిపడినప్పుడల్లా, ఓ నూతనానుభవం కలిగి, నది సంతోషంతో గర్జిస్తుంది.

"సముద్ర గర్భం చేరే ప్రతి నదీ తనకు తోచినట్లు నాట్యం చేస్తుంది. దారి పొడవునా సంతోషంతో, పరమానందంతో

పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తుంది. అది వంకర్లు తిరిగి ప్రవహిస్తున్నా, దానికి ఒకే లక్ష్యం వుంటుంది - అది సముద్ర గర్భం చేరడం. అది ఎప్పుడూ దగ్గర దారినే వెతుక్కుంటుంది.

"సాగర గర్భం చేరేవరకు ప్రతినదీ, ఒక ప్రత్యేక ప్రవాహం. సాగర సంగమంతో ఆనది నామ-రూపం లేకుండా కలసిపోతుంది. ఆ నది ప్రత్యేకతా పోతుంది. సముద్రంలో కలిసిన నదికి "ఒంటరితనం-ఏకాంతం" అనే స్ఫురణ వుండదు. కాని, సముద్రాన్ని చేరుకునే లోపల నదికి అనేక అడ్డంకులు, కష్టాలు వస్తాయి. అయినా అది పాటలు పాడుకుంటూ యాత్ర సాగిస్తుంది.

''ఈశ్వరరాజ్యం ప్రవేశించేలోపల మానవుడు పడే యాతనలు, దారి పొడవునా నది చేసే మోహనకరమైన, దివ్య మైన, ఆనందదాయకమైన మధురమైన ధ్వనులవలె వుంటాయి. ఆ యాతనలే అతనిలోని స్వరాలు, సంగతులు. ఆ మహా నిర్వాణాన్ని పొందేలోపల నదివలె ప్రతివారికీ ఎన్నో అనుభ వాలు కలగవచ్చు.

"కనుక ప్రతి ఒక్కరూ ఈశ్వరరాజ్యంకోసం క్షణం ఆగ కుండా వెదకాలి. జీవితమంతా గొప్ప ఆనందపారవశ్యంతో స్వేచ్ఛగా నాట్యం చేయాలి. ఎన్నో బాధలు పడాలి. దుఃఖాల్ని అనుభవించాలి. సంతోషాల్ని పొందాలి. అవన్నీ జీవితంలో ఎంత గొప్పగా, బలీయంగా, తీవ్రంగా వుంటే, అంత త్వరగా ఆనందసాగరం చేరుకోగలరు.

" ఆ ఆనందసాగరంలోని నీరు ఒకసారి ఒక గుక్కెడు తాగితే, ఇంకెప్పటికీ దాహం వేయదు. ఇంక ఏదీ రుచించదు.

మరేదీ తృప్తి నివ్వదు. ఎవరైతే ఆ ఈశ్వరరాజ్యం కోసం నిజంగా వెదికి, పోరాడి, పెనుగులాడి, నలిగి, చచ్చి బ్రతుకుతారో, వారే జీవన్ముక్తులు. అటువంటి జీవితాన్ని కోరేవారు, తమ అంతర్వాణి ఆజ్ఞ తప్పకుండా పాటించాలి.

"నేనూ అనేక యాతనలు పడ్డాను. దానికోసం అన్వేషించాను. అనేక చోట్లకు తిరిగాను. ఎన్నో గ్రంథాలు చదివాను. ఈశ్వరరాజ్యంలో ప్రవేశించాలనే తీవ్ర కాంక్షతో అనుక్షణం ఆరాటపడేవాడిని. కాని, దాన్ని ఈ భూమిమీద ఏ సంతోషమూ, ఏ సుఖమూ ఇవ్వలేదు. దానికోసం నేను కొన్ని నెలలు ఉపవాసం వున్నాను. చివరికి నా తీవ్ర అన్వేషణా ఫలితంగా దాన్ని పొందాను. అదే మోక్షం. అదే స్వర్గం.

"అటువంటి సంపూర్ణత్వాన్ని, దైవత్వాన్ని పొందమనీ, ఆ ఈశ్వరరాజ్యం దర్శించమనీ, ఆ పూల పరిమళం పీల్చమనీ, దానికోసం నా దగ్గరకు రమ్మనీ మిమ్మల్ని నా హృదయమంతటితో ఆహ్వానిస్తున్నాను. ఆ పూలతోటలోని అందమైన నీడల్ని చూస్తో, ఆనందాన్ని అనుభవిస్తో అన్నిటియందూ ప్రేమగా వుండటమే, అసలు జీవితం.

"ఆ విధంగా జీవించడమే గొప్ప సంగతి. ఆ సంగతిని ఎవరికి వారు పూర్తిగా అర్థం చేసుకోవాలి. ఒకసారి దాన్ని నిండు మనసుతో అర్థం చేసుకుంటే, అదే కావలసినంత శక్తిని ఇస్తుంది. అప్పుడు ఎవరికి వారే ఉపదేశకులు, సంపూర్ణ అధికారులు, మార్గ దర్శకులు అవుతారు. ఆనాడు ప్రతి చెట్టులో, ప్రతి పువ్వులో, సర్వ ప్రాణుల్లో, సమస్త చరాచరంలో తిరిగి తమ రూపాన్నే దర్శించగలరు. ఆ పరమ సత్యాన్ని అర్థం చేసుకుంటే, "అంతరాత్మే అన్నింటిపై అధికారి," అని తెలుసుకుని, దాని ఆజ్ఞ శిరసావహిస్తారు. వారికే విశ్వరూప సందర్శన భాగ్యం కలుగుతుంది.

"కాని, ఆ అంతర్వాణి విషయంలో ప్రతి ఒక్కరూ, ప్రతిక్షణం చాలా మెలకువగా వ్యవహరించాలి. అది నిజమైన అంతర్వాణి అవునో, కాదో వివేకంతో తెలుసుకోవాలి. అది ఎన్నో దుఃఖాల, బాధల అనుభవాల, సంతోషాల ద్వారా కలిగినదై వుండాలి. అటువంటి దానికే మన మీద అధికారం వుంటుంది. దాని ఆజ్ఞ పాటించినప్పుడే, ఈశ్వరరాజ్యంలో ప్రవేశించగలుగుతాము.

"ఒకసారి ఆ ఆనందాన్ని అనుభవిస్తే, ఒకసారి ఆ దివ్యదృశ్యాన్ని దర్శిస్తే, ఇంక ఈ భూమి మీద దేనినీ పట్టుకుని వేళ్ళాడము.

"కనుక మీరంతా నా పూలతోటకు రండి. నాతో భాగస్వాములై దాని అందాన్ని, మహిమనూ చూసి ఆనందించండి. దాని ప్రభావాన్ని, సంపూర్ణత్వాన్ని అనుభవించండి. ఒకసారి ఆ పూలతోటలో నడిచారా, మీకూ శక్తీ, అధికారం లభిస్తాయి. అప్పుడు మీకు తీసుకునే శక్తే కాదు, ఇచ్చేశక్తీ వస్తుంది," అన్నారు కృష్ణాజీ.



ఆ సమావేశాల ఆహ్వాన సంఘంవారు కావాలని తెలివిగా "ఆమ్‌స్టర్‌డామ్"లో అదే సమయానికి అనీబిసెంట్‌కు ఒక ఉపన్యాసం ఏర్పాటుచేశారు. అదేవిధంగా కృష్ణమూర్తి రెండో ఉపన్యాసానికి కూడా చాలా దూరాన ఆమెకు మరొక ఉపన్యాసం ఏర్పాటు చేశారు. అనీబిసెంట్ ఆ ఆహ్వానసంఘం వారి అంతర్యం గ్రహించి కృష్ణమూర్తికి రెండు ఉత్తరాలు రాసింది. ఆ రెండు ఉత్తరాలు అటు దియొసాఫికల్ సొసైటీ వారికీ, ఇట్లు కృష్ణమూర్తి ప్రేమికులకూ చాలా ఆసక్తి కరమైన సంగతుల్ని సూచిస్తాయనే ఉద్దేశ్యంతో వాటిని యదాతథంగా ఇక్కడ వుంచడమైనది :

10 JULY, 1926

*My Beloved Son,*

Thank you for your loving letter I seem very far away I hear of many delightful poems, which I of course do not see, and I am sure you are giving delightful talks. I am like the PROPHETS AND KINGS who desired to see and hear the things that the lucky people round you see and hear, but which the poor P S & K S did not see and hear.

Don't leave off loving me, because you have many who are more demonstrative than your loving old AMMA. ( MOTHER )

• • •

18 JULY, 1926

*My Beloved*

Thank you very much for your little letter, It is sweet of you to love me and I love you and wish to serve you.

I am sorry and glad that your spine and head are troublesome for it means that HE will come and use HIS-BODY - HIS - my darling, for you have given it to HIM. Your great and splendid privilege.

We can only help by not hindering I too would like to be with you, but I have to help all those gathered here from all parts of HOLLAND May all the DEVAS guard you, dear one, the happy crowd that love SRI KRISHNA and listen to hear HIS flute call them, to their Joyous service.

*Always your own loving*
AMMA

తాము ఎంతో ప్రేమతో, ఆశతో, ప్రయత్నంతో అందంగా అమర్చిన పేకముక్కల భవనం దివ్యజ్ఞాన సమాజ సభ్యుల స్వయం కృతాపరాధంవల్ల, వాళ్ళ కళ్ళ ముందే అది కూలిపోవనారంభించింది. చూస్తూ, చూస్తుండగా అనీబిసెంట్ మాటలు నిష్ఫలమైనాయి. సమస్తం వాళ్ళ కళ్ళ ముందు బూడిద పాలౌతోంది. వాళ్ళు అనుకునే ప్రవక్త, వాళ్ళు వేసిన బాటనుంచి మళ్ళారు. అతను వారి అభ్యర్ధనల్ని, ప్రార్ధనల్ని వినలేదు. వాళ్ళ పద్ధతుల్ని అంగీకరించక, "నేను జగద్గురువును కాదు. మీకు దారి చూపి నడిపేవారెవరూ లేరు; వుండరు. మీకు మీరే నడవాలి. ఆ సత్యమేదో మీలోనే వుంది. దాన్ని మీకు మీరే తెలుసుకోవాలి," అన్నాడు కృష్ణమూర్తి.

ఆగస్ట్ ఇరవై ఆరవ తేదీకి అనీబిసెంట్, కృష్ణమూర్తి, రోజలిండ్, రాజగోపాల్ న్యూయార్క్ చేరుకున్నారు. అక్కడ నలభై మంది పత్రికా విలేకర్లు కృష్ణమూర్తిని ఇంటర్వ్యూ చేశారు. వాళ్ళ ప్రశ్నలకు కృష్ణమూర్తి సరైన సమాధానాలు ఇచ్చినందుకు వారికి అతనిపై సదభిప్రాయం ఏర్పడింది. ఎన్నో ఫోటోలు తీశారు. హాలీవుడ్ ఫిల్మ్ ప్రొడ్యూసర్ ఒకాయన తాను తీయబోయే సినీమాలో కృష్ణమూర్తి బుద్ధునిగా నటిస్తే, వారానికి ఐదువేల "పౌండ్లు" ఇస్తానన్నాడు. ఒక విలేఖరి కృష్ణమూర్తిని, "ప్రేమ-పెళ్ళి" గురించి అడిగితే, "ఒంటరిగా వుండటం చేతకాక, పెళ్ళి చేసుకుంటారు. నేనెప్పుడూ ఒంటరిని కాను. కాని, నాకు ఉన్నదేదో దాన్ని మీరెవరూ తెలుసుకోలేరు," అన్నాడు.

అక్టోబరు మూడవ తేదీన అనీబిసెంట్ బృందం లాస్ ఏంజలీస్ నుంచి ఒహై వెళ్ళింది. అనీబిసెంట్ ఒహై వెళ్లడం అదే

మొదటిసారి. కృష్ణమూర్తి తన తమ్మునితో కలసివున్న కుటీరానికి వెళ్లి, కొంతసేపు ఆస్మృతుల్లో మునిగిపోయాడు. ఆ తర్వాత అందరూ ఆర్యవిహార్‌కి వెళ్లారు.

ముప్పైఏళ్ళ వయసు వచ్చేప్పటికి కృష్ణమూర్తి రూపురేఖల్లో-చాలా అందమైన మార్పులు వచ్చాయి. చక్కని జుట్టు. నల్లని కళ్ళు. నాజూకైన, పొడవైన చేతులు. తీర్చిదిద్దినట్లున్న ముక్కు. పల్చని, సన్నని, సున్నితమైన శరీరం, సున్నటి చామన చాయతో వెలిగిపోయేది. సామాన్యమైన ఎత్తులో నిటారుగా వుండేవాడు. అటువంటి సర్వాంగ సుందర స్వరూపం చూసి, అన్ని దేశాల్లోని ఆడవాళ్ళూ అకర్షితులై, అతన్ని విడవకుండా వెంటతిరిగేవారు. కృష్ణమూర్తి తాను కట్టుకునే బట్టలు విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం కొందరికి సమ్మతంగా వుండేదికాదు. స్వామీజీలాగ కాషాయం కట్టి, గెడ్డం పెంచి, పొడుగాటి జుట్టు వుంటే బావుంటుంది కాబోలు, వారికి. యూరప్, అమెరికా ఇంకా అనేక దేశాల్లో, ఆయా దేశ కాలాలకు అనుగుణంగా దుస్తులు ధరించేవాడు కృష్ణమూర్తి. ఇండియాలో పంచె - లాల్చీ - చెప్పులు వేసుకునేవాడు. ఎక్కడ ఎట్లావున్నా అతనికి ఎప్పుడూ దేహస్ఫురణ వుండేదికాదు. దేహం, నిత్యజీవిత కార్యక్రమానికి అనువుగా, అనుకూలంగా వుండి, సహాయపడే నిమిత్తం దాన్ని శుభ్రంగా ఆరోగ్యవంతంగా వుంచేవాడు. అంతే!

కృష్ణమూర్తికోసం అనీబిసెంట్ రెండులక్షల డాలర్లతో ఒహైలో కొంత భూమి కొన్నది. ఆ స్థలంలో చెట్లు నాటారు. దానికి "HAPPY VALLEY FOUNDATION - హాపీ వ్యాలీ ఫౌండేషన్" అని పేరు పెట్టారు. దాన్ని జగద్గురు కార్యక్రమం

కోసం వినియోగించాలన్నది అనీబిసెంట్ అభీష్టం. అప్పుడు దానికో ట్రస్ట్ ఏర్పడింది. అదే "హాపీ వ్యాలీ అసోసియేషన్." అది ఆర్యవిహార్‌కి దగ్గరలో వుంది. అది నాలుగువందల యాభై ఎకరాల భూమి. దానికి దిగువభాగంలో రెండువందల నలభై ఎకరాల భూమి సేకరించి, దానికి "ఓక్ గ్రోవ్" అని పేరు పెట్టారు.

కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి రాస్తో, "వీలైతే మీరూ, మేరీ, బెట్టీ ఒహై వచ్చి మాతో వుండకూడదా?" అన్నాడు. బెట్టీ తప్ప, తక్కినవారు వచ్చారు. అక్కడనుంచి లేడీఎమిలీ భర్తకు ఉత్తరం రాస్తో, "ఇక్కడ మేమంతా చాలా ఆనందంగా వున్నాం. కృష్ణమూర్తి, అనీబిసెంట్ రాజగోపాల్ ఆర్యవిహార్‌లో వున్నారు, నేనూ, మేరీ, రోజలిండ్ గెస్ట్‌హౌస్‌లో వున్నాం," అన్నది.

ఒహై వెళ్ళిన తర్వాత కృష్ణమూర్తి ఆరోగ్యం బాగాలేదు. మొదట్లో అతను అనీబిసెంట్‌తో కలసి ఇండియా రావాలను కున్నాడు. కాని, హాలీవుడ్ డాక్టరు కృష్ణమూర్తిని పరీక్షచేసి, ప్రయాణం చేయవద్దని సలహా ఇచ్చారు.

1927 ఏప్రిల్‌లో కృష్ణమూర్తి, అనీబిసెంట్ బృందం ఒహైనుంచి బయలుదేరేముందు కృష్ణమూర్తి బుద్ధిబలాన్ని, దృఢ సంకల్పాన్నీ, ఉదాత్త ప్రవృత్తినీ మెచ్చుకుంటో "జగద్గురువు ఇక్కడ వున్నారు," అన్నది అనీబిసెంట్, పత్రికల వారితో. ఆ మాటతో జార్జి అరండేల్ ఆమెను బహిరంగంగా వ్యతిరేకించాడు. అవన్నీ చూసి, కృష్ణమూర్తికి తాను నిజమైన సన్యాసిని కావాలన్న కోర్కె, అతనిలో మరింత బలపడింది. కాని, అతని అనుచరుల అభిప్రాయమేమిటంటే, తామూ, కృష్ణ

మూర్తి, దివ్యజ్ఞాన సమాజం ప్రపంచసంస్థా - అంతాకీర్తితో - ధనంతో-విశ్వవిఖ్యాతమైన పేరు ప్రఖ్యాతులు గడించాలని. ఆ ఉద్దేశ్యంతోనే చాలామంది అతన్ని అనుసరించారు.

కృష్ణమూర్తి వారి జీవితలక్ష్యాల్ని, వారి సాధనా విధానాల్ని, పద్ధతుల్ని పరిశీలించగా — వివేకవంతులు సహితం ప్రయత్నించి ప్రపంచంనుంచి తప్పుకుని ఏవిధంగా ఏకాంత వాసంలోకి పోతున్నదీ-అవివేకులు తమ స్వయం కల్పిత రొదలో ఏ విధంగా కలసిపోతున్నదీ గమనించాడు. ప్రజలు దురభిమానాలతో, మూఢనమ్మకాలతో, మత విశ్వాసాలతో, అర్థంలేని ఆలోచనలతో, ఆశలతో, భయాలతో, ప్రయత్న పూర్వకంగా తమచుట్టూ నిరంతరం ఎటువంటి గట్టి రాతిగోడలు ట్టుకుంటున్నదీ చూసి తెలుసుకున్నాడు వారు పడే బాధలు ంత నిరర్థకమైనవో అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు.



1927 జూన్ ఏడవ తేదీన పారిస్ రేడియో స్టేషన్‌నుంచి ృష్ణమూర్తి " The Secret of Happiness " గురించి మాట్లాడాడు.

1927 ఆగస్ట్ రెండవ తేదీన ఎర్డీభవనంలో స్టార్‌క్యాంప్ ఏర్పాటు చేయబడింది. ఆ సమావేశాలకు అనీబిసెంట్ హాజరైంది. అక్కడ చాలా మంది కృష్ణమూర్తిని గట్టిగా అడిగారు, 'మిమ్మల్ని గురించేనా అనీబిసెంట్ రాబోయే జగద్గురువుగా తిరిగి వస్తానన్న ఏసుప్రభువుగా చెబుతోంది? అయితే, ఆ సంగతులు మాతో చెప్పడానికి మీరెందుకు నిరాకరిస్తున్నారు' అని. దానికి కృష్ణమూర్తి —

"నేను వెళ్ళిన ప్రతిచోటా తిరిగి వస్తానన్న ఏసుప్రభువు మీరేనా ?" అని అడుగుతున్నారు. నేను, తిరిగి వస్తానన్న

ఏసుక్రీస్తునవేది బొత్తిగా అర్ధంలేని సంగతి. ఆ విషయం అప్రధానమైనది, విలువలేనిది, వట్టి పనికిమాలిన సంగతి. అసలు మీకా సందేహం ఎందుకు కలిగింది?

"నేను ఏసుక్రీస్తును," అని అంటే, మీరు నన్ను అంగీకరించి, అనుసరించి, నన్నో అదికారిగా తీసుకుని ఆరాధిస్తారు. నేనేం చెబితేదాన్ని పరమ సత్యంగా నమ్ముతారు. కాని, ఆ నా మాటలు విని, కొందరు నవ్వుతారు.

"నేను ఏసుక్రీస్తును కాదు," అంటే, కొందరు సంతోషిస్తారు. ఏదైనా నేను చెప్పినదాన్ని బట్టి, మీరు మీ అంతస్థుల ప్రకారం నన్ను నిర్ణయిస్తారు. అవునా? నేనెవరన్నది ముఖ్యమైన సంగతి కాదు. కాని, నా గురించి నేను చెప్పనిది, మీరు నన్ను ఎట్లా అర్ధం చేసుకోగలరు? మీ గురించి మీకు తెలియదు గనుక, నా గురించి తెలుసుకోవాలనుకుంటున్నారు.

"నేను తిరిగి వస్తానన్న ఏసుప్రభువును అవునో, కాదో, అది నేను చెప్పను. ఆ ప్రశ్న నాకు ముఖ్యం కాదు. కాని, నేను చెప్పేది ''సత్యమేనా?'' అని మీరు యోచించండి. సత్యమనేది వ్యక్తి మీద ఆధారపడదు. 'సత్యం' తెలియాలంటే, మీరు మీ అంతస్థుల, తరగతుల దురభిమానాల, పక్షపాతాల నుంచి స్వేచ్ఛపడాలి.

"నేను తత్వవేత్తను కాను. వేదాంతినీ కాను. నేను తత్వశాస్త్రాలు అభ్యసించలేదు. నేను అన్నిరకాల మనుష్యులతో కలిసి జీవించాను. నా స్వంత అనుభవాన్నే మీకు చెపుతున్నాను. నాకేది సత్యమో, దాన్నే మీకు చెపుతాను. కాని, మీకు కావలసిందేదో, దాన్ని మీకు మీరే వెతుక్కోండి.

"దేనినైనా తెలుసుకోవాలి, కనుక్కోవాలి అంటే, మనలో పెద్ద అసంతృప్తి వుండాలి. దానికితోడు గట్టిగా ప్రశ్నించే శక్తీ, నిరాశ, అశాంతి, అసౌఖ్యం, జీవితంలో కొన్ని దురదృష్టకరమైన సంగతులు తప్పనిసరిగా జరిగివుండాలి. నేను వాటి ద్వారానే సత్యాన్ని తెలుసుకున్నాను. దాన్ని మీరు ఏ పేరుతోనైనా పిలవండి. దాన్నే నేను తెలుసుకున్నాను.

"నాపని కేవలం విత్తనాలు చల్లడం. నన్ను అనుసరించమని ఎవరినీ అడగను. సత్యానికి ప్రత్యేకంగా ఓ మార్గమంటూ లేదు. సత్యమంటే, ఏమిటో, జీవితమంటే ఏమిటో తెలుసుకోకుండా ప్రతికేవారిని నిద్రలేపాలి. ఒకరిని అనుసరించడం వల్ల సత్యం తెలియదు. ఒకరిని అనుసరించే విధానమంతా వినాశనకరమైనది, క్రూరమైనది. అది అతి సాహస కృత్యాలకు దారితీస్తుంది. ఒకరిని అనుసరించి, అనుకరించి, వారు చెప్పింది ఆచరించడంవల్ల, సత్యం కనుక్కోబడదు. పైగా వాటివల్ల ప్రజలు స్వేచ్ఛను పోగొట్టుకుని, యాంత్రికంగా జీవిస్తారు.

"నేను తెలుసుకున్న సత్యాన్ని, నేను ఇంకొకరికి ఇవ్వలేను. దాని గురించి వివరించి మాటల్లో చెప్పలేను. దాన్ని ఎవరికి వారు స్వానుభవంతో తెలుసుకోవాలి. అంతేకాని, ఒకరిని అనుసరించి, నీతి సూత్రాల్ని అవలంభించి సత్యాన్ని తెలుసుకోవాలనుకోవడం మూర్ఖం. నమ్మకాల ద్వారా, మతాల ద్వారా, మహాత్ముల ద్వారా సత్యం తెలిసేది కాదు.

"నేనీ విధంగా చెప్పి, మిమ్మల్ని అనాసక్తుల్ని చేయడం నా అభిమతం కాదు. ఎవరైతే, సహజంగా నిజాయితీగా, నిష్కపటంగా సత్యాన్వేషణ చేస్తారో, వారికి వర్ణనాతీతమైనది గోచరం

కాకమానదు. అక్షయమైనది అవగతం కాకపోదు. అదే, నాశన రహితమైన, శాశ్వతమైన సత్యం. అదే, ఈశ్వరరాజ్యం. దానికి గురు - శిష్య సంబంధం అవసరం లేదు. అటువంటి పరమ సత్యాన్ని తెలుసుకోవాలంటే, ముందు తమను తాము తెలుసు కోవాలి. కాని బంధాలూ, అపేక్షలూ వుంటే, జీవితానికి విముక్తి లేదు. అటువంటివారు నిర్వాణాన్ని పొందలేరు. ఈశ్వర రాజ్యంలో ప్రవేశించికూడా ప్రపంచ విషయాలతో సఖ్యతగా, సమ్మతితో జీవించడానికి అవకాశముంది. ఇది కేవలం మాటల్లోనే కాదు. నిత్యకర్మలు ఆచరిస్తో ఆనందంగా, అందంగా అందరి మధ్యా హాయిగా బ్రతకవచ్చు, " అన్నాడు.

• • •

1927 ఆగస్ట్ మూడవ తేదీన కూడా అనీబిసెంట్ కృష్ణ మూర్తిని మాట్లాడమని కోరింది. ఆమెయందుండే భక్తి, గౌర వాలవల్ల కృష్ణమూర్తి ఆమె ముందు మాట్లాడటానికి మొదట జంకాడు అదీకాక, క్రిందటి రోజు తాను మాట్లాడింది అనీబి సెంట్‌కు బాధాకరంగా, కఠినతరంగా వుంది. తాను మళ్ళా ఆ విధంగా మాట్లాడితే, ఆమె గాయపడవచ్చుననే తలంపుతో కృష్ణ మూర్తి ఆలోచించే మాట్లాడాడు, మూడో తారీఖున.

ఆ సభల్లో కృష్ణమూర్తి చేసిన ప్రకటనలు నిర్భయంగాను, చెప్పిన మాటలు విప్లవాత్మకంగానూ, వున్నాయి. అయినా అనీబిసెంట్, 'కృష్ణమూర్తి నిశ్చయంగా జగద్గురువే! అతనేం చెప్పినా శ్రద్ధగా చివరివరకు వినండి,' అని స్టార్ సభ్యులకు హితవు చెప్పింది.

కృష్ణమూర్తి స్విట్జర్లాండునుంచి అనీబిసెంట్‌కు రాస్తో "నా ప్రసంగం నిన్నూ, ఇంకా చాలామందిని తలక్రిందులు చేసినందుకు చింతిస్తున్నాను. అసలు అప్పుడు నేనేంచెప్పానో, ఇప్పుడు నాకు గుర్తులేదు. ఆ నా ఉపన్యాసం ప్రతి వుంటే, దాన్ని నాకు పంపించు. చూస్తాను," అన్నాడు.

ఆ అక్టోబరు ఒకటవ తేదీనాటికి అనీబిసెంట్‌కు ఎనభై ఏళ్లు నిండాయి. ఆమెకు జన్మదినోత్సవ కానుకగా "శ్రీమతి హెమిల్‌టన్" అనే ఆమె ఇరవైఐదువేల ఫౌండ్లు కానుకగా ఇచ్చింది. ఆ ఉత్సవం లండన్‌లో జరిగింది. దానితోపాటు పదివేల ఫౌండ్లు ఆమె స్థాపించిన ప్రపంచ సంస్థకు విరాళంగా ఇచ్చింది.

అక్టోబరు మూడవ తేదీన అనీబిసెంట్ ఆశీర్వాదంతో రాజగోపాల్ - రోజలిండ్ లండన్‌లో వివాహం చేసుకున్నారు. ఆ తర్వాత వారు యూరప్ అంతా తిరిగి ఒహై చేరుకున్నారు. కృష్ణమూర్తి పైన్ కాటేజిలో వుంటే, రాజగోపాల్ - రోజలిండ్ ఆర్యవిహార్‌లో వుండేవారు. కృష్ణమూర్తి భోజనానికి ఆర్యవిహార్‌కి వెళ్ళేవాడు. రోజలిండ్ పైన్ కాటేజీ కూడా చూసుకునేది.

రాజగోపాల్ పూర్తి పేరు డి. రాజగోపాలాచార్యులు. అతను 1901 లో జన్మించాడు. నిత్యానందం ఆరోగ్యం బాగా లేనప్పుడు అతనికి సేవచేసే నిమిత్తం, రాజగోపాల్‌ను అమెరికా పంపించారు. అప్పటినుంచి కృష్ణమూర్తి, రాజగోపాల్ మంచి మిత్రులయ్యారు. కాని, వారి వారి ఆలోచనల్లో, ఆశయాల్లో, ఆదర్శాల్లో, అభిప్రాయాల్లో భేధాలున్నాయి. అయినా కృష్ణమూర్తి అతన్ని స్టార్ సంస్థకు అంతర్జాతీయ సంరక్షకునిగా నియమించాడు. ఆ తర్వాత అతన్ని "స్టార్ రివ్యూ" అనే పత్రికకు ప్రధాన ఎడిటర్‌గా కూడా నియమించాడు.

రాజగోపాల్‌కు మొదట్లో స్వంతడబ్బు అంటూ ఏమీ లేదు. అలాగే రోజలిండ్‌కీ డబ్బులేదు. వారిద్దరి ఖర్చులూ పూర్తిగా కృష్ణమూర్తే భరించేవాడు. కృష్ణమూర్తి ఎక్కడకు వెళ్ళినా వెంట రాజగోపాల్ వుండేవాడు. ఎందుకంటే, నిత్యానందం మరణానంతరం జాదూనందన్ ప్రసాద్ కృష్ణమూర్తి కార్యక్రమాలన్నింటినీ చూసేవాడు. అతను చనిపోయిన తర్వాత కృష్ణమూర్తి సంగతులన్నీ రాజగోపాల్ చూడనారంభించాడు. ఆ విధంగా నలభై ఏళ్ళు కృష్ణమూర్తి ఉపన్యాసాల్నీ, ప్రయాణాల్నీ, పుస్తక ప్రచురణల్నీ - అన్నింటినీ శ్రద్ధగా చూసేవాడు. క్రమంగా కృష్ణమూర్తికి సంబంధించిన అన్ని వ్యవహారాలకు రాజగోపాలే సర్వాధికారి అయ్యాడు. అన్ని అధికారాలు రాజగోపాల్ చేతిలో వుండేవి. లౌకిక వ్యవహారాలేవీ పట్టించుకోని కృష్ణమూర్తి, తన వ్యవహారాలన్నింటినీ స్వయంగా రాజగోపాల్‌కు అప్పగించాడు. కృష్ణమూర్తి విషయంలో ఏది చేయడానికీ రాజగోపాలే చివరి నిర్ణయకర్త అయినాడు. నిరహంకారి, పూర్ణ విశ్వాసి అయిన కృష్ణమూర్తికి రాజగోపాల్ అన్నీ చెప్పి, నడిపించనారంభించాడు. అతను కృష్ణమూర్తి ముందు ఏదైనా కాగింతం పెట్టి, సంతకం చేయమంటే, ఏమీ ఆలోచించకుండా వెంటనే సంతకం పెట్టేవాడు.

కృష్ణమూర్తి అడయార్ వస్తున్నాడని తెలిసి దివ్యజ్ఞాన సమాజ సభ్యులూ, కొందరు ప్రముఖులు, పెద్దలు ఎటో తప్పుకున్నారు. కృష్ణమూర్తి అనీబిసెంట్‌ల మధ్య అభిప్రాయ భేదాలు, వచ్చాయనీ, వారు త్వరలో విడిపోవచ్చుననీ పుకార్లు పుట్టించారు. క్రమంగా కృష్ణమూర్తి చుట్టూ ఘోరమైన రాజకీయాలు అల్లుకున్నాయి. కాని, కృష్ణమూర్తి, అనీబిసెంట్‌లు మాత్రం చివరివరకు ఒకరి యెడల ఒకరు అత్యంత ప్రేమగా వున్నారు. ఆ సందర్భంలో కృష్ణమూర్తి, " నా పాత్రనిండుగా

వుంది. నేను సమస్తాన్ని పరిత్యజించాలనుకుంటున్నాను. నేను నిజమైన సన్యాసిని కావాలనుకుంటున్నాను. కాని, ఈలోగా నేనొకటి చేయదలిచాను. దాన్ని ఒకరోజున పూర్తిచేస్తాను. అది పూర్తిచేయడానికి ఇంకా సమయం రాలేదు. దానికోసం నేను చాలా ఆతృతతో ఎదురు చూస్తున్నాను," అన్నాడు మిత్రులతో.

దివ్యజ్ఞాన సమాజ సభ్యులెవరూ కృష్ణమూర్తి మాటల్ని లక్ష్యపెట్టలేదు. ఆ రోజుల్లో కృష్ణమూర్తి ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. డాక్టర్లు విశ్రాంతి అవసరమన్నారు. ఊపిరి తిత్తులు చెడిపోయాయి. గుండె ఉబ్బరం, దగ్గు, వెన్నెముకలో పోటు, తలనరాలలో బాధలు - ఒక్కసారిగా అన్ని వచ్చాయి. వాటికితోడు భయంకరమైన ఒంటరి తనం, ఏకాంతవాసం అతని దేహాన్ని మరింత దుర్బలపరిచాయి.

1927 సంవత్సరాంతంలో అనీబిసెంట్ మరొకసారి "కృష్ణమూర్తే తిరిగి వస్తానన్న ఏసుప్రభువు. అతను నిశ్చయంగా జగద్గురువు," అన్నది. కాని, కృష్ణమూర్తి మాత్రం అసలు తానేమీకాదని అనడంతో, దివ్యజ్ఞాన సమాజసభ్యుల్లో తికమకలు వచ్చాయి. జార్జి అరండేల్ వంటివారు అనీబిసెంట్ పదే, పదే నిష్ఫల ప్రకటనలు చేస్తున్నందుకు ఆమెను ముఖాముఖి వ్యతిరేకించారు.

దివ్యజ్ఞాన సమాజంలో గొడవలు అణచడానికి అన్నట్లుగా అనీబిసెంట్, రుక్మిణీదేవిని "వర్జిన్ మాత"గా ఎన్నిక చేసింది. ఆ సంగతి కృష్ణమూర్తి, లెడ్‌బీటర్‌కు రాస్తో, " ఈ గొడవలతో

నా తల తిరుగుతోంది. కాని, నేను నా ప్రియతమునిలో ఐక్యమైవున్నాను. ఇంకేమీ గట్టిగా తీసుకోను. పత్రికల వాళ్ళు అడిగారు " వర్జిన్ మాత " విషయమై. ' ఆ సంగతి నాకేమీ తెలియదు, ' అన్నాను, " అన్నాడు.

డిశంబరులో జరిగే దివ్యజ్ఞాన సమాజ సమావేశాలకు వచ్చిన లెడ్‌బీటర్‌తో, ' నేను కృష్ణమూర్తి శిష్యురాలిని, ' అని అనీబిసెంట్ అన్నది.

అనీబిసెంట్ దివ్యజ్ఞాన సమాజానికి రాజీనామా చేసి కృష్ణాజీని అనుసరించాలనుకునేప్పటికి, అరండేల్‌వంటి పెద్దలు ఆమెను వ్యతిరేకించారు. ఆ సందర్భంలో కృష్ణాజీ లేడీఎమిలీకి రాస్తో, "నాకూ, దివ్యజ్ఞాన సమాజానికి మధ్య సంబంధాలు తెగిపోయాయి. నటనకంటే, ఈ సంఘటన నయమనిపిస్తోంది. నా తల, వెన్నెముక ఘోరంగా బాధపెడుతున్నాయి. ఇక్కడ నాకు సహాయం చేసేవారు ఎవరూ లేరు," అన్నాడు.

1928 జనవరి పదకొండవ తేదీన జరిగిన స్టార్ క్యాంప్‌లో "కృష్ణమూర్తి జగద్గురువుగా నాకు ఏమాత్రం నమ్మకం లేదు," అన్నాడు అరండేల్.

1928 లో కృష్ణమూర్తి మదనపల్లిలో దివ్యజ్ఞాన సమాజ విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలనే ఉద్దేశ్యంతో అక్కడకు వెళ్ళి, ఋషీ వ్యాలీని ఎన్నిక చేశాడు. అది మూడువందల ఎకరాల విస్తీర్ణంగల ప్రదేశం. అది సముద్రమట్టానికి ఇరవై నాలుగువందల అడుగుల ఎత్తున వుంది. పిల్లలు విద్యార్థి దశనుంచి ఆధునిక విజ్ఞానంతోపాటు ఎవరికి వారు తమను తాము తెలుసుకోవడానికి విద్య ఉపయోగపడాలనే తలంపుతో ఋషీ వ్యాలీలో ఒక స్కూలు స్థాపించారు. నిజమైన విద్యకు అవకాశం కల్పించడమే ఆ స్కూలు ఆశయం. అక్కడ మామూలు చదువులతోపాటు, పిల్లలు తమ జీవితాలకు తాము సదా ఎరుకలో వుంటారు. వారికి కావలసిన సలహాలు, సహాయాలు, సదుపాయాలు ఆ విద్యాసంస్థద్వారా సక్రమంగా సమకూర్చబడాలనేది కృష్ణమూర్తి అభిప్రాయం. అందు బాల-బాలికలకు ప్రవేశముంది. ఆ స్కూలు కేవలం చదువులకు-పిల్లలకు-ఉపాధ్యాయులకు మాత్రమే పరిమితంకాక, చుట్టుపక్కలవున్న పల్లెప్రజలకు వైద్యసహాయం కలగజేయాలనే ఉద్ధేశ్యం కూడా వుంది. దానికి ప్రథమ ప్రిన్సిపాల్ జి. వి. సుబ్బారావుగారు.

కుల, మత, వర్గ, జాతీయతలు పాటించని విద్యాలయమది. అక్కడ ఎవరికీ ఎటువంటి దురభిమానాలు కలగడానికి చోటు లేదు. సాంప్రదాయం, ఆచారం, లేకుండా, భావాలు - ఆశయాలు - ఆదర్శాలు అంటూ ఏమీ లేకుండా పిల్లలకు చదువు చెపితే, ప్రపంచంలో శాంతి వర్ధిల్లుతుంది. అక్కడ విద్యకు మినహా మరి దేనికీ ప్రాముఖ్యం లేదు. విశాలమైన భావాలు కల సహృదయులైన ఉపాధ్యాయులే ఆ స్కూలుకు కావాలి.

ఆ సందర్భంలో అక్కడ "ఋషీవ్యాలీ ట్రస్ట్" అని ఒక ట్రస్ట్ ఏర్పడింది. దానికి కృష్ణమూర్తే అధ్యక్షుడు. అనీబిసెంట్

మొదలైనవారంతా సభ్యులుగా వున్నారు. ఆ తర్వాత ఆ ట్రస్ట్ రాజఘాట్‌లో గంగానది ఒడ్డున రెండువందల ఎకరాల భూమిని ప్రభుత్వంనుంచి కొని 1928లో ఒక స్కూలు స్థాపించారు. అదే, రాజఘాట్ స్కూలు. అది బెనారస్‌కీ, సారనాథ్‌కీ మధ్యన వుంది. బెనారస్‌కి ఉత్తరదిశగా ఐదుమైళ్ళదూరంలోవుంది. ఆ స్కూలు 1934లో అధికార పూర్వకంగా తెరవబడింది.

ఫిబ్రవరిలో కృష్ణమూర్తికి ఉబ్బసం ఆరంభమైంది. అయినా అతను అమెరికా యూరప్‌లలో పర్యటించి ఉపన్యాసాలిచ్చాడు. ఆ సందర్భంలో తనతోపాటు ఓడలో ప్రయాణం చేస్తున్న ప్రయాణీకుల కోర్కెపై ఒక ఉపన్యాసం ఇచ్చాడు.

మే నాల్గవ తేదీన కృష్ణమూర్తి లెడ్‌బీటర్‌కి ఉత్తరం రాస్తో, 'అమ్మ (అనీబిసెంట్) అడయార్‌లో రుక్మిణీదేవిని "వర్జిన్ మాత"గా, ఎన్నిక చేయడంతో సమాజ సభ్యుల్లో, సంస్థ సభ్యుల్లో అలజడి బయలు దేరింది. ఆ సంగతులతో నాకు ఏమాత్రం సంబంధం లేదు. ఆ గొడవలనుంచి నేను దూరంగా వుండదలిచాను. అమ్మ, నన్ను అందులో ఇరికించకుండా వుంటే చాలు, సంతోషిస్తాను. ఇవన్నీ మీకీపాటికి తెలిసి వుంటాయను కుంటున్నాను. జీవితం చిత్రమైనది. దాన్నిండా ఎన్నో చిక్కులు. నేను వాటినుంచి స్వేచ్ఛగా వుండదలిచాను. మరొక సారి నేనటువంటి వాటిల్లో ఇరుక్కోదలచుకోలేదు.

"నేనొకటి చేయదలచుకున్నాను. అది త్వరలో చేస్తాను. కొందరే నన్ను అర్థం చేసుకుంటారు. నేను ఎవరి మీదా ఫిర్యాదు చేయను, కాని, ఇవన్నీ మీకు తెలియజేయాలని రాస్తున్నాను. అంతే! మీరు ఇవేమీ తీసుకోరనుకుంటాను.

"నేను నా గురువుతో - ప్రభువుతో - ప్రియతమునితో పూర్తిగా ఐక్యమైనాను. అది సత్యం. ఇప్పుడు 'కృష్ణ' లేడు. దీన్ని జార్జి, వెడ్జివుడ్ లాంటివాళ్ళు అంగీకరించకపోవచ్చు. నా ఆలోచనా విధానానికి ఏ ఒక్కరినీ, మార్చాలని, ఒప్పించాలని చూడ్డంలేదు. నా తల తిరుగుతోంది," అన్నాడు.

ఆ సమయంలో అనీబిసెంట్‌కు జబ్బు చేసింది. ఆమె లండన్‌నుంచి ఇండియా వచ్చింది. ఆమె అన్ని కార్యక్రమాలు రద్దు చేయబడ్డాయి. ఆమెకు క్రమంగా జ్ఞాపకశక్తి తగ్గి పోయింది. ఆమెను చూడ్డానికి కృష్ణమూర్తి అడయార్ వస్తే, జార్జి అరండేల్, రుక్మిణీదేవి అనీబీసెంట్‌ను వదిలేసి, ఎక్కడికో వెళ్ళిపోతూ, నీ దారి నీది, మాదారి మాది. మేము ప్రభువుకు సన్నిహితులం," అన్నారు.

వారి నిష్క్రమణతో అనీబిసెంట్ దివ్యజ్ఞాన సమాజంలో ఒక ముఖ్యమైన శాఖను-అంతరంగశాఖను - మూసేసింది; ఆ అక్టోబరు నెలలో. దివ్యజ్ఞాన సమాజ అధ్యక్ష పదవిని వదిలేసి, కృష్ణమూర్తి వెంట తిరగనారంభించింది, అనీబిసెంట్. అయినా ఆమెలో పూర్వం మాదిరి ఉత్సాహం లేదు. సమాజంలో కలతలు, అసఖ్యత, తిరుగుబాటు వచ్చాయి. ఆమె అనారోగ్యం, వృద్ధాప్యం వాటికి తోడయ్యాయి. ఆమె కృష్ణాజీ వెంట తిరుగుతూ "కృష్ణమూర్తి ఏం చెప్పినా, అది ప్రభువే! జగద్గురువే!" అంటూ వుండేది.

కృష్ణమూర్తి అడయార్‌లో వున్నప్పుడు ప్రతిరోజూ ఉదయం ఏడు గంటలకు గోష్టి జరిపేవాడు. ఒకసారి గోష్టిలో అందరూ ఆడవాళ్ళే వున్నారు. వారితో, "చీకటిగదిలో వుండి,

దోవా-తెన్నూ తెలియక, తడుముకుంటూ, ఎవరైనా వచ్చి, లైట్‌వేసి, తమను బైటికి తీసుకువెడతారేమోనని చూసేవారి మాదిరిగా వున్నారు, మీరంతా;" అన్నాడు.

ఆ సందర్భంలో పత్రికలవాళ్ళు, దివ్యజ్ఞాన సమాజంలో వున్న ప్రతి అందమైన అమ్మాయితో కృష్ణమూర్తి ప్రేమ వ్యవహారాలు సాగిస్తున్నట్లు ప్రచారం చేశారు.

•  •  •

కృష్ణాజీ మేరీ లూట్యన్స్‌ను పెళ్ళిచేసుకోబోతున్నాడని లండన్‌లో గోల బయలుదేరింది. ఆ గోలకు వారిద్దరూ గొడవ పడ్డారు. కృష్ణాజీ లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తూ, "ఈ గోలతో నాకు తలక్రిందులైనంత పని అయింది. ఆ విషయంగురించి దీర్ఘంగా, జాగ్రత్తగా యోచించాను. నా భావాలు, నా దృక్పథం మేరీలూట్యన్స్ పురోభివృద్ధికి అడ్డురావు, జోక్యమూ చేసుకోవు. అందరూ నాతోకలసి నా మార్గాన నడవరు. పూర్ణ వికసిత పుష్పం మాదిరిగా ఆమె వారినుంచి బైట పడుతుందనుకుంటున్నాను," అన్నాడు.

1929 జనవరి పదహారవ తేదీన అడయార్‌లో స్టార్ సంస్థ తాలూకు కేంద్రకార్యాలయం తెరిచారు.

మార్చిలో కృష్ణమూర్తి "నేను ఎవరినీ ఒదులుకోను. క్రమంగా వారే నన్ను ఒదిలేస్తారు," అని మిత్రులకు ఒక ఉత్తరంలో రాశాడు.

కృష్ణమూర్తి చాలా కాలంగా ఎదురుచూస్తున్న సమయం ఆసన్నమైంది. 1929 ఆగస్ట్ రెండు మూడు తేదీలలో ప్రపంచ సంస్థ సభ్యులు ఆమెన్‌లో క్యాంప్ ఏర్పాటు చేశారు. ఆ సమావేశాలకు లక్షమందికిపైగా సభ్యులు హాజరైనారు. కృష్ణమూర్తి ఏంచెపుతాడో విందామని దాదాపు ప్రపంచ దేశాలన్నింటి నుంచీ ప్రతినిధులు వచ్చారు. పత్రికలు, రేడియోలు వార్తలకు వేచివున్నాయి. యావత్ ప్రపంచం కృష్ణమూర్తి చెప్పబోయే సంగతి మీద దృష్టిపెట్టింది. అతను ఆ క్యాంపును ప్రారంభించే ముందు, తాను సర్వాధికారి హోదాలో వుండి ఆ సంస్థను రద్దు చేసి ఆ సంస్థకు తాను రాజీనామా చేశారు. ఆ సంఘటనతో క్యాంపులో సంస్థ సభ్యుల్లో, దివ్యజ్ఞాన సమాజంలో, ప్రపంచమంతటా సంచలనం బయలు దేరింది. తనను అనుసరించి, ఆరాధిస్తున్న సమాజాన్ని, సంస్థను పునాదులతో కదిలించారు. అనూహ్యమైన సంగతి జరిగినందుకు సమావేశాలకు హాజరైన అనీబిసెంట్ కూడా ఆశ్చర్యపోయింది. తనను మొదటినుంచీ అనీబిసెంట్ ఏవిధంగా వూహించి, పెంచిందో దాన్నంతా ఒక్కసారిగా నిరాకరించాడు కృష్ణమూర్తి. తానేదో అపురూప, అద్భుతశక్తివంతుడనైన జగద్గురువుగా, తిరిగినస్తానన్న ఏసుప్రభువుగా, అవతార పురుషుడుగా, దివ్యమూర్తిగా భావిస్తున్నవారిని నిరాకరించాడు. దానితో దివ్యజ్ఞాన సమాజ సభ్యుల, సంస్థ సభ్యుల కళ్ళముందు తాము వూహించిన ఆధునిక, మార్గదర్శక జగద్గురు దివ్యమంగళ స్వరూపం వెలవెలబోయింది.

కృష్ణమూర్తి తనకు కానుకలుగా, బహుమతులుగా, ధర్మంగా ప్రేమతో ఇచ్చిన ఎస్టేట్లనూ, భవనాలనూ తిరిగి స్వంతదార్లకు

నచ్చజెప్పి ఇచ్చేశాడు. ఆ సందర్భంలో అనేక ఉపన్యాసాలు ఇచ్చాడు, ముఖ్యం ప్రపంచసంస్థ సభ్యులను ఉద్దేశించి :

" ఈ నా చర్య కొందరికి విచారకరంగా, మరికొందరికి సంతోషకరంగా వుండవచ్చు. ఎవరికి ఎట్లావున్నా ఇప్పటికి ఇది తప్పదు.

" ఈ సంస్థను రద్దుచేసి, మీరేం చేస్తారు? ఎట్లా జీవిస్తారు? అనుచరులు అక్కర్లేకపోతే, ఇంక మిమ్మల్ని వినేదెవరు ? " అని మీరు నన్ను ప్రశ్నిస్తే, " నేను అనుచరుల్ని కోరడంలేదు. మీరూ అక్కర్లేదు. నేను చెప్పేది వినడానికి ఐదుగురు వుంటే చాలు. వాళ్ళు సత్యం వైపు తిరిగి వుండాలి. ఆ ఐదుగురుకీ మతం - మోక్షం - ఆత్మ - ప్రేమ - మృత్యువు, అంటే ఏమిటో అర్థమైతే చాలు.

" నే నా సంస్థనుంచి బైటికి రావడంతో, నాలో పూర్తి మార్పు వచ్చింది. ఎంతో అనుభవం కలిగింది. ఆ సంస్థ అసత్యమైనదిగా తోచడంతో, దాన్నించి బైటికి వచ్చేశాను. కాని, అది అన్నివిధాలా ఐశ్వర్యవంతమైన సంస్థ. అనీబిసెంట్ ఆశించి, స్థాపించి, నన్ను సర్వాధికారిని చేసింది. కాబట్టి, నేను ఆ సంస్థనుంచి బైటికి రావడంతో ఆమె చాలా బాధపడింది. వ్యధన పడింది. ఆ సంస్థనుంచి బైటికి వస్తే, నా తిండి, బట్ట, వసతి ఎట్లానో నాకు తెలియదు. అయినా అనీబిసెంట్ నా యెడల దయగా వుంది. ఆమె మొదటినుంచీ నన్ను తన కన్నకొడుకుగా, చూసుకుంటూ, నా స్వంత ఆలోచనా విధానాన్ని అంగీకరిస్తూనే వచ్చింది.

" ఆ సంస్థకు నేను సర్వాధికారిని గనుక, దాన్ని నిలిపి వేయాలనే దృఢనిశ్చయానికి వచ్చాను. ఆ నిర్ణయం క్షణి

కో ద్రేకంవల్ల కలిగింది కాదు. దాని గురించి రెండు నిండు సంవత్సరాలు దీర్ఘంగా, జాగ్రత్తగా, ఓపికగా, నిదానంగా, నెమ్మదిగా, ప్రశాంతంగా యోచించి, చివరికి దాన్ని ఎత్తివేయ డానికే నిర్ణయించుకున్నాను. ఆ సంస్థ సభ్యులైన వారు, వారికి ఇష్టమైతే మరో సంస్థ స్థాపించుకోవచ్చు.

"ఆ సంస్థను ఎత్తివేయడంలో గల నా ఉద్దేశ్యాన్ని అర్థంచేసుకున్నవారు ఓ ముగ్గురుంటేచాలు. మేము నలుగురమూ ఒకరి నొకరం అర్థం చేసుకుని, కొత్త ప్రపంచాన్ని సృష్టించు కుని, ఆనందిస్తాం. ఆ ముగ్గురిలో సత్యజ్వాల నిరంతరం రగులుతో వుండాలి. ఆ మహాజ్వాలతో వారు తమ చుట్టూవున్న వాటిని అన్నింటినీ దహించి, అన్నింటికీ ప్రమాదకరమైన వాళ్ళుగా వుండాలి. ఎంతో తెలుసుకోవడానికీ, నేర్చుకోవడానికీ వారు కడు శ్రద్ధగా వుండాలి.

"నేను" అనే దాని చుట్టూ ఏర్పడివున్న రాతిగోడల్నీ, అడుగడుగునా ఎదురయ్యే అడ్డంకుల్నీ, నిరంతర ఎరుకతో, జాగరూకతతో తొలగించుకోవాలి. ప్రపంచంలో ఏదీ అసాధ్య మైనది లేదు. కనుక మొదట్లో బ్రహ్మాండంగా, అసాధ్యంగా కనుపించేవికూడ, తీవ్రసాధనవల్ల అల్పమూ, స్వల్పమూ, సూక్ష్మమూ అయిపోతాయి. అందుచేత నన్ను అర్థంచేసుకున్న ఆ ముగ్గురిలో మొదట్లోనే స్థిర నిశ్చయం, గట్టి సంకల్పం వుండాలి. లేకపోతే వారు చేసే సాధన ఇష్టాయిష్టాలకు, ఏదేదో వెతుకులాటలకూ, ప్రతిదాన్ని విడదీసి చూసేందుకూ దారి తీస్తుంది. కనుక వారు ముందుగా తమ జీవితాశయం ఏమిటో స్పష్టంగా తెలుసుకుని, దాన్ని పూర్తిగా అర్థంచేసుకోవాలి. అప్పుడే వారు తమను తాము తెలుసుకుని సక్రమమార్గంలో పెట్టుకోగలుగుతారు. క్రమబద్ధమైన ఆ జీవితమే, ఓ ఆనందం, అందం. అది ప్రేమజనితం.

"చాలామంది తమ జీవితాల్లో మనిషికో, మతానికో, సంస్థకో, నామానికో, రూపానికో - దేనికో ఒకదానికి ప్రత్యేక విలువ ఇచ్చి అసలు సత్యాన్ని ఉపేక్ష చేస్తారు. మరచిపోతారు. నేను ప్రవక్తనో, జగద్గురువునో, తిరిగి వస్తానన్న ఏసుప్రభువునో అనేదీ; దాన్ని మీరు అంగీకరించడం, అంగీకరించకపోవడ మనేదీ ఏమాత్రం ముఖ్యమైన సంగతులు కావు. "ప్రవక్త - జగద్గురువు" అనే మాటలకు ఏ గొప్పతనమూ లేదు, ఏ అర్థమూ లేదు. కాని, నేను చెప్పేది విని, అర్థం చేసుకోవడం ఏమంత కష్టంకాదు. అది నిత్య జీవితం సంగతి. తెలివైన వాళ్ళు, భక్తికల వాళ్ళు అన్యభావ ప్రభావంవల్ల సహజ మార్గం వదలి, తప్పుతోవ తొక్కడంవల్ల, నిత్యజీవితాన్ని అర్థంచేసుకోలేకపోతున్నారు. నిజంగా వెతికేవానికి, సహజంగా వున్న వానికీ అన్నీ బోధపడతాయి ఏ కష్టమూ లేకుండా అతనికి అన్నీ అర్థమౌతాయి.

"నేను దేవుడు లేడనడం లేదు అలా అనడం బుద్ధి తక్కువ. కాని, ఆనాటినుంచి ఈనాటివరకు గొప్ప యోధులు ఈశ్వరుని గురించి మాట్లాడి, ప్రపంచాన్ని సర్వనాశనం చేస్తూనే వున్నారు. అమాయకపు ప్రజలు నలిగిపోతూనే వున్నారు. సంకుచిత హృదయులు, ప్రేమ రహితులు దైవం గురించి మాట్లాడుతూనే వున్నారు. దేవుడు లేడని నేనెప్పుడూ అనలేదు. ఆ దేవుణ్ణే నేను 'జీవితం' అంటాను. ఎందుకంటే, జీవితమే మానవుణ్ణి సత్యం దగ్గరకు తీసుకుపోతుంది.

"నేను కోరేది సంపూర్ణ జీవితం. అంతేకాని నేనేమిటో మీకు అనవసరం. అసలు నేనేమిటో మీరు ఎప్పటికీ తెలుసుకోలేరు. జీవితంలో సత్యమొక్కటే ముఖ్యమైన సంగతి. ఈ ఉపన్యాసాలు, ప్రశ్నలు, సమాధానాలు అన్నీ అనవసరం.

కనుక మీరు ఆ సత్యానికే శిష్యులుగా, అనుచరులుగా వుండండి. వ్యక్తుల్ని అనుసరించకండి. నాకు సత్యమే ముఖ్యం. అందు చేత దాని గురించి పదే పదే చెపుతాను. అటువంటి సత్యాన్ని తెలుసుకునేందుకు మతాల్ని - నమ్మకాల్ని - ఆచారాల్ని - సాంప్రదాయాల్ని - అన్నింటినీ దూరంగా నెట్టేసి, స్వేచ్ఛగా వుండండి. మీరు నాకు అనుచరులమని గాని, శిష్యులమనిగాని అనుకోకండి. అది నాకు ఇష్టం లేదు. నేను శిష్యుల్ని, అను చరుల్ని కోరడం లేదు. సత్యాన్వేషణలో ఒకరి శిష్యులు కావడం, సత్యాన్ని తప్పుమార్గంలో పెట్టడం. మీరు వ్యక్తులకు అణగి వుండటంవల్ల అసలు సత్యాన్ని మరుస్తారు. కనుక నేను చెప్పేది శ్రద్ధగా వినండి.

'నేనొకనాడు చూసిన అందాన్ని, తేజస్సును, దృశ్యాన్ని, అనుభవించిన ఆనందాన్ని, తెలుసుకున్న సత్యాన్ని, పొందిన ఈశ్వరరాజ్యాన్ని, చూసిన పూలతోటను, ఆనంద సాగరాన్ని - మీరు కూడా చూసి, పొంది, అనుభవించి, ఆనందించాలనీ, దాని గొప్పతనాన్ని అనుభవపూర్వకంగా మీరూ తెలుసుకోవా లనీ నేను లోపల్నించి కోరడమేకాక, మిమ్మల్ని దాని దగ్గరకు తీసుకుపోతానన్నాను. కాని, ఈనాడు ఆ విధంగా చెప్పి, మీకు నేను హామీ ఇవ్వబోవడం లేదు.

“ఏ సంఘం, ఏసంస్థా, ఏనిర్మాణం మానవుణ్ణి ఆధ్యాత్మికం వేపు తిప్పి, సత్యం దగ్గరకు తీసుకుని పోలేవు. జీవితంలో ఏసంస్థనూ స్థాపించకూడదు. స్థాపించబడ్డ వాటిల్లో చేరకూడదు. అవి తమకే గాక, అందరికీ అనారోగ్యకరమైనవీ, హానికరమైనవీ, అనర్థదాయకమైనవీ, అభివృద్ధి నిరోధకమైనవి. అవి దేన్నీ అర్థంచేసుకోనివ్వవు. అవి మనిషిలోని చురుకుదనాన్ని చంపు తాయి. ముఖ్యం, అధ్యాత్మికానికి అవి అనవసరం. అవి

మనిషికీ, మనిషికీ మధ్య ఘర్షణలు, కలతలు, తికమకలు కలిగించి, జీవితాన్ని గందరగోళం చేస్తాయి. క్రమంగా అవి కుంటివాని చంకకింది కర్రలై, బంధాలై మనిషిని బలహీన పరుస్తాయి ; బందీని చేస్తాయి. దానితో అతనిలో ఎదుగుదల, వికాసం పూర్తిగా అణగిపోతాయి. తనను తాను తెలుసుకోకుండా అతన్ని మూసేస్తాయి అందుకే నేను ఆ సంస్థను ఎత్తేశాను.

"నేనెట్లా జీవిస్తానా ? జీవితంలో సాహస కృత్యాలమీద కాక, కనీస నిత్యావసరాల మీద ఆధారపడి హాయిగా బ్రతక వచ్చు. నాకేం కావాలో, నాకేమి అవసరమో, నాకు తెలుసు. ఆ అవసరాలూ అంత ఎక్కువ కాదు. అవి అందరానివీ కావు. కాబట్టి నా దేహపోషణకు సరిపడేంత దానికోసం కూలిపని చేసిగాని, ఉపన్యాసాలిచ్చిగాని, ఏదైనా రాసిగాని సంపాదించి బ్రతుకు తాను. ఏమైనా అది అంత ముఖ్యమైన సంగతి కాదు,

"ఈ ప్రపంచంలో నేనొక్కటే చేయదలచుకున్నాను - ఒక్క సంగతే చెప్పదలచుకున్నాను - అది, మానవుడు స్వేచ్ఛగా వుండటం. ప్రజలు పక్షుల్లాగ భారరహితంగా, స్వేచ్ఛగా వుండటం. పరమానందంతో విహరించడం. చిత్ర కారుడు తన చిత్రణలో ఆనందాన్ని సంతోషాన్ని, విజయాన్ని పొందునట్లు, నేను ఆనాడు ఆనందిస్తాను. అంతేకాని, ఒకరి భావాలకు అనుగుణంగా తమ మనసులను మలచడం, మళ్ళిం చడం, వంచడం, అనుసరింపజేయడం మానసిక బానిసత్వం. మానవుణ్ణి ఏ అడ్డూ, హద్దూ, అవరోధమూ లేని సంపూర్ణ స్వేచ్ఛా పరుణ్ణిచేసి, అతన్ని అన్ని భయాలనుంచి తప్పించి, పంజరం లోంచి విడిపించాలనేదే నా సంకల్పం. అటువంటి స్వేచ్ఛా యుతమైన జీవితం తమకు అక్కర్లేదని కొందరు నిర్లక్ష్యంగా తప్పుకు తిరుగుతారు.

" గతబంధంనుంచి మనసు వేరై స్వేచ్ఛగా, నిర్మలంగా వున్నప్పుడే సత్యాన్ని తెలుసుకోగలుగుతారు. కాని, సత్యానికి ఒక మార్గమంటూ లేదు. దానికోసం ఒక మతాన్నో, సంస్థనో, వ్యక్తినో అనుసరించవలసిన పని లేదు. స్వేచ్ఛగా, నిరభ్యంతరంగా, నిర్భయంగా, సంపూర్ణంగా, ఏ నిబంధనా - నియమం లేకుండా Absolute and Uncondtional గా వున్నప్పుడే, సత్యాన్ని తెలుసుకోగలరు. ఎందుకంటే, సత్యానికి హద్దులూ ; అవధులూ లేవు. అది అన్ని కాలాల్లో, అంతటా ఒకే విధంగా విస్తరించి వుంది. అటువంటి విశ్వవ్యాప్తమైన సత్యాన్ని ఓ నిర్ణీత క్రమంలో పెట్టి, ఇష్టంవచ్చినట్లు నడపలేము. అది అలా నడపబడేదీ కాదు. ఏం చేసినా అది ఘనీభవిస్తుంది. లేదా, నిర్జీవమైపోతుంది. కాకపోతే, ఇతరుల మీద రుద్దడానికి క్రమంగా ఒక మతంగా తయారౌతుంది.

" కాని అసలు సత్యం మీలోనే వుంది. కనక ముందు మిమ్మల్ని మీరు తెలుసుకోమని నేను అన్నప్పుడు, మీలో ఏ ఒక్కరూ ఆ విధంగా చేయడానికి సిద్ధపడలేదు. అటువంటప్పుడు మీకు ఓ సంస్థా, ఓ సంఘం, ఓ గురువు, ఓ సర్వాధికారి ఎందుకు? చెప్పిన దానిని చేయడానికి నిరాకరించినప్పుడు బోధకుడు ఎందుకు? అందుచేత నేను చెప్పేది కనీసం ఒక్కరైనా విని, సత్యంవైపు తిరిగితే చాలు.

• • •

" నేను మరొకసారి గట్టిగా చెపుతున్నాను - హద్దులూ, అవధులూ లేని సంపూర్ణ జీవితాన్ని అనుభవించమని. మీరు నామార్గాన నడవదలచుకుంటే, అన్నింటినీ దూరంగా పెట్టి, భార రహితంగారండి. మూర్ఖమైన, బుద్ధి తక్కువ సంగతులన్నింటినీ

పక్కన పెట్టండి. నిర్భయంగా, ఏ నిబంధనా లేకుండా స్వేచ్ఛగా వుండండి. సత్యాన్ని తెలుసుకోవాలనే గట్టి పట్టుదలతో వుండండి. అప్పుడే మీరు మీ యెడల నీతిగా, సత్యవంతంగా, న్యాయంగా, నిజాయితీగా, యోగ్యంగా వుండగలరు. మీకు మీరు నిశ్చల మైన, నిశ్చయమైన, నిశ్చితమైన, నిర్దిష్టమైన భావంతో వుండ గలరు.

"మీకు తెలియని వాటితో ఆటలాడుతో కాలం గడపకండి. ఆడుకోవాలనిపిస్తే, చిన్నపిల్లల ఆట వస్తువులతో ఆడుకోండి. లేదా, అన్నింటినీ విసిరి కొట్టండి. ఏదో ఒకటి పూర్తిగా, శ్రద్ధగా, చేయండి. ఏది చేయడానికి మీకు మీరే నిర్ణయ కర్తలు. ఆపరేషన్‌కోసం డాక్టరు దగ్గరకు వెళ్ళిన రోగి, బాధను ఎట్లా భరిస్తాడో; అట్లాగే మీరూ బాధలు పడడానికి సిద్ధంగా వుండండి.

"అందరూ దేన్ని వెదికి తెలుసుకుంటారో, నేనూ దాన్నే వెదికి తెలుసుకున్నాను," అని నేను అంటున్నానని మీరు నన్ను ఓ అధికారిగా తీసుకోకండి. నేను చెప్పేది విని, ఆలోచించుకుని, ఏదో ఒకటి చేయడానికి సిద్ధంగా వుండండి. ఆ సంబంధాన్నే రోజు రోజుకీ మరింత దృఢపరచుకోండి, పరి శుద్ధం చేసుకోండి, శాశ్వతం చేసుకోండి. అప్పుడు మీలో 'నేను' అనేది కల్పించే రూపాలన్నీ సంపూర్ణంగా వుంటాయి. అన్నీ స్పష్టంగా తెలుస్తాయి.

"కాని, మీరు నిత్యజీవితంలో వాస్తవానికి బదులు వాటి ప్రతిరూపాల్ని ముఖ్యమైనవిగా, విలువైనవిగా భావిస్తున్నారు. మీకు నిజంగా తెలుసుకోవాలని వుంటే, లోకపరంగా మిమ్మల్ని పెంచి, పోషించే అవాస్తవ విషయాలన్నింటినీ దూరంగా

వుంచండి. అన్నింటినీ ఒదలమంటున్నానని నేనేదో కఠినంగా, క్రూరంగా మాట్లాడుతున్నాననుకోవద్దు. మీరు నిజమైన సత్యాన్వేషకులైతే, మీ చుట్టూ కమ్మిన నీడలనుంచి ఎట్లాగూ ఒకరోజున తప్పించుకుని ఆ వెలుగులోకి వస్తారు. అప్పుడు ఆట వస్తువులన్నింటినీ ఒదులుతారు. అదే ఒక సాధన. నేను చెప్పేది అసత్యమైతే, అరచి, నన్ను ఆపండి. నిజమైతే అంగీకరించండి. దేనికో ఒక దానికి గట్టిగా నిలబడండి.

"ఏ మార్గాన్ని అనుసరించినా, అంతరంగికంగా కొన్ని యాతనలు, అసంతృప్తి, ఒంటరితనం, భయం వుండనే వుంటాయి. తనను తాను తెలుసుకోనంతకాలం ఆరాధన, ఆచరణ, అనుసరణ, అనుకరణ, మతం, నమ్మకం, దేవతలు, సిద్ధాంతాలు, సాంప్రదాయాలు, వేదాంతాలు అన్నీ వ్యర్థం. అవన్నీ నేను పడ్డాను గనుకనే, అవి నిరుపయోగమైనవని మీకు చెపుతున్నాను. అందుచేత ఎవరికి వారు తమలోనే సఖ్యతను, ఐక్యతను, సమన్వయాన్ని ఏర్పాటు చేసుకోమంటున్నాను.

"ప్రతి ఒక్కరూ ఎప్పుడూ దేనికో ఒకదానికి భయపడుతూనే వుంటారు. ఆ భయంవల్ల దుఃఖం, బాధ, దైన్యం పోరాటం, పాతపద్ధతులు, చివరికి శూన్యం – ఇన్నివస్తాయి. అందుచేత ముందు ఆ "భయం" నుంచి బైటపడాలి. నిజంగా వినే వాళ్ళను మేల్కొల్పడం, ప్రేరేపించడం, స్వేచ్ఛపరచడం నా పని. అదీ, నాస్వంత అభిప్రాయాలతో కాదు. వాళ్ళ గురించి, వాళ్ళు జాగ్రత్తగా ఆలోచించుకోవడం ద్వారా, ధ్యానం ద్వారా, ఎరుకతో, స్వానుభవంతో తెలుసుకోవడం.

"అన్ని భయాలు పోయిన తర్వాత ఎట్లానూ మార్పు వస్తుంది. వసంతకాలంలో ఆకులు రాల్చిన చెట్లు, కొత్త

చిగుళ్ళు తొడుగునట్లు. కాని, మీరు ముందు ఆ మార్పును తలచుకుని భయపడతారు. ఎందుకంటే, ఏళ్ళ తరబడి పోగుజేసుకున్నవన్నీ సమూలంగా తుడిచిపెట్టుకుపోతాయనే భయంవల్ల బాదవల్ల. ఆకులు రాల్చిన మోడుచెట్లను తలచుకుని భయపడతారు. ఆకులు ఎట్లాసూ పండి, ఎండి రాలతాయి. తప్పదు. ఎంత ప్రయత్నించీ ఆకుల్ని రాలకుండా ఎవరూ ఆపలేరు. అట్లాగే కొత్తచిగుళ్ళు రాకుండా ఎవరూ అడ్డుపడలేరు. నేను చెప్పేది తప్పు, అబద్ధం, అక్రమం అనిపిస్తే, నన్ను వదిలేసి వెళ్ళిపొండి. దేనికైనా ఓర్పు అవసరం. జీవితంలో అదే విలువైన సంగతి. ఆత్మ పరిశుద్ధంగా, పరిపూర్ణంగా ఉంచుకోవడమే, నా ఆధ్యాత్మికతత్వం. అదే శాశ్వతం - సత్యం-ప్రేమ.

"పవిత్రమైన మానవుడు తప్ప, మరో "మాధవుడు" లేడు. మనను మనం తప్ప, మరే శక్తీ మనను స్వాధీనంలో వుంచుకోలేదు. మనను మించిన మార్గదర్శకుడూ, గురువూ వేరుగా లేరు. మనం సృష్టించుకున్న స్వర్గ, నరకాలు తప్ప, ఏమీలేవు. అలాగే, పాప-పుణ్యాలు ఏమీ లేవు. మనకు మనమే పూర్తి బాధ్యులం, ఇంకెవరూలేరు, కారు. మనమూ ఇతరులకు బాధ్యులం కాము. ఉన్నది మనం మాత్రమే.

"కనుక మీరు మీ వ్యక్తిత్వాలను పూర్తిగా తెలుసుకోవాలనుకుంటే, చలించికొట్టుకునే ప్రతి ఆలోచనకీ కలతచెంది, అల్లల్లాడే ప్రతి మనోవికారానికీ - సాంప్రదాయానికీ అసంతృప్తులై వుండండి. ప్రతిదాన్ని సంశయించేంత శక్తి, సామర్థ్యంకలిగి వుండండి. అప్పుడే మీరు సత్యాన్ని తెలుసుకోగలుగుతారు. ఏది ముఖ్యమైనదో అప్పుడు తెలుస్తుంది. ఏది సత్కర్మో ఎవరికి వారికి స్వానుభవంతో తెలుస్తుంది. కనుక ప్రతివారికీ స్వతంత్ర ఆలోచన, తన కాళ్ళమీద తాను నిలిచే

శక్తి వుండాలి-ప్రపంచం తప్పుగా ఎంచినా సరే. అట్లా నిర్భయంగా, నిశ్చలంగా నిలవాలంటే, నిష్కల్మషమైన మనసు కలిగివుండాలి. గొప్ప ఆశయాలు, భావాలు, ఆదర్శాలు అంటూ ఏవో కొత్తగా తెచ్చిపెట్టుకుని, మిమ్మల్ని మీరు మోసపుచ్చుకోకండి; అసహజంగా వుండకండి. వ్యక్తిగత కోర్కెలతో, దురభిమానాలతో, సంకుచిత స్వభావాలతో, మిమ్మల్ని మీరు వంచించుకోకండి. ఉత్సాహంకోసం ప్రోత్సాహంకోసం, ఇతరుల నుంచి సహాయంకోసం ఎప్పుడూ ఎదురు చూడకండి.

"ఒక్క సంగతిమాత్రం గుర్తుంచుకోండి - దురభిమానాలతో, పక్షపాతాలతో బందీలు కావద్దు. ఎందుకంటే, అవి పర్వతం మీద పడే నీడ మాదిరిగా వుంటాయి. అవి నిర్మల నీలాకాశంలో అడ్డంగా పోయే మేఘాలు మాదిరిగా వుంటాయి. అవి మనసును వక్రంచేస్తాయి. వాటికి తెలుసుకునే, అవగాహన చేసుకునే శక్తి లేదు. కనుక వాటి విషయంలో మీరు జీవితమంతా మెలకువగా వుండండి.

"మిమ్మల్ని మీరు తెలుసుకోవాలనుకుంటే, సమస్త ప్రపంచానికి సదా ఎరుకలో వుండండి. సాంప్రదాయాల్ని, మతాల్ని, నమ్మకాల్ని, చదివి - విని - చూసి పోగుజేసుకున్న వాటన్నింటినీ - ఆ సాధనా మార్గంలో అడ్డంగా, అవరోధంగా నిలిచిన వాటి నన్నింటినీ కూలదోయండి. గతాన్నంతా ఊడ్చెయ్యండి. అప్పుడే ఈ మతాలు, గురువులు, గ్రంధాలు, సాంప్రదాయాలు అన్నీ అర్ధమౌతాయి. జీవితంలో ఒకటి అర్ధమైతే, అన్నీ అర్ధమౌతాయి. కనుక ముందు మిమ్మల్ని మీరు తెలుసుకోండి.

• • •

"సృష్టి అంటే, అనంతమైన కదలిక. ఆ కదలికతోపాటు మనమూ కదలి, చలించి, జ్వలించకపోతే, 'నేను'కి, జీవిత అపారత్వానికీ చచ్చినట్లే. అన్ని విధాలైన అధికారాలకూ, సాంప్రదాయాలకు, నీతి - అవినీతులకూ మతాలకూ, అన్నింటికీ చచ్చి - స్వేచ్ఛా జీవనం గడపకపోతే; కాలరహితమైన స్థితిలో అంటే, వర్తమానంలో జీవించలేము. అనంతమైన, శాశ్వతమైన, దివ్యమైన జీవితం గడపాలంటే, గతానికి చెందిన జననంతో, భవిష్యత్తుకు చెందిన మరణంతో ఏమాత్రం సంబంధం లేకుండా హాయిగా 'ఆ క్షణం'లో నిలిచిపోవాలి.

"ఆకాశంలో మేఘాల్ని గాలి వెంబడించి, తరుమునట్లు; భూమి మీద మానవుణ్ణి జీవితం వెంటబడి తరుముతుంది. గాలి చేత తరుమబడే మేఘానికి నిశ్చలత్వం, శాంతి లేనట్లే; లక్ష్యం లేని మానవ జీవితం అశాంతిగా, అంధకారమయంగా వుంటుంది.

"జీవితం సూర్యకాంతి వంటిది. జీవితమే అందం - ఆనందం - సత్యం. అది స్థిరమైనది, శాశ్వతమైనది, నిబంధన లేనిది, క్షణభంగురమైనది. కాని, అసలు వున్నది, ఆ "జీవితం" ఒక్కటే. దానికి ప్రత్యేకించి నిర్మాణం, నాశనం అంటూ ఏమీ లేవు. ఆ జీవితంలో మీరు, నేను, అందరం, అంతా, అన్నీ వున్నాయి, వున్నాం. ఆ జీవితమే మానవుణ్ణి పరిపూర్ణుణ్ణి చేస్తుంది. ఒకోసారి అతన్ని సంపూర్ణ అధికారిగానూ, చేస్తుంది. మరొకసారి పరిస్థితులకు బానిసగా చేస్తుంది; భయపడేటట్లూ చేస్తుంది. అతన్ని పరిమితమైన హద్దుల్లో వుంచి, నాశనమయ్యేట్లు చేసి, వదిలేస్తుంది. అటువంటి మహత్తరమైన జీవితాన్ని అనుభవించాలంటే, పరిమితమూ, బంధమూ అయిన మార్గానపడి గుడ్డిగా, అనాలోచితంగా నడవకూడదు. జీవితాన్ని

తెలుసుకోవడమే, సత్యాన్ని తెలుసుకోవడం. అంటే, తమకు తామే గురుపు కావడం. ప్రతి ఒక్కరిలో సత్యమనేది ఒక శక్తి రూపంలో వుండి, సిద్ధి పొందేందుకు ప్రేరేపిస్తుంది.

"ప్రతి ఒక్కరిలోనూ "నేనూ - శాశ్వతత్వం" అనే రెండు మూలశక్తులు వుంటాయి. 'ఇంకా, ఇంకా అభివృద్ధి చెందాలి, ఉన్నతులం కావాలి," అని నిరంతరం యాతనలు పడుతుంది, 'నేను'. కాని, ఆ 'నేనే' నిత్యజీవితంలో మరో ప్రక్క అముఖ్యం, అశాశ్వతం, అప్రధానం, అసత్యం, అవాస్తవం అయిన వాటిని విలువైనవిగా, శాశ్వతమైనవిగా, సత్యవంతమైనవిగా భావించి; వాటినే మరింత అభివృద్ధి చేసుకుంటో, తన చుట్టూ రాతిగోడలు కట్టుకుంటో వుంటుంది - తన మనుగడకోసం, రక్షణకోసం. అందువల్లనే జీవితంలో బాధ, దుఃఖం.

"ఏదో సాధించాలని తీవ్రంగా అన్వేషిస్తో, బాధలుపడుతో ముందుకు పోయే ఆ 'నేను', కష్టపడి ఏదైనా తెలుసుకుంటే, ఆ అనుభవం కాస్తా క్షణంలో గతంగా మారిపోతుంది. దానికి అందని అనుభవమంతా ఓ నిగూఢ రహస్యంగా, మాయగా మిగిలి పోతుంది. ఆ మాయే, భవిష్యత్తు దాన్ని జయించడం, తెలుసు కోవడమంటే, ఎంతటివారికీ అసాధ్యం. ఆ సంగతి అర్థమైతే, 'నేను' అనేది కూడా అర్థమౌతుంది. 'నేను' తెలిస్తే, అంతా తెలిసినట్లే. అదే సత్యం. ఆ 'నేను' అనేది తెలియకపోతే, అంతా మాయగా కనబడుతుంది.

"దీన్ని బట్టి చూస్తే, శాశ్వతమైనదీ, అనంతమైనదీ, అక్షయమైనదీ, సత్యమైనదీ భూత - భవిష్యత్తుల్లో లేదనీ, అది ఒక్క వర్తమానంలోనే వుందనీ తేలుతోంది. అంటే, అది ఆ క్షణంలోనే

వుందన్నమాట. అంటే, అప్పుడే - అక్కడే వుందని అర్థం. అదంతా ఒక కదలిక. ఆ కదలికతోపాటు మనమూ కదలి జీవించాలి. అదే అమరత్వం, మోక్షం, నిర్వాణం, ఐక్యం. అది సంపూర్ణం, సమస్తం, సహజం. ఆ సంగతి, ఎవరికి వారికి అనుభవంలోకి రావాలి, ఏ క్షణానికా క్షణం. ఆ అనుభవం మూలానికి శక్తిని ఇస్తుంది. ఓ స్థిరమైన, నిశ్చలమైన లక్ష్యం లేనిది అటువంటి అనుభవం కలగదు. ఆ విధంగా కలిగిన ప్రతి అనుభవమూ, ఒక్కొక్క నీటి బిందువై, జీవనదిని మరింత విస్తృత పరచి, సముద్ర గర్భాన్ని చేరుకోవాలనే తీవ్రవాంచతో ఎదురు చూస్తుంది. ఆ స్వానుభవమే గురువై బోదిస్తుంది. మార్గదర్శకుడై దారి చూపి, నడిపిస్తుంది.

కొందరు తరచు నన్నొక ప్రశ్న అడుగుతారు 'గురువు సహాయం లేకుండా ఎవరైనా ముక్తి పొందగలరా?' అని. దానికి 'బహుశా చాలాకాలం పట్టవచ్చు. ప్రపంచ యాత్ర చేసి వచ్చిన వారిని, ప్రపంచయాత్రకు బయలు దేరి వెళ్ళేవారు సలహా అడిగితే, ఆయన - వారు వెళ్ళవలసిన మార్గం, ఆగవలసిన ప్రదేశాలు, చూసి, తెలుసుకోవలసిన సంగతులు అన్నీ వివరంగా, అనుభవపూర్వకంగా చెపుతారు. ఆయన చెప్పిన ప్రకారం ప్రపంచయాత్రకు వెడితే, ఆయన చూసినవే, ఆయనకు తెలిసినవే తర్వాత వెళ్ళినవారికీ తెలుస్తాయి. ఆ దృశ్యాలే కనుపిస్తాయి.

" గురువంటే ఏమిటో ఆలోచించడం అసాధ్యం. గురువనే ఆయన వెనక వుంటే సత్యం మీద దృష్టి - శ్రద్ధ కేంద్రీకరించాలి. గురువును చిన్న కిటికీలోంచి చూడ్డం అలవాటైపోయింది

గనుక, చాలామంది సూటిగా చూడ్డంలేదు. వారు వ్యక్తి మీదనే దృష్టి పెడతారు, తమ అర్హత నిశ్చయించుకోవడం కోసం, ఘనతకోసం, దీక్షకోసం. అందుకే ఒకరిని గురువుగా ఎన్ను కుంటారు; అసలు సత్యాన్ని మరుస్తారు,

"ఎవరైతే జీవితలక్ష్యం విషయంలో అనిశ్చయంగా వుంటారో, వారికి గురువు అవసరం. సందేహించేవారికీ, అపనమ్మకస్తులకూ, బలహీనులకూ, నిశ్చయమైన జీవితాశయాన్ని ఏర్పరచుకోవాలనుకున్నవారికీ గురువు అవసరం. అట్టి వారిని గురువు మేల్కొల్పి, బలవంతుల్ని చేస్తాడు. జీవితంలో ఓ ఆశయం, లక్ష్యం వుంటే, అదే విముక్తి పరుస్తుంది. అట్టి వారిని సైతం గురువు ప్రోత్సాహ పరచి, ధైర్యమిచ్చి, వారి పట్ల ఓ దివ్యమూర్తిగా నిలుస్తారు, అని అంటాను" అన్నాడు కృష్ణమూర్తి.



కృష్ణమూర్తి స్టార్ సంస్థను రద్దు చేసినందుకూ, తనకు అనుచరులు అఖ్కర్లేదు అన్నందుకూ లేడీ ఎమిలీ చాలా బాధ పడింది. ఎందుకంటే, పదెనిమిది ఏళ్ళ కిందట "నన్ను అను సరించండి" అన్న కృష్ణాజీ మాటల్లో విశ్వాసం వుంచి, ఆమె ఆనాటినుంచి అచంచల విశ్వాసంతో అతన్ని వింటో, చూస్తో అనుసరించింది అంతే కాదు, ఆమె తన ఇంటిని,పిల్లల్ని, భర్తని, సంసారాన్ని, సంతోషాన్నీ - సమస్తాన్ని వదలి కృష్ణాజీని అను సరించింది. అటువంటి ఆమె అకస్మాత్తుగా అతని ప్రవర్తనలో మార్పు చూసి ఆశ్చర్య పోయింది. ఆ సంఘటనను, తన జీవితచరిత్ర "Candle in the Sun"లో, కృష్ణాజీ తన వ్యక్తిగత ప్రేమను సహితం అధిగమించగలడు. కాని, అది నా చేతకాదు," అని.

కృష్ణాజీ అంటాడు, "పవిత్ర ప్రేమ, గులాబి పువ్వు పరిమళం మాదిరిగా, అందరికీ తన పరిమళాన్ని అందిస్తుంది. పవిత్ర ప్రేమకు భార్య - భర్త - తండ్రి - కొడుకు - తల్లీ - పిల్లలు - అంటూ ఏదీ ప్రత్యేకంగా వుండదు " అని.

లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "ఈ నా ప్రవర్తనకు నువ్వు నొచ్చుకుని వుంటావు. క్షమించు. నేనూ విచారిస్తున్నాను. నేను అనుభవించే పరమానందం, ఈ ప్రపంచంనుంచి వచ్చినదే! నేను సమస్తాన్ని అవగాహన చేసుకోవాలనుకుంటున్నాను. దుఃఖాన్ని జయించాలనుకుంటున్నాను. ఆసక్తి - అనురాగం - అప్యాయతా - బంధం - వైరాగ్యం - ఇటువంటివి వున్నాయి చూశావూ; అవి చాలా బాధాకరమైన సంగతులు. అవే కాదు. మృత్యువు-జీవితం మొదలైనవి కూడా బాధాకరమైన సంగతులే!

"చివరికి నేను వాటిని అవగాహనతో జయించాను. కాబట్టి నేను పొందుతున్న ఆనందం అఖండం - అపారం - అనంతం - అది శాశ్వతమైనది - యదార్ధమైనది - వాస్తవమైనది. అది నిజం, సత్యం. చూడమ్మా! ఇదంతా పలాయనం మాత్రంకాదు. తీరని తరగని దుఃఖంనుంచి తప్పుకునే మార్గం నాకు తెలుసు. ఊబిలో కూరుకు పోయిన వాళ్ళు పైకి లేవదలచుకుంటే వారికి సహాయంచేస్తాను. ఒకటి మాత్రం ప్రతి ఒక్కరూ గుర్తువుంచుకోవాలి. నమ్మకాలు - భావాలు అంటూ వుండకూడదు. ఎందుకంటే వాటి వల్లనే, జీవితంలో ప్రతిక్రియలు, బాధ్యతలు వస్తాయి. కనుక ప్రతి విషయానికీ చురుకుగా ఎరుకలో వుంటే, వర్తమానంలో భావాల, నమ్మకాల - మొదలైన వాటినుంచి స్వేచ్ఛ పొడవచ్చు. అప్పుడు అనంతమైనదాన్ని దర్శించవచ్చు. ఆ దృష్టే ఆనందం, " అన్నాడు,

కృష్ణమూర్తి ప్రపంచ సంస్థను సర్వాధికారి హోదాలో వుండి రద్దు చేశాడు. దానితోపాటు అన్నింటినీ తోసేసి, నిరాకరించాడు. తనపున్న తక్కిన గౌరవ హోదాలన్నింటినుంచీ, సభ్యత్వాలనుంచీ తప్పుకున్నాడు. అతను ఎన్ని చేసినా, ఏం చెప్పినా అనీబిసెంట్ ఏనాడూ బాధపడలేదు. కృష్ణమూర్తి ఒంటరిగా నిలబడి సత్యాన్వేషణ చేయడాన్ని ఆమె ఎంతగానో మెచ్చుకుంది. దివ్యజ్ఞాన సమాజంలో మళ్ళా అంతరంగ శాఖను తెరిచింది.

స్టార్ సంస్థను రద్దు చేయడంతో "కృష్ణాజీ జీవితం" అనే మహానాటకం తారస్థాయినందుకుంది. ఆ సంఘటనతో కృష్ణమూర్తిని మిత్రులు కొందరు వదిలేశారు. సంస్థ సభ్యులు వ్యతిరేకించారు. దివ్యజ్ఞాన సమాజంలో రాజకీయాలు మరింత రాజుకున్నాయి అధికార వ్యామోహాలు తలెత్తడంతో కృష్ణమూర్తి దివ్యజ్ఞానసమాజంనుంచి తప్పుకున్నాడు, 1930లో. కాని, ఆ సమాజ సభ్యులతో, సంస్థతో సఖ్యతగా వుండేవాడు. తనను గురువుగా, అధికారిగా తీసుకుని ఆరాధించే వారందర్నీ నిరాకరించాడు. తనను అనుసరించేవారిని ఆ ప్రలోభంనుంచి తప్పించయత్నించాడు. ఏ విధంగానైనా సరే, వారిని స్వేచ్ఛాపరుల్ని చేయాలని చూశాడు, వారి సందేహాల్ని తీర్చినా, అర్థంలేని వారి భయాల్ని పోగొట్టినా, ఎంతో ఓదార్పు ఇచ్చినా, లాలించినా, దిగజారిపోతున్నప్పుడు వారిని పైకి లేవనెత్తినా, అన్నీ స్పష్టంగా వివరించి చెప్పినా, నిద్రలేపినా వారు ఇంకా అజ్ఞానంలోనే వున్నారనేది కృష్ణమూర్తి బాధ. వారి నమ్మకపద్ధతుల్ని, నిర్మాణాల్ని, నిరసించి క్షణ-క్షణ కదలికలకు అనాసక్తంగా ఎరుకలో వుండమని వారిని గట్టిగా హెచ్చరించాడు.

అనాసక్తంగా అంటే, ప్రపంచంనుంచి విడిపడి, దూరంగా వుండమని కాదు. తమ యెడల తాము వైరాగ్యభావంతో, అనాసక్తంగా వుండమని. నిజమైన వైరాగ్యం, కోర్కెలు లేకపోవడం. వైరాగ్యమంటే, ప్రపంచ వాస్తవాన్ని, అంతనీ, అన్నింటినీ ప్రేమతో హృదయానికి హత్తుకోవడం. మనని మనం తెలుసుకోవడానికి ఎంతో అనాసక్తత, వైరాగ్యం వుండాలి. మనని మనం తెలుసుకోనిది, దేన్నీ తెలుసుకోలేము. వాస్తవాన్ని గుర్తించలేము. మన గురించి మనం తెలుసుకోవడం ఆరంభించడమే, వాస్తవానికి సరైన పునాది వేసుకోవడం. సరైన పునాది లేకపోతే, భ్రాంతి - అజ్ఞానం-అవిద్య-చాదస్తం తప్పకుండా చోటు చేసుకుంటాయి.

జీవిత వైరుధ్యాలనుంచి విముక్తి పొందటమే వైరాగ్యభావం, అనాసక్తత. అటువంటి వైరాగ్యం, విస్తారం కావడంవల్ల మనసు తేటపడి, విషయాలు స్పష్టమౌతాయి. అదే సహజత్వం. అదే ప్రేమ, పరిపూర్ణత.

కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సమాజంనుంచి తప్పుకున్న సంగతి తెలుసుకుని అనీబిసెంట్ గొడవపడింది. కాని, ఆ తర్వాత సంజీవరావు వంటివారు దివ్యజ్ఞాన సమాజానికి రాజీనామాచేసి, కృష్ణమూర్తిని అనుసరించారు. ఆ సంవత్సరం దివ్యజ్ఞాన సమాజ సమావేశానికి హాజరయ్యే నిమిత్తం లెడ్‌బీటర్ అడయార్‌వచ్చి, కృష్ణమూర్తి సంగతి విని, అతన్ని వ్యతిరేకించారు. ఆ సందర్భంలో కృష్ణమూర్తి విషయంలో ఏం చేయడానికి, ఏం మాట్లాడటానికి ఏమీ తోచక అనీబిసెంట్ తికమక పడుతోవుంటే, "గొడవపడకమ్మా, చివరికి లెడ్‌బీటర్‌కూడా నన్ను వ్యతిరేకించారు. ఇదంతా ఎప్పుడో ఒకప్పుడు జరగవలసిందే! నేను నా మార్గాన్ని అనుసరించి

పోతున్నానేకాని,నిత్యజీవితంనుంచి జారుకోవడంలేదు. నేనిప్పుడు ఉప్పొంగే సంతోషంతో, కేంద్రీకృతమౌనంతో, సంపూర్ణ ఎరుకతో, సజీవమైన జ్వాల మాదిరిగా వున్నాను. కాని, సత్యం నుంచి తప్పించుకుని పారిపోవడం లేదు. కనుక నువ్వు నా గురించి ఏమీ ఆలోచించనవసరంలేదు," అన్నాడు కృష్ణమూర్తి.

తాను దివ్యజ్ఞాన సమాజంనుంచి తప్పుకున్న సంగతి లెడ్ బీటర్‌తో ప్రస్తావిస్తూ, " I maintain that Truth is a pathless land, and you cannot approch it by any path whatsoever by any religion, by any sect That is my point of view, and I adhere to that absolutely and unconditionally Truth being limitless, unconditioned unapproachable by any path, whatsoever cannot be organised, nor should any organisation be formed to lead or to coerce people along any particular path .. " అన్నాడు కృష్ణమూర్తి.

కరుణామయులు, ఉదారస్వభావులు ప్రజల బాధ, దుఃఖం చూసి, జాలిపడి ఏవిధంగానైనా వాళ్ళను స్వేచ్ఛ పరచి, బాధా నివృత్తి కలిగించి, ఉపశమనం కలిగించాలనే గట్టి ప్రయత్నంతో, ఆశతో తమ జీవితాలను సైతం అర్పించి, చివరికి అందమైన ఒక కొత్తరకం ఖైదు నిర్మిస్తారు. అదే వారి జీవితాల్లో విషాద కరమైన సంగతి. కాని, కృష్ణమూర్తి మాత్రం ఆ విధంగా చేయలేదు.

సర్వసాధారణంగా ఎవరైనా తమ పాతఖైదుల్ని కూల్చేసి, తిరిగి వారే, తమకు తామే మరోరకమైన కొత్త ఖైదు కట్టుకుని, దాన్ని అందంగా అలంకరించుకుంటారు. ఖైదుల్ని కట్టుకోవడం మాత్రం మానరు. అది వారి సహజ లక్షణం. తాము నిర్మించుకున్న ఖైదుల గురించి పూర్తిగా తెలుసుకుని,

వారు వాటిని కూల్చుకునేటట్లు చేయడమే పనిగా పెట్టుకున్నాడు, కృష్ణమూర్తి. ప్రతి ఒక్కరూ సత్యాన్ని తెలుసుకోవాలనీ, నిజమైన ఆనందాన్నీ, శాంతినీ అనుభవించాలనీ, మేల్కొవాలనీ కృష్ణాజీ కోరుకుంటాడు. దానికి అందరినీ కలసి పనిచేయ మంటాడు.

నిజంగా ప్రేమించేవాడే, విప్లవవాది. అతనిదే నిజమైన మతం. అటువంటి వారిలో తప్పక పరిణామం వస్తుంది. ఎందు కంటే, ప్రేమ, ఆలోచనావిధానం కాదు. ప్రేమకు హద్దులూ, తన-పర భేద భావం; జాతి - మత - వర్గ - వర్ణవివక్షతలూ - ఏమీ లేవు. ఆలోచనవల్ల సంబంధాలు, బంధాలు, నియమ - నిష్ఠలు, ఆచారాలు, కార్యకలాపాలు - సమస్తం పుట్టుకొస్తాయి. అవి వినాశనాన్నీ, మృత్యువునీ తెచ్చిపెడతాయి. ప్రేమ వున్న నాడు, నిజమైన పరిణామానికి, విప్లవానికి అవకాశం వుంటుంది, ఆలోచనలు ఆగిపోవడమే దానికి సరైన మార్గం.

పరిణామ మంటే, విశాల దృక్పథం. సత్యాన్ని సత్యంగా, అసత్యాన్ని అసత్యంగా చూసి తెలుసుకోవడం. అలాగే అసత్యం లోని సత్యాన్నీ, సత్యంలోని ఆమోదయోగ్యమై, అంగీకారం పొందిన అసత్యాన్నీ తెలుసుకోవడం అదే నిజమైన పరిణామం. ఎందుకంటే, ఆ స్పష్టతే మనిషిని సర్వబంధాలనుంచి, భయాల నుంచి విముక్తి పరుస్తుంది.

పరిణామం ఎప్పటికీ భవిష్యత్తుకు చెందిందికాదు. భవిష్యత్తులో పరిణామం చెందాలనే మనసు ఎప్పటికీ సత్యాన్ని గ్రహించలేదు. ఎందుకంటే, సత్యం క్షణ క్షణానికీ కదిలేదీ, చైతన్యవంతమైనది; ఏ క్షణానికా క్షణం నూతనంగా వుండేది.

అటువంటి సత్యాన్ని అందుకోవడానికి ఫలాపేక్ష లేకుండా మనసు చురుకుగా పనిచేయాలి. భవిష్యత్తులో ఏదోగా మారాలనే కోర్కె వుండకూడదు.

పరిణామమనేది ఒకదాని పర్యవసానంగా ఏర్పడేదికాదు. ఒకదాని ఫలితమూ కాదు. ప్రతి ఫలితానికీ కారణం, కార్యం- రెండూ వుంటాయి. ఫలితం, ఒకదాన్ని వెనక దిగవిడుస్తుంది. కారణం వుంటే, కార్యం తప్పక జరుగుతుంది. ఆ కార్యంతో పాటు పరిణామం చెందాలనే కోర్కె కూడా వుంటుంది. ఆ కోర్కె ఆలోచనల్ని రేపుతుంది. కోర్కె, ఆలోచన లేని స్థితే, ప్రేమ. అటువంటి ప్రేమ వున్ననాడు పరిణామం వుంటుంది. ప్రేమ లేనిది విప్లవాన్ని వూహించలేము. ప్రేమ రహిత విప్లవం, కేవలం వినాశనం, దుఃఖమయం.

ఒకసారి కృష్ణమూర్తి, "నాలో అకస్మాత్తుగా పరిణామం రాలేదు. ఏదో మహాత్యం జరిగి, విశ్వాత్మలో, ప్రియతమునిలో ఐక్యం కాలేదు. హఠాత్తుగా నాకు ఏమీ జరగలేదు. నా అంతరంగిక ఎరుక ఎప్పుడూ నాకు వుండనేవుంది. ఆ సంగతి నాకు స్పష్టంగా, అనుభవపూర్వకంగా తెలియడానికి చాలాకాలం పట్టింది. అదంతా ఒక మెరుపులాగ, అకస్మాత్తుగా జరిగింది మాత్రం కాదు. కాని, నెమ్మదిగా - ఒకేతీరుగా - స్పష్టంగా క్రమంగా అంతరంగికంగా జరిగిన సంగతి, అది." అన్నాడు.

కృష్ణమూర్తి ఆవిధంగా ఎన్ని చెప్పినా, తమ పాట తమదే అన్నట్లు, "ప్రపంచసంస్థనుంచీ, దివ్యజ్ఞాన సమాజంనుంచీ మీరు ఎందుకు బైటికి వచ్చారు?" అని కృష్ణమూర్తిని కొందరు ప్రశ్నిస్తూనే వున్నారు. ఆ ప్రశ్నకు సమాధానంగా, "అసలు ఆధ్యాత్మిక, తాత్విక సంఘాల్ని, సంస్థల్ని స్థాపించి, నడపడం

దేనికి ? అవన్నీ ఒక్కొక్క నమ్మకంమీద ఆధారపడివుంటాయి. ఆ నమ్మకస్తులంతా ఒక వర్గంగా, ఒక తెగగా, ఒక జాతిగా, ఒక మతంగా ఏర్పడతారు. ఆ విధంగా వర్గాలు, మతాలు ఏర్పడ్డాయి.

"ఆ విధంగా ఏర్పడిన వర్గాలు, మతాలు మానవజాతిని విడదీసి దూరంగా వుంచుతాయి – హిందు; ముస్లిం, బౌద్ధ, క్రైస్తవ – మొదలైన పేర్లతో. చరిత్ర పొడవునా ఇదే జరిగింది. నమ్మకాలపై ఏర్పడ్డ సంస్థలు క్రమంగా కలహాల్లోకీ యుద్ధాల్లోకీ దిగి, మనుష్యులమధ్య గట్టి రాతిగోడలు కడతాయి. ఆ సంస్థలూ, సంఘాలూ, వర్గాలూ, మతాలూ అప్పుడప్పుడూ మాట వరసకు తాము కట్టుకున్న రాతిగోడల వెనకనుంచి "విశ్వ మానవ కళ్యాణం – స్నేహం – సౌభ్రాతృత్వం – శాంతి – సమానత్వం – ప్రేమ" అంటూ గొప్ప గొప్పమాటలు అరుస్తూ వుంటాయి. అంతే !

"సత్యం-దైవం" అనేది, సంస్థల, సంఘాల, సమాజాల, ప్రచారాల, నమ్మకాలవల్ల తెలిసేదీ, నిలిచేదీ కాదు. అది కేవలం స్వానుభవంవల్ల తెలియవలసిందే ! ఏ అనుభవాన్నీ నిర్మాణం చేయలేము, ఏర్పాటూ చేయలేము. దాన్ని మాటల్లో వర్ణించలేము. సభ్యత్వంకోసం సంఘం, సంస్థ, సమాజం. అలాగే ఆ సంఘ పురోభివృద్ధికోసం సభ్యులూ చూస్తూవుంటారు. ఆ సంఘ సభ్యులు ప్రచారానికి, పద్ధతికీ, నమ్మకానికి అలవాటు పడతారు. నమ్మకాలలో చిక్కుకున్నవారికీ, సంస్థల్లో-సంఘాల్లో చేరినవారికీ, ఓ పద్ధతిని అనుసరించి పోయేవారికీ స్వేచ్ఛ దుర్లభం. వాళ్ళ నమ్మకం, సంఘసంరక్షణ కోసం. రక్షణ వెదికేవాడు, స్వేచ్ఛలేనివాడు. స్వేచ్ఛలేనివాడు, సత్యాన్ని ఎట్లా తెలుసుకోగలడు ?

"మనం మన మాటలతో, గుర్తులతో, చిహ్నలతో, సౌంజ్ఞలతో, గ్రంథాలతో ఏం సాధించాం? ఎంతమందిని నిద్రలేపాము? ఎంతమందిని ఆనందపరిచాం ? మామూలుగా నిత్యంజరిగే బైట సంగతుల్లోనేకాదు, ఆముష్మికంగా ఏం సాధించాం ? ఎప్పటికీ చెడని, చెరగని, చెదరని, తరగని, తప్పిపోని, నాశనం కాని ఆనందాన్ని, సంతోషాన్ని – సహజమూ, సామాన్యమూ అయినదాని తాకిడికి కాంతి మందగించని ఆ పరమసత్యాన్ని ఎంతమందికి అందించగలిగాము? " అని మనల్ని మనం ప్రశ్నించుకోవాలి.

మనకు సంతోషకరమైన, సంతృప్తికరమైన, ప్రీతికరమైన సంగతుల్ని అనేకరకాల పేర్లతో పిలుచుకుంటాం. వాటిని అనేక పద్ధతుల్లోకి మలచుకుంటాం. ఆవిధంగా మనల్ని మనం ఇతరులనుంచి వేరుపరచుకోవడం; మనం తక్కినవారినుంచి భిన్నమనీ, ప్రత్యేకమనీ తలచుకోవడం అనాదిగా మనకు అలవాటు. ఇవన్నీ చేసి మనం దుఃఖవిముక్తులం కాగలమా ? అట్లా మనం విడిపడి, ఏ ఒక్కరికైనా శాంతిని, ఆనందాన్ని అందివ్వగలిగామా ? పోనీ, తామైనా దుఃఖం, బాధనుంచి తప్పించుకోగలిగారా ? ఆధ్యాత్మికంగా ఆర్తితో వున్నవారికి కనీసం ఉపచారాలు చేసి, ఉపశమనం కలిగించగలిగామా ? బాధితులతో కలసి నిజంగా బాధపడ్డామా ? అయితే ఇంకెందుకు తాము ప్రత్యేకం అనుకోవడం ? అసలు మీరు చేసే పని ఏమిటి? ఇతరులనుంచి మీరు ఏ విధంగా వేరు? అసలు మీ ఉద్దేశ్యం ఏమిటి? మీరేం సాధించారు ? ఏం సాధించాలనుకుంటున్నారు ?

ఈనాడు "కృష్ణమూర్తి" అనే వ్యక్తినుంచి సత్యాన్ని ఎదురుచూస్తున్నారు. అవునా ? ఆ సత్యాన్నే అభివృద్ధి పరచాలనుకుంటున్నారు. ఎవరో ఒకరు వచ్చి, ఒకదాన్ని "సత్యం"

అనే పేరుమీద, మీమీద బలవంతంగా అధికారపూర్వకంగా రుద్దితే, దాన్నే మీరు "అసలు సత్యం"గా ఎంచి, ఆ అధికారిని ఆరాధిస్తారు; అసలు సత్యాన్ని అనుసరించి, ఆరాధించడానికి బదులు. అవునా ?

"నేనెంతమాత్రం హద్దుల్లో బందీగా వుండాలనుకోవడం లేదు. నేను నా దారిని పోతాను. ఎందుకంటే, అసలు వున్నదీ ఆ ఒక్కటే మార్గం. నాకు కావలసింది నేను తెలుసుకున్నాను. నేను నా ప్రియతమునిలో ఐక్యమైనాను," అన్నారు కృష్ణాజీ.

అటువంటి స్వేచ్ఛాయుతమైన స్థితిని అందుకోవడానికి కృష్ణమూర్తి తన మిత్రుల, శత్రువుల, విమర్శకులతో అనేక సంవత్సరాలు పోరాడవలసివచ్చింది. చివరికి ఆ చిక్కు గొలుసుల్ని తెంచుకుని బైటపడ్డాడు. దానితో ఆయన జీవన విధానమే పూర్తిగా మారిపోయింది. అంత జరగడానికి ఆయన క్షణ-క్షణం ఎంత యాతన పడ్డారో! ఆయన్ని విడవకుండా విన్నవారికీ, వదలకుండా వుండి చూసినవారికీ కొంతవరకు తెలుసు.



1930 డిశంబరులో కృష్ణమూర్తి, రాజగోపాల్ 'ఏథెన్స్' వెళ్ళారు. అక్కడి ప్రజలు కృష్ణమూర్తి ఉపన్యాసాలకు ఆకర్షితులై, ఆయన్ని అనుసరించారు. ఒకతను, 'కృష్ణమూర్తి ఏథెన్స్‌లో వరసగా పదిహేను ఉపన్యాసాలు ఇస్తే, ఆయన తప్పక ఏథెన్స్ మేయరు అవుతాడు,' అన్నాడు.

కృష్ణమూర్తి ఏథెన్స్‌నుంచి లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, "ఈ దేశం, ఈ ప్రదేశం, కాలిఫోర్నియాలాగ వుంది. కాని,

ఇది ఇంకా ఎంతో అందంగా వుంది; సౌందర్యవంతంగా వుంది. ఏథెన్స్ ఎంతో నాగరికత, సంస్కారం కల పట్టణం. ఇక్కడ గాలి ఆహ్లాదకరంగా వుంది. ప్రజలు స్నేహప్రియులు. జీవించ డానికి ఇది స్వర్గం మాదిరిగా వుంది. వైలెట్‌పర్వతాలు, పూల వనాలు, ద్రాక్షతోటలు, సైప్రెస్ - ఆలీవ్ చెట్లతో ఎంతో అందంగా వుంది. ఎంత అందమని వర్ణించను? ఇక్కడ 'ఏక్రో పోలీస్'కి సాటైనది భూమి మీద మరొకటి వుండదను కుంటాను. అది అంటే నాకెంతో ఇష్టం, ప్రేమ. న్యాయదేవత "థెమిస్," చెక్కిన పాలరాతిలో వెలిగిపోతోంది. ఆ విగ్రహం అనన్య సామాన్యమైనది. ఆ దేవతామూర్తికి నా హృదయాన్ని, మనసునీ పూర్తిగా అర్పించాను.' అన్నారు.

కృష్ణమూర్తి ఏదెన్స్‌నుంచి కాన్‌స్టాంటినోపిల్ వెళ్ళారు. బుకారెస్ట్‌లో రుమేనియా రాణి 'మేరీ' ఆయన్ని కలుసుకోవా లనుకుంది. ఆ సంగతి తెలిసి, కృష్ణమూర్తే రాజభవనం వెళ్ళి, ఆమెతో రెండుసార్లు మాట్లాడారు. యుగోస్లావియాలోనూ, ప్రతి చోటా ప్రత్యేక ఇంటర్వ్యూలు, ఉపన్యాసాలు ఇచ్చారు, కృష్ణమూర్తి.

1931 అక్టోబరులో కృష్ణమూర్తి ఒహైలో వున్నారు. ఆయనతో రాజగోపాల్, రోజలిండ్, వాళ్ళ పాప'రాధ' వున్నారు. రాజగోపాల్ టాన్సిల్స్ ఆపరేషన్ నిమిత్తం హాలీవుడ్ వెళ్ళాడు. కృష్ణమూర్తి ఒంటరిగా వున్నాడు, ప్రతిదాన్ని గమనిస్తో. ఆ సమయంలో లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో 'నేను పరమానందంలో వున్నాను. దుఃఖాన్ని జయించాలనుకుంటున్నాను. అన్నింటినీ అవగాహన చేసుకోవాలనుకుంటున్నాను. సంయోగ-వియోగాల బాధ; జీవితం-మృత్యువు మొదలైన వాటినన్నింటినీ అవగాహన చేసుకోవాలనుకుంటున్నాను; నా పరమానందం వాస్తవం,

అనంతం, అపారం. అది కేవలం నా భ్రాంతి, భావన కాదు. అది పలాయనమూ కాదు. నన్ను నేను వంచన చేసుకోవడమూ కాదు. ఎందుకంటే, దుఃఖంనుంచి తొలగేమార్గం నాకు తెలుసు. అందుచేత ప్రజలను దుఃఖంనుంచి తప్పించే తరుణోపాయం కోసం చూస్తున్నాను. నేను ఎన్నుకున్న మార్గాన్ని స్పష్టం చేసుకోదలిచాను. ఇతరులు నా దగ్గరకు వచ్చేందుకు వీలుగా ఒక వంతెన కట్టదలిచాను.

"సంసార జీవితం వంటిది నాకు సమ్మతంకాదు. ఆ రిక మైన బంధం నాకు ఇష్టంలేదు. జీవితంలో ప్రతి ఒక్కరూ అవసరమైనవాటినీ, అప్రస్తుతమైనవాటినీ, అముఖ్యమైనవాటినీ తప్పనిసరిగా వదలాలి. నా దగ్గర ఎంతో డబ్బు చేరింది. ఆ ́బ్బు నాకు అవసరంలేదు. ఆ డబ్బు నాకు ముఖ్యమూ కాదు. క్షగాని మాదిరిగా నేను హాయిగా బ్రతకగలను. మిస్ డాడ్జి ౦కు డబ్బు ఇవ్వకపోయినా, నేను హాయిగా, ఆనందంగా బ్రతకగలను. నేనొకటి చేయదలిచాను. దానికోసమే జీవితంలో ముందుకు సాగుతున్నాను,'' అన్నారు.

ఆ సంవత్సరమంతా కృష్ణమూర్తి, రాజగోపాల్ యూరప్‌అంతా తిరిగారు. ఎర్డ్ భవనాన్ని తిరిగి యజమానిని ఒప్పించి ఇచ్చేశారు. ఆ ప్రయాణాల్లో కృష్ణమూర్తి "జార్జి బెర్నార్డ్‌షా"ను కలుసుకున్నారు. షా, కృష్ణమూర్తిని చూసి, "నేనెప్పుడూ ఇంత సౌందర్యవంతుణ్ణి చూడలేదు,'' అన్నాడు, ఆ తర్వాత.

ఆ రోజుల్లోనే కృష్ణమూర్తి, చిత్రకారుడు - మహాకవి - తత్వవేత్త-మేధావి అయిన ఖలీల్ జిబ్రాన్ని చూడ్డానికి ఆయన ఇంటికి వెళ్ళారు. ఆయన కృష్ణమూర్తిని చూసి ''నా ఇంటికి నిశ్చయంగా ప్రేమమూర్తి వచ్చారు" అన్నాడు.

"మీకు శారీరక రుగ్మతల్ని నయంచేసే శక్తి వుందా?" అని ఒకరు కృష్ణమూర్తిని అడిగితే, "ముందు మనోరుగ్మతల్ని నయంచేసుకోవడానికి చూడండి. జీవితంలో అది ముఖ్యమైన సంగతి," అని, "మహాత్మ్యాలు చిన్నపిల్లల ఆటల వంటివి. వాటికి విలువలేదు. నిత్యం డాక్టర్లు మహాత్మ్యాలు చేస్తూనే వుంటారు. అవన్నీ దేహానికే పరిమితం. నేను నయం చేయాలనుకున్నవి మనసుకీ, హృదయానికీ సంబంధించినవి. నాకు తెలిసినంతవరకు ఏ గురువూ మహాత్మ్యాలు చేయరనుకుంటాను. ఎందుకంటే, అవి సత్యాన్ని మోసంచేసినట్లే," అన్నాడు.

1931 - డిశంబరు పదకొండున, కృష్ణాజీ లేడీ ఎమిలీకి రాస్తో, "నేను ఒంటరిగా వున్నాను. ఇలా ఒంటరిగా వుండాలని నేను ఒకనాడు కోరుకున్నాను. నా జీవితంలో నాకు అన్నీ సకాలంలో సమకూరాయి. ఇప్పుడు నామనసు నిర్మలంగా, స్వచ్ఛంగా, ప్రశాంతంగా వుంది. అది ఏకాగ్రచిత్తంతోవుంది. ఎలుకను పట్టే పిల్లిమాదిరిగా వుంది. ఏకాంతవాసాన్ని నేను నిజంగా ఆనందంగా అనుభవిస్తున్నాను. నేను పొందే ఆనందాన్ని మాటల్లో వర్ణించలేను. అని, నన్ను నేను వంచనచేసుకోవడంలేదు.

మరొక ఉత్తరంలో, "నాకూ-ప్రపంచానికి మధ్య వంతెన కట్టాలనుకుంటున్నాను. నేను పొందినదేదో అది అందరికీ అందివ్వాలని ఆరాటపడుతున్నాను. బహుశా చాలా కాలం పట్టవచ్చు. వర్ణింపశక్యంకాని దాన్ని వర్ణించడం అసాధ్యం. ప్రకటింపబడేదేదీ పరమసత్యం కాదు," అన్నాడు.

ఆ ఉత్తరాలు చూసి, లేడీఎమిలీ ఆశ్చర్యపోయి ప్రజలు కృష్ణమూర్తి వీపు వెనక నవ్వి, అపహాస్యం చేసిన సంఘటనలను గుర్తుకుతెచ్చుకుని, "అతన్ని అర్థం చేసుకోవడం ఎంతో కష్టం," అని అనుకుని అతనికి ఉత్తరం రాస్తో. "నిన్ను అర్థం చేసుకోవడం చాలాకష్టం. ప్రజల నమ్మకాలనన్నింటినీ నీవు తలక్రిందులు చేశావు. వాళ్ళ పునాదుల్ని కూలదోసి, వాళ్ళను కలవరపరిచావు. నువ్వు చెప్పే సత్యం, వాళ్ళకు అర్థం కాదు. నీవు ఒక కోణంనుంచి మాట్లాడతావు. వాళ్ళు మరొక కోణంనుంచి చూసి, ఆలోచిస్తారు. పరమైన దాన్ని పొందాలంటే, అహంకారాన్ని తీసేసుకోమంటావు. అదెట్లా సాధ్యం?........," అంటూ ఎంతో రాసింది.

కాని, మనం కలుసుకుంటాం. నువ్వు మార్గాలు లేవంటావు. మేము మార్గాలు వున్నాయంటాం," అంటూ, నేను అడయార్ రావడం కొందరికి బాగాలేనట్లుంది. అడయార్ సజీవంగా వుంది. కాని, అక్కడి మనుష్యులు మాత్రం నిర్జీవంగా వున్నారు," అన్నారు.

అనీబిసెంట్‌కు ప్రమాదంగా వుందని తెలిసి దివ్యజ్ఞాన సమాజ సభ్యులు, ఆమె మిత్రులు అడయార్ చేరుకున్నారు. సెప్టెంబరు ఇరవయ్యో తేదీన అనీబిసెంట్, మరణించింది. ఆమె మరణవార్తను కృష్ణమూర్తి "ది న్యూయార్క్ టైమ్స్" పత్రికలో చూసి తెలుసుకున్నారు. కాని, ఏఒక్కరూ ఆమె మరణవార్త కృష్ణమూర్తికి తెలియపరచ లేదు. ఓ యాభై ఏళ్ళు కృష్ణమూర్తి, అనీబిసెంట్‌ల జీవితాలు ప్రేమతో పెనవేసుకుని పెరిగాయి. కాని, వారిద్దరూ కలిసి జీవించింది, కలిసి తిరిగిందీ బహుకొద్దికాలం, తల్లి, బిడ్డను ఎట్లా కంటికి రెప్పలాగ కాపాడు తుందో, అట్లా చూసుకుంది కృష్ణమూర్తిని, అనీబిసెంట్.

కృష్ణమూర్తి చిన్నప్పుడంతా అనీబిసెంట్‌కు వారానికి ఒక ఉత్తరం రాసేవాడు. అన్ని సంగతులు నిర్భయంగా, నిర్మొహమాటంగా రాసేవాడు. ఆమె కృష్ణమూర్తి యెడల మొదట తల్లిగా, తర్వాత గురువుగా మెలిగి, చివరికి కృష్ణ మూర్తి సమక్షంలో ఆయన బోధలు వింటో ఓ గొప్ప శిష్యురాలిగా వెలిగిపోయింది. కృష్ణమూర్తి ఆమె గురించి ప్రస్తావిస్తో "ఆమె నన్ను తన కొడుకుగా చూసుకుంది. ఆమె నా కోసం ఎంతో చేసింది. కాని, ఒకటి మాత్రం చేయలేదు - ఆమె నన్ను ఎప్పుడూ "ఇది చెయ్యి - అది చేయకు" అనలేదు, నన్ను నా స్వేచ్ఛకు వదిలేసింది," అన్నారు.

అనీబిసెంట్ ఇండియా జ్ఞానార్జనకోసం ఒకయాత్రికు రాలిగా వచ్చి, స్థిరపడి, దివ్యజ్ఞాన సమాజ విస్తరణకేగాక,

అజ్ఞానాంధకారంలో పడికొట్టుకుంటున్న భారతీయులకు అనేక విధాల సహాయాలు చేసింది. ఇండియా ఆమె ఆధ్యాత్మిక నివాసస్థలమైంది. ఆమె ప్రతిభవల్ల దివ్యజ్ఞాన సమాజం ప్రపంచమంతా విస్తరించి, బహుళ ప్రచారం పొందింది. అపజయమనేది లేకుండా నలభై ఏళ్ళు తన శక్తి-సామర్థ్యాలు ధారపోసి, నిద్రపోతున్న భారతజాతిని మేల్కొల్పి, రాజకీయ-సాంఘిక-మతైక-విద్యా విషయాల్లో చైతన్యవంతుల్ని చేసింది. ఎంతో నేర్చుకోవాలని వచ్చి, భారతీయులకు ఆమె ఎంతో నేర్పింది. భారతీయులకోసం అనేక విధాల శ్రమించింది. ప్రపంచదేశాల మధ్య ఇండియాకు సరైన స్థానం ఏర్పాటు చేసింది. భారతీయులు ఎప్పటికీ ఆమెకు విధేయులై వుండటం గొప్ప సంగతి. కాని, ఆమెను దేశప్రజలు కాని, దేశనాయకులుగాని అర్థంచేసుకుని అనుసరించలేకపోయారు. తాను నమ్మిన గురువుల ఆదేశానుసారం జీవితాంతం శ్రమించి, తరించిన ధన్యజీవి, అనీబిసెంట్. ఆమె బహుగ్రంధకర్త. గొప్పవక్త. ఆమే, ఒక సంస్థ.

అనీబిసెంట్ మరణానంతరం, జార్జి అరండేల్ దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షులయ్యారు (1934-45). కృష్ణమూర్తికి దివ్యజ్ఞాన సమాజంతో పూర్తిగా సంబంధాలు తెగిపోయాయి. తనకు ఎటువంటి సంస్థతోనూ ఏ విధమైన సంబంధం వుండకూడదనే నిశ్చయంతో ఋషీవ్యాలీ ట్రస్ట్‌నుంచి కూడా కృష్ణమూర్తి తప్పుకున్నారు.

ఆ తర్వాత కృష్ణమూర్తికి ప్రపంచం నాలుగు మూలల నుంచీ ఆహ్వానాలు వచ్చాయి, తమకు అవగాహన - సత్యం గురించి చెప్పమంటూ. వారి ఆహ్వానాలను పురస్కరించుకుని కృష్ణాజీ ఆయాచోట్లకు వెళ్ళి, ఉపన్యాసాలు ఇచ్చారు.

• • •

1933 సంవత్సరాంతంలో కృష్ణమూర్తి, రాజగోపాల్ ఇండియా వచ్చి, మద్రాసు "వసంత విహార్"లో వున్నారు. అది ఆరు ఎకరాల ఆవరణలో కట్టిన పెద్ద భవనం. అది అడయార్ నదికి ఉత్తరదిశను వుంది. ఆ భవనం ఇండియా స్టార్ సంస్థ తాలూకు కేంద్రకార్యాలయం. అందు ముద్రణాలయం కూడా వుంది అక్కడి సంగతుల్ని కృష్ణమూర్తి లేడీ ఎమిలీకి రాస్తూ (21-1-1934), దివ్యజ్ఞాన సమాజ సభ్యులు తనను ఏవిధంగా తీసుకున్నదీ తెలియపరుస్తూ, "లెడ్‌బీటర్ నాకు స్టేషన్‌లో పూలమాలలు వేసి, స్వాగతం చెప్పారు. డిశంబరులో జరిగే దివ్యజ్ఞాన సమాజ సమావేశాల అనంతరం ఆయన సిడ్నీ వెళ్ళాలనుకున్నారు. తక్కిన వాళ్ళంతా నామీద ప్రేమ వున్నట్లు నటించబోయారు. నేను వెళ్ళిన తర్వాత అడయార్ హాల్లో ఎంతోమంది చేరారు. అదొక తంతులా వుంది. దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులైన జార్జి అరండేల్ నా చేయిపట్టుకుని, నా వీపు తట్టారు. అక్కడి వాతావరణం భయంకరంగా తోచింది. అక్కడ ఏ మాత్రం స్నేహభావం కనపడలేదు, నాకు. అదంతా పెద్ద పచ్చి అబద్ధమని నాకు తెలుస్తోనే వుంది. పాతమిత్రులు నా మీద ప్రేమ వున్నట్లు దగ్గరకు వచ్చి, స్వరక్షణార్థం వెంటనే దూరంగా జరిగారు. కొందరు నాకు దగ్గరైతే, వాళ్ళమార్గం సులభమయ్యేట్టు నా చుట్టూ గుమికూడి, "ఇతను నిజమైన సరుకు వున్నవాడు," అని నెమ్మదిగా వాళ్ళల్లో వాళ్ళు గొణుక్కున్నారు. కాని, వాళ్ళంతా దివ్యజ్ఞాన సమాజంలో వృద్ధులు. వాళ్ళు తమ పాతపద్ధతులు వదలుకోలేని వాళ్ళు. ఆ పద్ధతుల్లో కూడా వారు తమ మనసులు, హృదయాలు పెట్టి, పని చేయడం లేదు. వెలుగుతున్న కొవ్వొత్తి కింద, నీడలా వాళ్ళు అడయార్ సమాజ కేంద్రంలో వున్నారు. అంతే! అక్కడ అలసిపోయినంతగా నేను నా జీవితంలో ఎక్కడా అలసిపోలేదు. దాన్ని వదలి వెళ్ళడం నాకెంతో పరమానందాన్ని కలిగించింది.

"లెడ్ బీటర్ చాలా ముసలివారైపోయారు. ఒకటే మాట్లాడుతున్నారు. ఆయన్ని చూడ్డానికి నేను రెండు సార్లు వెళ్ళాను. మేము అముఖ్యమైన విషయాల గురించి మాట్లాడుకున్నాం. ఆయన నా యెడల స్నేహంగా వున్నట్లు కనపడ్డారు. కాని, ....

"నేను ఇండియాలో ఎక్కడకు వెడితే అక్కడ, పెద్ద పెద్ద గుంపులు కూడారు. సంఖ్యలోనేకాని, నిజమైన సరుకు వున్న వాళ్ళు కాదు. వాళ్ళ హృదయాలు వుత్తశూన్యం" అన్నారు.

సమావేశాల అనంతరం లెడ్‌బీటర్ సిడ్నీ వెడుతూ దారిలో "పెర్త్"లో జబ్బుపడి, 1934 మార్చి ఒకటవ తేదీన మరణించారు. మహాజ్ఞాని - ఉత్తమ సంస్కారి - ప్రపంచ ప్రశంసనీయుడు - వివేకవంతుడు - భావగంభీరుడు అయిన లెడ్‌బీటర్ అస్తమించడంతో దివ్యజ్ఞాన సమాజ మూల స్తంభాలలో మరొకటి కూలిపోయింది. ఆ సమయంలో కృష్ణమూర్తి సిడ్నీలో ఉపన్యాసాలిస్తున్నారు. లెడ్‌బీటర్ మృత దేహాన్ని సిడ్నీ తీసుకు వెళ్ళారు. కృష్ణమూర్తి ఆయన అంత్యక్రియల్లో పాల్గొన్నారు కాని, శ్మశాన వాటిక లోపలకు వెళ్ళక బైట వుండిపోయారు.



కృష్ణమూర్తి, రాజగోపాల్ ప్రపంచదేశాలు తిరిగి "ఒహై" చేరుకున్నారు. అనారోగ్య కారణంగా రాజగోపాల్ హాలీవుడ్ వెళ్ళాడు. కృష్ణమూర్తి ఒంటరిగా వున్నారు పుస్తకాలు చదువుకుంటూ. ఆయనకు 'జోక్స్' అంటే ఇష్టం. కృష్ణమూర్తి చాలావరకు తెలుగు మరచిపోయారు. క్రమంగా తెలుగు మాట్లాడే అవసరం పోయింది. ఆయనకు ఫ్రెంచి, ఇటాలియన్, ఇంగ్లీషు భాషలు తెలుసు. లేడీ ఎమిలీ ఎప్పుడూ ఆయనకు ఎన్నో పుస్తకాలు పంపించేది. ఆయన అప్పుడప్పుడూ సినిమాలు,

టి. వి. చూసేవారు. పత్రికలు చదివేవారు. వార్తలు వినేవారు. ప్రపంచ విషయాలు, సైన్స్ సంగతులు మిత్రుల్ని అడిగి తెలుసుకునేవారు.

ఒకసారి కృష్ణమూర్తిని చూడ్డానికి "Rom Landon" అనే ఏయన ఒహైె వెళ్ళాడు. ఆయనతో, "సత్యం-దైవం-మోక్షం-ఏదైనాసరే దాన్ని ఏపేరుతోనైనా పిలవవచ్చు. అదే అసలు సత్యం. అది అనుభవం ద్వారా కాని, తెలివి - మేధస్సుతో కాని తెలిసే సంగతి కాదు. గత స్మృతుల భారం పూర్తిగా తొలగిన తర్వాత కలిగినదే, సత్యం. బాహ్యంగా, ఆంతరంగికంగా నిరంతరం జీవితానికి ఎరుకలో వుండేదే సత్యం. అది సర్వసాక్షి. కనుక మనం జీవితాన్ని పూర్తిగా జీవించాలి. సత్యాన్వేషణ అంటూ విడిగా చేయవలసిన పని లేదు. సత్యం ఎప్పుడూ అంతటావుంది. అది మన అనుభవాల రాశికింద అణగివుంది. ఆ కుప్పను తవ్వి పారేస్తే, వుండేది సత్యం మాత్రమే! దాన్ని తానుగా తెలుసుకోలేము. తానంటే, మొదటినుంచీ మన పరిసరాల ఫలితంగా ఏర్పడ్డదేకాని మరేం కాదు," అన్నారు కృష్ణాజీ.

ఒకసారి కృష్ణమూర్తిని ఒకరు అడిగారు, "మీకు సెక్స్ సమస్య కాదా?" అని. దానికి కృష్ణమూర్తి, 'ప్రేమ లేనినాడు సెక్స్' పెద్ద సమస్య అవుతుంది. ప్రేమ వుంటే, అవగాహన-పరిష్కారం - సరిపుచ్చుకోవడం అంటూ వుంటాయి. మనసు ఇంద్రియాలకు పూర్తిగా వశమైతే, సెక్స్ సంబంధమైన సమస్యలు ఉత్పన్నమౌతాయి.

"పవిత్రుల మనుకునే, అనబడే కొందరు, 'సెక్స్‌కు లోబడితే; దైవానికి దూరం అవుతాం,' అని అనుకుని భయంతో బ్రతుకుతారు. అందుచేత వారు సెక్స్‌ని దూరంగా వుంచుతారు;

ఆ సెక్స్ వాళ్ళను నిరంతరం తినేస్తున్నా సరే! బలవంతంగా విశ్వ సౌందర్యానికి కళ్ళు, చెవులు మూసుకుంటారు. వాళ్ళ హృదయాలు, మనసులు ఆర్తితో దహించుకుపోతూ వుంటాయి. వారు క్రమంగా సారం లేని మనుష్యులుగా తయారౌతారు. అందాన్ని, ఆనందాన్ని, సౌందర్యాన్ని, సమస్త ఔన్నత్యాన్నీ నిరాకరించి వదలుకుంటారు. ఎందుకంటే, అందం – సౌందర్యం స్త్రీతో కలిసివుంటుందనే భయంవల్ల," అన్నారు.

ఒక రోజున జార్జి బెర్నార్డ్‌షా, లేడీ ఎమిలీతో కలసి భోజనం చేస్తూ, "కృష్ణాజీ వంటి హృదయసౌందర్యం కల వ్యక్తిని నేను ఎక్కడా చూడలేదు. A Religious figure of the greatest distinction," అన్నారు ఆమెతో.

3-3-1935 న కృష్ణమూర్తి, రాజగోపాల్, బైరన్ కేసిల్ బెర్రీ అనే ముగ్గురూ దక్షిణ అమెరికా వెళ్ళారు. అక్కడకు వెళ్ళడం కృష్ణమూర్తికి అదే మొదటిసారి. ఆయన ఒకచోట మాట్లాడుతూ, "నేను ఏమతానికీ, ఏవర్గానికీ, ఏసంస్థకూ చెందిన వాడనుకాను. ఏ నిర్మాణసంస్థ అయినా మానవాభ్యుదయానికి పెద్ద ప్రతిబంధకం. అది మనుష్యుల మధ్య మంచితనాన్ని పోగొట్టి, వ్యతిరేక స్వభావులుగా తయారు చేస్తుంది. బుద్ధినీ, తెలివినీ, జ్ఞానాన్నీ నాశనం చేస్తుంది.

"మీరు పడే బాధలనుంచీ, దుఃఖాలనుంచీ, కలతలనుంచీ, కలవరాలనుంచీ విముక్తి పొందడంలో మీకు నేను సహాయ పడాలనుకుంటున్నాను," అన్నారు.

దక్షిణ అమెరికా యాత్ర గురించి కృష్ణమూర్తి, లేడీ ఎమిలీకి రాస్తూ, "పత్రికలు, రేడియోలు, ప్రజలు నన్నెంత గానో ఇష్టపడి ప్రశంసించారు. కాని, రోమన్ క్యాథలిక్స్

మాత్రం నన్ను బహిరంగంగా వ్యతిరేకించారు. వారిలో కొందరు నా సమావేశాలకు చేతి బాంబులతో సహా వచ్చారు. అయినా కొన్ని క్యాథలిక్ పత్రికలు నన్ను సమర్థించాయి," అన్నారు.

కృష్ణమూర్తి ఆరోగ్యం ఏమీ బావుండకపోయినా ఉపన్యాసాలు ఇస్తూ దేశాలు తిరిగారు. ఆయనతో "మేరీ లూట్యన్స్" కూడా వుంది. ఆమె కృష్ణమూర్తి ఉపన్యాసాల - చర్చల - సంభాషణల సారాంశాల్ని రాసుకుంటూ, ఆయన సేవలు చేసుకుంటూ వుండేది. సెంట్రల్ న్యూస్ ఏజెన్సీవారు, కృష్ణాజీ - మేరీల ప్రేమను అపార్థం చేసుకుని, వారి ప్రేమ వ్యవహారం వివాహం వరకు వచ్చిందని రాయడంతో మేరీ తండ్రి గొడవపడి, మేరీని వెంటనే ఇంటికి రమ్మని ఉత్తరం రాశాడు. ఆ విషయంలో లేడీ ఎమిలీ కలగజేసుకుని భర్తకు గట్టిగా చివాట్లు పెట్టి "కృష్ణమూర్తి మన మేరీని ఎంత మాత్రం వివాహం చేసుకోరు. ఆయనకు అందరూ ప్రేమికులే! ఏ ఒక్కరూ ఆయనకు ప్రత్యేకం కాదు. ఆయన జీవితం ఒక లక్ష్యానికి అర్పణై వుంది. ప్రస్తుతం మన మేరీ ఆయన దగ్గర వుండి సేవలు చేస్తోంది. అంతే!" అన్నది. ఆ విషయాన్నే మేరీ "నేనెప్పుడూ కృష్ణాజీని ప్రేమించానే కాని, ఆయన్ని కోరలేదు," అన్నది.

ఆ తర్వాత కృష్ణమూర్తి యూరప్ దేశాల్లో తిరుగుతూ పాత స్నేహితుల్ని కలుసుకున్నారు. మూడేళ్ళ తర్వాత లండన్ వెళ్ళి, లేడీ ఎమిలీతో వున్నారు. అప్పటికే మిస్ డాడ్జి చనిపోయింది. ఆమె చనిపోయినా, ఆమె ఏర్పాటు ప్రకారం సకాలంలో కృష్ణాజీకి డబ్బు అందుతూనే వుంది. ఆయన ఒకసారి ఆ డబ్బు గురించి మాట్లాడుతూ, "ఆ డబ్బు నాకు అందడం ఆగిపోయినా నేను జీవించగలను. నాకు డబ్బు ముఖ్యం కాదు," అన్నారు.

కృష్ణమూర్తి పారిస్ మిత్రుల్లో "మార్సెలీ. డి. మాంజ యర్లీ" అనే ఆమె ఒకరు. ఆమె 1901 లో జన్మించింది. కృష్ణ మూర్తిని 1920 లో కలుసుకుంది. ఆమె చక్కగా పాడగలదు. కొన్ని పాటల్ని కూడా కట్టింది. కృష్ణాజీ అంటే ఆమెకు ఎంతో భక్తి, ప్రేమ.

కృష్ణమూర్తి, రాజగోపాల్ రోమ్ వెళ్ళారు. అక్కడ ముసోలినీ బహిరంగసభల్ని నిషేధించారు. అందుచేత కృష్ణ మూర్తి చిన్న చిన్న సమావేశాల్లో, గోష్ఠి కార్యక్రమాల్లో పాల్గొ న్నారు. అక్కడనుంచి 'ఓమెన్' వెళ్ళి, ఉపన్యాసాలు ఇచ్చారు.

"నీ బంధాలకు నువ్వు ఎరుకలో వుంటే, నీ మనోస్థితిని నీవు పూర్తిగా అర్థం చేసుకోగలవు.

"అమరత్వమంటే, అనంతమైన వర్తమానం. ఆ వర్త మానాన్ని అవగాహన చేసుకోవడంలో వుంది, స్వేచ్ఛ.

"వర్తమానంలో జీవించాలంటే, గతానికంతకూ చావాలి, అప్పుడే ప్రేమ వుంటుంది, వర్తమానంలో జీవించడమంటే. సమస్తాన్ని భూతద్దంతో చూడ్డం ఎవరిదో, ఏదో ఇష్ట ప్రకారం కాకుండా జీవించడం. ఆ భూతద్దంలోంచి చూస్తే; గతం, వర్త మానంలోంచి ప్రవహించి, భవిష్యత్తులోకి వెళ్ళడం తెలుస్తుంది.

గట్టిగా యోచిస్తే గతం లేదు, భవిష్యత్తు లేదు. ఉన్నది వర్తమానం ఒక్కటే! అద్భుతమైన ఆ వర్తమానం, ఎంతో విలువైనది, మధురమైనది. మనకు ఉన్నదీ ఆవర్తమానం ఒక్కటే. ఇంకేం లేదు. అదే నిజజీవితం. అది, జీవితంలో అసాధారణమైన సంగతి. దాంట్లో దుఃఖం లేదు, సంతోషం లేదు,

సుఖంలేదు. భయం - పాపం - దోషం - తప్పు ఏమీ లేదు. ఉన్నది సజీవమైన ఆ క్షణం. ఆకదలిక ఒక్కటే, ఆ క్షణంలో ఉన్నది. అదే జీవన సౌందర్యం.



" నాలో రేగే ఎన్నో భావాలకు నేను నెమ్మదిగా మాటలు వెతుక్కుంటున్నాను. అంతు తెలీని ఆనందంలో వున్నాను. నన్ను ఏదీ బలవంతంగా ప్రేరేపించకుండా, కృత్రిమ ప్రేరణ అంటూ లేకుండా నా తెలివి - విజ్ఞానం - వివేకం తోడ్పడుతున్నాయి. అవి నా జీవితానికి కావలసిన దానికన్నా ఇంకా ఎక్కువ నిండుతనాన్నీ - వాస్తవాన్నీ ఇస్తున్నాయి. నేను నిజంగా ఈ ప్రశాంతతకీ, నిష్కామకర్మకీ, సహజ సమాధిస్థితికి సంతోషిస్తున్నాను," అన్నాడు కృష్ణాజీ, ఒకసారి మిత్రులతో.



1933 - 1939 మధ్యకాలంలో కృష్ణాజీ జీవితం చాలావరకు అజ్ఞాతంగానే గడచిపోయింది.

1938 లో కృష్ణమూర్తి, రాజగోపాల్‌తో కలసి ప్రముఖ రచయిత 'ఆల్డస్ హక్సలే'ని చూడ్డానికి లాస్ ఏంజలీస్ వెళ్ళారు. ఆ నగరంలో శ్రీరామకృష్ణ పరమహంస మఠం వుంది. దానికి 'వేదాంత సెంటర్' అని పేరు. దాని అదిపతి ''స్వామి ప్రభవానంద". ఆయన హక్స్‌లేకి మంచి మిత్రులు.

కృష్ణమూర్తి హక్సలేని చూసి, గొప్ప మేధావిగా గుర్తించారు. సైన్స్ - దాని ప్రభావం - ఆధునికులపై ఎట్లా పని చేస్తుందో తెలిసిన వ్యక్తి-హక్సలే. అతను అనేక తత్వశాస్త్రాలు-వేదాంతాలు తెలిసినవాడు. బౌద్ధ తత్వం ఎరిగిన వాడు. అతనితో కలసి షికారుకు వెళ్ళడం, తిరగడం కృష్ణమూర్తికి

చాలా సరదా, సంతోషం. వారిద్దరూ అలా నడుస్తూ ఎంతో మాట్లాడుకునే వారు. ఎన్నో సంగతులు చర్చించుకునే వారు. వారిద్దరి మధ్యా గొప్ప ప్రేమతో కూడిన అవగాహన వుంది; చివరివరకూ. వారిద్దరూ గంటల తరబడి మాట లేకుండా, మౌనంగా కూర్చునేవారు.

హక్స్లేకి అప్పటికే ఒక కన్ను పోయింది. రెండో కన్ను విషయంలో వైద్యం చేయించుకుంటున్నారు. హక్స్లే తాను రోజూ కంటికి చేసే వ్యాయామం, కృష్ణాజీ చేత కూడా ఆయన కంటికి చేయించారు. కృష్ణాజీ ఆ వ్యాయామం రోజూ పది నిమిషాలు చేసేవారు. అందుచేత కృష్ణాజీ కంటి చూపు చివరి వరకు ఎంతో బావుంది.

హక్స్లేని చూడ్డం కృష్ణమూర్తికి చాలా సంతోషమైంది. వారిద్దరూ మంచి మిత్రులయ్యారు. హక్స్లే, ఆయన భార్య మేరియా ఇద్దరూ ఒకసారి కృష్ణమూర్తిని చూడ్డానికి ఒహై వెళ్ళారు. ఆ సమయానికి రాజగోపాల్ యూరప్ వెళ్ళాడు. రోజలిండ్ కృష్ణమూర్తితో వుంది. కృష్ణమూర్తి, హక్స్లే ఎన్నో విషయాలు మాట్లాడు కున్నారు. ఆ తర్వాత ఎన్నో ప్రదేశాలకు వెళ్ళి చూశారు.

ఒకసారి హక్స్లే కృషమూర్తి ఉపన్యాసం విని, ఒక ఉత్తరంలో భార్యకు ఆ సంగతి రాస్తో, "........ The most impressive thing I have listened to. It was like listening to a discourse of the Buddha — such power - such intrinsic authority ........ ," అన్నారు.

హక్స్లే భార్య మరియు. ఆమె బెల్జియన్. ఆమె ఒకసారి వనభోజనం ఏర్పాటు చేసింది. ఆమెకు వనభోజనాలంటే బతే

సరదా. ఆ వనభోజనాలకు హక్స్లే, మరియు, కృష్ణమూర్తి, గ్రేటాగార్బో, చార్లీ చాప్లిన్, అతని భార్య; బెట్రండ్ రస్సెల్, క్రిస్టోఫర్ ఇషర్వుడ్ అందరూ ప్రముఖులే. అందరూ వనభోజనానికి బయలు దేరారు. హక్స్లే, మరియు, కృష్ణమూర్తి మామూలుగానే వున్నారు కాని, గ్రేటాగార్బో మాత్రం మగ వాళ్ళు వేసుకునే గొట్టం ఫాంట్ వేసుకుని, ఒక చిత్రమైన టోపీ ధరించింది. చార్లీ చాప్లిన్, అతని అందమైన భార్య మెక్సికోలో సామాన్యరైతులు ధరించే బట్టలు వేసుకున్నారు. ప్రపంచ ప్రఖ్యాత విద్యావేత్త, తత్వవేత్త అయిన రస్సెల్ కూడా వింతగానే వున్నారు, ఆనాడు. రచయిత క్రిస్టోఫర్ ఇషర్వుడ్ మాత్రం మామూలుగా వున్నారు. వారి వనభోజనానికి సరైన స్థలం దొరకలేదు. చివరికి లాస్ ఏంజలీస్ నదీ గర్భంలో ఒక ఇసుక దిబ్బపైకి చేరారు. అక్కడ తమకు ఇష్టమైన, ప్రత్యేకమైన ఒక రకం భోజనం తయారు చేసుకోవడానికి అన్ని ఏర్పాట్లూ చేస్తున్నారు. గ్రేటాగార్బో వనభోజనానికి వెడుతో కొన్ని కాయకూరలు తీసుకువెళ్ళింది. చార్లీ చాప్లిన్ భార్య షాంపైన్ సీసాలు తీసుకువెళ్ళింది. చాప్లిన్ మరొక భోజన పదార్థం తీసుకువెళ్ళారు. కృష్ణమూర్తి బియ్యం తీసుకువెళ్ళారు.

అంతలో ఒక పోలీసు ఆఫీసరు అక్కడ ప్రత్యక్షమై, 'మీరు ఇదంతా పాడు చేస్తున్నట్లున్నారే ?' అన్నాడు. అతని మాటలకు అందరూ నిశ్చేష్టులయ్యారు. చేస్తున్న పనులన్నీ ఆపేశారు. అంతలో మరో అధికారి వచ్చి, వారందర్నీ ఎగాదిగా చూసి, "ఈ గుంపులో ఒక్కరూ చదువుకున్న మొహాలు లాగ లేరే!" అన్నాడు. ఆ మాటతో వాళ్ళంతా ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు, అమాయకంగా.

ఆ అధికారి హక్స్లేని పిలిచి, 'అక్కడ - ఆ బోర్డు మీద ఏం రాసి వుందో చదువు!' అన్నాడు. ఆ బోర్డు మీద 'అనుమతి లేనిదే ఈ ప్రదేశంలో ప్రవేశించరాదు,' అని రాసి వుంది.

"భోజనాల తర్వాత ఈ స్థలమంతా ఎప్పటి మాదిరిగా శుభ్రం చేస్తాం," అన్నారు హక్స్లే. ఆ అధికారి ఒప్పుకోలేదు. పైగా కోపంతో, 'అదేం, కుదరదు. ముందు మర్యాదగా బైటికి నడవండి,' అన్నాడు.

ఆ అధికారికి శాంతంగా చెప్పి, ఒప్పించాలని అక్కడ వున్నవారి ప్రాముఖ్యత చెప్పి, ముఖ్యం, గ్రేటాగార్బో, చార్లీ చాప్లిన్‌లను అతనికి చూపించారు, హక్స్లే. ఎందుకంటే, వారు సినిమావారు గనుక, అతను సంతోషించి, శాంతపడతాడని.

"అవేం కుదరవు. వాళ్ళ సంగతి నాకు అఖ్కర్లేదు," అని గట్టిగా అరచి, "ఈయాక్టర్స్‌ని నేను సినిమాల్లో చూశాను. వాటిల్లో వీరు ఆ వేషాల్లో లేరు. ఏమైనా, ముందు మీరు ఇక్కడనుంచి బైటికి వెళ్ళండి. లేకపోతే మిమ్మల్ని అందర్నీ అరెస్ట్ చేస్తాను," అని బెదిరించాడు. వాళ్ళంతా గుడారాలూ, అవీ పీకేసి, సామానంతా సర్దుకుని వెళ్ళిపోయారు.

ప్రపంచ ప్రఖ్యాతులైన ఆ కళాకారుల్ని, తత్వవేత్తల్ని దేశ దిమ్మరుల్లాగ, చదువు - సంస్కారం లేని వాళ్ళులాగ గుర్తించాడు, ఆ అధికారి.

మేరియా, హక్స్లే జీవితచరిత్ర రాస్తూ, అందు తనకు హక్స్లే రాసిన ఒక ఉత్తరాన్ని పొందు పరచింది. "కృష్ణ మూర్తి సహజంగా, సంతోషంగా, ఉల్లాసంగా వుంటారు, ఎప్పుడూ. ఆయన మనోహరమైన సుందరమూర్తి. అతను

ప్రవక్తగా ప్రపంచమంతా ప్రచారం చేసినప్పుడు, కృష్ణమూర్తి పడ్డ బాధ, వేదన అపారం. నా మిత్రులలో కృష్ణమూర్తి ముఖ్యులు," అని హక్స్లే రాశాడు, భార్య మేరియాకు.

లేడీ ఎమిలీ ఆరోగ్యం బాగాలేదని విని, ఆమెను అమెరికా ఆహ్వానించి, తనతో వుండవలసినదిగా కోరుతూ కృష్ణమూర్తి ఆమెకు ఒక ఉత్తరం రాశాడు. కాని, ఆమె ప్రయాణం చేసే స్థితిలో లేదని తెలిసి, రాజగోపాల్‌తో కలసి లండన్ వెళ్ళారు. ఆమెతో మాటల సందర్భంలో జ్యూస్‌కి జరుగుతున్న అన్యాయం గురించీ, వారిని దారుణంగా అణచడాన్నీ ఖండించారు. "యూదులు-నీగ్రోలు - ఇండియాలో అంటరానివాళ్ళూ చాలా దారుణంగా అణచబడుతున్నారు. దీని కంతకూ కారణం, ఆర్థిక, రాజకీయ ఆధిక్యతలకోసం దేశాలు పడే ఆరాటం. అంతకు మించి వేరే కారణం కనుపించదు. అదికారమదం, ఆశ తప్ప మరేంలేదు. అందుచేత నేటి ప్రపంచంలో చాలా దేశాలు జాతి - మత - వర్గ - వర విబేధాలతో ఒకదాన్ని ఒకటి నిరంతరం హింసించుకుంటున్నాయి," అన్నారు కృష్ణాజీ.

ఆ సంవత్సరం కృష్ణాజీ గాంధీగారిని కలుసుకుని, 'సామ్రాజ్యవాదం, జాతీయవాదం రెండూ ప్రపంచానికి పట్టిన శాపాలు అంటూ, హింస, క్రూరత్వం మొదలైనవాటికి భయమే ప్రధాన కారణమంటూ ఎంతో మాట్లాడారు, కృష్ణమూర్తి. అంతకు ముందు గాంధీగారిని ఒకసారి కలుసుకున్నారు కృష్ణాజీ. కాని, ఏనాడూ రాజకీయాల జోలికిపోలేదు, కృష్ణాజీ.



రెండవ ప్రపంచ యుద్ధారంభంతో కృష్ణమూర్తి ప్రయాణాలు ఉపన్యాసాలు అన్నీ రద్దయ్యాయి. ఆ సందర్భంలో

కృష్ణాజీ ప్రపంచం గురించిన తన అభిప్రాయాల్ని వెల్లడించారు: హిట్లర్‌నీ, ముస్సోలినీని శపించడం, తిట్టడం చాలా తేలిక. ఎందుకంటే, వాళ్ళు బైటపడ్డారు కనుక. అధికార పిపాస, విజయకాంక్ష అందరి మనస్సుల్లో ఎప్పుడూ అంతో, ఇంతో వుండనే వుంటుంది. కని, అవి వారిద్దరిలో కాస్త ఎక్కువ మోతాదులో వున్నాయి. అంతే తేడా. ప్రతిఒక్కరిలో అవి పోవాలి. అప్పుడే ప్రపంచంలో శాంతి ఏర్పడుతుంది. కాని, మనం నిత్య జీవితంలో 'శాంతి' అనే మాటను, మాట వరసకు ఉపయోగిస్తాం. ఆ మాట నిజంగా మన అంతరాత్మ లోంచి వచ్చింది కాదు. నిత్యజీవితంలో క్రూరత్వం, దౌర్జన్యం, అన్యాయం, హింస, దోపిడి, హత్యలు, సంకుచితత్వం – మొదలైనవి ఎన్నో వున్నాయి. అవి మనలోంచి నిజంగా, పూర్తిగా పోనంత వరకు, శాంతి లేదు. శాంతి లేనప్పుడు యుద్ధం తప్పదు.

హృదయంలో ప్రేమ లేనినాడు జీవితం వృథా. మనం నిజంగా మన పిల్లల్ని ప్రేమించిననాడు యుద్ధానికి తావు లేదు. యుద్ధానికి కారణం! నువ్వూ – నేను. మన అసూయ, ద్వేషం, అధికారవాంఛ, ఆర్థిక పురోభివృద్ధి, మన తికమకలు, దురాశ, గందరగోళాలు – ఇన్ని వున్న మనం, మన పిల్లల్ని, నిజంగా ఎట్లా ప్రేమించగలం? మనలో ప్రేమ లేక, ఆ పిల్లల్ని మిలటరీకి పంపుతాము. లేదా, జాతీయ వాదులుగా తయారు చేస్తాం. కాకపోతే కుల – మత – వర్గ – వర్ణ వ్యవస్థాపకులుగా తయారుచేస్తాం. వారు మన అభీష్టం మేరకు తయారై, మన వతె కొట్టుకుచస్తున్నారు. అదీ ఈ లోకం తీరు. ఆ పద్ధతి ప్రకారమే వేల సంవత్సరాలు గడిచాయి.

యుద్ధకారణంగా కృష్ణమూర్తి ఇండియా రావడానికి అనుమతి లభించలేదు. అన్నిచోట్లా ఉపన్యాసాలు రద్దయ్యాయి. దాదాపు ఎనిమిదేళ్ళు ఎటూ కదలకుండా ఆయన ఒహైలో వుండి పోయారు. ఆయన రోజూ పోలీసులకు కనుపించాలి. ప్రభుత్వం అనుమతి లేకుండా ఆయన ఒహై వదలి ఎక్కడకూ వెళ్ళకూడదు. అందుచేత ఆయన రోజులో చాలా భాగం కొండల్లో నడిచేవారు, ప్రకృతిసౌందర్యాన్ని తిలకిస్తూ. అన్నివేళలా తిరుగుతూనే వుండేవారు. ఆ సమయంలో కృష్ణమూర్తి తనను తాను లోపలా, బైటా పరీక్షించుకుంటూ పరిశీలించుకుంటూ వుండేవారు. అది ఆయనకు గొప్ప సాధనాకాలం. కృష్ణాజీ తాను బైట తిరగడం గురించి చెపుతూ, "అలా నడిచేటప్పుడు ఏదీ ఆలోచించేవాడిని కాదు. అసలు నాలో ఏ ఆలోచనలూ కలిగేవి కాదు. అంత నిశ్చలంగా, నిర్మలంగా వుండేది మనసు. వూరికే అన్నింటినీ చూస్తూ నడిచేవాడిని," అన్నారు.

ఆ అడవుల్లో, కొండల్లో నడిచేటప్పుడు క్రూరమృగాలు, విషక్రిములు, కీటకాలు ఎన్ని ఎదురైనా ఆయన భయపడే వారు కాదు. వాటిని చూసినా ఆయన మనసు, దేహం చలించేవి కావు. అంత నిర్లిప్తంగా వుండేవారు. ఆగకుండా ఒకటే నడిచే వారు. అక్కడి ప్రకృతిదృశ్యం కృష్ణమూర్తికి ఎంతో విశాల మైన దృష్టిని ఇచ్చింది. సప స్తానికి సదా ఎరుకలో వుండి మౌనంగా అన్నింటినీ అవగాహన చేసుకుంటో కాలం గడిపారు.

ఇంట్లో అంట్లుతోమడం, తోటపని, ఆవుల్ని మేపడంతో ఆయన కాలం గడిచేది. వూరికే గెడ్డం పెంచారు, కొన్నాళ్ళు. విరామ సమయంలో "బిథోవెన్"ని వినేవారు. బిథోవెన్ కొమ్మిదో స్వరమేళనం కృష్ణమూర్తికి ఎంతో ఇష్టం. చాలా సేపు ఏవో పుస్తకాలూ, పత్రికలూ చదువుకునేవారు. ధ్యానం

చేసేవారు. సాయంత్రాలు చిన్నప్పుడు నేర్చుకున్న సంస్కృత శ్లోకాలు చదువుకునేవారు. దక్షిణామూర్తి స్తోత్రం ఆయనకు చాలా ఇష్టం.

కృష్ణమూర్తిని చూడ్డానికి అప్పుడప్పుడూ మిత్రులు ఒహై వెళ్ళేవారు. వారిలో ఆల్డస్ హక్స్లే ఒకరు. హక్స్లే మాటల్ని కృష్ణమూర్తి శ్రద్ధగా వినేవారు. ఆయన చెప్పే సంగతులమీద కృష్ణమూర్తి ఎంతో ఆసక్తి చూపేవారు. అలాగే కృష్ణమూర్తి మాటల్ని హక్స్లే కూడా ప్రేమతో వినేవారు. హక్స్లేని ఒక మేధావిగా భావించారు కృష్ణాజీ.

ఒకసారి హక్స్లే 'కృష్ణమూర్తి మాట్లాడుతూవుంటే, బుద్ధుడే వచ్చి మాట్లాడుతున్నారా! అనిపిస్తుంది', అన్నారు, భార్యతో.

హక్స్లే సలహానుసారం కృష్ణమూర్తి రోజూ ఉదయం ఏదో ఒకటి, అప్పటికి తోచింది రాసేవారు. ఆ రాతలే తర్వాత కాలంలో "COMMENTARIES ON LIVING" అని మూడు భాగాలుగా వచ్చాయి. వాటిని రాజగోపాల్ ఎడిట్ చేయగా అవి 1956 - 1959 - 1960 లలో అచ్చయ్యాయి.

యుద్ధాన్ని, ఆటంబాంబుల ప్రయోగాన్ని చూసి, "ఈ నా ఉపన్యాసాలవల్ల ఏం లాభం?" అన్నారు కృష్ణాజీ. అని, "యుద్ధం, పెద్ద ఘోరం. చెడ్డ సంగతి. ఆత్మ రక్షణార్ధం ఎదుర్కొంటున్నాం" అనడం కూడా కలహానికి కాలు దువ్వడమే. ప్రపంచంలో జరిగే ప్రతిదానికీ మనమే కారణం. అణచాలనే బుద్ధే, చెడ్డది. అది మనలోంచి పూర్తిగా పోవాలి," అంటారు కృష్ణాజీ.

"కమ్యూనిజానికీ, ఫాసిజానికీ తేడా లేదు. రెండూ నిరంకుశమైనవే," అన్నారు కృష్ణాజీ.

ఆ రోజుల్లో కృష్ణమూర్తి రోజూ కొన్ని గంటలు ధ్యానం చేసేవారు. తనలోకి తాను లోతుగా మునుగుటే, ధ్యానమంటారాయన. ప్రతి ఒక్కరూ తనను తాను నిరంతరం రక్షించుకోవాలనే అలవాటు నుంచి విముక్తి పొందాలి. ఎందుకంటే, ఆలోచించేవాడు ఎప్పుడూ, ఆలోచనల వెనక దాక్కొని రక్షణ పొందుతాడు. దానితో అతడు తాను భిన్నమనీ, అన్యంగా వున్నాననీ అనుకుంటాడు. తనను తాను రక్షించుకునే యత్నంలో తన ఆలోచనల్ని సరిదిద్దుకోవడం, మార్చుకోవడం జరుగుతుంది. ఆ విధానంవల్ల అతను ఎప్పటికీ, ఎప్పటిమాదిరిగానే వుంటాడు.

13-8-1943న, కృష్ణమూర్తి, లేడీ ఎమిలీకి రాస్తో, "జీవితంలో ధ్యానం ఓగొప్ప సంగతి. సరైన ధ్యానం, మరీ గొప్ప సంగతి. కాని, అది అసాధ్యం. అయినా అది ఒక అనుభవం; సృజనాత్మకం. అటువంటి ధ్యానం మనల్ని విముక్తి పరుస్తుంది. అదే మనని మనం తెలుసుకునే విధానం, అసలు సత్యాన్ని అవగతం చేస్తుంది.

"ధ్యానం నిత్యజీవితంలో గొప్పకళ. బహుశా అది అన్ని కళల్లోకి గొప్పకళ. దాన్ని దేహం ద్వారా నేర్చుకోవడం సాధ్యంకాదు. అదే, దాంట్లో అందం. దానికో పద్ధతీ, విధానం అంటూ లేదు. దానిపై అధికారి, అధికారం అంటూ లేదు. లోపలా, బైటా సదా నిన్ను, నీవు ఏ అరమరికా లేకుండా పరిశీలించుకోవడం. ప్రతి క్షణం నీకు, నీవు ఎరుకలో వుండటం. అంటే, సమస్తానికీ ఎరుకలో వుండటం. ఎటువంటి నిర్ణయం, ఎటువంటి కోరికా, ఇష్టం లేకుండా వుండటం. అదే ధ్యానం బస్‌లో

ప్రయాణం చేస్తున్నా, నడుస్తున్నా, చూస్తున్నా మాట్లాడుతున్నా - ఏం చేస్తున్నా సాగేదే ధ్యానం. ధ్యానం కోసం చేసే ఎటువంటి ప్రయత్నమూ దానికి అవరోధమే, అభ్యంతరమే," అన్నారు కృష్ణాజీ.

ఒక సందర్భంలో కృష్ణమూర్తి మిత్రులతో ధ్యానం గురించి ఎంతో మాట్లాడారు. ధ్యానం చేయడానికి స్థిరాసనంలో కూర్చోవాలి. అంటే, నిశ్చలంగా, నిర్మలంగా, తేలికగా, ఏ ఇబ్బందీ - నిర్బంధం లేకుండా హాయిగా ప్రశాంతంగా కూర్చోవాలి. అలా కూర్చున్న తర్వాత, చుట్టూ వున్నదాన్నంతా-చెట్లు-పక్షులు - కొండలు - ఆకాశం - మనుష్యులు - అన్నింటి వంకా వూరికే చూడాలి. అంతే: ఆ చూసే వాటిల్లోని రంగుల్ని, గుణాల్ని, స్వభావాల్ని, ఆకారాల్ని అన్నింటినీ చూస్తూ గమనించాలి. మనసుతో చూడ్డంకాదు, కంటికి కనుపించేవాటిని - బాహ్యంగా వున్నవాటి నన్నింటినీ చూడాలి.

అవన్నీ చూసి, గమనించిన తర్వాత, నీ లోపలికి చూసుకోవాలి. అంటే, దృష్టి అంతర్ముఖం కావాలి. ఆ తర్వాత కళ్ళు మూసుకోవాలి. కళ్ళు పూర్తిగా మూయాలి. అప్పుడు బాహ్యంగా చూడ్డం అనేది పూర్తిగా ఆగిపోతుంది. మూసిన కళ్ళతో అంటే, బాహ్యనేత్రాలతో కాక, అంతర్నేత్రంతో లోపలికి చూసుకోవాలి. అంటే, మనోనేత్రంతో దర్శించడం. అప్పుడు లోపల ఏం జరుగుతుందో నెమ్మదిగా, జాగ్రత్తగా గమనించాలి. అది ఎలా జరుగుతోందో, ఏం జరుగుతోందో పరిశీలించాలి. కాని, ఆలోచించకూడదు. గమనిస్తో మాత్రం వుండాలి. వూరికే వుండాలి. అది చాలు.

కనుగుడ్డు కూడా కదలకూడదు. వాటినీ స్థిరంగా, నిశ్చలంగా నిలపాలి. అప్పుడు చూడ్డానికి ఏమీ వుండదు.

అప్పుడు మనసులో ఏం జరుగుతోందో గమనించాలి. ఆ గమనికకు మనసు నిర్మలంగా, నిశ్చలంగా, ప్రశాంతంగా వుండాలి. మనసు అలా వున్నప్పుడు మనం చాలా చురుకుగా, సున్నితంగా మారిపోతాం. లోపలా - బైటా సంగతులకూ, విషయాలకూ సమస్తానికీ సర్వేంద్రియాలూ ఏకకాలంలో చురుకుగా పని చేయనారంభిస్తాయి. అప్పుడు అనుభవ పూర్వకంగా తెలుస్తుంది; బాహ్యంగా వున్నదీ-లోపల వున్నదీ- రెండూ ఒకటేననీ, అసలు వున్నదీ ఆ ఒక్కటేననీ. అలాగే, 'అన్వేషకుడు - అన్వేషింపబడేది' అనే సంగతి కూడా అప్పుడు అనుభవపూర్వకంగా తెలుస్తుంది.

దిగంతాలులేని స్థితే, ధ్యానం. కాలం, అదృశ్యం కావడమే ధ్యానం.



1944 వేసవిలో కృష్ణమూర్తి ఒహైలో వరసగా పది ఉపన్యాసాలు ఇచ్చాడు. పెట్రోలు కరువుగా వున్నప్పటికీ ఆసక్తి కలవారు అమెరికా అన్ని ప్రాంతాలనుండి ఒహై వచ్చి, కృష్ణాజీని వినేవారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికాలో కరువు ఏర్పడ్డది. కృష్ణాజీ - రాజగోపాల్ ఒహైలో వుంటూ ఒక ఆవును మేపారు. కొన్ని కోళ్ళను పెంచారు. పెరటిలో కూరగాయలు పండించారు. తేనెపెట్టెలు పెట్టారు. క్రమంగా ఆవులు రెండ య్యాయి. వాటిని కృష్ణాజీయే చూసుకునేవారు.

1945 లో, జార్జి అరండేల్ మరణించారు. ఆ తర్వాత దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షులుగా జినరాజదాస నియమింప

బడ్డారు. 1946 - 53 మధ్యకాలంలో కృష్ణమూర్తి పాత మిత్రులు కొందరు మరణించారు. కొందర్ని లోకం మింగేసింది. మరికొందరు కృష్ణమూర్తితో విరోధించారు. కొందరు ఆయన్ని భరించలేక జారుకున్నారు. చివరికి కృష్ణాజీ ఒంటరిగా మిగిలి పోయారు. ఆ ఒంటరితనం ఆయనకు గొప్ప సహాయకారి అయింది.

1946 లో కృష్ణమూర్తి, రాజగోపాల్, రోజలిండ్, హక్స్లే కలిసి ఒహైలో ఒక చిన్న స్కూలు తెరిచారు. వారే దానికి ట్రస్టీస్. ఆ తర్వాత " KRISHNA MURTY FOUNDATION — కృష్ణమూర్తి ఫౌండేషన్" ఒకటి ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడింది. దానికి కృష్ణాజీ నామమాత్రపు అధికారి.

ఆ సమయంలో కృష్ణమూర్తికి మూత్రపిండాలు ఇబ్బంది పెట్టాయి. అందుచేత ఆయన రెండు నెలలు మంచం మీదే వున్నారు. రోజూ జ్వరం వచ్చేది. ఆరు మాసాలు విశ్రాంతి అవసరమన్నారు డాక్టర్లు. రోజలిండ్, కృష్ణాజీకి ఉపచారాలు చేసింది. ఆ ఆరు మాసాలూ కృష్ణమూర్తి గెడ్డం చేసుకోలేదు. బలహీనంవల్ల ఒకటిన్నర సంవత్సరం ఎటూ కదలలేదు, కృష్ణాజీ.

ఆ తర్వాత కృష్ణమూర్తి లండన్ వెళ్ళారు. చాలా ఏళ్ళకు కృష్ణాజీని చూడ్డంవల్ల లేడీఎమిలీ కుటుంబంవాళ్ళు ఎన్నో సంగతులు మాట్లాడుకున్నారు. అందరూ సంతోషంగా నవ్వుకుంటూ ఆనందంగా వున్నారుకాని, మేరీమాత్రం తాను మురికిగా అపరిశుభ్రంగా వున్నట్లు భావించుకుని బాధపడింది. కృష్ణాజీ ఎదుటపడడానికి జంకింది, సిగ్గుపడింది. ఎందుకంటే, ఆమె మొదట్లో తన జీవిత విధానం మార్చుకునే ఉద్దేశ్యంలేక 1930 లో వివాహం చేసుకుని, నిష్కారణంగా కృష్ణాజీకి దూర

మైంది. ఆ కాలంలో ఆమె దేనికీ కృష్ణాజీ సలహా, సహాయం తీసుకోలేదు. కాని, 1945 లో, ఆమె విడాకులిచ్చి, మరో వివాహం చేసుకుంది. ఆమె రెండవభర్త కృష్ణాజీని ఇష్టపడ్డాడు. అందుచేత మేరీ ఆ తర్వాత కాలమంతా కృష్ణాజీతో సంతోషంగా గడిపింది. ఒకసారి వారి సంభాషణలో "నిత్యజీవితంలో ఆలోచనకు ప్రముఖస్థానం వుంది. కాని, ఆలోచన గతం. అది అనేక విషయాల సంగతుల, సంఘటనల, సందర్భాల, ప్రతిక్రియలవల్ల ఏర్పడ్డది. ఆ గతం, జ్ఞాపకాలకు గుర్తు. అది, కాలం దిగవిడిచిన స్థితి. నూతనత్వాన్ని గ్రహించాలంటే, ఆ గతం పూర్తిగా తొలగిపోవాలి.

"ఆలోచన, హృదయంనుంచి మనసును వేరుచేస్తుంది. ఆ మనసు స్వార్థంతోకూడిన కార్యకలాపాలకు మూలం. ఆ మనసు తిరిగి హృదయంలో కలసినప్పుడే వికాసం, శాంతి.

"మనం, ప్రతి ఆలోచన వెనక వెడితే, దాని కొసను నిశ్చయంగా నిశ్శబ్దం వుంటుంది. ఆ నిశ్శబ్దంనుంచే నూతనత్వం ఉద్భవిస్తుంది. ఆ నిశ్శబ్దం, స్మృతిలో నిలవదు. ప్రతి పాత ఆలోచనా గతం. దానికి వాస్తవత్వం లేదు.

" ఒక ఆలోచన తీసుకో. దానితో కొంతసేపు వుండు. దాన్ని నీ తెలివిలో, ప్రజ్ఞలో వుంచు. అలా వుంచి, ఆ ఆలోచనను గమనించడం ఎంత కష్టమో నీకే తెలుస్తుంది, అనుభవపూర్వకంగా. "ఆలోచించేవాడే- అన్వేషించేవాడు -అనుభవించేవాడు," అని తెలుసుకుంటాం," అన్నారు కృష్ణాజీ,

క్షణక్షణానికి గతానికి చావడమే కృష్ణాజీ బోధలోని ముఖ్యాంశం. "ఆవిధంగా క్షణక్షణానికి గతానికి చావకపోతే,

జీవితంలో నూతనత్వం, సృజనాత్మకం వుండదు," అంటారు కృష్ణాజీ. అదే, ప్రతిక్షణం తిరిగి పుట్టడం. దాన్నే "పునర్జన్మ" అని కూడా అంటారు.

కృష్ణాజీ మార్గం, పక్షి తిరిగి తిరిగి గూటికి చేరడంవంటిది. నది సాగరగర్భం చేరడం వంటిది. ఆమార్గానికి నిర్మాణం, పూజ, దర్శనం, మర్మం, ఇంద్రజాలం, ఆచారాలు, నియమ - నిష్టలు ఏమీ లేవు. ఆ క్షణంలో ఏంతోస్తే అది చేయడం. అంతే! కాని, దాన్ని మన నమ్మకాలు, పద్ధతులు, సిద్ధాంతాలు, అభిప్రాయాలు, అలవాట్లు ఆటంకపరుస్తాయి" అంటారు కృష్ణాజీ.

ప్రతి ఒక్కరికీ పుట్టినప్పటినుంచి పరిసరాల, పరిస్థితుల, అలవాట్ల, ఆలోచనల, ఆచారాల, సాంప్రదాయాలద్వారా గతం ఏర్పడుతుంది. గతాన్ని అడ్డురానివ్వకుండా, ఏకారణం - ఉద్దేశ్యం లేకుండా ఏక్షణానికాక్షణం-ఎప్పటికి ఏది అవసరమో దాన్ని చేసుకుంటో-అంటే, నిష్కామకర్మాచరణగావిస్తో- అంటే, ఆశ, ప్రయత్నం లేకుండా జీవించిడమే జీవితంలో సృజనాత్మకం. అదే కృష్ణాజీ జీవితం.

అసలు ఈ జీవితమే, ఒక సృష్టి. అందు సృష్టీ, సృష్టికర్తా రెండూవుంటాయి. కాని వాస్తవమైన జీవితాన్ని ప్రకృతి మరుగు పరుస్తుంది. అంటే జీవితంలో ఆవిర్భవించినవాటిని అన్నింటినీ తిరిగ ఆ జీవితమే దాచేస్తుంది. అదీ చిత్రం. కాని, సాధన ద్వారా జీవితంలో మేల్కొన్నవారిలో సదా ఆత్మస్ఫురణ, ఎరుక వుండటం వలన దాగివున్నవన్నీ బహిర్గతమౌతాయి. కృష్ణాజీ జీవితంలో జరిగిందీ అదే. అందుకే ఆయన తనగురించి చెప్పుకోవలసివస్తే, "K" అనేవారు.

1948 జనవరిలో కృష్ణమూర్తి ఉపన్యాసాలు సంభాషణలు బొంబాయిలో ఏర్పాటుచేయబడ్డాయి ఆ సమావేశాలకు చాలామంది హాజరయ్యారు. వారిలో రాజకీయనాయకులు, సాహితీపరులు, సంఘసంస్కర్తలూ వున్నారు. వారిలో కొందరు కృష్ణమూర్తి ప్రేమను చవి చూసినవారు. వారిలో "మారిస్ ఫ్రీడ్‌మన్'' ఒకరు. ఆయన ఇంజనీర్. దివ్యజ్ఞాన సమాజ సభ్యుడు. ఎప్పుడూ లాల్చీ-పై జమా ధరించేవాడు. ఆయనకు చిన్న గూనె వుండేది. బెంగుళూరులో ఉద్యోగం వదిలేసి, కాషాయం కట్టి "భారతానంద"గా పేరు మార్చుకుని, భిక్షవృత్తి జీవించారు. చెప్పులు లేకుండా కాశ్మీర్‌నుంచి కన్యాకుమారివరకు పాదయాత్రచేసి ఎడాల్లో, సత్రవుల్లో. చెట్లకింద, గుహల్లో నిద్రిస్తూ, యోగుల్ని, పకీర్లనీ, సాధువుల్ని, మహాత్ముల్ని దర్శిస్తూ, చర్చిస్తూ యాత్రలు చేశారు.

పేరు మార్చినా, కాషాయం కట్టినా, ఏంచేసినా బంధ విముక్తులు కాలేరని స్వానుభవంతో తెలుసుకుని, ఒకసారి ఆత్మ హత్యా ప్రయత్నంకూడా చేసి, చివరకు శ్రీరమణాశ్రమం చేరగా "బుద్ధి తక్కువ పనులు మానాలి,'' అన్న భగవాన్ మాటల్ని అర్థంచేసుకుని, ఆత్మవిచారమార్గాన్ని చేపట్టారు.

ఆ తర్వాత కొన్నాళ్ళు గాంధీగారి సేవాశ్రమంలో వున్నారు. అంబరుచర్కా తయారుచేయడంలో ఇంజనీరుగా ఆయన వారికి సహాయం చేశారు. గాంధిగారి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. క్రమంగా కృష్ణమూర్తి బోధలకు ఆకర్షితులై బొంబాయి చేరారు. ఆయన్ని ఎన్నో ప్రశ్నలు వేసి, చాలా సంగతులు స్పష్టంగా తెలుసుకున్నారు,

మరొకరు జమ్నాదాస్ ద్వారకదాస్. ఆయన అనీబిసెంట్ మిత్రులు. కదిలే కథావళివంటివారు. ఆయన ఎప్పుడూ ఖద్దరు టోపీ ధరించేవారు. క్రమంగా కృష్ణాజీ అనుచరులు అయ్యారు.

ఆ తర్వాత వారిలో పట్వర్ధన్ సోదరులు. వారి తండ్రి కృష్ణమూర్తి అభిమానులు కావడంచేత, తన కొడుకులను కృష్ణమూర్తిని విని అనుసరించమన్నారు. పట్వర్ధన్ సోదరులు విద్యావంతులు, రాజకీయవాదులు, సోషలిస్ట్ అభిమానులు, స్వాతంత్ర్యసమరయోధులు. వారు తండ్రిమాట ప్రకారం కృష్ణమూర్తిని విని అనుసరించి, ఆయనతో అనేకచోట్లకు వెళ్ళారు. "రాజకీయాలనుంచి దూరమై, నా ప్రభావానికి లోను కాకండి" అని కృష్ణాజీ వారిని హెచ్చరించారు. "అన్ని అధికారాల్నీ నిరాకరించమంటున్నారు కదా ?" అని వారు కృష్ణమూర్తిని అడిగితే, "అవును. కాని, ముందు మనసు అధికారాన్ని నిరాకరించి, పరీక్షించాలి," అన్నారు.

ఆ సమయంలో కృష్ణమూర్తిని చూడ్డానికి చేరిన వారిలో శ్రీమతి పుపుల్ జయకర్, ఒకరు. ఆమె ఐదవఏట వారణాసిలో చదువుకునేప్పుడు కృష్ణమూర్తిని చూసింది. అప్పటికే ఆమెకు కృష్ణమూర్తి మిత్రులైన పట్వర్దన్ తెలుసు.

శ్రీమతి పుపుల్ జయకర్ 1915 లో జన్మించింది. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక, దేశంలో అనేక సాంస్కృతిక సంస్థలకు ప్రధానాధికారిగా వుంటూ ఎన్నో కార్యక్రమాల్ని చేపట్టింది. ఆమె ఇందిరాగాంధీకి చిన్ననాటి స్నేహితురాలు. ఆమెకంటే, పుపుల్ జయకర్ రెండేళ్లు పెద్దది. వారిద్దరూ చివరి వరకూ మంచి స్నేహితులుగా వున్నారు. పుపుల్ జయకర్ ఏకైక పుత్రిక రాధిక. ప్రస్తుతం పుపుల్ జయకర్ ఢిల్లీలో వుంటున్నారు.

కృష్ణమూర్తి బొంబాయిలోవుండగా పుపుల్‌జయకర్ చెల్లెలు నందిని కృష్ణమూర్తిని చూడ్డానికి వెడుతూవుంటే, పుపుల్ జయకర్‌కూడా వెళ్ళింది. ఆనాటినుంచి ఆమె కృష్ణమూర్తిని వింటూ, చివరివరకూ విడవకుండా అనుసరించింది. ఆయన ఉపన్యాసాల్ని, చర్చల్ని, సంభాషణల్ని, మామూలు సమయాల్లో మిత్రులతో మాట్లాడిన మాటల్ని సహితం నోట్‌చేసుకుని, చివరికి ఆయన జీవితచరిత్ర రాసింది.

1948 జనవరి ముప్పై సాయంత్రం కృష్ణమూర్తి ఓ మిత్రుని ఇంట్లో మాట్లాడుతూ వుండగా, అచ్యుత పట్వర్ధన్‌కి ఫోన్ వచ్చింది. ఆయన ఫోన్ విని, తిరిగి మిత్రుల మధ్యకు వచ్చారు. ఆయన ముఖం కొయ్యబారిపోయివుంది. ఆయన్ని చూసి కృష్ణమూర్తీ, మిత్రులు నిశ్శబ్దమయ్యారు. ఆయన నెమ్మదిగా తేరుకుని "మహాత్మాగాంధి హత్యచేయబడ్డారు," అన్నారు. కృష్ణమూర్తి మాట్లాడటం ఆపేసి, అందర్నీ గమనిస్తో కూర్చున్నారు.

"గాంధీజీని హత్యచేసింది హిందువా? ముస్లిమా?" అనే ప్రశ్న వచ్చింది. "ఎవరు హత్యచేశారో తెలిసిందా?" అని అడిగితే, "నాకు తెలియదు" అన్నారు అచ్యుత పట్వర్ధన్.

అందరూ లేచారు. ఒకరి తర్వాత ఒకరు వెళ్ళిపోయారు. జరగకూడని, వూహించని ఘోరం జరిగిపోయింది. ఓ బ్రాహ్మణ యువకుడు గాంధీజీని తుపాకీతో కల్చి చంపాడు.

ఫిబ్రవరి ఒకటవ తేదీన కృష్ణమూర్తి దగ్గర కొంతమంది చేరారు. "గాంధీజీ హత్యకు దారితీసిన నిజమైన కారణం ఏమిటి?" అని ఒకరు కృష్ణాజీని ప్రశ్నించారు.

"గాంధీజీ హత్యకు కారకులు, మీరు," అన్నారు కృష్ణాజీ, చాలా సీరియస్‌గా. అని, "మీరు అంటే, జాతి-మత-కుల-వర్గ-వర్ణాలతో కూడిన మీరు. వాటిని సదా ప్రోత్సహించే మీరు. అటువంటి భిన్నత్వమే ప్రపంచంలో ఘర్షణల్ని, హత్యల్ని తెచ్చిపెడుతుంది," అన్నారు.

* * *

ఆ ఏప్రిల్‌లో కృష్ణమూర్తి మాధవాచారి అతిధిగా మద్రాస్ వసంత్‌విహార్‌లో వున్నారు. ఆ భవనంచుట్టూ పెద్ద ఏరండాలు. లోపల విశాలమైన హాల్స్. గేట్‌ముందు కొలను. భవనంచుట్టూ చెట్లు. అక్కడ జరిగే సమావేశాలకు దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులైన జినరాజదాస పాల్గొనేవారు. ఆయన కృష్ణమూర్తితో ఎన్నో సంగతులు చర్చించేవారు. అనీబిసెంట్‌కి సన్నిహిత మిత్రులైన సంజీవరావుకూడా హాజరయ్యేవారు. ఆయన వారణాసిలో కృష్ణమూర్తి విద్యాసంస్థను నిర్మించిన విద్యావంతులు. ఆయన భార్య పద్మాబాయ్. ఆమెకూడా కృష్ణమూర్తి మిత్రురాలే. వారిద్దరూ రోజూ కృష్ణమూర్తిని వినడానికి వసంతవిహార్‌కి వచ్చేవారు. వారితోపాటు "బాల సుందరం" అనే దివ్యజ్ఞాన సమాజ సభ్యులూ వచ్చేవారు. హాజరైన వారిలో "ముకుందపాద" అనే ఆయన, కృష్ణమూర్తిని విని తన్మయత్వం చెందేవారు. "సునంద" అనే విద్యావంతు రాలు. ఆమె రోజూ కృష్ణమూర్తిని విని, ఆయనతో చాలా మాట్లాడేది.

"శాంతారావు"అనే ఆమె మంచి డాన్సర్. భరతనాట్యంలో దిట్ట. సంగీతం బాగా తెలిసిన ఆమె. చాలా చురుకైనది. ఎంతో తెలివైనది. ఆమె రోజూ కృష్ణమూర్తికి భోజనం తెచ్చి

పెట్టేది. ఎక్కువగా ఆయన గదిముందు ద్వారపాలిక మాదిరిగా కూర్చుని వుండేది. కృష్ణమూర్తితో చనువుగా మాట్లాడేది. సంగీతం, నాట్యం, కళ, అందం మొదలైన అంశాలపై ఎంతో మాట్లాడేది.

* * *

మే నెలలో కృష్ణమూర్తి ఊటీ వెడితే బొంబాయినుంచి పుపుల్‌జయకర్, రాధిక, నందిని, నందిని మామగారు సునీలాల్ మెహతా అక్కడకు వెళ్ళారు. ఆతర్వాత జమ్నాదాస్ వెళ్లారు. కృష్ణమూర్తి వాళ్ళతో కలసి నీలగిరి కొండల్లో, చెట్లమధ్యా తిరుగుతూ, ఎన్నో కబుర్లు చెపుతూ అందంగా కాలం గడిపారు.

ఆ సమయంలో ఇండియా ప్రధాని జవహర్‌లాల్‌నెహ్రూ ఊటీలో వున్నారు. ఆయన తన సెక్రటరీద్వారా పుపుల్ జయకర్‌కు వర్తమానం పంపారు, తాను కృష్ణాజీని కలుసుకోవాలనుకొంటున్నానని. కాని, రక్షణ ఏర్పాట్లు సరిగాలేని కారణంచేత, నెహ్రూ కృష్ణమూర్తిని కలుసుకోవడం జరగదని అనుకుంటూ వుంటే, కృష్ణమూర్తే నెహ్రూను చూడ్డానికి గవర్నమెంట్ హౌస్‌కి వెళ్ళారు. కృష్ణమూర్తి వెంట పుపుల్ జయకర్, మారిస్ ఫ్రీడ్‌మన్ వున్నారు. కృష్ణమూర్తి, నెహ్రూ ఇద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు. చాలా సేపు మౌనంగా వుండిపోయారు. వారి హృదయాలు దగ్గరయ్యాయి.

ఆ తర్వాత కృష్ణమూర్తి తన డైరీలో, "నెహ్రూ ప్రఖ్యాత రాజకీయవేత్త. హేతువాది. నిజమైన దేశభక్తి కలవాడు. నిజాయితీ పరుడు. స్వార్థం, సంకుచితత్వం ఎరుగని వ్యక్తి. సహృదయుడు. దేశ స్వాతంత్ర్య సమరంలో ఎన్నో కష్టాల్ని ధైర్యంగా, నిర్భయంగా ఎదుర్కొన్న యోధుడు. గొప్ప విద్యావంతుడు. ఆయనకు రాజకీయం జీవనశ్వాస అయింది. ఆయన స్వాప్నిక జగత్తులోవున్నా, రాజకీయాల కోసం అన్నింటినీ పక్కకు నెట్టేశారు." అని రాసుకున్నారు.

* * *

కృష్ణమూర్తి ఊటీలో వుండగా మరొకసారి దివ్యానుభవం కలిగింది. ఆ సమయంలో ఆయన దేహం చాలా యాతనలు పడింది. ఆయన ఎంతో ఎదిగినట్లుగా, వికాసం చెందినట్లుగా వెలిగిపోయారు. ఎంతో శక్తివంతులయ్యారు. దేహంలో ఏదో మార్పు జరిగింది. 'మచ్చ - మకిలి - మురికి లేని వర్షపు చినుకు మాదిరిగా వున్నాను,' అన్నారు కృష్ణాజీ. ఆ అనుభవంతో ఆయన గతమంతా కాలి, బూడిద అయింది. ఆయనలో మహాశూన్యం ఏర్పడింది. మనసు, ఆలోచన, యోచనా రహితంగా మారింది. ఆ స్థితి గొప్పశక్తితో నిండింది. ఆ శక్తి తనకు తెలిసిన, ఊహించిన, భావించిన శక్తి కాదు. ధనం, కీర్తి, అధికారం, సంసార సంబంధమైన వాటికి చెందిన శక్తి కాదు. ఆ శక్తి పూర్తి పవిత్రమైన, స్వచ్ఛమైన శక్తి. డైనమోలో మాదిరిగా ఆయనలో ఆ శక్తి వుంది. ఆయన ముఖంలో నిశ్చలత్వం, నిర్మలత్వం కనుపించాయి. ఆయన వింత అందంతో వెలిగిపోయారు.

కృష్ణమూర్తికి ఊటీలో కలిగిన అనుభవం:

కృష్ణమూర్తి ఊటీలో వుండగా ఒకరోజున షికారు వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు. అంతలో అకస్మాత్తుగా అతనికి నీరసంగా అనిపించింది. కాస్సేపటికి ఎంతో బాధగా వుందన్నాడు. తలలో నరాలు పీకుతున్నాయని పడుకున్నాడు. రెండు గంటలు యమయాతన పడ్డాడు. మెడ దగ్గర నొప్పి విపరీతంగా వుందన్నాడు. ఆ తర్వాత పొట్ట ఉబ్బరించి గట్టి పడింది. గట్టిగా మూలిగాడు. పడుకుని అటూ, ఇటూ పొర్లాడు, అరిచాడు. చాలాసార్లు కదలిక లేకుండా పడివున్నాడు. 'నేను మూర్ఛపోతే, నా నోరు మూయండి;' అని, "అమ్మా! నాకు శాంతిని ప్రసాదించు. అతన్ని వెనక్కిపిలు. నేను పిచ్చివాడి

నైతే, నన్ను తీసుకుని, చూసుకో. నేను ఎంత మాత్రం పిచ్చి వాడిని కాను. ఈ దేహం యెడల వాళ్ళు ఎంతో శ్రద్ధ చూపుతున్నారు. నేను ముసలివాడిలా ఫీలవుతున్నాను. (నాలో-ఏ కొంచెమో, పని చేస్తోంది) నేను ఇండియా రబ్బరు బొమ్మ మాదిరిగా వున్నాను,' అన్నాడు తనతో తాను కృష్ణమూర్తి.

అంతసేపూ కృష్ణమూర్తి ముఖం బాధతో నీరసించి వుంది. కన్నీళ్ళు ధారగా కారాయి. 'కొండపైకి పోతున్న ఇంజను మాదిరిగా వుంది, నాస్థితి,' అన్నాడు కృష్ణాజీ.

రెండు గంటల తర్వాత మళ్ళా మూర్ఛపోయిలేచి, 'నా బాధ మాయమైంది. నా లోపల నాకేం జరిగిందో నాకు తెలుస్తోంది. నేను నిండుగా, సంపూర్ణంగా వున్నాను,' అన్నాడు.

ఆ తర్వాత కృష్ణాజీ ఎన్నో సంగతులు మాట్లాడారు. 'ఆ నా బాధ, నా దేహాన్ని శక్తివంతం, దృఢం చేసింది. నన్ను ఉక్కు మనిషిలా చేసింది. ఆలోచన అంటూ లేకండా నా దేహం అటూ, ఇటూ తేలికగా వంగుతూ, వూగుతూ కదిలింది. ఆ బాధతో నాకు పరీక్ష జరిగింది. నేనూ చక్కదిద్దబడ్డాను. మెరుగు పెట్టబడ్డాను.

"అంత బాధ అని పిస్తే, ఆపుజేసుకోలేకపోయారా?" అని పుపుల్ జయకర్ అడిగితే, "గర్భంలోంచి బిడ్డను రాకుండా ఆపుజేయకలరా? ఎవరైనా?" అన్నాడు కృష్ణాజీ.

"ఏదో జరిగింది. దాన్నంతా మీరు చూశారా? గమనించారా?" అని కృష్ణమూర్తి అందర్నీ అడిగాడు.

నేను ఇప్పుడు వర్షపు చినుకు మాదిరిగా మచ్చలేకుండా స్వచ్ఛందంగా వున్నాను. "నేను" అనేదంతా పూర్తిగా దగ్ధమైపోయింది. లోపలంతా కాలి, ఖాళీ అయింది.

కృష్ణమూర్తి ఊటీనుంచి బెంగుళూరు వెళ్ళారు. అక్కడ విక్రమ్ ఇంట్లో వున్నారు. అక్కడ ఆయన చుట్టూ ఎంతోమంది యువకులు చేరారు. ఫ్రీడ్‌మన్ కృష్ణమూర్తిని వదిలేవారుకాదు. కృష్ణమూర్తి ఒంటికి వెల్లుల్లి నూరి మర్దనా చేసే వైద్యం చేయించారు; ఫ్రీడ్‌మన్ అంతలో మద్రాసునుంచి మాధవాచారి వచ్చి, ఆ వైద్యాలూ, అవీ చూసి, గట్టిగా అరచి, ఆపేశారు.

కృష్ణమూర్తి బెంగుళూరులో వుండగా ఋషీవ్యాలీ స్కూలు సంగతి చర్చకు వచ్చింది. ఆ స్కూలు ప్రిన్స్‌పాల్ సుబ్బారావుగారి మంచితనం ఆసరాగా తీసుకుని, కొందరు దాని పవిత్ర వాతావరణాన్ని పాడుజేశారు.

ఒకదశలో కమిటీవారు ఆ స్కూలూ, ఆ ఆవరణా అంతా అమ్మేయాలనుకున్నారు. "స్కూలు అమ్మడం కన్నా, దాన్ని మూసేయడం మంచిది" అన్నారు కృష్ణాజీ. అయితే "ఆ స్కూలూ, దాని తాలూకు ఆస్తి అంతా మీ చేతుల్లోకి తీసుకుని, మీ దృష్టి దాని మీద పెట్టి, దాన్ని బాగు చేయండి," అని సంజీవరావు అంటే, "నాకా, ఆస్తి? నాకు ఎటువంటి ఆస్తీ లేదు, అఖ్కర్లేదు," అన్నారు కృష్ణాజీ. దీర్ఘ చర్చానంతరం, దాని ఉద్ధరణకు ఒక కమిటీ ఏర్పడింది.

కృష్ణమూర్తి బెంగుళూరునుంచి పూనా వెళ్ళారు. అక్కడ మిత్రులతో మాట్లాడుతూ, "నువ్వు ఏ గోతిలో వున్నావో, నీకు నువ్వే తెలుసుకుని, నీకు నువ్వే ఆ గోతిలోంచి బైటికి రావాలి," అన్నారు. ఆ మిత్రుల్లో ఒకరు, "అనేక కారణాలవల్లా, అనేక సంగతుల - విషయాల - సంఘటనల - సందర్భాలవల్లా నేను మానసికంగా అలసిపోయాను. తికమకలో వున్నాను," అన్నాడు. దానికి కృష్ణమూర్తి, "మీరు ఏదో చేసి, దాన్నించి

తప్పించుకోవాలని చూస్తారు. ఏం చేసినా, ఇంకో అతుకు పడు తుంది. దాని మంచి - చెడ్డలకు మీరే కారణం. దానికి మీరే బాధ్యులన్న సంగతి మరచిపోకండి. పక్షపాతాలతోగాని, పరమానందాలతోగాని - అసలు దేనితో మాత్రం మీకు ఏం పని? వాటి నన్నింటినీ వదలండి. ఆక్షణాన ఎదురైన విషయాల్లో పూర్తిగా లీనమైపోండి. దాంట్లో మిమ్మల్ని మీరు చూసి, తెలుసు కోండి. ఏ అరమరికా లేకుండా, పూర్తిగా, స్పష్టంగా; లోపలా - బైటా మిమ్మల్ని మీరు చూసుకోండి. అప్పుడు ద్వంద్వాల మధ్య వంతెన కట్టడం మానేస్తారు.

"అసలు అన్నింటికీ ప్రధాన కారణం, స్మృతి. అది గతం ఆ గతంనుంచి నువ్వు ఎప్పటికీ తప్పించుకోలేవు. నువ్వు చేయవలసిందీ, చేయుగలిగిందీ ఆగతాన్ని అర్థం చేసుకోవడం ఆ అవగాహనే, నీకు స్వేచ్ఛ నిస్తుంది. అదే విముక్తి, ముక్తి.

"మనసు ఒక అగ్నిపర్వతం. దాని మీద కూర్చుని ఎవరూ హాయిగా వుండలేరు. ముందు ఆ మనసును వెంటాడు. ఏ ఒక్క ఆలోచనను వదలకు; అది ఎట్లాంటి ఆలోచన అయినా సరే: ఎటువంటి నిశ్చయాలు, నిర్ణయాలు లేకుండా దాన్ని గమనించు. ఆ ఆలోచనలకు విలువ కట్టకు. వాటిని న్యాయ నిర్ణయం చేయకు. వచ్చిన ప్రతి ఆలోచననూ నిర్భయంగా గమనించు.

"సంబంధం ఒక అద్దం వంటిది. దాంట్లో నీ స్వరూపాన్ని నీవు స్పష్టంగా చూసుకోవచ్చు.

"ఏదైనా, నీవు ఎక్కడ ఎట్లావున్నావో, అక్కడనుంచే దాన్ని ప్రారంభించు.

"మనస్సంటే, కదలికలతో కూడిన పాత్ర. ఆ కదలికల్ని ఆలోచన రూపంలో వ్యక్తం చేసే వాటిని అంటే, మాటల్ని-

వాక్యాల్ని - పేరాల్ని - పేజీల్ని పరిశీలనగా చదువు. ఆ కదలి కలకు ఒక రూపం లేనప్పుడు అంటే, మెదడులోని కణాలు కదల కుండా ఆగినప్పుడు - అప్పుడు "నేను - నాది" అనేది వుండదు. అది పూర్తి నిరామయస్థితి. ఆస్థితి నిశ్చలం, నిర్మలం. ఆస్థితిలో స్మృతికి తావులేదు. అప్పుడు అంటే, కదలిక లేనప్పుడు బలీయమైన కేంద్రీకృతమైనశక్తి వుంటుంది. ఆ కదలిక యొక్క అవగాహనే, నిజమైన మార్పు.

"అంతేకాని రాజకీయ, సాంఘిక కార్యకలాపాలు ఎన్నటికీ ప్రపంచాన్ని మార్చలేవు. మనిషి తనకు తాను హేతు బద్ధంగా పరిణామం చెందితేనే, మార్పు సంభవం. ఎటువంటి పద్ధతులు మనిషిలో పరిణామం తీసుకురాలేవు. మనిషి ఎప్పుడూ పద్ధతులను మార్చుతూ వుంటాడు. కనుక పరిణామం అనేది ఆ క్షణంలో రావాలి. అంతే!" అన్నారు కృష్ణాజీ.

డిశంబరు ఎనిమిదవ తేదీన నెహ్రూ ఆహ్వానంపై కృష్ణాజీ తీన్‌మూర్తి భవనంలో కలుసుకున్నారు. "తనను తాను తెలుసుకోవడం ఎట్లా?" అని నెహ్రూ అడిగితే, దానికి కృష్ణాజీ 'మీ ఆలోచనల్ని పరిశీలించండి - పరీక్షించండి - పరిశోధించండి. మీ లోపల-బైట సంగతుల, విషయాల అన్నింటినీ పరిశీలనగా చూడండి. ఆలోచనలు - ఆలోచించే వానినుంచి భిన్నమా?" అంటూ "నే నెవడను?" అను ఆత్మవిచారమార్గాన్ని చెప్పారు.

ఆ సమావేశానంతరం కృష్ణమూర్తి తన డైరీలో 'నెహ్రూ ఎంతో ఔన్నత్యం కల వ్యక్తి. అటువంటివారు రాజకీయాల్లో వుండటం మంచిదికాదు. రాజకీయాలంటే, పూర్తిగా గతానికి చెందినవి. ఆయన రాజకీయాల్లో వుండటం వట్టిదండగ. కాలం, వృథా చేయడం,' అని రాసుకున్నారు.

ఒకసారి కృష్ణమూర్తి మిత్రులతో మాట్లాడుతున్నప్పుడు గాంధీగారి ప్రస్తావన వస్తే, "గాంధి మానసికంగానూ, భావాల్లోనూ, విప్లవవాది కాని, వాటిని ఆచరణలో పెట్టవలసి వచ్చేప్పటికి ఆయన దృష్టి, దృక్పథం అంతా ఇరుకున పడింది. దానికి కారణం, ఆయన రాజకీయాల్లో ప్రవేశించడం. క్రమంగా ఆయన రాజకీయాల్లో చిక్కుకుపోయారు. అటువంటి వారికి రాజకీయాలు వినాశన కారి వంటివి. అవి మనసును వికాసం చెందనీయవు. అవి మనసుకు వృద్ధాప్యం తెచ్చి పెడతాయి. రాజకీయాలవల్ల గాంధీగారు తన విప్లవభావాలతో రాజీపడ్డారు," అన్నారు.

❀ ❀ ❀

కృష్ణమూర్తి ఢిల్లీలో వుండగా "మా - ఆనందమయి "ని కలుసుకున్నారు. ఆమె. తనను తాను తెలుసుకున్న మహా తపస్విని. ఉత్తర భారతదేశంలో ఆమెకు ఎందరో శిష్యులూ, అనుచరులు, భక్తులు వున్నారు. ఆమెది చక్కని చిరునవ్వు ముఖం.

ఆమె చాలా ఏళ్ళ కిందట కృష్ణమూర్తి ఫోటో చూసి "ఇతను చాలా గొప్పవాడు అవుతాడు," అన్నదట. ఆమెకు ఇంగ్లీషు తెలియదు. అందుచేత ఆమె దుబాసీ ద్వారా కృష్ణమూర్తితో మాట్లాడుతూ, "నువ్వెందుకు గురువుల్ని నిరాకరిస్తున్నావు? వేల సంఖ్యలో ప్రజలు నిన్ను వినడానికి వస్తున్నారు కదా?" అన్నది. అంటే, ఆమె అర్ధం, "నువ్వు ఒక గురువువే కదా?" అని.

దానికి కృష్ణమూర్తి, "ప్రజలు 'గురువు' అనే పదాన్ని ఒక ఊతకర్రగా, కుంటివాడు చంక కింద పెట్టుకుని నడిచే సహాయ కర్రగా - ఉపయోగించుకుంటున్నారు," అన్నారు.

"నువ్వు గురువులకు గురువువి," అన్నారామె మళ్ళా. ఆ మాటకు కృష్ణమూర్తి సమాధానం చెప్పక, ఆమె చేతుల్ని ప్రేమగా తన చేతుల్లోకి తీసుకున్నారు. ఆ తర్వాత ఎందరో వచ్చి వారిద్దరి కాళ్ళకూ సాష్టాంగ నమస్కారాలు చేశారు. ఆ నమస్కారాల్ని ఆమె ప్రేమతో స్వీకరించారు. కాని, కృష్ణమూర్తి మాత్రం ఇబ్బంది పడ్డారు.

"మా - ఆనందమయి "కి లోకం లేదు కృష్ణమూర్తికి లోకం వుంది. దాని అవగాహనే జీవితమంటారు, ఆయన.

  

కృష్ణమూర్తి గురువుల్ని, గ్రంధాల్ని, సాంప్రదాయాల్ని, మతాల్ని, మతాదిపతుల్ని, మఠాదిపతుల్ని నిరసించి, నిరాకరించారు. అయినా కృష్ణమూర్తిని వినడానికీ, చూడ్డానికీ కాశీలో బౌద్ధ భిక్షువులు, సాధువులు, సన్యాసులు, యోగులు, యాత్రికులు, భక్తులు, సాధకులు, జిజ్ఞాసువులు, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు - అనేక మతాలకు, వర్గాలకు, దేశాలకు సంబంధించిన వారు - రకరకాలవారు - అనేక జాతులవారు - పండితులు, పామరులు, శాస్త్రవేత్తలు, తాంత్రికులు - ఒకటేమిటి అన్నిరకాల వారూ, రోజూ ఎంతోమంది వచ్చేవారు. అవసరమైనవారికి సంజీవరావు, అచ్యుత పట్వర్ధన్ మొదలైనవారు; కృష్ణాజీ మాటల్ని వారి వారి భాషల్లోకి తర్జుమా చేసి చెప్పేవారు.

కృష్ణాజీ ఎంత అలసిపోయినా, ఏ వేళయినా సాధువుల్ని, సన్యాసుల్ని, సాధకుల్ని తప్పనిసరిగా కలుసుకుని మాట్లాడేవారు. తాను నిజమైన సన్యాసి కావాలన్నది ఆయనకు మొదటి నుంచీ వున్న యోచన. కాని, ఆయన వారి ఆచారాలు, పద్ధతులు, నియమ - నిష్టలు, కర్మకాండ, శిక్షణ, నిబంధనలు - వాటిని

ఒప్పుకునేవారు కాదు. సన్యాసమంటే, కాషాయం కట్టడం, గుండు చేయించుకోవడం కాదు. గతాన్నంతా పూర్తిగా వదలడం. ఏ బరువూ, బాధ్యతా లేకుండా నిర్మలంగా, నిశ్చలంగా, నిర్భయంగా, స్వేచ్ఛగా జీవించడం. నిజంగా ఎవరూ, ఎప్పుడూ ప్రపంచాన్ని పరిత్యజించలేదు. ఎందుకంటే, ఆ ప్రపంచం ఎప్పుడూ వారిలో విడదీయరాని ఒక భాగంగా వుండనే వుంటుంది.

* * *

కృష్ణమూర్తి రాజఘాట్‌లో ఒక ఇంట్లో వుండేవారు. ఋషీవ్యాలీ ట్రస్ట్‌వారు రాజఘాట్‌లో ఒక స్కూలు నడుపుతున్నారు. ఆ ట్రస్ట్‌వారితో కృష్ణమూర్తి దీర్ఘ చర్చలు జరిపారు. ఆయన నిర్ణయాలతో వారు ఏకీభవించలేక, ట్రస్ట్ నుంచి తప్పుకుంటే, కొత్త సభ్యులు నియమింపబడ్డారు. దాని ప్రకారం రావ్‌సాహిబ్ పట్వర్ధన్ రాజఘాట్ స్కూల్లో పనిచేసేటట్లు నిర్ణయమైంది. కాని, ఆయనకు అందు పనిచేయడం ఇష్టం లేదు. కాని, ఆయనంటే అందరికి ఇష్టం, ప్రేమ.

రాజఘాట్‌లో కృష్ణమూర్తితోపాటు అచ్యుత పట్వర్ధన్ సోదరులూ, ఫ్రీడ్‌మన్, సంజీవరావు, పుపుల్ జయకర్, ఆమె కుమార్తె రాధిక వున్నారు. కృష్ణాజీ సాయంత్రాలు షికారుగా నడుస్తూ, చుట్టూ వున్నవాటిని పరికిస్తూ, అవగాహన చేసుకుంటూ - దారిలో పడివున్న రాళ్ళను, ముళ్ళను ఏరిపారేస్తో, మేక పిల్లలతో ఆడుకుంటో, పక్కవాళ్ళతో కబుర్లు చెపుతో, పశు - పక్ష్యాదుల శబ్దాలు వింటో, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటో వెళ్ళేవారు. అది ఆయన ఎప్పుడూ నడిచే విధం. 'అన్నింటితో సంబంధంలేని మనిషి, మనిషే కాదు,' అనేవారు కృష్ణాజీ. కాని, కృష్ణమూర్తి సర్వసాధారణంగా షికారులో ఎప్పుడూ,

ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేవారు కాదు; ఒక్క ప్రకృతి విషయమైతే తప్ప. ఎందుకంటే, సంభాషణ పరిసర పరిశీలనను ఆటంకపరుస్తుందని వారిభావన.

* * *

1949 మార్చిలో కృష్ణమూర్తి బొంబాయిలో "హిమత్ నివాస్"లో వున్నారు. ఒక రోజున మురార్జీ దేశాయ్ కృష్ణాజీని చూడ్డానికి వెళ్ళారు. మాటల్లో, 'నేను భగవద్గీతవంటి గ్రంథాలేవీ చదవలేదు అటువంటి గ్రంథాలేవీ తనను తాను తెలుసుకోవడానికి ఉపయోగపడవు,' అని కృష్ణాజీ అనేప్పటికి, ఆయనకు బాధ కలిగింది.

* * *

నందిని, ఆమెభర్త బగవాన్ మెహతాల మధ్య సత్సంబంధాలు క్రమంగా సన్నగిల్లాయి. నందిని కృష్ణమూర్తిని కలుసుకున్న కొన్నేళ్ళకు భర్తతో 'ఇకనుంచి నేను మీతో ఎటువంటి శారీరక, భౌతిక సంబంధం పెట్టుకోబోవడంలేదు. బ్రహ్మచర్య జీవనం గడపదలిచాను,' అని నిర్భయంగా చెప్పేప్పటికి ఆయనకు చాలా బాధ కలిగింది. కోపమూ వచ్చింది. ఆమెను ఎంతగానో ప్రేమించే మామగారు సునీలాల్ మెహతా కూడా బాధపడ్డారు. నందిని అటువంటి నిర్ణయం తీసుకుని, నిర్భయంగా చెప్పడానికి కారణం, కృష్ణమూర్తి ప్రభావమని ఆమె బంధు - మిత్రుల భావన. వారే కాదు, ఆ సంగతి తెలిసిన ప్రతివారూ అలాగే అనుకున్నారు. నందిని విషయంలో బంధుమిత్రుల్లో గుసగుసలు బయలుదేరాయి. నందిని అత్తగారు ఆమెను గట్టిగా కోప్పడింది. "పెళ్ళయిన తర్వాత ఆడది వీధి గుమ్మం చూడకూడదు. నోరెత్తి మాట్లాడకూడదు. పెద్దల్ని ఎదిరించ

కూడదు. నిందించకూడదు. వాళ్ళకు ఎటువంటి బాధా కలిగించ కూడదు. పన్నొత్తి నవ్వ కూ డ దు." అని చివాట్లు పెట్టి, మందలించింది.

చట్టప్రకారం విడాకులకోసం నందిని కోర్టుకు వెళ్ళింది. బొంబాయి హైకోర్టులో దావా వేసింది - "తన యెడల అత్త మామలూ, భర్తా దౌర్జన్యంగా, నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారనీ, తన పిల్లల్ని తననుంచి విడదీసి, నిర్బంధించి వుంచారనీ - ఓ కూతురుకి తొమ్మిదేళ్ళు, పెద్ద కొడుక్కి ఏడేళ్ళు, చిన్న వాడికి మూడేళ్ళు," అని ఆ ఫిర్యాదులో పేర్కొన్నది.

ఆ కేసు విచారణకు వచ్చింది. భగవాన్ మెహతా వకీలు కోర్టులో కృష్ణమూర్తి ప్రస్తావన తెచ్చాడు. "నందిని కృష్ణ మూర్తి ప్రభావానికిలోనై, భర్తకు విడాకులిస్తోందనీ, పిల్లల్ని కూడా విస్మరిస్తోందనీ వాదించాడు. ఆ సందర్భంలో కృష్ణ మూర్తి ఉపన్యాసాల్లోని కొన్ని భాగాల్ని న్యాయమూర్తికి చదివి వినిపించాడు; 'భారతీయుల్లో కపటం, మాయవుంది. భారతీయస్త్రీ భర్త అధీనంలో వుండవలసిన దైన్యస్థితిలో వుంది. ఆమెకు రక్షణ లేదు," అని. దానితో స్త్రీలు రెచ్చిపోయారు. అటువంటి స్త్రీలలో నందిని ఒకరు. కనుక ఈ కేసులో నందినిపై కృష్ణమూర్తి ప్రభావం నిశ్చయంగా వుంది," అని వాదించాడు.

క్రాస్ పరీక్షలో నందిని మామగారైన సునీలాల్ మెహతా తన గురుతుల్యులైన కృష్ణమూర్తిని నిరాకరించలేక, కన్న కొడుకును కాదనలేక తికమక పడుతుండగా, "నందినికి కృష్ణ మూర్తితో సంబంధం, సహవాసం వుందా ?" అని ప్లీడరు

ఆయన్ని అడిగేప్పటికి సునీలాల్ మెహతా కుర్చీలోంచి ఒక్క దూకున లేచి, గంభీరంగా నిలబడి, "లేదు, కృష్ణమూర్తి మహాత్ములకే, మహాత్ములు," అన్నాడు.

క్రూరత్వం మీద ఆరోపించిన నందిని కేసు హైకోర్టు కొట్టేసింది. పిల్లల్ని భర్తకు అప్పగించారు. ఆ కేసులో నందిని పూర్తిగా ఓడిపోయింది. వెంటనే ఆ విషయం కృష్ణమూర్తికి టెలిగ్రాం ద్వారా తెలియజేశారు నందిని, పుపుల్ జయకర్. దానికి కృష్ణమూర్తి 'ఏం జరిగిందో, అది సరైనదే!' అంటూ సమాధానమిచ్చారు.

ఆ తర్వాత కృష్ణమూర్తి నందిని యెడల ఎటువంటి ప్రత్యేకతా, చూపలేదు. కరుణా చూపలేదు. ఆ సమయంలో ఎంతోమంది స్త్రీలు అనేక విషయాలపై కృష్ణమూర్తిని ప్రశ్నించారు.

నందిని వ్యవహారంతో కొందరు పెద్దలూ, బాగా తెలిసిన వారూ కృష్ణమూర్తిని ఏమీ ఎరగనట్లు తప్పించుకుని తిరిగారు. జరగకూడని ఘోరమేదో కృష్ణమూర్తి వల్ల జరిగినట్లు కొందరు కృష్ణమూర్తి మిత్రులు బాధపడ్డారు. నందిని భర్తతో విడిపోవడం చాలామంది విద్యావంతులు సహితం కృష్ణమూర్తి ప్రభావమనే అనుకున్నారు.

హోలీపండుగ నాటి రాత్రి నందిని భర్తతో పూర్తిగా విడిపోయింది. ఆ రాత్రి నందిని తల్లి దగ్గరకు వెళ్ళింది. మర్నాడు ఉదయం నందిని కృష్ణమూర్తి దగ్గరకు వెళ్ళింది. ఆయన ఆమెను చూసి, "భర్తను, పిల్లల్ని, సంసారాన్ని, సమస్తాన్ని వదిలి వచ్చావు. గనుక, ఇకనుంచి నువ్వు ఒంటరిగా, ధైర్యంగా నిలబడాలి.

"నువ్వు చేసింది సరైనది, సత్యమైనది" అని నువ్వు నిజంగా నమ్ముతున్నావు గనుక, జీవితంలో ధైర్యంగా ముందుకు సాగు. నిన్ను నీవే రక్షించుకోవాలి. ఇతరులెవరి మీదా ఆధారపడకూడదు. ఎవరి ప్రభావం నీ మీద పనిచేయకూడదు," అని హెచ్చరించారు.

నందిని దగ్గర ఏ మాత్రం డబ్బులేదు. గతిలేక తిరిగి భర్త దగ్గరకు వెడుతుందనుకున్నారు కొందరు బంధుమిత్రులు. జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడింది ఆమెకు.

"నేను ఈ నందిని భారాన్ని మోయలేను" అంటూ ఆమె తల్లి కృష్ణమూర్తితో మొరపెట్టుకుంటే, "అయితే నీ భారాన్ని నీవు దించుకో!" అని ఆమెకు సలహా ఇచ్చారు కృష్ణాజీ. నందని తల్లి ఏడ్చింది. ఆయన ఆమెను ఓదార్చారు.

పుపుల్ జయకర్ కృష్ణమూర్తి దగ్గరకు వెళ్ళి నందిని గురించి అంతా వివరంగా, విపులంగా చెప్పింది. "పిల్లల్ని తిరిగి భర్తనుంచి తీసుకోవాలంటే, లీగల్‌గా అతనిపై చర్య తీసుకోవలసి వుంటుంది," అన్నది. దానికి కృష్ణమూర్తి 'నా మీద ఏదో అబాంఢం వచ్చిపడిందనీ, నన్ను రక్షించాలనీ మీరీ ప్రయత్నాలన్నీ చేస్తున్నారా? నీకు ఏది న్యాయం? ఏది సత్యం? అనిపిస్తే, దాన్ని నందిని కోసం. పిల్లలకోసం చెయ్యి. పిల్లలు ముఖ్యం. జయాపజయాలు ముఖ్యం కాదు. న్యాయం కోసం పోరాడు,' అన్నారు.

• • •

1950 జనవరిలో యూనివర్సిటీ కాలేజీవారి ప్రత్యేక ఆహ్వానంపై కృష్ణమూర్తి కొలంబో వెళ్ళారు. ఆయన వేదిక మీదకు వెళ్ళగానే అన్నిమూలలనుంచీ ఈలలూ, పిల్లికూతలూ,

గోలలూ ఆరంభమయ్యాయి. ఆయన మాట్లాడటం ప్రారంభించినా విద్యార్థులు గోలచేయడం మానలేదు. కృష్ణమూర్తి నవ్వి, "మీరు నానుంచి ఏది కోరుతున్నారు? మీరు నన్ను ప్రత్యేకంగా ఆహ్వానించి ఎందుకు ఇంత గోల చేస్తున్నారు? నా వల్ల ఏం తప్పు జరిగింది? నేను ఏ పొరపాటు చేశాను. అసలు మీ ఉద్దేశ్యం ఏమిటో చెప్పండి?" అని మర్యాదగా అడిగారు.

కృష్ణమూర్తి నవ్వుతూ వారి సమాధానంకోసం ఎదురు చూశారు. అంతలో అన్నిమూలలనుంచీ, "మీరు తిరిగి వస్తానన్న ఏసుప్రభువులా? ముందు ఆ సంగతి చెప్పండి?" అని విద్యార్థులు అడిగారు.

కృష్ణమూర్తి మళ్ళా నవ్వారు. ఆనంద - విషాదాలతో కూడిన ఆ చిరునవ్వు విద్యార్థుల్ని నిశ్చేష్టుల్ని చేసింది. ఓక్షణంలో హాలు వాతావరణమే మారిపోయింది.

'సరేనయ్యా, మీ ప్రశ్నకు నేను సమాధానం చెపుతాను,' అంటూ కృష్ణమూర్తి తన జీవితగాథ - చిన్నప్పటి జీవితం - చదువు - దివ్యజ్ఞాన సమాజం - తనను జగద్గురువును చేయడం - తన బాధలు - యాతనలు - వేదనలు - ఆవేదనలు - ఒంటరితనం - ఆశలు - ఆశయాలు - అనుభవాలు అన్నీ సహజంగా సరళమైన భాషలో చెప్పారు. అదంతా విని, వారు ఒకటే చప్పట్లు కొట్టారు. కొందరు పశ్చాత్తాపంతో కన్నీరు కార్చారు. మొత్తంమీద సభ సంతోషంగా ముగిసింది.

"ఈ భూమి మీద అరుదుగా ఉద్భవించిన అద్భుత మూర్తి, కృష్ణమూర్తి. ఆయన నిశ్చయంగా ఈ తరానికే పూర్ణమానవుడు. మంచి మిత్రుడు. ఆయన సూచించేది సహజమార్గం" అని కొనియాడారు ఆ విద్యార్థులు.

• • •

ఆ సందర్భంలో అక్కడే మరొకరు కృష్ణమూర్తిని ప్రశ్నించారు. "మీరు ఈ విధంగా సంవత్సరం తర్వాత సంవత్సరం ప్రపంచం తిరిగి బోధించి కాలం వృధా చేయక పోతే ఏదైనా ప్రయోగాత్మక పద్ధతిలో - ప్రయోజన కరమైనది చేసి ప్రపంచానికి సహాయం చేయవచ్చును కదా ?" అని.

దానికి కృష్ణమూర్తి, "అంటే, మీ అర్థం ప్రపంచంలో మార్పు తీసుకురావాలనే కదా! ముఖ్యం, ఆర్థికంగా అవునా? ఆ విధమైన మార్పు రావాలని కోరుకుంటున్నారు. మార్పు తీసుకురావాలని ప్రతిమేధావీ ఆశించాడు, ప్రయత్నించాడు, కృషి చేశాడు.

"మీరు ఆ మార్పుకు ఒక పద్ధతిని కోరుతున్నారు. అవునా ? అందుకే నన్ను అడుగుతున్నారు, "మీరు బోధిస్తో కాలాన్ని ఎందుకు వృధా చేస్తున్నారు ?" అని. 'దాని బదులు ఏదో ఒకటి ప్రజలకు సహాయపడేది చేయవచ్చును కదా ?" అని అంటున్నారు. నేను నిజంగా కాలాన్ని వృధా చేస్తున్నానా? నేను చేసేది కాలం వృధా చేయడమేనా ? అది వృధా చేయడం కాకపోతే, పాతవాటికి బదులు కొత్తభావాలు నేను ప్రవేశపెట్టినట్లయితే, అప్పుడు కాలం వృధా చేయడమే అవుతుంది. ఎందుకంటే ఆదర్శాలు, నమ్మకాలు, సిద్ధాంతాలు పద్ధతులు కర్మని నిరోధిస్తాయి. పని జరగకుండా అడ్డుపడతాయి," అన్నారు.

ఆ తర్వాత నందిని చాలాసార్లు కృష్ణమూర్తిని ఒంటరిగ కలుసుకుంది. "నీకు సంభవించిన దానికి చింతించకు. దానికి మనసులో చోటివ్వకు. వాస్తవాన్ని నిర్భయంగా ఎదుర్కో. నూతనత్వానికి కళ్లుతెరు," అన్నారు కృష్ణాజీ.

"కృష్ణమూర్తి ప్రభావంవల్ల నందిని భర్తకు విడాకు లిచ్చింది" అనే వార్తను "Revolt of Doormat" అనే శీర్షికతో "ది టైమ్స్" పత్రిక ప్రకటించింది. ఆ వార్తను రాజగోపాల్ చదివి కృష్ణాజీకి ఒక ఉత్తరం రాశాడు. "నందిని విషయమై పత్రికల్లో వచ్చిన వార్త నిజమేనా?" అని.

రాజగోపాల్ ఉత్తరానికి పుపుల్ జయకర్ సమాధాన మిచ్చింది, "నందిని విషయంలో కృష్ణమూర్తి ప్రస్తావన రావడం విచారకరం," అని.

కాని, ఇండియా మిత్రులనుంచి కృష్ణమూర్తి - నందిని విషయమై దేశంలో ప్రచారమైవున్న అపవాదును మరింతచేసి, రాజగోపాల్‌కి ఉత్తరాలు వచ్చాయి. అవన్నీ చూసిన తర్వాత రాజగోపాల్‌కీ, రోజలిండ్‌కీ కృష్ణాజీపై కోపంవచ్చి, కృషమూర్తి ఒహైి వెళ్ళగానే "నందిని విషయమైన నిజానిజాలు చెప్ప" మని కృష్ణమూర్తిని అడిగారు.

కృష్ణమూర్తి వారి ప్రశ్నలకు సూటిగా, సరిగ్గా సమాధానం చెప్పకపోయేప్పటికి వారికి మరింత కోపంవచ్చి, బాధ పడ్డారు. ఆ సందర్భంలో కృష్ణమూర్తి పుపుల్ జయకర్‌కి రాస్తో "ఓ సంవత్సరం పైగా నేను ఎటువంటి సభలకూ, సమావేశాలకు వెళ్ళను. ప్రత్యేక ఇంటర్వ్యూలు ఇవ్వను. విశ్రాంతిగా వుంటాను. కనుక ఇండియాకుడా రాను," అన్నారు.

ఆ ప్రకారం కృష్ణమూర్తి 1950 ఆగస్ట్‌నుంచి 1951 చివరి వరకు ఇండియాతో ఎటువంటి సంబంధమూలేదు. అది గమనించి "కృష్ణమూర్తి పూర్తి మౌనంలో వుంటున్నారు" అని రాజగోపాల్ మిత్రులకు సమాధానాలు రాసేవాడు.

1951 చివరలో కృష్ణమూర్తి, రాజగోపాల్ ఇండియా వచ్చారు. పాతమిత్రులు కృషమూర్తిని చూడ్డానికి తొందర పడ్డారు. ఆయన వారందర్నీ ప్రేమగా తీసుకున్నారు. కాని, ఏఒక్కరితోనూ ఆయన ప్రత్యేకంగా ఒక్కమాట మాట్లాడలేదు. మౌనంగా వున్నారు. ఆయన ప్రవర్తన చూసి, రాజగోపాల్ ఇబ్బంది పడ్డాడు. మిత్రులూ కలవరపడ్డారు.

కృష్ణమూర్తి బొంబాయినుంచి మద్రాసు వచ్చారు. అక్కడా మౌనంగా వున్నారు. కాని, సన్నెండు ఉపన్యాసాలు ఇచ్చారు. ఆయన్ని చూడ్డాకిని బొంబాయినుంచి పుపుల్ జయకర్, నందిని వచ్చారు. కృష్ణమూర్తితోపాటు అందరూ వసంత్‌విహార్‌లో వున్నారు. కాని, కృష్ణమూర్తి ఒంటరిగా భోజనం చేసేవారు. అందరినుంచీ, అన్నింటినుంచీ ఆయన దూరంగా, విడిగా వున్నారు. రాజగోపాల్‌ను పుపుల్‌జయకర్‌కీ, నందినికీ పరిచయం చేశారు. ఆ తర్వాత వారు మంచి మిత్రులయ్యారు.

నందిని బొంబాయిలో "మలబార్‌హిల్"లో అనాధ పిల్లలకు ఒక స్కూలు పెట్టింది. దాని పేరు "బాలానంద". తన ఇంటి చుట్టుపక్కల వున్న అనాధపిల్లల్ని చేరదీసింది. క్రమంగా పిల్లల సంఖ్య పెరిగింది. ఉపాధ్యాయులూ, ఉదారస్వభావులూ ముందుకు వచ్చారు. స్కూలే, నందిని లోకమైపోయింది. పిల్లలు ఆమె చుట్టూచేరి, ఆడి, పాడి, నవ్వుతూవుండేవారు. ఆ స్కూల్లో డాన్స్, పాటలు, చిత్రలేఖనం, డ్రామాలు, భాషలు, సైన్స్, లెక్కలు, నేత ఒకటేమిటి అన్నీ వున్నాయి.

ఇరవై ఐదేళ్ళ తర్వాత ఆ స్కూలు "కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ ఇండియా" లో ఒక భాగం అయింది. ఆమె, ఆ సంస్థ సభ్యురాలైంది. ఆమె స్వంత పిల్లలు పెరిగి, పెద్దవారై, ఆమె దగ్గరకు వచ్చారు. క్రమంగా నందిని కృష్ణమూర్తికి మంచి మిత్రురాలైంది. కృష్ణమూర్తి ఇండియాలో వున్నప్పుడు నందిని ఆయనవెంట వుండేది. ఆయన విదేశాల్లో వున్నప్పుడు విడవకుండా ఉత్తరాలు రాసేది.

1951 నవంబరులో కృష్ణమూర్తి లండన్ వెళ్ళారు కానీ, లేడీఎమిలీతో వుండలేదు. కాని, ప్రతిరోజూ వెళ్ళి ఆమెను చూసేవారు. ఆ రోజుల్లో కృష్ణాజీకి రోజూ జ్వరం వచ్చేది.

1952 వసంతకాలంలో కృష్ణమూర్తి, రాజగోపాల్ యూరప్‌మీదుగా అమెరికా వెళ్లారు జూలైనాటికి నందిని పరిస్థితి విషమించింది. కృష్ణమూర్తి మిత్రుల సూటి, పోటీ మాటలు, భర్త నిరంకుశ ప్రవర్తన నందినిని మరింత హింసించాయి. ఆమె మానసికంగా కృంగిపోయింది. ఆమె దేహం కూడా క్షీణించింది. కేన్సర్ ప్రవేశించింది. వైద్యానికి యూరప్ వెళ్ళింది. నందిని విషయం కృష్ణమూర్తికి టెలిగ్రాం ఇచ్చింది, పుపుల్ జయకర్. "మా కుటుంబానికి సంభవించిన విపత్తును కృష్ణమూర్తి బలంతోనే ఎదుర్కొంటున్నాం. నందిని లండన్‌లో మృత్యువుతో పోరాడుతోంది. రేపటికోసం ఆలోచించవద్దన్న కృష్ణమూర్తి మాటల బలంతో నందిని ఒక హోటల్లో వుంది, దిగజారిపోతున్న ఆరోగ్యంతో," అని. దానికి కృష్ణమూర్తి నుంచి జవాబులేదు.

ఆపరేషన్ రోజున నందిని తన పిల్లల్ని ఫోన్‌లో పలకరించింది. "ఆపరేషన్ సమయంలో తమను ఎవరో రక్షిస్తున్నట్లు వుంది," అని పుపుల్‌జయకర్ కృష్ణమూర్తికి ఒక ఉత్తరం రాసింది.

1952 శీతాకాలంలో కృష్ణమూర్తి, రాజగోపాల్ పూనాలో వున్నారు. కృష్ణమూర్తితో చర్చలు ఏర్పాటుచేయబడ్డాయి. తన మిత్రులకోసం "విరల్‌వాడి"లో రావ్‌సాహిబ్ పట్వర్ధన్ ఆ చర్చల్ని ఏర్పాటుచేశారు. పట్వర్ధన్ ఆ మధ్యే సోషలిస్ట్ పార్టీనుంచి తప్పుకున్నారు. ఆ చర్చలకు బొంబాయి నుంచి, మద్రాసు నుంచి కృష్ణాజీ మిత్రులు వచ్చారు.

రావ్‌సాహిబ్ చిన్న తమ్ముణ్ణి సునంద వివాహం చేసుకుంది. సునందను కృష్ణమూర్తి మొదటినుంచీ బిడ్డలాగ చూసుకునేవారు. కృష్ణమూర్తి, సునంద ఇద్దరూ షికార్లు తిరిగేవారు. అది చూసి, 'గతంలో గొడవలు చాలకనా, మళ్ళా ఆడపిల్లలతో స్నేహాలు, షికార్లు, ప్రేమలు,' అంటూ రాజగోపాల్ గట్టిగా కృష్ణమూర్తిని రొప్పదేవాడు. ఓ వారం తర్వాత పూనాలో కృష్ణమూర్తి చర్చలు ముగిశాయి. ఎక్కడివారు అక్కడకు వెళ్ళారు.

కృష్ణమూర్తి విరల్‌వాడినుంచి ఋషీ వ్యాలీ వెళ్ళారు. అది పెద్ద మైదానం. దాన్ని క్రమంగా చెట్లతో నింపి, వనంలాగ తయారు చేశారు. ఆ ప్రాంతానికి ఋషీవ్యాలీ ఒక ఒయాసిస్. ఆ ప్రదేశం చుట్టూ కొండలు. ఉభయ సంధ్యల్లో ఆ లోయ ఎంతో అందంగా వుంటుంది. మంచి గాలి వీస్తుంది. అక్కడకు మదనపల్లి ఇరవై కిలోమీటర్ల దూరంలో వుంది. లోయ మధ్య గుడి మాదిరిగా ఒక పెద్ద మర్రి చెట్టు వుంది. దాని ఊడలు స్తంభాల్లా వున్నాయి. ఆ చెట్టు చుట్టూ చక్కని స్టేజీ కట్టారు.

అచ్యుత పట్వర్ధన్ ఆహ్వానంపై కృష్ణమూర్తి రాజఘాట్ వెళ్ళారు. ఆయన ప్రముఖ రాజకీయవాది. స్వాతంత్ర్య సమర యోధులు. ప్రముఖ సోషలిస్ట్‌వాది. విప్లవవాది. అన్నీ వదిలేసి, రాజఘాట్ స్కూలు విషయంలో శ్రద్ధ వహించి, దాన్ని సంస్కరించ పూనుకున్నారు. ఆ చుట్టు పక్కల పల్లెలవారికోసం

అక్కడ ఒక ఆసుపత్రి తెరిచారు. మిత్రులైన డాక్టర్లు ఆయనకు సహాయం చేశారు వ్యవసాయదారుల పిల్లలకోసం అగ్రికల్చరల్ స్కూలు కూడా పెట్టారు. వరుణనది ఒడ్డున ఒక చిన్న ఇంట్లో వుండేవారు అచ్యుత పట్వర్ధన్. ఆ ఇంటికి కరెంటు లేదు. మరుగుదొడ్డీ లేదు. గొప్ప మిత్రులు వచ్చి, ఆయనతో చేతులు కలిపారు. ఆ రోజుల్లో ఆచార్య వినోబాభావే భూదానోద్యమం ప్రారంభిస్తే, పట్వర్ధన్ సోదరులు అందు చేరారు.

1953 మొదట్లో కృష్ణమూర్తి, రాజగోపాల్ బొంబాయి వెళ్ళారు. అక్కడ "రతన్‌జీ మొరార్జీ" తో వున్నారు. కృష్ణమూర్తి ఎక్కువకాలం ఒంటరిగా గదిలో వుండేవారు. రాజగోపాల్ కోపపు చూపుల్ని, కఠినపు మాటల్ని జమ్నాదాస్ గమనించక పోలేదు. మధ్య మధ్య కృష్ణమూర్తి మృదుస్వరంకూడా వినేవారాయన.

ఒక పౌర్ణమిరోజు రాత్రి కృష్ణమూర్తి మిత్రులతో కలసి మోటారు బోట్‌లో "ఎలిఫెంటాకేవ్స్" కి వెళ్ళారు. అక్కడ పిల్లలు వారి చుట్టూ చేరారు. వారు కృష్ణమూర్తికి పువ్వులు ఇచ్చి పైసలు అడిగారు. కృష్ణమూర్తి తన ఖాళీజేబులు చూపించి, పక్కకు తిరిగి "ఆ పిల్లలకు ఏమైనా పైసలు ఇవ్వండి," అని మిత్రులకు చెప్పారు. ఆ తర్వాత ఆయన పిల్లలతో కలసి కాస్సేపు ఆడారు, పాడారు, ఆవెన్నెల్లో.

కృష్ణమూర్తి పెద్దనాన్నగారి కొడుకు నారాయణ యం. ఎ. పాసై, బొంబాయిలో కృష్ణమూర్తిని చూడ్డానికి వెళ్ళాడు. అతన్ని ఋషీవ్యాలీ స్కూల్లో చేరమన్నారు, కృష్ణమూర్తి. అతనికి కొన్నేళ్ళు విదేశాల్లో శిక్షణ ఇప్పించారు. అతను మొదట ఋషీవ్యాలీ స్కూల్లో టీచర్‌గా చేరి, తర్వాత వైస్ - ప్రిన్సిపాలై, 1988 లో ప్రిన్సిపాల్ అయ్యాడు.

కృష్ణమూర్తి పుస్తకం "Education and the Significance of Life", అచ్చయింది. ఆ పబ్లిషర్ "VICTOR GOLLANCZ LTD - ఇప్పటికీ కృష్ణాజీ పుస్తకాలు అచ్చువేస్తున్నారు.

1953 లో, దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులుగా శ్రీరాంగారు నియమితులైనారు.

1953 లో, కృష్ణమూర్తి మొదటి పుస్తకం 'Education and The Significance of life' అచ్చయింది. అక్షర జ్ఞాన శూన్యుడు అజ్ఞాని కానవసరం లేదు. తనను తాను తెలుసుకోని వాడు తాను చదివిన గ్రంథాల మీద, తనకు తెలిసిన - పరిమితమైన విజ్ఞానం మీదా ఆధారపడ్డ మూర్ఖుడు. తనను తాను తెలుసుకోవడమే నిజమైన విద్య.



గిండీలో వున్న దివ్యజ్ఞాన సమాజ పాఠశాలను ఋషీవ్యాలీకి తరలించారు. కాని, కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సమాజం నుంచీ, స్టార్ సంస్థనుంచీ తప్పుకోవడంవల్ల ఋషీవ్యాలీలో విశ్వవిద్యాలయ స్థాపన ఆగిపోయింది.

1953 లో, ఋషీవ్యాలీలో ఒక ట్రస్ట్ ఏర్పాటు చేశారు. దాన్ని 'ఫౌండేషన్ ఫర్ న్యూ ఎడ్యుకేషన్'గా మార్చారు. పిల్లలలో సదవగాహన పెంపొందించాలనేది ఆ విద్యావిధానం. అవగాహనా పటిమలోని వికాసమే, విద్య. అటువంటి వికాసానికి స్వేచ్ఛ ముఖ్యం. అందుకే కృష్ణాజీ అంటారు, 'జీవితం ఒక జీవనదివంటిది. అది నిరంతరం ఎడతెగక ప్రవహిస్తుంది. అది సజీవమైనది, చైతన్యవంతమైనది. ఎన్నటికీ ఆగదు, ఆరదు. ఆ నదిలోని ఒక భాగాన్ని తీసుకుని, దాన్నంతా అర్థం చేసుకున్నాననడం వ్యర్థం. దానితో మనము ప్రవహించలేము. అది

మనల్ని వదలి ముందుకు సాగుతుంది. ఎవరైనా నిజంగా దాని గమనాన్ని గమనించి ఆపగలరా? దాని గట్ల మీది సంగతులకు సదా ఎరుకలో వుండగలరా? అలాగే, జీవితాన్ని అవగాహన చేసుకోగలరా?

"మన పెద్దలు మనచుట్టూ మంచి ప్రపంచాన్ని సృష్టించలేదు. దాన్నిండా భయాలు, చీకటి మూలలు, కలుషితం, నియమ - నిష్టలు అన్నీ వున్నాయి. అవన్నీ చూపి, వాటి గురించి చెప్పి పిల్లల్ని భయపెట్టారు. ముందు పిల్లల్లో ఆ భయాలు పోవాలి.

"విద్యార్థికి, నేను విద్యాలయానికి వెడుతున్నాను," అనే భావం కలగాలి. అప్పుడే విద్యార్థులలో, ఉపాధ్యాయులలో విశ్వాసం, ప్రశాంతత, అవగాహన, గౌరవం, ఆనందం, అందం, సంతోషం - అన్నీ వుంటాయి. విద్యార్థికి నిర్భయంతోపాటు, సత్య వాక్కువుండాలి. అతనికి ఏకాగ్రత గురించి కాక, తనకు తాను సదా లోపలా, బైటా సంగతులకు ఎరుకలో వుండేటట్లు వాళ్ళను మలచాలి, అదే నిజమైన విద్య.

"సరైనవిద్య విద్యార్థిని లోపలా - బైటా పూర్తిగా బాగుచేసి వృద్ధి చేస్తుంది. మనసుకూ, హృదయానికీ లోతునూ, శక్తినీ, అవగాహనా పటిమను, అందాన్ని, ఆనందాన్ని ఇస్తుంది."

1954 జనవరిలో కృష్ణమూర్తి విద్యగురించి మాట్లాడారు : 'విద్య, ఇరవై ఒక్క సంవత్సరాలవరకే కాదు. అది జీవితాంతం నేర్వవలసిన సంగతి. అది ఎగతెగక నిరంతరం సాగాలి. నేర్చుకోవడమంటే, ఒకదాన్ని అనుసరించి, అన్వేషించడం, దాని మీద

దృష్టిపెట్టి శ్రద్ధగా పనిచేయడం. నేర్చుకోవాలనుకోవడమే, జీవించడం. దానికి తీవ్రమైన ఆర్తి, స్వేచ్ఛ, ఇచ్ఛ అవసరం. విద్య నేర్వడానికి అధికారం, ఆచారత్వం లేని పరిశీలన అవసరం.

"కనుక విద్యార్థి స్వేచ్ఛగా వుండాలి. వారిపై ఎటువంటి నియమ - నిబంధనలు వుండకూడదు. వాస్తవాన్ని ముఖా ముఖీ ఎదుర్కొనగల దృష్టి, శక్తి, మనోనిబ్బరం విద్యార్థిలో కలుగ జేయడం ఉపాధ్యాయుని విధి.

"ఈ విద్య అనేది, మహా క్షేత్రంలో ఒక మూల, ఒక చిన్న భాగాన్ని సాగు చేయడం వంటిది. ఈ రోజుల్లో ఆ విద్యను చూసుకుని, దాన్ని ఆధారంగా తీసుకుని సమస్తాన్ని విస్మరిస్తున్నారు, ఉపేక్ష చేస్తున్నారు, నిర్లక్ష్యం చేస్తున్నారు. మనం సైకలాజికల్‌గా చాలా వెనకబడివున్నాం. టెక్నాలాజికల్‌గా పురోగమించాం. కాని మన నమ్మకాలతో, దేవతలతో, జాతీయతలతో ఆదివాసుల మల్లె వున్నాం. వాటన్నింటినీ తోసేసి, ఎదురైన భయాన్ని నిర్భయంగా, ఒంటరిగా ఎదుర్కోవాలి. ఆ ఎదుర్కోవడంలో మనం చురుకుగా, మెలకువగా, త్వరగా గ్రహించేట్లుగా వుండాలి. అదే బుద్ధివికాసం. నీలోని ఆ మార్పే, సంఘాన్ని మారుస్తుంది.

"భయం ఏరూపంలో వున్నా, వికాసం సున్నా. పైగా, భయం విద్యార్థిని కుంటివాణ్ణి చేస్తుంది. ఆ సంగతి ఉపాధ్యాయుడు మొదట గమనించాలి, భయం విద్యార్థిలో చురుకుతనాన్ని చంపేస్తుంది. భయం వున్ననాడు ఇంద్రియాలు సహజంగా పనిచేయడం మానేస్తాయి. భయం అనేక నమ్మకాలకు, చాదస్తాలకు, బాధలకు, కారణమౌతుంది. కనుక 'పిల్లలు

ఏం ఆలోచించాలి ?' అని కాదు, వాళ్ళు ఎలా ఆలోచించాలో నేర్పడమే విద్య ఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యంతోనే కృష్ణమూర్తి చిన్న పిల్లలకు పాఠశాలలు స్థాపించమని ప్రోత్సహించేవారు. ఇంగ్లండులో కృష్ణమూర్తి అనుచరులు సుశిక్షుతులైన ఉపాధ్యాయులతో అటువంటి స్కూలు ఒకటి తెరిచారు.

పాఠశాలంటే. అది విద్య నేర్చుకునే చోటు గనుక పవిత్రమైనది. చర్చి - మశీదు - మొదలైన స్థలాలలో నేర్చుకోవడం వుండదు. పైగా ఆయా చోట్ల నేర్చుకోవడం ఆగిపోతుంది. అందుచేత అవి పాఠశాలలంత గొప్పవి కావు. వాటిని చేరిన వారు "మాకు విశ్వాసం వుంది. అది చాలు," అంటారు. ఆ అంధ విశ్వాసమే వారిని పూర్తిగా "నేర్చుకోవడం" అనే కళ నుంచి దూరం చేస్తుంది.

కృష్ణమూర్తి ప్రోత్సహించిన పాఠశాలల్లో పూర్తిగా నేర్చుకోవడానికే జీవితాన్ని అర్పిస్తారు; విద్యార్ధులు.

• • •

లేడీ ఎమిలీ తన ఆత్మకధ అచ్చుకు ఇచ్చేముందు కృష్ణమూర్తికి ఒక ఉత్తరం రాసింది. ఆ పుస్తకంలో తనకూ కృష్ణమూర్తికి మధ్య అన్ని సంవత్సరాలలోనూ నడచిన ఉత్తర ప్రత్యుత్తరాల్నీ, సంభాషణల్నీ, చర్చల్నీ, ఇంకా అనేకమంది సంగతులను, ఎన్నో విషయాలను ప్రస్తావనకు తెచ్చింది. అందు కొన్ని సంగతులు కొందరికి కంటకంగా, బాధాకరంగా వుండవచ్చుననే సంగతి ఆమె గమనించలేదు. కృష్ణాజీ అనుమతితో, ఆయన రాసిన కొన్ని ఉత్తరాల్ని యధాతధంగా అచ్చుకు ఇచ్చింది.

1954 లో, కృష్ణమూర్తి రెండో పుస్తకం, "THE FIRST AND LAST FREEDOM" అచ్చయింది. దానికి ఆల్డస్

హక్స్లే పరిచయం రాశారు. ఆ పుస్తకం మొదటి సంవత్సరం లోనే ఆరో ముద్రణకు వెళ్ళింది. కృష్ణాజీ ఎప్పుడూ తన పుస్తకాలను సరైన వాళ్ళకే ఇచ్చి అచ్చువేయించేవారు. అచ్చయిన తర్వాత ఆ పుస్తకాలను ఆయన చూసేవారు కాదు, చదివేవారూ కాదు

కృష్ణమూర్తి తక్కిన పుస్తకాల కన్నా, ఈ పుస్తకం ప్రపంచంలో ఎక్కువమందిని ఆకర్షించింది. అందు మనో స్పష్టతలో - విషయ విభజనలో కృష్ణాజీ ఆర్టిస్ట్‌గా దర్శనమిచ్చారు. ఆ పుస్తకం కృష్ణాజీ బోధల సారమైన ఎచ్చు. అతను ఆ పుస్తకంలో తాను గురువుగా ప్రకటించుకోడు. అసలు ఏం చేయాలో అదీ చెప్పడు. కాని, మన ముఖం ముందు ఒక అద్దం వుంచుతాడు.

హింస, ఒంటరితనం, అసూయ, ద్వేషం ఈర్ష్య - అవే కాక తక్కిన దుఃఖాలన్నింటికీ కారణాలు చెప్పి, వాటిని తీసేసుకో, లేదా, మానుకో అంటాడు. చాలామంది వాటిని తీసేసుకోరు. వాటిని పట్టించుకోకుండా వదిలేస్తారు. ఎందుకంటే, వాటిల్లో తృప్తి, సంతోషం కనపడక. "మన సమస్య ఎవరివల్లా పరిష్కారం కాదు, ఒక్క మనవల్ల తప్ప," అంటాడు కృష్ణమూర్తి.

లేడీ ఎమిలీ ఉత్తరానికి కృష్ణమూర్తి సమాధానం రాస్తో అచ్చయిన తన పుస్తకం గురించి కాని, అచ్చుకాబోయే ఆమె ఆత్మకథ గురించి కాని ఏమీరాయలేదు. కాని, ఆ వెంటనే మరో ఉత్తరం రాస్తో, "కొన్నిరోజుల క్రిందట నేను నీకో ఉత్తరం రాశాను. ఎట్టి పరిస్థితులలోనూ నీ ఆత్మకథ అచ్చువేయించవద్దు. ఎందుకంటే, ఆ పుస్తకం నీ ప్రకారం విడుదల అయితే,

నేనిప్పుడు చేస్తున్నపనికి పెద్ద అంతరాయం కలుగుతుంది. ఎంతో హాని చేస్తుంది. కొందరికి కష్టం, మరికొందరికి నష్టం కూడా కలగవచ్చు. అది అనవసరమైన, అముఖ్యమైన విషయాల్ని ప్రాముఖ్యంలోకి తీసుకొస్తుంది. ఆ పుస్తకం ఎందర్నో ఎంతగానో గాయపరుస్తుంది. చాలా విషయాల్ని తల క్రిందులు చేస్తుంది. కొందరిలో పగను, మరికొందరిలో చేదును పుట్టిస్తుంది. పైపై సంగతులతో, తాత్కాలిక ఆసక్తులతో, ఉద్రేకల్ని కలిగిస్తుంది. నీ పుస్తకం అచ్చు విషయమై నేను బాగా శ్రద్ధగా దృష్టి పెట్టి చూసిన తర్వాత దీర్ఘంగా యోచించాను. తత్ఫలితంగా అది ఎంత మాత్రం అచ్చయి బైటికి రాకూడదనేది నా నిశ్చితాభిప్రాయం అయింది.

"ఈ నా అభిప్రాయంతో నువ్వు ఏకీభవిస్తావనుకుంటున్నాను. ఈ విషయంలో నేను చాలా సీరియస్‌గా వున్నాను. ఆ పుస్తకం ప్రేమ - గౌరవాల సంగతి కేకాక, ఇంకా అనేక కారణాలకు ఎంతకీ చక్కదిద్ద శక్యంకాని హాని తెచ్చిపెడుతుంది. ఈ విషయంలో నువ్వూ, మేరీ మరో విధంగా యోచించవద్దు. ఏవిధంగానైనా సరే, నీ పుస్తకం అచ్చుకాకుండా చూడు. దాని గురించి సంకోచించకండి, సందేహించకండి, వెనుదీయకండి. ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు.

"నేనెంతో చూసి, యోచించి ఇదంతా రాస్తున్నాను. ఈ విషయంలో మీ ఇద్దర్నీ కోరి అర్థిస్తున్నాను.

ప్రేమతో
కృష్ణ.

కృష్ణమూర్తి తన తల్లికి రాసిన ఉత్తరం చదివి మేరీ వెంటనే కృష్ణమూర్తికి సమాధానం రాసింది: 'మీ ఉత్తరం చూసి అమ్మ ఎంతో కృంగిపోయింది. మానసికంగా పెద్ద దెబ్బ తిన్నట్లు కూలిపోయింది తిండి మానేసింది, నిద్రపోవడం లేదు. ఇంత పెద్ద వయసులో తట్టుకోలేని దెబ్బ తగిలిందిగావును; ఇంకొకటి ఆలోచించలేకుండా వుంది. ఆమెకు ఒక్కసారిగా పదేళ్ళు గడిచినంత పని అయింది. పబ్లిషర్స్‌కి నష్టం కలిగిందనే అభిప్రాయంతో అశాంతిగా వుంది.'

మేరీ ఉత్తరానికి కృష్ణమూర్తి జవాబు రాశారు: 'నీ ఉత్తరం. అమ్మ (లేడీ ఎమిలీ) అశాంతిగా వున్నందుకు, అశాంతి కలిగించినందుకు విచారిస్తున్నాను. పబ్లిషర్స్ బాధపడ్డా, తాను పుస్తకాన్ని అచ్చుకు ఇవ్వకుండా ఆపేసినందుకు నాకెంతో సంతోషంగా వుంది. ఏమైతేనేం అమ్మ ఆత్మకథ అచ్చుకాకుండా ఆగిపోయింది. ఇవన్నీ జరక్కపోతే అమ్మ చాలా చిక్కుల్లో పడిపోయేది.'

లేడీ ఎమిలీ ఆత్మకథ అచ్చువేయడానికి పబ్లిషర్స్ మొదటినుంచీ ఎంతో ఉత్సాహంగా, కుతూహలంగా వున్నారు. ఎందుకంటే, ఆ పుస్తకంలో కృష్ణాజీ చాలా గొప్పగా గంభీరంగా దర్శనం ఇవ్వడమే ప్రధాన కారణం. దానివల్ల తమ వ్యాపారం లాభిస్తుందనే పెద్ద ఆశతో వున్నారు. ఆ పుస్తకం అచ్చుకాకుండా ఆగిపోతే, ఆ పబ్లిషర్స్‌కు ఆశాభంగం, వ్యాపార నష్టం, బాధాకరం కావచ్చునని లేడీ ఎమిలీ బాధ. అదీ కాక, ఆ పబ్లిషర్స్‌కు ఆమె అత్యంత స్నేహితురాలు. అందుచేత ఆమె ఆజ్ఞానుసారం వారు ఆమె పుస్తకం అచ్చువేయకుండా ఆపుజేశారు.

1954 అక్టోబరులో కృష్ణమూర్తి లండన్ వెళ్ళారు. లేడీ ఎమిలీని కలుసుకున్నారు. ఆమె కృష్ణమూర్తిని చూసి, 'నువ్వు చెప్పినట్లు నేను నా పుస్తకాన్ని అచ్చుకాకుండా ఆపుజేసివుండక పోతే, నువ్వు నన్ను ఎప్పటికీ క్షమించివుండేవాడివి కాదు కదా? ఏం చేసేవాడివి? ఇంక నాతో మాట్లాడేవాడివి కాదు కదూ?' అని చిన్న పిల్లలాగ అడిగింది. దానికి కృష్ణాజీ ఆమె రెండు చేతుల్నీ తన చేతుల్లోకి ప్రేమగా తీసుకుని మౌనంగా కూర్చున్నారు.

1957 లో లేడీ ఎమిలీ ఆత్మకథ "Candle in the Sun" అనే పేరుతో అచ్చయింది. అందులో కృష్ణాజీ ఆమెకు రాసిన ఉత్తరాలూ, ఒహైలో ఆయనకు కలిగిన అనుభవ వివరాలూ చేర్చబడలేదు.



1955 లో కృష్ణమూర్తి యూరప్ వెళ్ళేముందు ఒక నెల విశ్రాంతిగా హిమాలయ ప్రాంతమైన 'రాణికెత్'లో వున్నారు. ఆ ప్రదేశం బ్రిటిష్‌వారి పాలనలో మిలిటరీ కేంద్రం. అక్కడ చిన్న చిన్న కుటీరాలు, పూలతోటలూ వున్నాయి. వేసవిలో అది ఎంతో అందంగా వుంటుంది. మోహన్ జయకర్, కృష్ణమూర్తిని ఢిల్లీనుంచి రాణికెత్‌కు కారులో తీసుకువెళ్ళారు. వెళ్ళేప్పుడు కారు ముందు సీట్లో కృష్ణమూర్తి కూర్చున్నారు. మోహన్ జయకర్ డ్రైవ్ చేశారు. వెనక సీట్లలో పుపుల్ జయకర్, మాధవాచారి కూర్చున్నారు. ఉదయం ఐదు గంటలకు ఢిల్లీనుంచి బయలు దేరారు. అక్కడకు రాణికెత్ మూడు వందల కిలోమీటర్ల దూరాన వుంది. అదంతా అందమైన ప్రయాణం. అక్కడ కృష్ణమూర్తి వుండేందుకు అచ్యుత పట్వర్ధన్ ఒక ఇల్లు ఏర్పాటు చేశారు.

దారిలో మాధవాచారి, పుపుల్ జయకర్ "Awareness" గురించి మాట్లాడుకుంటున్నారు. కృష్ణమూర్తి వెనక్కి తిరిగి, 'మీరు ఏం మాట్లాడుతున్నారు?' అని వారిని అడిగితే "Awareness - ఎరుక." గురించి అన్నారు. 'అయితే ఇప్పుడేం జరిగిందో మీకు తెలుసా?' అని మళ్ళా అడిగితే, 'మాకు తెలియదు,' అన్నారు ఇద్దరు.

"మన కారు ఒక మేకను గుద్దింది. మీరు చూడలేదా?" అన్నారు. 'చూడలేదు', అన్నారు వాళ్ళు.

"మీరేమో 'ఎరుక' గురించి మాట్లాడుతున్నారు. అయితే, ఇంక మీరు దేనికి ఎరుకలో వున్నట్లు? అదంతా వృధా సంబాషణ మాత్రమే!" అన్నారు కృష్ణాజీ.

రాణికెత్‌లో కృష్ణమూర్తితో అచ్యుత పట్వర్ధన్ కొన్నాళ్ళు వున్నారు. ఆ తర్వాత వంటవానిని వుంచి ఆయన వెళ్ళి పోయారు. కృష్ణమూర్తి ఒంటరిగా వున్నారు.



ఆ శీతాకాలంలో కృష్ణమూర్తి, రోజలిండ్ ఇండియా వచ్చారు. కృష్ణాజీతో 1949 నుంచీ ఇండియా అంతా తిరిగిన సునందా పట్వర్ధన్ కూడా వుంది. ఆమె కృష్ణాజీకి సెక్రటరీగా పనిచేసేది. ఆయన మాటల్ని షార్ట్‌హేండ్‌లో రాసుకునేది. ఆయన ఉత్తరాల్ని టైప్ చేసేది. ఆయన ఉపన్యాసాలకు, చర్చలకు, సంభాషణలకు, ఇంటర్వ్యూలకు స్థలం, సమయం నిర్ణయించేది. ఆమెను రోజలిండ్ ఎంతో ఇష్టపడి ప్రేమించింది.

కృష్ణమూర్తితో కలసి అజంతా - ఎల్లోరా - గుహలు చూడాలని రోజలిండ్ గట్టిపట్టు పట్టింది. వారితో సునంద, మాలతీ నౌరోజీ కూడా వున్నారు. అది మంచి ఎండరోజు. ఆ ఎండకి కృష్ణాజీ జబ్బుపడ్డారు.

అక్టోబరులో కృష్ణమూర్తి ఒక్కరే ఢిల్లీ వచ్చారు. ఆయన గొప్ప తేజస్సుతో వెలిగిపోతున్నారు. చాలా ఏళ్ళకి ఢిల్లీలో ఉపన్యాసాలు ఇచ్చారు. ఆ ఉపన్యాసాలకు గాంధి అనుచరులు చాలామంది హాజరయ్యారు. హాజరైనవారిలో శంకరరావుదేవ్, దాదా ధర్మాధికారి, సర్వ సేవా సంఘ సభ్యులు - వీరంతా కృష్ణమూర్తి ప్రతి మీటింగులోనూ వున్నారు. దేశంలో చాలామంది మేధావులు, విజ్ఞానవంతులు, విద్యావంతులు కృష్ణాజీని ఆత్మ సాక్షాత్కారం పొందిన మహాత్ములుగా భావించి, కొనియాడారు. వారిలో సన్యాసులు, సాధకులు, సాధువులు, రాజకీయ నాయకులు, ధనవంతులు, పారిశ్రామిక వేత్తలు, గుమాస్తాలు, ప్రొఫెసర్స్, యువకులు - అన్నిరకాల వారూ వున్నారు.

గాంధి మరణానంతరం గాంధేయవాదులు వినోబా భావే వైపు తిరిగారు. వారిలో శంకరరావుదేవ్ ఒకరు. ఆయన నిజమైన స్వాతంత్ర్య సమరయోధులు. ఆయన సత్కార్మాచరణ గావిస్తూ, సాంప్రదాయాల్ని పాటిస్తూ శేష జీవితం గడుపుతున్నారు. ఆయన ఎంతో చదివినవారు. కొల్లాయి కట్టి, గాంధీని అనుసరించి, కఠిన నియమ - నిబంధనలు పాటిస్తూ, ఉపవాసాలుంటూ, బ్రహ్మచర్యం పాటిస్తూ 1948 లో కృష్ణాజీని విని, "కృష్ణమూర్తిని అర్థంచేసుకోవాలంటే, ముందు "నేను" అనే దాని గురించి పూర్తిగా తెలుసుకోవాలి," అన్నారు.

"నేను"ను తెలుసుకోవాలనుకోవడంలోగాని, దాన్ని అవగాహన చేసుకోవాలనుకోవడంలో గాని "కాల - దూరాలు" ఇమిడి వుంటాయి. కనుక కాల - దూర రహితమైన స్థితిలోనే "నేను"ను అవగాహన చెసుకోవడానికి వీలుంటుంది," అంటారు కృష్ణాజీ.

కాలం, గతంలోంచి, విజ్ఞానంలోంచి అనుభవంలోంచి పుడుతుంది. అదే మనిషికి సైకలాజికల్ శక్తి. మనిషి ఎప్పుడూ గతానికి బానిస. కాలమంటే, వేల నిన్నల ప్రభావం, ఫలితం. అది ముందు - వెనుకలకు సాగుతూ జ్ఞాపకం మాదిరిగా వుంది.

"నేను మృత్యువుకు భయపడుతున్నాను. నాకు ఏదైనా ఒక నిశ్చయమైన, నిర్దుష్టమైన మార్గం - తరుణోపాయం - విశ్వాసం - చూపగలరా?" అని ఒకరు లండన్‌లో కృష్ణమూర్తిని అడిగితే, దానికి ఆయన.

"మీకు తెలిసినవి, మీరు పోగుజేసి దాచుకున్నవి అన్నీ మృత్యువుతో సమూలంగా తుడిచిపెట్టుకు పోతాయనీ, అసలు వాటిని వదలి పోవలసివస్తుందనీ భయపడుతున్నారు. అవునా? అందుకే అడుగుతున్నారు. వాటన్నింటినీ పూర్తిగా, ఏమీ మిగలకుండా వదిలెయ్యి. అవన్నీ పోయిన తర్వాత ఏర్పడే ఆ మహాశూన్యంతో - అగోచరంతో - అవ్యక్తంతో వుండిపోండి. అదే మృత్యువు. ఇంక వేరే మృత్యువంటూ లేదు.

"నువ్వు", అంటే - గోచరమైన, వ్యక్తమైన వాటీ అన్నింటి ఫలితంగా ఏర్పడ్డ నువ్వు. అటువంటి నీవు, నీకు తెలియని మృత్యువులోకి ప్రవేశించడం అనేది గొప్ప సంగతి. దాన్ని బ్రతికి వుండగానే నీ జీవితంలో జరగనియ్యి. మృత్యు గృహంలో ప్రవేశించడం అంటే, అదీ - నువ్వు సంపూర్ణ ఆరోగ్యంగా, ఆనందంగా, సజీవంగా వుండగానే - అందు ప్రవేశించడం అనేది జరగాలి. అది ఒక్కటే మృత్యు భయం నుంచి తప్పించుకునే మార్గం. అది ఎట్లాంటిది అని కాదు మనం చూడవలసింది. "అది సుఖప్రదమైనదా? దుఃఖభూయిష్ఠమైనదా?" అని యోచించకూడదు. అందు ప్రవేశించడమే ముఖ్యం.

మనసు క్షణ - క్షణం గతానికి, తెలిసిన వాటికి అన్నింటికీ చచ్చినట్లయితే, ఆ మనసు ఇంకెప్పటికీ దేనినీ తీసుకుని, పోగు జేసుకుని, నిలవవుంచుకోదు.

"మృత్యువు" అనేది జీవితంలో లేకపోతే, పునః స్సృష్టి లేదు.

* * *

1956 బుద్ధ జయంతికి దలైలామాను ఆహ్వానించింది, ఇండియా ప్రభుత్వం. బుద్ధునికి సంబంధించిన ప్రదేశాలలో ఆయన పర్యటన కూడా ఏర్పాటు చేసింది. ఇండియా గవర్న్మెంట్ విదేశీ వ్యవహారాల శాఖలో పనిచేసిన 'అప్పాసాహిబ్ పంత్'ను దలైలామా వెంటవుండమన్నారు. దలైలామా ఇండియా వచ్చినప్పుడు కృష్ణమూర్తీ, ఆయనా కలుసుకునే ఏర్పాటు విషయమై అప్పాపంత్ పుపుల్ జయకర్‌కు రాశారు.

అప్పాపంత్, దలైలామా ఒక పెద్ద ఎ. సి. ట్రెయిన్‌లో ఇండియా యాత్ర బయలు దేరారు. దలైలామా టిబెట్‌లో ఒక ఆధ్యాత్మిక గురువు. స్వదేశస్థులకే ఆయన దర్శనం దుర్లభం. ఆయన నిరంతరం ధ్యానంలో వుంటారు. వారి జీవితం నియమ-నిష్టలతో సాగుతుంది. టిబెట్‌నుంచి ఇండియా వచ్చిన మొదటి లామా, దలైలామా,

డిశంబరులో వారి యాత్రా ట్రెయిన్ మద్రాసు చేరింది. అప్పుడు కృష్ణమూర్తి వసంత్ విహార్‌లో వున్నారు. కృష్ణమూర్తి గురించీ, ఆయన బోధల గురించీ అప్పాపంత్, దలైలామాకు చెప్పారు. దానితో దలైలామా కృష్ణమూర్తిని తప్పకుండా కలుసుకోవాలని గట్టిపట్టు పట్టారు. ఎందుకంటే, 'కృష్ణమూర్తి,

నాగార్జునుడు మాదిరిగా వున్నారు,' అన్నారు. తన నియమ-నిబంధనల్ని, సాంప్రదాయాల్ని అన్నింటినీ పక్కకు నెట్టేసి, దలై లామా కృష్ణమూర్తిని కలుసుకున్నారు.

కృష్ణమూర్తి, దలై లామాను ఎంతో సహజంగా ఆహ్వానించి తీసుకున్నారు. వారిద్దరూ చాలా సంగతులు మాట్లాడుకున్నారు. రాజభవనం వెళ్ళాక దలై లామా కృష్ణాజీ గురించి మాట్లాడుతూ, 'గొప్ప ఆత్మ. గొప్ప అనుభవం,' అన్నారు. అని, మరొక సారి కృష్ణమూర్తిని కలుసుకోవాలన్న కుతూహలాన్ని వ్యక్త పరిచారు.



1957 వేసవిలో కృష్ణమూర్తి, రాజగోపాల్ ఇటలీలో వున్నారు. వారిమధ్య అభిప్రాయ భేదాలు తారస్థాయి నందుకున్నాయి. రాజగోపాల్ కృష్ణమూర్తినుంచి విడిపోదలచి 'ఇక నుంచి మీ పనులేవీ నేను చేయబోవడం లేదు,' అని బెదిరించాడు.

అయినా ఆ శీతాకాలం వారిద్దరూ ఇండియా వచ్చారు. కృష్ణమూర్తి ఉపన్యాసాలు ఎక్కడా ఏర్పాటు చేయబడలేదు. కృష్ణమూర్తి పుస్తక ప్రచురణ విషయాలతో తెగతెంపులు చేసుకోవాలనుకున్నాడు, రాజగోపాల్. 'కృష్ణమూర్తి సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్'కి దూరంగా వుండి, తానూ ఒక గురువు మాదిరిగా అన్నిచోట్లకూ వెళ్ళి, ఉపన్యాసాలు ఇవ్వాలనుకున్నాడు.

కృష్ణమూర్తికి దేంటోనూ ఆసక్తి లేదు. ఆయన ఏదీ బాధ్యతగా తీసుకోరు. ప్రతిదానికీ అస్పష్టంగా వుండేప్పటికి, రాజగోపాల్‌కు అలుసుగా వుండేది.

" ఫౌండేషన్ - ఫర్ - న్యూ ఎడ్యుకేషన్, "కి మాధవాచారి సెక్రటరీగా నియమింపబడ్డారు. అలాగే, ' కృషమూర్తి రైటింగ్స్ - ఇన్ కార్పొరేషన్, 'కి ఇండియా ప్రతినిధిగా మాధవాచారే నియమింపబడ్డారు. అప్పటినుంచి మాధవాచారి కృష్ణమూర్తికి ఇండియాలో శాశ్వత సహచారి అయ్యాడు. కృష్ణమూర్తి మద్రాసులో వున్నప్పుడు మాధవాచారే చూసుకునే వాడు. క్రమంగా వారిద్దరూ మంచి మిత్రులయ్యారు. మాధవాచారి రిటైరై వసంత్‌విహార్‌లో వుంటున్నారు. అక్కడ ఆయన జీవితం గొప్పగా వెలిగింది. ఆయన కృష్ణమూర్తిని క్షణం వదిలేవాడు కాదు.

1958 మొదట్లో కృష్ణమూర్తికి దగ్గు పట్టుకుంది. ఆకలీ తగ్గింది. ఆయన లేడీ ఎమిలీకి ఉత్తరం రాస్తో, " నేను ఇండియాలో పూర్తి విశ్రాంతి తీసుకుంటున్నాను. ఒంటరిగా వుండి నన్ను నేను పరిశీలించుకుంటున్నాను, పరిశోధించు కుంటున్నాను, " అన్నారు.



నిత్యానందం మరణానంతరం కృష్ణాజీ జీవితంలో అంతటి స్థానాన్ని రాజగోపాల్ ఆక్రమించుకున్నాడు. అతడు అన్ని రంగాల్లో కడు సమర్థుడు కావడంచేత, కృష్ణాజీ, తన ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం, తన పుస్తకాలు ఎడిట్ చేసి, అచ్చువేయించడం, చివరికి అన్ని వ్యవహారాల బాధ్యతలు-సర్వాధికారం రాజగోపాల్‌కు అప్పగించారు. అతను అనీబిసెంట్ ఆశీర్వాదంతో రోజలిండ్‌ను వివాహమాడి కృష్ణాజీతో వుంటున్నాడు. అటువంటి రాజగోపాల్, క్రమంగా నిరంకుశంగా ప్రవర్తించ నారంభించాడు.

శీతాకాలం చివరలో రాజగోపాల్ కృష్ణాజీ చేత లీగల్‌గా ఒక అధికార పత్రం రాయించుకున్నాడు. అప్పటివరకు "కృష్ణమూర్తి రైటింగ్స్ ఇన్‌కార్పొరేషన్ (K W I)"కి కృష్ణమూర్తే ప్రెసిడెంట్‌గా వున్నారు. కాని, ఆ డాక్యుమెంట్ ప్రకారం దాని తాలూకు సర్వహక్కులూ రాజగోపాల్‌కు అప్పగించబడ్డాయి. రాజగోపాల్ ఏం చెపితే, అది చేశారు, కృష్ణాజీ. ఎక్కడ సంతకం పెట్టమంటే అక్కడ పెట్టారు. రాజగోపాలంటే, కృష్ణమూర్తికి అంత ప్రేమ, విశ్వాసం. అందుచేత అతనికి సర్వహక్కుల సమర్పణ పత్రం ఒకటి రాసి ఇచ్చారు: 'ఇది నా వ్రాత మూలకమైన సర్వహక్కుల సమర్పణ పత్రం. ఈ రోజునుంచి - చివరివరకు - నా గత రచనలు యావత్తూ - ముందు రాబోయే నా రచనలకు K.W I కి సంబంధించిన అనుబంధ సంస్థలైన అమెరికా, ఇండియా, ఇంగ్లండులలో గల సంస్థలకు సహితం రాజగోపాల్‌కు సర్వాధికారాలు అప్పగిస్తున్నాను. ఇకనుంచి అతను K W I కి ప్రెసిడెంట్‌గా వ్యవహరిస్తాడు, సర్వహక్కులతో. అతను నా ఉపన్యాసాలు, ప్రయాణాలు, నా పుస్తకాల ప్రచురణలు - నాకు సంబందించిన సమస్త కార్యక్రమాలు అతను స్వయంగా, స్వతంత్రంగా నా తరపునా, పబ్లిషర్స్ తరపునా కాంట్రాక్ట్స్, అగ్రిమెంట్స్ తీసుకునే అధికారం ఇవ్వడమైనది,' అని రాసి ఇచ్చారు.

ఆనాటినుంచి రాజగోపాల్ కృష్ణమూర్తి విషయంలో తానే తుదినిర్ణయం తీసుకుని, సర్వాధికారిగా వ్యవహరించనారంభించాడు.

కృష్ణమూర్తి రచనలు అచ్చుకావడానికి ఎన్నో చందాలు వచ్చాయి. ఎంతో డబ్బు కూడింది.

• • •

మాధవాచారి, కృష్ణమూర్తి ఢిల్లీ వెళ్ళారు. అక్కడనుంచి వారణాసి వెళ్ళారు. అక్కడనుంచి రాణికెత్ వెళ్ళి, ఆ వేసవి అక్కడ గడపాలనుకున్నారు. ఆ సంగతి పుపుల్ జయకర్‌కి రాస్తే, 'నా భర్తకు గుండెజబ్బుగా వుంది. ఆయన్ని వదలి నేను రాలేను,' అని సమాధానమిచ్చింది.

కృషమూర్తి, మాధవాచారి రాణికెత్ వెళ్ళారు. అక్కడ కృష్ణమూర్తి ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ కాలం గడిపాడు. సాయంత్రాలు సంస్కృత శ్లోకాలు చదువుకునేవాడు. వాటిల్లో పురుష సూక్తం, దక్షిణామూర్తి స్తోత్రం, ఆ రెండూ ఆయనకు ఎంతో ఇష్టం. అక్కడ అవసరమైన వారికి, యువకులకు యోగాసనాలు నేర్పేవాడు. వారికి ఎన్నో నిత్యజీవిత సత్యాలు వివరంగా చెప్పి, నడిపించేవాడు. మాధవాచారి ఏదో పనిమీద మద్రాసు వెడితే, కృష్ణమూర్తితో వుండటానికి ఢిల్లీనుంచి మురళీరావు వెళ్ళి, కొన్నాళ్ళువుండి కృష్ణమూర్తిని రాణికెత్ నుంచి తీసుకొచ్చాడు.

ఆ సంవత్సరం "బెన్‌హర్" ఫిలిం ప్రొడ్యూసర్ 'సామ్ జింబాలిస్ట్' మరణించారు. ఆయన భార్య "మేరీ జింబాలిస్ట్" కృష్ణాజీ స్నేహితురాలై, ఆయన వెంట తిరుగుతూ, ఆయనకు సేవలు చేస్తూ వుండేది. ఆమె చాలా అందగత్తె ఆమె చాలా వరకు కృష్ణాజీ సెక్రటరీగా పనిచేసేది.



1960 నాటికి కృష్ణమూర్తి చేపట్టిన కార్యక్రమాలకు బహుమానం రూపంలో కావలసినంత సొమ్ము చేరింది. ఆ సొమ్మంతా రాజగోపాల్ అధీనంలో వుంది. కృష్ణమూర్తి మిత్రుడొకడు అది గమనించి, "పోగైన డబ్బు సంగతి ఏమిటి ? దాని పరిస్థితి ఏమిటి ?" అని కృష్ణమూర్తిని అడిగాడు. ఆ డబ్బు సంగతి

తనకు తెలియక, తెలియపరచమని రాజగోపాల్‌కు రాశారు, కృష్ణమూర్తి - "ప్రస్తుతం మన ఆర్థిక పరిస్థితి ఏమిటి?" అని. ఎన్నడూ లేనిది కృష్ణమూర్తి అకస్మాత్తుగా, 'ప్రస్తుతం మన ఆర్థిక పరిస్థితి ఏమిటి? అది ఎట్లా వుంది? పుస్తకాల అచ్చు - అమ్మకంపగైరా విషయాల గురించి వీలైనంత త్వరలో వివరంగా తెలియపరచగలవు;' అని రాసేప్పటికి, రాజగోపాల్ ఆశ్చర్యపోయి తనను అడిగారని అభిమానపడి, మథనపడి, అవమానించినట్లు బాధపడి కృష్ణమూర్తికి సరైన సమాధానం చెప్పడానికి నిరాకరించాడు. తనను అడిగినందుకు కృష్ణాజీని నిందించాడు, రాజగోపాల్. అసలు ఆ విషయం కృష్ణమూర్తికి సంబందం లేనట్లే ప్రవర్తించాడు. "పోనీ, ట్రస్టీలను సమావేశపరచు. చర్చించుకుందాం," అని కృష్ణాజీ మళ్ళా రాసినా, అతను ఒప్పుకోలేదు. చివరకు ఆ వ్యవహారం బిగుసుకుపోయింది.

కృష్ణమూర్తి విషయమై రాజగోపాల్ చేతులు కడుక్కోవడానికి ప్రయత్నించి, ఉభయ మిత్రురాలైన "మిస్ డోరిస్ ప్రాట్,"ను అడగమన్నాడు. ఆమె లండన్‌లో వుంటుంది. రాజగోపాల్ సూచన ప్రకారం కృష్ణమూర్తి ఆమెకు ఒక ఉత్తరం రాశారు, "ట్రస్ట్ సమావేశాలు ఏర్పాటు చేయండి," అంటూ.

ఈలోగా రాజగోపాల్ కృష్ణమూర్తిని బహిరంగంగా నిందించనారంభించాడు. ఏవిధంగానైనా వ్యవహారం చక్కబెట్టమని మిస్ డోరిస్ ప్రాట్, రాజగోపాల్‌కు రాసింది.

కృష్ణమూర్తి మళ్ళా మిస్ డోరిస్ ప్రాట్‌కు ఒక ఉత్తరం రాశారు, "నా గురించిన సమాచారం, రాజగోపాల్‌కు తెలియపరచ నవసరం లేదు,'' అని. అలాగే రాజగోపాల్‌కూ, 'త్వరగా

మన ట్రస్ట్ తాలూకు ఆర్థిక వ్యవహారాలు తెల్చి, చెప్పు. నా ఉత్తరం తక్కిన ట్రస్టీలకు చూపించు,' అని. అతను ఆ ఉత్తరాన్ని ట్రస్టీలకు చూపలేదు. ఆ వ్యవహారం చక్క బెట్ట లేదు. కృష్ణమూర్తికి సమాధానం రాయలేదు.

కని, కృష్ణమూర్తి ఇండియా వచ్చాక జమా - ఖర్చుల కాగితం ఒకటి తలా తోకా లేనిది తయారుచేసి పంపించాడు, రాజగోపాల్. దాన్నిచూసి ' రాజగోపాల్ని నమ్మి నా విషయమై ఏం చేయడానికీ సర్వహక్కులూ అతని చేతిలో పెట్టాను,' అన్నారు కృష్ణమూర్తి, మిత్రులతో.

1960 మార్చిలో కృష్ణమూర్తి యూరప్ వెళ్ళారు. ఆయన "రోమ్" చేరగానే జబ్బుపడి, 'జూరిచ్'లో ఆసుపత్రిలో చేరారు. వారు ప్రత్యేక శ్రద్ధ వహించి, కృష్ణాజీకి వైద్యం చేశారు.

• • •

ఆ ఏప్రిల్‌లో పూనా - బొంబాయి మధ్య నున్న 'లోనా వాలా' అనే కొండపక్క గ్రామంలో ఓ పరిచారకునితో కలసి కృష్ణాజీ వున్నారు. మిత్రులు అక్కడకు వెళ్ళి ఆయన్ని చూసేవారు.

మే లో కృష్ణమూర్తి, మాధవాచారి ' పరమేశ్వరన్ ' అనే వంటవానితో శ్రీనగర్ వెళ్ళారు. మొదటిరోజు బోట్ - హౌస్‌లో వున్నారు. అక్కడనుంచి "ఆచి బాల్ "లో వున్నారు. అది ఓ ప్రాచీన నిర్మాణం.

కొన్నాళ్ళ తర్వాత తన పిల్లలకు జబ్బుగా వుందని మాధవాచారి మద్రాసు వెళ్ళిపోతే, కృష్ణమూర్తితో వుండటానికి పుపుల్ జయకర్ వెళ్ళింది. కృష్ణమూర్తికి దగ్గరలో ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకుంది.

కృష్ణమూర్తి రోజూ ఉదయం యోగాసనాలు, ప్రాణాయామం చేసేవారు. ఆ యోగాసనాలను పూనాలో ఒక అయ్యంగారి దగ్గర నేర్చుకున్నారు. మూలికల కషాయం తాగేవారు. ఆ ప్రదేశాన్ని ఎంతో ఇష్టపడ్డారు, కృష్ణాజీ. మామిడి పళ్ళు ఇష్టంతో తినేవారు.

ఉభయ సంధ్యల్లో కృష్ణమూర్తి షికార్లు వెళ్ళేవారు. ఇంగ్లీషు కవిత్వాలు, సంస్కృత శ్లోకాలూ బిగ్గరగా చదివేవారు. ఆ కొండల్లో ఒకటే నడిచేవారు. పుపుల్ జయకర్ తరచు శ్రీనగర్ వెళ్ళి, ఏవేవో సరకులు కొని తెచ్చేది. వాటన్నింటినీ కృష్ణమూర్తి సంతోషంతో చేతులోకి తీసుకునేవారు.

"ఒక మహాత్మునితో కలసి వుండటం, నిరంతరం తనను తాను తెలుసుకోవడం - పరిశీలించుకోవడం, పరీక్షించుకోవడమే అవుతుంధి," అంటుంది పుపుల్ జయకర్.

1960 ఆగస్ట్ పదమూడవ తేదీన ఆచార్య వినోబాభావే కృష్ణమూర్తిని కలుసుకున్నారు. "వారితో విమలదేశపాండ్య" అనే ఆమె వున్నారు. ఆమె వినోబా ఆశ్రమ వాసిని. ఆయనకు ఆమె కొన్నాళ్ళు సెక్రటరీగా పనిచేశారు. ఆయనతో కలసి పాదయాత్రలు చేసింది. ఆయన ప్రసంగాల్ని, ఆయన పెద్దల్ని కలుసుకున్నప్పుడు జరిగిన సంభాషల్ని నోట్ చేసుకునేది. అలాగే ఆయన కృష్ణమూర్తిని కలుసుకున్నప్పటి సంభాషణలను కూడా రికార్డు చేసింది :

వినోబాభావే : 'మీ వయస్సెంత?' అని కృష్ణమూర్తిని అడిగారు.

కృష్ణమూర్తి : 'అరవైనాలుగు' అన్నారు.

వి : మీరు నా సోదరుని వంటివారు. మీకు నా గౌరవాభివందనాలు అర్పించి, మీ ఆశీస్సులు పొందడానికి వచ్చాను. మీగురించి శంకరరావ్‌దేవ్, దాదాధర్మాధికారి, విమల, అచ్యుత పట్వర్ధన్ మొదలైనవారు చాలాసార్లు చెప్పారు. నేను ఎప్పుడూ తిరుగుతూ వుంటాను. మీరూ అంతేకదా? కనుక మనం కలుసుకోలేక పోయాం. ఇప్పుడు నాకేమైనా చెప్పండి.

కృష్ణమూర్తి ఇబ్బందిగా వుండిపోయారు.

వి : అయితే ఇప్పుడు మనం ఏం మాట్లాడుకుందాం? అసలు సంభాషణ ఎలా ప్రారంభించాలి?

కృ : అది మీ అభిరుచి మీద ఆధారపడి వుంటుంది.

వి : అంటే, జీవితం గురించా? ప్రతి ఒక్కరికీ జీవితమంటే ఇష్టమే! కాని, సంభాషణ – చర్చ అనేది మాటల మీద ఆధారపడి వుంటుంది. వాటికి మాటలే కావాలి.

కృ : మరీ ఎన్నో మాటలు కాదు కాని, అసలు మాటలు లేక పోతే, చర్చ చప్పగా వుంటుంది.

వి : అనుభవాలు మనిషిని హద్దుల్లో పెడతాయి కదూ ?

కృ : నిశ్చయంగా పెడతాయి. కనుక నిత్యజీవిత అనుభవాలకు చావాలి మనకు అనుభవశూన్యమైన మనసు కావాలి. ఎందుకంటే, మనసు ప్రతి అనుభవాన్నీ గతంగా మార్చుకుని, మాటల రూపంలో దాచుకుంటుంది.

ఆ పద్ధతి పోవాలి. దేనికైనా గత భారంలేని మనసు కావాలి. దానికి స్వేచ్ఛ ముఖ్యం.

వినోబాభావేతో వచ్చిన వారెవరూ, కృష్ణమూర్తిని ఏమీ ప్రశ్నించలేదు. వారిని కూడా ప్రశ్నలు అడగమని వినోబా చెప్పినా వారు అడగలేదు. "మన వారు ప్రశ్నించరు, చర్చిస్తారు," అన్నారు వినోబా, చమత్కారంగా.

వి : మీరు ఇండియాలో ఎన్నాళ్ళు వుంటారు ?

కృ : ఆరు నెలలు.

వి : వ్యాయామం ఏమైనా చేస్తారా ?

కృ : నడుస్తాను.

"ఆత్మ సాక్షాత్కారమంటే ఏమిటి ?" అని వినోబా శిష్యుల్లో ఒకరు కృష్ణమూర్తిని ప్రశ్నించారు.

కృ : అంటే, మీ ఉద్దేశ్యం ఏమిటి ? దాని గురించి మీ అభిప్రాయం ఏమిటి ?

వి. శిష్యుడు : భగవంతునిలో ఐక్యం కావడం.

కృ : 'దైవం' ఒక మాట మాత్రమే. భగవంతుణ్ణి తెలుసుకోవడానికి స్వేచ్ఛతో కూడిన స్వచ్ఛమైన మనసుకావాలి. అంటే, ఎవరినీ, దేనినీ, ఎప్పుడూ అనుసరించని, అర్థించని

మనసు కావాలి. అంటే, మంచి మనసు కావాలి. ఆ మనసుకు గురువు వుండ కూడదు. ఆ మనసు ఏపద్ధతినీ అనుసరించ కూడదు. ప్రయత్నించి చూడండి.

వి. శిష్యుడు : అటువంటి మనసు ఎలా సాధ్యం?

కృ : ప్రతి ఒక్కరికీ తమను గురించిన అవగాహన వుండాలి. "ఒకరు ఎలా ఆలోచిస్తారు? అసలు ఎందుకు ఆలోస్తారు? ఎలా పనిచేస్తారు? అసలు ఆ ఒక్కరూ అనే వారు ఎవరు? అంటే, "నేనెవరు?" ముందు ఆ సంగతి తెలుసుకోవాలి. దానికి కావలసింది విప్లవాత్మకమైన మనసు. అటువంటి మనసును ఒక పద్ధతిని సాధించ వీలుకాదు. మీరు ఒక చిన్న కిటికీలోంచి చూస్తే, మీ దృష్టి పరిమితంగానే వుంటుంది. దృష్టి విశాలం కావాలి.

మరొక శిష్యుడు : దాన్ని బోధించడం ఆధ్యాత్మికానికి అసాధ్యమా?

కృ : సరైన ఆలోచనా విధాన మంటూ ఒకటి వుంది. కాని, అది నిజంగా కావాలని ఎవరు వింటారు?

వి : బహుశా, అదేదో మీరు బోధిస్తారని అతను చూస్తున్నాడను కుంటాను.

కృ : నేనా? అయ్యో! నేను మాట్లాడతాను. అంతే! మాట్లాడటమే నా పని, నా జీవితం. మీరు దాన్ని కూడా ఒక పద్ధతిలో, సాంప్రదాయం ప్రకారం మాట్లాడ మంటున్నారా?

వి : మిమ్మల్ని మీ పద్ధతిలోనే చెప్పమంటున్నాడతను.

కృ : అయ్యో? మీ మార్గం–నా మార్గం, అతని మార్గం అంటూ, లేదు. ఉన్నది ఒక్కటే మార్గం. నేను ఒక పద్ధతిలో

యోచిస్తాను. మీరు ఒక పద్ధతిలో ఆలోచిస్తారు. దాన్నం తనీ మనం తప్పుదారిలో పెడతాం. కాని, ఏమైనా ప్రతి ఒక్కరూ స్వేచ్ఛగా వుండాలి. భగవంతుని గురించి మాట్లాడటానికి మనిషి ముందు స్వేచ్ఛగా వుండాలి. కమ్యూనిస్టులంటారు, "దేవుడు లేడు," అని. 'దేవుడు వున్నాడు,' అని మీరంటారు. ఆ విషయంలో మీరు ఇద్దరు చెప్పేదీ ఒక్కటే. మీరు, నాది, వారిది అంటూ విన్నమైన విధానాలంటూ లేవు. ఉన్నది ఒక్కటే విధానం.

వి : మీరు ఈ విధంగా అమెరికాలో మాట్లాడితే వారికి బాగా నచ్చుతుందనుకుంటాను ?

కృ : పాశ్చాత్య దేశాల్లో-శాంతి కోరే దేశాలవారు సాధ్యమైనంత వరకు తక్కువ మాటల్నే ఇష్టపడతారు. ఇక్కడ - ఇండియాలో ప్రజలు మతంలోకి మారిపోయినట్లు, అక్కడ - పాశ్చాత్య దేశాల్లో ప్రజలు, నమ్మకాల్లోకి, విశ్వాసాల్లోకీ, క్రైస్తవ మతంలోకీ జారిపోతారు. తేడా ఏముంది ? ఇండియాలో ఆర్థిక సంస్కరణ ముఖ్యం. నిజమైన సంస్కర్తకు మతాలతో ప్రమేయం లేదు. నేను సంస్కరణకు వ్యతిరేకిని కాను.

యూరప్‌లోని కమ్యూనిస్టులు కొంతవరకు నాలో చాలా ఆసక్తి చూపుతారు. కేథలిక్స్ కూడా. అలాగే కొందరు హిందువులూనూ. నేను ఇండియాలో వున్నా, అమెరికాలో వున్నా, యూరప్‌లో వున్నా నేను ఎప్పటికీ కొత్తవాడినే! ఇండియాలో వున్నది "రాజకీయం" ఒక్కటే! ఎందు చేత ఇండియాలో ఏదీ లోతుగా పాతుకుని వ్యాప్తి చెందడం లేదు ?

ఇండియాలో చాలామంది ఆలోచనాపరులు. వారంతా సంస్కరణవైపు తమకు తాముగా ఎందుకు పరుగులు తీస్తున్నారు ? "సంస్కరణ" అనేది చాలా చిన్న సంగతి. అల్పమైనది కూడాను. అల్పం, స్వల్పం అయిన "సంస్కరణ"లో అధికం, ఔన్నత్యం, ఉన్నతం అయినది ఎప్పటికీ కలవదు. కాని, గొప్ప దాంట్లో, 'స్వల్పం' చేరవచ్చు.

వి : ఆధ్యాత్మిక దృష్టికల పెద్దలంతా ఎందుకు తమకు తాముగా సంస్కరణలను చేపడతారు ? ఆ సంస్కరణ విధానం బలీయమైన, లోతైన, శక్తివంతమైన విప్లవం దగ్గరకు వారిని తీసుకుపోదు. ఈ విషయంలో మీరేమంటారు ?

కృ : "నిశ్చయమని ముగించకండి. ఇంకా పరిశీలించండి, పరిశోధించండి, పరీక్షించండి," అంటాను. ఇండియా మనస్తత్వంలో గట్టి విరుద్ధాభిప్రాయం వుంది. ఆదర్శాలు మాట్లాడతారు. తద్భిన్నంగా ప్రవర్తిస్తారు. నేనేమంటానంటే, "ముందు, పనిచెయ్యండి, తర్వాత దానివల్ల వచ్చే ఫలితాన్ని పరిశీలించండి," అని. కాని, సాంప్రదాయవాదులు, గురువులు భిన్నంగా చెపుతారు. అందుచేత ఈ దేశంలో అంతా నిష్ఫలమైపోయినట్లు బాధపడతారు. లేదా, విరుద్ధాభిప్రాయాలతో వుంటారు. "ఈశ్వరాన్వేషణ" అంటూ చేస్తారే కాని, అసలైన జీవితాన్ని జీవించరు. అందుచేతనే భారతీయులు పైపై సంగతులవైపు తిరుగుతారు కాని, లోతుగా వెళ్ళరు. ఆ పైపై సంగతులే, వారి "సంస్కరణ".

వి : యూరోపియన్స్ మిమ్మల్ని బాగా గ్రహిస్తారనుకుంటాను? మిమ్మల్ని తెలుసుకుని, తీసుకుంటారను కుంటాను ? మీ ఆలోచనా విధానాన్ని వారు బాగా ఆకళింపు చేసుకుంటా రనుకుంటాను ?

కృ : ఇండియాలో మాదిరిగానే అక్కడాను. కొందరుసీరియస్‌గా వుంటారు. కాని, ఇండియాలో రాజకీయాల్ని సీరియస్‌గా తీసుకుంటారు. రాజకీయాలు వినాశనకరమైనవి. "నేను సంస్కరణకోసం, శాంతికోసం పనిచేస్తాను," అని అంటే, అందులో 'నేను' అనేది ప్రాముఖ్యం వహిస్తుంది. రాజకీయాల్లో ప్రవేశించిన వారికి స్వచ్ఛమైన, నిర్మలమైన, నిష్కల్మషమైన మనసు వుండటానికి వీలులేదు. కాని, ప్రపంచం కోరేది పవిత్రమైన మనసును - సంతోషకరమైన, నిర్భయమైన మనసును. కాని, షరతులు ఏర్పరచుకున్న మనసు కాదు. అంటే, 'నేను హిందువును. నేను క్రైస్తవుడను. నేను ముస్లింను,' అనే మనసు వుండకూడదు.

"నేను హిందువును," అని అనుకుంటే నిజంగా మీరు దేనినీ, ఎవరినీ, ఎప్పుడూ ప్రేమించలేదు. ప్రేమకు స్వేచ్ఛ కావాలి.

ఒక రోజున ఒక సన్యాసి అమర్‌నాథ్ వెడుతూ నన్ను చూడ్డానికి వచ్చారు. సాధువులలో, సన్యాసులలో అనేక తెగలు, శాఖలు వున్నట్లు చెప్పారు. 'వాళ్ళేం చేస్తారు?' అని నేను ఆయన్ని అడిగాను. "ఏమీ చేయరు. కాని, వారికి ఈశ్వరుడు తెలుసు. వారు ధ్యానం చేసుకుంటూ ఒంటరిగా జీవిస్తారు" అన్నారు.

"వారు విశ్వాసాల, నమ్మకాల, బరువులు మోస్తో వారు ఎప్పటికీ స్వేచ్ఛగా వుండలేరు. ఒంటరిగానూ వుండలేరు;" అన్నాను. అని, "మీరు పూర్తి ఒంటరిగా వుండి, అసలు సత్యాన్ని మీకు మీరే తెలుసుకోవాలి. గురువుల మీద, సాంప్రదాయాల మీద ఆధారపడ్డవారు ఒంటరిగా

వుండటం అసాధ్యం, కష్టం కూడాను," అని వినోబాభావే చుట్టూ వున్నవారిని చూసి, "వీరంతా మీ అనుచరులా ? అలా అయితే చాలా చెడ్డ సంగతి," అన్నారు.

వి : నాకు తెలియదు ; వారు నన్నెందుకు అనుసరిస్తున్నారో?

కృ : ఇండియాలో గురుపీఠంకోసం కోర్కెపడతారు. ఆశపడ తారు కూడాను. ప్రతి ఒక్కరు తమ అన్వేషణే, సాధనే అద్వితీయమైనదని భావిస్తారు. వారి సాధన ఈశ్వరా న్వేషణతో ముడిపడి వుంటుంది.

వి : అన్వేషణకు ఒక ఉద్దేశ్యం అంటూ వుండదంటారా? ఈశ్వరసాక్షాత్కారానికి అన్వేషించనవసరం లేదా?

కృ : అలా అన్వేషణద్వారా కాకపోతే, అదొక అముఖ్యమైన దైవమే అవుతుంది, వారికి. ఈశ్వరసాక్షాత్కారంకోసం ప్రజలు అమర్‌నాథ్ వెడతారు. అంటే ఏమిటి? మనం దైవదర్శనార్థం ప్రేమని, అందాన్ని, సౌందర్యాన్ని, వ్యక్తిగత ఆలోచనా విధానాన్ని, తెలివిని, భావోద్రేకంతో కూడిన ఆరాటాన్ని అణచేస్తున్నామన్న మాట. వాటి స్థానంలో అధికారాన్ని, పద్ధతిని అంగీకరించి తీసుకుంటాం. అసలు సత్యాన్వేషణకు మన మనసును పోనివ్వము. ఈశ్వరదర్శనార్థం 'మనం తప్పకుండా కాషాయం కట్టు కోవాలి. సెక్స్‌ని నిరాకరించాలి. ఇంద్రియాల్ని అణచాలి,' అని ప్రకృతిని, పరిసరాల్ని చూడ్డం మానేసి హద్దుల్లో, నిబంధనల్లో వుంటాం. అప్పుడు మనం చేసే ధ్యానం వశీకరణకోసం చేసే మంత్రవిద్యే అవుతుంది.

"దేశపురోభివృద్ధి విషయంలో మతం యొక్క స్థానం ఏమిటి?" అని భావే అనుచరుల్లో ఒకరు కృష్ణాజీని అడిగారు.

కృ : దేశమంటే ఏమిటి? ప్రజలంటే ఏమిటి? సంఘ మంటే ఏమిటి? అది సాంఘిక, సాంస్కృతిక సంబంధమా? అటువంటి సంబంధంలో మార్పువస్తే, సంఘమూ మారు తుంది. నిజజీవితంలో వాస్తవాన్ని, దాని సంబంధాన్ని కనుక్కోవడం, తెలుసుకోవడం, అవగాహన చేసుకోవడమే మతం. ఈ రోజుల్లో ప్రతి ఒక్కరూ, 'నేను హిందువును. నేను ముస్లింను. నేను క్రైస్తవుడను,' అంటున్నారే కాని, "నేను మానవుణ్ణి" అనడం లేదు. మానవ సమస్యకు చేతులు కలపడం లేదు. పైగా భూమిని ఆటం బాంబులతో ధ్వంసం చేస్తున్నారు. ఇవి చాలా గట్టి సమస్యలు. ఆ సమస్యల్ని పరిష్కరించడానికి నిజమైన వారు ఈ భూమి మీద కనీసం ఆరుగురు కూడా లేరు.

వి : కాని, ఇండియా పూర్వం మాదిరిగా కాక ఇప్పుడు కొత్త భావాలను ఆకళింపుజేసుకోవడానికీ, జాతీయ వాదాన్ని వదలివేయడానికీ, సంకుచిత జీవితంనుంచి బయటపడ డానికీ చూస్తోంది.

కృ : నాకూ తెలుసు. ఇంకా మార్పురావాలి. ఇండియాలో యాంత్రిక జీవనం అలవాటైపోయింది. చాలామంది జీవితంలో దాన్నే కోరుతున్నారు ఆ లక్ష్యాన్ని చేరుకోవ డానికి మార్గాల్ని అనుసరిస్తున్నారు. అసలు వారెప్పుడూ ప్రశ్నించరు. చాలా మర్యాదస్తులుగా వుంటారు. కాని, ప్రతి ఒక్కరికీ స్వేచ్ఛాయుతమైన మనసు అవసరం. సాంప్రదాయాలతో గతభారంతో కూడిన మనసు కాదు. ఎంతో స్వేచ్ఛరావాలి. కాని, 'నేను స్వేచ్ఛగా వున్నాను' అని అనుకున్న క్షణంలోనే "నువ్వు స్వేచ్ఛగా లేవు". కనుక మనసును రగల్చాలి. ప్రతి ఒక్కరూ తమను

తాము లోతుగా తవ్వి చూసుకోవాలి. తాము వేసుకున్న ముడులు, తామే విప్పుకోవాలి. మనసు మూలల్లోకి వెళ్ళి, లోతుగా మునిగి తెలుసుకోవాలి.

వి : మీరు ఒక సంవత్సరంనుంచి ఉపన్యాసాలు ఇవ్వడం లేదని విన్నాను.

కృ : అవును, ఇవ్వడం లేదు. నేను వూరికే వున్నాను. అంటే, నేను ఉపన్యాసాలు ఇవ్వనని ఎటువంటి ప్రమాణమూ చేయలేదు. బహిరంగ ఉపన్యాసాలు ఇవ్వకూడదని నిశ్చయించుకోనూ లేదు.

వి : ఈ రోజు మిమ్మల్ని కలుసుకోవడం నాకెంతో సంతోషంగా వుంది. ఈ రోజుకోసం చాలా కాలంగా ఆశతో ఎదురు చూస్తున్నాను మీకేమైనా ఇండియన్ భాషలు వచ్చునా?

కృ : హిందీ నేర్చుకోవాలనుకున్నాను. నా మాతృభాష తెలుగు. నేను చిన్నప్పుడే తెలుగు మాట్లాడటం మానేశాను.

వి : మీరు మరీ అంత ముసిలివారు కాదు, భారతీయ భాషలు నేర్చుకోవడానికి.

కృ : సంస్కృతం నేర్చుకోవాలనుకుంటున్నాను. అది అందమైనభాష. అద్భుతమైన భాష. లాటిన్, సంస్కృతం ఒకే కుటుంబానికి చెందినవి.

ఆ రోజు సమావేశం ముగిసేముందు కృష్ణమూర్తి, వినోబాభావే చాలా సంతోషంగా ఒకరికొకరు నమస్కారాలు చేసుకున్నారు,

వినోబాజీ ఆహ్వానంపై కృష్ణాజీ 1960 ఆగస్ట్ పధ్నాల్గవ తేదీన ఆయన్ని చూడ్డానికి వెళ్ళారు. వినోబాజీ తన భూదాన

యజ్ఞం గురించి ఆయనకు చెప్పారు. ఆ తర్వాత వినోబాజీ, 'నిన్నటి మన సంభాషణ నన్ను ప్రభావితుణ్ణి చేసింది. నన్ను ప్రజ్వలింపజేసింది. ఆ ఆలోచనలు నన్ను కాంతివైపు తిప్పాయి. నేను గాంధీగారిని కలవక పూర్వం అంటే, నా ఇరవయ్యో ఏట, గాంధీగారిని చూశాను, విన్నాను. ఆయన నాకు గాని, ఎవరికి గాని తన ఆలోచనల్ని అంగీకరించమని అడగలేదు,' అన్నారు వినోబాజీ.

కృ : మంచి సంగతి.

వి : మీరు గాంధీగారిని కలుసుకున్నారనుకుంటాను ?

కృ : మూడుసార్లు కలుసుకున్నాను. ఒకసారి లండన్‌లో అనీబిసెంట్‌తో కలుసుకున్నాను.

వి : చదువుకోవడానికి నాకు వ్యవధిలేదు. కాని, చదువుతున్నాను.

కృ : నేనేం చదవను. అప్పటికి అక్కడ వున్న ఒకటి రెండు మామూలు పుస్తకాలు తప్ప, నేనూ చదవను. మీరు చాలా పొద్దుటే లేస్తారనుకుంటాను ?

వి : నాలుగున్నరకి. రోజుకి పదిమైళ్ళు నడుస్తాను. మీరు పుస్తకాలు రాశారా ?

కృ : రాశాను.

వి : వాటిని ఎవరు అచ్చువేస్తారు ?

కృ : సంభాషణలు, చర్చలు ఇండియాలో అచ్చవుతాయి.

వి : భూదాన ఉద్యమంలో పనిచేసే చాలామంది మీ పుస్తకాలు చదువుతారు.

కృ : ఆ సంగతి శంకరరావుదేవ్, అచ్యుత పట్వర్ధన్ చెప్పారు.

ఆ తర్వాత వారిద్దరూ ఒకరికొకరు నమస్కారాలు చేసుకుని వెళ్ళిపోయారు.

ఆగస్ట్ పద్నాల్గో తేదీన "పహిల్‌గామ్"లో వినోబాజీని వినడానికి వచ్చిన జనసమూహానికి ఆయన ఉపన్యాసం భిన్న ధోరణిలో సాగడం, కృష్ణమూర్తి ప్రభావమనుకున్నారు.

కృష్ణమూర్తి వంటి వ్యక్తులు, కాపలాదారులు వంటివారు వారి మాటలు, బోధలు, ప్రకటనలు, హెచ్చరికలు విని పాటించాలి. వాటిని ఆకర్షణతో విని, ఆచరణలో పెట్టాలి.

కొన్ని నెలల తర్వాత "వినోబాభావే నన్ను ఒప్పుకుని, అంగీకరించి తనపని ఎప్పటి మాదిరిగా చేసుకుపోతున్నారు. ఇంకనన్ను అంగీకరించడంలో అర్థం లేదు," అని కృష్ణమూర్తి అన్నారని ఎవరో వినోబాభావేతో చెపితే, 'అవును, నిజమే! కృష్ణమూర్తి అన్నది' అని ఆయన ధైర్యంగా ఒప్పుకున్నారు.



ఆగస్ట్‌లో కృష్ణమూర్తి ఆరోగ్యం బాగాలేదు. జ్వరం - మూత్రపిండాలు దెబ్బతిన్నాయి. బాగా నీరసించిపోయారు. పహిల్‌గామ్‌నుంచి మాధవాచారి కృష్ణమూర్తిని ఢిల్లీ తీసుకొచ్చారు. అక్కడ డాక్టర్లు పరీక్ష చేసి 'కిడ్నీ ఇన్ఫెక్షన్' అని ANTIBIOTICS ఇస్తే, వాటికి ఆయన శరీరం తట్టుకోలేకపోయింది. కొన్ని రోజులు ఇబ్బంది పడ్డారు.

కిట్టీ శివరావులు భక్తి, శ్రద్ధలతో కృష్ణమూర్తికి సేవలు చేశారు. ఆయన త్వరలో కోలుకున్నారు. తర్వాత శ్రీనగర్ వెళ్ళి "దాల్‌లేక్" ఒడ్డున ఒక అందమైన కుటీరంలో వున్నారు. అక్కడి చల్లని వాతావరణం, చుట్టూ తేమవల్ల కృష్ణమూర్తికి కీళ్ళ నొప్పులు వచ్చాయి. వంట అతను పరమేశ్వరన్ సహాయంతో మాధవాచారి కృష్ణమూర్తికి సేవలు చేశాడు.

ఆ తర్వాత కృష్ణమూర్తి హోమియో మందులు వాడారు. ఆ మందులు ఆయన ఒంటికి సరిపడ్డాయి.

శ్రీనగర్‌లో లక్ష్మణ్ ఝూ కృష్ణమూర్తిని విని తన్మయత్వం చెందాడు.

ఎరుకలో వుండి వినడం - చూడ్డంవల్ల ఏదైనా పూర్తిగా, శక్తివంతంగా చేయగలరు. ఆ మనసు ఎటువంటి నిర్ణయాలూ తీసుకోదు. అది దేన్నీ పట్టుకుని వేళ్ళాడదు. దేన్నీ వదలదు. అప్పుడు వుండేది సత్యం - శివం - సుందరం మాత్రమే! అదీ వర్తమానంలో.

ఏ పేరూ పెట్టకుండా, గతఛాయలు లేకుండా వినడమే - చూడ్డమే ఒక శక్తి. అదే అవగాహనా స్థితి. అలా చూడ్డం, వినడంలో మంచి - చెడు; అందం - వికారం; చిన్న - పెద్ద అన్నీ వుంటాయి. కాని, వాటికి నామ - రూపాలుండవు. అటువంటి మనసు పొంగి పొర్లుతుంది.

వర్తమానం, గతాన్నంతా హత్తుకుని వుండటం చేత, వర్తమానంలోంచి తప్ప, గతాన్ని చూడలేము.

మనసు - దేహం - హృదయం సఖ్యతగా వుండి శ్రద్ధగా, ఏకాగ్రతతో వున్నప్పుడు విన్నదే, నిజమైన వినడం. ఆ వినడంలో కాలానికి చోటు లేదు. కాని, మనం ఏది వినే ముందూ, అది ఎంత ప్రయాసకరమైనదైనా సరే - మన విధానమంతా ఏదోగా మారాలి, మనం ఏదో కావాలి, పరిణామం చెందాలి, ఏదో జరగాలి, మనం ఎదగాలి, సాధించాలి, పెరగాలి, సంపాదించాలి, చివరికి లక్ష్యం చేరాలి అనే వూహ వుంటుంది. అది మామూలు వూహ. ఆ వూహ అందరికీ ఎప్పుడూ వుండేదే; కాని, అది వుత్త అబద్ధపు వూహ మాత్రమే!

నిజంగా విన్నప్పుడే ప్రశాంతత. మనసు నియమబద్ధం కావడంవల్ల నిజంగా వినలేము, చూడలేము. వినడమంటే, మామూలు చెవులతో వినడం కాదు. అది మామూలు సంగతి కాదు. అసలు శ్రవణేంద్రియంతో వినడమే, నిజమైన వినడం. అది, ఆ వినడం - నిశ్చలం - నిర్మలం అయిన తటాకం మాదిరిగా వుండే మనోస్థితి. ఆ నిశ్చల తటాకంలో, ఒక రాయివేస్తే, తటాకం అంతటా చిన్న, చిన్న అలలు లేస్తాయి. అటువంటిదే మన మనో తటాకం. మనసు పూర్తిగా, నిశ్చలంగా వున్నప్పుడే, మనం అసలు శ్రవణేంద్రియంతో వినగలం. దాంట్లో, 'ప్రశ్న' అనే రాయివేస్తే, అలలు మాదిరిగా దాంట్లోంచి సమాధాన తరంగాలు లేస్తాయి. కనుక అసలు శ్రవణేంద్రియంతోనే వినడం జరగాలి. చూడ్డమూ అంతే! అంతర్నేత్రంతో చూడాలి.



ఆ నవంబరులో కృష్ణమూర్తి, పుపుల్ జయకర్‌తో కలిసి బొంబాయివెళ్లి, అక్కడ డాక్టర్లను చూశారు. ఆయనకు ఇంకా మూత్రపిండాల వ్యాధి నయంకాలేదు. దానితో ఆయన అకస్మాత్తుగా ఇరవై ఐదుపౌన్ల బరువు తగ్గారు. ఆ తర్వాత మాధవాచారితో కలిసి, ఋషివ్యాలీ వెళ్ళారు. అక్కడ కోలుకున్నారు.



1961 - ఆగస్టులో ఆల్డస్ హక్స్లే తన రెండవ భార్య "లారా"తో కృష్ణమూర్తిని చూడ్డానికి "గస్టాడ్" వెళ్లారు. హక్స్లే మొదటి భార్య 1955 లో కేన్సర్‌తో చనిపోయింది. గస్టాడ్‌లో హక్స్లే కృష్ణాజీని విని, "అయన చెప్పే సంగతులు అద్భుతంగా వున్నాయి బుద్ధుడే బోధిస్తున్నట్లుంది. అంతటి

శక్తి, అధికారం, సహజత్వం అరుదుగా చూస్తాం. గురువులు, మార్గదర్శకులు, రక్షకులు, గుడులు, చర్చిలు, మశీదులు - అన్నింటికంటే, ఆయన బోధలు, ఆయన చెప్పే సంగతులు ఎంతో గొప్పగా వున్నాయి," అన్నారు లారాతో.



కృష్ణమూర్తి, రాజగోపాల్‌తో మామూలు స్నేహంగా వుండాలని మరొకసారి గట్టిగా ప్రయత్నించారు. కాని, రాజగోపాల్ హృదయం మూసుకునే వుంది. పైగా, కృష్ణమూర్తి గురించి బాహాటంగా, 'కపటి, వంచకుడు, వేదికపై గొప్పగా కనపడాలనే తాపత్రయంతో అద్దంముందు గంటల తరబడి నిలబడి అలంకరించుకుంటాడు,' అంటూ తక్కువ రకపు నిందారోపణలు ప్రారంభించాడు. ఆ సమయంలో రోజలిండ్‌కి విడాకలిచ్చి, మరో వివాహం చేసుకున్నాడు, రాజగోపాల్. ఇవన్నీ చూసిన 'మిస్ డోరిస్ ప్రాట్' "కృష్ణమూర్తి యూరప్‌లో వున్నంత కాలం ఆయన సమస్త ఖర్చులు" సానెన్ కమిటీయే భరిస్తుంది " అని రాజగోపాల్‌తో చెప్పింది.



రాజకీయ జీవితంలో బాగా అలిసిపోయిన శంకరరావ్‌దేవ్, కృష్ణమూర్తిని చూడ్డానికి వారణాసి వెళ్ళి, తనను మృత్యుభీతి పీడిస్తోంది అన్నారు. దానికి కృష్ణాజీ, "భయానికీ, మృత్యుభీతికి కారణం, మీలోని ఇంద్రియాల్ని బలవంతంగా అణచడం వల్ల కలిగినవే!" అన్నారు.

శంకరరావ్‌దేవ్ మరొకసారి దాదాధర్మాధికారితో కలసి కృష్ణమూర్తి దగ్గరకు వెళ్ళారు. వారిని చూసి, 'జీవితంలో మీరు మీకోసం ఏం చేసుకున్నారు?' అని కృష్ణాజీ అడిగి, శంకరరావ్‌దేవ్‌ని గట్టిగా హృదయానికి హత్తుకున్నారు. ఆయన కళ్ళ

లోంచి నీరు జలజలా రాలాయి కృష్ణాజీ స్పర్శ ఆయన్ని ఎంతో కదిలించింది. కృష్ణమూర్తి ఆయన్ని తన గదిలోకి తీసుకువెళ్ళారు. ఒక గంట తర్వాత బైటికి వస్తే, శంకరరావ్ దేవ్‌గారి ముఖం తేటగా, గొప్ప తేజోవంతంగా వుండటం పట్వర్ధన్, దాదాధర్మాధికారి చూసి ఆశ్చర్యపోయారు.

కృష్ణమూర్తి, శంకరరావ్‌దేవ్‌గారిని రాజకీయాలనుంచి తప్పించి, అంతర్ముఖుల్ని చేశారు. ఆ సంగతి దేశమంతా తెలిసింది. ఆ తర్వాత కృష్ణమూర్తిని చూడ్డానికీ, వినడానికీ దేశం నలుమూలలనుంచీ అన్నిరకాల వారూ, అన్ని తరగతుల వారూ వచ్చారు.



ఆ శీతాకాలం కృష్ణమూర్తి ఋషీవ్యాలీలో వున్నారు. అప్పుడుఆ స్కూలుకు బాలసుందరం ప్రిన్స్‌పాల్‌గా వున్నారు. కృష్ణమూర్తి ఒకరోజు సూర్యాస్తమయం గురించి తన నోట్ బుక్‌లో ఇలా రాసుకున్నారు: భూమి, ఆకాశం రంగులో వుంది. కొండలు ఆకుపచ్చ రంగలో వున్నాయి. పండిన వరిపొలాలు, చెట్లు, ఎండిన నదీగర్భంలోని ఇసుక తిన్నెలు అన్నీ ఆకాశం రంగులో వున్నాయి. మబ్బులు, రాళ్ళవలెవున్నాయి. స్వర్గం, భూమిగా; భూమి, స్వర్గంగా వుంది. అస్తమయ సూర్యుడు సమస్తాన్ని వింతరంగులతో అందంగా మార్చాడు. ఆకాశం, మండుతున్న అగ్నివలెవుంది. ప్రతి మబ్బుచారలోంచీ ఆ కాంతి అకస్మాత్తుగా బైట పడింది. ప్రతిరాయిలోనూ, ప్రతిగడ్డి పరక మీదా, ప్రతి ఇసుకరేణువు మీదా రక్త వర్ణం పడింది.

ఆకాశం – ఆకుపచ్చ – రక్తవర్ణం – ఊదావర్ణం – అగ్ని శిఖలాంటి రంగులతో వెలిగిపోతోంది. దూరపుకొండ మీద రక్త

వర్ణం, బంగారు ఛాయ పులిమినట్లుగా వుంది. తూర్పున విరుద్ధమైన సూర్యాస్తమయం అవుతున్నట్లే వుంది. ఎరుపు, ఊదా రంగులు ప్రధానంగా వుండి, ఆకాశం వైభవంగా వుంది. తూర్పున విరుద్ధంగా కనుపించే సూర్యాస్తమయకాంతి, పశ్చిమ దిశను మాదిరిగా భగ్గుమన్నట్లు వెలుగుతోంది.

కొన్ని మబ్బులు తమంతట తాము అస్తమయ సూర్యుని చుట్టూ మూగాయి. అవి పవిత్రంగా, ఎప్పటికీ ఆరని, పొగలేని జ్వాలవలె వున్నాయి. అపారమైన ఆ అగ్ని జ్వాలా, దాని తీవ్రతా సమస్తాన్ని చుట్టేసుకుని భూమి మీద ఆవరించింది. భూమి, స్వర్గంగా; స్వర్గం భూమిగా వుంది. సమస్తం సజీవంగా, చైతన్యవంతంగా, ధూమ్ర వర్ణంతో వెలుగుతోంది. ఆ వర్ణమే, దైవం. దైవమంటే, మనుష్యులు అనుకునే దైవం కాదు.

కొండలు క్రమంగా స్వచ్ఛమైనాయి. ఆకాశంలో ప్రతి భాగం నీలంగా వుంది. ఎండిన వరిపొలాలు, గులాబిరంగులోనూ పచ్చగానూ వుండి కోతకు సిద్ధంగా వున్నాయి. లోయను దాటి పోయే అడ్డరోడ్డు తెల్లగా, ధూమ్రవర్ణంతో వుంది. అలాగే అంతసన్నిహితంగానూ ఆకాశంలో అడ్డంగా ఓకాంతి కిరణం పడి వుంది. నువ్వూ, ఆ కాంతి కిరణానివే! ఉగ్రంగా మండే జ్వాల – భగ్గుమనిరేగిన అగ్నిశిఖ – నీడ అనేది లేకుండా, అంటే, 'మూలాధారం – మాట' అనేవి లేకుండా వుంది. సూర్యుడు ఇంకా – ఇంకా పశ్చిమానికి వెళ్ళినట్లే, ప్రతివర్ణం మరింత ఊదాగా, తీవ్రంగా కేంద్రీకృతమైనాయి. ఆ క్షణంలో గతభావం లేకుండా నిన్ను నువ్వు పూర్తిగా మరచిపోతావు. అది సంధ్యాసమయం. ఆ సమయంలో జ్ఞాపకం – స్మృతి లేదు. ఉన్నది ఆ అందమైన సమయం ఒక్కటే. అంతే!

• • •

కృష్ణాజీ రచనల్లో మకుటాయమానమైనది "కృష్ణమూర్తి నోట్‌బుక్". అందులో ఆయన ఒకచోట ఇట్లా రాశాడు :

ఒక అందమైన-ఆనందదాయకమైన, ఫలవంతమైన అనుభవం మరొకసారి కలగాలనే వాంచాక్షేత్రంలోంచే, దుఃఖం పుడుతుంది. బౌద్ధ భిక్షువులు, మతగురువులు, సన్యాసులు— వీళ్ళంతా మళ్ళా అటువంటి అనుభవంకోసం జీవితాన్ని-దేహాన్ని-బుద్ధిని పాడుజేసుకుంటారు. కాని, ఆ అనుభవం వుందే, అది వారిని చాలా చమత్కారంగా తప్పించుకుంటుంది. ఎందుకంటే, అనుభవం బజార్లో దొరికే వస్తువు కాదు. ఏదో త్యాగంచేసీ, ప్రార్థించీ మనం దాన్ని పొందలేము. అర్థించడం, అన్వేషించడం అనేవి మనలోంచి పూర్తిగా పోవాలి".

ఇంకొకచోట అంటారు : "కాలం ఎప్పటికీ దుఃఖాన్ని తుడిచిపారేయలేదు. బహుశా మనం మన బాధలోని కొంత భాగాన్ని మాత్రమే మరచిపోగలమేమో కాని, దుఃఖం ఎప్పటికీ వుండనే వుంటుంది. దుఃఖాన్ని ఒక్క వర్తమానంలోనే తుడిచెయ్య గలం.

"అవగాహన అనేది ఏార్మికమైనదికాదు. ప్రతిదాన్ని సూటిగా ఏ పక్షపాతం, దురభిమానం, వ్యక్తిగత అభిప్రాయం అంటూ ఏమీ లేకండా-అంటే, ఎటువంటి ఉద్దేశ్యం లేకండా-మనసు భారరహితంగా, నిశ్చలంగా, నిర్మలంగా వున్నప్పుడు అవగాహనకు అవకాశం ఏర్పడుతుంది. దానికి కావలసింది మనలో పూర్తి విప్లవం." అంటాడు కృష్ణాజీ.

ఆ పుస్తకం ప్రకారం చూస్తే అతను పరిణామం చెందిన వాడనీ, బహుముఖ ప్రజ్ఞాశాలనీ, అపూర్వ వ్యక్తనీ తెలియక పోదు.

  

మరొకచోట—

" ఆలోచన ఒక చైతన్యప్రవంతి. అది పనిచేసేది, గత జ్ఞానంతో.

" ఆలోచన అక్షరరూపంలో జ్ఞాపకంగా వుంటుంది. ఆలోచనకన్నా, ఆలోచనా విధానమే ప్రధానమైనది.

" జ్ఞానేంద్రియాలద్వారా గతంలో పోగుజేసి దాచుకున్న ఊహలు, భావాలు, జ్ఞాపకాలు, అనుభవాలు—అన్నీ మెదడులో అనేక పొరలలో నిల్వవుంటాయి.

" మెదడు అంటే, సర్వేంద్రియాల-నాడుల కేంద్రం. మనం సేకరించిన విజ్ఞానం—అనుభవాలు—సిద్ధాంతాలు—నమ్మకాలు—సాంప్రదాయాలు—అన్నీ అందులో వుంటాయి. అవన్నీ పూర్వీకులద్వారా వేల-వేల సంవత్సరాలనుంచి మనకు సంక్రమిస్తున్నాయి.

" అవన్నీ మెదడును బంధించి వుంచుతాయి. అందుచేత ఆ మెదడు మనసుకు ఎటువంటి ఆదేశాలు అందివ్వలేదు. కాని, మనసు-మెదడుకు ఆదేశాలు ఇస్తూ వుంటుంది. మనసుకు మెదడుతో సంబంధంలేదు. ఆ రెండూ వేరు, వేరు. మెదడు వస్తుప్రధానమైతే, మనసు బావప్రధానమైనది.

" మనసుయొక్క చైతన్య క్రియకు, మెదడు ఒక ఉపకరణం మాత్రమే. మనసు, మెదడుద్వారా విషయాల్ని గ్రహిస్తుంది. తిరిగి ఆ విషయాలు మనసుద్వారానే విశద మౌతాయి. ఆ మనసు తిరిగి వాటిని వివరిస్తుంది.

" ఆలోచనలతోకూడిన మెదడు, ధ్యానాన్ని అందుకో లేదు. ఆలోచనలు—కోర్కెలు—ఆందోళనలు—భయాలు—ఆశలు—ఉద్రేకాలు—ప్రయత్నాలు ఏమీ లేకుండా ఎంతో శ్రద్ధాసక్తితో, ఎరుకతో మెదడును ఉంచగలిగిన స్థితే, ధ్యానం.

అంటే, ఆ సమయంలో మెదడు శూన్యంగా, నిర్మలంగా వుంటుంది." అంటాడు కృష్ణమూర్తి.

1962 మార్చిలో కృష్ణమూర్తి యూరప్‌లో వున్నారు. అక్కడ జబ్బుపడ్డారు. రాజగోపాల్, తన మొండిపట్టు విడవ లేదు. కృష్ణమూర్తికి కొత్త మిత్రులు ఎక్కువయ్యారు.

1963 లో కృష్ణమూర్తి రోమ్‌లో వుండగా, ఆయన్ని చూడ్డానికి ఆల్డస్ హక్స్లే వెళ్ళారు.

ఆ అక్టోబరు ఇరవై ఒకటవ తేదీన కృష్ణాజీ ఢిల్లీ వచ్చారు. అప్పుడు మాధవాచారి ఢిల్లీలో వున్నారు. కృషమూర్తి రోజూ సాయంత్రాలు కొంతమంది మిత్రులతో కలసి బుద్ధ జయంతి పార్క్‌కి వెళ్ళేవారు.

కృష్ణమూర్తి ఢిల్లీనుంచి రాజఘాట్ స్కూలుకు వెళ్ళారు. కొన్నేళ్ళనుంచి ఆ స్కూల్లో అచ్యుత పట్వర్ధన్ పనిచేస్తున్నారు. కాని, ఆయన మనసులో ఏం పుట్టిందో ఏమోగాని వినోబాభావే భూదాన యజ్ఞం గొప్పగా సాగుతోందనీ, అది ఎందరికో బీద వాళ్ళకు సహాయం చేస్తోందనీ అచ్యుత పట్వర్ధన్ కృష్ణమూర్తికి చెప్పారు.

దానికి కృష్ణమూర్తి, 'మీరు ఇక్కడ వుండకపోతే — అసలు మీరు నన్ను కలవకపోతే - సర్వోదయంలో వుండి, పల్లె ప్రజలకు సమస్త సేవలూ చేస్తూ వుండేవారు. మీరు పని చేయడానికి అదే సరైనది కావచ్చు. అటువంటి పనులు చేయ డానికి కాదు, మీరు ఇక్కడ వుంటున్నది. ఏదైనా సరే, లోపల్నించి గట్టిగా రావాలి,' అన్నారు.

"మీరు ఏమంటున్నారో అది నాకు అర్థంకాలేదు," అన్నారు అచ్యుత పట్వర్ధన్. కాని, చాలా ఏళ్ళ కిందట అచ్యుత్‌తో, "కృష్ణాజీని విని, అర్థం చేసుకోకపోయినా, ఆ సంగతి దూరంగా వుంచండి. కాని, మీరు మాత్రం ఆయన్ని

ఎన్నడూ వ్యతిరేకించకండి" అన్న అనీబిసెంట్ మాటలు గుర్తుకు వచ్చి, రాజఘాట్ స్కూల్లో చేస్తున్న పనిని వదిలేసి, ఏమీ మాట్లాడకుండా, కృష్ణమూర్తిని వ్యతిరేకించకుండా, ఏదీ ప్రశ్నించకుండా హిమాలయాలకు వెళ్ళి, ఆరు మాసాలు వున్నారు; అచ్యుత పట్వర్ధన్. అక్కడ ఆయన తన ఆలోచనల్ని ప్రతిరోజూ ఉదయం ఓ పుస్తకంలో రాసుకున్నారు.

• • •

1963 - నవంబరు—ఇరవై రెండవ తేదీన "లాస్ ఏంజలీస్"లో ఆల్డస్ హక్స్లే మరణించారు. ఆయన మరణవార్త ఒక నెల తర్వాత కృష్ణమూర్తికి తెలిసింది. ఆ వార్త విని, "రెండేళ్ళ క్రితం హక్స్లే ఒక్క నాతో మాత్రమే ఒక రహస్యం చెప్పారు, తన నాలుకకు కేన్సర్ వుందని. ఆ సంగతి ఆయన తన భార్యకు కూడా చెప్పలేదుట.

"నేను మొన్నామధ్య చూసినప్పుడు ఆయన బాగానే వున్నారు. కాని, ఆయన మరణవార్త విని షాక్ అయ్యాను. విస్మయం చెందాను. ఆయన అనారోగ్యంతో ఏమీ బాధపడి వుండరనుకుంటాను," అన్నారు కృష్ణాజీ ఒక మిత్రునితో.

• • •

లేడీ ఎమిలీకి జ్ఞాపకశక్తి పూర్తిగా తగ్గిపోయింది. ఆమెను చూడ్డానికి కృష్ణమూర్తి లండన్ వెళ్ళారు. ఆమె కృష్ణమూర్తిని చూసి, చాలా సంతోషపడి, ఆయన చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని చాలాసేపు ఎంతో ప్రేమగా ఎన్నెన్నో కబుర్లు చెప్పింది. ఆ తర్వాత ఆమె మళ్ళా ఆయన్ని చూడలేదు. ఆమె కొన్నిరోజులకు చనిపోతుందనగా "పవిత్రమైన, అతి సౌందర్యవంతమైన వ్యక్తి, కృష్ణాజీ. అటువంటి వ్యక్తిని నేను నా జీవితంలో మరొకరిని కలుసుకోలేదు. ఆయన పూర్ణ మానవుడు," అన్నది, ఆమె.

1964-జనవరి-మూడవ తేదీన లేడీ ఎమిలీ మరణించింది. ఆమె మరణవార్త విని, "Life is a strange business. One could not have wished from Mum, to go on living, but all the same London won't be the same It has been a long friendship—more than that for nearly fifty-two years almos one's whole life What we have all been through It will be very very strange all the same, not to see her, I loved her," అన్నారు కృష్ణాజీ.

చిన్ననాటి కృష్ణమూర్తిని చూసి లేడీ ఎమిలీ ప్రేమించి, అనుసరించింది. ఆ తర్వాత జీవితంలో కృష్ణమూర్తి ఏం చేసినా, ఏం చెప్పినా, ఎట్లా ప్రవర్తించినా సహించింది. కాని, "Order of the Star in the East,"ను రద్దుచేస్తూ "నాకు అనుచరులు అఖ్కర్లేదు" అనేప్పటికి బాధపడి, ఆ సంగతి తన ఆత్మకథలో "గులాబిపువ్వు తన పరిమళాన్ని గాలికి వెదజల్లి నట్లు, కృష్ణమూర్తి తన ప్రేమను వెదజల్లుతున్నారు. ఆయనకు ఏ ఒక్కరి ప్రత్యేక ప్రేమ అవసరంలేదు. ఆయనది విశ్వ ప్రేమ. ఎవరిమీద తన కాంతికిరణం ప్రసరిస్తుందో గమనించడు సూర్యుడు. పవిత్ర ప్రేమకు బంధం, సంబంధం వుండదు," అని రాసింది.

• • •

1964 నుంచీ మేరీ జింబాలిస్ట్ చివరివరకూ కృష్ణాజీ అభిమానురాలిగా మిగిలిపోయింది. ఆమె కృష్ణాజీ యెడల ఎంతో నమ్మకంగా వుండేది. క్రమంగా ఆయనకు చాలా సన్నిహితురాలు అయింది. ఆమె సలక్షణమైనది, శాంతస్వభావం కలది. ఇంగ్లీషు పద్ధతులుకల అమెరికన్. ఆమె తండ్రి పారిస్‌లో వుండటంవల్ల, ఆమె ఫ్రెంచి చక్కగా మాట్లాడేది. ఆమెకు అన్నిరంగాల్లో ప్రవేశముంది. ఆమెకు "మాలిబు"లో

ఒక ఇల్లు వుంది. ఆమె దాన్ని అమ్మేసి ఒహైలో ఒక ఇల్లు కొని, దాన్ని తన అనంతరం కృష్ణమూర్తి ఫౌండేషన్‌కు చెందేట్లు రాసింది.

• • •

ఒకసారి కృష్ణమూర్తి మిత్రులతో మాట్లాడుతూ, "నేను దేవుణ్ణి ప్రేమిస్తున్నాను," అనేది వుత్త అర్ధంలేని సంగతి. ఎందుకంటే, నీ ఆంతరంగిక అభిప్రాయాన్ని నువ్వు ఊహించి, చిత్రించుకున్న రూపంలో "దైవం" అని పేరుపెట్టి, ఆరాధించి, "ప్రేమిస్తున్నాను" అని అంటున్నావు. అంతేనా ? అది దైవమూ కాదు, నీది, ప్రేమా కాదు.

"భగవంతుడు" అనేది ఒకమాట మాత్రమే. ఆ మాట ఎన్నో సంగతుల, సంఘటనల, సందర్భాల, విషయాలతో కూడిన గిడ్డంగి.

మనం, మన ఆలోచనలతో భగవంతుణ్ణి కొత్తగా సృష్టించు కుంటాం. అంటే, మనం మన దుఃఖాల, బాధల, వేదనల, భయాల, నిరాశల, ఆతృతల, ఆరాటాల, ఆశల—మొదలైన వాటితో సృష్టించుకున్నదాన్నే "దైవం" అంటాం, అంతే!

భంవంతుడు తన రూపంలో మనల్ని సృష్టించలేదు. మనం స్వేచ్ఛగా, నిర్భయంగా వుంటే, ఇంక జీవితంలో వేరే దైవం అవసరం లేదు.

• • •

ఆ సంవత్సరంలోనే ముప్పైఐదేళ్ళ 'ALAIN NAUDE' అనే దక్షిణాఫ్రికావాసి కృష్ణాజీని అనుసరించాడు. అతను మంచి పియానిస్ట్. పారిస్‌లో విద్యాభ్యాసం చేసి, ప్రిటోరియా యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేశాడు. అతనికి చిన్నప్పటి నుంచీ మత పరమైన జీవితం గురించిన విషయాలు తెలుసు కోవాలనే ఆసక్తి కలవాడు.

అతను మొదలు "సానెన్"లో కృష్ణాజీ ఉపన్యాసాలు విని, ఆ తర్వాత ఆయన్ని స్వయంగా కలుసుకుని, మాట్లాడి, ఉద్యోగానికి రాజీనామా చేసి, కృష్ణాజీని అనుసరించాడు.

ఆ సంవత్సరమే మేరీ జింబాలిస్ట్ కృష్ణాజీ దగ్గరకు చేరింది. ఆమె ALAIN NAUDE ని కలుసుకుంది. ఆ తర్వాత వారిద్దరూ మంచి స్నేహితులయ్యారు. కృష్ణాజీ ALAIN ని, తన సెక్రటరీగా, ముఖ్యం—ప్రయాణాల్లో తనవెంట వుండేట్లు ఏర్పాటుచేసుకున్నాడు. అతను కృష్ణమూర్తికి ఎంతో సహాయంగా వుండేవాడు.

" గతంతో, సాంప్రదాయాలతో, నమ్మకాలతో పూర్తిగా నిండివున్న మనసు అన్నింటితోపాటు "భగవంతుడు" అనే మాట నుంచి కూడా స్వేచ్ఛ పడాలి. ఎందుకంటే, "దైవం" అనేది అనేక వేల, వేల "నిన్నల" సాంప్రదాయకపదం.

" ప్రపంచమంతా భగవంతునిలో విశ్వాసంతో వుంది. దురదృష్టవశాత్తు ఆ భగవంతుడంటే ఏమిటో నాకు తెలియదు. బహుశా ఆ దైవాన్ని నేనెప్పటికీ కనుక్కోలేననుకుంటాను.

" గత జ్ఞాపకాల, అనుభవాల, విజ్ఞానాల బరువుతో నిర్బంధంలోవున్న మనసు—మెదడు భగవంతుని గూర్చిన సత్యాన్ని ఎట్లా తెలుసుకోగలదు ?

" నేనేమంటానంటే, ముందుగా, లోతుగా, బుద్ధిబలంతో, తెలివితో—శారీరకంగా, మానసికంగా ఆరోగ్యంగా వున్నప్పుడే, గత జ్ఞాన భారం మనసులోంచి పూర్తిగా తొలగాలి, అని. అంటే, "నేను—నాది" అనేదే జ్ఞానానికి మూలం గనుక, "గతానుభవం ఎట్లా లేకుండా చేసుకోవాలి ? " అనే ప్రశ్నను ఎవరికి వారు—చివరికి వేదాంతి, మేధావి, సత్యాన్వేషి, తపశ్శాలి సహితం—

తమ అంతరాంతరంలోంచి, జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ప్రశ్నించుకోవలసిందే ! తప్పదు. దానికి సమాధానం ఎవరికి వారు గతానుభవంతోనే తెలుసుకోవాలి. ఇంకో మార్గంలేదు. అంతేకాని, ఇతరులనుంచీ, గ్రంథాలనుంచీ కాదు.

"ఆ ప్రశ్నను ఎదుర్కోవడానికి నెమ్మదిగా, జాగ్రత్తగా దాన్ని అనుసరించాలి.

" అందరూ, "దైవం వున్నాడు" అంటారు. వారంతా దాన్ని అరమరిక లేకుండా నమ్ముతారు. కాని, నేను "ఆ దైవం వున్నాడో, లేడో నాకు నిజంగా తెలియదు," అంటాను," అన్నారు కృష్ణాజీ.

• • •

"దైవం" అనేది ఒక తారు—మారు అయిన సంగతి. అది క్రమరహితమైన విషయం. మనిషి కాలం పొడవునా ఎందరో దేవుళ్ళను సృష్టించాడు. దానితో మతాలు పుట్టు కొచ్చాయి. వాటితో యుద్ధాలు కూడా వచ్చాయి.

1964 శీతాకాలంలో అచ్యుత పట్వర్ధన్ రాజఘాట్ వెళ్ళి, కృష్ణాజీని కలుసుకుని ఎంతకీ కరగని, తరగని తన మనో ఘర్షణల్ని ఆయనతో చర్చించారు. " రాజఘాట్‌లో మీకు ఏదీ కలసిరాదు. మీరు ఇక్కడనుంచి వెళ్ళవచ్చు, మీకు వెళ్ళాలని పిస్తే. మీరు కోరినరీతి వికాసం చెందేందుకు రాజఘాట్ సహాయపడదు. ఒక్క మీకు మీరు తప్ప సహాయంచేసేదీ, చేసేవారూ లేరు, " అన్నారు కృషాజీ.

1965లో అచ్యుత పట్వర్ధన్ రాజఘాట్ వదలి వెళ్ళి పోయారు. ఆయనకు కృష్ణమూర్తి అంటే లోపల ఎటువంటి పగ, ద్వేషం, కోపం లేదు. బెంగుళూరు చివర ఒక చిన్న కుటీరంలో వున్నారు. ఒక చోటునుంచి మరో చోటుకు తిరుగుతూ మూలాన్ని తెలుసుకునే యత్నంలో వున్నారు.

అచ్యుత్ పట్వర్ధన్ ఏదో అయిపోయారనుకుని సోదరుడు రావ్ సాహిబ్ పట్వర్ధన్ చాలా బాధపడ్డారు. పధ్నాల్గేళ్ళు రాజఘాట్ స్కూలుకు నిస్వార్ధంగా సేవచేసి, జీవితమే ధారపోసి, వుత్త చేతులతో తిరిగి వెళ్ళిపోయిన అచ్యుత్ గురించి సోదరుడు బాధపడటం సహజమే! ఆ తర్వాత రావ్‌సాహిబ్ పట్వర్ధన్ కూడా కృష్ణమూర్తినుంచి నెమ్మదిగా జారుకున్నారు. ఆయన వ్యక్తిగతంగా కృష్ణమూర్తి యెడల భక్తి—గౌరవాలు కల మనిషి. తాత్కాలిక ఆవేశం కొద్దీ కృష్ణమూర్తికి దూరమయ్యారు.

ఒకసారి రావ్ సాహిబ్ పట్వర్ధన్ అనుకున్నారుట, కృష్ణమూర్తి దగ్గరకు వెళ్ళాలని. కాని, ఆయనకు అహం అడ్డు వచ్చింది. "తాను చేసింది తప్పు, పొరపాటు," అని కృష్ణమూర్తితో చెప్పుకుని ఒప్పుకోవడానికి ఆయన మనసు అంగీకరించలేదు. ఆ తర్వాత ఆయనకు రక్తపుపోటు, గుండె జబ్బు వచ్చాయి. ఆ డిశంబరులో అచ్యుత పట్వర్ధన్, నందిని, మాధవాచారి, బాలసుందరం, పుపుల్ జయకర్, కృష్ణమూర్తి దగ్గర చేరారుకాని, రావ్‌సాహిబ్ పట్వర్ధన్ వెళ్ళలేదు.

కృష్ణమూర్తి రాజఘాట్‌లో వుండగా ఆయన అనుచరుడైన "జార్జి విధోల్ కాస్" అనే గ్రీస్ అతనూ, మేరీ జింబాలిస్ట్ వచ్చారు. మేరీ జింబాలిస్ట్ సంపన్న కుటుంబానికి చెందినది. మొదటినుంచీ సుఖాలకూ, సౌకర్యాలకూ అలవాటుపడిన ఆమె. కనుక ఆమెకు రాజఘాట్‌లో వసతి సౌకర్యాలు కుదరలేదు. అందుచేత ఆమె తన మకాం కృష్ణమూర్తి ఇంట్లోకి మార్చింది. ఆమె ఆలా మారడం, మాధవాచారికి బాధాకరమైంది. క్రమంగా మాధవాచారి మనసులో కృష్ణమూర్తిమీద వ్యతిరేక భావాలు పుట్టుకొచ్చాయి. కృష్ణమూర్తి అన్నింటికీ తనమీద ఆధారపడుతున్నారనే అభిప్రాయం మాధవాచారిలో గట్టిగా బలపడింది.

అప్పటికే మాధవాచారి "కృష్ణమూర్తి ఫౌండేషన్" నడుపుతున్నారు. అందుచేత ఆయన కావలసి కృష్ణమూర్తి పనులన్నింటినీ ఉపేక్షచేయ నారంభించారు-స్కూలు, తోట, వసంత్ విహార్, కృష్ణమూర్తి ఫౌండేషన్ పనులు, అన్నీ. ఆయన క్రమంగా తానే సర్వాధికారిగా వ్యవహరించ నారంభించారు ఎవరి సలహా, సహాయం తీసుకోవడం మానేశారు.

ఆ వేసవిలో కృష్ణాజీ గెస్టాడ్‌లో వున్నారు. పుపుల్ జయకర్ ఆయన దగ్గరకు వెళ్ళింది. అక్కడి మిత్రులు కృష్ణమూర్తికి ఒక కారు ఇచ్చారు. కృష్ణమూర్తితో పుపుల్ జయకర్ షికారుకు వెళ్ళేది. కృష్ణాజీ కారు చాలా స్పీడ్‌గా డ్రైవ్ చేసేవారు.



1966లో, ఇండియానుంచి 'దేశికాచారి' అనే ఆయన కృష్ణమూర్తికి 'యోగం' నేర్పడానికి యూరప్ వెళ్ళారు.

ఆ శీతాకాలంలో కృష్ణమూర్తి ఇండియా వచ్చారు. కృష్ణమూర్తి, మాధవాచారి మధ్య సంబంధం, మరింత క్షీణించింది. కృష్ణాజీకి, ఇండియా ఫౌండేషన్‌కీ మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. ఇండియా ఫౌండేషన్, రాజగోపాల్‌ని బలపరుస్తోంది, పరోక్షంగా. కృష్ణమూర్తికి వ్యతిరేకంగా నిలబడేందుకు మాధవాచారి ప్రయత్నంలో వున్నారు. కృష్ణమూర్తి అవన్నీ గమనించి, "ఫౌండేషన్ దృష్టి ఏమీ బాగాలేదు," అన్నారు మిత్రులతో.

1967 శీతాకాలంలో మాధవాచారికీ, కొందరు కృష్ణమూర్తి మిత్రులకూ మధ్య కలతలు వచ్చాయి. మాధవాచారి ప్రవర్తన బాగాలేనట్లు కృష్ణమూర్తి మొదటినుంచీ గమనిస్తూనే వున్నారు. కృష్ణమూర్తి వసంత్ విహార్‌లో వున్నప్పుడు

ఆయన్ని వినడానికి "శ్రీమతి విజయలక్ష్మి" అనే ఆమె వచ్చారు. ఆమె 1960 నుంచీ వస్తున్నారు. ఆమె కర్ణాటక సంగీతంలో మంచి నిపుణురాలు. నిండైన విగ్రహం. సరళ భాషిణి. మంచి వ్యవహార వేత్త. కృష్ణమూర్తిని సాయంత్రాలు తన కారులో బీచ్‌కి తీసుకువెళ్ళేది. ఆయన కొంచెం దూరం ఒంటరిగా వెడితే, ఆయన తిరిగి వచ్చేవరకు కారు దగ్గర వేచి వుండేది. "అటువంటి సమర్థురాలి సలహా సహాయం వసంత్ విహార్‌కీ, ఫౌండేషన్‌కీ మంచిది" అని కృష్ణమూర్తి, మాధవాచారితో అంటే, అయన ఏమీ సమాధానం చెప్పక మౌనంగా వుండిపోయారు.

కృష్ణమూర్తి చుట్టూ చేరి, ఆయన్ని విని, సన్నిహితులైన వారు క్రమంగా తాము అధికులమూ, కృష్ణమూర్తికి తప్పని సరిగా కావలసిన వారమూ, ముఖ్యులమూ; తాము లేనిది కృష్ణమూర్తి దినచర్యే జరగడం కష్టం అనుకునేవారు, కొందరు తయారైనారు. వారు కృష్ణమూర్తికి కొన్నేళ్ళుగా సేవలు చేస్తున్నవారే: కృష్ణమూర్తి ఎప్పుడూ, దేనికీ, ఏమాత్రం, ఎవరిమీదా ఆధారపడక తన సంగతి తాను చూసుకుంటున్నారన్న సంగతి వారు గ్రహించి, తమను కృష్ణమూర్తి ఉపేక్ష చేస్తున్నారనుకుని, బాధపడి, తమ ఆధిక్యతా, అవసరం తగ్గాయని తమకు తామే ఊహించుకుని, మదనపడి, వ్యాకులపడి, స్థానభ్రష్టులయ్యారు, మరి కొందరు.

చాలామంది కృష్ణమూర్తినుంచి ఈర్ష్యతో, భ్రాంతితో కొట్టుకుపోయారు. కొందరు కృష్ణమూర్తినుంచి కృతజ్ఞతను ఎదురు చూశారు; తాము చేసిన దానికి ప్రతిఫలంగా. ఎవరినీ తనకు వ్యక్తిగతంగా సహాయం, సేవా చేయడానికి కృష్ణమూర్తి ఎప్పుడూ ఒప్పుకునే వారు కాదు. కృష్ణమూర్తితో, కొత్తవాళ్ళు ప్రేమగా, చనువుగా వుంటే, పాతమిత్రులు విలవిలలాడి బాధపడేవారు - కృష్ణమూర్తి తమను మరిచారనో, విడిచారనో, అనుకునేవారు. ఆయన ఎప్పుడూ ఎవరినీ పట్టుకోలేదు, వదలా

లేదు. ఆ రెండూ ఆయన చుట్టూ చేరినవారు చేసిన పనులు. ఎవరూ ఆయన్ని పొగిడి మెప్పు పొందిన సంఘటనలు లేవు.



మేరీ లూట్యన్స్ కృష్ణమూర్తిని హాలెండ్‌లో కలుసుకుంది. కృష్ణమూర్తి ఆమెతో, "నువ్వు కృష్ణమూర్తి గురించి ఏదైనా ఒక పుస్తకం రాయరాదా ?" అని అడిగారు. దానికి ఆమె ఆశ్చర్యపోయి, "ఏ రకం పుస్తకం ? ఆయన ఉపన్యాసాల్ని ఆధారంగా తీసుకుని రాయమంటారా ?" అని అడిగితే, "అది నీ ఇష్టం," అన్నారు కృష్ణాజీ.

మేరీ లూట్యన్స్ ఆ మధ్యకాలంలో చాలా సంవత్సరాలు కృష్ణమూర్తిని చూడలేదు, వినలేదు, చదవలేదు.

మరికొన్నాళ్ళ తర్వాత ఆమె కృష్ణమూర్తిని కలుసుకుంటే, "పుస్తకం ఎంతవరకు వచ్చింది ?" అని అడిగారు. దానికి ఆమె "అసలు నేను ఏదీ ప్రారంభించనే లేదు," అన్నది.

"ప్రయత్నిస్తాను అనేది చాలా భయంకరమైన మాట," అన్న కృష్ణమూర్తి మాట గుర్తుకు వచ్చి, సిగ్గుపడింది, మేరీ.

అప్పటినుంచి ఆమె కృష్ణమూర్తిని మళ్ళా శ్రద్ధగా చదవనారంభించింది. కృష్ణమూర్తి అనేకచోట్ల, అనేక రకాల వారికి, అన్ని సంవత్సరాలలో బోధించింది చాలావరకు పునశ్చరణమైనా, వాటిల్లో శక్తీ, వివరణ విస్తారంగావున్న సంగతి ఆమె మొదట గుర్తించింది. కృష్ణమూర్తి తన ఉపన్యాసాల్లో, సంభాషణల్లో, చర్చల్లో, రచనల్లో చాలా మాటల్ని అందంగా అర్ధయుక్తంగా, స్పష్టంగా తూచినట్లు వాడారు. ఆయనలో అదొక ప్రత్యేకత.

చివరికి మేరీ లూట్యన్స్ కృష్ణమూర్తి గురించి రాయడానికి పూనుకుంది. ఆమె చేసిందల్లా ఆయన బోధలోని సారాంశాన్ని సందర్భశుద్ధిగా ఒక పద్ధతిలో అమర్చింది. దానికి ఆయన మాటల్నే ఉపయోగించింది. అదే "FREEDOM FROM THE KNOWN"

ఋషీవ్యాలీ, రాజ్‌ఘాట్ స్కూళ్ళ అవ్యక్త, అధ్వాన్న స్థితిని చూసి భరించలేక కృష్ణమూర్తి మిత్రులతో, 'ఆ స్కూళ్ళలో వికాసం, అభివృద్ధి ఏమాత్రం కనుపించడం లేదు. కనుక మీరు వాటిని తీసుకుని రక్షించండి,' అన్నారు. ఆ స్కూళ్ళను ఏ విధంగానైనా సరే కాపాడమని కోరుతూ, 'నేను మళ్ళా తిరిగి రాకపోవచ్చు లేదా, చనిపోవచ్చు. అది సహజమే కదా? ఇండియా వచ్చినా కొద్ది కలమే వుంటాను. ఇంక నేను శారీరకంగా ఎక్కువ పని చేయలేననుకుంటాను. అలసటగా అనిపిస్తోంది. ఇంక నేను వెళ్ళిపోతున్నాననే అనుకోండి. ఏదైనా జరగవచ్చు ఆ స్కూళ్ళ విషయంలో ఒక మంచి నిర్ణయం తీసుకోవడం, మంచిదనిపిస్తోంది భవిష్యత్తులో ఏం జరగనున్నదో కదా? కాబట్టి ఋషీవ్యాలీ, రాజఘాట్ స్కూళ్ళు ఒయాసిస్‌లు వంటివి గనుక, వాటిని ప్రస్తుత పరిస్థితినుంచి రక్షించండి, నేను చెపుతున్నది మీకు అర్థం అవుతోందా? బాలసుందరమో, మరొకరినుంచో కాదు రక్షించడం, కలుషితంనుంచీ కాదు. వాటిని ఎప్పటికీ ఒయాసిస్‌లుగా వుంచమని కోరుతున్నాను. అంతే? వాటి విషయంలో ఏదో కఠినమైన నిర్ణయం తీసుకోబోతున్నాను. కాని, మీరు ఏం చెయ్యబోతున్నారో నాకు తెలియదు. నా కాలం, బహుస్వల్పం. అంటే, దాదాపు పది సంవత్సరాలు. కనుక వున్న ప్రతిదానిమీదా దృష్టి పెట్టి, శ్రద్ధ చూపాలనుకుంటున్నాను. నాశక్తి వృథాకాకూడదు. నేనిప్పుడు పూర్తి మానసికారోగ్యంతో వుండే మాట్లాతున్నాను. ఉద్రేకరహితంగా, మనో విజృంభణ లేకుండా భావావేశంతో కాకుండా మాట్లాడుతున్నాను.

"అయితే ఆ రెండు స్కూళ్ళనూ రక్షించడం ఎట్లా? ఈ పిచ్చి ప్రపంచంలో వాటిని ఒయాసిస్‌లుగా వుంచడం ఎట్లా? నలభై ఏళ్ళ తర్వాత మనం ఏం సాధించాం? ఈ సంస్థలకు మీ జీవితాల్ని ఎంతో ఇచ్చారు. ఏం, లాభం? మేమెంతో

చేశామంటారు, మీరు. అవునా? మీరు చేస్తున్నది తప్పు అని కాని, మంచిది అనికాని నేను అనబోవడం లేదు. నేను ఆ విధంగా అనుకోవడమూ లేదు. కాని, 'మనం ఏం చేయాలి?' అని అంటున్నాను.

"ఇటువంటి విషయమే ఒహైలోనూ ఎదురైంది. "కృష్ణమూర్తి రైటింగ్స్ ఇన్‌కార్పొరేషన్"కీ, నాకూ మధ్య. సరిగ్గా ఇటువంటి గొడవలే! మన మందరం కలసి ఒక గొప్ప నిర్మాణం చేయదలిచాం, చిరస్థాయిగా వుండాలని. అది విలువైనదిగా వుండాలని కోరుతున్నాం, ఆశిస్తున్నాం. కాని, అక్కడా, ఇక్కడా ఏమాత్రం అభివృద్ధి, వికాసం లేదు.

"కాబట్టి, ఇక్కడ (ఇండియాలో) మనం ఏం చేయగలం? ఈ రెండు స్కూళ్ళు ఒయాసిస్‌లుగా చేయాలి. ఈ బోధలకు వాటిని నిలయాలుగా మార్చాలి. అయితే వాటిని ఎట్లా విలువైనవిగా చేయగలం? ఈ సంగతి మాధవాచారితో కొన్నేళ్ళుగా చాలాసార్లు ప్రస్తావించాను. అందుచేత 'ఇప్పుడు మనం ఏం చేయాలి?' అని మీ అందర్నీ నేను అడుగుతున్నాను," అన్నారు.

మాధవాచారి మధ్యలో అందుకుని కొన్ని క్షమాపణలు, వివరణలు ఇవ్వబోయారు. కాని, కృష్ణమూర్తి అయన్ని వినలేదు. కాని, "మీరు చెప్పేది నేను అర్థం చేసుకున్నాను. ఈ సంగతి చాలాసార్లు, కొన్నేళ్ళుగా ఋషీవ్యాలీ, రాజఘాట్‌లలో మన మందరం కలిసి చర్చించుకున్నాం. పదేళ్ళుగా చర్చిస్తున్నాం. నేను మిమ్మల్ని అడుగుతున్నాను, 'మనమంతా కలసి ఏం చేద్దాం?' అని. గతాన్ని మరచిపొండి. మనం గతంలో చేయగలిగినంత మంచి చేశాం చివరికి ఒకే ఒక ప్రశ్న మిగిలింది – 'ఇప్పుడు మనం ఏం చెయ్యాలి?' అని.

"మామా! (కృష్ణమూర్తి, మాధవాచారిని అట్లా పిలిచేవారు) నేను రేపు చనిపోవచ్చు. నేను చనిపోవాలనుకోవడం లేదు. కాని, నేను చనిపోతే, ఏం జరుగుతుంది? వీటిని ఎప్పటి మాదిరిగా నడుపుతారు కదూ? ఈ ప్రశ్న మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి, మామా!

"అటువంటి గొప్ప విపత్తు సంభవించినప్పుడు కదా?" అని మాధవాచారి చెప్పబోతూ వుంటే, "ఆ విపత్తు ఇప్పుడే, వుంది," అన్నారు కృష్ణాజీ గంభీర స్వరంతో.

• • •

1968 మొదట్లో కృష్ణమూర్తి యూరప్‌లో వున్నారు. ఆయన చుట్టూ ఓ నూతనవర్గం ఏర్పడింది. వారిలో కొందరు రాజగోపాల్‌తో పడలేక లండన్‌లో మరో ట్రస్ట్ ఏర్పాటు చేశారు. దానితో రాజగోపాల్, కృష్ణమూర్తికి ఒక లీగల్ నోటీసు ఇచ్చాడు, 'మీ మీద లీగల్‌గా చర్య తీసుకుంటాను,' అని బెదిరిస్తూ. ఆ సంఘటనతో కృష్ణమూర్తి మిత్రులు మరింత గట్టిగా నిలబడ్డారు. ఆ సంవత్సరమే ఇంగ్లండులో 'కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ ఇంగ్లండు'ను స్థాపించారు.

అదే సమయంలో "వసంత్ విహార్"ను "గేలోవే" అనే అతనికి అప్పగించండి అని మద్రాసులో వుంటున్న మాధవాచారికి కృష్ణమూర్తి ఒక టెలిగ్రాం ఇచ్చారు, దానికి మాధవాచారి 'వసంత్ విహార్‌ను మీకు గాని, మీ తరపు వ్యక్తికిగాని అప్పగించడానికి నాకు లీగల్ రైట్స్ లేవు. వసంత్ విహార్ విషయమై రాజగోపాల్ నాకు "పవర్ ఆఫ్ ఎటార్నీ," రాసి ఇచ్చారు. మీకు వసంత్ విహార్ విషయంలో "మోరల్ రైట్స్" వుండవచ్చుగాని, లీగల్ రైట్స్ రాజగోపాల్ అధీనంలో వున్నాయి," అని సమాధాన మిచ్చాడు.

తన పుస్తకాల 'కాపీరైట్' ఏదీ రాజగోపాల్ అధీనంలో వుండకూడదని, ఆ వ్యవహారం ఏవిధంగానైనా తెగత్రెంపులు చేసుకోవాలని కృష్ణమూర్తి గట్టిగా నిశ్చయించుకున్నారు. తాను అతనికి ఇచ్చిన అనుమతి పత్రాన్ని ఉపసంహరించుకోదలిచారు; కృష్ణమూర్తి.

"కృష్ణమూర్తి - రైటింగ్స్ - ఇన్‌కార్పొరేషన్"తో సంబంధాలు తెంచుకని, తన పుస్తకాల అచ్చు విషయం చూసేందుకు కృష్ణమూర్తి మరో ముగ్గురి సహాయం కోరారు. దాని ఫలితంగా లండన్‌లో ఒక కమిటీ ఏర్పండింది. అలాగే అక్కడ ఒక ఫౌండేషన్ కూడా ఏర్పడింది.

ఆ సమయంలో బాలసుందరం పారిస్‌లో వున్నారు. ఆయన కృష్ణమూర్తిని సానెన్‌లో కలుసుకుని మాట్లాడారు. "కృష్ణమూర్తి నిజంగా, గట్టిగా కోరితే, ఇండియా ఫౌండేషన్‌లో వున్న సభ్యులందరిచేతా తాము రాజీనామా చేయించగలము," అంటూ కిట్టూ - శివరావులు కృష్ణమూర్తికి రాశారు. దానికి ఆయన సమాధానం ఇవ్వలేదు.

అక్టోబరులో కృష్ణమూర్తి, ఫౌండేషన్ సభ్యులకు ఉత్తరం రాశారు, "ఫౌండేషన్ ఫర్ న్యూ ఎడ్యుకేషన్" గురించి బాలసుందరం, మూర్‌హెడ్ దంపతులతో నేను దీర్ఘంగా చర్చించాను. ఆగస్టు ఇరవై ఎనిమిదవ తేదీన లండన్‌లో "కృష్ణమూర్తి ఫౌండేషన్" ఒకటి ఏర్పాటైంది. దానికి కృష్ణమూర్తే ప్రెసిడెంట్. అది కృష్ణాజీ బోదల్ని ప్రపంచమంతా వ్యాప్తి చేయాలనే ఉద్దేశ్యంతో స్థాపించబడింది. అది పూర్తిగా నాకూ, నా అభీష్టాలకూ బాధ్యత వహించి పనిచేస్తోంది. అది ఏవిధంగానూ ఒక సంస్థ కాదు. నాకు బాధ్యత వహించిన ఒక కమిటీ మాత్రమే. అది కృష్ణమూర్తి బోధల్ని, ప్రచురణల్ని - మొదలైన వాటిని నా ఇష్ట ప్రకారం వ్యాపింపజేస్తుంది. అది అంతర్జాతీయ

కమిటీ. దాని సభ్యులు ప్రపంచ సభ్యులుగా వ్యవహరిస్తారు. కాని, వారు తమ, తమ దేశాలకు పరిమితులై వుండరు. ఆ కమిటీ కార్యక్రమాలు ఖచ్చితంగా, నిజమైనవిగా, ప్రామాణికమైనవిగా వుంటాయి. బాలసుందరం వచ్చి, అవన్నీ మీకు చెపుతారు,' అని.

కృష్ణమూర్తి ఉత్తరం చూసి ఋషీవ్యాలీ స్కూలులో అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు - రావ్‌సాహిబ్, అచ్యుత పట్వర్ధన్, సునందా పట్వర్ధన్‌లు అప్పటికే రాజీనామా చేశారు. వారి రాజీనామా లేఖలు కమిటీ బల్లమీద వున్నాయి. మాధవాచారి రాజీనామా చేయడానికి సిద్ధంగా వున్నాడు. ఋషీవ్యాలీ స్కూలు ప్రిన్స్‌పాల్ బాలసుందరం కమిటీ సెక్రటరీగా వున్నారు. కిట్టీ శివరావు కూడా రాజీనామా చేశారు, ఒత్తిడికి లొంగి.

ఆ తర్వాత ఆ కమిటీకి పుపుల్ జయకర్ ప్రెసిడెంట్ అయ్యారు. సభ్యులందరూ కలసి పుపుల్ జయకర్‌ను, కృష్ణ మూర్తికి ఒక ఉత్తరం రాయమన్నారు. దానితో ఆమె ఇబ్బందిలో పడింది కృష్ణమూర్తి తనకు గురుతుల్యులు, మార్గ దర్శకులు కనుక " డియర్ కృష్ణాజీ ! " అని ప్రారంభించింది.

" బాలసుందరంగారు వచ్చి, " ఫౌండేషన్ ఫర్ న్యూ ఎడ్యుకేషన్" గురించి చెప్పారు. ఆ తర్వాత మీ ఉత్తరం వచ్చింది. మేమంతా చాలా నొచ్చుకున్నాం. ఇక్కడివారూ మీ బోధల్ని ప్రచారం చేస్తూ, పుస్తకాల్ని ప్రచురిస్తూ ఆదర్శ వంతంగా వున్నారు.

" సభ్యులందరూ మీతో వుండి, మిమ్మల్ని విని, సంతోషంగా కాలం గడిపిన వారే! ఋషీవ్యాలీ, రాజఘాట్

స్కూళ్ళలో మీ బోధల్ని విద్యతోపాటు నేర్పాలనేది ఫౌండేషన్ ఆశయం గనుక, వారు భక్తి, శ్రద్ధలతో పనిచేస్తూనే వున్నారు. ఇకముందు ఆ రెండు స్కూళ్ళలో మీ ఆశయాల్ని నెరవేర్చ గలరనే ఆశతో మీకు రాస్తున్నాను.'' అని రాసింది.

ఫౌండేషన్ సభ్యుల సంయుక్త సమాధానానికి కృష్ణమూర్తి సమాధానం ఇవ్వలేదు. మద్రాసులో, 'కృష్ణమూర్తి సెంటర్,' స్థాపించి దానికి రాజ్యలక్ష్మిని ఇండియా ప్రతినిధిగా ఎన్నిక చేశారు. దేశంలో కృష్ణమూర్తి గురించి అన్ని సంగతులూ చూసుకుని, చక్కబెట్టే బాధ్యత కూడా ఆమెపై వుంచారు.

కృష్ణమూర్తినుంచి ఉత్తరం లేకపోయినా, "మిమ్మల్ని లండన్‌లో చూస్తాను," అని పుపుల్ జయకర్ కృష్ణాజీకి రాసింది. దానికీ ఆయన సమాధానం ఇవ్వలేదు. కాని, డిశంబరులో "కృష్ణమూర్తి ఫౌండేషన్ ఫర్ ఇండియా," ప్రెసిడెంట్‌గా పుపుల్ జయకర్ కృష్ణమూర్తిని ఇండియా వచ్చి, ఉపన్యాసాలు ఇవ్వవలసినదిగా కోరి, ఆహ్వానించింది.

1969 జనవరి పదహారవ తేదీన కాలిఫోర్నియా నుంచి కృష్ణమూర్తి పుపుల్ జయకర్‌కు ఒక ఉత్తరం రాశారు. తనను అధికార హోదాలా వుండి, ఇండియాలో ఉపన్యాసాలు ఇవ్వడానికి ఆహ్వానించినందుకు పుపుల్ జయకర్‌ను, అభినందించారు, కృష్ణమూర్తి. ఆ ఉపన్యాసాలకు పుపుల్ జయకర్, కిట్టీ శివరావులను బాధ్యత వహించవలసినదిగా కోరారు. అయితే తాను ఇండియాలో డిశంబరునుంచి 1970 జనవరి వరకు వుంటానన్నారు కృష్ణమూర్తి.

గత కలతల తాలూకు ఛాయలేమీ కృష్ణమూర్తి ఉత్తరంలో లేకపోవడం, అంతా మామూలుగా, కొత్తగా వుండటం చూసి ఇండియా సభ్యులు సంతోష పడ్డారు. ఆ ప్రకారం కృష్ణమూర్తి ఇండియా వచ్చి, ఉపన్యాసాలు ఇచ్చారు.

• • •

ఫిబ్రవరి పన్నెండున అమెరికాలో "కృష్ణమూర్తి ఫౌండేషన్" ఏర్పడింది. రాజగోపాల్ ఎంతకీ కృష్ణాజీతో ఎటువంటి పరిష్కారానికీ అంగీకరించలేదు. కాని, ఫిబ్రవరి పదమూడవ తేదీన కృష్ణాజీ "మాలిబు" నుంచి రాజగోపాల్‌కు ఒక ఉత్తరం రాశారు– "మీరు ఒకసారి వచ్చి, వ్యవహారం చక్కబెట్టవలసినదిగా కోరుతున్నాను," అంటూ. దానికి రాజగోపాల్, "తనను లాయరు ఆ విషయమై మాట్లాడవద్దన్నారు," అని రాశాడు.

కృష్ణాజీ మళ్ళా మార్చిలో రాజగోపాల్‌ని రమ్మని పిలిచారు. దానికతను, "నేను ఒహై వదలి ఎక్కడకీ వెళ్ళను," అని సమాధానమిచ్చాడు, కృష్ణమూర్తి మళ్ళా ఏప్రిల్‌లో రాజగోపాల్‌కు ఫోన్ చేశారు. అయినా అతను కదలలేదు. వ్యవహారం పరిష్కారం కాలేదు. రాజగోపాల్ కావలిసి నిర్లక్ష్యం, ఉపేక్ష చేయడం చూసి, ఆ విషయాన్ని కృష్ణాజీ అనేకమంది మిత్రులకు రాశారు, "అతను కోరితే ఆర్థికంగా అన్ని ఏర్పాట్లూ చేస్తాను," అని హామీ ఇచ్చారు కృష్ణమూర్తి. రాజగోపాల్ దేనినీ లక్ష్యపెట్టలేదు. చేవరికి విసిగిపోయి, " I felt forced normally to seek legal advice. I felt the whole of Krishna Murty writings incorporation affairs were something sacred—thousands of people at great sacrifice had contributed to it in my name and how I had no voice or even information about it," అని వాపోయారు కృష్ణాజీ.

జూన్ రెండవ తేదీన కృష్ణమూర్తి పుపుల్ జయకర్‌కు ఒక ఉత్తరం రాశారు, "ఒహైలో నిధులు కొరతగా వున్నాయి. కనుక రెండు రాను–పోను విమానం టిక్కెట్లు—అమెరికానుంచి ఇండియా; ఇండియానుంచి అమెరికా – ఒకటి తనకూ, రెండవది తన మిత్రుడు "నాడి" కి," అని. కాని, ఆ ఆగస్టునాటికి ఆ

మిత్రుడు కృష్ణమూర్తితో అన్ని సంబంధాలూ పూర్తిగా తెంచేసుకున్నాడు. అందుచేత కృష్ణాజీ తన ఒక్కరికే రాను - పోను విమానం టిక్కెట్టు తీసుకోమన్నారు.

• • •

ఆ సంవత్సరం "Freedom From the Known" అనే కృష్ణమూర్తి పుస్తకం అచ్చయింది. ఆ పుస్తకంలో ప్రేమ గురించిన అధ్యాయం చాలా గొప్పది. ప్రేమంటే, ఓర్వలేని తనం, అపనమ్మకం కాదు. ప్రేమ, ప్రేమించమని కోరదు. ప్రేమ, భయం కాదు. ప్రేమ, లైంగికానందంకాదు. మరొకరిమీద ఆధారపడి జీవించడం ప్రేమకాదు. అది Self - Pity కూడా కాదు. ప్రేమకు స్వేచ్ఛకావాలి. ఆ స్వేచ్ఛ అవగాహన ద్వారా రావాలి. స్వేచ్ఛ, ప్రేమ.

• • •

ఆగస్ట్ 29 తేదిన రావ్‌సాహిబ్ పట్వర్ధన్ పూనాలో మరణించారు. ఆ తర్వాత అచ్యుత పట్వర్ధన్నీ, సునందా పట్వర్ధన్నీ తిరిగి కృష్ణమూర్తి ఫౌండేషన్‌లో చేరవలసినదిగా పుపుల్ జయకర్ కోరింది. "నేను చేరకపోయినా ఫౌండేషన్‌కు సహాయం చేస్తాను. పూర్తిగా సహకరిస్తాను," అన్నారు అచ్యుత్.

డిశంబరులో కృష్ణమూర్తి ఢిల్లీ వచ్చారు. విమానాశ్రయంలో పుపుల్ జయకర్, అచ్యుత పట్వర్ధన్, సునంద, నందిని కృష్ణమూర్తికి స్వాగతం చెప్పారు, కృష్ణమూర్తి వారిని చూసి, "మీరు నన్ను వదలిపెట్టలేదన్నమాట," అన్నారు నవ్వుతూ,

ఆ తర్వాత వారు కృష్ణమూర్తితో "కృష్ణమూర్తి ఫౌండేషన్ కృష్ణమూర్తి – న్యూ ఎడ్యుకేషన్ - కృష్ణమూర్తి సెంటర్'' తాలూకు విషయాలన్నీ మాట్లాడారు. కృష్ణమూర్తి సెంటర్‌కు, కృష్ణమూర్తే ప్రెసిడెంట్ కావడం, ఇండియా మిత్రులకు, సభ్యులకు సమ్మతంగా లేదన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఎందుకంటే, నైతికంగా, లీగల్‌గా ఎటువంటి బాధ్యతలూ తమ ప్రియాతిప్రియమైన కృష్ణాజీమీద వుంచకూడదనే నిర్ణయంతో.

కృష్ణమూర్తి ఢిల్లీనుంచి బొంబాయి వెళ్ళారు. అక్కడ "హిమత్ నివాస్"లో వున్నారు. ఒకరోజు రాత్రి కృష్ణమూర్తితో పుపుల్ జయకర్, నందిని, అసిత్‌చాంద్‌మత్ భోజనం చేస్తుండగా, కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సమాజం గురించీ, అనీబిసెంట్ గురించీ చాలా మాట్లాడారు : "సిద్ధపురుషులు లెడ్‌బీటర్‌తో చెప్పారు, మంచి సాంప్రదాయంకల బ్రాహ్మణ కుటుంబంనుంచి, ఒక బాలుణ్ణి వెదికి తీసుకోమని. వారు ఆయనకు ఆ బాలుని ముఖాకృతిని కూడా వర్ణించి చెప్పారు. ఆ బాలుని బాధ్యత దివ్యజ్ఞాన సమాజంమీద వుంచారు. ఆ బాలుని రెండేళ్ళు తమ సంరక్షణకింద వుంచడంచేత, దివ్యజ్ఞాన సమాజంవారు అతన్ని సదా వెన్నంటి కాపాడారు. ఆ బాలుడు స్థిరంగా వుండి, అర్హత సంపాదిస్తే, మహాత్మా మైత్రేయ అతనికి శక్తి ఇస్తారు. ఆ సందర్భంలో లెడ్‌బీటర్ కృష్ణమూర్తిని అడయార్ బీచ్‌లో చూశారు. అతని చుట్టూ గొప్పకాంతి వుండటం గమనించారు.

"ఆ తర్వాత కృష్ణమూర్తి తనను తాను ప్రశ్నించుకున్నాడు."

"ఆ బాలునికి అరంజి జ్యూస్‌నుంచి, "రోల్స్‌రాయిస్" కారు వరకు ఇచ్చినా, కోరిన అన్నింటితోపాటు, చుట్టూవున్న

వారంతా ప్రత్యేక శ్రద్ధతో చూసినా, ఏమీ అంటకుండా, చెడి పోకుండా ఎట్లావున్నాడు ?

"దివ్యజ్ఞాన సమాజంవారు అతన్ని ఎంత దృష్టి పెట్టి చూశారంటే, ఆతను కూర్చున్నచోట, ఎవరూ కూర్చోకూడదు. అతని టెన్నిస్ బేట్, ఎవరూ ముట్టుకోకూడదు. అతడు అంత గొప్పగా వుండేందుకు వారు ప్రత్యేక శ్రద్ధ చూపేవారు. అతడు ఏనాడూ మత్తుపానీయాలు ముట్టలేదు. మాంసాదులు తినకుండా, అనాగరికులతో తిరగకుండా సంస్కార రహితులతో కలవకుండా ఆ బాలుణ్ణి కంటికి రెప్పగా కాపాడారు.

"ఆ బాలుడు చెడిపోకుండా ఎలావున్నాడు ?" అనే ప్రశ్నపై కృష్ణమూర్తి అనేక సిద్ధాంతాల్ని ఎత్తి చూపారు. "జన్మ-పునర్జన్మ" ఫలితంగా చెడిపోకుండా వున్నాడా ? లేక, అప్పటికే అతడు పరిపూర్ణమానవుడయ్యాడా ? . ఆ బాలుని దేహం పక్వదశకు వచ్చేవరకు మైత్రేయ కాపాడారా ? పుట్టుక తోనే ఆ బాలునికి దేనివల్లా చెడిపోకుండా వుండే శక్తి వచ్చిందా? తండ్రి సంపర్కం, స్కూళ్ళు, దివ్యజ్ఞాన సమాజ సిద్ధాంతాలు, పద్ధతులు, ఇంగ్లండులో విలాస జీవితం—ఏదీ అతన్ని చెడ గొట్టలేదా ?

"ఆ బాలుడు చెడిపోకుండా, సాధువుగా, సహజంగా వున్నాడు. చివరివరకూ రక్షింపబడ్డాడు. చెడు, దుర్మార్గం అంటకుండా, అవి అతనిలో ప్రవేశించకుండా కాపాడబడ్డాడు.

కృష్ణమూర్తి కొంతసేపు నిశ్శబ్ధమయ్యాడు. తర్వాత శక్తివంతంగా కనుపించాడు.

"అనీబిసెంట్ ఆ బాలునికి రెండు దీక్షలు ఇప్పించి," ఇకనుంచి నువ్వు ఎప్పుడూ ఏకాంతంగా వుంటావు. కాని, భౌతికంగా ఒంటరిగా వుండవు," అన్నది.

" ఆ బాలునిలో కలుషితంకాని, "మంచి" అనే ఒక పెద్ద సరస్సు వుంది. అతనికి 1969 వరకు రక్షణ కావలసివుంది. గతరాత్రి ధ్యానంలో, ఆ బాలుడు మాదిరిగానే వున్నాడు, ఇప్పటి కృష్ణమూర్తి. అంటే, మాట్లాడే సమయం వరకు. ఆ కృష్ణమూర్తి జీవితంలో ఏమీ మార్పు రాలేదు. ఇప్పటికీ ఆ బాలుడు చెడునుంచి రక్షణ కోరుతున్నాడు," అని,ఆగి, "నేనింకా రక్షణపొందుతున్నట్లే" వుంది.

" ఆ బాలుని దేహం ఒహైలో, ఊటీలో అనేక యాతనలు పడింది. ఎందుకంటే, అతని మెదడులో ఇంకా కొన్ని లోపాలున్నాయి. లోపలవున్న "మంచి," బైటనుంచి ఏ "చెడు"నీ, ప్రవేశింపనీయలేదు, దరిచేరనివ్వలేదు," అని, నేనెవర్నీ, దేన్నీ నిరాకరించను, తోసెయ్యను. నేనెవర్నీ వెళ్ళిపొమ్మనను; కాని, చాలామంది నన్నే వదలిపోతారు.

"హృదయ కవాటాన్ని పూర్తిగా తెరిస్తే, అందు "మంచీ, చెడూ" రెండూ ప్రవేశిస్తాయి. "మంచి" కష్టపడి ప్రవేశించాల్సి వుంటుంది. "చెడు" సులభంగా, తేలికగా ప్రవేశిస్తుంది. చెడు, మంచికి భిన్నమైనదేకాని, వ్యతిరేకమైనది కాదు. వాటి మధ్య ఎటువంటి సంబంధమూ లేదు," అన్నారు కృష్ణాజీ.

ఆ రోజు రాత్రి అర్ధరాత్రి అయింది. అప్పుడు పడుకున్నారు, కృషాజీ.

ఆ తర్వాత కృష్ణమూర్తి బొంబాయినుంచి మద్రాసు వెళ్ళారేకాని, రాజగోపాల్ ఆంక్ష పెట్టడంవల్ల వసంతవిహార్‌లో దిగలేదు. అది K. W I N C కి మాత్రమే సంబంధించిన భవన మన్నారు. అందుచేత కృష్ణమూర్తి శ్రీమతి విజయలక్ష్మితో వున్నారు. ఆమె ఇల్లు వసంతవిహార్‌కి దగ్గరలో వుంది.

1970 జనవరి మధ్యలో కృష్ణమూర్తి ఋషీవ్యాలీలో వున్నారు. "కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ ఇండియా - K F I." అని ఒకటి ఏర్పాటు చేయబడింది. దానికి పుపుల్ జయకర్ ప్రెసిడెంట్. నందిని, బాలసుందరం, సునందా పట్వర్ధన్‌లతో ఒక కమిటీ ఏర్పడింది. ఇండియాలో 'కృష్ణమూర్తి సమస్త కార్యక్రమాల్ని ఆకమిటీ నిర్వహిస్తుంది. సునంద ఎడిట్ చేయగా "బులెటిన్" వెలువడుతుంది.

కృష్ణమూర్తి ఋషీవ్యాలీనుంచి డిల్లీ వెళ్ళారు. అక్కడ బి. శివరామ ఇంట్లో వున్నారు. వారిద్దరూ ఎన్నో సంగతులు చర్చించారు. అంతలో శివరావుకి జబ్బుచేసింది. ప్రమాద మైంది. చనిపోతారనుకున్నారు. గుండె నీరసంగా వుంది. కృష్ణమూర్తి, అతని ప్రక్కన కూర్చుని చాలాసేపు అతనిపై చేయివేశారు.

ఆ రోజు వారి మాటల్లో "శివరావు చనిపోరు," అన్నారు కృషాజీ, చాలా నిశ్చయ భావంతో. ఆ తర్వాత వారి చర్చ "మృత్యువు" గురించి జరిగింది "మృత్యువును గోడ అవతల వుంచండి. జీవిత కదలికలనుంచి దాన్ని దూరంగా వుంచండి. ప్రశ్న ఏమంటే, " మృత్యువంటే ఏమిటి ? మరణమంటే ఏమిటి ? " అని. ఆ రెండూ ఒకటే. తెలిసిన వాటన్నింటికీ

మనసు స్వేచ్ఛగా వుంటే మృత్యువు లేదు. "మృత్యువు", అసలు అనుభవం. అది తెలియని స్థితి.

"చావడమంటే, అగోచరంలో మునిగిపోవడం. సమస్త బంధాలూ ఒక్కసారిగా తెగిపోవడం. మృత్యువు ఒక భావన, అభిప్రాయం. అది వాస్తవంమీద ఆధారపడిందే కాని, గత జ్ఞానంవల్ల భయం కలుగుతుంది. ఆ వాస్తవాన్ని ముఖాముఖి కలుసుకుంటే, ఆ భయం పోతుంది. దేహం, చచ్చిపోతుందంటే, పడే భయంకన్నా, "నేను" చనిపోతుందంటే, పడే భయం అధికం. జీవన్ముక్తి అంటే, బ్రతికివుండగా అగోచరాన్ని అందుకోవడం.

"మృత్యువంటే, కనుపించేవాటికి, తెలిసినవాటికి, అన్నింటికీ చావడం. అన్నింటినీ అంతంచేయడం. ఉన్నదంతా పోవడం. గతానికీ, స్మృతికీ చావడం. ఆసక్తి అంతం కావడం.

"జీవిస్తో, క్షణ-క్షణానికీ, గతానికి చావడమే, నిజమైన మృత్యువు. అది, మృత్యువుతో జీవించడమే అవుతుంది. జీవితంలో, జీవించడం—మృత్యువూ రెండూ కలిసే నడుస్తాయి. అదే అసలు జీవితం.

"మృత్యువనేది ఎక్కడో దూరాన లేదు. అది ప్రమాదాల్లో, రోగాల్లో, ముసలితనంలో లేదు. అది జీవితానికి భిన్నమైనది కాదు. అది గతంలో లేదు.

"నిత్యం, చచ్చేవాడే మృత్యువుకు అతీతుడు. అలా చావడమే, జీవితంలో ఒక అందం—ఆనందం—ప్రేమ." అన్నారు కృష్ణాజీ.

"ఇన్వెస్టిగేట్ యువర్ సెల్ఫ్" అని చెప్పి – నిన్ను నీవు తెలుసుకో– ఆత్మ విచారణ చెయ్యి—పరిశోధించు—పరిశీలించు—పరీక్షించు అని; ఇప్పుడు అవన్నీ కాదని వ్యతిరేకిస్తున్నారు," అని ఒకరు కృష్ణమూర్తితో అంటే, దానికి కృష్ణమూర్తి, "అవును. వాటన్నింటినీ వ్యతిరేకించి, ఇప్పుడు కాదంటున్నాను. ఎందు కంటే, అవి మనిషిని ఎక్కడికీ తీసుకుపోవు. కనుక సమస్తానికీ– చివరికి మీరు అనుకుంటున్న జ్ఞానాన్ని, అన్నింటినీ, అంతనీ "కాదు—లేదు" అని తోసెయ్యడంవల్ల మనసు—మేధస్సు—బుద్ధి – పరిశీలన – పరిశోధన – పరీక్ష – విచారణ–అన్నింటినుంచీ మీరు స్వేచ్ఛ పడతారు. అదే సరైన కిటుకు అనుకుంటున్నాను.

"అయితే, మెదడు తనకు తాను తిరిగి సహజమైన (సాధుత్వానికి) స్థితికి వెళ్ళగలదా? అనంతమైన శక్తి, సామర్థ్యాలు కల ఆ మెదడు, అన్నింటినీ అదుపులో పెట్టేదీ, అన్నింటినీ కదిలించేదీ, సర్వేంద్రియాలచేత పనిచేయించేదీ అయిన ఆ మెదడు పూర్తి సాధువుగా, సహజంగా మారగలదా?

"అంత గతం కలిగిన ఆ మెదడు తనకు తానుగా గతాన్నంతనీ తోసెయ్యగలదా? అన్నింటినీ నిరాకరించ గలదా? ఆ విధంగా మెదడులోని కణాలు వాటికవి మార్పు చెందగలవా? పరిణామం చెందగలవా?"

"ఆలోచన" అనేది భౌతిక విధానం. ఆ ఆలోచన, మెదడు కణాలలోంచి ఉద్భవిస్తుంది. మెదడుకూడా భౌతికమే కదా? ఆ మెదడులోని కణాలు వదలిన మచ్చే, స్మృతి -

గతానుభవం. ఆ మెదడులో స్మృతి - జ్ఞాపకం - అనుభవ జ్ఞానం - అన్నీ వుంటాయి. ఆ కణాల కదలికే, కాలం. అది అనంతకాలం నుంచి ఎదిగినది.

"అందుచేత ఆలోచన అనేది స్మృతి భాండంనుంచి, అనుభవంనుంచి, పోగుజేసి, దాచి, నిల్వ వుంచుకున్న జ్ఞానంనుంచి ఒక గొలుసులాగ అనంతంగా వస్తూనే వుంటుంది. అది కేవలం ఆలోచనా విధానంలోనే వుంది. అది కూడా మెదడులోని ఒక భాగమే. అంటే, ఆలోచన గతంనుంచే పుడుతుంది. దానికి ఇంకో మార్గం లేదు. ఆ గతమే అన్ని కాలాల్లోనూ నడిపించే శక్తి. అది వర్తమానంలో తనకు తాను మారి, నమ్మకాలతో - భ్రాంతులతో రక్షణ ఏర్పరచుకుంటో ముందుకు కొనసాగుతుంది.

"కనుక ముందు ఆ మెదడును జాగ్రత్తగా గమనించాలి. అనేక బాహ్యాంతర ఒత్తిడులవల్ల పరిమితమైన ఆ మెదడు, తన అంతాన్ని, తాను వెతుక్కోగలదా ?

"ఇక్కడ ముఖ్యంగా కావలసింది, జరగవలసిందీ - గతానికి చావడం. చావుతో బంధం అంతమౌతుంది. ఆ అంతంతోనే అసలు సంగతి ఆరంభమౌతుంది. అప్పుడు మెదడులోని కణాల కదలిక కొత్తగా, గతానుభవం లేశమాత్రం లేకుండా, స్వేచ్ఛగా, నిర్మలంగా వుంటుంది.

"ఇంతకాలం ఎందరో కొండల్లో, అడవుల్లో ఇంకా అనేక చోట్ల - అన్నీ త్యజించి; నానాబాధలూ, యాతనలూ పడి, చివరికి వున్నదాన్ని పొందలేకపోయారు. ఎటూ కదలని మనోస్థితే ఆలోచనలు ఆగినస్థితి. ఆలోచనద్వారా, అన్వేషణ అంటూ లేదు.

"మెదడు అంటే, ఆదికాలంనుంచీ-యావత్ మానవజాతి స్వతసిద్ధమైన బుద్ధి. అటువంటి బుద్ధి, పరిశీలన, పరిశోధన, పరీక్ష, అన్వేషణ, ప్రయోగాత్మక స్థితులలో లేదు. ఇన్నాళ్ళూ అలా చేసి తప్పిపోయారు. ఏ ఒక్కటీ, ఎవరినీ అక్కడకు తీసుకుపోలేదు," అన్నారు కృష్ణాజీ.

కృష్ణాజీ నిరాకరణ గుడ్డిగా, మూర్ఖంగా లేదు. ఆ నిరాకరణలో ఎంతో వివేకం వుంది. దాని వెనక "లాజిక్" కూడా వుంది. అంటే, "అది కాదు, ఇదీ కాదు," అనడం. సనాతనమైన మెదడు తన పరిధిదాటి కదలాలి. ఆ స్థితిలో మెదడు ఎట్లా పనిచేస్తోందో గమనించాలి. అది ముఖ్యం.



1971 మార్చి మూడవ తేదీన కృష్ణమూర్తి ఒహై వెళ్ళి, రాజగోపాల్‌ని కలుసుకుని, తమ వ్యవహారం నిశ్శేషంగా పరిష్కరించ దలిచారు. ఆ సమావేశం జరగలేదు. ఆ తర్వాత అతనితో కలిసి మాట్లాడినా లాభం లేకపోయింది.

ఏప్రిల్ ఐదవ తేదీన మూడవసారి కృష్ణమూర్తి రాజగోపాల్ ఇంటికి వెళ్ళి, వ్యవహారం విషయమై గంటన్నర మాట్లాడారు వ్యవహారం పరిష్కారం కాకపోయినా, ఒహైలో స్కూలు పెట్టాలనే గట్టి సంకల్పంతో కృష్ణమూర్తి స్థలం కొన్నారు. "ఈ నా ఉద్దేశ్యం—సంకల్పం సరైనది అయితే, అది సక్రమంగా జరుగుతుంది," అన్నారు



కృష్ణమూర్తి ఫౌండేషన్స్ మూడుచోట్ల స్థాపించబడ్డాయి.

(1) 1968 ఇంగ్లండులో - బ్రాక్‌వుడ్ పార్క్‌లోనూ,

(2) 1969 అమెరికాలోనూ,

(3) 1970 ఇండియాలోనూ.

1970 లో కృష్ణాజీ తన జీవిత చరిత్ర రాయమని మేరీ లూట్యన్స్‌ను అడిగారు. ఆమెకు తన వ్రాతమూలకమైన అనుమతి కూడా ఇచ్చారు. తన ఉపన్యాసాలు - ఉత్తరాలు అన్నీ స్వేచ్ఛగా ఉపయోగించుకోమన్నారు.

"తనను ఏదో దివ్యశక్తి నడుపుతోందన్న విషయం రాయాలి సుమా!" అని కూడా చెప్పారు కృష్ణాజీ.

1971 చివరలో కృష్ణమూర్తి రోమ్‌లో వున్నారు, అక్కడా ఆయన ఆరోగ్యం కుదుటపడలేదు. ఆ సందర్భంలో "వీలైనంత వరకు ఈ దేహాన్ని కొనసాగించడమే మన బాధ్యత," అన్నారు కృష్ణాజీ మిత్రులతో.

రోమ్‌నుంచి పుపుల్‌జయకర్‌కు ఉత్తరంరాస్తో, "ఇండియా పాకిస్తాన్‌ల మధ్య యుద్ధం వస్తుందని అనుకుంటున్నారు. వేసవి తర్వాత "గస్టాడ్"లో నా దేహం చాలా అలసిపోయింది. ప్రతిరోజూ వాంతి అయ్యేది. నిద్రపట్టేది కాదు. పగలంతా పక్కమీద వుండేవాడిని. రెండు ఉపన్యాసాలు రద్దుచేశారు. దేహం పూర్తి విశ్రాంతి కోరుతోంది. నేనిప్పుడు ఇండియా వస్తే, మరింత జబ్బుపడి, పక్కవారికి ఇబ్బంది కలిగిస్తాను," అన్నారు.

ఆ సంవత్సరం ఇండియారాక, "మాలిబ్" వెళ్ళి, మేరీ జింబాలిస్ట్ ఇంట్లో వుంటూ సినిమాలు చూస్తూ, బీచ్ ఒడ్డున తిరు

గుతూ చదువుకుంటో, టి. వి చూస్తో కాలం గడిపారు. ఎక్కువ సేపు ధ్యానంలో వుండేవారు. శారీరకంగా, మానసికంగా కృష్ణాజీలో చాలా మార్పులు వచ్చాయి. ఆ స్థితి 1972 మే వరకూ వుంది.



**1972** వసంతకాలంలో కృష్ణమూర్తి ఢిల్లీలో వున్నారు. ఆ జూలై ఇరవై మూడవ తేదీన పుపుల్‌జయకర్ భర్త మరణించారు. ఆమెతో, కృష్ణమూర్తి, "భయం, అనేక రూపాల ఎప్పుడూ వుంది. ప్రతిదీ భయాన్ని కలిగిస్తుంది. మన లోపలా-బైటా - చుట్టూ ఎప్పుడూ భయం వుంది. అసలు "భయం" అనేది మన రక్త కణాల్లోనే వుంది. భయం ఆనువంశికంగా కూడా వస్తుంది. భయం, మన మంచం మీది దుప్పటికింద వుంది. ఆ దుప్పటి పైకెత్తిచూస్తే, భయం కనుపిస్తుంది. మనం నిజంగా, శ్రద్ధగా పరిశీలించినా, పరిశోధించినా, పరీక్షించినా భయం ఏమాత్రం వుండదు. భయం, మన జీవితంలో ఒక భాగమైనప్పుడు మనం దానికి ఎందుకు భయపడాలి? బాధపడాలి? "కాలం" నుంచి స్వేచ్ఛ పడ్డప్పుడే, నిర్భయంగా వుండగలం," అన్నారు.

నవంబరు పందొమ్మిదవ తేదీన కృష్ణమూర్తి మిత్రులతో మాట్లాడుతూ, "మెదడుకు సరైన శిక్షణ అవసరం. లేకపోతే అది స్వేచ్ఛగా, శక్తివంతంగా పనిచేయలేదు. మనం మెదడులోని ఒక చిన్న భాగాన్ని మాత్రమే ఉపయోగించుకుంటున్నాం. ఆ భాగం—ఆలోచనకూ, దాని కదలికలకూ సంబంధించినంత వరకే! అంటే, మెదడును పూర్తిగా పనిచేయించడం లేదు. అందుచేతనే మన ఆలోచన కూడా అసంపూర్ణంగానే వుంటుంది. ఆ ఆలోచన మన ఇంద్రియాలమీద ఆధారపడి పనిచేస్తోంది. అది పరిమితమైనది.

" మెదడుకు సరైన శిక్షణ వుంటే, మనసూ శాంతిగా వుంటుంది. అటువంటి నిశ్చల మనస్సులో "కాలం" లేదు. ఆ మౌనావస్థలో అన్వేషకుడు లేడు, అనుభవమూ లేదు. వుండేది సంపూర్ణమౌనం ఒక్కటే. ఆ మౌనంలోనే ద్వారం తెరచు కుంటుంది. ఆ ద్వారం వెనుక ఉన్నది ఏదో దాన్ని మాటల్లో వర్ణించలేము. అది వర్ణనాతీతం. దాన్ని ఎవరూ మాటల్లో పెట్టలేరు.

"మెదడులోని కణాలు ఒకసారి విచ్ఛిన్నమైతే, నిర్వీర్య మైతే, అవి తిరిగి ఎప్పటికీ కోలుకోలేవు. అంటే, పునః సృష్టి కావు. కాని, ఒక కొత్త కణం పుట్టవచ్చు. పుట్టి, కొత్త సంబంధాన్ని కలిగించవచ్చు.

"కదలికలేని మెదడు స్థితే, సమాధి. కాని, ఆ స్థితిలో అనంతమైన కదలిక ఎప్పుడూ లయబద్ధంగా వుండనే వుంటుంది.

" మెదడు ఎప్పుడూ రక్షణా, క్రమం కోరుతుంది. కణాలలో ఐకమత్యం కూడా కోరుతుంది. ఐకమత్యం వుంటేనే రక్షణా, క్రమం వుంటాయి. కాని, ఇంతవరకూ అది ఎప్పుడూ అలా లేదు," అన్నారు.

• • •

" జీవితానికి కొన్ని అనువంశిక, ఆదర్శవంతమైన సాంప్రదాయాలు సహాయం చేస్తాయి. మనిషి వికాసం చెందడానికి అవి ఉపయోగపడతాయి. ఆ సాంప్రదాయాలు మనిషిని మంచి క్రమశిక్షణలో కూడా వుంచుతాయి,'' అనే భావంతోవున్న " ivan illich - ఇవాన్ ఇల్లిచ్చి " అనే ఆయన నవంబరు ఇరవై ఏడవ తేదీన కృష్ణమూర్తిని రాజఘాట్‌లో కలుసుకున్నారు.

ఆయన ఇందిరాగాంధీ ఆహ్వానంపై ఇండియా వచ్చారు. ఆయన్ని పుపుల్ జయకర్ కృష్ణమూర్తికి పరిచయం చేసింది.

"సాంప్రదాయాలు ఎంత గొప్పవైనా, ఎక్కడివైనా, ఎప్పటివైనా, ఆధునికమైనవైనా, ఉన్నతమైనవైనా, ప్రాచీన మైనవైనా మనిషిచుట్టూ షరతులు, నిబంధనలు, నియమాలు ఏర్పరుస్తాయి," అన్నారు కృష్ణాజీ, ఇవాన్ ఇల్లిచ్చితో.

కృష్ణమూర్తి ఆయనతో ఏకీభవించలేదు. ఎందుకంటే, ఏ రకమైన క్రమశిక్షణ అయినా కట్టుబాట్లయినా హింసాత్మకమే ! ఆ బాధ్యత ఏదో అది లోపల్నించి స్వేచ్ఛగా వచ్చినప్పుడే, అందులో ప్రేమ, దయ వుంటాయి. స్వేచ్ఛా, దయా రెండూ ఒకటే, కృష్ణాజీ దృష్టిలో.

"మతాలు, జాతీయతలు, వర్గాలు, నమ్మకాలు, సిద్ధాంతాలు వినాశనకారులు. సమస్త విజ్ఞానం పాతదే ! అది గతానికి చెందినదే ! అటువంటి పాత విజ్ఞానంనుంచి స్వేచ్ఛగా వుండాలంటే, మనం దేనికీ చెందకుండా, దేనికీ సంబంధించకుండా వుండాలి. అదే మార్గం," అంటారు కృష్ణమూర్తి.

"నీకు నీవు కొత్తగా ఏ శాస్త్రజ్ఞానాన్నీ పోగుచేసుకో కూడదు," అని కృషాజీ అంటే, "కొత్తగా తెచ్చిపెట్టుకున్న జ్ఞానంతో, కొత్త అనుభవం వస్తుంది కదా ?'' అని ఇల్లిచ్చి అన్నారు.

అసలు "అనుభవం" అనేదాన్నే తోసేస్తూ, "అనుభవం అపాయకారి. ఎందుకంటే, మనసు పూర్తి తికమకలో వున్నప్పుడు, అనుభవంతో పనేముంది ? దానితో ప్రయోజన

మేముంది ? మనసు అనుభవశూన్యంగా వుంటే. సమస్త విశ్వంతో సంబంధం వుంటుంది.

"ఒకతను తనకు తానుగా, ఒంటరిగా ఒకదానికి చెంది వున్నాడనుకోండి. అతడు భయపడతాడు వెనక్కి తగ్గుతాడు— మతానికో, వర్గానికో, దేశానికో, దేనికో ఒకదానికి వెళ్ళి అతుక్కుంటాడు. అది ఏదైనా, అదీ మహాప్రవాహంలో ఒక భాగమే కదా ? కనుక గతించిపోయేవాటన్నింటినీ చూస్తూ, సదా సాక్షీభూతంగా వుండండి. వూరికే వుండండి. అది చాలు. తర్కించవద్దు. అనువదించుకోవద్దు. తప్పు—ఒప్పు ; అందం— వికారం; మంచి—చెడ్డ ; అది—ఇది—ఏదీ అనవద్దు, అనుకోవద్దు. "అది లేకపోతే నేనెట్లా బ్రతకను ?" అనకండి. వూరికే వుండండి. చూడండి, అన్నింటినీ. ఆ చూపులో కలుషితం లేదు, వుండదు.

"అలా చూస్తున్నప్పుడు మనసు తనకు తాను కల్పించుకున్న ఇంద్రజాలంలోంచి, చిక్కుల్లోంచి తప్పించుకుని బైటపడుతుంది. అప్పుడది దేనినైనా అనాలోచితంగా చూడగలుగుతుంది.

"ఆలోచనారహితమైన ఆ ఎరుకే, నిజంగా, సంపూర్ణంగా పనిచేయడం. అజ్ఞానం, వైరుధ్యం, ఘర్షణ వల్ల దుఃఖం కలుగుతుంది. ఆ దుఃఖంతో కలిసి ముందుకు సాగడమే, దుఃఖానికి అతీతంగా వుండటం," అంటారు కృష్ణమూర్తి. అంటే, నిరంతరం లోపలా—బైటా పూర్తిగా, నిజంగా కలసి కదలడం.

* * *

1973 జూన్‌లో "కృష్ణమూర్తి ఫౌండేషన్" మొదటి అంతర్జాతీయ సమావేశం "బ్రాక్ వుడ్" లో జరిగింది.

ఆ సమావేశానికి ఇండియా ప్రతినిధులుగా సునంద, అచ్యుత పట్వర్ధన్, బాలసుందరం, పుపుల్ జయకర్ వెళ్ళారు. కృష్ణమూర్తి వారిని విదేశీయులకు పరిచయం చేస్తూ, "అచ్యుత్ గురించి ఎలా పరిచయం చేయను ? ఆయన బ్రిటిష్‌వారిని ఇండియానుంచి తరిమేసిన ప్రముఖులలో ఒకరు అని చెప్పనా?" అన్నారు.

ఆ సమావేశాలకు హాజరైన సభ్యులందరూ కృష్ణమూర్తి రచనల కాపీరైట్స్ గురించి చర్చించి ఒక నిర్ణయానికి వచ్చారు. కృష్ణమూర్తి రచనలలో ఆయన ఉపన్యాసాలు, చర్చలు, సంభాషణలు కూడా కలుస్తాయి.



కృష్ణమూర్తికి తనదంటూ స్వంత ఆస్తి ఏమీలేదు, ఆయన ఒంటిమీద బట్ట — చేతి గడియారం తప్ప. ఆయన తన వీలునామాలో "నేను ఎక్కడ మరణిస్తే అక్కడ నన్ను దహనం చేయండి. ఒకవేళ నేను ఇండియాలో చనిపోతే, "గోల్డర్స్ గ్రీన్"లో దహనం చేయండి. నా అస్తికలపై ఎటువంటి నిర్మాణమూ చేయవద్దు," అని రాశారు.

కృష్ణమూర్తి తన వీలునామా గురించి ప్రస్తావించిన తర్వాత, "మా ప్రియతముని అస్థికలు కాళ్ళకిందపడి తొక్క బడటం మాకు సమ్మతం కాదు కనుక, వాటిని ఇండియా నదులన్నింటిలో నిమజ్జనం చేస్తాం," అన్నది పుపుల్ జయకర్.

పుపుల్ జయకర్ మాట విన్న తక్షణం కృష్ణమూర్తి గంభీరులై అందరివంకా తీక్షణంగా చూసి, నిశ్చయభావంతో, "ఈ దేహం పవిత్రమైనది," అన్నారు.



ఒక సందర్భంలో 'కృష్ణమూర్తి మిత్రులలో స్త్రీ—పురుష సంబంధమైన విషయాలపై మాట్లాడుతూ "అన్ని కాలాల్లో అన్ని మతాలూ "సెక్స్"ని నిరాకరించాయి, అణచాయి. ఎందు కంటే, సెక్స్ సంబంధంవల్ల శక్తి వ్యర్ధమౌతుందని వాటి అభిప్రాయం. ఆ శక్తి సహాయంతో ఏదో ఘనకార్యం ఏదైనా సాధించవచ్చునని, దేనినైనా దర్శించవచ్చునని ఆ మతాలు చెప్పాయి. ఆ విధమైన మానసిక, శారీరక నిరోధం, సున్నిత మైన ఇంద్రియజ్ఞానాన్ని బాధిస్తుంది. అటువంటి హింసాత్మక ఆలోచనవల్లనే, అసలు శక్తి వ్యర్ధమయ్యేది. సెక్స్‌వల్ల మనలోని శక్తి ఏమాత్రం వ్యర్ధంకాదని వారు తెలుసుకోలేకుండా వున్నారు.

" మనం సెక్స్‌ని సమస్య చేసుకుంటాం. అది నిజంగా సమస్య కాదు. ఒకరితో మంచంమీద వుండటం, వుండకపోవడం కాదు, సమస్య. సెక్స్‌కు సంబందించిన ఆలోచన మనల్ని ముందుగా ఆక్రమించుకోవడంవల్ల, అది సమస్యగా మారుతుంది. అందుచేత సెక్స్‌ని సమస్యగా చేసుకోకూడదు. ఒక్క సెక్స్ వల్లనే కాదు, ఇంకా అనేక విధాల నిత్యం—నిరంతరం శక్తి వ్యర్ధమౌతున్న సంగతిని చాలామంది గమనించలేకుండా వున్నారు సెక్స్ మాదిరిగానే జీవితంలో ఇంకా ఎన్నో విషయాల్లోకూడా మనం సరైన శిక్షణలో, క్రమంలో వుండాలి. కాని, వాటికి బానిసలం కకూడదు.

" భయం—అసూయ—అవమానం—అపనమ్మకం—స్వాధీనంలో వుంచుకోవాలనే యోచన—తృప్తి—రక్షణ—అధికారంతో అడగడం మొదలైనవాటివల్లా, గురువో, గ్రంథమో చెప్పాయనీ సెక్స్‌ని మార్గంగా అణుస్తారు. ఆ విధంగా సమస్త విశ్వసౌందర్యాల్ని విస్మరిస్తారు. అందమే "స్త్రీ" అని వారి భావన.

"ఒక పక్క మనసు, దేహం వాళ్ళను తినేస్తూనే వుంటాయి వాళ్ళ మనసు హింసతో కొట్టుకుంటూ వుంటుంది. హృదయం ముడుచుకుని వుంటుంది. అదీ వాళ్ళ తీరు," అన్నారు కృష్ణాజీ.

  

సెప్టెంబరులో కృష్ణమూర్తి బ్రాక్‌వుడ్‌లో వుండగా విపరీతమైన వర్షాలవల్ల ఆయన ఇంట్లోనే వుండి స్టీరియో ప్లేయర్ మీద బాక్, బిథోవెన్ సంగీతాలు వింటూ కాలం గడిపేవారు.

  

నవంబరు పదిహేడవ తేదీన కృష్ణాజీ ఢిల్లీ వచ్చారు. పుపుల్ జయకర్ విమానాశ్రయానికి వెళ్ళింది. అక్కడ మహర్షి మహేష్‌యోగి నిలబడి వున్నారు. ఆయన మెడలో పెద్ద గులాబి పూలమాల వుంది. ఆయన చుట్టూ శిష్యులు నిలబడి వున్నారు. "మీతో మహేష్‌యోగి విమానంలో వున్నారా?" అని పుపుల్ జయకర్ కృష్ణమూర్తిని అడిగింది. దానికి ఆయన చిరునవ్వు నవ్వారు. అంతలో ఒకతను వచ్చి, ఒక గులాబి పువ్వు కృష్ణ మూర్తి చేతికిస్తూ, "ఈ గులాబి పువ్వును మహేష్‌యోగిగారు మీకు ఇవ్వమన్నారు. మీకు వారి శుభాకాంక్షలు తెలపమన్నారు," అన్నాడు, దానికి కృష్ణమూర్తి, "వారికి నా కృతజ్ఞతలు తెలపండి," అన్నారు,

ఆ తర్వాత కృష్ణమూర్తి బాత్‌రూమ్‌నుంచి వచ్చేప్పుడు మహేష్‌యోగి పక్కనుంచి వస్తోవుంటే, ఆయన కుర్చీలోంచి లేచి, కృష్ణమూర్తికి నమస్కారం చేశారు. కృష్ణమూర్తి కూడ వారికి నమస్కారం చేశారు. ఆయన కృష్ణమూర్తిని తన పక్కనవున్న కుర్చీ చూపి, "కూర్చోండి, కాస్సేపు మాట్లాడ కుందాం," అన్నారు.

కృష్ణమూర్తి, మహేష్‌యోగి పక్కన కూర్చున్నారు. "నేను నేపాల్ వెడుతున్నాను. ప్రపంచంలో మార్పు తీసుకు రావాలనుకుంటున్నాను. మీరు నాకు సహాయంగా వుంటే, దాన్ని తప్పక సాధించగలననే ధీమా నాకు వుంది," అన్నా రాయన.

దానికి కృష్ణమూర్తి, "నేను ఒప్పుకుని చేస్తానన్న పనులు చాలా వున్నాయి క్షమించండి," అన్నారు.

మహేష్‌యోగి మరొకసారి కృష్ణమూర్తిని కోరారు. "తాను చేపట్టిన కార్యక్రమం చాలా ముఖ్యమైనది," అని అంటో. ఆ విధంగా వారిద్దరూ ఒక అరగంటసేపు మాట్లాడు కున్నారు.



ఒకసారి పుపుల్ జయకర్‌తో, "గురువు లేడు - శిష్యుడు లేడు" అన్నారు కృష్ణాజీ. అని, "నువ్వు వుంటే, ఇంకొకటి లేదు. ఉన్నది నువ్వు మాత్రమే! దాన్ని తెలుసుకోవాలి, అంటే, నిన్ను నీవు తెలుసుకో! ఎందుకంటే, అసలు వున్నది నువ్వే కనుక. ఇంకేం లేదు," అన్నారు.

"ఏ గురువూ, ఏ దైవం, ఎవరూ, ఏదీ మనిషిని విముక్తి పరచలేరు. ఒక్క తనను తాను తప్ప," అనేది కృష్ణాజీ బోధ లోని సారాంశం.

"గురువు పని సూచించడం, తెలపడం, చూపడం వరకే. గురువు చుట్టూ గిరిగీస్తారు కాని, ఆయన బోధలోని సారాన్ని గ్రహించరు. అదే సాధకుల్లో, అన్వేషకుల్లో లోపభూయిష్టమైన సంగతి. గతంలో అన్ని మతాలూ అట్లానే నడిచాయి,

"గురువును కాక, గురుబోధలోని సారాన్ని గ్రహించాలి. బోధలోని సత్యాన్ని చూడాలి. దాని అగాధాన్ని అన్వేషించాలి. దాని లోపలకు వెళ్ళి చూడాలి. దానితోనే జీవించాలి. అదే జీవితంలో ముఖ్యమైన సంగతి.

"అన్ని మతాలూ ఆయా వ్యవస్థాపకులకు ప్రాధాన్యం ఇచ్చి, వారి బోధల్ని ఉపేక్ష చేస్తాయి.

" ఆ సాధన స్వల్పంగా, అల్పంగా వున్నట్లు తోచినా, ఆచరణకు అసాధ్యం," అన్నారు కృష్ణాజీ.

• • •

" భగవంతుడు వున్నాడా ? వుంటే, భగవంతుణ్ణి వర్ణించి చెప్పండి ? " అని ఒకరు కృష్ణాజీని అడిగితే, దానికి– "భగవంతు మనం కొత్తగా కల్పించుకున్నాం. మన ఆలోచనే భగవంతుణ్ణి కల్పించింది. అంటే, మనం దుఃఖంతో–నిరాశతో–ఒంటరిగా–ఆత్రుతతో వున్నప్పుడు, మన ఆలోచన కల్పించిందే, "దైవం." వ్యక్తిగతంగా నాకు దేనిమీదా నమ్మకం లేదు. భయం, దుఃఖంనుంచి స్వేచ్ఛగావుంటే, దైవప్రసక్తే రాదు," అన్నారు కృష్ణమూర్తి.

• • •

డిశంబరు పదహారవ తేదీన కృష్ణమూర్తి - రాజగోపాల్ మధ్య వ్యవహారం శాశ్వతంగా పరిష్కారమైంది. ఆ తర్వాత రాజగోపాల్ ఆర్యవిహార్‌నుంచి వెళ్ళిపోయాడు.

దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులుగా "కోట్స్" నియమితులైనారు.

1975 - జనవరిలో కృష్ణమూర్తి - మేరీ జంబాలిస్ట్ ఒహై వెళ్ళారు. అక్కడ దంతా బాగుచేయించారు. "ఓక్ గ్రోవ్" స్కూలు తెరిచారు.

రాజగోపాల్ వద్ద కృష్ణమూర్తి కొన్ని వ్రాత ప్రతులు వున్నాయి. వాటిని తిరిగి ఎవరికీ, చివరికి కృష్ణమూర్తికి కూడా ఇవ్వడానికీ, కనీసం చూపడానికీ రాజగోపాల్ నిరాకరించాడు. "అచ్చయిన తర్వాత అవన్నీ పోయాయి," అన్నాడు. అటువంటి సంకుచితత్వంతో ప్రవర్తించాడు. అంతేకాదు, ఇంకా అసభ్యంగా, అమర్యాదగా మాట్లాడాడు.

• • •

జూన్‌లో కృష్ణాజీ "టెనెగ్"లో వుండగా ఆయన వుండే ఇంట్లో పెద్దసైజు పెద్దపులి ఫోటో ఒకటి వుండేది. దాన్ని మేరీలాట్యెన్స్‌కి చూపుతూ, "నేను ఆపులికి అప్పుడప్పుడూ చెపుతాను - జాగ్రత్తగా వుండు," అని. దానికి ఒకసారి గట్టిగా చెప్పాను, కూడా; "మనుష్యుల్ని తప్పించుకో. వాళ్ళు నిన్ను తెలివిగా చంపేస్తారు," అని, అన్నారు కృష్ణాజీ.

కృష్ణమూర్తి ఒకసారి ఇండియాలో వున్నప్పుడు ఒకరోజు సాయంత్రం ఒక మిత్రుని కారులో అడవి ప్రాంతానికి వెళ్ళి, చీకటిపడేవేళ తిరిగి వస్తోవుండగా, ఒకచోట - రోడ్డు మలుపులో ఒక పెద్దపులి రోడ్డు మధ్య కూర్చుని వుంది. దాన్ని అంత దగ్గరగా చూసిన దృశ్యాన్ని కృష్ణాజీ ఇట్లా వర్ణించారు: "ఆ పెద్దపులిని చూసి నా మిత్రుడు కారు ఆపాడు. కారు లైటులో దాని కళ్ళు మరీ మెరిశాయి. అది గుర్రుమని శబ్దంచేస్తూ, మా కారు దగ్గరకు వచ్చింది. అది మెరపులాగ వచ్చి, మా కారును గట్టిగా నెట్టింది. అది పెద్ద పులి. దాని తోక కూడా

చాలా పొడవుగా వుంది. చూడ్డానికే భయంకరంగా వుంది. దానివి నల్లని పెదాలు. అది అరుస్తూ మా కారును మళ్ళా కదిపింది. కారు తలుపు వూడింది. అది ఇంకా గుర్రు పెడుతూనే వుంది. నేను కారులోంచి చెయ్యి బైటికి పెట్టాను, ఆ అరణ్యాధిపతిని తాకాలని. కాని, నా మిత్రుడు వెంటనే నాచేతిని వెనక్కిలాగి, "పులి, చెయ్యి కొరికేస్తుంది," అన్నాడు. ఆ తర్వాత మేము ఇంటికి వచ్చేశాము.



అటువంటిదే ఇంకొక సంగతి జరిగింది. కృష్ణాజీ ఇండియాలో వున్నారు. ఆయన ఒక కుటీరంలో యోగాసనాలు చేస్తుండగా కిటికీలోంచి ఒక కోతి ఆయన్ని చూస్తోంది. కిటికీ వూచల్లోంచి ఆ కోతి చేతిని లోపలికి జాచింది. కృష్ణాజీ ప్రేమగా దాని చెయ్యిపట్టుకున్నారు. దాని అరచేయి గరుకుగా, మొద్దుగా వుంది. చేతి పైభాగం బొచ్చుతో, మృదువుగా, పట్టులాగ మెత్తగా వుంది. అది లోపలకు రావాలని చూసింది. ఆసంగతి గమనించి, "నువ్వు లోపలకు రాలేవు. వచ్చే వీలూలేదు. అదీ కాక ఇక్కడ నీకు చోటూలేదు," అన్నారు కృష్ణాజీ ఆ కోతితో.

ఆయన దాని చేతిని కొన్ని నిమిషాలు ప్రేమగా పట్టుకొని, "నేను యోగాసనాలు చేయాలి," అంటూ దాని చేతిని వదిలేశారు. ఆయన మాటలు దానికి అర్థమయ్యాయిగావును, అది వెళ్ళిపోయింది.



1976 వసంతకాలంలో ఒహైె ఆర్యవిహార్‌లో ఒక సెమినార్ ఏర్పాటు చేశారు. ఇండియానుంచి సునంద, ఆమె భర్తా, నారాయణ వెళ్ళారు. కామెర్లవల్ల బాలసుందరం వెళ్ళలేదు.

బాలసుందరం ఆరోగ్యం బాగాలేకపోవడంవల్ల, వసంత్ విహార్‌కు సెక్రటరీగా సునంద నియమింపబడింది. అప్పటికి వసంత్ విహార్‌కి డబ్బులేదు. అది అంతా అస్తవ్యస్తంగా వుంది. దాన్నంతా సర్ది, కృష్ణమూర్తి కొన్ని పుస్తకాలు కూడా అచ్చు అయ్యేట్లు చేసింది, సునంద.



అక్టోబరులో కృష్ణమూర్తి ఇండియా వచ్చి ఢిల్లీలో పుపుల్ జయకర్‌తో వున్నారు. కాని, ఆ శీతాకాలం ఇండియా రావడానికి కృష్ణమూర్తి మొదట ఇష్టపడలేదు. ఎందుకంటే ఇండియాలో "ఎమర్జెన్సీ" వుండటంవలన తాను ఏం మాట్లాడితే, ప్రభుత్వం ఏం అర్థంచేసుకుంటుందో అనే ఉద్దేశ్యంతో. ఆ సందర్భంలో పుపుల్ జయకర్ ఇందిరాగాంధీని కలుసుకుని, కృష్ణమూర్తి విషయం చెపితే, "దానికేముంది ? ఆయన ఇండియా వచ్చి స్వేచ్ఛగా మాట్లాడవచ్చునే!" అన్నది. అప్పుడు కృష్ణాజీ ఇండియా వచ్చారు.

అక్టోబరు ఇరవై ఏడవ తేదీన పుపుల్‌జయకర్ ఇందిరా గాంధీని తన ఇంటికి భోజనానికి పిలిచింది. ఆ విందుకు అచ్యుత పట్వర్ధన్, నందిని, ఆమె కూతురు దేవి, సునంద, ఆమె భర్తా, ఎల్. కె. ఝా, కృష్ణమూర్తి వున్నారు.

ఆ రోజు ఇందిరా గాంధి కృష్ణమూర్తితో రాత్రి తొమ్మిది గంటల వరకూ ప్రత్యేకంగా ఎంతో మాట్లాడింది.

బోజనాల దగ్గర ఎటువంటి చర్చా జరగలేదు. మామూలు కబుర్లు తప్ప. చాలావరకు అందరూ గంభీరంగా వుండి పోయారు. దానికి కారణం, దేశంలో ఎమర్జెన్సీ అమలులో

వుండటం. ఎన్నడూ లేనిది కృష్ణమూర్తి తనకు తానుగా కలగ జేసుకుని, "సెయింట్ పీటర్ - స్వర్గం," గురించిన ఒక కథ చెప్పారు :

ఒక ధనవంతుడు తన జీవితకాలంలో ఎన్నో దాన ధర్మాలుచేసి, మరణించి, స్వర్గద్వారం చేరుకుని, ద్వార పాలకుడుగావున్న సెయింట్‌పీటర్‌ని కలుసుకున్నాడు. పీటర్‌కి తన ఆనవాలు చూపించాడు. పీటర్ అది చూసి, అతను లోపలకు ప్రవేశించేందుకు అనుమతి ఇచ్చాడు.

"లోపల ప్రవేశించడం సులభమేనా ?" అని ఆ ధన వంతుడు అడిగాడు. దానికి ఆయన "చాలా సులభం. ద్వారం తట్టావా, తెరచుకుంటుంది. నిన్ను అక్కడకు చేరుస్తుంది," అన్నాడు. అని, "అలా లోపలకు వెళ్ళేముందు, ఒకసారి అధోలోకం కూడా ఎలావుందో చూడకూడదా?" అన్నాడు పీటర్.

"అలాగే, తప్పకుండా చూస్తాను. అయితే అక్కడకు దారి ఎటు ?" అని అడిగాడు ఆ ధనవంతుడు.

"అది ఏమంత కష్టం కాదు, ఒక మీట నొక్కు. సరి పోతుంది," అన్నాడు పీటర్.

ఆ ధనవంతుడు అలాగే ఒక మీట నొక్కాడు. ఒక ఎలివేటర్ అతన్ని అక్కడనుంచి తీసుకుపోయింది. అతను అలా వెడుతూవుండగా అధోలోక ద్వారాలు తెరచుకున్నాయి. ఆదారి పొడవునా పూల వనాలు, కొలనులు, సెలయేర్లు, అందమైన పర్వతాలు, సౌందర్యవంతమైన స్త్రీలు, ద్రాక్షసారాయి, రుచైన భోజన పదార్థాలు కనుపించాయి. అతన్ని ఆహ్వానించి తీసు కోవడానికి అందమైన ఆడవాళ్ళు ఎదురుచూస్తున్నారు.

అందమైన, సుందరమైన ఆ ప్రదేశంలో అతడు కొంత సేపు ఆనందంగా గడిపాడు. తిరిగి పీటర్ దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళి, "అధోలోకం ఎంతో బావుంది. సరదాగా వుంది. తిరిగి నేను వెళ్ళి, అక్కడే వుండిపో తాను," అన్నాడు ఆ ధనవంతుడు.

దానికి పీటర్, "నేను అప్పుడే అనుకున్నాను, నువ్వు అట్లాంటి నిర్ణయం తీసుకుంటావని," అన్నాడు.

ఆ ధనవంతుడు మళ్ళా అధోలోక ద్వారం దగ్గరకు వెళ్ళి మీటనొక్కాడు. ద్వారం తెరచుకుంది. పూలవనం అదృశ్య మైంది. పై పెచ్చు బాగా బలసిన రెండు దున్నపోతులు అతన్ని తరిమి పొడవబోయాయి. అతడు వాటిని ఆపుజేయ బోయాడు. వాటిని ఆపలేక, ఆయాసపడుతూ, "అసలు ఏం జరిగింది? ఇదేమిటి, ఇక్కడ ఇలా వుంది? కొన్ని నిమిషాల క్రిందట ఇక్కడకు ఎస్తే ఘనస్వాగతం లభించింది. ఇప్పుడు ఇట్లావుందేమిటి?" అని ఒకతన్ని అడిగితే, దాని కతడు, ఆ ధనవంతుణ్ణి ఒక్క దెబ్బకొట్టి, "అప్పుడు నువ్వు కేవలం ఒక సంచారివి మాత్రమే." అన్నాడు, ఆ కింకరుడు. ఆ కథ విని అందరూ గొల్లున నవ్వారు.

ఆ కథ విన్న తర్వాత తనకూ ఉత్సాహం కలిగి, తానూ ఒక కథ చెపుతానన్నది, ఇందిరా గాంధి.

చంద్రమండలంలోకి వెళ్ళిన అంతరిక్షయాత్రికులు తిరిగి భూమికి వచ్చిన తర్వాత ఒకసారి కృశ్చేవ్‌ని కలుసుకున్నారు. ఆయన వారితో,మీరు అంతరిక్షంలో ఎక్కడైనా అత్యద్భుతమైన కాంతినిగాని, వింతప్రాణినిగాని, గొప్ప మహిమగల, పెద్ద తెల్ల గెడ్డంతో ప్రకాశవంతమైన కాంతికల బోధిసత్త్వుణ్ణిగాని చూశారా?" అని నెమ్మదిగా అడిగాడు.

దానికి వారు, "చూశాం, కామ్రేడ్! చూశాం," అన్నారు. "అందుకే నేను భయపడుతున్నాను; మీరు అక్కడ అవన్నీ చూసి వుంటారని. మీరు అవన్నీ చూసిన సంగతి ఎవరికీ చెప్పకండి. ఈ రహస్యం మన మధ్యే వుండాలి సుమా? జాగ్రత్త! ఎవరికీ ఈ రహస్యం తెలియకుండా వుంచండి," అని వారికి మరీ మరీ హెచ్చరికగా చెప్పాడు.

తర్వాత ఆ అంతరిక్ష యాత్రికులు ప్రపంచ పర్యటన చేస్తో, "పోప్"ను చూశారు. వారు ఆయనకు తమను పరిచయం చెసుకున్నారు. పోప్ వారిని ఆహ్వానించి, పక్కగదిలోకి తీసుకు వెళ్ళి, "నా బిడ్డల్లారా, అంతరిక్షంలో మీరు వున్నప్పుడు అక్కడ ఎక్కడైనా దివ్యకాంతుల్ని చూశారా? తెల్లగెడ్డంకల, మహాకాయంగల మహాత్ముణ్ణి దర్శించారా?" అని అడిగారు.

దానికి వారు" తండ్రీ! మేము అటువంటి కాంతుల్ని చూడ లేదు. తెల్లగెడ్డం కల మహాత్ముణ్ణి దర్శించలేదు, అంతరిక్షంలో ఎక్కడా!" అన్నారు.

"అలాగా, నా బిడ్డల్లారా! మీరు చూశారనుకున్నాను. మీరు ఆ కాంతిని, మహాత్ముణ్ణి చూడని సంగతి దయవుంచి ఎవరికీ చెప్పకండి," అని బ్రతిమాలాడు, పోప్. ఆ కథ విని అందరూ విరగబడి నవ్వారు.

బోజనానంతరం అతిథులందరూ వెళ్ళిన తర్వాత పుపుల్ జయకర్‌తో, "ఇందిరా గాంధి చాలా కష్టాల్లోంచి నడుస్తోంది. ఆమె కలతచెంది, కలవరపడుతున్నట్లు కనబడుతోంది. ఆమెలో ఉన్నతమైనదాన్ని రాజకీయాలు నాశనం చేశాయనుకుంటాను," అన్నారు కృష్ణాజీ.

ఇందిరాగాంధి ఇంటికి వెడుతూ, "మిమ్మల్ని మళ్ళీ కలుస్తాను,'' అంది కృష్ణమూర్తితో.

ఇందిరా గాంధి మొదట కృష్ణమూర్తిని 1950 లో పుపుల్ జయకర్ ఇంట్లో చూసింది. ఆమె సహజంగా మాటకారి కాక పోవడంవల్లా, కలుపుకోలుతనం లేకపోవడంవల్లా అప్పుడు మౌనంగా వుండిపోయింది. కృష్ణమూర్తి కూడా చాలావరకు అదేరకం. అయినా వారు క్రమంగా కబుర్లలోకి, కథల్లోకీ దిగారు. అప్పుడు కూడా కృష్ణాజీ ఒక కథ చెప్పారు :

టాన్‌జాన్, టకీడూ అనే ఇద్దరు బౌద్ధ సాధువులు సంచారం చేస్తున్నారు. ఒకరోజున వాన కురుస్తోంది. దారి బురదగా వుంది. ప్రయాణంలో ఎదురుగా ఒక యేరు అడ్డమైంది. వానకి ఆ యేరు బాగా పొంగింది. ఆ యేటి ఒడ్డున ఒక అందమైన అమ్మాయి, షోకైన బట్టలు వేసుకుని "ఈ యేరు దాటడం ఎట్లా ? " అని సంకోచిస్తో నిలబడింది.

"ఆమె సాధువుల్ని చూసి, "నన్ను ఈ యేరు దాటించండి,'' అని అడిగింది. దానికి టాన్‌జాన్, "రా, పిల్లా, రా!" అని ఆమెను భుజాన ఎత్తుకుని అవతల ఒడ్డున దించాడు. రెండో సాధువు ఆమెను తాకడానికే జంకాడు.

ఆ తర్వాత ఎవరిదారిన వారు వెళ్ళారు. దారి పొడవునా టకీడు ఒక్కమాట మాట్లాడలేదు. వారు రాత్రికి ఒక వూరు చేరుకున్నారు. ఒక దేవాలయంలో పడుకున్నారు. ఇంక వుండలేక, ''టాన్‌జాన్ ! మనం సన్యాసులం. స్త్రీలను చూడకూడదు. తాకకూడదు. కనీసం సమీపంగా కూడా వెళ్ళకూడదు. నువ్వు ఆ నిబంధనల్ని ఉల్లంఘించి ఆమెను భుజాన ఎక్కించుకుని అపచారం చేశావు,'' అన్నాడు టకీడు.

దానికి టాన్‌జాన్, "నేను ఆ అమ్మాయిని అప్పుడే అక్కడే దించేశాను. నువ్వు ఇంకా ఆమెను మనసులో మోస్తూనే వున్నావా?'' అని ఆశ్చర్యంతో అడిగాడు. ఆకథ విని మిత్రులు చాలా కదిలిపోయారు.



అక్టోబరు ఇరవై ఎనిమిదవ తేదీన ఇందిరాగాంధీ పుపుల్ జయకర్‌కు ఫోన్‌చేసింది, కృష్ణమూర్తిని కలుసుకుని మాట్లాడే టైమ్ ఏర్పాటుచేయమని. ఆమె ఏర్పాటుచేసిన ప్రకారం ఇందిరా గాంధి వెళ్ళి, కృష్ణమూర్తిని కలుసుకుంది. ఆమె రక్షణ ఏర్పాట్లు ఏమీ చేసుకోలేదు. అయినా కొంతసేపటికి రక్షణ పరివారం ఆమెను వెతుక్కుంటూ పుపుల్ జయకర్ ఇంటికి వచ్చింది.

కృష్ణమూర్తిని చూసి ఇందిరాగాంధి కన్నీళ్ళు ఆపుకోలేక పోయింది. చివరికి బిగ్గరగా ఏడ్చి, "ఈ విధంగా నేను నా జీవితంలో ఎప్పుడూ ఏడ్వలేదు" అన్నది.

ఆ తర్వాత కృష్ణమూర్తి - ఇందిరా గాంధి చాలా సేపు అప్పటి దేశరాజకీయాలగురించి మాట్లాడుకున్నారు—ముఖ్యం, ఎమర్జెన్సీ గురించి. ఆ మాటల్లో, "నేను పెద్దపులిమీద సవారీ చేస్తున్నాను. దాని మీదనుంచి కిందికి ఎలా దిగాలో నాకు తెలియకుండా వుంది," అన్నది ఇందిరా గాంధి; కృష్ణమూర్తితో.

దానికి కృష్ణాజీ, ''మీరు ఆ పెద్దపులికన్నా తెలివైనవారు అయితే, దానితో ఎట్లా మసలుకోవాలో మీకు మీరే తెలుసుకో గలరు," అన్నారు.

"అయితే, నేనేం చెయ్యాలి?" అని ఇందిరాగాంధి మళ్ళా అడిగింది. కృష్ణమూర్తి మొదట ఏం చెప్పడానికీ నిరాకరించినా చివరకు చెప్పారు, "ఘర్షణల్ని, తప్పుల్ని, పనుల్ని-అన్నింటినీ ఒకే సమస్యగా చూడండి. ఆతర్వాత ఏ భావం, ఏ అభిప్రాయం, ఏ కారణం, ఏమీ లేకుండా పని చెయ్యండి. దానివల్ల ఎటువంటి పలితం వస్తుందోనని ఎదురు చూడకండి. దేనికీ భయపడకండి," అని.

ఆ తర్వాత ఇందిరాగాంధి దేశంలో అమలులోవున్న అత్యవసర పరిస్థితిని ఎత్తివేయాలనే నిర్ణయానికి వచ్చింది. ఆ సంగతి తనకు ఆప్తులైన వారితో చర్చించింది. అంతేకాక దేశంలో జనరల్ ఎన్నికలు జరపడానికీ అంగీకరించింది.

ఆ రోజుల్లో ఇందిరాగాంధి మరొకసారి కృష్ణమూర్తిని కలుసుకుంది పుపుల్ జయకర్ ఇంట్లో. ఆనాటి విందులో కరన్‌సింగ్, నందిని, పార్థసారధి, జిమ్‌జార్జి వున్నారు. ఆ రోజు భోజనాల దగ్గర ప్రపంచ యువతీ-యువకుల గురించిన ప్రస్తావన వచ్చింది.

కృష్ణమూర్తి యూరప్ వెళ్ళేముందు బొంబాయిలో వున్నారు. ఇందిరాగాంధి అప్పుడు ప్రకటించింది, "నిర్బంధంలో వున్న వారందర్నీ విడుదల చేస్తున్నాము," అంటూ. అంతకుముందు వారందర్నీ దేశ భద్రతకోసం ఖైదుల్లోవుంచినా, ఎన్నికలకోసం వారిని విడుదల చేసింది.

కృష్ణమూర్తి ఆ సంగతి తెలుసుకుని, చాలా సంతోష పడ్డారు. ఇండియానుంచి వెళ్ళేముందు ఇందిరాగాంధీని కలుసుకుంటే బావుండుననుకున్నారు, కృష్ణమూర్తి. కాని, వీలు కాలేదు. కాని, పుపుల్ జయకర్‌తో, "ఇందిరను గూర్చిన సమాచారం తరచు తెలియపరుస్తూ వుండండి. ఆమెకు పదవి పోతేనేం ?" అన్నారు కృష్ణాజీ.

జనరల్ ఎన్నికల్లో ఇందిరాగాంధి ఓడిపోయింది. ఆ వార్తను కృష్ణమూర్తి ఒహైలో విన్నారు. వెంటనే పుపుల్ జయకర్‌కు ఉత్తరం రాస్తో, "ఇందిరాగాంధి రాజకీయ ప్రపంచం నుంచి బైటపడి వుంటారు. అయితే ఆమె ఏం చెయ్యబోతున్నారు? ఆమెను కలిస్తే. నేను అడిగినట్లు చెప్పండి. నా ప్రేమను తెలపండి."

మరొక ఉత్తరంలో, "ఆమె ఎన్నికల్లో ఓడిపోయిన వార్త వచ్చేప్పటికి మీరు ఆమె చెంత వుండటం నాకెంతో సంతోషంగా వుంది. నేను మీకు బొంబాయిలో చెప్పానుగా, "ఆమె ఎన్నికల్లో ఓడిపోవచ్చునని" అని రాశారు కృష్ణాజీ.

ఇందిరాగాంధి అరెస్ట్ వార్త, కృష్ణమూర్తి లండన్‌లో విన్నారు; బి. బి. సి. లో. అది విని, ఇందిరాగాంధి యోగ క్షేమాలు తెలుపమంటూ పుపుల్ జయకర్‌కు రాశారు.

1977 జూన్ ఇరవై రెండవ తేదీన ఇందిరా గాంధి, కృష్ణాజీకి ఒక ఉత్తరం రాసింది, గౌరవనీయులైన కృష్ణాజీ గారికి: అంటూ, "మీ ఎడ్రస్ నాకు పుపుల్ జయకర్ పంపించింది. మీకు రాయాలనుకున్నాను. కాని, ఏంరాయాలో తెలియలేదు. నేను సంపాదించుకుని, దాచుకున్న శాంతి, ఈ పరిస్థితుల్లో నాకు సరిపోవడం లేదు. నాపై వచ్చిన అపవాదులకు నవ్వుకుంటున్నాను.

"మమ్మల్ని (మా కుటుంబాన్నంతా) వెన్నంటి, నిరంతరం గమనిస్తో, అనుసరిస్తో, వేధిస్తోంది ఇండియా ప్రభుత్వం. మేమంతా వాటికి గురిఅవుతున్నాము. సంజయ్‌గాంధిమీద క్రిమినల్ కేసులు పెట్టి వేధిస్తున్నారు. నన్నుకూడా చాలా తిప్పలు పెట్టారు."

నవంబరులో కృష్ణమూర్తి ఇండియా వచ్చారు. బొంబాయిలో వున్నారు. ఇందిరాగాంధి పుపుల్ జయకర్‌కి ఫోన్‌చేసింది; తాను బెంగుళూరునుంచి బొంబాయి వస్తున్నట్లు, కేవలం కృష్ణమూర్తిని చూడ్డానికే!

కృష్ణమూర్తి బొంబాయి వచ్చిన సమయానికి మలబార్ హిల్ ప్రాంతంలోవున్న పుపుల్ జయకర్ ఇల్లు పూర్తి రిపేరులో వుంది. ఇంటిముందు పెద్ద గొయ్యి తీశారు. నడవడానికి దానిపై చెక్కలు వేశారు. కృష్ణమూర్తిని చూడ్డానికి ఇందిరా గాంధి ఆ ఇంటికే వచ్చింది. రెండు గంటలు కృష్ణాజీతో ప్రత్యేకంగా మాట్లాడి బైటికి వస్తోవుంటే, డైరెక్టర్-జనరల్ ఆఫ్ పోలీసు, కొంతమంది సిబ్బందితో ఇందిరాగాంధి రక్షణార్ధం వచ్చి, ఆ ఇంటిముందు నిలబడ్డారు. ఇందిరాగాంధి బైటికి వచ్చి, "కృష్ణమూర్తి నన్ను మరో రోజు ఇక్కడ వుండమంటు న్నారు, నేను ఒప్పుకున్నాను," అని పుపుల్ జయకర్‌తో చెప్పింది. ఆ మాటలు పోలీస్ ఆఫీసరు విని గొడవపడ్డారు. ఎందుకంటే, ఆ చిన్న ఇంట్లో—తలుపులు, కిటికీలు సరిగాలేసి ఆ ఇంట్లో-దారి సరిగాలేని ఆ ఇంటికి రక్షణ ఏర్పాట్లు చేయడం చాలా కష్టం కనుక. "ఇందిరా గాంధీని వెంటనే ఢిల్లీ పంపిం చెయ్యండి" అని పుపుల్ జయకర్‌తో చెప్పారు ఆ పోలీసు అధికారి.

అంతలో ఎంతోమంది కాంగ్రెస్ నాయకులు ఇందిరా గాంధీని చూడ్డానికి వచ్చారు. ఆ చిన్న ఇంట్లోనే వారందర్నీ ఆమె కలుసుకుంది. ఇందిరాగాంధీ వచ్చిన సంగతి తెలిసి ప్రజలు తండోపతండాలుగా వచ్చారు. ఎలాగైనాసరే ఆమెను ంటనే ఢిల్లీ పంపించెయ్యాలనే నిర్ణయానికి వచ్చారు, పోలీసు ఫీసరు. ఆయన విమానాశ్రయానికి ఫోన్ చేస్తే, "ఆరోజు

ఢిల్లీ వెళ్ళే విమానం కొన్ని గంటలు లేట్" అని చెప్పారు. ఆ రోజంతా ఇందిరా గాంది చాలా సంతోషంగా; హుషారుగావుంది.

ఆ సంవత్సరం కృష్ణమూర్తికి "ప్రోస్టేట్" ఆపరేషన్ జరిగింది. ఆ తర్వాత "హెర్నియా" ఆపరేషన్ జరిగింది. అప్పుడు "బ్లడ్‌సుగర్" కూడా ఎక్కువగానే వుంది. రెండు కళ్ళల్లో "కేటరేక్ట్'' ప్రారంభమైంది. కేటరేక్ట్ మాత్రం చుక్కలమందుతో నయమైంది.

ఆ వేసవిలో బెంగుళూరులో ఒక స్కూలు తెరిచారు. ఆ స్కూలుకి ఒకాయన వంద ఎకరాల భూమి ధర్మంగా ఇచ్చారు. ఆ తర్వాత ఆ స్కూలే అనుబంధ స్కూలుగా రూపొందింది.

నవంబరులో కృష్ణమూర్తి ఇండియా వచ్చారు. ఋషీ వ్యాలీ వెళ్ళారు. ఇందిరాగాంధీ పుపుల్ జయకర్‌కు రాస్తో, "కృష్టమూర్తిని ఋషీవ్యాలీలో కలుసుకోవాలనుకుంటున్నాను. ఆ ప్రదేశంలో కొన్ని రోజులు విశ్రాంతిగా వుండాలనుకుంటున్నాను," అని రాసింది.

ఇంరాగాంధి బై-ఎలక్షన్‌లో గెలిచింది. అయినా ఆమెను పార్లమెంట్‌నుంచి బహిష్కరించి, జైల్లో పెట్టారు. అందుచేత ఆమె ఋషీవ్యాలీ ప్రయాణం ఆగిపోయింది.

ఇందిరాగాంధి ఒక వారం రోజులు తీహార్ జైల్లో వుంది.

ఇందిరాగాంధి జైలునుంచి విడుదల అయిన వెంటనే మద్రాస్ వసంత్ విహార్‌లో వుంటున్న కృష్ణమూర్తిని చూడ్డానికి వెళ్ళింది. ఆమెకు గట్టి బందోబస్తు వుంచారు. ఆమె చాలా సేపు కృష్ణమూర్తితో మాట్లాడి, వెళ్ళేముందు పక్కగదిలోవున్న

పుపుల్ జయకర్‌ను పిలిచి, "కృష్ణమూర్తి నన్ను రాజకీయాల నుంచి తప్పుకోమంటున్నారు. ఎలా తప్పుకోవాలో నాకు తెలియకుండావుంది. నా మీద ఇరవైఎనిమిది క్రిమినల్ కేసులున్నాయి. వాటికి నేను సమాధానాలు చెప్పాలి. ఇప్పుడు నా ముందు రెండు మార్గాలున్నాయి. ఒకటి - నేను వారితో పోరాడి గెలవాలి. రెండు - నేను వాళ్ళ చేతుల్లో పూర్తిగా ఓడిపోవాలి, మళ్ళా తలెత్తకుండా," అంది.

ఆ రోజు ఒంటిగంటకు ఇందిరాగాంధి, కృష్ణమూర్తితో కలసి భోజనం చేసింది. ఆ రోజు సాయంత్రం వసంత్‌విహార్‌లో యమ్. ఎస్. సుబ్బలక్ష్మి పాటకచేరీ ఏర్పాటు చేశారు. కృష్ణమూర్తి ఇందిరాగాంధీని ఆ కచేరీకి ఆహ్వానించారు. "చాలా మీటింగులు వున్నాయి. వీలుంటే వస్తాను," అని వెళ్ళిపోయింది ఇందిరాగాంది.

సాయంత్రం కచేరీ జరుగుతుండగా ఇందిరాగాంధి వచ్చింది. కృష్ణమూర్తి అందరి మధ్యా నేలమీద కూర్చున్నారు. హాలు గుమ్మం దగ్గరవున్న మామూలు కుర్చీమీద ఇందిరాగాంధీ కూర్చుని, ఓ గంటసేపు విని, "మళ్ళా కలుసుకుందాం," అని కృష్ణమూర్తితో చెప్పి వెళ్ళిపోయింది.



అమెరికా, ఇంగ్లండు "కృష్ణమూర్తి ఫౌండేషన్స్" వారు 1977 చివరలో – మద్రాసులో, కృష్ణమూర్తి సమక్షంలో సమావేశమయ్యారు. ఆ తర్వాత 1978 జనవరి పదమూడు, పధ్నాల్గు తేదీలలో మళ్ళీ సమావేశాలు జరిపారు. తత్ఫలితంగా బ్రుషీ వ్యాలీ స్కూలు విషయంలో మార్పులు జరిగాయి. పైన్ కాటేజి (ఒహై)ని అందంగా బాగుచేశారు. జనవరి చివరలో కృష్ణమూర్తి మేరీతో ఒహై వెళ్ళారు.

ఒకసారి కృష్ణమూర్తి, మేరీతో, "ప్రతి రాత్రి ధ్యానం నన్ను మెలకువ పరుస్తోంది," అని "మనసు దాని చురుకుదనానికీ, తొందర్లకీ, ఆతృతలకీ, ఆశలకీ, ప్రయత్నాలకూ—అన్నింటికీ పూర్తిగా ఖాళీ కావడమే, ధ్యానం," అన్నారు.

"మనిషి తన తికమకల, గందరగోళాల, ఆందోళనల నుంచి తప్పించుకుని పారిపోవడానికి అనేక రకాలైన ధ్యానాదుల్ని కొత్తగా కల్పించుకున్నాడు. ఆవిధంగా కల్పించుకున్నవన్నీ అతని కోర్కెమీద, ఇచ్ఛ - సంకల్పం - ఇష్టంమీద ఆధారపడ్డవే: ఆ విధమైన, ఉద్దేశ్యపూర్వకమైన, సాహసవంతమైన ప్రయత్నాలు, యాతనలు, పెనుగులాటలు ఎప్పుడూ పరిమితమైన హద్దులు కల మనసులో, వుంటాయి. ఆ మనసుకు స్వేచ్ఛ లేదు. ధ్యానానికి చేసే అన్నిరకాల ప్రయత్నాలూ, అసలు ధ్యానాన్ని కాదనడం, నిరాకరించడమే అవుతుంది. ధ్యానమంటే, ఆలోచనను అంతం చేయడం. అగోచరంలో, అవ్యక్తంలో ప్రవేశించడమే, ధ్యానం. అది గతానికి తెలియని సంగతి. ఆ అవ్యక్తం; సుందరమైన ప్రశాంతమైన ప్రపంచం. అది ఎటువంటి రూపమూ, చిత్రమూ లేని ప్రపంచం. ఎవరి గురించీ, దేనిగురించీ ఒక్క ఆకారమూ - చిత్రమూ లేని లోకమది. ఏ సంజ్ఞా, ఏ గుర్తూ, మాటా, గతం, జ్ఞాపకాల అలలు లేనిదే, ధ్యానం.

"క్షణక్షణానికీ గతానికంతకూ చావడమే, ప్రేమతో నిండి వుండటం. అది ఆసక్తితో కూడినది కాదు. దానికి కారణం, మూలం లేదు. అదొక జ్వాల. ఆ జ్వాల, మనం కట్టుకున్న హద్దుల్ని కాల్చేస్తుంది. శ్రద్ధగా, ఆసక్తితో ఎరుకలోవుండి కట్టుకున్న కంచెల్ని కాల్చేస్తుంది.

"మొదటినుంచీ శ్రద్ధతో, ఇష్టంతో, ఆసక్తితో పోగుజేసుకున్న వాటన్నింటినీ పూర్తిగా నిరాకరించి తోసెయ్యడం సాధ్యం కాదు. దానికి ఎంతో సాధన చెయ్యాలి," అన్నారు కృష్ణాజీ.

వీసా లేకుండా అమెరికా వెళ్ళే "గ్రీన్ కార్డ్" ప్రభుత్వం నుంచి పొందారు, కృష్ణాజీ.



1978 డిశంబరులో కృష్ణమూర్తి ఋషీవ్యాలీలో "కృష్ణమూర్తి ఫౌండేషన్స్" సభ్యుల్ని సమావేశపరచి, "నిన్న పుపుల్ జయకర్ నాతో అన్నది, తన హృదయాంతరాళంలోంచి వచ్చిన మాటలు" అంటూ — "కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ ఇండియా"కి కృష్ణమూర్తే ప్రెసిడెంట్‌గా వుండాలని. అప్పుడు నేనేం మాట్లాడలేదు. జవాబూ చెప్పలేదు. నేను అన్నీ మామూలుగా వదిలేసినట్లే, ఆమె మాటనీ వదిలేశాను.

"గతంలో నేను "ది ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్ ది ఈస్ట్" ని రద్దు చేశాను. అన్ని ఆర్గనైజేషన్స్ మనిషిని హద్దుల్లో, పరిమితుల్లో వుంచుతాయి. రాజకీయం, ఆధ్యాత్మికం, సాంఘికం ఏదైనా అంతే! మనిషికి బంధమే! అవన్నీ పరిమితమే! అవి మనిషికి స్వేచ్ఛని ఇవ్వవు. మనిషి క్రమంగా అన్ని విధాలా వేర్పాటువాది అవుతున్నాడు. కాని, నేను దేన్నీ వేర్పాటు చేయను. నేనో పద్ధతినీ అనుసరించను.

"నేను KFI కి, ప్రెసిడెంట్ కావాలన్నది చాలా కాలం నుంచి పుపుల్ జయకర్ కోర్కె. ఆమె ఇన్నాళ్ళూ వ్యతిరేకించి, ఇప్పుడు కోరుతోంది.

"నేను ఇదివరకు అనేక సంస్థల్లో వుండి చివరికి వాటిని రద్దుచేశాను. కొన్నింటినుంచి నేను తప్పుకున్నాను. నేను ప్రెసిడెంట్ అయితే ఏం జరుగుతుంది? నేను సంవత్సరంలో మూడు నెలలు ఇండియాలో వుంటాను. అంతే!

"అయినా నాకూ, మీకూ మధ్యవున్న సంబంధం ఏమిటి? అది ఎట్లావుంది? మనలో ఒకరిపై ఒకరికి ప్రేమ, విశ్వాసం, నమ్మకం వున్నాయా? ప్రతి ఒక్కరికీ కృష్ణమూర్తితో ప్రేమ సంబంధం వుంది. ఆ విధంగా మనమంతా మంచి సంబంధంలో వున్నాం.

"కృష్ణమూర్తి ఇండియాలో లేనప్పుడు మనమంతా బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నాం. నిజంగా అందరూ కృష్ణమూర్తికి బాధ్యతగా వుండాలి కదా? తమ తమ ప్రేమ సంబంధాల ప్రకారంగా."

మధ్యలో అచ్యుత పట్వర్ధన్ అందుకున్నారు, "మనం అసలు ధర్మానికి బాధ్యులమై వుండాలి. ఆ ధర్మమే మూలం," అన్నారు.

సంబంధం విషయంలో కృష్ణాజీ ఎంత దగ్గరగా వుంటారో, అంత దూరంగా వుంటారు.



1978 డిశంబరు, చివరి వారంలో పుపుల్ జయకర్ కృష్ణాజీ జీవిత చరిత్ర రాయాలనుకుంది. ఆ సంగతి కృష్ణమూర్తితో చెపితే, ఆయన అంగీకరించారు. ఆమె కృష్ణాజీని ఎన్నో ప్రశ్నలు వేసింది. సుక్షేత్రంలో నాటిన బీజం మొలకెత్తి, పుష్పించి, ఫలించినట్లు, ఆ ప్రశ్నలకు ఆయనలోంచి సమాధానాలు వచ్చాయి.

ఆమె కృష్ణమూర్తిని ముప్ఫై ఏళ్ళనుంచి వింటోంది. ఆమె కృష్ణమూర్తి మనసును పరిశోధించగా, ఆ మనసు ఎప్పుడూ, ఆ క్షణంలో మహాశూన్యంగా వుంటుందని గ్రహించింది. భవిష్యత్తు తాలూకు ఆలోచనలు, భావాలూ ఏమీలేకుండావున్నా, ఆయన మనసు, ఆమె ప్రశ్నలను తీసుకుని సమాధానాలిచ్చింది.

* * *

1979 లో, కృష్ణమూర్తి ఋషీవ్యాలీలో టీచర్స్ సమావేశంలో మాట్లాడుతూ, "అయ్యా! మీరు మీ క్లాస్‌రూమ్‌లలో ప్లాట్‌ఫారమ్ దిగి మీ విద్యార్థులతో, "నేనూ మీ వంటివాడినే!" అని ఎప్పుడైనా అన్నారా?

"పిల్లలూ, మీవలె నాకూ భయాలు, ఈర్ష్యలు, గాయాలు ........అన్నీ వున్నాయి. ఏం చెయ్యాలో మీకు తెలియనట్లే, నాకూ తెలియదు," అని ఎప్పుడైనా అన్నారా?

"మీరు పిల్లలతో అలా అని వుంటే, అప్పుడు ఆ విద్యార్థులు అనుకుంటారు; "మన టీచర్ కూడా తమ సంగతి ఎంతో బాగా మాట్లాడుతున్నారు. ఆయన ఎంతో నిజాయితీ పరులు. మనం ఆయన్ని నమ్మవచ్చు," అని.

"అలా అనుకునే ముందు, మీలో భయం, తికమక పోవాలి. అన్నింటినుంచీ ముందు మీరు స్వేచ్ఛ పడాలి. అప్పుడు మీరు వారికి ఆవిధంగా, గట్టిగా చెప్పగలరు. నమ్మకం కుదిరేటట్లు మాట్లాడగలరు," అన్నారు.

* * *

ఒకరోజున కృష్ణాజీ "ఆలోచన" గురించి మాట్లాడారు: "ఆలోచనే, గతం. అది జ్ఞాపకంగా, స్మృతిగా, అనుభవంగా, విజ్ఞానంగా, తెలివిగా — అన్నివిధాల పనిచేస్తుంది. వాటికి సమాధానమూ ఇస్తుంది.

"ఆలోచన కొనసాగుతోంది" అంటే, ఆ సమయంలో వర్తమానానికి, నూతనత్వానికి - సృజనాత్మకమైనదానికి తావు లేదు. అప్పుడు వుండి పనిచేసేది, గతం ఒక్కటే. ఆ గతం, వర్తమానంలో తనకు తాను సరిదిద్దుకుని, మార్చుకోవడమే జరుగుతుండి. అంతే! అంటే, వర్తమానంలో గతకాలపు జీవనమే వుంటుందన్నమాట.

"జీవనమంటే, బంధం. బంధమంటే, సంబంధం పెట్టుకుని వుండటం.

"ఏదైనా కొనసాగుతోందంటే, అది ఆలోచన. అంటే, అది చచ్చిన సంగతి. అది పాత విషయం. అది గతంలోని సంగతి. అందు నూతనత్వం వుండదు.

"నూతనత్వం, సృజనాత్మకం అయినది వున్నదంటే, అందు గతంలేదు. అంటే, అ సమయంలో మనసు దేనిచేతా బందీకాలేదన్నమాట.

"కరడుకట్టిన అటువంటి గతాన్ని అర్థంచేసుకోవాలంటే, సామాన్యులకు సాధ్యంకాదు. దానికి మన శక్తినంతా వెచ్చించాలి. తీవ్రమైన ఆసక్తి, శ్రద్ధవున్ననాడు అవసరమైన శక్తి దానికదే వస్తుంది.

"ముందుగా మనం గతాన్ని తూకంవేసి చూడాలి. దాని గురించి నిష్పక్షపాతంగా చర్చించాలి - తర్కించాలి - యోచించాలి, కలిసి ఆలోచించాలి.

"నాకు తెలుసు, నేను ఎరుగుదును" అనేదంతా గతమే. అటువంటి గతంనుంచి "నేను దూరంగా తప్పుకుంటాను," అని అనకూడదు. అలా అని ఇంతవరకూ ఎవరూ దాన్నించి దూరంగావున్న సంగతి వినలేదు, చూడలేదు. కాబట్టి మనం చేయవలసింది, గతానికి సదా పూర్తి ఎరుకలో వుండటం అది చాలు.

"జీవితానికి నిస్వార్థమైన నిరంతర ఎరుక అవసరం. అప్పుడు జరిగేది పవిత్ర పరిశోధన. అది ఒక్కటే మనిషిలో అప్రయత్నంగా మార్పు తెస్తుంది.

"గతం గురించి వర్తమానంలో అనవసరంగా ప్రతిస్పందించకూడదు. దానిగురించి గొడవపడకూడదు. React కాకూడదు. వర్తమానంలో గతాన్ని ప్రవేశించి, జోక్యం చేసుకోనివ్వకుండా చూసుకోవాలి. అదే ముఖ్యం. అప్పుడు సాహసోపేతమైన ఒక చర్య అవసరమౌతుంది. అదే నిజమైన క్రియ. త్యాగమన్నా అదేనేమో!

"ఏదో ఒకటి కొత్తగా సృష్టి జరగాలంటే, "ఆలోచన" అనేది వుండకూడదు. గతంలో మనం పోగుజేసుకున్న విజ్ఞానం (చదువు, సాంప్రదాయం, మతం, తెలివి, అలాగే విని, చూసి, భావించిన, మొదలైన వాటి) యొక్క కదలికలే మన విజ్ఞాన శాస్త్రం. మనం "గతంలో ఎంతో విజ్ఞానం పోగుజేసుకున్నాం," అంటాం. "ఆ ఎంతో- ఆ అధికం" అనేది వుంది చూశారూ, అదీ ఒక కొలత మాత్రమే! కాని, అది అపారం, అనంతం

మాత్రం కాదు. ఎందుకంటే, అది భౌతికం. దాన్ని కూడా ఆలోచనే కొలుస్తుంది. పరిమితమైన ఆ విజ్ఞానం సృష్టించేదీ పరిమితమే కదా ?

"నేను, నాది" అనే భావంలేని వ్యక్తి ద్వారానే నిజమైన సృష్టి జరుగుతుంది. అదే నూతనత్వం. అదే నూతన జీవితం."



మరొక సందర్భంలో కృష్ణాజీ మిత్రులతో సెక్స్ గురించి ఎంతో వివరంగా మాట్లాడారు :

"జీవితంలో సెక్స్ ప్రధానమైన విషయమై ప్రముఖ పాత్ర వహిస్తుంది. అది ఎప్పటికప్పుడు గాఢమైన, నూతనమైన అనుభవం. అది అన్ని క్రియలకన్నా భిన్నమైనది, అందమైనది, ఆనందదాయకమైనది.

"ఒక్క సెక్స్ సంబంధంలో తప్ప, తక్కిన అన్ని సంబంధాల్లో బాధ, పోరాటం, పెనుగులాట వుంటాయి.

"సెక్స్ సంబంధంలోనే నిజమైన స్వేచ్ఛ, బలం, తీవ్రత, ప్రకాశ తీక్షత వుంటాయి. అందుకే సెక్స్, జీవితంలో గొప్ప విలువయిన సంగతి అయింది.

"కాని, మనిషి దానికి బానిస అయితే, అలవాటుపడితే దాన్నే మళ్ళా మళ్ళా కోరుతుంది మనసు.

"ఇంద్రియలోలత్వమే సెక్స్‌కు కారణం. సృజనాత్మక శక్తిలేని మనుష్యులు సెక్స్‌వేపు మొగ్గుతారు. అప్పుడది సమస్య అవుతుంది. ప్రేమవున్ననాడు, సమన్వయం, అవగాహన వుంటుంది."

"సెక్స్" పెద్ద అలగా వచ్చి, యువతీ, యువకుల మీద విరగబడుతుంది. దానితో వారు తికమక, గందరగోళంలో పడతారు. క్రమంగా అది అయోమయంగా, అగమ్యంగా, శూన్యంగా తోస్తుంది. చివరికి అది వాళ్ళను అధిగమించి పనిచేస్తుంది.

"సెక్స్" ఒక మృదువైన పుష్పం వంటిది. అదొక కేంద్రీకృత అగ్ని జ్వాల. అది అతి నాజూకు, సున్నితమైన క్రియ. చాలా అరుదైన సంగతుల్లో సెక్స్ ఒకటి. అది దేహానికీ, మనసుకీ పోషణకారి, రక్షణ వంటిది.

"స్త్రీ, పురుషుల కలయికను ప్రేమరహితంగా, విశృంఖలంగా సాగనిస్తే, దేహశక్తి పాడవుతుంది. సుకుమారం, సున్నితం, సౌందర్యవంతం, ఆనందదాయకం అయిన ఆ సంగతి, క్రమంగా అణగారి, నాశనమౌతుంది. సెక్స్ని ప్రేమతో గమనించాలి. దాన్ని పోషించాలి. సెక్స్ని మూయకూడదు, అణచకూడదు, నిరాకరించకూడదు, కాదనకూడదు, లేదనకూడదు. కాని, దానికి లోబడకూడదు.

"ఒక్క సెక్స్లో తప్ప, తక్కిన అన్ని వేళలా, అన్ని రంగాల్లో జీవితంలో ఘర్షణ, జరగడం, విరోధం తప్పదు. ఒక్క సెక్స్లో తప్ప, "నేను" అనేది అన్నిచోట్లా ముఖ్యమైపోతుంది. ఆ సంబంధంలో "నేను" అనే ప్రత్యేక తలంపు, బేధభావం లేకుండా ఒకరిలో ఒకరు ఐక్యమౌతారు. దాంట్లో అన్ని సమస్యలూ, భయాలూ ఎగిరిపోతాయి. మానవ జీవితంలో "నిష్కామకర్మ" అదొక్కటే. "సెక్స్" మబ్బులేని నీలాకాశమంత స్పష్టం.

"తమను తాము పూర్తిగా మరచిపోవడానికి "సెక్స్" ఒక మార్గం. అది తప్ప ఇంకో మార్గంలేదు. కనీసం మనం ఆ క్షణంలోనైనా మనని మనం మరచిపోతాం. ఆ క్షణంలో కాల ప్రసక్తిలేదు. అందుకే సెక్స్‌ని కోరతారు.

"ఏటి నీటి గలగలల్నీ, చెట్ల ఆకుల గుస, గుసల్నీ ఎట్లా వింటామో, అట్లా మన వాంఛల్నీ విని, అనుసరించి గమనించాలి. సెక్స్, సమస్యకాదు. సెక్స్ గురించిన ఆలోచనే సమస్య.

"ప్రస్తుతం సెక్స్ విషయమై యువతీ,యువకుల్లో తిరుగుబాటు దోరణి కనిపిస్తోంది. యవ్వనవంతులు, అప్పుడే భూమి మీదకు దిగివచ్చిన పసివారు వంటివారు. వారు తమకు తోచిన విధంగా కొత్త సాంస్కృతిక విత్తనాలు చల్లుతున్నారు; అవి ఎంత వైపరీత్యంగా, అసహజంగావున్నా, మనిషికి – ప్రకృతికి మధ్య అన్యోన్యసంబంధం, ఐకమత్యం తిరిగి స్థాపించాలని. ఆ సందర్భంలో వారు డ్రగ్స్, సంగీతం, యోగం, సెక్స్ – మొదలైనవాటిని అనుసరిస్తున్నారు. తద్వారా కలుషిత రహితమైన నూతన ప్రపంచ నిర్మాణంకోసం వారు ఎదురు చూస్తున్నారు."

• • •

1979 నవంబరు ఇరవైఎనిమిదవ తేదీన కృష్ణమూర్తి ఋషీవ్యాలీలో వున్నారు. ఆయన్ని చూడ్డానికి రాధాబర్నియర్ వెళ్ళారు. ఆమెతో, "మీరు దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షులుగా నిలబడబోతున్నారా?" అని కృష్ణమూర్తి అడిగితే, దానికి ఆమె "నాకు ఏమీ తెలియదు," అంది.

"నాకు ఏమీ తెలియదు," అంటే, అర్థం ఏమిటి? అడయార్ దివ్యజ్ఞాన సమాజ ఆవరణ ఏ బోధలకోసం ఏర్పాటు చేశారో, ఆ విషయంలో దివ్యజ్ఞాన సమాజం తప్పిపోయింది. అసలు దాని ఉద్దేశ్యమే నాశనమైంది. అయినా అది ఇంకా ఏ కొంచెమో మిగిలివుంది. దానికి మనం ఏమైనా చేయగలమా?" అని మళ్ళా అడిగారు ఆమెను.

"జీవితానికి గురువు అవసరమా?" అని రాధాబర్నియర్ కృష్ణాజీని అడిగింది.

"గురువంటే మీ ఉద్దేశ్యం ఏమిటి?" అని కృష్ణాజీ ఆమెను అడిగారు.

"దారి చూపి నడిపించేవారు," అంది రాధాబర్నియర్.

"మేల్కొల్పేవాడు" అంది పుపుల్ జయకర్.

"కొంతమందే చీకటిలోంచి, కాంతి వైపు నడవడం వుంది. అటువంటప్పుడు, గురువనే దానికి తావెక్కడ వుంది? ఆ కాంతి ఏదో అది "నేను" అనడం వేరు సంగతి," అన్నారు కృష్ణాజీ.

• • •

"సంవత్సరం తర్వాత సంవత్సరం మీరీ ఉపన్యాసాల్ని ఎందుకు కొనసాగిస్తున్నారు?" అని ఒకరు కృష్ణాజీని అడిగారు.

"ఈ ప్రశ్న నన్ను చాలామంది, చాలా సార్లు అడిగారు. నేను జవాబూ చెప్పాను."

"యాభై సంవత్సరాలనుంచి మీరు మీ శక్తిని ఎందుకు ఈ విధంగా వృధా చేసుకుంటున్నారు? ఏ ఒక్కరిలోనూ మార్పు రానిది, దీనికి మాత్రం మీరెందుకు గొడవపడుతున్నారు? ఇదొకరకమైన తృప్తా? ఈ విషయాలు మాట్లాడటంవల్ల

మీకేమైనా శక్తి కలుగుతుందా? లేక, మీరు ప్రేక్షకులమీద ఆధారపడుతున్నారా?"

"నేను ఎవరిమీదా ఆధారపడటం లేదు. నేను ఎవరికీ అతుక్కుని వుండలేదు. నేను ఈ సమావేశాల్ని, సభల్ని కోరడం లేదు," అన్నారు కృష్ణాజీ.

"అయితే, అసలు ఈ విషయంలో మీ ఉద్దేశ్యం ఏమిటి?"

"ఎవరైనా, ఏదైనా ఒక అందమైన సంగతి, సత్యమైనది దర్శిస్తే, దానిగురించి ప్రేమతో, దయతో ప్రజలకు చెప్పాలనుకుంటారు.

"ఆ విషయాల్లో ప్రజలకు కూడా ఆసక్తి, ఇష్టం, ప్రేమ వుంటే, వారు, వారి చుట్టూ చేరతారు. మీరు పువ్వును అడగలేరు కదా, నువ్వు ఎప్పుడు వికసిస్తావు? ఎందుకు పరిమళం విరజిమ్ముతావు?" అని. అటువంటిదేనేమో, ఈ కారణం ఉద్దేశ్యం కూడా," అన్నారు కృష్ణాజీ.

• • •

"కృష్ణమూర్తి ఫౌండేషన్,"కి పుపుల్ జయకర్ ప్రెసిడెంట్‌గా వుంది. కాని, సభ్యుల్లో ఆమెయెడల అసంతృప్తిగా వున్నట్లు కృష్ణమూర్తి గమనించారు.

• • •

1979 జనరల్ ఎన్నికల్లో ఇందిరాగాంధి పూర్తి మెజారిటీతో విజయం సాధించింది. కృష్ణమూర్తి ఇండియా వచ్చినా ఆయన్ని చూసే వ్యవధి చిక్కనంత పని ఒత్తిడిలో వుండిపోయింది, ఇందిరాగాంధి.

• • •

1980-నవంబరులో కృష్ణమూర్తికి కొలంబోలో నాలుగు ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడ్డాయి. ఆయన్ని శ్రీలంక ప్రభుత్వం ఆహ్వానించింది. అక్కడ ప్రభుత్వ గెస్ట్‌హౌస్‌లో వున్నారు. ఆయన వెంట పుపుల్ జయకర్, నందిని, మేరీ జింబాలిస్ట్ వున్నారు. ప్రజలు, ప్రభుత్వం ఆయనకు ఘన స్వాగతం ఇచ్చారు.

"క్రైస్తవులు సందేహించరు. వారికి విశ్వాసం, నమ్మకం ముఖ్యం. మతపరమైన విచారణలో సందేహం చాలా ముఖ్యమైన సంగతి. అనీబిసెంట్‌లో సంశయం వుంది. తత్ఫలితంగా ఆమె క్రైస్తవ మతాన్ని వదిలేసింది. కాని, క్రమంగా ఆమె ఒక సంస్థలో చిక్కుకుంది. దానితో ఆమె జీవితంలో సజీవత్వాన్నే కోల్పోయింది," అంటూ కృష్ణమూర్తి ఆ సభల్ని ప్రారంభించారు.

"సందేహం, దాని స్పష్టతే జీవితంలో అతిబలీయమైన సజీవత్వం. భ్రాంతులతోకూడిన మనసును, సందేహం శుద్ధి చేస్తుంది. ఇండియా క్రమంగా అటువంటి విధానాన్ని పోగొట్టుకుంటోంది. ఒక్క సందేహం ద్వారానే, సత్యాన్ని చేరుకో గలుగుతావు. నమ్మకం, విశ్వాసంలో చిక్కుకుంటే, సందేహం అంతరిస్తుంది.

"సంశయం, దివ్యలేపనం వంటిది. అది మంట పుట్టించినా అమోఘంగా నయంచేస్తుంది. ఆ సంశయం శాశ్వత ప్రేమకు జన్మనిస్తుంది. అది మనోకల్మషాన్ని కడిగేస్తుంది"; అన్నారు కృష్ణాజీ.

• • •

కృష్ణమూర్తి ఋషీవ్యాలీ వచ్చారు. అమెరికా-ఇంగ్లండు-ఇండియా — కృష్ణమూర్తి ఫౌండేషన్స్‌వారు ఋషీవ్యాలీలో కృష్ణమూర్తి సమక్షంలో భవిష్యత్ కార్యక్రమం గురించి చర్చించేందుకు సమావేశమయ్యారు. ఆ సమావేశం, తర్వాత మద్రాసులో జరిగింది.



1980లో దివ్యజ్ఞాన సమాజానికి రాధాబర్నియర్ అధ్యక్షులై కృష్ణాజీని అడయార్ దివ్యజ్ఞాన సమాజ కేంద్ర కార్యాలయానికి ఆహ్వానించారు. కృష్ణాజీ అంగీకరించారు. ఆయన అక్కడ అడుగుపెట్టే సమయానికి ఎందరో పెద్దలు, సభ్యులు ద్వారంవద్ద స్వాగతపూర్వకంగా వేచివున్నారు.

నవంబరు-మూడవ తేదీన రాధాబర్నియర్‌తో కలసి కృష్ణాజీ నలభై ఏడు ఏళ్ళ తర్వాత దివ్యజ్ఞాన సమాజ ఆవరణలో అడుగుపెట్టారు.

కృష్ణాజీ అక్కడనుంచి బీచ్‌ఒడ్డున నడుచుకుంటూ రాధాబర్నియర్ ఇంటికి వెళ్ళారు. ఆ తర్వాత ఆయన ఎప్పుడు మద్రాసు వచ్చినా ఆమె ఇంటికి తప్పకుండా వెళ్ళేవాడు.



ప్రతిరోజూ - తెల్లవారితే చాలు తాను ఎన్నడూ ఎరగని, చూడని అపురూపమైన, అపూర్వమైన, అద్భుతమైన ఒక గొప్ప సంగతి తన కళ్ళముందు ప్రత్యక్షమైనట్లు ఆశ్చర్యంతో చూసేవాడు కృష్ణమూర్తి. అది ఒక కొత్త రోజుగా ఆయనకు దర్శనమిచ్చేది. అది అన్ని రోజుల వంటి మామూలు పాత రోజు మాత్రం కాదు. అటువంటి రోజు అంతకు ముందు ఎన్నడూ రానట్లు, లేనట్లు, తాను చూడనట్లు చూసేవాడు.

ఒకరోజు ఉదయం ఎండవేళ నడచివెడుతోవుంటే, దారిలో ఒక చోట ఒక ఎండుటాకు రాలి నేలమీద పడి వుండటం చూశాడు కృష్ణమూర్తి. ఆ ఆకు పసుపు పచ్చగానూ, ముదురు ఎరుపురంగులోనూ వుంది. ఆ ఆకు అంత్య దశలో వున్నప్పటికీ, ఎంతో అందంగా వుంది. అది సహజంగా, సుమ్నంగా, ఉల్లాసంగా, పూర్తి అందంతో నిండుగా వుంది. చెట్టుకు వుండే శక్తి, వేసవి వేడీ అంతా ఆ ఆకులో వున్నట్లే వుంది. అది వాడిపోకుండా అందంగా వుంది.

"కాని. మనిషి దుఃఖంతో, బాధతో, రోగంతో, ముసలితనంతో, ముడుచుకుపోయి, అందవికారంగా, అశాంతిగా, దైన్య స్థితిలో ఎందుకు చనిపోతున్నాడు ? మనిషి ఆకు అంత అందంగా, సహజంగా ఎందుకు చనిపోలేకండా వున్నాడు ?"

" మనిషిలోని లోపం—పొరపాటు—తప్పు ఏమిటి ? దేహానికి సంబంధించినంతవరకు, ఈ డాక్టర్లు—మందులు—హాస్పిటల్స్—ఆపరేషన్స్. జీవితానికి సంబంధించినంతవరకు మరణవేదన — యాతన — బాధ వున్నాయి అదేవిధంగా సంతోషాలు—సుఖాలు—ఆనందాలు—ఇవన్నీ వున్నా మనిషి ఎందుకు చిరునవ్వుతో గొప్పగా—ఆకు అంత సహజంగా ఎందుకు చావలేకపోతున్నాడు ?

" మీరు మీ పిల్లలకు చదువు, రాత—శాస్త్రజ్ఞానం—సమస్త విద్యలు—వ్యాపారం—ఉద్యోగం అంతా, అన్నీ నేర్పినట్లే ; గొప్పగా, సహజంగా, అందంగా, ఆనందంగా చావడం గురించి కూడా చెప్పి, నేర్పడం మంచిది.

" మనం జీవితంలో ఎన్నో సంగతులు నేర్చుకోవడంతో పాటు, సహజంగా చావడం కూడా అందులో ఒక భాగమని

తెలుసుకోవడం మంచి సంగతి. పిల్లలకు చావు గురించి వికృతంగా, భయంకరంగా వైరాగ్యభావంతో చెప్పడం కాక, దాని గురించి శాంతంగా, సౌమ్యంగా వివరించి చెప్పాలి. మీ మాటలతో "చావు—పుట్టుక ; జీవితం-మృత్యువు" ఒక్కటే, సమానమే అనే భావం ఏర్పడాలి వాళ్ళలో.

"పునర్జీవితం లేదు. అది వట్టి మూర్ఖమైన నమ్మకం.

"ఈ అందమైన భూమిమీద ప్రతిదీ కొన్నాళ్ళు జీవించి, తర్వాత మరణిస్తుంది. జీవితంయొక్క కదలికను అంతటినీ అవగాహన చేసుకోవడానికి దయ—ప్రేమతోకూడిన జ్ఞానం అవసరం. ఆకు పండి, ఎండి, నేలరాలునట్లు—మనిషి జీవితం కూడా అట్లా అంతంకావడం లక్ష్యంగా పెట్టుకోవాలి, ప్రతి ఒక్కరూ. చావు, తనకూ ఇతరులకూ భయంకరం అసహ్యం కాకూడదు. అని, దాన్ని తోసేసి, నిరాకరించవలసినది కాదు. చావును ముందుకు హొడిగించి, వాయిదా వేయవలసినదీ కాదు. "అది మనతో రాత్రిం-బవళ్ళు వున్నదే!" అనే భావం మనలో వుండాలి. ఆ భావంలోంచి అసాధారణమైన, బ్రహ్మాండమైన విశాలభావం పుడుతుంది."



కృష్ణాజీ ఒకరోజున మేరీజింబాలిస్ట్‌తో "ప్రతిరాత్రి ధ్యానం నన్ను మేల్కొల్పుతోంది. ఆ సమయంలో నేను కానిది—నాకు పరమైనది-నాకు భిన్నమైనది—అవ్యక్తమైనది ఏదో—అది నాతో వుంటోంది.

"ప్రతిరాత్రి నన్ను మేల్కొల్పే ఆ ధ్యానమే, స్వేచ్ఛ. అదే జ్ఞానం. ఆ స్వేచ్ఛ, అందర్నీ, అన్నింటినీ ప్రేమతో

కలుపుతుంది. అది ఎటువంటి ప్రపంచమంటే, మాటలు— సంజ్ఞలు—ఛాయలు — గుర్తులు — ప్రతిబింబాలు — కనీసం జ్ఞాపకం—అనే వాటి జాడలేని ప్రపంచం. అది అగోచరం— అవ్యక్తం—అనంతం—అపారం—ఆనందం — పవిత్రం — నిర్మలం—నిశ్చలం—ప్రశాంతం అయిన ప్రపంచం.

"ఆవిధంగా గడచిపోయే ప్రతి క్షణం, ప్రేమమయం. అదే తిరిగి ప్రేమగా దర్శనమిస్తుంది. అందు బంధం, ఆసక్తి లేదు. దానికి మూలాధారం అంటూ లేదు అది నిర్వికారంగా ప్రకాశిస్తుంది.

"మనం అంతవరకూ ప్రేమతో, ఇష్టంతో, ఆసక్తితో, ఆశతో; శ్రద్ధగా, తెలివిగా, ప్రయత్నపూర్వకంగా నిర్మించుకున్న హద్దుల్ని, అంతాన్నీ ఆ ప్రేమ ఒక అగ్నిజ్వాలై, కాల్చేస్తుంది.

"అటువంటి ధ్యానం—ఒక అందం, ఆనందం. ఆ ధ్యానంతో జీవితానికి కావలసిన దీవన, ఆశీర్వాదం వస్తుంది," అన్నారు కృష్ణాజీ.



ఆ డిశంబరులో ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, ఆయన భార్య పిల్లలు కృష్ణమూర్తిని చూడ్డానికి ఋషీవ్యాలీ వెళ్ళారు. తనది ప్రైవేట్ మీటింగు కనుక, రాష్ట్రప్రభుత్వ సిబ్బందిగాని, కాంగ్రెస్‌వారుగాని, ఋషీవ్యాలీ స్కూలు ఆవరణలోకి రానవసరం లేదని ఇందిరాగాంధీ ముందుగానే వారికి తెలియపరచింది. రక్షక దళాల్ని కూడా ఆ ఆవరణ వెలుపలే వుండమన్నారు. కాని, వాళ్ళంతా వచ్చి, నిరాశపడ్డారు. అయినా వందలకొద్ది

పోలీసులు, రక్షకభటులు ఆమెకు, ఎవరికీ కనపడకుండా ఆ ఆవరణలో చెట్లవెనకా, రాళ్ళగుట్టల పక్కనా కూర్చొని ఇందిరా గాంధీని కాపలా కాశారట.

ఇందిరాగాంధి పుపుల్ జయకర్‌తో కలసి ఆ స్కూలు ఆవరణ అంతా చూసింది. ఆ స్కూలు పిల్లలతో మాట్లాడింది. ఆ వాతావరణం చాలా ఇష్టపడింది :

అసెంబ్లీహాల్లో కృష్ణమూర్తి, ఇందిరాగాంధీ పక్కన కూర్చున్నారు. స్కూలు - పిల్లలు-పరివారం-ఉపాధ్యాయులు నిశ్శబ్దంగా వున్నారు. పిల్లలు మొదట సంస్కృత శ్లోకాలు చదివారు. తర్వాత కృష్ణమూర్తి ఇందిరాగాంధీని మాట్లాడమన్నారు. తాను కృష్ణమూర్తి ముందు మాట్లాడలేనన్నది, ఇందిరాగాంధి. కృష్ణమూర్తి వేదికపై పద్మాసనంలో కూర్చొని, పిల్లలకు మాట్లాడారు. ఆ తర్వాత ఇందిరాగాంధి వెళ్ళి, కృష్ణమూర్తి పక్కన కూర్చొని కొద్దిగా మాట్లాడింది.

కృష్ణమూర్తి, ఇందిరాగాంధి ఋషికొండవైపు నడచి వెళ్ళారు; సాయంత్రం వేళ. తర్వాత మర్రిచెట్టుకింద కూర్చొని, మాట్లాడుకున్నారు. రాత్రి వెన్నెల్లో భోజనం చేశారు.



1981 అక్టోబరు ఇరవై ఆరున కృష్ణమూర్తి ఢిల్లీలో వున్నారు. జబ్బుపడి నీరసంగా వున్నారు. ఇండియా ప్రెసిడెంట్ శ్రీ నీలం సంజీవరెడ్డి, కృష్ణమూర్తిని తనతో వుండమని ఆహ్వానించారు.

నవంబరు రెండవ తేదీన కృష్ణమూర్తికి రాష్ట్రపతి భవనంలో విందు ఏర్పాటు చేయబడింది. కృష్ణమూర్తితో పుపుల్ జయకర్, అచ్యుత పట్వర్ధన్, నారాయణ్, నందిని వున్నారు.

సంజీవరెడ్డి ఎంతో భక్తి గౌరవాలతో కృష్ణమూర్తిని ఆహ్వానించి తీసుకున్నారు. కృష్ణమూర్తి చాలాకాలంగా పరిచితులైన ఆర్. వెంకట్రామన్‌గారితో సంభాషణ ప్రారంభించారు. ఆ రోజు కృష్ణమూర్తి ఎర్రంచు ఖద్దరు పంచె, లాల్చీ ధరించి, పైమీద ఉత్తరీయం వేసుకున్నారు, ఇందిగాంధీ విందుకు కొంచెం ఆలస్యంగా వచ్చారు.



1982-నవంబరులో కృష్ణమూర్తి ఢిల్లీలో వున్నారు. ఋషీవ్యాలీ స్కూల్లో పనిచేయడానికి పుపుల్‌జయకర్ కుమార్తె, రాధిక అమెరికానుంచి వచ్చింది. ఆ మధ్యకాలంలో ఆ స్కూల్లో ఎంతోమంది మేధావులు చేరారు. ఆ స్కూల్లోనే కాదు, దాని అనుబంధ పాఠశాలల్లో కూడా విద్యావంతులు చేరారు. మొత్తం మీద ఆ స్కూళ్ళలో ఒక నూతన చైతన్యం వచ్చింది.

రాధిక ఋషీవ్యాలీ స్కూల్లో "డైరెక్టర్ ఆఫ్ స్టడీస్," గాను, నారాయణ ప్రిన్సిపాల్‌గాను శ్రద్ధగా పనిచేయడం చూసి కృష్ణాజీ చాలా సంతోషపడ్డారు. ఆ సందర్భంలో కృష్ణాజీ, " నేను వున్నా, లేకపోయినా ఇంగ్లండు-అమెరికా-ఇండియా స్కూళ్ళలో పనిచేసేవారు, ప్రతి ఒక్కరూ కాంతివంతమైన ఒక్కో దీపంగా తమకు తాము వెలగాలని కోరుతున్నాను," అన్నారు.



నవంబరు పద్దెనిమిదవ తేదీనుంచి కృష్ణమూర్తికి మొదటి సారిగా కలకత్తాలో నాలుగు ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడ్డాయి. కృష్ణమూర్తితోపాటు సునంద, పామాపట్వర్ధన్, అచ్యుతపట్వర్ధన్, డాక్టరు పరుచూరి, పరమేశ్వరన్ కలకత్తా వెళ్ళారు.

"ఆ మర్నాడు కృష్ణమూర్తి మేరీకి రాస్తో," ఇక్కడ నా సభలకు బ్రహ్మాండమైన ప్రచారం జరిగింది. నా బోధల్ని పత్రికలు నిండుగా ప్రకటించాయి. ఐదారువేలమంది జనం నిశ్శబ్దంగా, ప్రశాంతంగా విన్నారు.

"కలకత్తా ఇరుకు, మురికి. అత్యధిక జనాభా కల నగరం. ఇక్కడ కమ్యూనిస్ట్ ప్రభుత్వం ఏర్పడివుంది. గంటలకొద్దీ కరెంట్ కోత అన్నారు.

కలకత్తాలో కృష్ణమూర్తి అనేక విషయాలపై మాట్లాడారు. అన్ని పేపర్లూ ఆయన జీవిత విశేషాలతోపాటు, ఆయన తత్వ విచారణ గురించీ రాశాయి.



ఆ సంవత్సరం బ్రాక్‌వుడ్ స్కూలు బిల్డింగుకు నిప్పంటు కుంది. కాని, కృష్ణమూర్తి వుండే గదిలో ఆయన బట్టలూ, అవీ భద్రంగా వున్నాయి.

కృష్ణాజీ జీవితం – తత్వం ఆధారంగా తీసుకుని, ఐదేళ్ళు శ్రమించి " THE CHALLANGE OF CHANGE " అనే కలర్ సినిమా తీశారు.

1983 నవంబరులో కృష్ణమూర్తి ఋషీవ్యాలీలో వున్నప్పుడు, "కస్టర్డ్ యాపిల్స్" పేకెట్ ఒకటి పుపుల్ జయకర్ ద్వారా ఇందిరాగాంధీకి పంపించారు. అది అందిన సంగతి సంతోషంతో తెలుపుకుంటో—

గౌరవనీయులైన కృష్ణాజీగారికి,

మీ ప్రేమగల ఉత్తరానికి నేనెంతో కృతజ్ఞురాలిని. మిమ్మల్ని కలుసుకోవడం నాకో ప్రత్యేకానుభవం. మీ మద్రాస్ ప్రోగ్రామ్స్‌కి విఘాతం కలిగించి, మిమ్మల్ని రమ్మనడం తప్పుగా, దోషంగా భావిస్తున్నాను. మీకోసం నేనే నా సమ

యాన్ని ఏర్పాటు చేసుకుంటాను. ఈ రెండునెలలూ నాకు పని ఒత్తిడి. వచ్చే - పోయే వారు వుంటారు. మామూలుగా ప్రభుత్వపరంగా వుండే కార్యక్రమాలు వుంటాయి. ఫిబ్రవరి 12, 13 తేదీలలో బొంబాయిలో నాకు ఒక ప్రోగ్రాం వుంది. ఏమాత్రం వీలున్నా ఆరెండు రోజుల్లో మిమ్మల్ని అక్కడ చూస్తాను.

మీరు క్షేమమని తలుస్తాను.

ప్రేమతో,

ఇందు

ఆ ప్రకారమే బొంబాయిలో ఇందిరాగాంధి, కృష్ణమూర్తిని కలుసుకుంది. వారిద్దరూ ఒక గంటకు పైగా మాట్లాడుకున్నారు. ఆమెతో కృష్ణమూర్తి మేడదిగి, ఆమె కారు దగ్గరకు వెళ్ళి, ఆమె రెండు చేతుల్నీ ప్రేమగా తీసుకున్నారు. అదే వారు చివరిసారిగా కలుసుకోవడం.

* * *

ఆ రోజుల్లోనే " The Challange of Change " అని కృష్ణాజీ జీవితంమీద ఒక పూర్తి నిడివి రంగుల చిత్రం విడుదల అయింది. దాన్ని అమెరికన్ ఫౌండేషన్ ట్రస్టీలలో ఒకరు చిత్రీకరించారు. అది చాలా అందంగా తయారైంది.

* * *

ఆ రోజుల్లో కృష్ణాజీ మిత్రులతో మాట్లాడుతూ,

"మనకు తెలిసిందీ, చేతనైనదీ - నిత్యం మన తెలివితో తెలిసి చేసేదాన్నే "ధ్యానం" అంటాం. ఆ ధ్యానానికై పద్మాసనం వేస్తాం. ఓ నామాన్నో, — మంత్రాన్నో ఆపకుండా జపిస్తాం. ఓ రూపాన్ని మనసులో ప్రతిష్టించుకుంటాం.

ఆ కార్యకలాపమంతా—మన కోర్కెలో భాగం, ఆలోచనతో ఒక యత్నం. అదంతా వట్టి పనికిమాలిన సంగతి. అది నిరర్ధకం. ఆ విధానమే నిజమైన ధ్యానాన్ని నాశనం చేస్తుంది, ఆపేస్తుంది, అడ్డగిస్తుంది.

"ధ్యానం చేస్తాననడం, వాయిదా వేయడం. క్షణక్షణానికి సత్యాన్ని గ్రహించుటే, ధ్యానం. అదే ఆత్మజ్ఞానం-స్వస్వరూప ధ్యానం," అన్నారు.

1984_ఏప్రిల్ పదిహేడవ తేదీన యు. యన్. ఒ. వారు "డాగ్ హేమర్ షెల్డ్" లైబ్రరీ ఆడిటోరియంలో కృష్ణమూర్తి ఉపన్యాసం ఏర్పాటుచేశారు. "అంతర్జాతీయ సమితిగా ప్రపంచంలో ఆనాటినుంచి, ఈనాటివరకు అనేక సంస్థలు – సంఘాలు – సమాజాలు శాంతికోసం స్థాపించబడ్డాయి. కాని, ఏనాడూ ప్రపంచం శాంతిగా లేదు. దానికి అనేక కారణాలు– జాతీయవాదం, మత వ్యతిరేకత, వర్గాలు, జాతులు, తరగతులు మొదలైనవి ఎన్నో వున్నాయి.

"ఎందువల్ల ఇన్నివేల సంవత్సరాలలోనూ మానవులు శాంతిగా బ్రతకలేకపోతున్నారు ? అశాంతికి ప్రధాన కారణం, మనం. మనం–హిందూ, క్రైస్తవ, ముస్లింగా, ఇంకా అనేక విధాల విభాగమై వున్నాం. ప్రపంచ అశాంతికి కారణం, మన మని, మనం ఎప్పుడైనా గుర్తించామా ? హింస, యుద్ధం, భీతికి కారణం మనమే : " యుద్ధం జరుగుతున్నది "బీరూట్"లో కాదు, మన హృదయాల్లో, మన మనసుల్లో.

"ఈ సంఘాన్ని, ఈ సమాజాన్ని సృష్టించింది, మనం. అటువంటి దాంట్లో మనం నివసిస్తున్నాం. మనమే ఈ సంఘం, సమాజం, సంస్థ. అన్నీ, అంతా మనమే. కనుక ప్రతి ఒక్కరూ లోపలా, బైటా పూర్తిగా, హేతుబద్ధంగా మారనిది ప్రపంచంలో శాంతి, భద్రతలు వుండవు.

"మనిషి మనసు, మెదడు ఒక ప్రత్యేక పద్ధతిలో, సాంప్రదాయంలో, మతంలో రూపొందించబడతాయి. అందు చేత అతడు షరతుల్లో, హద్దుల్లో, పరిమితుల్లో బ్రతుకుతాడు. అటువంటి హద్దులు కల మనిషి స్వేచ్ఛ పడటం సాధ్యమా ? అసలు ఆ మనిషి ఎందుకు బందీగా వున్నాడు ? ప్రతి ఒక్కరూ, ప్రతి క్షణం ప్రతి దాన్నించీ లోపలా, బైటా రక్షణ కోరతారు – అవి – జాతి, మతం, సంస్థల ద్వారా.

"మనం మన జీవితాన్ని మార్చుకోకపోతే, భూమిమీద శాంతిని ఎట్లా స్థాపించగలం? ప్రతి ఒక్కరూ తానొక ప్రత్యేక వ్యక్తి ననుకోవడం వల్ల ప్రపంచంలో వినాశనాన్ని తెచ్చిపెట్టు కుంటున్నాం. ఒకరిని, ఒకరం చంపుకుంటున్నాం. లేదా, ఒకరికి సహాయం, లాభం చేకూర్చే యత్నంలో మరొకరికి నష్టం, కష్టం, హాని, అశాంతి, బాధ కలిగిస్తున్నాం. చివరికి హత్య కూడా చేస్తున్నాం. దానికి కారణం "నేను—నాది" అనే బుద్ధి.ఆ బుద్ధి మారాలి. మనిషి స్వేచ్ఛగా వుండాలి. ఆనాడే ప్రపంచానికి శాంతి లభిస్తుంది.

"మనసు, మెదడు నిరంతరం గతంతో నిండివుండటం వలన, ఎవరూ శాంతిగా, ప్రశాంతంగా వుండలేకపోతున్నారు. మన నిత్య జీవితం అసంతృప్తిగా, విసుగుగా, ఒంటరిగా సాగు తుంది, అనేక స్వయం కల్పిత కారణాలవల్ల. దాన్నించి తప్పించుకునేందుకు మతం, సాంప్రదాయం, పద్ధతి, జాతీయత ఇంకా, ఇంకా అనేక రకాలైన వినోదాల ద్వారా పారిపోవడానికి చూస్తారు.

"ఈ విధమైన జీవన విధానం, ఇప్పుడు మనమే కాదు ఇక్కడే కాదు వేల, వేల సంవత్సరాలనుంచీ ఇలాగే గడుస్తోంది."

ప్రపంచంలో రోజు రోజుకీ ఘోర యుద్ధాలు, అన్యా యాలు, హత్యలు, అక్రమాలు చూసి కనీసం ఏ ఒక్కరిలోనూ మార్పు రాలేదని, తన ఉపన్యాసాల, బోధల, చర్చలవల్ల ప్రయోజనం లేకపోయిందనీ బాధపడ్డారు కృష్ణాజీ.

తనకు సన్నిహితంగా వుండి వినిన వారిలో కూడా మార్పులేక పోవడం ఆయనకు ఆశ్చర్యకరంగా తోచింది.

ఏ ఒక్కరిలోనూ మార్పూ, పరిణామం వున్నా, తన బోధ ఫలించినట్లు, ప్రజలు వికాసం చెందినట్లు సంతోషించేవారాయన. ఇన్ని సంవత్సరాలలో ఎందరికో మాట్లాడారు. ఎన్నో రాశారు. చెప్పారు, చర్చించారు. అయినా ఏ ఒక్కరిలోనూ అది లోతుగా వెళ్ళలేదని వాపోయారు, కృష్ణాజీ.

• • •

ఆ రోజు ఉపన్యాసానంతరం ఒక పత్రికా విలేకరి మాట్లాడుతూ, "ఈరోజు మనం ఒక నాగరికుని, మర్యాదస్తుణ్ణి చూశాం. జంకు బిడియం లేని వానిని కలుసుకున్నాం. అతనిలో అంతులేని ఓపిక, ఓర్పు వున్నాయి. వాటితోపాటు అతని తీవ్రత, అతను చేపట్టిన కార్యక్రమం కనపడుతున్నాయి. అతని స్పష్టత, లోదృష్టితో కూడిన వ్యాఖ్య - విమర్శ - చర్చ మనల్ని నిజంగా ఒక స్వేచ్ఛాపరుణ్ణి చూశామనే సంతోషాన్ని కలిగించాయి. ఇక్కడ మనకు విశాలమైన దృక్పథం కలిగిన ఒక సంపూర్ణ స్వేచ్ఛాపరుడు. ఒక రకమైన ఆధ్యాత్మిక అధికారీ కనుపించాడు," అన్నాడు.

• • •

ఒకసారి కృష్ణమూర్తి మిత్రులతో మాట్లాడుతూ, "దుఃఖాన్ని అంతమొందించాలని, దానికి అతీతంగా వుండాలని ఆశించకూడదు. దాన్ని నిరోధించాలనీ యత్నించనూ కూడదు. దాన్నించి ఒక్కక్షణం కూడా దూరంగా వుండక, దానితోనే వుండాలి. దానికి ఎరుకలో వుండాలి. దాన్ని వదలి దూరంగా వెళ్ళకూడదు.

"దుఃఖం వున్నప్పుడు, ప్రేమకు తావులేదు. దుఃఖమంటే, Self Pity కాదు. దుఃఖం ఒంటరితనాన్నీ, నిరాశనీ, నిస్పృహనీ, ఏకాకిననే భావాన్నీ, విడిగా వున్నాననే ఆలోచననీ కలిగిస్తుంది.

"అసలు మనలో ఆ దుఃఖం ఎలావుందో దాన్ని జాగ్రత్తగా, పరిశీలనగా, నెమ్మదిగా, ఓర్పుగా నిదానంగా, లోతుగా, నిజాయితీగా, వివరంగా పరిశీలించాలి. ఆ దుఃఖంతో మనం కొంతకాలం వుండాలి - అంటే, అది ఎంతకాలమని కాదు. దానితో కొంతకాలం వుండటమే ముఖ్యమైన సంగతి.

"దుఃఖపడేవానినుంచి , దుఃఖం వేరు కాదు, భిన్నమూ కాదు. దుఃఖంనుంచి పారిపోయి అన్నిరకాలైన ప్రయత్నాలూ, పనులూ చేస్తారు, దాన్ని తొలగించాలని.

"అసలు పద్ధతి, అది కాదు. ఆ దుఃఖాన్ని ఒక అందమైన చంటిబిడ్డగా తీసుకుని, చూసుకోవాలి. అంతేకాని దాన్నించి తప్పించుకుని పారిపోకూడదు. దాన్ని నిజంగా, లోతుగా చూసినట్లయితే దానికి తప్పక అంతం వస్తుంది," అన్నారు.



1984 నవంబరు నాల్గవ తేదీన కృష్ణమూర్తి - దలైలామా ఒకే వేదికమీద మాట్లాడతారని దేశ, దేశాల బౌద్ధ సన్యాసులకు తెలిసింది. ఎంతోమంది ఆ సభలకు హాజరు కావచ్చుననుకుంటున్నారు. కాని, ఆ ముందురోజున అంటే, నవంబరు మూడవ తేదీన పుపుల్ జయకర్ ఇంట్లో కృష్ణమూర్తి, దలైలామాతో పాటు ఇందిరాగాంధీకి కూడా విందు ఏర్పాటు చేయబడింది. ఆ సమావేశాలకు అన్ని ఏర్పాట్లూ చురుకుగా జరుగుతున్నాయి.

ఆ అక్టోబరు ఇరవైఎనిమిదవ తేదీన కృష్ణమూర్తి, మేరీజింబాలిస్ట్ ఢిల్లీ వచ్చారు. కృష్ణమూర్తి సఫ్దర్‌జంగ్ రోడ్‌లోవున్న పుపుల్ జయకర్ ఇంట్లో వున్నారు. మేరీ తాజ్ మహల్ హోటల్లో వుంది. ఇండియాలో ఆమె ఆరోగ్యం అంత బావుండదు. ఆ సంగతి కృష్ణమూర్తికి తెలుసు.

ఆ తర్వాత నందిని, ఆసిత్‌చాంద్‌మల్, పట్వర్ధన్‌కూడా వచ్చి, కృష్ణమూర్తితో చేరారు.

ముప్ఫైవ తేదీన వైస్-ప్రెసిడెంట్ వెంకట్రామన్ రాష్ట్రపతి భవనంలో ఏర్పాటుచేసిన విందుకు కృష్ణమూర్తితో పాటు పుపుల్ జయకర్, మేరీ జింబాలిస్ట్, పట్వర్ధన్ కూడా హాజరయ్యారు.

ఆ సాయంత్రం కృష్ణమూర్తి త్వరగా భోజనం ముగించారు. పుపుల్ జయకర్ తాను రాసిన కృష్ణాజీ జీవిత చరిత్ర చదివి వినిపిస్తోంది, కృష్ణమూర్తికి. అక్కడ మేరీ కూడా వుంది. పుపుల్ జయకర్ "ALCYONE" అని వున్న పేరా చదువుతో వుంటే, కృష్ణమూర్తి ఆమెను ఆపి, "అల్కియోన్" అంటే అర్ధం తెలుసా?" అని అడిగారు. అంటే, "The Brightest star in the Pleiades" అని అర్ధం" అని చెప్పారు కృష్ణాజీ.

పుపుల్ జయకర్ చదువుతోంది. కృష్ణమూర్తి వింటూ అకస్మాత్తుగా పక్కకు తిరిగి, "దాన్ని మీరు గమనించారా? నేను దానికి నమస్కారం చేస్తాను," అన్నారు. అంతే!

ఆ మర్నాడు ఉదయం 9-20 నిమిషాలకు డిల్లీలో ఇందిరా గాంధి హత్యచేయబడింది. దేశమంతా అల్లకల్లోలమైంది. అదంతా కృష్ణమూర్తి టి. వి. లో చూశారు.

పుపుల్ జయకర్ పరుగు-పరుగున ఇందిరాగాంది నివాసానికి వెళ్ళింది. జరిగిన సంగతి కృష్ణాజీకి ఫోన్ చేసింది.

ఆ మధ్యాహ్నం వరకు కృష్ణమూర్తి గంభీరంగానే వుండిపోయారు. ఆ తర్వాత పుపుల్ జయకర్‌తో "ఇందిరాగాంధి గూర్చిన జ్ఞాపకాల్ని మీ మనసులో వుంచుకోకండి. ఆ జ్ఞాపకాలు ఆమెను భూమికి బంధిస్తాయి. ఆమెను వెళ్ళనివ్వండి," అన్నారు.

• • •

అసిత్‌చాంద్‌మల్ కృష్ణమూర్తిని బ్రాక్‌వుడ్, సానెన్, ఇండియా, ఒహైలలో తీసిన అనేక కలర్ ఫొటోలను ఒక క్రమంలో అమర్చి, చిన్న పరిచయం రాసి, గొప్ప పుస్తకంగా, సర్వాంగ సుందరంగా తయారుచేసి దాన్ని కృష్ణమూర్తి ఎనభై ఐదోఏట జన్మదినకానుకగా ఆయనకు సమర్పించాడు. అదే, 'THE THOUSAND MOONS"

*　　　　*　　　　*

కృష్ణమూర్తి జీవితంలో ఏది స్థాపించడానికీ, నిర్మించడానికీ అంగీకరించకపోయినా, అనుమతించక పోయినా తన పేరు మీద ఒక విద్యా సంస్థ స్థాపించడానికి అంగీకరించడం కొందరికి ఆశ్చర్యకరంగా తోచక మానదు.

"కృష్ణమూర్తి ఫౌండేషన్" పేరుమీద ఇండియా - ఇంగ్లండు - అమెరికాలలో కమిటీలు ఏర్పడ్డాయి. ఆ కమిటీలు కృష్ణమూర్తి పుస్తకాల్ని అచ్చువేస్తాయి. ఆయన ఉపన్యాసాల్ని, ప్రయాణాల్ని, వసతి ఏర్పాట్లనూ చూస్తాయి. ఒకసారి కృష్ణమూర్తి తన గురించి చెప్పుకుంటూ, "నాకు ఏ బ్యాంకులోనూ ఎకౌంటు లేదు. నేను పొగ త్రాగను. మద్యం ముట్టను. మాంసం తినను. నాకు ఏ అలవాట్లూ లేవు. నాకు కావలసినవన్నీ, మిత్రులే సమకూర్చి పెడుతున్నారు. స్నేహితులిచ్చే బట్టలే కట్టుకుంటాను. మరికొందరు నా పుస్తకాలు అచ్చువేస్తారు. కొందరు అమ్ముతారు. నాకు ఎక్కడా ఇల్లూ, ఆశ్రమం అంటూలేదు. ఈ ప్రపంచమే నా ఇల్లు," అన్నారు.

కృష్ణాజీకి జీవితంలో ఇష్టమైన విషయం, విద్య. ఆయన కోరి, స్థాపించిన అనేక పాఠశాలల్ని, ఆ కమిటీలు నడుపుతాయి. పిల్లలలో జాతి, మత, వర్గ, వర్ణ వివక్షతలు గాని, ఎటువంటి దురభిమానాలుగాని లేకుండా చూడ్డం, ఆ విద్యాలయాలు

లక్ష్యంగా పెట్టుకున్నా, తగిన ఉపాధ్యాయులు దొరకడం కష్టం. కృష్ణాజీ ప్రతి సంవత్సరం ఆయా పాఠశాలలకు వెళ్ళి పిల్లలతో - ఉపాధ్యాయులతో సంభాషించేవారు, చర్చించేవారు,

ఇండియా ఫౌండేషన్‌వారు నాలుగు స్కూళ్ళు నడుపుతున్నారు : ఋషీవ్యాలీ-రాజఘాట్-బెనారస్-అడయార్‌లలో. బెంగుళూరులో "వ్యాలీస్కూలు," బొంబాయిలో, "బాలానంద" కూడా వారి ఆధ్వర్యాన నడుస్తున్నాయి. ఇండియాలో ఇంకా అటువంటి స్కూళ్ళు అవసరమని కృష్ణాజీ అభిప్రాయం. ఆ స్కూళ్ళకు ప్రభుత్వ సహాయం ఏమీ లేదుకాని, కొన్ని స్కాలర్ షిప్స్ మాత్రం ఇస్తోంది, ప్రభుత్వం.

ప్రతి విద్యార్థి తన చుట్టూవున్న పరిసరాల సహాయంతో తనకు తాను పూర్తి వికాసం చెందటం, ఆ పాఠశాలల లక్ష్యం కావాలన్నారు, కృష్ణాజీ. మంచిగా మారడానికి విద్యార్థికి ఆ స్కూలు సహాయపడుతూ, అవకాశం కల్పించాలంటారు, ఆయన. విద్యార్థులు తాము చేసే పనుల విషయంలో సరైన అవగాహన ఏర్పరచుకుంటూ, తమ వ్యక్తిత్వాలను తామే అభివృద్ధి పరచుకోవాలనేది, ఆ విద్యావిధానం. విద్యార్థిపై బైటనుంచి ఎటువంటి బాధ్యత, అధికారం, బంధం, భయం వుండకూడదంటారు, కృష్ణాజీ. ఎందుకంటే, ఎటువంటి క్రమశిక్షణ అయినా, పిల్లల మనసునీ, హృదయాన్నీ విశాలంగా ఎదగనివ్వక అణచేస్తుంది. విద్య, ఉద్దేశ్యం, సమాచారం సేకరించడం, విజ్ఞానాభివృద్ధేకాదు, జీవితాన్నంతా పూర్తిగా తెలుసుకోవడం, సత్సంబంధాన్ని కలిగి వుంటేటట్లు చేయడం. అటువంటి విద్యవల్ల భయం పోయి స్వేచ్ఛ లభిస్తుంది.

ఆ స్కూళ్ళలో పరీక్షలు వుండపోయినా, పరిశీలనార్థం, పరిశోధనార్థం, గ్రంథాలూ, ఎన్‌సైక్లోపేడియావంటి గ్రంథాలూ

వుంటాయి. ఆ గ్రంధాల పరిశీలనతో విద్యార్థులు నోట్స్ తయారుచేసుకుంటారు. పై చదువులకు వెళ్ళేందుకు వీలుగా విద్యార్థులను తయారుచేస్తాయి, ఆ స్కూళ్ళు.

సౌందర్యదృష్టి, సౌశీల్యం, పవిత్రత, విద్యార్థుల దృష్టిగా వుండాలి. అటువంటి స్కూళ్ళే నిజమైన జీవనకేంద్రాలు, విజ్ఞాన నిలయాలు. ఎవరికివారు, లలిత కళలు, సంగీతం, చిత్రలేఖనం, క్రీడలు నేర్చుకునే కుతూహలం కలిగి వుండాలంటారు కృష్ణాజీ. ఎందుకంటే, మాకు ఒక విద్యా విధానాన్ని ఏర్పరచి, మమ్మల్ని నడిపి, మా జీవితాల్ని సరిదిద్దమని ప్రజలు ప్రభుత్వాన్ని, మతాన్ని అర్థిస్తారు. దానితో మతం ప్రజల్ని ఒక క్రమ పద్ధతిలో ఏర్పాటుచేస్తుంది. ప్రభుత్వం, సామర్థ్యంకల టెక్నీషియన్స్‌ని కోరుతుందేకాని, సామాన్య ప్రజానీకాన్నికాదు. ఆ విధంగా ప్రభుత్వం, మతం విద్యా విధానం మీద అధికారం చెలాయించి, దాన్ని స్వాధీనంలో వుంచుకుని, అదుపు-ఆజ్ఞల్లో పెడతాయి.

* * *

కృష్ణమూర్తి ఉపన్యాసాలు, సంభాషణలు, ప్రతి వేసవి కాలం స్విట్జర్లాండ్ - సానెన్‌లోనూ, వసంతకాలం - ఇంగ్లండు బ్రాక్‌వుడ్ పార్క్‌లోనూ, శీతాకాలం ఇండియా-ఢిల్లీ-వారణాసి-మద్రాసు-ఋషీవ్యాలీ, బొంబాయిలలోనూ ఏర్పాటు చేయబడేవి. ఒక్కో సంవత్సరం అనేక కారణాలవల్ల ఆయా కార్యక్రమాల్లో మార్పులు వచ్చేవి.

కృష్ణమూర్తికి తొంభై ఏళ్ళు పైబడినా, యాభయ్యోఏట ఎట్లా వుండేవారో అట్లానే వున్నారు; కొంచెం తేడాలో. వయసు పెరిగినకొద్దీ చేతులు వణకడం ఆరంభించాయి, అంతే; కాని, తరచు

జబ్బు పడేవారు. ఆయన దాదాపు ప్రతి సంవత్సరం ప్రపంచం పర్యటించి, ఉపన్యాసాలిచ్చారు. ఫిబ్రవరి మధ్యనుంచి, మే-చివరివరకు అమెరికాలో పర్యటించేవారు. ఒహై కేంద్రంలో వుండి ఆహ్వానాలపై న్యూయార్క్-శాన్‌ఫ్రాన్సిస్కో-మెక్సికో మొదలైన నగరాలకు వెళ్ళి ఉపన్యాసాలిచ్చేవారు.

కృష్ణాజీ ఎక్కడవున్నా, ఆయన దినచర్య ఎప్పుడూ ఒకే మాదిరిగా వుండేది. ఇండియాలో వున్నప్పుడు, సూర్యోదయంతోపాటు నిద్రలేచేవారు. మంచంమీద పడుకున్నా, సర్వేంద్రియాలు చైతన్యవంతంగా వున్నా, ఆయనకు ఒక్క ఆలోచనకూడా వచ్చేదికాదుట. ఉదయం యోగాసనాలు నలభై ఐదు నిమిషాలు చేసిన తర్వాత, నలభై ఐదునిమిషాలు ప్రాణాయామం చేసేవారు. అవి కేవలం, దేహం యావత్తూ సఖ్యతగా వుండేందుకే : నరాలు-కండరాలు-కణాలు-సమస్త దేహం సక్రమంగా పనిచేసేందుకు మాత్రమే, ఆయోగాసనాలు.

కృష్ణాజీ ఎప్పుడూ తనకూ, తన దేహానికీ మధ్య ఎటువంటి సంబంధం లేనట్లుగా వుండేవారు. కాని యోధుడు తన గుర్రాన్ని ఎట్లా చూసుకుంటాడో అట్లా నిరంతరం తన దేహాన్ని బాధ్యతగా, కేంద్రీకృతదృష్టితో చూసుకునేవారు. యోగం, షికార్లు, కంటి వ్యాయామం, సక్రమ ఆహారం - అన్నీ దేహం సరిగ్గా పని చేయడానికే చూసేవారు.

"నిత్యజీవితంలో నువ్వు ఏమైనా చెయ్యి. ఏం చేసినా నువ్వు పరిపూర్ణమైన, స్వచ్ఛమైన ఓ పరికరం మాదిరిగా వుండి, పనిచెయ్యి. అటువంటి పరిపూర్ణమైన జీవితం గడుపు. ఏది చెయ్యి - అది సరైనది అయితే దానికి కావలసినవి, అవసరమైనవి అన్నీ, అంతా లభ్యమౌతాయి. చివరికి ధనంతో సహా, సహాయము జరుగుతుంది," అన్నారు కృష్ణాజీ, ఒకసారి.

ఉదయం ఎనిమిది గంటలకు, అప్పటికి తనను చూడ్డానికి వచ్చిన మిత్రులతో కలసి అల్పాహారం తీసుకుంటూ సంభాషించేవారు. ఆ అల్పాహారంలో పళ్ళూ, వెన్న, గోధుమ-ఒక్కోసారి ఇడ్లీ - దోసె, కొబ్బరిపచ్చడి వుండేవి. రోజూ ఒక చిన్న గరిటెడు కాకరకాయ రసం తాగేవారు. అవసరమైనప్పుడూ, ఒళ్ళు బావుండనప్పుడు మూలికల కషాయం తీసుకునేవారు. ఆయుర్వేదం మందులు వాడేవారు. టిఫిన్ తర్వాత రోజూ విటమిన్స్, మినరల్స్ మాత్రలు వేసుకునేవారు. ఆ సమయంలో అనేక విషయాలపై - జాతీయ-అంతర్జాతీయ సమస్యలపై కూడా చర్చలు సాగేవి. కొన్ని సంగతుల్ని మిత్రుల్ని అడిగి తెలుసుకునేవారు, ఆ విధంగా పదకొండు గంటలవరకూ మాట్లాడుతూ వుండేవారు. వ్యక్తుల ప్రత్యేక సమావేశాలు, ఇంటర్వ్యూలు, సమస్యలు వుంటే, వారిని తన గదిలోకి తీసుక్కువెళ్ళేవారు - కొన్ని నిమిషాలు మాత్రమే.

పదకొండున్నర గంటలకు ఒక అరగంట విశ్రాంతిగా పడుకొని, ఏవో పుస్తకాలు చదువుకునేవారు. ఎప్పటికప్పుడు ప్రపంచ పరిస్థితులు, సైన్స్ పురోభివృద్ధి తెలుసుకునేవారు. పత్రికలు, బొమ్మల పుస్తకాలు, ప్రకృతి దృశ్యాలు, మిస్టరీ నవలలూ చదివేవారు.

మధ్యాహ్నం నూనె మర్దనా తర్వాత వేడినీళ్ళ స్నానం చేసేవారు. ఒంటిగంటా - పదిహేను నిమిషాలకు భోజనం చేసేవారు. భోజనంలో వేపుళ్ళు లేవు. మిరాయీలూ తక్కువే. కారం పచ్చళ్ళు ఇష్టం. ఒక్కోసారి అతిథులు వుండేవారు. ఆ సమయంలో చర్చలు సాగేవి. కృష్ణాజీ అప్పుడప్పుడూ కథలూ చెప్పేవారు. కొత్తవాళ్ళు వుంటే, చాలావరకు మౌనంగా వుండేవారు. సన్యాసులు, బౌద్ధులు, సిద్ధులు, యోగులు ఎందరో, ఎన్నిరకాలవారో, ఎన్ని జాతుల, మతాల, దేశాలవారో ఆయన

భోజన బల్లదగ్గర చేరేవారు. సన్యాసులు, సాధువులు, యోగులు వాళ్ళను చూడ్డానికి, కృష్ణాజీ ఎప్పుడూ సంతోషంగా వుండేవారు. వాళ్ళంటే ఆయనకు ఎంతో ఇష్టం, ప్రేమ. భోజనపదార్థాలు నెమ్మదిగా నములుతూ, వాటి రుచులు గమనిస్తూ రెండుగంటల సేపు తినేవారు. భోజనానంతరం చిన్న కునుకు తీసేవారు.

సాయంత్రం నాలుగు గంటలకు మిత్రుల్ని చూసేవారు. వాళ్ళ కష్ట-సుఖాల్ని విని, ఓదార్చేవారు. సలహాలు ఇచ్చేవారు. వాళ్ళను ప్రేమతో తీసుకునేవారు. ఎప్పుడూ, ఎవరినీ తన గదిలోకి ప్రవేశం లేకుండా చేయలేదు. ఆ తర్వాత తన బూట్లు తానే పాలిష్ చేసుకుని షికారుకు వెళ్ళేవారు. పెద్ద, పెద్ద అంగలు వేస్తూ, ఐదారు కిలోమీటర్ల దూరం నడిచేవారు. నడిచేటప్పుడు దేహం సితారుగా వుండేది. వెంట మిత్రులు వుండేవారు. ఒక్కొక్కసారి పిల్లలు వుంటే, వాళ్ళ చేతులు పట్టుకుని నడిచేవారు. ఎక్కువగా, ఒంటరిగా వెళ్ళడానికి ఇష్టపడేవారు. ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత, ప్రాణాయామం చేసేవారు,

రాత్రి భోజనంలో పళ్ళూ, సలాడ్స్, కాయలు, పప్పులు, సూప్ వుండేవి.

కృష్ణమూర్తి మొదటినుంచీ తాను ధరించే బట్టల విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించేవారు. విదేశాల్లో తన పనులు తానే చేసుకునేవారు. అప్పుడప్పుడూ సినిమాలు చూసేవారు. మ్యూజియమ్స్‌కు వెళ్ళేవారు. శాస్త్రీయ సంగీతం వినేవారు. రాత్రి పదిన్నర గంటలకు నిద్రపోయేవారు. ఆయనకు అప్పుడప్పుడూ కలలు వచ్చేవి.

తెల్లవారి నిద్రలేచేప్పటికి, పక్క దుప్పటి కొంచెంకూడా చెదిరేదికాదుట.

కృష్ణమూర్తి వెళ్ళిన ప్రతిచోటా కొంతమంది వ్యక్తులతో ప్రత్యేక సంభాషణలు, చర్చలు జరిపేవారు. వారు, ఆయన రాక కోసం ఎదురుచూసేవారు. చిన్న చిన్న సంస్థల్లో, సంఘాల్లో సమాజాల్లో, బహిరంగ సభల్లో పాల్గొనేవారు. వేదిక మీదకు నెమ్మదిగా, మౌనంగా వెళ్ళేవారు. ఇండియాలో అయితే, ఎర్రంచు పంచె, లాల్చీ ధరించేవారు. నిటారుగా కూర్చునే వారు. చేతులు మోకాళ్ళమీద ఆన్చేవారు. ఉపన్యాసానంతరం ఒక్క క్షణం నిశ్చలంగా వేదికమీద కూర్చునేవారు. తన కాళ్ళను ఎవరినీ తాకనిచ్చేవారు కాదు. తిరిగి నివాసానికి వెళ్ళే ముందు చేతులు జాచి మిత్రుల్ని, పిల్లల్ని తాకేవారు. నెమ్మదిగా నడచి, జనం మధ్యనుంచి వెళ్ళేవారు, అందర్నీ పలకరిస్తూ. చివరికి ఒక్కరే గదికి వెళ్ళేవారు. దారిలో పిల్లలు పువ్వుల దండలు ఇస్తే, సంతోషంగా తీసుకునేవారు. వాటిల్లో కొన్ని దండల్ని కాస్సేపు మెళ్ళో వేసుకుని, తిరిగి పిల్లలకు ఇచ్చేసే వారు.

ఎప్పటికీ ఒక చోట స్థిరంగా వుండక అరవై సంవత్సరాలు ప్రపంచం తిరిగి, తనను వినే వాళ్ళకు బోధించారు, సలహాలు, సూచనలు ఇచ్చారు.

వృద్ధాప్యం ఎక్కువయ్యే కొద్దీ ఆయనలో చురుకుదనం ఎక్కువఅయింది ఏ పనీ లేకుండా మంచంమీద పడుకున్నప్పుడు మాత్రం, కృష్ణమూర్తిలో ముసలితనం కనుపించేది. చేతులు వణకడం, దేహం ముడతలు పడటంవల్ల వృద్ధాప్యం తెలిసేది. ఆయన కదిలినా, ఏంచేసినా, నవచైతన్యంతో వెలిగిపోయేవారు. యువకుని మాదిరిగా వుండేవారు. తొంభై యేళ్ళ ఏటకూడా ఖండాంతరాలు ప్రయాణం చేశారు; ఉపన్యాసాలు ఇచ్చారు. ఆయన దేహం, మనసు, మెదడు సఖ్యతగా వుండి పనిచేసేవి,

"తన దేహం మాట్లాడటం మానేసినప్పుడు, అప్పుడు ఆ దేహం మరణిస్తుంది," అన్నారు కృష్ణాజీ. ఒకసారి. అంటూ, "ఈ నా దేహానికి ఒక ఉద్దేశ్యం వుంది – అది మాట్లాడటం. మాటల్లో బోధించడం. ప్రపంచానికీ తెలియజెప్పడం," అన్నారు.

మనిషిని మానసికంగా మార్చాలనేది కృష్ణమూర్తి ఆశయం. "మనిషి తన ఆలోచనను ఏ ఒక్కదానికీ కట్టుబడనీయకుండా, దాన్ని నిర్భయంగా, నిస్సంకోచంగా, కొసదాకా కొనసాగించాలి. మనిషిలో పరిపూర్ణ పరిణామం వచ్చినప్పుడే, స్వేచ్ఛ సాధ్యం. స్వేచ్ఛ అంటే, నిశ్చలమైన, నిర్మలమైన పరిశోధన. ఏ భయమూ, ఉద్దేశ్యమూ, అభిప్రాయమూ, పద్ధతీ, మార్గమూ అంటూ ఏమీ లేకుండా సాగించే పరిశీలన. ఎవరైనా తాము మనస్సంతటితో మారదలిస్తే, మారడానికి అవకాశం లేకపోలేదు. ప్రతి ఒక్కరిలో ఆ శక్తి వుంది. మనిషి మారితే, వ్యవస్థా, మారుతుంది. ఆ మారడం కూడా ఎప్పుడోకాదు, అప్పుడే – ఆ క్షణంలోనే జరగాలి," అంటారు కృష్ణాజీ.



తొంభైయ్యో ఏటకూడా కృష్ణాజీ ముసలివానిమాదిరిగా కనుపించలేదు. నిదానించి చూసినవారికి అమరుడుగా, శాశ్వతుడుగా, అనంతశక్తి స్వరూపుడుగా కనుపించారు. అన్నింటినీ శ్రద్ధగా, చురుకుగా పరిశీలించేవారు.

కృష్ణాజీ ఎప్పుడూ తన పనులు తానే చేసుకునేవారు. అప్పుడప్పుడూ దంతవైద్యుని దగ్గరకు వెళ్ళేవారు, పుస్తకాల షాపుకూ వెళ్ళేవారు. రెస్టారెంట్‌కీ వెళ్ళేవారు. తనచుట్టూవున్న ప్రజల్ని పరిశీలించేవారు. బట్టల విషయంలో ఎప్పుడూ శ్రద్ధ తీసుకునేవారు. కొత్త బట్టలు కుట్టించుకోవడానికో, పాతవాటిని

సరిచేయించుకోవడానికో, టైలర్ దగ్గరకు వెళ్ళేవారు. అవన్నీ ఆయనకు మొదటినుంచీ పరిచయమైనవే! ఆ యాచోట్లకు అన్ని చోట్లకు వెళ్ళినట్లే చాలా సహజంగా, అందరిమాదిరిగా వెళ్ళేవారు.



1913 లో కృష్ణమూర్తి తన ఆత్మకథ రాయాలనుకున్నారు. దానికి "యాభై సంవత్సరాల జీవితం," అని పేరు కూడా పెట్టారు. అది 1945-సంవత్సరం వరకు జరిగిన కథ అయివుండేది. బాల్యజీవితం రాసి, ఎందువల్లనో విరమించారు.

ఆతర్వాత కృష్ణమూర్తి జీవితచరిత్ర బి. శివరావు రాస్తారనుకున్నారు. ఆయన కృష్ణమూర్తికి చిరకాల మిత్రులు. 1909లో, ఆయన అడయార్‌లో వున్నప్పుడు కృష్ణమూర్తికి చదువుచెప్పేవారు. ఆ తర్వాత అనీబిసెంట్ స్థాపించిన "న్యూ-ఇండియా" అనే పత్రికకు ఎడిటర్‌గా పనిచేశారు. ఆయనకు కృష్ణమూర్తి గురించిన అన్నిసంగతులు వివరంగా తెలియడం వల్ల, మరికొంత సమాచారం సేకరించి కృష్ణాజీ జీవిత చరిత్ర దాదాపు రెండు అధ్యాయాలు రాసిన తర్వాత, జబ్బుపడ్డారు. దానితో ఆ రచన ఆగిపోయింది.

1947-లో ఇండియాకు స్వతంత్రం వచ్చిన తర్వాత, శివరావు పార్లమెంట్ సభ్యులైనారు. కృష్ణాజీ జీవిత చరిత్ర రాయడం తనవల్లకాదనుకుని, తాను సేకరించిన సమాచారాన్నంతా కృష్ణాజీ సమ్మతిమీద ఉభయమిత్రురాలైన "మేరీలూట్యన్స్"కి అప్పగించారు.

మేరీలూట్యన్స్, లేడీఎమిలీకుమార్తె. ఆమెకు కృష్ణమూర్తి చిన్నప్పటినుంచీ తెలుసు ఆయనతో సన్నిహితంగావుండేది. ఆయనతో కలసి అనేకచోట్లకు వెళ్ళింది. కృష్ణాజీతో ఉత్తర-ప్రత్యుత్తరాలు జరిపింది. ఆయన రచనల్ని పూర్తిగా, శ్రద్ధగా చదివి, అన్ని విషయాలూ స్పష్టంగా తెలుసుకుంది. కృష్ణమూర్తి తత్వ విచారణపై కొంత సమాచారం సేకరించడంవల్ల ఆయన జీవిత చరిత్ర రాయడానికి, కృష్ణమూర్తి అనుమతి పొందింది. ఆమె ఎంతో భక్తిశ్రద్ధలతో విషయాలు సేకరించింది. ఆమె గ్రంధానికి విస్తారణ వివరణే, వన్నె తెచ్చింది. కృష్ణాజీ జీవిత చరిత్ర మొదటిభాగం "The years of Awakening", రెండవ భాగం "The years of Fulfilment", మూడవభాగం "The Open Door" అని పేర్లు పెట్టింది.

ఆ గ్రంధంలో కృష్ణాజీ జీవితానికి సంబంధించిన ఏ ఒక్క చిన్న అంశాన్నీ ఆమె వదలిపెట్టలేదు. ఆమెకు అవసరమైన సమాచారాన్ని కృష్ణమూర్తి అందించారు. ఎన్నో సూచనలు, సలహాలు ఇచ్చి ఎంతో సహాయం చేశారు. మేరీలూట్యన్స్ కూడా ఆయన బోధల్ని జాగ్రత్తగా పరిశీలించి రాసింది.

ఆ తర్వాత కృష్ణమూర్తి జీవితచరిత్ర రాసినవారు శ్రీమతి పుపుల్ జయకర్. ఆమె కృష్ణమూర్తిని 1948 లో కలుసుకుంది. అప్పటినుంచి విడవకుండా ఆయనకు సన్నిహితంగా వుంటూ, అనుసరిస్తూ, వింటూ, చదువుతూ వెంటనంటి వుంది. ఆయనతో చర్చలు, సంభాషణలు, ఉత్తర-ప్రత్యుత్తరాలు జరిపింది. ఆయన రాసిన పుస్తకాలూ, ఇన్ని సంవత్సరాలలో ఆయనపై వచ్చిన గ్రంధాలూ, పత్రికల్లో వెలువడే సమాచారాలు, తన అనుభవంలో వున్న సంగతులతో కృష్ణాజీ జీవితం రాయాలనుకుంది, 1978 లో. ఆ సందర్భంలో కృష్ణాజీ మిత్రుల,

సన్నిహితుల, అనుచరుల, అభిమానుల హృదయాల్లో నిక్షిప్తమై వున్న అమూల్యనిధులవంటి కొన్ని అనుభవాల్ని సేకరించింది. తాను సేకరించిన సమాచారాన్ని కృష్ణమూర్తికి చదివి వినిపించింది. ఆయన ఆమోదం పొందింది. కృష్ణాజీని పూర్ణ మానవుడుగా, గురువుగా, తత్వవేత్తగా, బోధకుడుగా, మహామేధావిగా తీసుకుని అనేక సంగతుల్ని, సంఘటనల్ని, సందర్భాల్ని ఆధారంగా తీసుకుని ఆయన జీవిత చరిత్ర రాసింది.

మేరీలూట్యన్స్, పుపుల్ జయకర్ గ్రంథాల్లో ఒక ముఖ్యమైన సమాచారం వుంది. అది ఏమిటంటే, "కృష్ణాజీ అసలు తానెవరో, తానేమిటో అదంతా ఆయన వివరించి చెప్పడంగాని, దాన్ని మర్మంగా దాచి వుంచడంగాని ఏనాడూ ఆయన అభిమతంకాదు," అన్న సంగతి.

కృష్ణాజీ తాను చెప్పే సంగతులు, బోధించే విషయాలు తనకు ఎక్కడనుంచి వస్తున్నాయో, అసలు వాటిమూలమెక్కడో ఆయన చెప్పలేదు, దాచనూలేదు. ఆయన ఆ సంగతి చెప్పినా, చెప్పకపోయినా ఆ విషయం ఒక మర్మంగా మిగిలిపోయింది. ఆయన్ని మొదటినుంచీ ఏది కాపాడి, రక్షించిందో ఆ సంగతి ఆయన ఎప్పుడూ ప్రత్యేకంగా, స్పష్టంగా చెప్పలేదు. ఆ మర్మమేదో, దాన్ని ఎవరూ కనుక్కోనూ లేదు. "బైటనుంచి ఏదైనా" శక్తి ఆయన్ని నడిపించిందా? అని తలలు బద్దలు కొట్టుకోవడంకన్నా, ఆయన బోధల్ని అర్థం చేసుకోవడం ముఖ్యం. తక్కినదంతా వ్యర్థం.

అసలు జరిగిందేమిటంటే, మహాత్మామైత్రేయ అవతరణకు అనువైన దేహంకోసం మేధావంతులు, సంస్కారవంతులు అయిన లెడ్‌బీటర్, అనిబిసెంట్ ఇద్దరూ అన్వేషణ ఆరంభించారు.

ఆ అవతార అవతరణకు అదొక సాంప్రదాయమట. ఈ సాంప్రదాయ వాదులు అవతార పురుషులుగా తూర్పుదేశ వాసుల దేహాల్నే ఎందుకు ఎన్నుకుంటారో ?

వారి అన్వేషణా సమయంలో, అడయార్ సముద్రతీరంలో కొంత మంది పిల్లలతో కలసి ఆడుకుంటున్న ఒక చిన్న కుర్రవాడిని లెడ్‌బీటర్ చూసి, పట్టుకుని, తమ చేతుల్లోకి తీసుకున్నారు. ఎందుకంటే. ఆ బాలుని దేహం, మహాత్మా మైత్రేయుని అవతరణకు అనువైనదనీ, సరైనదనీ భావించా రాయన.

ఆ బాలుడే జిడ్డు కృష్ణమూర్తి. ఆ తర్వాత ఆ బాలుని సంగతి కృష్ణాజీయే వివరంగా చెప్పారు :

"దివ్యజ్ఞాన సమాజంవారు నన్ను తీసుకుని, నాకు సమాజ కేంద్రాలయంలో ప్రముఖ స్థానమిచ్చి, దీక్ష ఇచ్చి, ప్రపంచ సంస్థ ఒకదానిని స్థాపించి, దానికి నన్ను సర్వాధికారిని చేసి, గురుపీఠం వేసి, జగద్గురువును చేసి కూర్చోబెట్టారు. నేను తిరిగి వస్తానన్న ఏసుప్రభువుననీ, ప్రచారం చేశారు. నన్ను స్తుతించారు, కీర్తించారు, ధనం కుమ్మరించారు, ఆస్తులు ఇచ్చారు. నన్ను ఎంతో గొప్ప చేశారు.

"ఎన్ని చేసినా, ఎన్ని చూపినా, ఎన్ని ఇచ్చినా, ఇంకా ఎంతో ఆశపెట్టినా ఏదీ నన్ను అంటలేదు, ఆకర్షించలేదు, నా మనసును మార్చలేదు. ఏదీ నన్ను బంధించలేదు, బాధించ లేదు. ఎందుకంటే, మొదటినుంచీ నా మనసు పూర్తిశూన్యంగా వుంటూ వచ్చింది. అంటే, నేనేం చేస్తున్నా, చూస్తున్నా, వింటున్నా, తింటున్నా, తిరుగుతున్నా, మాట్లాడుతూవున్నా, నా నసు మాత్రం పూర్తి ఖాళీగా, శూన్యంగా వుంది. అదే

నా జీవితంలో ముఖ్యమైన సంగతి. నాలో అదొక్కటే విశేషం. ఆవిధంగా నా మనసు పూర్తి శూన్యంగా వుండటంవల్ల నాకు ఎప్పుడూ, ఎటువంటి సమస్యలు ఎదురుకాలేదు.

"మనసు శూన్యంగా వున్నవారందరికీ, నాస్థితివంటి స్థితి వుంటుందా ?" అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

"నా మనసు శూన్యంగా వుందంటున్నానంటే, అది నా భ్రాంతి కాదు. ఆత్మవంచనా కాదు. అది, ఒకదాని ప్రభావం వల్ల ఏర్పడ్డ స్థితీ కాదు. అది ఒక వాంఛాఫలితమూ కాదు. ఆ స్థితి ఆలోచించేదీ కాదు, ఊహించిందీ కాదు. అది ఆత్మ ప్రేరితమూ కాదు. అదొక ఆలోచనా ఫలితమూ కాదు. అది అసలు మానవ నిర్మితమే కాదనుకుంటాను.

" ఆ శూన్యం, స్వార్థం లేకపోవడంవల్ల ఏర్పడిందా ? మహాత్మా మైత్రేయ తన అవతరణకొరకు ఆ మనసును అట్లా శూన్యంగా వుంచారా ?" అని అడిగారు ఒకరు, కృష్ణాజీని.

"ఆ, నా స్థితి నాకు ఎంతకీ తెలియునిదీ, అర్థంకానిదీ, అందనిదీ, కనుక్కోబడనిదిగా తోచింది. అసలు ఆ స్థితి ఏమిటో, అది దేన్ని వాంఛిస్తోందో తెలియకుండా వుంది.

"ఆ స్థితి వివరించ శక్యంకాని సంగతా ? దాన్ని బోధింప వీలుకాదా ? అయితే, అది నాకు ఎలా లభ్యమైంది ? అసలు ఆ స్థితి ఏమిటి ? అది నాలోకి ఎట్లా వచ్చింది ? 'ఎక్కడనుంచి వచ్చింది ? దాని గురించి గొడవపడి, దాని లోతుల్లోకి వెళ్ళి, తీవ్రంగా అన్వేషించవలసిన విషయమూ, అది ?" అని నాలో నేను చాలా తీవ్రంగా అనుకున్నాను. ఎందుకంటే, నేను చెప్పే సంగతులు ఏవో అవి, ఎంతమాత్రం నేను ఆలోచించి చెప్పిన సంగతులు కావు.

"ఏమీ కాని నాకు, అదికారం, ఆస్తులు, అన్నీ వచ్చినా నేను ఎటువంటి ప్రలోభానికీ లోనుకాక, ఆకర్షణలోపడి చెడిపోకుండా ఇన్నేళ్ళూ ఏది నన్ను కాపాడింది?" అనుకుంటే, అప్పుడు నేను ఏమనుకుంటానంటే, "బహుశా అది ఒక మెరుపు వంటి కాంతి, లేక, విద్యుచ్ఛక్తి, లేక ప్రేమశక్తి," అని అనుకుంటాను. అంతే!

"ఆ శక్తే, ఈ, నా శూన్యమైన మనసును దేనివల్లా చెడిపోకుండా కాపాడుకుంటో వస్తోందనిపిస్తోంది.

"విద్యుచ్ఛక్తి ప్రవహించడానికి ఒక పరికరం కావాలి కదా? ఆ ప్రేమశక్తి ప్రవహించడానికి కృష్ణమూర్తి శూన్యమైన మనసును తీసుకుంది," అనుకుంటాం, అన్నారు ఒకరు.

"ఆ శక్తి నాలో ప్రవేశించడానికి, ఈ, నా దేహం తక్కిన దేహాలనుంచి ప్రత్యేకమై వుండాలి. కాని, ఈ నా దేహం వుంది చూశారూ, ఇది వృత్త దుర్బలమైంది. ఇటువంటి విషయంలో ఎవరైనా, ఎంతటి సాధకులైనా చెడిపోకుండా వుండటం బహుకష్టమనుకుంటాను. కాని, నా మనసును మాత్రం ఆనాటి నుంచి దేనివల్లా ఏమాత్రం చెడిపోకుండా ఆ ప్రేమశక్తే కాపాడుకుంటో వస్తోంది. దుర్బలమైన ఈ దేహం ఇన్నేళ్ళూ ఎట్లా కొనసాగిందో అది ఆశ్చర్యకరమైన సంగతి.

"ఆ ప్రేమశక్తి, ఈ దుర్బల దేహాన్ని కోరిందా? తాను కాపాడతానని మాట ఇచ్చి, తీసుకుందా? లేక, అది నన్ను అవతారమూర్తి అన్నదా? అయితే, నా లోపల ఏం జరిగింది? ఎలా జరిగింది? అసలు ఎందుకు జరిగింది?

"ఆ శక్తి ఈ దేహాన్ని ఎందుకు గమనిస్తూ, రక్షిస్తూ వచ్చింది? ఆ శక్తి ఓ సామాన్య బ్రాహ్మణ బాలుణ్ణి కోరిందా?

"ఎవరైనా పెద్దలు, మేధావులు ఈ దేహాన్ని నిలేసి, "అసలు నువ్వు ఏమిటి ? నువ్వు ఎవరు ?" అని అడిగితే, అది ఏమీ చెప్పలేదు. ఆ సంగతి మాత్రం స్పష్టం.

"కాని, కొందరు "అతను అలా పుట్టాడు," అన్నారు.

"దుర్బలమైన ఈ దేహం అన్వేషణ ఆరంభించినప్పటి నుంచీ, దీనిలోంచి "మాటలు" పుట్టుకొచ్చాయి. దీనికి మాట్లాడటం ఒక లక్షణం అయిపోయిందనుకుంటాను. ఆ లక్షణమే కొనసాగుతోంది. అంటే, ఈదేహం మాట్లాడుతూనే వుంది.

"అటువంటి దుర్బలమైన దేహంతో ఏం చేయడానికీ, ఏమీతోచక, నేనేమీ చేయకుండా వూరుకున్నాను. అంటే, కృష్ణమూర్తి ఏ సాధనా విధానాన్ని అనుసరించలేదు అని అర్థం.

"ఈ దేహం అట్లా మాట్లాడుతూ పెరిగింది. మాట్లాడుతూనే వుంది. అది మాట్లాడటంకాక, ఇంకేం చేయడానికీ దానికి ఇంక ఏమీలేదు. అది అటువంటి స్థితిలో వుంది. అది కేవలం మాట్లాడటానికే వుండి, చెడిపోకుండా కాపాడబడుతోంది.

అలా మాట్లాడుతున్నప్పుడల్లా కృష్ణమూర్తిలోంచి పరమ సత్యం బహిర్గతమయ్యేది.

ఈ దేహం విషయంలో, దీన్ని కాపాడే ఆ శక్తి ఒక్కటే కాదు. నాది కాని, నాకు తెలియని ఇంకొక రకమైన రక్షణ కూడా ఈ దేహానికి వుంది. అది, లోకాతీతమైన శక్తి. అది కూడా, ఈ దేహాన్ని మొదటినుంచి కాపాడుతున్నది. నాకు అదొక ప్రత్యేకమైన రక్షణ. ఆ రక్షణ పూర్తి కేంద్రీకృతమై, ఏకమై, ఐక్యమై, ఘనీభవించి, ఆకారమేర్పరచుకుని,పనిచేసింది, ఈ దుర్బల దేహంలో. అ రక్షణవల్లనే నేను చెడిపోకుండా వుండగలుగుతున్నాననే అనుభూతి కలిగింది. నేను ఎప్పుడూ

ఆ రక్షణను కూడా "ఫీల్" అవుతూనే వున్నాను. మొదటినుంచీ ఓ శక్తి దాన్నంతా గమనిస్తోనే వుంది. ఆ రెండో రక్షణ వుంది చూశారూ, అది అన్ని విధాలా చాలా శక్తివంతమైనది.

"1927 నుంచీ నాకు నిజమైన సన్యాసిని కావాలని గట్టి కోర్కెవుంది. ఆ సందర్భంలో నేను అన్వేషిస్తూ సుదూరాలు వెళ్ళాను. అంటే, ఎంతవరకు వెళ్ళి అన్వేషించానంటే, దాదాపు మృత్యు గృహం దగ్గరకు వెళ్ళాను. మృత్యువంటే, దివ్య తేజస్సు. ఆ దివ్యకాంతిని దర్శించాను.

"కాని, అంతలో అకస్మాత్తుగా వెనక్కి తిరిగాను. బహుశా ఈ నా దేహానికి వున్న గుణం మాట్లాడటం కనుక, నేను ఉపన్యాసాలు అవీ ఇవ్వడానికి వెనక్కి వచ్చి వుంటాను. అందుచేత అప్పటినుంచీ నేను మాట్లాడుతూనే వున్నాను. నేను ఎప్పుడైనా మాట్లాడటం మానేస్తే – అదే నాకు మృత్యువు. ఆ మృత్యువు నాకు ఆసన్నమైతే, ఈ దేహాన్నీ, నన్నూ కాపాడే శక్తి తొలగిపోతుంది. బహుశా ఆ సమయం – 1986 అనుకుంటున్నాను.

(ఈ సంగతి 1978 లో. కృష్ణాజీ, మేరీలూటీన్స్‌కుచెప్పారు.)

"అప్పటివరకు ఈ దేహం మాట్లాడుతూనే వుంటుంది," అన్నారు కృష్ణాజీ.

• • •

తొంభై సంవత్సరాలు పైబడ్డా కృష్ణమూర్తి ఉత్సాహంతో యూరప్, అమెరికా, ఇండియాలలో పర్యటించి బోధించారు. చివరివరకు ఆయన దినచర్య క్రమం తప్పకుండా సాగింది. కంటి చూపు చక్కగా వుంది. ఆలోచనా శక్తి తగ్గలేదు. శారీరక కదలికలలోనూ మార్పులేదు. ఆయన ఎప్పటి మాదిరిగా పనిచేసేవారు.

1985 ఏప్రిల్ పదకొండవ తేదీన అంతర్జాతీయ సమితి సలభయ్యో వార్షికోత్సవంలో కృష్ణమూర్తి శాంతి గురించి మాట్లాడారు. ఆ సందర్భంలో ఆయనకు ఆ సమితివారు ఒక వెండి మెడల్ బహూకరించారు. ప్రేక్షకులలో ఆసక్తి లేకపోవడం గమనించి, "NO MORE U. N. O" అన్నారు.

ఆ మర్నాడు వాషింగ్టన్‌లో మాట్లాడారు, కృష్ణమూర్తి. అక్కడ రేడియో, పత్రికల వాళ్ళకు ఇంటర్వ్యూలు ఇచ్చారు. పరమార్థంకోసం గురువుల్ని అర్థించడమే జీవితంలో అనర్థం. నిత్యజీవితానికి అది వినాశనకరమైన సంగతి," అన్నారు కృష్ణాజీ.

"గురువును ఏరుకుని, వారిని అర్థించి, మనకు మనమే నిస్సహాయులమై పోతున్నాం. మన చేతుల్ని ఆయనకు అప్పగిస్తున్నాం. అది పొరపాటు. తమను తాము తెలుసుకోవడానికీ, అన్నింటినీ అవగాహన చేసుకోవడానికీ అన్ని అధికారాల్ని నిరాకరించి, దూరంగా వుంచాలి. ఉపన్యాసకుడు కేవలం అద్దం మాదిరిగా వుంటాడు," అన్నారు, కృష్ణాజీ.

పద్దెనిమిదవ తేదీన "వాయిస్ ఆఫ్ అమెరికా" వారికి ఇంటర్వ్యూ ఇచ్చారు. "మత పునరుద్ధరణకై అమెరికా

పిల్లలు స్కూళ్ళలో ప్రార్థనలు చేస్తారు. మనం ఈ క్షణంలా మారకపోతే, ఎప్పటికీ మనం అనాగరికులం మాదిరిగానే వుండి పోతాం. భవిష్యత్తు, ఇప్పుడే, ఇక్కడే వుంది," అన్నారు కృష్ణమూర్తి.

వాషింగ్టన్‌లో భోజనం కృష్ణమూర్తికి అనారోగ్యం చేసింది. ఒహై వెళ్ళాక కడుపునొప్పితో బాధపడ్డారు.

"మే'' నెలలో కృష్ణమూర్తి బ్రాక్‌వుడ్‌లో వున్నారు. అక్కడ "విటమిన్-బి" ఇంజక్షన్లు తీసుకున్నారు. కొంత నయమైంది.

మేరీజింబాలిస్ట్‌తో ''ఇకనుంచి నన్ను శ్రద్ధగా చూసు కుంటూ వుండు. నా జాగ్రత్త తీసుకో! అర్థమైందా" అన్నారు కృష్ణాజీ.

ఒకరోజు సాయంత్రం మేరీతో, "నాకు సమయమైన దేమో, అనుకుంటున్నాను," అన్నారు, సానెన్‌లో వుండగా. అక్కడ చివరి ఉపన్యాసంలో "ఇక్కడి పర్వతాలు, సుందర మైన సూర్యోదయాలు, శోభాయమానమైన సూర్యాస్తమయాలు; పొడవైన నీడలు, లోతైన లోయలు, స్వచ్ఛమైన నీలాకాశం, మంచూ, చెట్లు, పక్షులు, అందమైన రోజులు అన్నీ నాకు "గుడ్-బై చెపుతున్నట్లు వున్నాయి," అన్నారు, కృష్ణమూర్తి, ఆమెతో.

దూరపు ప్రయాణాలు కృష్ణమూర్తికి అలసట కలిగించినా, ఒకేచోట ఎంతోకాలం వుండేవారుకాదు. అలా వుంటే, ''ప్రజలు తమ దృష్టినంతా తనమీదే కేంద్రీకరిస్తారు'' అనేవారు. ఆ విధమైన కేంద్రీకృత దృష్టి, ఆయనకు ఇష్టంలేదు.

ఆగస్ట్‌నాటికి కృష్ణమూర్తి చాలా బలహీనమయ్యారు. నడక తగ్గించారు. ఆ సందర్భంలో మిత్రులతో, "మృత్యువు నాకు దగ్గరగా జరుగుతోంది" అన్నారు. ఆ విషయాన్నే మేరీతో, "ఒకవేళ నేను, నీవు దగ్గరలేనప్పుడు అది జరిగితే, నేను నీకు ఫోన్ చేస్తాను. కాని, నేను అకస్మాత్తుగా చనిపోను. అయినా, నేను చనిపోతే నువ్వు ఏడ్వకు," అన్నారు.

అక్టోబరు ఇరువైనాల్గవ తేదీన కృష్ణమూర్తి ఢిల్లీ వచ్చారు. ఆయన పుపుల్ జయకర్‌తో వున్నారు. ఆయన తిండి—నిద్ర బాగా తగ్గిపోయాయి. రోజూ షికారుగా "లోడే పార్క్" వరకు వెళ్ళేవారు. ఒకరోజున దారిలో ఒకతను, "మీరేనా కృష్ణమూర్తి?" అని అడిగితే, "I am No - body" అన్నారు.

కృష్ణమూర్తిలో పాటు బ్రాక్‌వుడ్‌నుంచి డాక్టరు పరుచూరి ఇండియా వచ్చి, చివరివరకు కృష్ణమూర్తిని వదలలేదు.

కృష్ణమూర్తి ఢిల్లీనుంచి రాజఘాట్ వెళ్ళారు. అక్కడ కొంచెం కోలుకున్నారు. చర్చలూ జరిపారు. కాని, మేడ మెట్లు ఎక్కలేకపోయేవారు. ఎవరైనా సహాయం చేస్తామంటే, ఒప్పుకునేవారు కాదు. "నేను మెట్లమీద పడిపోతే అది నా సంగతి," అన్నారు కృష్ణమూర్తి. అయినా ఆయన కొన్ని ఉపన్యాసాలిచ్చారు. బౌద్ధ పండితులతో చర్చలు జరిపారు.

రుక్మిణీదేవి అరండేల్ బంధువైన డాక్టర్ పి. కృష్ణన్ (బెనారస్, హిందూయూనివర్శిటీలో ప్రొఫెసర్ ఆఫ్ ఫిజిక్స్) కు రాజఘాట్ స్కూలు అప్పగిస్తూ, "ఈ స్కూలును మీ చేతుల్లోకి తీసుకుని, మీ ఇష్టంవచ్చినట్లు నడపండి. నేను చెపుతున్నాను, వినండి. ఇది మీ స్వంత ఇల్లు చేసుకుని, చూసుకోండి. ఇంక

మీరు ఇక్కడ స్థిరపడిపోండి, జీవితాంతం. నేను ఏం చెపుతున్నానో మీకు అర్థమైందా? ఈ స్కూలు అభివృద్ధిచేయడం, మీ చేతుల్లో వుంచుతున్నాను. దీన్ని – వెండిపళ్ళెంలో ఆభరణం పెట్టి ఇస్తున్నట్లు ఇస్తున్నాను. దీన్ని మిమ్మల్ని తీసుకోవాలని కోరుతున్నాను. తీసుకుంటారు కదూ? దీన్ని మీ ఇష్టం వచ్చినట్లు నడపండి. అంతా మీ ఇష్టానికే వదులుతున్నాను,'' అన్నారు.

దానికి డాక్టరు కృష్ణ "నేను సామాన్యుణ్ణి. నన్ను పూర్తిగా నమ్మి, ఈ స్కూలు నా చేతుల్లో పెడుతున్నారు. మీరు కోరిన రీతిని దీన్ని నేను నడపగలనా? అని యోచిస్తున్నాను," అన్నారు.

దానికి కృష్ణమూర్తి, "నేనూ సామాన్యుణ్ణే. చనిపోతున్న తండ్రి, కొడుకును పిలిచి, ఏదైనా ఇస్తే, అతడు తీసుకోవడానికి నిరాకరిస్తాడా? తీసుకుంటాడు. అలాగే, మీరూ ఈ స్కూలు తీసుకోండి, ఆలోచించకుండా.'' అన్నారు.

ఆ మాటతో కృష్ణగారు కదిలిపోయారు. "నేను ఇటువంటి విషయాల్లో ఏమాత్రం అనుభవం లేనివాడిని. చిన్నవాడిని. మీ అంతటివారు నన్ను కోరి, దీన్ని నాకు ఇస్తున్నారు. ''దీన్ని ఎట్లా నిర్వహించగలనా? అని సందేహిస్తున్నాను. "పోనీ, ఈ విషయంలో రాధాబర్నియర్‌గారి సలహా తీసుకోక పోయినారా?'' అని అంటే, "నేను సలహా అర్థించను. అది నాకు సమ్మతమూకాదు. నేను జీవితంలో ఎప్పుడూ, ఏదీ ఆ విధంగా చేయలేదు. ఇన్నాళ్ళూ నా అంతరాత్మ ఏంచెపితే, అది చేశాను. అంతే." అన్నారు కృష్ణాజీ.

''నేను కొంచెం తీరికగా ఆలోచించుకుని చెపుతాను," అన్నారు డాక్టరు కృష్ణ.

"మీరు ఎవరినైనా ప్రేమిస్తే, అది పెళ్ళివరకు వస్తే, ఆమెతో, ''నన్ను కొంచెం ఆలోచించుకోనియ్యి," అంటారా? అనరు. ఈ స్కూలు బాధ్యత ఇప్పుడే తీసుకోండి." నా హృదయ పూర్వకంగా అంగీకరించి తీసుకుంటున్నాను, అనండి. నన్ను అర్థంచేసుకుని, అన్నీ చేయండి. కాని, ముందు,"అంగీకరించాను" అని చెప్పండి," అన్నారు కృష్ణాజీ.

డాక్టరు కృష్ణ ఇరుకునపడి, ''అలా కాదు. నన్నూ కాస్త ఆలోచించుకోనివ్వండి. నాకు కొంత వ్యవది ఇవ్వండి. నేను ఎంతవరకు ఈ స్కూలు వ్యవహారాల్ని సమర్థించగలనో ఆలోచించుకోనివ్వండి. ఈ విధంగా నేను ఎప్పుడూ, దేంట్లోనూ ఆలోచించకుండా ప్రవేశించలేదు," అన్నారు.

''మీరు కొంచెం ఆగండి. ఈ విషయంలో మీ భార్య అంగీకారం కూడా తీసుకుంటాను," అని గబగబా ఆమె దగ్గరకు వెళ్ళి, ఆమె చేతుల్ని ప్రేమగా తన చేతుల్లోకి తీసుకుని, "చూడమ్మా! ఇది, నాకోసం చేస్తారా? ఈ స్కూలు మీ స్వంత ఇల్లుగా తీసుకుని చూస్తారా?'' అని అడిగారు కృష్ణాజీ.

దానికామె, కన్నీళ్ళతో ''మీకోసం ఏమైనా చేస్తాను. మేమిద్దరం వచ్చి, ఇక్కడ వుంటాం." అన్నది.

కృష్ణమూర్తి చాలా సంతోషపడి, "ఇంక మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. రేపు, అన్నీ వివరంగా మాట్లాడుకుందాం,'' అన్నారు.

'' నేను, ఈ వ్యవహారానికి తగినవాడినేనా? అని నా అనుమానం,'' అని డాక్టరు కృష్ణ మళ్ళా అంటే—

"నేను మిమ్మల్ని విశ్వసించాను. మీరు ఇక్కడకు వచ్చి మీ ఇష్టం వచ్చినట్లు పనిచేయండి. మనమందరం కలసి, పని చేద్దాం," అన్నారు కృష్ణాజీ.

ఆ మర్నాడు ఇండియా ఫౌండేషన్ సభ్యులందరూ డాక్టరు కృష్ణ నియామకానికి అంగీకరించారు. వారికి ఇద్దరు కూతుళ్ళు. అక్కడ వారికి ఒక ఇల్లు ఏర్పాటు చేశారు. ఆ తర్వాత డాక్టరు కృష్ణ వైస్ చాన్స్లర్ అనుమతితో ఉద్యోగానికి రాజీనామాచేసి, కృష్ణాజీ అభీష్టానుసారం రాజఘాట్ స్కూల్‌కు వచ్చారు.



కృష్ణాజీ చేతులు బాగా వణకడంచేత మేరీ జింబాలిస్ట్‌కి ఉత్తరాలు రాయలేక ప్రతిరోజూ టేప్ చేయించి పంపే ఏర్పాటు చేశారు, ఆమెకు ఓదార్పుగా, ఆందోళన చెందకండా వుండేందుకు. కృష్ణాజీ ఇండియావస్తే, ఆమెను తనతో ఇండియా రావద్దన్నారు. ఆమె ప్రతి సంవత్సరం కృష్ణాజీతో ఇండియా వచ్చేది. వచ్చి జబ్బు పడేది.

గతంలో కృష్ణాజీ ఒకసారి ఆమెతో, నువ్వు నన్ను ఎప్పుడూ వదలిపెట్టి వుండవుకదూ?" అన్న కృష్ణాజీ ఇప్పుడు ఇట్లా అన్నారు.

ఇండియా వచ్చినప్పటినుంచీ డాక్టరు పరుచూరి ప్రతి రోజూ కృష్ణాజీని పరీక్షచేసేవారు. భోజనం పక్కమీదనే చేసే వారు. వచ్చిన మిత్రులను మంచందగ్గరే కలుసుకుని మాట్లాడే వారు.

ఇండియా మిత్రులంతా రాజఘాట్ చేరుకున్నారు. కృష్ణాజీ వారితో చర్చలు జరిపారు.

ప్రముఖ సినీ నిర్మాత జి. అరవిందన్‌కి, ఇండియా గవర్నమెంట్ కొంత డబ్బు ఇచ్చి, "కృష్ణాజీ జీవితం" సినిమా తీయమన్నారు. ఆయన కృష్ణాజీమీద సినిమా 1984లో ప్రారంభించి, 1985 చివరలో కృష్ణాజీ రాజఘాట్ వచ్చినప్పుడు పూర్తి చేశారు. దాని పేరు " The Seer who walks alone " అని.

నవంబరు తొమ్మిదవ తేదీన కృష్ణాజీ, మేరీజింబాలిస్ట్‌కి ఉత్తరం టేప్ చేయిస్తో, " నాకు B P చాలా " Low " గా వుంది. నడక కష్టంగా వుంది. మొన్న మెట్లు ఎక్కలేక కూలబడ్డాను," అన్నారు.

క్రమంగా కృష్ణాజీ చాలా నీరసపడ్డారు. పరుచూరి వెంట వున్నారు.

ఫెడరిక్ ఆర్థిక సహాయంతో ఇండియాలో కొన్నిచోట్ల కృష్ణమూర్తి సెంటర్స్ ఏర్పాటు చేయబడ్డాయి.

నవంబరు చివరలో కృష్ణమూర్తి ఋషీవ్యాలీ వచ్చారు. ఆయన వెంట ఫ్రెడరిక్ వున్నారు. కృష్ణాజీ బాగా నీరసంగా వున్నారు. నడుస్తూ తూలబోయేవారు. బరువూ తగ్గారు. ఎన్ని రగ్గులు కప్పినా చలి తట్టుకోలేకపోయారు. నీరసంగా వున్న కారణంచేత బొంబాయిలో ఉపన్యాసాల్ని రద్దుచేశారు. కాని, "నా గుండె, తల, మెదడు, లివర్ బావున్నాయి. మెదడు చురుకుగా పనిచేస్తోంది," అన్నారు కృష్ణాజీ, మిత్రులతో.

ప్రపంచంలోవున్న కృష్ణమూర్తి స్కూళ్ళ టీచర్ల సమావేశం డిశంబరు మధ్యలో ఏర్పాటు చేశారు. ఆ సమావేశానికి అందరూ హాజరయ్యారు. అనేక విషయాలు చర్చించారు.

అంతలో కృష్ణమూర్తికి జ్వరం వచ్చింది. డాక్టర్ పరుచూరి ఎంత జాగ్రత్తగా పరిశీలిస్తున్నా, ఆ జ్వరం తగ్గలేదు. అయినా

కృష్ణాజీ సాయంత్రాలు షికారు వెళ్ళేవారు. కాని, నడక కొంత దూరం తగ్గించారు.

ఫ్రెడరిక్ రాజఘాట్ స్కూలు దగ్గర "కృష్ణమూర్తి స్టడీ-సెంటర్" నిర్మాణానికి కొంత డబ్బు ఇచ్చారు. అటువంటివే, ఋషీవ్యాలీలోనూ, ఉత్తరకాశీలోనూ ఏర్పాటు చేయించారు.

డిశంబరు ఇరవైమూడవ తేదీన ఋషీవ్యాలీనుంచి కృష్ణమూర్తి మద్రాసు వచ్చారు. ఋషీవ్యాలీలో ఆయనకు కన్నీళ్ళతో వీడ్కోలు ఇచ్చారు. ఆ సంవత్సరం మద్రాసులో నాలుగు ఉపన్యాసాలు ఏర్పాటు చేయబడ్డాయి కాని, ఆయన మద్రాసు చేరుకోగానే, జబ్బుపడ్డారు. ఎటువంటి శారీరక పరీక్షలకు ఆయన అంగీకరించలేదు. అందుచేత ఆయన కార్యక్రమాల్ని మార్పు చేశారు. ఉపన్యాసాల్ని మూడింటికి కుదించారు. ప్రతి ఉపన్యాసానికి కనీసం మధ్య రెండు రోజులు వ్యవధి వుండాలన్నారు, డాక్టర్లు. ఆయనకు విశ్రాంతి అవసరమనీ చెప్పారు. దానికి కృష్ణాజీ "ప్రోగ్రామ్స్ ప్రకటించి, తర్వాత వాటిని మార్పు చేసి, ప్రజల్ని ఇబ్బంది పెట్టడం తనకు సమ్మతం కాదన్నారు."

మొదటి ఉపన్యాసం డిశంబరు ఇరవైఎనిమిది సాయంత్రం 5–30 నిమిషాలకు ప్రారంభం కావాలి. కాని, ఆ సాయంత్రం నాలుగు గంటలకు, "నీరసంగా వుంది" అన్నారు కృష్ణాజీ. డాక్టరు పరుచూరి చూస్తే, వంద డిగ్రీల జ్వరం వుంది. అయినా ఆయన అలాగే ఆరోజున ఉపన్యాసం ఇచ్చారు. ఆ సమయంలో అడయార్ దివ్యజ్ఞాన సమాజ సభ్యులందరూ కృష్ణాజీని చూశారు. కొందరు ప్రేమగా పలకరించారు. స్కాట్, నందినితో కలసి కృష్ణమూర్తి కారులో అడయార్ బీచ్‌కి వెళ్ళారు. తనను లెడ్‌బీటర్ మొదట ఎక్కడ చూశారో, ఆచోటు వాళ్ళకు చూపించారు. ఆ తర్వాత రాధాబర్నియర్ ఇంటికి వెళ్ళారు.

తన ఒహై ప్రయాణం జనవరి పదిహేడునకాక, పన్నెండుకే నిరయించారు, కృష్ణాజీ. ట్రస్టీల మీటింగు రద్దుచేశారు.

డిశంబరు ముప్ఫై ఒకటి రాత్రి కృష్ణమూర్తి మంచం మీద నుంచి లేచి తూలి గోడమీద పడ్డారు. "నేను కింద పడితే, నా గడియారానికి గాయమై వుండేది," అన్నారు.

అంత అనారోగ్యంలోనూ కృష్ణమూర్తి నిటారుగా కూర్చునేవారు. ఆయన కళ్ళు జ్యోతుల్లాగ వెలిగేవి. ఆయన అక్కడవున్న అందర్నీ పలకరించి, ప్రశ్నించి సంగతులు తెలుసుకునేవారు.

తన ప్రయాణం జనవరి పన్నెండున కాక, పదవ తేదీకి మార్చారు, కృషమూర్తి. ఆ విషయం స్కాట్‌తో చెపితే, "నేను ఒహైకి మూడు ఫస్ట్‌క్లాస్ టిక్కెట్లు కొన్నాను," అన్నాడు.

కృష్ణమూర్తి తన ఇండియా దుస్తులన్నీ అందరికీ పంచేశారు.

రెండవ ఉపన్యాసం జనవరి ఒకటవ తేదీన జరిగింది. ఆ రోజు ఉపన్యాసంలో ఆయన మృత్యువు గురించి మాట్లాడారు.

"మృత్యువంటే ఏమిటి ? అంటే, అన్నింటినుంచీ స్వేచ్ఛ పడటం. అదే నిజమైన మార్పు.

"చావడమంటే, అన్నీ వదలిపోవడం. జీవితకాలంలో పోగుజేసుకున్నవాటి నన్నింటినీ వదలడం." అదే మృత్యువు.

"అటువంటి మృత్యువు, ఏళ్ళతరబడి పోగుజేసి పెట్టుకున్న, నిల్వవుంచుకున్న, నిలుపుకున్న, విలువగా చూసుకుంటున్న అన్నింటినీ పదునైన కత్తెరతో నాజూకుగా కత్తిరిస్తుంది. మన నమ్మకాల్ని, కోర్కెల్ని, సుఖాల్ని, దైవాల్ని,

సాంప్రదాయాల్ని-అన్నింటినీ కత్తిరిస్తుంది. అందుకే మృత్యువు, జీవితమంత ముఖ్యమైనది.

"చావడమంటే ఏమిటో ఎవరికి వారు స్వానుభవంతో తెలుసుకోవాలి. అంటే, తమను తాము నిజంగా, గట్టిగా ప్రశ్నించుకోవాలి. ఆ ప్రశ్న, ఎప్పుడూ వుంది. చావడమంటే, పూర్తిగా స్వేచ్ఛగా వుండటం. అన్నింటికీ బంధరహితంగా వుండటం-ఆ సంపూర స్వేచ్ఛలో-గతం, భవిష్యత్తు, దైవం ఏమీ, ఏదీ లేదు. దాని గొప్పతనాన్ని, అందాన్ని చూడలేరు, మీరు. అసలు మీరు దాని శక్తి గమనించలేకండా వున్నారు, జీవితంలో.

" పోగుజేసుకున్నవన్నీ వదలడమే, మృత్యువు. మీరు ఎప్పుడైనా ఆ విధంగా చేశారా ? అన్నీ వదలడానికి మీరు ప్రయత్నించారా ? అన్నీ వదిలేశారా ? దానికోసం పరిశోధించారా ? దానికోసం ఏదో ఒక రోజు కాదు, ప్రతిరోజూ, ప్రతిక్షణం వున్నవాటి అన్నింటికీ చావాలి. తిరిగి పుట్టాలి.

ఆ విధంగా మీరు చావరు. తిరిగి పుట్టరు. దానికి మీ మనసులు, మెదడు తర్ఫీదు పొందలేదు. మీ మెదడులు హద్దుల్లో, షరతుల్లో, పరిమితుల్లో, నియమ, నిబంధనల్లో వున్నాయి.

మీ చదువుల, సాంప్రదాయాల, గ్రంథాల, గురువులతో మీరు బందీలై, భారవంతంగా వున్నారు.

స్వేచ్ఛకు కావలసింది, ప్రేమ. జీవితంలో ప్రేమ, మృత్యువు కలిసే నడుస్తాయి, జీవితాంతం వరకు.

అన్నింటినుంచీ స్వేచ్ఛగా వుండండి. దేనికీ అతుక్కో వద్దు.

స్వేచ్ఛ వున్నప్పుడు, వుండేది ప్రేమ ఒక్కటే. ఆ ప్రేమే, శక్తి—బలం—సంపూర్ణ స్వేచ్ఛ,'' అన్నారు కృష్ణాజీ.

• • •

మద్రాసులో మొదటి రెండు ఉపన్యాసాలూ చక్కగా జరిగాయి. అంతలో కృష్ణమూర్తికి మళ్లా జ్వరం వచ్చింది. ఆయన బరువుకూడా బాగాతగ్గారు. అయినా ఆయన మద్రాసు కార్యక్రమాన్ని ఎట్లాగైనా పూర్తిచేసి, మధ్యలో ఎక్కడా ఆగకుండా సరాసరి ఓహై వెళ్ళాలనుకున్నారు. కనీసం ఒక్క ఉపన్యాసమైనా బొంబాయిలో ఇవ్వవలసినదిగా అక్కడి మిత్రులు కోరారు. కృష్ణమూర్తి అంగీకరించలేదు. ఆయనకు జ్వరమూ తగ్గలేదు.

అన్ని ప్రాంతాలనుంచీ కృష్ణమూర్తి మిత్రులు వచ్చి, చూసి వెడుతున్నారు, ఆయన్ని. కృష్ణమూర్తి చాలావరకు విశ్రాంతిగా వున్నారు.

1986 జనవరి నాల్గవతేదీ సాయంత్రం గం. 5-30 ని.లకు వసంత్ విహార్‌లో కృష్ణమూర్తి మూడవ ఉపన్యాసం ఏర్పాటు చేయబడింది. ఆ రోజు సభకు దాదాపు ఐదువేలమంది హాజరయ్యారు. ఆయన ఉపన్యాసం ప్రారంభిస్తూ, "ఇంక ఇదే చివరి ఉపన్యాసం అనుకుంటాను," అంటూ ఆరోజు జీవితం — దాని మూలం; — మతం — ధ్యానం — సృష్టి — కంప్యూటర్ టెక్నాలజీ - జెనిటిక్ ఇంజనీరింగ్ - మనసు - మెదడు మొదలైన ఎన్నో విషయాల ప్రస్తావనతో ఉపన్యాసం ముగించి, "నమస్తే'' అన్నారు, కృషమూర్తి. అప్పుడు ఆరున్నర అయింది.

ఆ సమావేశానికి హాజరైన శ్రోతలు, ‘‘అదే-మద్రాసులో చివరి ఉపన్యాసం” అనుకున్నారు అంతే: ఆరోజు ఉపన్యాసం అయిపోయిందనుకుని అందరూ లేవబోతూవుంటే, ఎప్పుడూ, ఏదీ అనని ఆయన, “ఆగండి. కూర్చోండి. ఈ రోజు కాస్సేపు కూర్చుని నాతో కలసి ధ్యానం చేయండి.'' అని, “మనమంతా మౌనంగా కూర్చుందాం,” అన్నారు. అందరూ కొన్ని నిమిషాలు మౌనంగా కూర్చున్నారు. ఆ తర్వాత ఆయన మాటలకు కొందరు ఆశ్చర్యపోయారు. ఆయన వేదిక దిగి వెడుతూవుంటే, ఒక పాప తెల్లచంపక పువ్వు ఇస్తే, దాన్ని తీసుకుని, పాపని చూసి చిరునవ్వారు.

కృష్ణాజీ చివరి ఉపన్యాసంలో ఒక ముఖ్యాంశంవుంది. అది - ‘‘సృష్టి, చిత్రమైనది - పవిత్రమైనది - పావనమైనది- పుణ్యప్రదమైనది.

“జీవితాన్ని చిక్కుచేసుకున్నా, తారుమారు చేసుకున్నా వెంటనే దాన్ని మార్చుకో. మార్చుకోవడం రేపుకాదు-అప్పుడే, ఆ క్షణంలోనే మార్చుకో.

నువ్వు ఏ విషయంలోనైనా అనిశ్చయంగా వుంటే, వెంటనే ఓ నిశ్చయానికిరా.

నీ ఆలోచన సూటిగా లేకపోతే, సూటిగా చేసుకో, ఆలోచనను తర్కబద్ధంగా వుండనియ్యి.

అవన్నీ అట్లా సక్రమంగా చేయకపోతే, ‘‘అందమైన ఈ సృషి లోకి నువ్వు ప్రవేశించలేవు,” అని హెచ్చరించాడు.

• • •

జి. అరవిందన్ ‘‘ The Seer who walks alone ’’ అని కృష్ణమూర్తిమీద ఒక డాక్యుమెంటరీ ఫిల్మ్ తీశాడు. దాన్ని కృష్ణమూర్తి జనవరి నాల్గవ తేదీన వసంతవిహార్‌లో చూశారు.

తాను మరాం చేసిన ఇళ్ళను యాత్రాస్థలాలుగా చేయ వద్దని కృష్ణాజీ మిత్రుల్ని కోరారు.

అనారోగ్య కారణంవల్ల కృష్ణమూర్తి జనవరి పదవతేదీన ఒహై వెళ్ళడానికే నిశ్చయించుకున్నారు.

ఆ రోజు సాయంత్రం రాధాబర్నియర్ ఆహ్వానంపై దివ్యజ్ఞాన సమాజ కేంద్రానికి వెళ్ళారు. ఆమె 1923 లో జన్మించారు. ఆమె తండ్రి, శ్రీరాం. ఆయన దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులుగా 1953 నుంచి 1973 వరకు ఉన్నారు. ఆమె అడయార్‌లోను, కాశీ విశ్వవిద్యాలయంలోనూ విద్యాభ్యాసం చేసింది. ఆమెకు అనేక భాషలు తెలుసు. చిన్నప్పటినుంచీ అడయార్ దివ్యజ్ఞాన సమాజ వాతావరణంలో పెరిగింది. కనుక ఆమెలో అణువణువునా దివ్యజ్ఞానం జీర్ణించుకు పోయింది. స్విడ్జర్లాండ్ పౌరుడైన "బర్నియర్" అనే అతన్ని వివాహ మాడింది. కాని, వివాహమైన బహు కొద్ది సంవత్సరాలకే భర్త మరణించడంతో, ఆమె తన శేషజీవితాన్ని దివ్యజ్ఞాన సమాజ సేవకు అంకితం చేసింది. 17-7-1980 న, ఆమె దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలైంది.

సమాజ సభ్యుల కోర్కెపై అడయార్ దివ్యజ్ఞాన సమాజ ఆవరణలో కృష్ణమూర్తి ఒక మొక్క నాటారు. అక్కడనుంచి అనీబిసెంట్ గదికి వెళ్ళి, కొంతసేపు కూర్చున్నారు. ఆ తర్వాత బీచ్‌కి వెళ్ళారు. చాలామంది మిత్రులు ఆయన్ని అనుసరిం చారు. సముద్రాన్ని చూస్తూ, కొంతసేపు ఒంటరిగా కూర్చున్నారు.

అక్కడనుంచి, రుక్మిణీదేవి అరండేల్‌కు జబ్బుగా వుందంటే, చూడ్డానికి వెళ్ళారు. ఆమె 29-2-1904 న, బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. పదిహేడవ ఏట, పాశ్చాత్యుడైన జార్జి అరండేల్‌ను వివాహమాడింది. 1935 లో, దివ్యజ్ఞాన

సమాజ వజ్రోత్సవంలో నాట్యంచేసి, ప్రతిభాసంతురాలని ప్రఖ్యాతిగాంచింది. ఆమెపై "పావ్‌లోవా" ప్రభావం చాలా వుంది. ఆ తర్వాత ఆమె దృష్టి భారతీయ నృత్యం వైపు మళ్ళింది. గౌరీ అమ్మాళ్ వద్ద భరతనాట్యం అభ్యసించింది. కళారాధనే జీవిత లక్ష్యంగా పెట్టుకుని, 1936 లో "కళాక్షేత్రం" స్థాపించి, అందు సంగీతం – నృత్యం – లలితకళల అభివృద్ధికి ఎంతో కృషిచేసింది. "కళాతపస్విని" అనే బిరుదు పొందింది. తర్వాత రాజ్యసభ సభ్యురాలైంది. జంతుహింస నిషేదానికి సంబంధించిన శాసనాన్ని పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి, దాన్ని ఆమోదింపజేసింది. జీవితంలో జీవకారుణ్యానికి ఎంతో ప్రాముఖ్యత ఇచ్చింది. "పద్మభూషణ" బిరుదుపొందింది.



కృష్ణమూర్తి మద్రాస్ వసంత్‌విహార్‌నుంచి ఒహై బయలుదేరి వెళ్ళేముందు మిత్రులతో సంతోషంగా గడిపారు. ఆ రాత్రి త్వరగాపడుకున్నారు. కాని, ఆ రోజున వారు ప్రయాణించే విమానం రెండుగంటలు ఆలస్యంగా బయలుదేరింది.

కృష్ణమూర్తి ప్రయాణిస్తున్న విమానం నాలుగు గంటల్లో సింగపూర్ వెళ్ళింది. అక్కడ మరో విమానం మారేలోగా, కృష్ణమూర్తికి కడుపులో గట్టిగా నొప్పి వచ్చింది. మందులు వేసుకుంటే తగ్గింది.

సింగపూర్‌నుంచి టోక్యో ఆరుగంటల్లో వెళ్ళారు. విమానం ఎయిర్ కండిషన్ కనుక, కృష్ణమూర్తి చలితో బాధపడ్డారు. స్కాట్ సహాయంతో కృష్ణమూర్తి టోక్యో విమానాశ్రయం విశ్రాంతిహాల్లో అటూ, ఇటూ నడిచారు. అంతలో వయసుమళ్లిన ఒక జపాను అతను వచ్చి, "మీరేనా కృష్ణమూర్తి?" అని ఆయన్ని అడిగారు. ఎందుకంటే, ఒక మద్రాసు మిత్రుడు కృష్ణమూర్తి

ప్రయాణ వివరాలు అతనికి తెలియజేశాడు. ఆ ప్రకారం అతను, కృష్ణమూర్తిని కలుసుకుని, తానుకూడా ఆయనతోపాటు కొంతదూరం ప్రయాణం చేసినట్లు వుంటుందని, అతను "లాస్ ఏంజలీస్" కి ఒక రాను, పోను విమానం టికెట్టు కొనుక్కొని, ఆయనతో కలసి ప్రయాణం చేశాడు.

వారి విమానం లాస్ ఏంజలీస్ చేరేప్పటికి ఉ॥ 9-30 ని॥ అయింది. ఆ ప్రకారం కృష్ణమూర్తి ఇరవైనాలుగు గంటలు విమాన ప్రయాణం చేశారు. కృష్ణమూర్తికోసం, లాస్ఏంజలీస్‌లో మేరీజింబాలిస్ట్ ఎదురుచూస్తోంది. ఆమె కారులో కృష్ణమూర్తి ఒక్కరే ఒహై వెళ్ళారు. దారిలో, "రెండు, మూడురోజులు నువ్వు నన్ను వదలి ఎక్కడకూ వెళ్ళకు," అన్నారు కృష్ణాజీ ఆమెతో.

పైన్ కాటేజీదగ్గర కృష్ణమూర్తి దర్శనార్థం ఎందరో మిత్రులు వేచివున్నారు. కృష్ణమూర్తి తన గదిలోకి వెళ్ళి, సంతోషంగా వున్నారు. ఆ సాయంత్రం ఆయనకు 101° జ్వరం వచ్చింది, విమాన ప్రయాణ అలసట వల్ల. ఆ రాత్రి మేరీ, కృష్ణమూర్తి గదిలో నేలమీద పడుకుని నిద్రపోయింది. స్కాట్ సోఫాలో పడుకున్నాడు. డాక్టరు పరుచూరి ఆర్యనిహార్‌లో పడుకున్నారు ఆ రాత్రంతా మేరీ, కృష్ణమూర్తిని శ్రద్ధగా చూసుకుంది ; తల్లి, బిడ్డను ప్రేమగా చూసుకున్నట్లు.

జనవరి పదమూడవ తేదీన డాక్టరు పరీక్షలో కృష్ణాజీ లివర్ దెబ్బతిన్నట్లూ, సుగర్ ఎక్కువగా వున్నట్లూ తెలిసింది. కృషమూర్తి ఏమీ ఆహారం తీసుకోలేకపోయారు.

జనవరి 19 న కృష్ణమూర్తి చాలా గట్టిగా పట్టుపట్టారు, ఏ పరిస్థితిలోనూ తాను కాటేజీ బైటికి వెళ్ళాలని. ఆరోజు కొంచెం దూరం నెమ్మదిగా నడిచారు. స్కాట్, మేరీ - కృష్ణమూర్తికి చెరోపక్కన వున్నారు. వారు కాస్సేపు చెట్లక్రింద కూర్చున్నారు.

20 న, డాక్టరు మళ్ళా పరీక్ష చేశారు, కృష్ణమూర్తిని.

21 న, కృష్ణాజీ కొంచెం దూరం నడిచారు.

22 న, రాత్రి ఒంటిగంట వేళ గట్టిగా నొప్పి ఆరంభమైంది. తెల్లవారిన తర్వాత, ఉదయం 8-45 కి, వాంతి అయింది. డాక్టరు, హాస్పిటల్‌లో చేరమన్నారు కృష్ణాజీని. అక్కడ తాను కృష్ణమూర్తిని శ్రద్ధగా చూసుకుంటానని చెప్పాడు.

కృష్ణమూర్తి చాలా ఏళ్ళ కిందట మేరీతో, "నన్నెప్పుడూ, ఏ పరిస్థితిలోనూ హాస్పిటల్‌లో చేర్చకు," అన్నారు. అని, "నేను ఇంట్లోనే చనిపోతాను. కాని, హాస్పిటల్‌లో వుండను," అన్నారు. ఎలాగైతే, చివరికి కృష్ణమూర్తిని ఒప్పించి హాస్పిటల్‌లో చేర్చారు. అక్కడ ఎక్స్-రే పరీక్షల్లో పేగుల్లో ఏదో అడ్డుపడినట్లు కనపడింది. అక్కడ ఎనిమిది రోజులు వున్నారు. మేరీ, స్కాట్, పరుచూరి వంతుల ప్రకారం చూసుకున్నారు.

జనవరి 23 న, డాక్టరు పరీక్ష ప్రకారం కృషమూర్తి దేహం, అసామాన్యమైనదని తెలింది. ఒక అసాధారణ శక్తి, ఆయన దేహాన్ని ఉపయోగించుకుంది. ఆ దేహం, చాలా సున్నితం - నాజూకు. తాను ఎన్నడూ అటువంటి దేహం కలవారిని చూడలేదన్నారు, డాక్టరు.

"కృషమూర్తికి వచ్చినవ్యాధి కేన్సర్ అయితే మనం ఏమీ చేయలేము," అన్నారు డాక్టరు. అప్పటినుంచి అన్ని మందులతోపాటు, ప్రతి రెండు గంటలకు మత్తు ఇంజక్షన్లు ఇచ్చారు, కృష్ణమూర్తికి.

కొన్నేళ్ళ క్రిందట డాక్టర్ పరుచూరి కృష్ణమూర్తికి ప్రమాణం చేశారు, "కృష్ణమూర్తికి మృత్యువు ఆసన్నమైతే, ఆ సంగతి తనకు స్పష్టమైతే, తప్పక వెంటనే ఆ సంగతి కృష్ణమూర్తికి చెపుతాను,'' అని. కాని కృషమూర్తి దేహస్థితి చూసి, కంగారుపడి, కృష్ణమూర్తి కోమాలోకి వెడతారేమోనని భయపడి, "కృష్ణమూర్తికి మృత్యువు ఆసన్నం కాబోతోంది," అని కృష్ణాజీతో చెప్పారు, డాక్టరు పరుచూరి.

ఆ తర్వాత మేరీ, స్కాట్ ఇద్దరూ కృష్ణమూర్తి గదిలోకి వెళ్ళారు వాళ్ళను చూసి, "అంటే, నేను చనిపోతున్నానన్న మాట ? '' అన్నారు.

మరొకసారి కృషమూర్తి మేరీతో, "దీన్నంతా నేను గమనిస్తూనే వున్నాను. ఇది చాలా ఆత్మృతగా వుంది,"అన్నారు.

తనకు కేన్సర్ అని తెలిశాక, "నేనేం పొరపాటు, తప్పు చేశా,ను" అని మేరీని అమాయకంగా అడిగారు, కృష్ణాజీ.

కృష్ణమూర్తి ఆరోగ్యపరిస్థితి ఆందోళనకరంగా వుందని ప్రపంచమంతటా వున్న కృష్ణమూర్తి మిత్రులందరికీ, చాలా వరకు వార్తలు వెళ్ళాయి.

24 న కృష్ణమూర్తి ఆరోగ్యం బావుంది. కృష్ణమూర్తి ఒంటికి రక్తం అవసరమన్నారు, డాక్టర్లు. కాని సరైన రక్తం దొరకడం కష్టమైంది.

ఒకసారి కృష్ణమూర్తి మాటల్లో తనను చివరివరకూ చూసుకుంటూ వుండమని మేరీని స్కాట్ని కోరారు. ఆ తర్వాత, ''నా అస్థికల్ని ఏం చేస్తారు ? '' అని స్కాట్ని అడిగి, "దాన్ని మూడు భాగాలు చేసి-ఒక భాగం ఒహైలో వుంచండి. ఒకటి, ఇండియాలో. మరొకటి బ్రాక్వుడ్లో, వుండేటట్లు చూడండి.

నా అస్తికలపై ఎటువంటి నిర్మాణం చేయకండి. ఎందుకంటే, ప్రజలు అక్కడ ఆరాధనలు చేస్తారు. అది నాకు ఇష్టంలేదు," అన్నారు.

27 న డాక్టరు పరీక్ష అయిన తర్వాత కృష్ణమూర్తి పైన్ కాటేజీకి వచ్చేశారు. తనకు హాస్పిటల్‌లో చనిపోవడం ఇష్టం లేదన్నారు, కృష్ణాజీ.

29 న కృష్ణమూర్తికి ఆ క్షణాన అభీష్టమేమిటో అడిగారు, డాక్టరు. దానికి కృష్ణమూర్తి, "చివరి వరకు నా మనసు స్వచ్ఛంగా వుండాలను కుంటున్నాను," అన్నారు. అని, "అంతేకాదు, విపరీతమైన బాధపడాలనీ లేదు," అన్నారు. కాని, బాధ ఎక్కువగా వున్నప్పుడు మత్తు మందులు వేసేవారు.

30 న తనకు "తినడానికి ఏమైనా పెట్టండి," అని అడిగారు కృష్ణమూర్తి. మేరీ టొమేటో, రొట్టె ఇచ్చింది. ఆతర్వాత ఐస్‌క్రీం కూడా ఇచ్చింది. కాని, కృష్ణమూర్తి ఏమీ తినలేకపోయారు. "PAVAROTT" సంగీతం వినిపించమన్నారు. వినిపించారు. ఆ తర్వాత NEAPOLITAN పాటలు విన్నారు.

31 న రాధికను అడిగారు కృష్ణాజీ, "ఋషీవ్యాలీలో వర్షం పడిందా?" అని.

"వర్షం పడింది," అని ఆమె చెప్పడంతో కృష్ణమూర్తి చాలా సంతోషపడ్డారు.

ప్రపంచం నాలుగు మూలలనుంచీ క   మిత్రులు
ఒహై చేరుకున్నారు. ఆ నాటికి పుపుల్ జయకర్
కూడా ఒహై చేరుకుంది. రాజీవ్‌గాంధి, సునంద,
నందిని మొదలైనవారు ఇచ్చిన ఉత్తరాలు
ఫిబ్రవరి ఒకటవ తేదీన కృష్ణమూర్తికి చదివి
వినిపించింది. పుపుల్ జయకర్.

"ఆ ఉత్తరాలకు నేను జవాబు రాయలేను. వారికి నా ప్రేమ అందించు," అన్నారు కృష్ణాజీ ఆమెతో.

మేరీ జింబాలిస్ట్ చాలా శ్రద్ధగా రాత్రింబవళ్ళు కృష్ణమూర్తికి సేవలు చేసింది.

కృష్ణమూర్తికి ఆ తర్వాత నాలుగు రోజులు కొంచెం నయంగా వుంది. ఆయన్ని చూడ్డానికి వచ్చిన మిత్రులను కృష్ణమూర్తి గదిలోకి వెళ్ళనిచ్చారు.

కృష్ణాజీ తన పుస్తకాల ఎడిటింగు, అచ్చు గురించి మాట్లాడారు. వరసగా రెండురోజులు. ఆ మాటల్ని టేప్ చేశారు. కుటీరం దగ్గర చక్రాల కుర్చీలో అటూ, ఇటూ తిరిగారు, కాస్సేపు. ఇతరుల సహాయంతో కృష్ణమూర్తి ఇంట్లో నడిచారు. టి. వి. లో ఒక సినిమా కూడా చూశారు.

ఇండియా, ఇంగ్లండు కృష్ణమూర్తి సెంటర్స్ వారు, ఆయన పుస్తకాల ముద్రణ విషయంలో తగాదాపడ్డారు.

"ఇండియాలో కృష్ణమూర్తి ఉపన్యాసాలు, సంభాషణలు, చర్చలు ఇంగ్లండు వెళ్ళి, అక్కడ ఎడిట్ చేయబడి అక్కడే అచ్చవుతాయి. సాదా ప్రతులైతే, అచ్చు వేసుకునే అదికారం ఇండియా ఫౌండేషన్‌కు ఇవ్వడమైనది" అన్నారు కృష్ణాజీ.

ఆ విధంగా ఇండియా, ఇంగ్లండు కృష్ణమూర్తి ఫౌండేషన్స్ వారికి చెప్పి, "నేను చెప్పింది మీకు సమ్మతమేనా?" అని కృష్ణమూర్తి డాక్టరు కృష్ణను అడిగారు.

"నాకు పబ్లికేషన్, ఫౌండేషన్‌తో సంబంధం లేదు. కాని, పుపుల్ జయకర్‌కి మాత్రం సమ్మతం కానట్లుంది," అన్నారు డాక్టరు కృష్ణ. అని, "ఇది మీ స్వంత యోచనా ? లేక, మీరు అస్వస్థులుగా వున్నప్పుడు ఎవరైనా చెప్పిన సలహా ?" అని మళ్ళా అడిగారు డాక్టరు కృష్ణ, కృష్ణమూర్తిని.

"మీ ప్రశ్న, సంశయం అన్నీ నాకు అర్ధమయ్యాయి. అయితే వినండి; నేను ఇండియన్‌ని కాదు. అలాగే మీరూ ఇండియన్స్ కారు. చివరికి ఒక సమన్వయ మార్గానికి వచ్చారు కదా ? అంతా సవ్యంగావుంది కనుక వినండి.

ఇప్పుడు నా మెదడు చాలా బాగా వుంది. అది చురుకుగా పని చేస్తోంది. అది స్పష్టంగా, ప్రశాంతంగా వుంది. రాత్రి నిద్రలేకపోయినా, గొప్ప ధ్యానం కుదిరింది. వీలైనంత త్వరగా నేను వెళ్ళిపోవాలనుకుంటున్నాను. నా వ్యాధి తొందరపడుతోంది. అది తీవ్రంగా పనిచేస్తోంది. మత్తు ఇంజక్షన్లతో శారీరక బాధ పోగొట్టుకోగలను. కాని, ఆ తర్వాత మళ్ళా అదే బాధ వస్తుంది. ఆ విధంగా జీవించాలని నాకు లేదు. నేనిప్పుడు బాగా మాట్లాడగలను. మాట్లాడుతున్నాను," అన్నారు కృష్ణాజీ

ఆ తర్వాత కృష్ణమూర్తి చక్రాల కుర్చీలో అటూ, ఇటూ తిరిగి, తనను ఒక చెట్టుకింద కూర్చోబెట్టమన్నారు.

ఫిబ్రవరి - నాల్గవ తేదీన కృష్ణమూర్తిని చూడ్డానికి హాస్పిటల్ డాక్టరు వస్తే, "నేను మళ్ళా ప్రయాణాలు చేసి, ఉపన్యాసాలు ఇవ్వవచ్చా ?" అని కృష్ణాజీ అడిగారు. ఎందుకంటే, అప్పటికే ఆయన మెదడు ఎప్పటి మాదిరిగా చురుకుగా పనిచేస్తోంది. "పూర్వం మాదిరిగా కాక, వ్యక్తులతో మాట్లాడవచ్చు. టేప్ చేయవచ్చు. లేదా, ఎవరికైనా చెప్పి, రాయించవచ్చు," అన్నారు డాక్టరు.

విపరీతంగా మందులు వాడటంవల్ల కృష్ణాజీకి కామెర్లు అయ్యాయి.

"ఈ ప్రాణం వున్నంతవరకు నేను బోధకుడనే! దేహం సజీవంగా వున్నంతవరకు, కృష్ణమూర్తి వుంటాడు," అన్నారు కృష్ణాజీ, మిత్రులతో.

ఎవరైనా తనను చూడ్డానికి వస్తే, వారు చూసిన తర్వాత, "ఇంక ఇక్కడ కూర్చోకండి. వెళ్ళండి. వెళ్ళి, మీ పనులు చేసుకోండి. ఇక్కడ వుండి మీరు నాకు ఎటువంటి సాహాయమూ చేయలేరు. ఇక్కడ కూర్చుని మీ కాలాన్ని వృథా చేసుకోకండి. మీరు దీన్ని (తనను) పోకుండా ఆపుచేయలేరు," అనే వారు కృష్ణమూర్తి, వినయపూర్వకంగా.

తనను చూడ్డానికి మిత్రులు రాగానే, "భోజనం చేశారా?" అని అడిగేవారు కృష్ణాజీ. దానికి వారు, "మంచి భోజనం చేశాం," అని వారంటే, "ఏ-మేం తిన్నారో, అవన్నీ చెప్పండి," అని సరదాగా అడిగేవారు.

హాస్పిటల్ డాక్టరుకు తన గడియారాన్ని బహుమతిగా ఇచ్చారు, కృష్ణమూర్తి.

ఒక రోజున మిత్రులతో, "ఈ దేహంలో వున్న శక్తిని ఎవరూ గమనించి, తెలుసుకోలేరు. ఇందున్న జ్ఞానాన్ని, బుద్ధిని, తెలివిని, స్ఫురణను ఎవరూ గుర్తించలేరు. ఈ దేహం డెబ్భై ఏళ్ళు పనిచేసింది. ఇంక నిలవలేదు. ఏదో దివ్య శక్తి దీన్ని నడిపించింది. దీన్ని ఉపయోగించుకుంది. ఆ శక్తి ఏదో, ఏమిటో ఎవరూ తెలుసుకోలేకపోయారు. ఏ ఒక్కరూ దాన్ని తెలుసుకోలేరని నాకు తెలుసు. ఇప్పుడు ఇది చివరి దశలో వుంది," అన్నారు కృష్ణాజీ.

"అపారమైన జ్ఞానం – బ్రహ్మాండమైన శక్తి - అంతిమ సత్యం ఈ దేహాన్ని దాదాపు డెబ్బై ఏళ్ళు ఉపయోగించుకుంది" అనే విషయం గురించి కృష్ణాజీ మాట్లాడుతూ, "ఏదో శక్తి ఈ దేహం ద్వారా పనిచేసింది,'' అనే సంగతి ప్రజలు గుర్తించారా ? లేదా ?" అని నేను ఎప్పుడూ ఆలోచించలేదు. ఈ దేహంలో అద్భుతమైన శక్తివుంది. పన్నెండు సిలెండర్ల ఇంజనువంటి శక్తి ఈ దేహంలో వున్నట్లు అనిపిస్తుంది. "డెభ్భై ఏళ్ళు" అనేది సొగసైన, ముచ్చటైన దీర్ఘకాలం. ఇంక ఇప్పుడు ఈ దేహం నిలవలేకపోతోంది.

ఇప్పుడు ఈ దేహం విషయంలో జాగ్రత్త పడకపోతే, అంటే, శ్రద్ధ తీసుకుని కాపాడకపోతే, ఈ దేహంలోంచి అసలు ఇన్నేళ్ళూ ఏశక్తి ప్రసరించి పనిచేసిందో ఎవరూ అర్థం చేసుకోలేరు. దాన్నెవరూ తెలుసుకోలేరు.

ఆ శక్తి గురించి తెలిసినట్లు ఎవరూ నటించవద్దు. తెలిసినవారు ఎవరూ లేరని, నేను అంటున్నానని ఎవరూ ఏమీ అనుకోకండి. దాన్ని తెలుసుకున్నవారు - గ్రహించినవారూ నిజంగా ఎవరూ లేరు. వాళ్ళు తెలుసుకోలేరని నాకు తెలుసు. ఇప్పుడు- డెబ్బై ఏళ్ళ తర్వాత ఇంక ఈ దేహం నిలవలేక పోతోంది. ఇది ఇంక ఎక్కువకాలం నిలవలేదు. మీరు ఇలాంటి దేహాన్ని కనుక్కోలేరు, చూడలేరు. ఇటువంటి, శక్తి – జ్ఞానం – కొన్ని వందల ఏళ్ళనుంచి ఓ దేహంలో పనిచేస్తోంది. ఇంక మీరు మళ్ళా దాన్ని చూడలేరు. అది వెళ్ళేప్పుడు వెడుతుంది. అది దాని ఇష్టం.

"చివరి వరకు అన్ని జాగ్రత్తలూ ఈ దేహానికి తీసుకున్నారు క్రమం తప్పకుండా ప్రేమతో సేవలు చేశారు. సంతోషం!'' అన్నారు.

తనకు వైద్యం చేసిన డాక్టరుతో, "చనిపోతున్నానని నేను ఏ మాత్రం గొడవపడటం లేదు, భయపడటమూ లేదు. ఎందుకంటే, జీవితమంతా నేను మృత్యువుతోనే గడిపాను. నేను ఎప్పుడూ ఎటువంటి జ్ఞాపకాల్ని – స్మృతుల్ని – గతాన్ని మోసుకుంటో తిరగలేదు – బ్రతకలేదు," అన్నారు కృష్ణాజీ.

* * *

గొట్టాలద్వారా తనకు ఆహారాన్ని లోపలకు పంపడాన్ని కృష్ణాజీ ఇష్టపడలేదు. ఆ గొట్టాల్ని తీసెయ్యమన్నారు కృష్ణమూర్తి. అవి తీసేస్తే, దేహం నిలవదన్నారు డాక్టర్లు.

అంత జబ్బులోనూ కృష్ణమూర్తి తన నిత్య కార్యక్రమం సక్రమంగా చేసుకునేవారు. పళ్ళు తోముకునేవారు. స్నానం చేసేవారు. తలదువ్వుకునేవారు. చివరి వరకు కళ్ళ వ్యాయామం కూడా చేశారు. ధ్యానం కూడా బాగా కుదిరేది.

మేరీకి ధైర్యం చెప్పారు. తాను చనిపోయిన తర్వాత ఆమెను యాత్రలకు వెళ్ళమన్నారు, కృష్ణాజీ. ఇంట్లో పనులు అయిపోయిన తర్వాత షికారుకు వెళ్ళమనేవారు.

జగన్నాద ఉపాధ్యాయ సూచన ప్రకారం కృష్ణమూర్తి మృతదేహాన్ని ఏంచేయాలో ఆ సంగతి పుపుల్ జయకర్ కృష్ణమూర్తితో చెపితే, ఆయన ఆ ప్రకారం అంగీకరించక, "మృతదేహానికి ఎటువంటి తంతూ జరపవద్దు. అలాగే ఎంతో మంది జనంవచ్చి, తన మృతదేహాన్ని చూడ్డంకూడా తనకు ఇష్టం లేదు," అన్నారు కృష్ణాజీ,

9 న వైద్యపరీక్షలో కృష్ణమూర్తికి ''కడుపులో కేన్సర్'' అని తేలింది. వయసు కారణంగా ఆయనకు ఆపరేషన్ కుదర

దన్నారు, డాక్టర్లు. ఆతర్వాత వ్యాధి మరింత తీవ్రమైంది ఆసుపత్రి నుంచి కృష్ణమూర్తి పైన్‌కాటేజీకి వచ్చేశారు.

"ప్రాణం పోయిన తర్వాత దేహానికి ఏ ప్రాముఖ్యతా లేదు. అది ఒక కర్రముద్దు వంటిది. అది కట్టెలతో కాలవలసిందే! నేను సామాన్యుణ్ణి. నా మరణానంతరం ఎటువంటి కర్మకాండ జరపవద్దు. నా అస్తికలపై ఎటువంటి నిర్మాణమూ చేయవద్దు. గురువు ముఖ్యంకాదు. ఆయన బోధ ముఖ్యం. ఆ బోధ, మనిషిని వికృతం, వికారం, కలుషితం నుంచి కాపాడుతుంది. బోధలో అధికారానికి, గురుపీఠానికి తావులేదు. బోధకు, వారసుడు లేడు. అలాగే బోధకు ప్రతినిధీ లేడు. నా పేరు మీదుగా ఇప్పుడుగాని, ఎప్పుడుగాని స్థాపించబడివున్న పాఠ శాలలు ఇప్పటి మాదిరిగానే కొనసాగాలని కోరుతున్నాను. అంతే!" అన్నారు కృష్ణాజీ.

12 వ, తేదీన ఆయనకు 104° జ్వరం వచ్చింది. శారీర కంగా చాలా బాధలు పడ్డారు.

13 న, కృష్ణమూర్తి మరీ నీరసించిపోయారు. చేతుల మీద ఎత్తి సోఫాలో కూర్చోబెట్టారు.

అప్పుడప్పుడు తన పేరుమీద స్థాపించబడివున్న పాఠ శాలల గురించి "అవి ఎట్లా వున్నాయి?" అని స్కాట్‌ని అడిగే వారు కృష్ణమూర్తి.

"నేను చనిపోయిన తర్వాత నా మృతదేహాన్ని ఎవరూ చూడవద్దు," అని కృష్ణమూర్తి అన్నారని అసిత్ చాంద్‌మల్ బాధపడ్డాడు.

పదహారవ తేదీ రాత్రి పుపుల్ జయకర్, రాధిక ఇండియా వచ్చేశారు.

ఆ రాత్రి మేరీ – స్కాట్-డాక్టరు పరుచూరి కృష్ణాజీ దగ్గరే వున్నారు. వారిని చూసి, "మీరు వెళ్ళి పడుకోండి," అన్నారు కృష్ణమూర్తి చాలాసార్లు.

ఆ రాత్రి తొమ్మిది గంటలకు కృష్ణమూర్తి నిద్రమాత్ర వేసుకని పడుకున్నారు.

మేరీ ఆయన పక్కన కూర్చుని, ఆయన ఎడం చేతిని పట్టుకుంది. ఆయన నిద్రపోయే ముందు మేరీని చూసి, "వెళ్ళి నిద్రపో. గుడ్ నైట్," అన్నారు.

"నేను మీ దగ్గరే వుంటాను" అంది మేరీ. ఆమె మాట విని ఆయన నిద్రపోయారు. నిద్రపోతున్నా, ఆయన కళ్లు సగం తెరచివున్నాయి.

మేరీ ఆయన ఎడమ చేతిని పట్టుకుని కూర్చున్నా ఆయనకు నిద్రాభంగం కాలేదు.

స్కాట్ ఆయనకు కుడివైపున కూర్చున్నాడు.

పరుచూరి అటూ, ఇటూ పచార్లు చేస్తున్నాడు, గదిలో. కృష్ణాజీ నిద్రపొతున్నారు.

చూస్తుండగానే ఆ నిద్ర కోమాలోకి జారుకుంది. క్రమంగా శ్వాస నెమ్మదించింది. అవి చివరి ఘడియలనిపించాయి. ఆయనకు మళ్ళా మెలకువ వచ్చిన జాడలేదు.

రాత్రి పదకొండు గంటలకు హాస్పిటల్ డాక్టరు వచ్చారు.

ఆ రాత్రి సరిగ్గా 12–30 నిమిషాలకు కృష్ణాజీ గుండె ఆగిపోయింది. నిద్రలోనే ఆయన శాశ్వతంగా కన్నుమూశారు. ఇండియా కాలమానం ప్రకారం ఫిబ్రవరి – పదిహేడవ తేదీ – మధ్యాహ్నం – ఒంటిగంటా నలభై నిమిషాలు అయింది.

ఫిబ్రవరి పదిహేడవ తేదీన ఆల్కాట్ మరణించారు. అదే తారీఖున లెడ్‌బీటర్ జన్మించారు.

"మరణానంతరం మీ దేహాన్ని ఏంచేయమంటారు ?" అని కృష్ణమూర్తిని ఒకసారి అడిగితే, "నేనెప్పుడూ పరిశుద్ధుడనే! మరణానంతరం నా దేహాన్ని స్నానం చేయించి, ఒక గుడ్డలో చుట్టి, ఏ ఆడంబరమూ లేకుండా అగ్నికి అర్పించండి," అన్నారు.

ఆ ప్రకారమే ఆయన మృతదేహాన్ని స్నానం చేయించి "మేరీలీ" ఇచ్చిన ఖద్దరు సిల్కు బట్టలో ఆ మృతదేహాన్ని చుట్టారు. అవకాశం వున్న వారు కొందరు ఆయన చివరి దర్శనం చేసుకున్నారు. వారిలో అసిత్‌కూడా వున్నాడు.

పదిహేడవ తేదీ ఉదయం, ఎనిమిది గంటలకు కృష్ణమూర్తి ముఖం కూడా కప్పేశారు. ఆయన చెప్పినట్లు ఏ ఆడంబరమూ, సందడీ చేయకుండా, ఎటువంటి ప్రార్ధనలూ, సమావేశాలూ జరపకుండా సహజంగా, నిరాడంబరంగా ఆయన భౌతిక కాయానికి "వెన్‌టూరా" లో అంత్యక్రియలు జరిపారు.

కృష్ణమూర్తి దేహం కాలి బూడిదైపోయింది. వెలుగు రవ్వ మహాజ్వాలలో కలిసిపోయింది.

కృష్ణమూర్తి బోధ, తీసుకున్నవారికి తీసుకున్నంతగా, తరగని నిధి మాదిరిగా నిలిచిపోయింది.

కృష్ణమూర్తి అస్థికల్ని మూడు భాగాలుచేసి, ఇంగ్లండు- ఇండియా - అమెరికాలకు ఇచ్చారు.

ఏ పైన్‌కాటేజీలో కృష్ణాజీకి, ఆధ్యాత్మిక అనుభవం కలిగిందో, ఆ పైన్ కాటేజీలోనే ఆయన అంతిమ శ్వాస వదిలారు.

కృష్ణాజీ తన నూతన ప్రబోధాన్ని మొదట పశ్చిమ దేశాల్లో ప్రారంభించి, ఆ ప్రబోధాన్ని తూర్పుదేశమైన ఇండియాలో ముగించారు.

తూర్పుదేశమైన ఇండియాలో జన్మించి, పశ్చిమదేశమైన అమెరికాలో అస్తమించారు, కృష్ణాజీ.

• • •

ఇవి నా మాటలు కావు.

ఇవి కృష్ణమూర్తిగారు చెప్పిన

అనేక సంగతుల సారాంశం.

అవి కేవలం సూక్తులు కావు,

పరమ సత్యాలు.

వాటిని నిత్య జీవితంలో

అనుష్ఠిస్తే, ఎవరైనా సరే

వికాసం చెందగలరు.

**సజీవమూ** సౌందర్యవంతమూ, తేజోమయమూ, చైతన్యవంతమూ అయిన ఈ భూమిని అనుభవించడం జీవితంలో ముఖ్యమైన సంగతి. ఇంత సుందరమైన, సువిశాలమైన ప్రపంచంలో ఏదో ఒక అందమైన సమయాన్నో, సౌందర్యవంతమైన సమయాన్నో, సౌందర్యవంతమైన ప్రదేశాన్నో, శోభాయమానమైన భావాన్నో, పట్టుకుని వేళ్ళాడక, సర్వకాల సర్వావస్థల్లో ఈ ప్రపంచమంతా మనదే అనుకుని, దాన్ని మన సంతతితో ప్రేమించి అనుభవించాలి. కాని, ఆ మనసు అనాదిగా తనకు తెలిసిన వాటితో ముడిపడి, సతతం సమస్యలతో, చింతలతో, తొందర్లతో, స్వలాభాపేక్షలతో, ఆలోచనలతో,ఆవేదనలతో సతమతమౌతుందేకాని, నిశ్చలంగా, నిర్మలంగా, నిశ్శబ్దంగా వుండి ప్రపంచాన్ని అనుభవించలేకపోతుంది.

జీవితంలో మనసుకు అద్వితీయమైన స్థానం వుంది. మనసు లేనిది, ఈ ప్రపంచంలో ఏదీ జరగదు. కాని, ఆ మనసు ఎక్కడనుంచి ఏ విధంగా పనిచేస్తున్నదో చెప్పడానికి ఒక కేంద్రమంటూ లేదు. మనసు, మనకు ఇవ్వబడిన ఆశ్చర్యకరమైన ఒక గొప్ప ఆయుధం. అది అన్నింటికంటే, శక్తివంతమైన ఆయుధం.

పరిసరాల ఫలితంగా ప్రభావితమైనదే, మనసు. దాని స్వభావం, సృష్టించడం. వాస్తవాన్ని ఎదుర్కోవడంలో మనసు వక్రంగా, అసమర్ధవంతంగా, అసత్యంగా, అక్రమంగా, మోసంగా, వంచనగా, దగాగా, అమర్యాదకరంగా, అవినీతికరంగా వుంటుంది. అటువంటి మనసు కాలపరిధిలో తగుల్కొని, ఎప్పుడూ తనకు తెలిసినవాటితో కలసి అటూ-ఇటూ తిరుగుతుంది. ఏ విధంగానంటే, ఒక కర్ర పాతి, దానికో తాడు కట్టి, ఆ తాడు చివర ఒక కోతిని కడితే, ఆ కోతి - ఆ తాడుమేర, కర్రచుట్టూ తిరుగునట్లు, మనసూ తనకు తెలిసిన వాటి పరిధిలోనే

తిరుగుతుంది. తాడును మించి తిరిగే శక్తి కోతికీ, తనకు తెలిసిన వాటిని మించి తిరిగేశక్తి మనసుకూ లేదు.

"జీవితాన్ని, సమస్తాన్ని పాలించే ఈ మనసు ఏమిటి ?" అని మనం ఆ మనసునే ప్రశ్నిస్తే, ఆశనిపాతంలాంటి ఆ ఎదురు ప్రశ్న తాకిడికి తట్టుకోలేక, వెంటనే తనకు తెలిసిన "సమాచారం - విజ్ఞానం — తెలివి" శరణుజొచ్చి, వాటి బలంతో ఎదురైన ప్రశ్నను ఎగరగొట్టెయ్యాలని చూస్తుంది. కాని, మనం విడవకుండా దాన్ని వెంబడించి, "అసలు నువ్వెవరు ?" అని ప్రశ్నిస్తూవుంటే, అది కాస్త వెనక్కి తగ్గి, తాత్కాలికంగా కిక్కురుమనకుండా అణగుతుంది. అది అణగి ఎట్లావుందో, ఏం ఆలోచిస్తోందో, ఏం భావిస్తోందో, ఏరి ఊహిస్తోందో - అసలు ఆ మనసు మన ప్రశ్నను ఏం విధంగా తీసుకుందో, తీసుకున్న తర్వాత అది ఎక్కడెక్కకు వెళ్ళి, ఎట్లా - ఎట్లా దూకుతోందో విడవకుండా గమనించాలి. మన గమనికపై, దాని రియాక్షన్ ఏమిటో కూడా పరీక్షించాలి. ఇదంతా జీవితంలో ఒకప్పుడైనా జరక్కపోతే, ఎంతో పోగొట్టుకున్నవాళ్ళం అవుతాం.

అనుక్షణం ఒకదానిమీదనుంచి, మరోదాని మీదకు సీతాకోకచిలుక మాదిరిగా దూకే స్వభావంకల మనసును ఎప్పుడూ, దేనికీ, ఏమాత్రం ఆపుజేయాలని, అణచాలని, హద్దుల్లో - నియమాల్లో పెట్టాలని చూడకూడదు. కాని, దాని దూకుళ్ళను గమనించాలి, నది ఒడ్డున కూర్చుని ప్రవాహంలో కొట్టుకుపోయేవాటినన్నింటినీ గమనించినట్లు. అలాగే మన పాతా, కొత్తా ఆలాచనల్ని, గమనించాలి.

మనసు తనకు తాను మాయలోపడి, మోసపుచ్చుకోవడమే, అజ్ఞానం. అప్పుడు అది అనేక అవస్థల్ని, స్థితుల్ని కల్పించుకుంటుంది. అదే భ్రాంతి. జీవితంలో అది ప్రమాదకరమైన సంగతి.

మనసు అనేది, అనేక మడతల్లో చుట్టబడ్డ బట్ట వంటిది. జ్ఞాపకాలు దాని నూలు పోగులు. పడుగు-పేకలుగా అల్లుకు పోయిన ఆ నూలు పోగుల్ని ఆలోచనలు నిరంతరం బైటికి లాగుతూ వుంటాయి. ఒక్కోసారి గట్టిగా లాగుతాయి. అటు వంటప్పుడు లోపల మడతల్లో నూలుపోగులు చెడవచ్చు, చెదర వచ్చు, లేదా, దారాలు తెగవచ్చు. మడతలన్నీ చెదిరి, బట్ట-తా కదిలి, చిక్కుపడి క్రమం, వశం తప్పి ప్రమాదం ఏర్పడుతుంది. అంటే, మనసుచెడి, పిచ్చిపట్టే అవకాశం ఏర్పడు తుంది. అందుచేత మనసు విషయంలో చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి.

మన జీవితం నిరంతరం కార్య–కారణాల మధ్య సాగు తుంది. వాటిని మనసు మళ్ళా, మళ్ళా ఏర్పాటు చేసుకుంటుంది. మనస్సంటే, కార్య-కారణ సంబంధం. అందుచేత ఆ మనసుకు ఆది - అంతాలు లేని దాన్ని, మనసు జ్ఞాపకం పెట్టుకోలేదు.

మనలో "నేను–నాది" అనేదాని కేంద్రమే, ఈ మనసు. "నేను-నాది" అనే విధానంలో ఆ మనసు అనాదిగా, అసం పూర్తి క్రమశిక్షణలో, తెలిసీ - తెలియని పరిజ్ఞానంతో, పరిణతి చెందని సంబంధంలో అనుభవాలద్వారా. జ్ఞాపకాలద్వారా, ఒక మార్గం ఏర్పరచుకొని, హద్దుల్లో, షరతుల్లో బిగించబడి, వుంటుంది. మనిషి విశాలంగా ఎదగకుండా ఆ హద్దులే అడ్డు పడతాయి. ఆ విధంగా పెరిగిన మనసు క్రమంగా ఒక పద్ధతిని ఏర్పరచుకుని అందు తగుల్కొని వుంటుందేకాని, దేన్నీ కొత్తగా చూడదు, తీసుకోదు. ఆ మనసు అనుసరించే విధానం, జీవిత పరిమళమైన ప్రేమను నాశనం చేస్తుంది.

ప్రపంచం మనకు అన్యంగా, భిన్నంగాలేదు. మనమే ప్రపంచం. మన మనో కల్పితమే, ప్రపంచం. ఆ ప్రపంచంలో

నువ్వు - నీమిత్రుడు - నీ శత్రువు - అంతా అందరూ - అన్నీ వున్నాయి. మనమంటే, ప్రపంచంయొక్క ప్రతిరూపం. కనుక మనమూ, ప్రపంచమూ ఒక్కటే. ఆ ప్రపంచాన్ని అర్ధంచేసుకోవాలంటే, ముందు నిన్ను నీవు తెలుసుకోవాలి. కాని, మనలో "నేను" అనేది, తాను ఈ ప్రపంచానికి భిన్నంగా వున్నాననుకుంటుంది. ఆ విభాగమే అన్ని అనర్ధాలకు మూలం. "నేను" అనే ప్రత్యేక తలంపు వున్నంతకాలం, ద్వంద్వం తప్పదు. భిన్నత్వం తొలగదు. కాబట్టి ప్రతి ఒక్కరిలో తానూ, ప్రపంచం ఒకటేనన్న భావం స్థిరపడాలి. ఆ భావం మనలో గట్టిగా స్థిరపడే కొద్దీ, ద్వంద్వాతీతమైన స్థితిని పొందగలుగుతాము. ఆ స్థితిలో భావన, ఇష్టా యిష్టాలు, నిర్ణయాలు, నిశ్చయాలు, కోర్కెలు, అన్నీ పోయి, అంతా ఒకటిగా దర్శనం ఇస్తుంది. అదే సహజ స్థితి. అది మనను నిశ్చలమైన స్థితి.

ఆస్థితిలో జరిగేదే సృజనాత్మకం. భయంకరమైన ఒంటరితనాన్ని ఎదుర్కొన్నప్పుడు సృజనాత్మకమైన మనసు చోటు చేసుకుంటుంది. కాని, ఆ మనసు ఎప్పుడూ అటువంటి స్థితిలో వుండదు. మనసు కదిలి, తన మనుగడ కోసం కాలాన్ని మూడు భాగాలుగా విభజిస్తుంది. కాలమంటే, ఎడతెగని ఒక కదలిక. ఆ కదలికకు ఆద్యంతాలు లేవు. దానికో మార్గమూ లేదు. అసలు అది దేనికోసమూ ఆగవలసిన పనీలేదు. అది అనంతమైన కాలాన్ని కప్పుతుంది. పరిమితమైన మనసు ఎప్పటికీ దాని అంచును కూడా తాకలేదు. కనుక ఈ కాలమనేది కూడా మనో కల్పితమనే తెలుతోంది. మనసు ఆగితే, కాలమూ ఆగుతుంది, తన నీడవంటి గతాన్ని అనుసరించి పోయే మానవుడు, ఎప్పటికీ కాల కదలికను అందుకోలేడు. అంటే, అతడు ఎప్పటికీ వర్తమానంలో నిలవలేడు.

మనస్సంటే, కదలికలతో కూడిన పాత్ర. మనసు కదలికను రెండు భాగాలు చేస్తే, ఒకటి - మనో కదలిక, రెండవది - మనసులోని కదలిక, మనో కదలిక నిరంతరం, ఎడతెగక కొనసాగుతుంది. ఎందుకంటే, మనసు నిరంతరం తనకు తెలిసిన పరిధిలో తిరుగుతూ వుంటుంది కనుక.

మనసులోని కదలిక, అది అవ్యక్తం. దానికి అపారమైన శక్తి - సామర్థ్యాలూ, వివేక-విజ్ఞానాలూ వుంటాయి. అది మానసాతీతం. అదే అసలు కదలిక. జీవితం అన్నా అదే. బాహ్యజీవితంలో పరిష్కారం కాకుండా మిగిలిపోయిన సమస్యల్ని, ఆ కదలిక పరిష్కరిస్తుంది. ఆ కదలికలకు ఎరుకలో వుండటమే, అసలు జీవితానికి తలుపు తెరవడం.

మనో కదలికకు ఒక రూపం లేనప్పుడు అంటే మెదడులోని కణాలు కదలకుండా ఆగినప్పుడు అప్పుడు ''నేను-నాది,'' అనేది వుండదు. అది పూర్తి నిరామయ స్థితి. అది నిశ్చలం, నిర్మలం. ఆ స్థితిలో, స్మృతికి తావు లేదు. కదలిక లేనప్పుడు, బలీయమైన, కేంద్రీకృతమైన శక్తి పనిచేస్తుంది. ఆ శక్తి, నీది కాదు. నీకు తెలియదు. ఆ శక్తి లోనే "సత్యం". వుంది. అదే మనలోని మార్పు. మార్పే, సజీవతకు లక్షణం.

• • •

ఆకాశం-చెట్లు-పర్వతాలు పక్షులు-మబ్బులూ;వాటి నాజూకు నొక్కులూ ; కాంతి, అది-కల్పించే అందాలూ; దేన్ని చూసినా ఆ క్షణంలో దానికో పేరు పెట్టకుండా, దానికో రూపాన్ని ఆపాదించకుండా, దానిపై యిష్టాయిష్టాలు చూపకుండా వుండలేము గనుకనే, నిత్యసత్యమైన జీవితాన్ని అర్థంచేసుకోలేకపోతున్నాం. మనని మనం పాత జ్ఞాపకాలతో, పాత అనుభవాలతో చూసుకో

వడం వల్ల వర్తమాన జీవితం సారహీనంగా, అర్ధరహితంగా, అందవికారంగా తయారౌతోంది. గత జ్ఞాపకాల బాధలవల్లనే, వర్తమానంలో మనం దేనినీ కొత్తగా, అపురూపంగా, అందంగా చూడలేకపోతున్నాం. చూసీ, ఆనందించలేకపోతున్నాం. క్రమంగా మనకు దేహంలోనూ అందం, అద్భుతం కనుపించడం మానేసింది.

నిరంతరం చూసి, తెలుసుకునేవాడే, గతం - వర్తమానం. అంటే, అతడు సగం చచ్చి, సగం బ్రతికిన వాడన్నమాట. అటువంటి వానిలోంచి, భవిష్యత్తు తొంగిచూస్తుంది. అతనిలోంచి చూసి, విని, తెలుసుకునేది ఏదైతే వుందో, అదే తెలివి - స్ఫురణ - జ్ఞాపకం. దాని సహాయంతో అతడు వర్తమానంలో ఎదురైన వాటిని పాత పదాల్లోకి అనువదించు కుంటాడు. ఆ విధంగా అతడు అహర్నిశలూ గతాన్నే పెంచు కుంటాడు.

"వర్తమానంలో నిలిచినదే, జ్ఞాని స్థితి. అదే సహజ స్థితి. గతం కాలి, బూడిద అయితేనే, ఆ స్థితి నిలిచేది. కాని, జ్ఞానులు గతించి పోయే వాటన్నింటికీ సదా పూర్తి ఎరుకలో వుంటారు. ఆ స్థితిని ఎంతటి వారూ మాటల్లో వర్ణించి చెప్పలేరు. ఆ స్థితి ఏమిటో సామాన్యులకూ అర్ధంకాదు అందుచేత, జ్ఞాని ఏం రాసినా, ఏం మాట్లాడినా, ఏం చెప్పినా, ఏం చేసినా - వాటిల్లో అంత ప్రేమ - దయ - అందం - ఆనందం - సంతోషం - సంతృప్తి ఏమిటి? వాటికి అంత బలం, వేగం ఎక్కడివి? అవి నిజంగా ఎటు మళ్ళుతాయి?'' అని అనేకమంది మహా మేధావులూ, సాధకులూ తెలుసుకోవాలని గట్టిగా ప్రయత్నించి ఓడిపోయారు. కొందరు భంగపడ్డారు. మరికొందరు కష్ట పడ్డారు, నష్టపడ్డారు. కొందరికి ఆశాభంగం కలిగింది.

ఏ భావం, ఏ సంకల్పం లేనివారు జ్ఞానులు. వారి మాటలు - చేతలు - నడతలు అన్నీ ఒక మహాసంయోగ మార్గంలో వుంటాయి. అవి ఒక నూతన విధానాన్ని సూచిస్తాయి. అది మామూలు మనిషికి అందని సంగతి. అదంతా ఒక దివ్య భావన. కానీ, అదీ ఆ క్షణానికే పరిమితం. కనుక వారికి ఏ విషయంలోనూ వైరుధ్యమనేది వుండదని మనము మొదట తెలుసుకోకపోతే, జ్ఞానులు ఎప్పటికీ అర్థం కారు.

జ్ఞానుల జీవితం మేఘావృతమైన ఆకాశంలో మెరపు కాంతుల వంటి మెరపులతో నిండివున్నట్లు వుంటుంది. ఒక మెరుపుకీ, మరొక మెరుపుకీ మధ్య వుండే వ్యవధి, వ్యత్యాసాలే, వారి జీవితకాలంలో వుంటాయి. ఒక మెరపుకీ, వేరొక మెరపుకీ ఎటువంటి సంబంధం, సారూప్యం వుండనట్లే, వారి ముందు—వెనుక కర్మలకూ సంబంధం, సందర్భం వుండదు. కాని, ప్రతి మెరపుకీ ఒక విధమైన శక్తి, అందం, నూతనత్వం, అపురూపత్వం వున్నట్లే, జ్ఞానుల విషయంలో ప్రతీదీ ఆ క్షణాన సంపూర్ణంగా, నిష్కామంగా, ఆది—అంతాలతో కూడి వుంటుంది. ఎవరైనా ఆ స్థితిని అందుకున్నారంటే, వారు ఈ భౌతిక విషయ జ్ఞానం నుంచి ఒక అడుగు ముందుకు వేశారన్నమాట. దానితో వారు విరాట్ స్వరూపంలో శాశ్వతంగా కలసిపోతారు. వారు తమ అనుభవాలను తెలియజెప్పడానికి కొందరు బోధిస్తారు, కొందరు రాస్తారు, మరికొందరు ప్రచారంచేసి చెపుతారు, కొందరు సూచిస్తారు,కొందరు విశదీకరిస్తారు. కాని,కొందరు మౌనం వహిస్తారు. వారికి సమస్త ప్రాణికోటిపై గొప్ప ప్రేమ, దయ వుంటాయి.

• • •

జీవితంలో మనం ఎన్నింటికో, ఎన్నెన్నో కారణాలు కల్పించుకుని, వాటికి మరిన్ని అవసరాలు ఆపాదించుకుని అనురాగంతోనో ఆసక్తితోనో, ఆశతోనో వాటికి మరింత గట్టిగా అతుక్కుని, అలవాటు ప్రకారం బ్రతుకుతూ, ప్రతిదాన్నీ స్వాధీనపరచుకోవాలనీ, ప్రతిదాన్ని అణచి - అధికారం చెలాయించాలనీ ప్రతిదాన్ని అనుభవించాలనీ కోర్కె పడతాం. ఒక్కొక్కసారి వాటిని పొందే విషయంలో మన ఆశా, ప్రయత్నం ఫలించవేమోనని నిరంతరం అనుమానంతో బ్రతుకుతాం. చివరికి ఆ అనుమానం పెనుభూతమై, భయంగా మారుతుంది. ఆ భయమే మనల్ని ఇరుకల్లో, నిబంధనల్లో, నియమాల్లో, అదుపుల్లో, ఆజ్ఞల్లో పెట్టి బందిస్తుంది. అందుకే, మనం జీవితంలో శాంతిగా, స్వేచ్ఛగా, ఆనందంగా, హాయిగా వుండలేక పోతున్నాం.

భయమనేది విడిగా లేదు. అది, ఒకదాని సంబంధంవల్ల కలుగుతుంది. చాలావరకు మనం తెలిసినవాటికే భయపడతాం. కాని, ఒక్కొక్కసారి తెలియని వాటికీ, మనసుకు అందనివాటికీ భయపడతాం. దేనికో ఒక దానికి, ఎవరికో ఒకరికి, ఎందుకో, ఒకందుకు మనం ఎప్పుడూ భయంతోనే బ్రతుకుతాం.

బుద్ధి వికాసానికి భయం పెద్ద అవరోధం. భయం, మనసునీ, హృదయాన్నీ బలహీనపరుస్తుంది. అవి క్రమంగా మొద్దుబారిపోతాయి. భయంవల్ల సమస్తానికీ, సంపూర్ణ జీవితానికీ అచేతనులుగా వుండిపోతాం. అయితే, ఆ భయాన్ని జయించడం ఎట్లా? దాన్నించి ఏ విధంగా తప్పించుకోవాలి? ఏవిధంగా దాన్ని అణచి, అదుపులో పెట్టగలం? దాన్ని ఏ విధంగా దూరంగా తోసెయ్యగలం? అసలు భయమనేది కలగకుండా వుండాలంటే, మనం ఎట్లా జీవించాలి?

ప్రతి ఒక్కరినీ, నిరంతరం, జీవితాంతం వెంటపడి వేదించే పెద్ద భయం, "మృత్యుభీతి". చావుతో ఏళ్ళతరబడి పోగుజేసుకున్నవన్నీ పోతాయని రాత్రిం-బవళ్ళు భయంతో బ్రతుకుతాం. మనిషి తప్ప ఏ ప్రాణీ చావు గురించి యోచించవు. అందుకే అవి అంత హాయిగా, ఆనందంగా, స్వేచ్ఛగా జీవిస్తాయి

కాని, మానవుడు తన మానసిక తికమకవల్లా, కాఠిన్యం వల్లా, సంక్షోభంవల్లా భయాన్ని అర్ధంచేసుకోలేకపోతున్నాడు. భయానికి గల కారణాలన్నీ, అసలు భయ మనేదాని అర్ధాన్నీ, భయం కలగడానికి గల ఆవశ్యకతనూ, దాని స్వభావాన్నీ. దాని ఏర్పాటునూ తెలుసుకుంటే, మనం నిర్భయంగా వుండగలం.

"భయం" అనే దాన్ని అర్ధం చేసుకోకపోతే, సమస్త సౌందర్యాలకూ అంధుల మౌతాం. క్రమంగా మనం అసహ్యకరమైన, వికృతమైన మనుష్యులుగా తయారౌతాం. మనం క్రమంగా మొద్దుబారి, త్వరలో వివేకాన్నీ, బుద్ధినీ, స్థిరత్వాన్నీ కోల్పోతాము.

గతంలో కలిగిన బాధాస్మృతులు మెదడులో జ్ఞాపకాల రూపంలో నిల్వవుండి, వర్తమానంలో "జాగ్రత్త!" అని హెచ్చరించడంవల్ల,భవిష్యత్తులో ఏమౌతుందోననే అనుమానంతో, ఆందోళనతో వృథాగా భయపడతాం. ఆ భయాన్ని ఆలోచనే స్మృతిపథంలోంచి బైటికి లాక్కొని వస్తుంది.

భయానికి కారణమైన ఆలోచనే, ఆనందానికీ, ఆహ్లాదానికీ, ఇష్టానికీ, ప్రీతికీ కారణమని అనుభవంమీద తెలుస్తుంది. ఆలోచన వల్లనే గతంలోని అందమైన, ఆనందభరితమైన, సంతోషకర

మైన అనుభవం, వర్తమానంలో, భవిష్యత్తులో — ఎప్పుడూ కల
గాలనే వాంఛ కలుగుతుంది.

తృప్తి లేకపోవడంవల్ల, కోర్కె అంతంకదు. ఏ కోర్కె
అయినా ఒకటే — అది ధనం కోసం కావచ్చు, దైవం కోసం
కావచ్చు. కలిగిన కోర్కె-దేనివెనక పడి పోతోందో, అసలు దాని
తత్వం ఏమిటో ముందు పూర్తిగా తెలుసుకోవాలి. కోర్కెవల్లనే
ఆలోచన పుడుతుంది.



జీవితంలో ఆలోచనకు మితిమీరిన, విపరీతమైన, విశిష్ట
మైన, అసాధారణమైన, అపురూపమైన, గౌరవం, ప్రాముఖ్యతా
వున్నాయి. కాని, ఆలోచన, వట్టి జిత్తులమారిది, కపటి.
ఎప్పుడూ కుయుక్తితో, ఉపాయంతో నిండివుంటుంది. అది
చాలా చమత్కారి. ఎంతో తెలివైనది. అది ఎప్పుడూ ఒక
దాన్ని వేర్పాటు చేస్తుంది. మరొక దాన్ని కొత్తగా ప్రారంభి
స్తుంది. ఎప్పటికప్పుడు నూతనంగా కనిపిస్తుంది. భయాన్ని
కలిగిస్తుంది. యుద్ధాల్ని తెచ్చిపెడుతుంది. క్షణికానందాన్ని
కలిగిస్తుంది. అనంతమైన చిత్ర చిత్రాల్ని సృష్టిస్తుంది. అది,
తన అంతాన్ని తానే అన్వేషిస్తుంది. నిన్నటి అహ్లాదాన్ని,
ఈ రోజు అనుభవిస్తో, "రేపు" అనే దాన్ని దానికి అంటగట్టి,
వినోదిస్తుంది. ఆలోచన అనేది ఎప్పుడూ చురుకుగా పనిచేస్తుంది.
ఏవేవో ఊహిస్తుంది. ఇంకేదేదో భావిస్తుంది. మనల్ని ఎక్క
డెక్కడికో లాక్కుపోతుంది. దానికి అన్ని విధాలైన సామ
ర్థ్యాలు వున్నాయి. కనుకనే, ప్రతి ఒక్కరూ ఆలోచనకు
బానిసలు అవుతారు.

ఆలోచన ఎప్పుడూ సంతోషాన్నో, ఆనందాన్నో దృష్టిలో
పెట్టుకుని పనిచేస్తుంది. నిరంతరం జ్ఞాపకాల్ని బైటికి లాగి,

సంబంధాలతో, ద్వంద్వాల్ని ఏర్పరుస్తుంది గనుకనే, లోకంలో అంత గోల. ద్వంద్వభావంవల్ల అనేక అనర్థాలు, ఘర్షణలు, పోరాటాలు, కలతలు, యుద్ధాలు వచ్చి పడుతున్నాయి.

విడవకుండా ఆలోచన కొనసాగడమే, ఆలోచించేవాడు. ఆలోచన ఆగితే, కలిగేది పవిత్రమైన, స్వచ్ఛమైన, నిర్మలమైన యోచన మాత్రమే. అది ఆలోచనా రహితమైన స్థితి.

ఆలోచన ఎంతకీ తనకు తెలిసిన వాటి పరిధిలోనే తిరుగుతుంది. అది దాన్ని దాటి వెళ్ళలేదు. దానికి దాన్ని దాటి వెళ్ళే శక్తి లేదు. దాన్ని దాటి వెడితే, అక్కడ వుండేది కేవలం "మౌనం" మాత్రమే! "అటువంటి శక్తివంతమైన మౌనం మనలో ఎంతకాలం వుంటుంది? ఎంతకాలం వుంది?" అని కాదు, మనం చూడవలసింది. అది క్షణికమైనా, గొప్ప సంగతే! అది లిప్తకాలమైనా ఆ క్షణంలో సరైన అవగాహన వుంటుంది. అది సత్కర్మకు, సదనుభవానికీ నాంది అవుతుంది.

రెండు ఆలోచనల మధ్య వ్యవధే, మౌనం. ఆ వ్యవధి కాలానికి చెందింది కాదు. అది ఆలోచన ఆగిన స్థితి. అంటే, ఆలోచన అంతమైనప్పుడే, మౌనం సాధ్యం. మౌనానికి మార్గాలు లేవు. హద్దులూ, అవధులూ లేవు. అది అపరిమితమైనది. సమస్తం, మౌనంలో భాగమే. మౌనం, మానసాతీతం. ఆలోచించేవాడు, అన్వేషించేవాడు వున్నంతకాలం, మౌనం అసాధ్యం.

తమను తాము తెలుసుకున్నవారి బోధల్లో మకుటాయమానమైన సంగతి, "మౌనం." అది, మనో మౌనం కావడం, మరీ గొప్ప సంగతి. ఆ మనో మౌనం బైట ఎటువంటి గోల వల్లా చెదరదు, చెడదు. ఏ ఆలోచనా దాన్ని ఆపలేదు, కదపలేదు, కలత చెందించదు. గతించిపోయే ఏ అనుభవమూ దాన్ని నిరోధించదు. ఆ మౌనం నిష్కపటమైనది, మాయారహిత

మైనది. అది అనంతం. అటువంటి మౌనం వున్ననాడు, దానిలోంచి సత్కర్మ ఆవిర్భవిస్తుంది. ఆ కర్మ, కలతల్ని, కలవరాల్ని, ఆందోళనల్ని, దుఃఖాల్ని, విచారాల్ని అంతం చేస్తుంది.

మనం దేని గురించి ఆలోచిస్తున్నా, ఆ ఆలోచనను మనకు దగ్గరగా, మరింత సన్నిహితంగా తీసుకుంటే, ఆలోచనా విధానం నెమ్మదిగా శాంతించి, క్రమంగా కిందికి దిగజారుతుంది. కాలంతోపాటు దాని వేగం, తీక్షతా, తొందరపాటూ తగ్గుతాయి. ఆ విధంగా ఆలోచన దిగజారుతున్నప్పుడు, దాన్ని ఇంకా, ఇంకా దగ్గరగా తీసుకుని పరీక్షించాలి. ఆ పరిశోధనలో మనం దాని లోతుల్లోకి వెళ్ళగలం. ఆ సమయంలో మనం ఏది చేసినా, చూసినా, విన్నా, రాసినా, పాడినా, గీసినా అది సంపూర్ణంగా వుంటుంది. ఆ సంపూర్ణత్వం జీవితానికి ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఆ స్థితిలో మనలో ఒక విధమైన పరిణామం కలుగుతుంది. అదే నిజమైన మార్పు. అదే జీవితంలో గొప్ప విప్లవం. అదే నూతన సృష్టికి ఆరంభం. ఆ సమయంలో అంతా కొత్తగా, గొప్పగా దర్శనమిస్తుంది. గతంలో ఉపేక్షచేసి, నిరాకరించి, అలక్ష్యంచేసినవన్నీ; సజీవంగా, చైతన్యవంతంగా, తేజోమయంగా, మెచ్చుకోతగ్గవిగా, ఆశ్చర్యకరమైనవిగా దర్శనమిస్తాయి. అదే అసలు జీవితం. ఆ జీవితంలో గాబరాలు, కలతలు, వేదనలు, ఆందోళనలు అన్నీ పోయి, ఆనందంగా వుంటాం.

"సత్యం" సజీవమైనది, శాశ్వతమైనది. అది అన్ని కాలాల్లో, అంతటా ఒకే విధంగా విస్తరించి వుంది. అంటే, "సత్యం," హద్దులూ, అవధులూ లేకుండా వుంది. అటువంటి సత్యాన్ని వివరించి, వ్యాఖ్యానించి, వర్ణించి చెప్పడం శక్యం కాదు చెప్పామా, అది సత్యం కాకుండా పోతుంది.

సత్యం, ఒక శక్తి రూపంలో వుండి, మనం సిద్ధి పొందేందుకు ప్రేరేపిస్తుంది. కాని, అది మన ఆలోచనల, అన్వేషణల చివరలో లేదు. అది అశాశ్వతమైనవాటికి అతీతంగా, అత్యున్నతంగా వుండటం వలన ఒకదాన్ని ఎంచి, "ఇదీ సత్యం" అని దేన్నీ ఖచ్చితంగా, స్పష్టంగా, నిశ్చయంగా చెప్పవీలుకాదు.

సత్యానికి మతంలేదు, గురువు లేడు. దానికి మార్గమూ లేదు. దాని దగ్గరకు, తీసుకుపోయేవారూ లేరు. దానికి పక్షాలూ, భాగాలూ లేవు. ఒక మార్గాన పడిపోయేవాడు ఎప్పటికీ సత్యాన్ని తెలుసుకోలేడు. సత్యాన్వేషణలో ఒకరు శిష్యులు కావడం, సత్యాన్ని తప్పు మార్గంలో పెట్టడమే అవుతుంది. సత్యాన్వేషణకు గొప్ప ఆలోచనా శక్తి, క్రమశిక్షణా, ఆత్మపరీక్ష, ఆత్మనిష్ట, ఆత్మవిమర్శ, ఆత్మనిగ్రహం అవసరం. అంటే, అంతర్ముఖులై తమను తాము స్వానుభవంతో తెలుసుకున్నవారే సత్యాన్ని దర్శించగలరు. ఆ మార్గాన నడవదలచుకున్నవారిలో దృఢ సంకల్పం, గొప్పనిశ్చయం, పరవశత్వం వుండాలి.

సత్యమెప్పుడూ చైతన్యవంతంగా కదులుతూ, మార్పు చెందుతూ వుంటుంది. అటువంటి సజీవమైన సత్యాన్ని తెలుసుకోవాలన్నా, అందుకోవాలన్నా, అనుసరించాలన్నా ప్రతిక్షణం ఎంతో ఆతృతతో, ఆసక్తితో, శ్రద్ధతో, ఇష్టంతో, నిజాయితీగా ఎదురుచూస్తూ వుండాలి. దానికి అతిచురుకుగా కదిలే మనసూ, సుకుమారమైన హృదయం కావాలిగాని, ఎండి స్థాణువులాగ పడివున్న మనసూ, ముడుచుకుపోయిన హృదయం ఎప్పటికీ సత్యాన్ని తెలుసుకోలేవు.

మనసు, హృదయం సహజంగా, స్పష్టంగా, స్వచ్ఛంగా వున్నప్పుడు, ముఖ్యం, మనసు గతభారం లేకుండా శూన్యంగా వున్నప్పుడు - వుండేది, సత్యమే!

మనో కల్పన లేనప్పుడు, సత్యం, నీదగ్గరకు వస్తుంది - గాలి వలె, సూర్యోదయం వలె, దాన్ని తీసుకోవడానికి నీ హృదయాన్ని పూర్తిగా, విశాలంగా తెరవాలి.

సత్యం ఎప్పుడూ ఒకే మాదిరిగా వుండదు. క్షణ, క్షణానికీ మారుతూ వుంటుంది. అది ఎప్పటికీ నూతన మైనది. కాలాతీత మైనది. నిన్నటి సత్యం, ఈనాడు సత్యం కాదు. ఈనాటి సత్యం రేపు సత్యం కాదు. సత్య మనేది ఎప్పుడూ ఒకే మాదిరిగా, ఎడతెగకుండా వుండేది కాదు.

సత్యానికి ఒక ఆరాదనాలయ మంటూ లేదు. దానికి దేశం జాతి మతం ప్రజ నమ్మకం సిద్ధాంతం ఏమీలేదు. పవిత్ర పరిశుద్ధ గ్రంథ పరనం భక్తి ఆరాధన ఆత్మత్యాగం మొదలైన వాటి ద్వారా దాన్ని పొందలేము. నమ్మకాల ద్వారా మతాల - మహాత్యాల - మహాత్ముల ద్వారా సత్యం తెలిసేది కాదు. దేవాలయాలను కట్టించినా దేవతలను ప్రతిష్టించినా. రాత్రిం - బవళ్ళు ప్రార్థించినా అనుక్షణం ఆరాధించినా, సర్వ కర్మలూ ఆచరించినా నిరంతరం నామజపం చేసినా సత్యాన్ని తెలునుకోలేము.

సత్యం ఆశ కల్పించదు కాని అవగాహన కలిగిస్తుంది. ఆ అవగాహనా సహాయంతో ఎవరికి వారు స్వానుభవంతో సత్యాన్ని తెలుసుకోవాలి. నిరంతరం తాను అన్వేషించే ఆ పరమ సత్యం, పువ్వులో పరిమళం వలె తనలోనే వుందని అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి.

ఆ విధంగా తెలుసుకోవాలంటే, ప్రతి ఒక్కరూ తమ యెడల తాము గౌరవంగా, మర్యాదగా, నీతిగా, నిజాయితీగా, ధర్మంగా మసలుకోవాలి. తన ఆలోచనలతో, భావాలతో, ఆత్మ విశ్వాసంతో, నిర్మల మనస్సుతో, పవిత్ర హృదయంతో సత్యాన్ని తెలుసుకోవాలి.

మనలోని భయాలన్నీ పోయి, స్వేచ్ఛాపరులమై, అంతర్ముఖులమై అన్నింటినీ ప్రేమతో హృదయానికి హత్తుకుని, సమస్తాన్ని స్వానుభవంతో అవగాహన చేసుకున్న నాడే, సత్యం తెలుస్తుంది. మనలోని కల్మషాలూ, పోగుపడ్డ విషయ వాసనలూ కడిగేసి, శుభ్రం చేసుకున్న తర్వాతే, సత్యసందర్శన మౌతుంది.

మనలో వివేక - విజ్ఞానం, అవగాహనా పటిమ, ప్రేమ, దయ, వాత్సల్యం, కరుణ, వున్నప్పుడే సత్యాన్ని తెలుసుకో గలుగుతాము. అప్పుడే మన సమస్యలూ దుఃఖాలూ అంత మౌతాయి.

మన చుట్టూ వున్న హద్దుల్నీ అడ్డంకుల్నీ అభ్యంత రాల్నీ అవరోధాల్నీ పరిమితుల్ని కూలదోసి స్వేచ్ఛగా, నిర్భ యంగా, సహజంగా వున్నప్పుడూ మనం ఏ మాత్రం ఏదీ వూహించనప్పుడూ, ఆశించ నప్పుడు, ప్రయత్నించనప్పుడు అప్పుడు సత్యం తనంతట తానుగా వచ్చి, జీవితంలో చొరబడు తుంది.

ఈ విశాల విశ్వానికి విడిగా, ప్రత్యేకంగా నిరంతరం "నేను - నేను" అంటున్నదేదో అది తిరిగి తలెత్తకుండా నాశనం అయిన తర్వాతనే సత్యాన్ని తెలుసుకో గలుగుతాము. అంటే మన నిత్య జీవితంలో తటస్థపడే కలిగే, సంభవించే, ఎదురయ్యే దుఃఖం, సంతోషం, బాధ, విచారం, ఆనందం, సుఖం, కోపం

వేదన, మృత్యు భీతి, నిరాశ, హింస, క్రూరత్వం, ఆలోచనలు...
అన్నింటిలో - ప్రతి ఆకు కిందా - ప్రతి చిరునవ్వులో - ప్రతి
కన్నీటి చుక్కలో, భావాల్లో సత్యం వుందని గ్రహించి,
వాటిని అర్థం చేసుకోవడమే, సత్యాన్ని తెలుసుకోవడం. అటు
వంటి సత్యాన్ని దర్శించాలంటే, వాటిని కప్పిన, లేదా, వాటిని
మూసిన గట్టి పెంకును బద్దలు కొట్టాలి. ముూత తెరవడమే,
సత్యాన్ని తెలుసుకోవడం. అన్నింటి అవగాహనే - మూత
తెరవడమే సత్యాన్ని తెలుసుకోవడం. అదే ధ్యానం.

  

జీవితంలో ధ్యాన మనేది ఒక అద్భుతమైన ఆశ్చర్య
కరమైన సంగతి. అటువంటి ధ్యానం గురించి ఏమీ తెలుసుకో
కుండా ఒక మాటనో - ఒక భావాన్నో - ఒక ఆలోచననో - ఒక
ఆదర్శాన్నో - ఒక రూపాన్నో పట్టుకుని దానిమీద మనసును
బలవంతంగా దీర్ఘకాలం నిలపడం ధ్యానంకాదు. అటువంటి
ధ్యానం ఎన్నాళ్ళు చేసినా ఏమీ రాదు. ఆ ధ్యానానికి ఎటువంటి
విలువా లేదు.

ధ్యానమంటే అన్వేషణ - ఏకాగ్రత - క్రమ-శిక్షణ — భక్తి -
విచారణ - నామజపం — శల్య పరీక్ష - మెదడును మచ్చిక
చేసుకోవడం ఏదీ కాదు. అసలు ఇవేవీ ధ్యానం కాదు. ధ్యాన
మనేది అన్నింటికీ భిన్నమైన సంగతి.

ఏకాగ్రతలో" తెలుసుకునే వాడు తెలుసుకోబడేది- చూసే
వాడు చూడబడేది—అనుభవించేవాడు అనుభవింప బడేదీ" అనే
ద్వంద్వం వుంటుంది. అటువంటి విభాగంతో కూడిన ఏకాగ్రత
క్రమంగా బహిష్కరణ విధానానికి దారితీస్తుంది. ఏకాగ్రత అంటే
ఆలోచనలకూ మెదడులోని కణాల సహజమైన కదలికలకు అడ్డుగా

ఎదురుగా గట్టి రాతి గోడ కట్టడం. అలాగే భక్తీ, ప్రార్థన, విశ్వాసం నిరంతర నామజపం ఏ ఒక్కటీ ధ్యానం కాదు.

ధ్యానమంటే, తనను తాను తెలుసుకునే విధానమే కాని, ఒక ఆలోచనావిధానం కాదు. ఆలోచనల్ని అదుపులో పెట్టడమూ కాదు. ఆలోచనల్ని అవగాహన చేసుకోవడం. ధ్యానమంటే ప్రతి ఆలోచనకీ, ప్రతి భావానికీ ప్రతి అనుభవానికి సదా ఎరుకలో వుండటం. "ఇది మంచి ఇది చెడు," అని దేన్నీ ఎప్పుడూ, ఎందుకూ ఎంచకుండా, సముద్రం ఒడ్డున కూర్చుని కెరటాల్ని గమనించినట్లు; ప్రతిదాన్నీ పూర్తి శ్రద్ధా-సక్తులతో గమనించడమే ధ్యానం కాని, వాటిని సరిదిద్దుకుంటూ, చక్కబెట్టుకుంటూ కూర్చోవడం ఏమాత్రం ధ్యానంకాదు. ధ్యానానికి పద్ధతులు, రీతులు, విధానాలు, నియమాలు, క్రమాలు, మార్గాలు, సూత్రాలు ఉపయోగిస్తే, మనసు యాంత్రికంగా పనిచేయడానికి అలవాటు పడుతుంది. చివరికి అదంతా మనసును మోసపుచ్చడమే అవుతుంది.

ధ్యాన మంటే, అనంతమైన కదలిక. ఆ కదలికకు ఆగడమంటూ లేదు. వుండదు.అది ఎప్పటికీ ధ్యానించేవాని అధీనంలో వుండదు. మామూలు సంఘనీతినీ, ఏళ్ళతరబడి ఏర్పడి వున్న విలువల్నీ కాదని, నిరాకరించగా ఏర్పడ్డ స్వేచ్ఛ, ధ్యానంలోని మొదటి కదలిక. నమ్మకాలతో, సిద్ధాంతాలతో బతికేవారు దాని పొలిమేరలోనికైనా పోలేరు. ఎందుకంటే, ధ్యానానికి స్వేచ్ఛ ముఖ్యం.

ధ్యాన మంటే, ఒక విధమైన మానసికావస్థ అది ఒక అద్భుతమైన సంగతి ఆ స్థితిలో అన్నింటికీ కేంద్రమైన ఆలోచన ఆగిపోతుంది. దృశ్యాల్ని, సంగతుల్ని ఏర్పరచి, మనల్ని హద్దుల్లో, నియమాల్లో వుంచి. ఎ.నం ఇంకా, ఇంకా బాధల్లో,

బంధాల్లో ఇరుక్కోకుండా స్వేచ్ఛగా వుండేందుకు ఆ స్థితిలో ఆలోచనలు ఆగిపోతాయి.

ధ్యాన మంటే, శబ్దరహిత నాదం. మాట ఆగి, మౌనం ఏర్పడ్డ ప్రశాంత స్థితి. ఆ మౌనంలోని సత్యవంతమైన, నిజాయితీ అయిన, నీతివంతమైన కదలికే ధ్యానం. సెక్స్‌తో గాని, మరి ఏ ఆనందంతో గాని, ధనంతో గాని, ఆలోచనతోగాని అందుకో లేని ఆవరణలోకి - మనసు సైతం ఏమాత్రం ఆక్రమించి ప్రవే శించలేని శూన్యంలోకి ఏ క్షణానికాక్షణం ప్రవేశించడమే ధ్యానం. ఆ సమయంలో నిశ్శబ్దం ఒక్కటే ఆవరించి వుంటుంది. ఆ నిశ్శబ్దంలోని కదలికే ధ్యానం అప్పుడు కలిగే అనుభవం కొత్తది. ఆ నూతన అనుభవాన్ని మాటల్లో వర్ణించడం కష్టం.

ధ్యానమంటే, లోకపరంగా దేనితోనూ, ఏవిధమైన ఒడం బడికా కాదు, అనుకరణా కాదు, విధేయతా కాదు. అది నిత్య జీవిత యావత్ కర్మకాండ. అనుక్షణం ఆరకుండా రగిలే జ్వాల. ఆది-అంతాలు లేని కఠోరదీక్ష. అత్యున్నతమైన క్రమశిక్షణ. లోపలా-బైటా విషయాలకు నిరంతర ఎరుకే, ధ్యానం.

విడచిన బాణంవలె, ధ్యానం అగోచరంలోకి చొచ్చుకు పోతుంది. తుఫానులాగ వచ్చి, సమస్తాన్ని తుడిచిపెట్టి, శుభ్రం చేస్తుంది. మనం ఎక్కడవున్నా అడవిలోవున్నా, కొండమీద కూర్చున్నా, బస్సులో ప్రయాణం చేస్తున్నా, జనం మధ్య వున్నా - మన చుట్టూ ఎంత రద్దీ వున్నా ఆ ధ్యానం ఆగదు. ఎందుకంటే, ఆ స్థితిలో మనసు గతానికంతకూ పూర్తి ఖాళీ అవు తుంది, ఏ మరకా లేకుండా. ఇంక వుండేది ధ్యానమొక్కటే.

విశాల విశ్వానికి హృదయం పూర్తిగా తెరచుకున్నప్పుడే, ధ్యానం కుదురుతుంది. ఆ హృదయ కవాటాన్ని ఆలోచన తాళంచెవితో కాదు, ప్రేమభావంతో తెరవాలి. ఆలోచనవల్ల

కలిగే మోసాల, వంచనల, దగాల, అసత్యాలనుంచి మనసును విముక్తి పరచేది, ధ్యానమొక్కటే. అందుచేత బంధాలకు దారితీసే ఆలోచనలకూ, భావాలకూ, భ్రమలకూ ధ్యానంలో తావులేదు. కాని, ధ్యానం ద్వారానే వాటినుంచి విముక్తి కలుగు తుంది.

ధ్యానం చేస్తున్నామంటే, సమస్త విశ్వానికీ తలుపు తెరిచామన్న మాట. అందుచేత ధ్యానం గతానికి అంతకూ పూర్తి ఖాళీయై అపారమైన విస్తీర్ణాన్ని ఆక్రమించుకుంటుంది. అప్పుడే దేనినైనా తెలుసుకోగలుగుతాము. ఆ తెలిసిందేదో అది, అంతకు ముందు మనకు తెలిసినది కాదు. అది ఒక నూతనానుభవం. అది ఒక నవవికసిత పుష్పం.

బాహ్య జీవితాన్నీ, అంతరాత్మనూ కలిపే కొక్కెమే, ధ్యానం. సర్వశక్తుల సమ్మేళనమే, ధ్యానం. ధ్యానమంటే, విశాల విశ్వంలో జరిగే సంగతి కనుక, అందు అద్దంలో మాదిరి సమస్తం అవగతమౌతుంది. ధ్యానంలో రహస్యానికీ, భయానికీ తావులేదు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఒక్క చూపుతో సమస్త విశ్వాన్నీ అవగాహన చేసుకోవడమే, అవలోకించడమే, ధ్యానం క్షణ క్షణం జీవితాన్ని అవగాహన చేసుకోవడం ధ్యానం. అదే నిత్య జీవితంలో ముఖ్యమైన సంగతి. అదే జీవనసారం. అటువంటి ధ్యానం జరక్కపోతే, సౌందర్యవంతం, తేజోమయం అయిన ఈ భూమిమీద మనిషి అంధుడువలె వుంటాడు.

ధ్యానం ప్రతి ఒక్కరికీ సాధ్యమే. ఎవరికి వారు, ఎప్పటికప్పుడు సమస్త విశ్వంతో పాటు తమను తాము అర్థం చేసుకోవడమే నిజమైన ధ్యానం. కిటికీ తెరచి నప్పుడు లోపలికి చొరబడి వచ్చేగాలి వంటిది, ధ్యానం. జీవితంలో ధ్యాన మనేది

జరక్కపోతే, ముఖ్యం, హృదయం ఎడారిగా మారి, బీడు వారిన భూమిగా మిగిలిపోతుంది.

ధ్యానమనేది ఒక కళ. కళలన్నింటిలోకీ గొప్ప కళ. ఎవరికి వారు అభ్యసించవలసిన కళ. అది ఒకరికి మరొకరు నేర్పే విద్య కాదు. బోధించే సంగతి కాదు. ఎవరికి వారు స్వయంగా నేర్చుకోవలసిన, తెలుసుకోవలసిన కళ.

అటువంటి ధ్యానంలో ధ్యానించే వానికి చోటులేదు. ఆ ధ్యానంలో అతడు ముఖ్యమూ కాదు. అందులోని అంధం, అతడు కాదు, ధ్యానంలో ధ్యానమే అందం. ధ్యానం చేయక పోతే, జీవితానికి ప్రేమ, అందం లేవు.



అందమనేది వస్తువులలో, ప్రదేశంలో, కాలంలో, విషయంలో, భావనలో లేదు. మనం చూసే దృష్టిలో, మనం చేసే పనుల్లో, మన సహజత్వంలో, సరళత్వంలో, నిష్కాపట్యంలో, మనో స్పష్టతలో, హృదయ విశాలత్వంలో వుందికని, వస్త్రధారణలో, తిండిలో, బావాల్లో లేదు. అసలు అందమంతా నిజమైన వినయంలో, నమ్రతలో, అణకువలో వుంది. జీవితంలో ఒక క్రమమే, అందం. ప్రేమే, అందం.

విశ్వమంతా సౌందర్యమయం. కాని, మనిషి స్వయం కల్పిత వ్యాపకాలతో దాన్నించి తప్పించుకుని, తిరుగుతాడు. ఒక వేళ పొరపాటున విశ్వ సౌందర్యాన్ని చూడ్డం తటస్థపడితే, దాన్ని తదేకంగా చూస్తూ నిలవడం వల్ల తన అమూల్య కాలం వృధా అయిందనుకుంటాడు. లేదా, తన నిత్యజీవిత కార్యక్రమానికి అంతరాయం ఏర్పడిందనుకుంటాడు. కాకపోతే, దాన్నించి సుఖాన్నో, లాభాన్నో, తృప్తినో కోరతాడు. అదీ మనిషి స్వభావం.

విశ్వ సౌందర్యాన్ని చూస్తూ వుండగానే అతనిలో అలవాటు ప్రకారం ఆలోచనలు పుట్టుకొస్తాయి. అందమైన ఆ దృశ్యాన్నో, సంగతినో, సంగీతాన్నో ఆనందంగా మార్చి, అనుభవించ నారంభిస్తుంది, అతని మనసు. అంతేకాదు, ఆ అనుభవాన్ని రేపు, ఎల్లుండి, ఎప్పటికీ అనుభవించాలనే కోరిక కలుగుతుంది. ఆ కోర్కె, బంధం.

ఆకులమీద పడే కాంతినీ, చెట్ల నీడల్ని, కొండగాలినీ, పక్షుల అరుపుల్నీ, పువ్వుల - పిల్లల - మబ్బుల నాజూకు తనాన్ని, ఏటినీటి గలగలల్నీ, సూర్యాస్తమయ శోభనీ దర్శించకుండా, ఏదీ వినకుండా అందానికి అంధులై అసలు జీవితానికే అనాసక్తులౌతున్నారు.



ఈనాడు మన నిత్య జీవితాన్ని వివేకంతో చూసుకుంటే, అందులో అందం లేదు, ప్రేమ లేదు, స్వేచ్ఛలేదు, ఆనందం లేదు, శాంతి లేదు - అసలు ఏమీ లేదు. అది వుత్తమోడు జీవితంగా, ఎడారి బ్రతుకుగా వుంది. గొడ్డుబారిన అటువంటి జీవితం సంగతి తలచుకున్నా, తెలుసుకున్నా మనం కన్నీళ్ళు కారుస్తాం. మనమెంత దౌర్భాగ్యులమో, దుఃఖితులమో, యాంత్రికులమో తెలుసుకుంటాం.

జీవితంలో ప్రేమవుంది. కాని, ప్రేమంటే ఏమిటో నీకు తెలుసా? నువ్వు అనుకునేది, నీకు తెలుసు ననుకునేది ప్రేమ కాదు. కాని, దానికి ఒక ఉద్దేశ్యం, అభిప్రాయం లేదు. ధానికి హద్ధులు, అవధులు లేవు. అది కాలాతీతమైనధి. అది బలీయంగా గాడంగా, ప్రబలంగా, ధృఢంగా, శక్తివంతంగా, తీక్షణంగా, సత్తువగా వుంది.

ప్రేమంటే, సమస్తానికి సదా ఎరుకలో వుండటం. మధుర మైనదిగా, మృదువైనదిగా, సునిశితంగా అన్నింటి యందూ, అన్ని వేళలా దయగా, ధర్మంగా, నీతివంతంగా, సత్యంగా, సన్మార్గంతో, సౌశీల్యంతో వుండటం. అటువంటి ప్రేమను తెలుసుకో గలమా ? దాన్ని సాదించ గలమా ? దాన్ని ప్రయత్నించి తెచ్చుకోవాలని చూడ్డమే, డానికి మొదటి ప్రతిబంధకం. అదే దానికి పెద్ద అవరోధం.

ప్రేమంటే, గ్రంధాలు, గురువులు, మతాలు, తల్లి - తండ్రులు, సంఘం, మిత్రులు చెప్పినప్పటికీ ఎవరికి వారు స్వయంగా తెలుసుకోవాలి. అప్పుడు ఎవరినీ దేనినీ దేనికీ అనుసరించరు.

ప్రేమ, మాట కాదు. ప్రేమ గురించి రాసినా, మాట్లాడినా యోచించినా అది ప్రేమ కాదు. ప్రేమ, అనుభవం కాదు. అది మానసికమూ కాదు. అభ్యాసం, శిక్షణవల్ల వచ్చేది ప్రేమకాదు. దయ, క్షమ, ప్రేమ కాదు. ప్రేమ గీతం, ప్రేమ కాదు. భయం, ప్రేమ కాదు. ఒకరిపై, ఒకదానిపై ఆధారపడి వుండటం, ప్రేమ కాదు. ధర్మం, బాధ్యత కూడా ప్రేమ కాదు. భక్తి, ఆవేశం ప్రేమ కాదు.

" ప్రేమ " అనే పదాన్ని కసాయివాడు వాడతాడు, ఐశ్వర్యవంతుడూ వాడతాడు. ఆ మాటని యువతీ - యువకులు ఉపయోగిస్తారు. దాని అసలు అర్ధం ఎందరికి తెలుసు ? దాని అగాధం, అమరత్వం, అపారత్వం తెలిసిన వారెందరు ?

మీరు అనే, అనుకునే " ప్రేమ " కేవలం ప్రేరణ మాత్రమే. అది మీ శూన్యాన్ని కప్పే తాత్కాలిక మైనది మాత్రమే. మీరు ఒంటరితనం నుంచి తప్పించుకుని పారిపోవడానికి సంఘం, వ్యక్తి, సంస్థ, దైవం ఏదైనాసరే, అదే మిమ్మల్ని మూసే మూత.

ప్రేమ, మానసికం కాదు. దానికి అంతస్థులు, వర్గాలు, జాతులు లేవు. ప్రేమకు శత్రుత్వం లేదు.

మనసు పనిచేస్తున్నంతకాలం, ప్రేమ లేదు. అంటే ఆలోచన ఆగిన స్థితి, ప్రేమ. అది సహజస్థితి. అది వర్తమానం లోనే వుంటుంది. మానసికమైనది హృదయాన్ని నింపనప్పుడు వుండేది ప్రేమ మాత్రమే. మనసు నిర్మలంగా, నిశ్చలంగా వున్నప్పుడూ, హృదయం విశాలమైనప్పుడూ ప్రేమ వికసిస్తుంది. దాని పరిమళం జీవితాన్ని నింపుతుంది.

కాని మనచుట్టూ నిత్యం ఊపిరిసలపకుండా పొగ దట్టంగా కమ్మి వుంటుంది. ఆ పొగలోంచి అప్పుడప్పుడూ మంట కని పిస్తుంది. పొగ దట్టమైతే, మంట మరుగున పడుతుంది. నల్లని పొగలో ప్రేమ వుండలేదు. పొగా-మంటా రెండూ ఒకేసారి వుండటం అసాధ్యం, అసంభవం. పొగ, మంట కాదు. పొగలో మంట వుండదు. పొగ. మంట రావడానికి గుర్తూ కాదు. మంట, పొగనుంచి స్వేచ్ఛగా వుంటుంది. పొగలేని జ్వాలే, ప్రేమ. మనమే పొగ. నిప్పుని నిదానంగా రాజుకోనివ్వాలి. చివరికి అది రగిలి మండుతుంది. ప్రేమాగ్ని లేనిది, జీవితానికి అర్థం లేదు. అది మందకొడిగా, భారంగా వుంటుంది.

ప్రేమ, భయంకరమైనది. మానవునిలో పరిణామం కలి గించి, పూర్తి ఆనందాన్ని ఇచ్చేది ప్రేమ ఒక్కటే. ప్రేమ వుంటే, అన్నీ వుంటాయి. అన్ని సమస్యలూ పరిష్కార మౌతాయి. అన్ని సంబంధాలూ అవగాహన అవుతాయి. అంతా అందంగా దర్శనమిస్తుంది.

ప్రేమ, ఇచ్చే కొద్దీ పెరుగుతుంది.



జీవితంలో చూడ్డం, వినడం రెండూ ముఖ్యమైన విష యాలు. వినడం, ఒక కళ. కళ లన్నింటిలోకీ గొప్పకళ. అపూర్వ మైనకళ. వినూత్నమైన కళ. కాలాతీతమైనకళ. జీవితంలో వినడ మనేది ఒక అందమైన, అపురూపమైన సంగతి. వినేదాన్ని అర్థం చేసుకుంటూ అందులో లీనమై వినడం మరీ గొప్ప సంగతి.

మనం దేనినైనాసరే ఒకకోణం నుంచే వింటాం. వింటూ ఒకోక్కసారి సంతోషిస్తాం. ఒక్కొక్కసారి వినోదిస్తాం. ఒక్కొక్క సారి నిరాకరించి తోసేస్తాం. ఒక్కొక్కసారి ఆశతో అతృతతో వింటాం. ఎందుకంటే, వినేటప్పుడు మన స్వంత అభిప్రాయాలూ, పర్యవసానాలూ, ఆలోచనలూ, దురబిమానాలు, పక్షపాతాలూ మొదలైనవి ఒక తెరగా అడ్డుపడతాయి; మనం వింటున్న దాన్ని సరిగ్గా, శ్రద్ధగా, పూర్తిగా, నిజంగా విననీయకుండా. నిజం చెప్పాలంటే, మనం చాలా వరకు ఆ తెరవెనుక నుంచే వింటాం. అది వినడం కాదు.

వినడం, రెండు రకాలు. వినిపించే శబ్దాలకు ఏ ప్రాము ఖ్యతా ఇవ్వకుండా వూరికే వినడం, ఒకటి. రెండవది, వినేవాటి లోతుపాతుల్ని, అర్థాల్ని, గ్రహిస్తో, దానిచుట్టూ ఏర్పడి వున్న వాటి అన్నింటికీ పూర్తి ఎరుకలో వుండి, అవగాహన చేసుకుంటూ వినడం, రెండోదానికి చురుకైన, సూక్ష్మమైన మనసు కావాలి.

అసలు ఏది వినడానికీ మొదట మనలో శాంతి వుండాలి. మనసు స్వేచ్ఛగా, నిర్మలంగా వుండాలి. శ్రద్ధగా, నిజంగా వినాలనే ఆసక్తి వుండాలి. వినే ముందు మనలో భయం, భారం, భావం వుండకూడదు. అలాగే అలసటలు, కోపాలు, తాపాలు, కోర్కెలు, గొడవలు, నమ్మకాలు, సంశయాలు, నిశ్చయాలు, నిర్ణయాలు - చివరికి నిత్యకార్యకలాపాలు - ఏవీ వుండకూడదు. వాటినన్నింటినీ దూరంగా పెట్టాలి. వినితీరాలనే బలవంతం,

ఆశతో కూడిన పట్టుదల, ప్రయత్నం, ఉద్దేశ్యం, అభిప్రాయం, కారణం ఏమీ వుండకూడదు. ఇంటి తలుపులు తెరచినట్లు హృదయ కవాటాన్ని తెంచి వినాలి. అప్పుడే విన్నది అవగాహన అవుతుంది. మన శక్తి, సామర్థ్యాల్ని బట్టి వినేదాంట్లోని లోతు పాతులు తెలుస్తాయి. చాలామందికి అసలు వినడమనే పనే వుండదు.

వినడానికి ప్రయత్నించడమే, మనసును చెదరగొట్టడం, కలవరపరచడం. ప్రయత్నమే ఒక విధమైన బలవంతంగా తయారై అనేక సమస్యల్ని రేపుతుంది. చివరికి ఆ ప్రయత్నమే, ఒక సమస్య అవుతుంది. అంటే, ఒక వాస్తవంమీద నిలిచి పనిచెయ్యాలనే ప్రయత్నమే, సమస్యలు ఉత్పన్నం కావడానికి మూలకారణం. మనం చేసే ప్రయత్నం, మనం చూపే భేదభావం, న్యాయాన్యాయ నిర్ణయం, ఇచ్చే తీర్పు, విధించే శిక్ష-మొదలైన వాటితో మనసు నిండి వున్నంతకాలం, మనం దేన్నీ సరిగ్గా, పూర్తిగా వినలేము. సరిగ్గా వినేందుకై కొంత కాలాన్నీ, ఎంతో ఏకాగ్రతనూ, ఏదో ఒక విధమైన సాధనా మార్గాన్నీ, దాన్నించి ఫలితాన్నీ కోరతాం. కాని, నిరంతరం ఏదో ఒకటి మన చెవిని పడుతూనే వుంటుంది. కాని, మనం చూపే శ్రద్ధా, ఆసక్తి మరో దానిపై వుంటుంది. అంటే, మనం వినదలచుకున్నదాన్ని మన స్వయం కల్పిత రొదతో కలిపి వింటాం.

కాని, పూర్తి శ్రద్ధతో, ఆసక్తితో నిజంగా వినడం, మనసును మౌనంలోకీ, నిశ్శబ్దంలోకీ, నిశ్చలత్వంలోకీ తీసుకుపోతుంది. ఆ విధంగా కేంద్రీకరించబడ్డ శ్రద్ధ మామూలుగా కలిగే బాధల, ఇబ్బందులనుంచి, విముక్తి పడుస్తుంది. అది మనసును స్వేచ్ఛపరచి, అన్ని వ్యాఖ్యానాలను తొలగిస్తుంది. నిజంగా,

శ్రద్ధగా వినడమే మనలో ఏకత్వాన్ని, సంపూర్ణత్వాన్ని కలిగిస్తుంది.

వినడమనేది ఒక సంపూర్ణ కర్మ. అది స్వేచ్ఛనిస్తుంది. కాని, అనేక సంగతులతో నిండివున్న మనసు, ఎప్పుడూ దేన్నీ స్థిరంగా విననీయదు. ఎందుకంటే, దాని స్వయంకల్పిత పోరాటాల, బాధల, దుఃఖాల, భయాలవల్ల. అందుచేత "ఏదో కావాలి. ఇంకేదోగా మారాలి," అనే ప్రయత్నాలేమీ చేయకుండా వినే సమయంలో వూరికే వుండి, వినాలి. ఆ వినడంలో ఒక అనుభవాన్ని అందుకోవాలనో, ఆనందాన్ని పొందాలనో ఆశించకూడదు, ప్రయత్నించకూడదు. కాని, అన్నింటికీ ఎరుకలో వుండి వినాలి. అదే నిజమైన వినడం. కాని, గతజ్ఞానం, మనం వినేదాన్ని నిజంగా, శ్రద్ధగా, పూర్తిగా విననివ్వదు.

వినడంలో ఎరుక వుండాలి. అంటే, వినబడే మాటలకు శబ్దాలకే కాక, ఇంకా మన చుట్టూ వినుపించే సమస్త శబ్దాలకు కాకి అరుపులకూ, రైలు కూతలకూ, పిల్లల ఏడ్పులకూ - అన్నింటికీ అంటే, ఏ ఒక్క శబ్దాన్నీ విడవకుండా, దేన్నీ తోసిపుచ్చకుండా అన్నింటినీ వినడం. వినడమేకాదు, వాటికి ఆలంబనమైన రూపాలతో, దృశ్యాలతో, సంగతులతో కలసి వినడం. అదే, అసలు వినడం. అదే, ఎరుక. అప్పుడే మనసు నిర్మలంగా, నిశ్చలంగా వుండి, వర్తమానంలో నిలిచి వింటుంది.

ఆ క్షణాన దృష్టిని లోనికి మరల్చి, ఏం జరుగుతోందో గమనించాలి. సముద్రంలో అనంతంగా కదిలే తరంగాల మాదిరిగా క్షణాలు కదులుతాయి. నిరంతరం మారుతూ, కదులుతూ వుండే ''నేను'' ఆ కాల తరంగాలపై తేలి, వర్తమానంలో నిలిచి, ప్రతిదాన్ని గమనిస్తుంది. ఆక్షణంలో "నేను" అనేది ప్రత్యేకంగా, విడిగా వుండక అన్నింటి సంబంధంతో సఖ్యతగా వుంటుంది.

ఆ స్థితిలో మనలో ఒక విధమైన పరిణామం కలుగుతుంది. అదే నిజమైన మార్పు. అదే జీవితంలో గొప్ప విప్లవం. అదే నూతన సృష్టికి ఆరంభం. ఆ సమయంలో మనం వినేదీ, చేసేదీ అంతా కొత్తగా దర్శన మిస్తుంది. గతంలో ఉపేక్షించి, నిరాకరించి, అలక్ష్యం చేసినవన్నీ, ఆ స్థితిలో సజీవంగా, చైతన్యవంతంగా, తేజోమయంగా, మెచ్చుకో తగ్గవిగా ఆశ్చర్యకరమైనవిగా కనుపిస్తాయి, వినుపిస్తాయి, అనిపిస్తాయి. అదే అసలు జీవితం. ఆ జీవితంలో గాబరాలు, కలతలు, వేదనలు, ఆందోళనలు అన్నీ పోయి, ఆనందంగా వుంటాం. ప్రతిదాన్ని నిజంగా, శ్రద్ధగా, సరిగ్గా, సంపూర్ణంగా విని, అవగాహన చేసుకుంటూ దాంట్లో లీనమై పోతాం.



చూడ్డం కూడా వినడమంత ముఖ్యమైన సంగతి. విచారాలతో, వ్యాకులతలతో చింతలతో, తొందర్లతో కళ్ళు గ్రుడ్డివైతే, ప్రకృతిసౌందర్యాన్ని చూడలేము. మనిషికి సౌందర్యదృష్టి కన్నా, మేధస్సును అభివృద్ధి పరచుకునే యత్నంలో గ్రంథాల్ని తిరగెయ్యడం; వింతలు, వినోదాలు చూడ్డం; ఇతరుల అభిప్రాయాల్ని - ఆదర్శాల్ని - ఉద్దేశ్యాల్ని - భావాల్ని వల్లించి చిలక మల్లె పలకడం; తెలియకపోయినా కళ గురించో, మరి దేనిగురించో ఎంతో మాట్లాడటం, అనేక జటిల సమస్యల గురించి ఆలోచించి, రాత్రింబవళ్ళు దీర్ఘంగా చర్చించడం ఇష్టం,

కాని, చాలామంది నీలాకాశంలో రెక్కలాడిస్తూ ఎగిరే పిట్టల్ని, క్షణ క్షణానికీ రంగులూ, రూపాలూ మారుతో ఆకాశంలో అడ్డంగా కదిలిపోయే మబ్బుల్ని, కొండపై పడే వెలుగు-నీడల్ని.

ఇతరుల ముఖాలలోని అందాల్ని, విస్మరించి, అల్ప విషయాల వెనకపడి నిస్సార జీవితం గడుపుతారు.

మనం ఒకదాన్ని చూడగానే ప్రయత్నపూర్వకంగానో, అప్రయత్నంగానో దానికీ - మనకూ మధ్య సహజంగా ఒక విధమైన సంబంధం ఏర్పడుతుంది. వెంటనే దాని పరంగా మనలో ఆలోచనలు రేగుతాయి. దాని విషయమై కోర్కెలు కలుగుతాయి చివరికి అదంతా సంతోషంగాగానో, భయంకరంగానో మారుతుంది.

అటువంటి సంబంధాలన్నీ మన మనోకల్పితాలే : అవన్నీ మన ఆలోచన చేత ఆకార మేర్పడ్డ రూపాలు. మాటచేత కూర్చబడ్డ నామాలు - తల్లి - తండ్రి - భార్య - భర్త - పిల్లలు - సంఘం - కుటుంబం - పొరుగు - దేవతలు - గురువులు - బోధకులు - ఉపదేశకులు - ప్రవక్తలు - దేశాలు - నాయకులు - సంరక్షకులు మొదలైన వన్నీ చిత్త చిత్రాలు, అన్న సంగతి అనుభవపూర్వకంగా తెలుసుకునేందుకు, మనలో ఆసక్తి, శ్రద్ధ వుండాలి.

" మనం ఒకదాన్ని చూస్తున్నామంటే, అది నిజంగా మనకు విడిగా వున్న ఒకదాన్ని చూస్తున్నామా ? లేక, మన మనసు కల్పించిన, మాట ఏర్పరచిన రూపాన్ని చూస్తున్నామా? లేక, అలవాటు ప్రకారం మన ప్రజ్ఞతో చూస్తున్నామా ? ఆ చూసేదాన్ని సంపూర్ణంగా చూస్తున్నామా ? లేదా ? " అనే విషయాల్ని ఎవరికి వారు ముందు స్పష్టం చేసుకోవాలి.

మనం ఒకదాన్ని చూస్తుంటే, మన మనసు తన తోవను తాను ఇష్టంవచ్చినట్లు తిరుగుతుంది- అదీ తనకు తెలిసిన విషయ పరిధిలో. కాని, ఆ సమయంలో మనసులో జ్ఞాపకాలు, వివరణలు,

స్మరణలు, అర్థాలు వ్యాఖ్యానాలు, చూస్తున్నామనే సంతోషాలు, ఆ చూడ్డంవల్ల కలిగే సుఖానుభవం - ఇన్ని వుంటాయి. అయినా మనం చూసేదాన్ని మన మనసు తీసుకోవచ్చు, తోసెయ్య వచ్చు. అది దాని ఇష్టం. కాని, మనసు దేన్నీ తీసుకోకుండా తటస్థంగా వున్నప్పుడే. మనం దేనినైనా శ్రద్ధగా పరిశీలించ వచ్చు. అదే సంపూర్ణమైన, ఉత్తమమైన పరిశోధన. అది జీవితంలో ఒక కొత్త విషయం.

పూర్తి శ్రద్ధతో, ఎంతో ఆసక్తితో దేన్ని పరిశీలనాదృష్టితో చూసినా,దానితోపాటు దానిచుట్టు వున్నదాన్నంతా శక్తిఅంతటితో ఒకేసారి చూడ్డానికి ప్రయత్నించాలి. అప్పుడు దానికి సంబం ధించినంతవరకు మనలో గతంలో పాతుకుపోయిన పాత సిద్ధాం తాలు కాని, సూత్రాలుకాని, ఇష్టాయిష్టాలుకాని ఏమీ జ్ఞాపకం రావడానికి, అవకాశం వుండదు. అలాగే ఆ చూడ్డంలో కోరికా, సుఖం, సంతోషం ఏమీ వుండవు. అందు కర్తా వుండడు. మనం దేన్ని చూస్తున్నామో, అదీ, మనమూ ఐక్యమైపోతాం. ఆ కేంద్రీకృత దృష్టిలో వుండేది శ్రద్ధ ఒక్కటే. అదే ధ్యానం. ఆ సమయంలో మనసు పూర్తి నిశ్చలంగా, నిశ్శబ్దంగా. నిర్మ లంగా, మౌనంగా, సునిశితంగా. సూక్ష్మబుద్ధితో అసాధారణంగా వుండి, గతించిపోయేవాటికి ఎరుకలో వుంటుంది. ఆ స్థితిని మాటల్లో వర్ణించడం కష్టం. దాన్ని ఎవరికివారు ఎప్పటికప్పుడు స్వానుభవంతో తెలుసుకోవాలి.

ఎందుకంటే, చూసేవాడంటే, ఒక సజీవమైన వ్యక్తి. ఎప్పుడూ కదులుతూ, నిత్యం పరిణామం చెందుతూ వుండే శక్తి. అతడు చూస్తాడు - భావిస్తాడు - ఆలోచిస్తాడు - అనుభ విస్తాడు. తిరిగి వాటినే విమర్శిస్తాడు, నిందిస్తాడు. న్యాయ నిర్ణయం చేస్తాడు, శిక్షిస్తాడు. మళ్ళా అతడే వాటి వెనుకనున్న అసలు సత్యాన్ని తెలుసుకునేందుకు తనకు తాను గట్టి శిక్షణలో పెట్టుకుంటాడు.

దేన్ని తెలుసుకోవాలన్నా మనం దాన్ని పూర్తిగా చివరి వరకూ అనుసరించాలి. అదేవిధంగా మనని మనం తెలుసుకోవాలన్నా, నిరంతరం ఏ అరమరికలూ లేకుండా శ్రద్ధగా, నిజంగా, స్పష్టంగా చూసుకుంటో అనుసరించాలి. ఏ పాత జ్ఞాపకం, సూర్తూ, అనుభవం, అభిప్రాయం, ఆదర్శం. నిర్ణయం, ఉద్దేశ్యం అంటూ ఏమీ లేకుండా పక్షినో, చెట్టునో, మబ్బునో చూసినట్లు చూసుకోవాలి. అదే నిజమైన చూడ్డం. అదే యదార్ధమైన సంబంధం.

మన నమ్మకాల, ఆలోచనల, భావాల, అనుభవాల వంకా అట్లానే చూసుకోవాలి. ఆ చూసుకోవడంలో ఏ కోరికా, ఆలోచనా, ఏ కదలికా లేకుండా వూరికే చూడాలి. మనచుట్టూవున్న వాటి నన్నింటినీ ప్రేమిస్తో, వాటి అందాన్ని అనుభవిస్తో చూడ్డం నేర్చుకోవాలి.

మనని మనం చూసుకునేప్పుడు, మన గురించి మనం సృష్టించుకున్న స్వరూప-స్వభావ బద్ధమైన వ్యక్తిత్వాన్ని కాక, అసలు మనమైన మనని మనం ముఖాముఖి చూసుకోవాలి. ఆ విధంగా తమని తాము చూసుకోవడం ఎవరికీ ఇష్టం వుండదు. పైగా, కష్టం కూడాను. ఆ విధంగా చూసుకోవడం వల్ల, మనలో లేవనుకున్న ఎన్నో గుణాలు, స్వభావాలు బైట పడతాయి. వాటిని చూసుకుని మనని మనం భరించడం దుర్లభమే కాదు, దుర్భరం కూడాను. వాటిని మనవిగా తీసుకోవడం కూడా కష్టమే.

సంధ్యాసమయంలో ఆకాశంలో అడ్డంగా పరచుకున్న నీలం చారల్ని చూడాలని ప్రయత్నించకూడదు. వాటిని వూరికే చూడాలి. వ్యవధి వుంటే, అందమైన ఆ చారల్ని చూస్తో, ఒక చోట కాస్సేపు ప్రశాంతంగా నిశ్చలంగా కూర్చోవాలి. ఆ నిశ్చలతే ముఖ్యం. అప్పుడు మనం ఎన్నడూ కనీ వినీ ఎరుగని అందమైన దృశ్యాన్ని, అపురూపమైన సౌందర్యాన్నీ ఇంకా - ఇంకా ఎన్నో గొప్ప సంగతుల్నీ తెలుసుకుంటాం, ఆ చూడ్డంలో.

ప్రపంచంలో ఎంత నాగరికత ప్రభలినా, మనిషి దేన్ని తాకితే అది-ఆర్థికం, రాజకీయం, మతం, జీవితం, దైవం, ధ్యానం, శాంతి, రక్షణ, స్వాతంత్రం ... ప్రతీదీ ఎందుకు సమస్యగా మారుతోంది ? మనిషికి దేనితో సంబంధం వుంటే, అది ఎందుకు సమస్యగా తయారౌతోంది ? ఆ సంబంధాల్ని సమస్యలుగా మారకుండా మనం ఎందుకు చేసుకోలేకుండా వున్నాం ?

జీవితంలో ఎదురయ్యే సమస్య లన్నింటినీ మనం పూర్తిగా అర్థం చేసుకోవాలంటే, మనం ప్రపంచమంతా తిరగవలసి వుంటుంది. కాని, ఆ ప్రపంచం జాతి - మత - సిద్ధాంతాలతో విభాగమై వుంది. "సాంప్రదాయం, అధికారం" అనే కాడికింద పడి నలుగుతోంది: ప్రపంచం. ఆ విభాగాల మధ్య నిరంతరం సంగ్రామం, సంఘర్షణ జరుగుతోంది. అందుచేత ఎవరు ఏది తలపెట్టినా అది విరుద్ధంగా మారి, చివరికి వ్యర్థమౌతోంది. అందుచేత ప్రజలు తీరని కష్టాలకు, బాధలకు, వ్యధలకు, దుఃఖాలకు గురి అవుతున్నారు.

ఆదిలో ఒక సమస్యవుంటే, దాన్ని పరిష్కరించాలని గట్టిగా ప్రయత్నించి, తీవ్రంగా యోచించేకొద్దీ, దాంట్లోంచి అనేక కొత్త సమస్యలు కుక్కగొడుగుల్లాగ పుట్టుకొస్తాయి. చివరికి అవన్నీ ఒకదానికొకటి ముడిపడతాయి. ఆ సమస్యలన్నీ మనపై విసరబడ్డ ఆయుధాల్లాగ పనిచేసి, మనల్ని బాదిస్తాయి. వెంటనే మనలో ఆలోచనలు రేగుతాయి, ఆ సమస్యల్ని ఎట్లా ఎదుర్కోవాలి ? వాటినుంచి మనం ఎట్లా తప్పించుకుని పారిపోవాలి?" అని. ఆ ఆలోచనల వల్ల సమస్య మరింత జటిలమౌతుంది. అసలు ఆలోచనే ఒక సమస్య.

సమస్య లన్నింటిలోకీ భయంకరంగా-బాదించేవి-ఆకలి, సెక్స్. వాటి విషయంలో ఆ క్షణాన మనమెంత సహజంగా,

ఒక సమన్వయ మార్గాన్ని, ఒక పరిష్కార విధానాన్ని కేంద్రీకృతమైన ఆలోచనలతో ఎట్లానూ యోచిస్తామో, అట్లానే తక్కిన సమస్యల విషయంలోనూ అంత మానసిక వ్యధతోనూ కేంద్రీకృతమైన ఆలోచనలతోనూ యోచించి, అర్థంచేసుకుని వాస్తవ పద్ధతిలో వాటిని పరిష్కరించుకోవాలి. అంతేకాని మన సమస్యల్ని ఎవరో – ప్రభుత్వమో, దైవమో, గురువో - ఒకడు వచ్చి పరిష్కరించాలని నిర్వీర్యులుగా, బాధ్యతారహితంగా ఎదురు చూడకూడదు.

ఏ సమస్యనైనా పరిష్కరించాలనుకున్నప్పుడు మనం బౌద్ధులమనిగాని, కమ్యూనిష్టులమనిగాని, హిందువులమనిగాని-అసలు ఏమనిగాని అనుకోకుండా ఎదురైన సమస్యను సీరియస్‌గా తీసుకుని, దాని వెనకనున్న అసలు సత్యాన్ని ఏ పక్షపాతం, దురభిమానం, ఎటువంటి నిశ్చితాభిప్రాయం, తుది నిర్ణయం అంటూ ఏమీలేకుండా నిష్కర్షగా, నిర్భయంగా పరిశీలనాదృష్టితో చూసి, దాని లోతుల్లోకి వెళ్ళాలేగాని, దాన్ని అణచాలనిగాని, దాన్నించి తప్పించుకోవాలనిగాని చూడకూడదు. మన కోర్కెల్ని పోగుజేసుకున్న అనుభవాల్ని,మన ఆలోచనా పద్ధతినీ దూరంగా వుంచాలి. అలాగే ఎదురైన సమస్యపై విసుగు చెందకూడదు. నిరాశ పడకూడదు. నిస్పృహ చెందకూడదు. ఎందుకంటే, సమస్యను పరిష్కరించాలని చేసే ప్రయత్నమే, దాని లోతుల్లోకి పోయి, అసలు సంగతి వివరంగా తెలుసుకోనీకుండా అడ్డు పడతాయి.

నిత్యం మనచుట్టూ విషపూరిత నాగుల్లాంటి సమస్యలు పడగలెత్తి, బుసలుకొడుతూ వుంటే; వాటిమధ్య నిలబడి పిచ్చి పట్టకుండా బతకాలి. అదీ, ఈ భూమిమీద మానవజీవితం.

సమస్యను నెమ్మదిగా, జాగ్రత్తగా శ్రద్ధగా, నిజంగా పరిశీలించి, అవగాహన చేసుకోవడంవల్ల, ఏర్పడే కాలవ్యవధి

లోంచి, పరిష్కారం కూడా బైటికి వస్తుంది. అంటే, సమస్య లోనే పరిష్కారం కూడా ఇమిడి వుందన్నమాట. కనుక సమస్యా పరిష్కారం కోసం మనం గ్రంధాలు తిరగెయ్యనవసరం లేదు. ఒకరి సలహాను అర్ధించవలసిన ఆవసరం లేదు. ఎందుకంటే, సమస్యనుంచి పరిష్కారం విడిగా లేదనీ, అది అందులో అంతర్లీనంగా వుందనీ; అసలు ఆ రెండూ ఒకటేనని తెలుస్తోంది.

ఆ విధంగా ప్రపంచంతో మనకు గల సంబంధాన్ని ఆనుక్షణం అవగాహన చేసుకోవడంవల్ల మనలో స్పష్టత ఏర్పడుతుంది. అప్పుడే సమస్యలు అర్ధమౌతాయి. ఆ పరమ సత్యాన్ని విస్మరించి ప్రపంచ సమస్యలు, తమ సమస్యలు కావని అనుకోవడం వుత్త మూర్ఖం.

అదేవిధంగా మన కలలు, ప్రయత్నాలు, మనో వ్యాపారాలు, ఇంద్రియ సుఖాలు మొదలైనవన్నీ, ఉపశమనం లేని కోర్కెలు. తీరని సమస్యలు. అవికూడ అప్పుడప్పుడూ ఆయుధాలు ధరించి మన మీదికి దూకుతాయి - అలవాట్లుగా అభ్యాసాలుగా, ఆధ్యాత్మిక సోమరితనంగా. వాటిని వర్తమానం ఒక్కటే ఎగరగొట్టెయ్య గలదు. అవి ఆ క్షణాన ఎగిరిపోయినట్లు ఎగిరిపోయి మరుక్షణంలోనో, మరికొన్నాళ్ళకో ఏళ్లకో - ఎప్పటికో ఒకప్పటికి, ఏదో ఒక రూపాన, ఏదో ఒక విధంగా మళ్ళా మన మీదికి దూకుతాయి. వాటిరాక, పోకలకు మనం ఎరుకలో వుంటే, అవీ క్రమంగా కాలంలో ఆగిపోయే, లేక కరిగిపోయే అవకాశం లేకపోలేదు.

ఆ విధంగా ప్రతి సమస్యను పరిశీలించడంవల్ల పరిశోధించడం వల్ల సమస్యకూ, సమస్యకూ మధ్య కొంతకాలవ్యవధి ఏర్పడుతుంది.ఆవ్యవధి బహు స్వల్పమే కావచ్చు. కాని,క్రమంగా అది మన మాటలకూ, భావాలకూ, మనకూ గొప్ప అర్ధాన్ని ఇచ్చి,

మనం చేసే పనుల్లో ఒక విధమైన ప్రభావం కలిగివుంటుంది. ఆ వ్యవధిలో నిలిచేశక్తే, ప్రేమ. ఆ ప్రేమ, పరమ సత్యానికి ద్వారం తెరుస్తుంది. అదే ఏకత్వాన్ని నిరూపిస్తుంది. బహుశా భూతల స్వర్గం అన్నా అదేనేమో! ఆ కాల వ్యవధిలో. నిలవడమే జీవితానికి ఒక వరం. అదృష్టం

కానీ, ఈ ప్రపంచంలో రోజురోజుకీ దారుణంగా, భయంకరంగా పెరిగిపోతున్న అత్యాచారాలు, అక్రమాలు, అన్యాయాలు, అవినీతి, యుద్ధాలు - మొదలైన వాటి సమస్యలు ఎప్పటికీ ఏ విధంగానూ పరిష్కారం కావని తేలిపోయింది. అవన్నీ బ్రహ్మాండమైన. చిక్కైన సమస్యలు. వాటిని పరిష్కరించడంలో మతం, మహాత్ములు, విద్య అన్నీ తప్పిపోయాయి. సభలతో, సమావేశాలతో, చర్చలతో సమస్యలు చల్లారిపోవు. నాయకుని మార్చినా, హతమార్చినా సమస్యలు అట్లానే వుంటాయి. ఎందుకంటే, సమస్యలు, వాటి సృష్టికర్త చేతిలో వుంటాయి కనుక. అంటే, మన సమస్యలు మన చేతిలోనే వుంటాయి.

ప్రశ్న సరైనదీ, నిజమైనదీ, సూటైనదీ అయితే దానికి వేరే సమాధానం అవసరం లేదు,వుండదు కూడాను. ఎందుకంటే, ఆ ప్రశ్న లోపల్నించి వస్తుంది. అదే ద్వారాలు తెరుస్తుంది. కాని, తప్పు ప్రశ్న అయితే, అది మార్గాలు వెతుక్కుంటుంది, సమస్యాపరిష్కారంకోసం. అది అలా దారులు వెతుకుతూ, బంధాల్లో చిక్కుకుంటుంది. ఎందుకంటే, ఎవరైతే ప్రశ్న అడుగుతారో వారు బంధాల్లో వున్నట్లే.

ఈ ప్రపంచం మన అందరి సంబంధంతో ఏర్పడింది. కనుక మనమే ఈ ప్రపంచ సమస్యలకు బాధ్యులం. మన సమస్యలే, ప్రపంచ సమస్యలు. వాటిని అర్థం చేసుకోవాలన్నా,

పరిష్కరించాలన్నా ముందు మనని మనం అర్థం చేసుకోవాలి. అంటే, మానవ మనస్తత్వాల్ని, నిత్య జీవిత మిశ్రమ సమస్యల ఘర్షణల్ని, తికమకల్ని, ఆందోళనల్ని-అన్నింటి సంబంధంతో, అవగాహనా జ్ఞాన సహాయంతో పరిష్కరించుకోవాలి. లేకపోతే, ఏ సంస్కరణా వృథా! అప్పుడే సహజీవనం వీలౌతుంది. సహజీవన మంటే, హెచ్చు - తగ్గులు లేని జీవితం. దాంట్లో వక్రతనం వుండదు. అత్యాశ, కోర్కె, తలంపులు లేనటువంటిదే సహజీవనం. అటువంటి సదవగాహనలోంచి ఒక కొత్తరకం నీతి, సత్ప్రవర్తన, ఒక నూతన కార్యక్రమం ఉద్భవించడం ఎంతైనా అవసరం ఈనాడు. ప్రతి ఒక్కరిలోనూ అటువంటి మార్పు రావాలి. అది ఒక్క నిర్మల మనస్సు వల్లనే సాధ్యం.

అజ్ఞానం వల్ల, అశ్రద్ధవల్ల, ఎరుక లేకపోవడంవల్ల మనోభావాల్ని తప్పుగా ఉపయోగించుకోవడం వల్ల సమస్యలు కలుగుతాయి. ఉన్నదాన్ని ఉన్నట్లుగా చూడ్డమే, మనిషి నిజస్థితి. ఆ స్థితి, స్వేచ్ఛపడిన మనసుకే సాధ్యం.

మనసు స్వేచ్ఛగా లేక స్వార్థంతో, భయంతో, సంకుచితంగా వున్నప్పుడే సమస్యలు కలుగుతాయి. కనుక మన ఆలోచనల్లో పూర్తి మార్పు రావాలి. అంటే, ప్రతి ఒక్కరూ తమయెడల తాము దృష్టి మరల్చుకోవాలి. ఆ గమనికే జీవితంలో ప్రధానమైన మార్పు. అటువంటి మార్పు ప్రతి ఒక్కరిలో రావాలి. అదీ, ఆక్షణంలో జరగాలి. కాని, ఎప్పుడో, కాలక్రమంలో వస్తుందనేది వట్టి కల, ఆశ, భ్రమ మాత్రమే! అప్పుడే సంఘాలలోనూ మార్పు వస్తుంది. ప్రపంచంలో ఆశించిన శాంతి ఏర్పడుతుంది.

• • •

జీవితంలో ఒక ప్రక్క అంతులేని కలవరం, అత్యాశ, అందవికారం, జాతి-మత-సిద్ధాంతాలు-సాంప్రదాయాలు- తిరుగుబాట్లు-ఎదిరింపులూ, మరో ప్రక్క వైరుధ్యం, ఘర్షణ, బాధ, దుఃఖం, అనారోగ్యం, ముసలితనం, మృత్యువు - ఇన్ని వున్నాయి ఇవన్నీ మనల్ని జీవితాంతం వెంటాడుతూనే వుంటాయి. ఆ విధంగా జీవితం అధికభాగం అసంగతంగా, వ్యాకులంగా, గందరగోళంగా, గాబరాగా, తికమకగా, విరుద్ధంగా, భయంకరంగా, భరింపరానిదిగా వుండటంవల్లా - ఒకదాన్ని అంగీకరిస్తో, వేరొకదాన్ని నిరాకరిస్తో వుండటంవల్లా- బ్రతుకంతా దోష భూయిష్టంగా, నిత్య సంగ్రామంగా, సమస్యామయంగా తయారుకావడంవల్లా విసుగుచెంది, బతకడమంటేనే నిరుత్సాహంగా, నిస్సారంగాతోచి, అసలు జీవితమంటే ఏమిటో అర్థంకాక, ఎటుచూసినా శాశ్వత విఫలత్వమే గోచరించడంవల్లా, "ఇదంతా ఏమిటి? అసలు దీనికో అర్థం వుందా? ఈ జీవితం వెనుక వున్న అసలు సత్యం ఏమిటి?" అని కొందరు ఆనాటినుంచి, ఈనాటివరకు నిజాయితీగా ప్రశ్నిస్తూనే వున్నారు.

"ఈ జీవితం నీకు ఇవ్వబడింది. దానితో నువ్వు ఏం చేయబోతున్నావు? అది ఎంతో విలువైనది. కాని, నువ్వు దాన్ని వికారం చేస్తున్నావు. దాన్ని అపార్థం చేసుకుంటున్నావు. హింసాత్మకం చేసుకుంటున్నావు. నాశనం చేసుకుంటున్నావు. అసూయతో ప్రేమరహితం చేస్తున్నావు. "దయ" లేకుండా చేశావు. చివరికి రసహీనుడవు, గుణహీనుడవూ అయ్యావు. అటువంటి జీవితాన్ని నువ్వేం చేయదలచుకున్నావు?" అనే ప్రశ్న నీకు నువ్వు నిజంగా లోపల్నించి వేసుకుంటే, అప్పుడు నీలో ప్రేమకు చోటు ఏర్పడుతుంది. అదే ప్రేమ జీవనం.

జీవితం, అసిధారా వ్రతం వంటిది. జాగ్రత్త! అది అనేక అత్యద్భుత ఐశ్వర్యాలతో నిండివుంది. అందు ఎన్నో

నిధులు వున్నాయి దాన్ని ఖాళీ చేతులతో సమీపిస్తే, చేతుల నిండుగా ఎంతో ఐశ్వర్యాన్ని తీసుకోవచ్చు.

జీవితం చిత్రమైంది. ఎన్నో సంగతులు, విషయాలు అనుకోకుండా జరుగుతాయి; కొన్ని ఎదురౌతాయి అలా ఎదురైన వాటిని తాత్కాలికంగా ఆపుజేస్తే, సమస్యలు పరిష్కారం కావు. అప్పటికి దాన్ని నిరోధించడం వల్ల సమస్య సాధింపబడదు.

జీవితం నది మాదిరిగా వుంది. తన మార్గానికి ఏదైనా అవరోధం కలిగితే, అది అంతటితో ఆగిపోదు. అది మరో మలుపు తిరిగి, మరో మార్గాన పయనిస్తుంది. ఏ విధంగానైన చివరికి ఆనది సాగర గర్భం చేరుతుంది. అదే దాని లక్ష్యం.

కాని, నిత్యజీవితం సంగ్రామంగా తయారుకావడంతో కొందరు తమకు తోచిన రీతిని, వీలైన నమ్మక పద్ధతిని భావానికో, ఆశయానికో, ఆదర్శానికో, సిద్ధాంతానికో, సాంప్రదాయానికో, మతానికో - దేనికో ఒకదానికి జారుకుని, దాన్నే అనేక విధాల అభివృద్ధి చేసుకుంటో బతుకుతారు. కాని, వాటివల్ల కూడా వారికి క్రమంగా కలతలు, కలహాలు, ఘర్షణలు ప్రబలి ఘోర యుద్ధాలు వచ్చి కొట్టుకు చస్తున్నారు.

మరికొందరు, జీవితంనుంచి పలాయనం చిత్తగిస్తారు — సారాయి—గంజాయి—భంగు మొదలైన మత్తుపదార్థాల్లోకి; మరి కొందరు-క్లబ్బులు-సంఘాలు-సంస్థలూ-సంసారాలూ- సాహిత్యం కళలు - మొదలైన వాటిల్లోకి ప్రవేశిస్తారు. కొందరు అసమర్థులు జీవిత సమస్యల్ని పరిష్కరించుకునే శ్రమ తీసుకోరు. వాటిని ఏదో విధంగా అణచాలని చూస్తారు. మరికొందరు, జీవితమంటే ఏమిటో తెలుసుకోవాలని అన్వేషణ ఆరంభించి, కొంత సాధన చేసి, మధ్యలో ఏదో ఒక కారణానికి ఆపేస్తారు. మరికొందరు

" ఏది మంచి – ఏది చెడు ? ఏది పుణ్యం - ఏది పాపం ? ఏది నీతి - ఏది అవినీతి ? " అంటూ యోచించి ఎప్పటికీ ఏదీ అర్థం కాక మరింత తికమకపడి ఏమీ చేతకాక, ఏదీ తెలియక, చెడ తిరిగి, అయోమయావస్థలో పడి ఇతరుల సహాయంకోరి, వారు చెప్పినట్లు నడుచుకుంటో, యాంత్రిక జీవితం గడుపుతారు.

వారి అభ్యర్ధనపై గురువులో, గ్రంధమో, సంఘమో, మతమో, మహాత్ములో - ఎవరో ఒకరు, వారిని తమ ఇష్టం వచ్చి నట్లు నడుపుతారు. ఒకరు తమను నడుపుతున్నారనే వెర్రి ధైర్యంతో కళ్ళు తెరచి నడవడం మానేస్తారు. అట్టివారిలో కొందరు మంత్రాలు జపిస్తో, ప్రార్థనలు చేస్తో, ఆలోచనల్ని బలవంతంగా ఆపుజేస్తో, విధానాల్ని, నియమాల్ని, నిష్టల్ని, పద్ధతుల్ని అనుసరిస్తో, కోర్కెల్ని అణస్తో, మోహాన్ని భస్మం చేస్తో, తృష్ణను హద్దుల్లో పెడుతో, కామవాంఛను నొక్కిపెడుతో బతుకంతా మనసునీ, దేహాన్నీ చిత్రహింసలు పెడతారు. అటు వంటి వారి జీవితంలో నూతనత్వం, విశాలత్వం, నిర్మలత్వం, సహజత్వం, స్పష్టత, శాశ్వతత్వం నశించిపె తాయి.

మనిషి ఒక పద్ధతిని అనుసరించకుండా బ్రతకలేడు. తనకు తానై నిర్మించుకున్న అవరోధాలు—సాంఘిక, మతైక, జాతీయ, అంతర్జాతీయ, రాజకీయ వ్యవస్థలూ; తాము కట్టు కున్న రాతిగోడలు - ఆశయాలు, కోర్కెలు, అత్యాశలు, ద్వేషాలు, నమ్మకాలు, రక్షణలు, పక్షపాతాలు, ప్రేమలు, అంత రంగికమైన ఆశలు, ఆపేక్షలు మొదలైన అవస్థలన్నీ ఒక పెద్ద చిక్కు వలయంగా ఏర్పడి, మనిషిని బందిస్తాయి. ఆ చిక్కు వలయమే, "పరిసరం" ఆ పరిసరాలకు రియాక్ట్ కావడంవల్ల మొదటినుంచీ మనలో ఏర్పడ్డ రాతిగోడే " స్మృతి - జ్ఞానం - ప్రజ్ఞ" అదే "నేను". ఆ "నేను" కూ, పరిసరానికి నిరంతర సంఘర్షణ మూలంగా మనిషి జీవితం అశాంతిగా గడుస్తుంది.

అటువంటి పరిసరం ఎప్పుడూ మానవుణ్ణి తన వశం చేసుకుని, తన అధీనంలో వుంచుకోవాలని చూస్తుంది. కాని, అది మాత్రం ఎంతమాత్రం అతని అధీనంలో వుండదు.

పరిసర ప్రభావాన్ని తట్టుకోలేనివారు మతాల్లోకీ, గురు సేవల్లోకీ ఇంకా అనేక మార్గాల పరిసరం నుంచి తప్పించుకుని పారిపోజూసేవాళ్ళు రోజురోజుకీ ఎక్కువౌతున్నారు. వాళ్ళు పారిపోయేది ఎక్కడికోకాదు, ఎందుకోకాదు; తమను తాము తెలుసుకోవడానికీ కాదు—తమలో తాము తాబేలు మాదిరిగా ముడుచుకుని, బ్రతకడానికి. అంతే! ఆ జీవితాన్నే కొందరు గొప్ప చేసి, సాధనగా, ఆత్మనిష్ఠగా మాట్లాడతారు. వాళ్ళు త్వరలో ఒక అంతర్వాణిని కూడా సృష్టించుకుంటారు.

అందుచేత జీవితమంటే ఏమిటో ఆలోచించి, నిర్వచించ లేము. ఏ బంధమూ, ఏ సంబంధమూ లేని పూర్తి స్వేచ్ఛా మయమైనది జీవితం. అది అగోచరం, అవ్యక్తం. అది సజీవమైనది, సృజనాత్మకమైనది. అది ఒక భావం కాదు. అది, ఉనికి. అది నిరంతరం కదిలినా, ఒక కదలికకూ, మరొక కదలికకూ పోలికా, సంబంధం వుండదు. అది నిరంతరం సృష్టిం చినా, అది సృష్టి విధానం కాదు. ఎందుకంటే, జీవితం ఒక పద్ధతిని, ఒక సిద్ధాంతాన్ని అనుసరించదు.

జీవితమంటే, పరిసమాప్తంకాని ఒక దీర్ఘమైన క్రియ. అన్నింటి సంబంధంలో ఒక కదలికే, జీవితం. అది ఒక ఉద్దే శ్యంతో కదలినప్పుడు, వైరుధ్యంగా మారుతుంది. ఉద్దేశ్యానికి కారణం, ఆలోచన. ఆ ఆలోచన గతం. అది ఒక యంత్రం మాదిరిగా నిరంతరం కదులుతూ వుంటుంది. ఆ విధంగా మనిషి జీవితం "ఉద్దేశ్యం-క్రియ-వైరుధ్యం" అనే మూడింటిచుట్టూ తిరుగుతూ వుంటుంది.

అటువంటి జీవితాన్ని అర్ధంచేసుకునేందుకు ఏ అధికారి, అధికారం ఉండనవసరంలేదు. ఏ బోధకుడూ, ఏదీ బోధించ బోధించనవసరంలేదు. జీవితమే గురువై బోధిస్తుంది. మార్గ దర్శకుడై, దారి చూపుతుంది. దాన్ని అనుసరిస్తే, అదే లక్ష్యాన్ని చేరుస్తుంది.

అన్ని బోధలకన్నా, బోధకులందరికన్నా. జీవితమనే గ్రంథాన్ని చదివి, తనను తాను తెలుసుకోవడం ఉత్తమం. ఆ ఆ గ్రంథమే మనం. ఆ గ్రంథం మనలోనే వుంది. ఆ గ్రంథంలో అన్నీ వుంటాయి. ఆ గ్రంథం ఏ ఒక్కరిదీ కాదు. అది మానవులందరి గ్రంథం. దాన్ని చదవక; ఎవరో, ఏదో రాస్తే, దాన్ని చదివి కాలాన్ని వృధాచేయకూడదు.

మనం మన జీవిత గ్రందాన్ని చదివినా, చదవక పోయినా, ఒకనాడు జీవితం వచ్చి, మూసివున్న మన ఇంటి తలుపుల్ని తట్టి, తెరవమంటుంది. అది అట్లా తట్టడమే మనల్ని మేల్కొల్పడం. అట్లా జీవితం మనల్ని తట్టి మేల్కొల్పడం, మనకు బాధాకరంగా వుండవచ్చు. కాని, అది అలా తట్టడం – ఎడారి జీవనంలో జల్లువానగా, ఎండిన బతుక్కి నవనీతంగా వుంటుంది. తలుపు తెరిచే వరకు అది వూరుకోదు. తలుపు తెరచి నప్పటినుంచే, అసలు జీవితం ఆరంభం. మనం ఎప్పుడూ, ఎవరినీ, దేనికీ, ఏవిధంగానూ, దేనికోసమూ అర్థించనప్పుడు, మనం ఒంటరిగా ఉండవలసివస్తుంది. అటువంటి జీవితం శూన్యంగా, అల్పంగా, స్వల్పంగా, వ్యాకులంగా, మందకొడిగా, అవివేకంగా, దోషభూయిష్టంగా అంధకారంగా తోస్తుంది. ఆ జీవితాన్ని భరించలేక కొందరు తమకు వీలైన మార్గాన పారి పోతారు. కాని, నిజమైన అన్వేషకుడు ఒంటరితనానికి, దేనికీ భయపడక జీవితసత్యాన్ని తెలుసుకోవడానికి వివేకంతో ప్రయత్నిస్తాడు. అంటే, అతడు "జీవితం" అనే గ్రంథం

చివరి అధ్యాయంలో ప్రవేశించాడన్న మాట. అప్పుడు అతనిలో ఒక విధమైన క్రమం-అదే విశ్వవ్యాప్తమైన క్రమం ఏర్పడుతుంది. అదే అసలు జీవితం. దానికి తత్వశాస్త్రాలతో, తత్వవేత్తలతో, చివరికి దేనితోనూ పనిలేదు. ఎవరు చెప్పినా, ఏది చెప్పినా "నిన్ను, నీవు తెలుసుకో! నీవు, నీవుగా వుండు. నువ్వు ఏమిటో అట్లానేవుండు," అనే కదా ?

"విశ్వవ్యాప్తమైన క్రమం" అనే దాని గురించి కొంచెం తెలుసుకోవడం మంచిది. బైబిల్, ఇంకా అనేక తూర్పుదేశాల ప్రాచీన గ్రంథాల్లో, "ఆదిలో అవ్యక్త స్థితి వుంది. దాన్నించి, ఒక క్రమం ఏర్పడింది;" అనే సంగతి వుంది. కాని, అది సరైన సంగతి కాదనిపిస్తోంది. సృష్టిలో ఆదినుంచీ ఒక క్రమం వుంది. ఆ క్రమంలో అన్నీ, అంతా వుంది. అంటే, భూకంపాలు, తుఫానులు, అగ్నిపర్వతాలు, ఆకాశం, మబ్బులు, పక్షులు, చెట్లు, పిల్లలు-సమస్తం వున్నాయి. అవన్నీ వున్నదే ఆ క్రమం. ఆ సంగతి విస్మరించి, చీకటిమయమైన అవ్యక్తస్థితిని మనిషే సృష్టించుకున్నాడు. ఆ అవ్యక్తస్థితినుంచి, తిరిగి విశ్వవ్యాప్తమైన ఆదిక్రమానికి వెళ్ళాలని ఆరాటపడుతున్నాడు. ఎందుకంటే, ఆది క్రమం, అది అపారమైన దీవన-ఆశీర్వాదం-అనుగ్రహపూరితం-కలుషరహితం. జీవితంలో ఆ క్రమమే, అందం.

ఇన్ని వేల సంవత్సరాలలోనూ మానవుడు ఎన్నో కోర్కెల్ని, ఎంతో విజ్ఞానాన్ని పోగుజేసుకుని, మెదడులో దాచుకున్నాడు. సర్వేంద్రియాలు కోర్కెల్ని పుట్టించి, అనుభవాల్ని, జ్ఞాపకాల్ని కలిగిస్తాయి. మనసులో ఒక్క కోర్కె కూడా లేనప్పుడు, విశ్వవ్యాప్తమైన క్రమానందాన్ని అనుభవించగలం. ఆ కోర్కెలు అంతం కావడానికి ఒక మార్గం, ఒక పద్ధతి, ఒక సంకల్పం, ఇచ్ఛాశక్తి అంటూ ఏమీ లేదు. మనం చేయవలసింది ఆ కోర్కెల్ని అర్థంచేసుకోవడం. అంటే, మెదడు

పూర్తిగా ఖాళీ కావడం. అదే, మనసు స్వచ్ఛమై, స్వేచ్ఛ పడడం. అంటే, ఇంద్రియాలు పూర్తిగా వికాసం చెందడం. కాని, అవి వికాసం చెందకుండా అడ్డుపడేది మనిషే! కోర్కె లేనప్పుడు వుండేదే, సంపూర్ణత్వం.



మనకు కొన్ని సంగతులు, కొన్ని విషయాలు తెలుసు. కాని, మనం ఇంకా, ఇంకా తెలుసుకోవాలని నిరంతరం ప్రయత్నిస్తాం, ఆశిస్తాం. ఆ సందర్భంలో అనేక అగచాట్లు పడతాం. కాని, మనకు మన గురించి ఏమాత్రం తెలియదు. తెలుసుకోవాలనీ, ప్రయత్నించము. అదే జీవితంలో చిత్రమైన సంగతి.

మనలోకి మనం ఎందుకు చూసుకోమంటే, చాలావరకు సోమరితనం, కాకపోతే భయం. అంగారకగ్రహంలోకి ప్రయత్నించి వెడితే ఏదైనా లాభం వుండవచ్చు కాని, తనను తాను తెలుసుకోవడంవల్ల ఏమి లాభం? అయినా అది ఏమంత గొప్ప సంగతీ కాదు. ఎందుకంటే, ప్రతి ఒక్కరికీ తమ సంగతి తమకు తెలుసునని ధీమా. తన గురించి తాను తెలుసుకోవడమనేది పిచ్చిపనిగా తోస్తుంది, చాలామందికి.

మనని మనం తెలుసుకోవడానికి చాలాకాలం పడుతుంది. అది ఎంతో కష్టమైన పని. ఆ యాత్రకు అంతం వుండదు. ఒంటరిగా ప్రయాణం చేయాలి. చెప్పేవారూ, సూచించేవారూ తప్ప, సహాయంచేసి తీసుకుపోయేవారూ, చూపించేవారూ వుండరు. తనను తాను తెలుసుకునేందుకు ఎంతో శక్తి కావాలి. ఆ శక్తి, మత్తుమందులద్వారా, మంత్రాలద్వారా, ఒకదాన్ని అనుసరించడంద్వారా, వేరొకదాన్ని నిరాకరించడంద్వారా అది కేంద్రీకృతం కాదు. ఏ దేవుడూ, ఏ ఆచారం, ఏ నమ్మకం,

ఎటువంటి ప్రార్ధనా, ఆరాధనా ఆ శక్తిని ఇవ్వలేవు. అవి ఇవ్వవు కూడాను. ఏళ్ళతరబడి తీవ్రకృషిచేసి, ఆర్జించి దాచుకున్న విజ్ఞానాన్ని వెచ్చించి, ఆ శక్తిని కొనలేము. ఏవిధంగానూ దాన్ని పొందలేము. అది నిశ్చయమైన సంగతి. ఆ శక్తిని సంపాదించడంలో గతంలో మనం పోగుజేసుకున్న జ్ఞానం, మనల్ని ఎటూ కదలనీయకుండా, ఎటూ చూడనీయకుండా మరింత బందీల్ని చేస్తుంది. అందుచేత మనం ఆ జ్ఞానపరిదిలో అటూ, ఇటూ తిరగడమే కాని, దాన్ని దాటిపోలేము.

తన గురించి తప్ప ఇంక ఆలోచించడానికి ఏమీ లేనప్పుడు అప్పుడు తెలుసుకునేది ఎవరు ? తెలుసుకునేది ఏది ? తెలిసేది ఏది ? ఆలోచించేదెవరు ? వెదికేదెవరు ? ఇదంతా ఏమిటి ? అసలు ఎందుకు వెదకాలి ? దేన్ని వెదకాలి ? ఎవరు వెదకాలి ? అసలు ఆ "నేను" ఎవరు ? అనే చివరి ప్రశ్నకు వస్తాం.

తనను తాను తెలుసుకోనిది ఏంచేసీ వ్యర్ధం. అది అజ్ఞానం, భ్రాంతి మాత్రమే అవుతుంది. అది వైరుధ్యాలకు దారితీస్తుంది. దానితో జీవితంలో తికమక ఏర్పడుతుంది. ఆ తర్వాత బాధలు, దుఃఖాలు పుట్టుకొస్తాయి. అందుచేత ముందు తనని తాను తెలుసుకోనిది ఏంచేయడానికి ఆధారం వుండదు.

తననితాను తెలుసుకోవడానికి "గతం" పెద్ద అడ్డు. అది చచ్చినమొద్దు. ఆ గతాన్ని భుజాన వేసుకుని తిరుగుతాం. ముందు దాన్ని వదలాలి. అంటే, "గతం"నుంచి పూర్తిగా స్వేచ్ఛ పడాలి. గతమంటే, ఎన్నో అభిప్రాయాల-తుది నిర్ణయాల-అనుభవాలతోకూడిన అగాధం. దాన్ని పూర్తిగా పూడ్చెయ్యాలి.

కాని, వర్తమానంలో దేన్నీ త్యజించవలసిన పనిలేదు. కొండలు ఎక్కవలసిన అవసరం లేదు. అరణ్యాల్ని ఆశ్రయించ

వలసిన అగత్యమూ లేదు. ఏకాంతవాసంలో వుండి, సాధన చేస్తున్నా, అక్కడి పరిస్థితులతో, పరిసరాలతో ఒకవిధమైన సంబంధం ఏర్పడక తప్పదు. అసలు జీవితమంటేనే, సంబంధం. ఆ సంబంధంలో తనలో కలిగే ప్రతి చిన్న కదలికకీ, భావానికి, అభిప్రాయానికీ, తలంపుకి కారణాలు నెమ్మదిగా, జాగ్రత్తగా, శ్రద్ధగా, నిజాయితీగా వెదకాలి.

ఆ సాధనా సమయంలో మన నిర్ణయాల, అభిప్రాయాల. అనుభవాలతోపాటు మన స్వభావం, యాతనలు, పనులు, పద్ధతులూ, ప్రపంచంతో మనకు గల సంబంధం—అన్నింటిపై ఏకకాలంలో దృష్టిపెట్టి, వాటికి ఎరుకలో వుండాలి. అలా అన్నింటికీ ఏకకాలంలో ఎరుకలో వుండటం బహుకష్టం. ఎందు కంటే, మన తుదినిర్ణయాలు అభిప్రాయాలు, అనుభవాలు-అవి, మనం ఏది నేర్చుకోవడానికీ, తెలుసుకోవడానికీ గట్టి అభ్యంతరాలై, మనం చేసే సాధనను వక్రమార్గం పట్టిస్తాయి. అవి ఇంకా బలమైనవైతే, తెలుసుకోవాలన్న మన కుతూహలాన్నే చంపేస్తాయి.

ఈ భూమిమీద ఏదీ ఒంటరిగా మనలేదు. కనుక లోక సంబంధంతో తనను తాను తెలుసుకోవాలి. అదొక్కటే మార్గం. ఆ సంబంధాలలో ఒక సంబంధం అర్ధమైతే, అన్నీ అర్ధమౌతాయి. అలాగే ప్రతి సమస్యకీ, సవాలుకీ సౌంజ్ఞకీ, సూచనకీ సదా సంపూర్ణ ఎరుకలో వుండాలి. దానికి అసాధారణమైన మనసు కావాలి. కాని, చాలామంది నిద్రపోతూ వుంటారు. మిగిలిన వారిలో కొందరు తమ పనుల్లో విఫలురౌతారు. కొందరు భంగ పడతారు. తక్కినవారు జీవితంలో ఒక అడుగు సమాధి గోతిలో వుంచే జీవిస్తారు. అందుచేత ప్రతి ఒక్కరూ, ప్రపంచంలో ప్రతిదానితో ముఖాముఖి సంబంధంపెట్టుకోవాలి, వీలైనంత వరకు ఉద్దేశ్యరహితంగా, నిష్కామంగా.

తననితాను తెలుసుకోవడ మనేది వినడానికి చాలా తేలిక సంగతిగా, సులభమైన విషయంగా, స్వల్పమైనదిగా తోచినా, అది ఆచరణకు, అన్వేషణకు అత్యంత కష్టతరమైనది.

అనుక్షణం తనని తాను లోపలా – బైటా అనుసరించ డానికి అమితమైన చురుకుదనం కావాలి. తానుచేసే ప్రతి పని మీదా దృష్టిపెట్టి, దానిగురించి బహుముఖంగా విచారణ చేయాలి. తనకు గల అన్ని సంబంధాలకు అనుక్షణం ఎరుకలో వుండాలి. అసలు కష్టమంతా మనం ఓర్పు లేనివాళ్ళం ఎలాగో, ఏదోవిధంగా ముందుకు సాగిపోవాలి గమ్యం చేరుకోవాలి, ముక్తి పొందాలి " అని తాపత్రయపడేవాళ్ళమే కాని, మనని మనం అర్పించుకోము. మన కాలాన్ని ఇచ్చేసుకోము. కాని, అది ఏదో, అది మనకు రావాలి, కావాలి. మనం దాన్నిపొందాలి," అని అనుకుంటాం.

ఆ సాధనా విధానంలో గురువుల్ని, గంథాల్ని, పద్ధతుల్ని, ఆచారాల్ని సాంప్రదాయాల్ని - మొదలైన వాటిని అనుస రించడం వృథా శ్రమ. అవి నిష్ఫలమైనవి. అవి అర్థంలేని సంగతులు.

మనం స్వేచ్ఛగా, నిర్భయంగా వుండి, సదా మనకు మనం ఎరుకలో వున్ననాడు, మనలో తప్పక పరిణామం వస్తుంది. ఆ తర్వాత సంఘంలో కూడా మార్పు వస్తుంది.

మనని మనం అనుక్షణం ఏ అరమరికా లేకుండా లోతుగా చూసుకున్నకొద్దీ, స్పష్టత అధికమౌతుంది. మనసు నిశ్చల మైతే, కలిగేదే శక్తి. అదే సంపూర్ణ శక్తి. ఆ శక్తి సహాయంతో మననిమనం తెలుసుకోవాలి. అప్పుడే అన్ని ఘర్షణలు, సమస్యలు తొలగి శాంతి, ఆనందం లభిస్తుంది.

ఏ క్షణానికాక్షణం తనని తాను పరీక్షగా, పరిశీలనగా నిజమైన శ్రద్ధతో చూసి తెలుసుకోవడం ఆరంభించగానే, తానొక సజీవమై, కదిలే, చలించే, ఆలోచించే, కోరే, ఆశించే, ప్రయత్నించే, వెదికే ప్రాణిననీ; అప్పుడే ఈ భూమిమీద అవతరించిన అనుభవంలేని పసివాడిననీ తెలుసుకుంటాడు. ఆ సమయంలో ఏనోకదలికను కూడా గమనించాలి. ఆ ఎరుకే, అసలు జీవితానికి ద్వారం తెరుస్తుంది. అదొక అపూర్వమైన, వినూత్నమైన స్థితి. ఆ స్థితిలో భయానికి తావులేదు. సంపూర్ణ స్వేచ్ఛ వుంటుంది. ఆ స్థితిలో మన బాధ్యతలు, విధులు, ధర్మాలు ప్రత్యుత్తరాలు, వాటి తాలూకు ప్రతిక్రియలు పవిత్రంగా, నిర్మలంగా వుంటాయి. ఆస్థితి పరిశీలకునిఎక్కడకు తీసుకుపోతుందో, చివరకు ఏమౌతుందో మొదట్లో తెలియదు. అది ఊహకు కూడా అందదు. కాని, సాధన విడవకుండా ఇంకా, ఇంకా శ్రద్ధగా చేస్తే, "రియాక్షన్" అనేది పోయి, కేవలం "యాక్షన్" మాత్రమే జరుగుతుంది. ఎందుకంటే, ఆ స్థితిలో అన్ని వైరుధ్యాలు పోతాయి. ఇన్ని జరిగినా, ఆ స్థితి ఏమిటో సాధకునికి స్పష్టంగా తెలియదు.

ఆ స్థితిలో ఏం జరుగుతుందో నిలిచి, ఓపికగా గమనించాలి. దాన్నించి ఎటువంటి సమాధానం, ఏ ఫలితం ఆశించకూడదు. ఆ స్థితిని ఊరికే గమనిస్తో వుండాలి. అంతే! లోపలా – బైటా ఎన్ని మార్పులు వచ్చినా పరిశీలన మానకూడదు, వెనక్కి చూడకూడదు.

ఆ పరిశీలనలో ఎన్నాళ్ళకూ, ఎటువంటి సమాధానం, ఫలితం లేకపోయేప్పటికి, సాధకునికి మరీ ఆందోళన కలుగుతుంది. మనసు తికమకపడుతుంది, గొడవపడుతుంది. మనిషికి

చేతనైనది ఆలోచించడం గనుక, వెంటనే ఆలోచనకు పూను కుంటాడు. కాని, అప్పటికే అతనిలో "నేను" అనేది అదృశ్యమై "వున్నాను" అనేది మాత్రమే మిగులుతుంది. అదే అనుభవం. ఆ అనుభవం ఒక మెరపువలె వస్తుంది. తెలియడమన్నా, అదే. అదే జ్ఞానానికి, స్వేచ్ఛకి నాంది. దాన్ని మనసు గుర్తించలేదు. దాన్ని మాటల్లో వర్ణించలేము, అటువంటి సర్వోత్కృష్టమైన స్థితిని జీవితంలో అనుభవించాలంటే, ఎవరి సలహా, సహాయం, తీసుకోనవసరంలేదు. ఆ స్థితికై ఎవరినీ, ఎప్పుడూ, ఏవిధంగానూ అర్థించకూడదు; అనుసరించకూడదు. దాన్ని ఎవరికివారు, ఏక్షణానికా క్షణం తమకు తోచిన మార్గాన సాధనచేసి తెలుసుకోవలసిందే!

మొదట్లో ఆ స్థితిలో ఎక్కువసేపు నిలవడం కష్టం. ఉక్కిరి బిక్కిరిగా వుంటుంది. అటువంటి స్థితిలోంచి వెంటనే బైటికి వచ్చి కొంత విశ్రాంతి తీసుకోవాలి. "కొంతసేపు," అనేది కొన్నిక్షణా లైనా కావచ్చు. కొన్ని నిమిషాలు, గంటలు, రోజులు, సంవత్స రాలైనా కావచ్చు. కాని, ఆ పరిస్థితిలో "కొంత విరామం" అవసరం.

ఆ స్థితినుంచి తాత్కాలికంగా, ఏకారణానికి బైటికి వచ్చినా ఆ రావడంలో ఒక అనుభవం వుండాలి. ఆ అనుభవ జ్ఞానంతో చూస్తే, గతమంతా పూర్తిగా కాలి, బూడిద అయినట్లూ, గత జీవిత మంతా ఎందుకూ కొరగాకుండా గడచినట్లూ కనబడుతుంది. "నేను" అనే ప్రత్యేక వ్యక్తిత్వం కూలిపోయినట్లు కనిపిస్తుంది. బతుకంతా ఏ రక్షణా లేని నిరామయంగా తోస్తుంది. అంతా శూన్యంగా కనబడుతుంది. అటువంటి నిరామయ శూన్యంలో నిలవడమంటే ఎంతటివారికీ - ఆ సాధనా మార్గంలో ఎంతో ముందుకు వెళ్ళాము అనుకున్న వారికి సహితం దుర్లభంగా, దుర్భరంగా, దుస్సాధ్యంగా తోచక మానదు. దాన్ని భరించ డమూ కష్టమే!

ఆ స్థితిలోంచి బైటికివచ్చి, విశ్రాంతి తీసుకున్న తర్వాత మళ్ళా "నేను" అనేది లేని స్థితికి వెళ్ళాలి; పూర్వం మాదిరిగా, తనను తాను తెలుసుకునే ప్రజ్ఞతో. ఆ స్థితిలో మళ్ళా కొంత సేపు నిలవాలి. ఉక్కిరి బిక్కిరి కాగానే మరొక అనుభవంతో బైటికి రావాలి. అది ఎటువంటి అనుభవం అని చూడకూడదు. ఆ విధంగా "నేను" అనేది లేని స్థితికి వెళ్ళడం, అందు కొంత సేపు నిలిచి, తిరిగి రావడం-ఆ విధంగా సాధన కొంతకాలం సాగితే, "నేను" అనేది లేని స్థితిలో ఎక్కువ సేపు నిలవడానికి అవకాశం ఏర్పడుతుంది. ఆ స్థితిలోనే ఆనందం, శాంతి, స్వేచ్ఛ వుంది. అటువంటి ఆనందం జీవితంలో స్థిరంగా, శాశ్వతంగా ఎప్పటికీ నిలిచి వుండటమే, ముక్తి.

కాని, ఇక్కడ ఒక సంగతి గమనించాలి. అది ఏమిటంటే, ప్రతి విషయానికి ముందుగా మెదడు సమాధానం చెపుతుంది. కనుక సమస్తానికి, చివరికి నువ్వు అనుకుంటున్న జ్ఞానాన్ని, ముక్తిని-అన్నింటినీ, అంతా-"కాదు-లేదు" అని తోసెయ్యడం వల్ల మనసు, మేధస్సు, బుద్ధి, పరిశోధన, పరిశీలన, పరీక్ష, విచారణ-అన్నింటినుంచీ నువ్వు స్వేచ్ఛపడతావు అప్పుడు "వుంటావు". సమస్తానికీ సాక్షీభూతంగా వుంటావు. గతించి పోతున్నవాటన్నింటికీ ఎరుకలో వుంటావు. అదే కిటుకు అనిపిస్తోంది.

అయితే మెదడు తనకు తాను తిరిగి సహజమైన స్థితికి (సాధుత్వానికి) వెళ్ళగలదా? అనంతమైన శక్తి-సామర్థ్యాలు కల ఆ మెదడు, అన్నింటినీ అదుపులో పెట్టేదీ, నిరంతరం అన్నింటినీ కదిలించేదీ, సర్వేంద్రియాలచేత పని చేయించేదీ అయిన మెదడు, పూర్తి సాధువుగా, సహజంగా మారగలదా?

ఎంతో గతం కలిగిన ఆ మెదడు తనకు తానుగా గతాన్నంతనీ తోసెయ్యగలదా? అన్నింటినీ నిరాకరించగలదా?

ఆ విధంగా మెదడులోని కణాలు వాటికవి మార్పుచెందగలవా? పరిణామం చెందగలవా?

"ఆలోచన అనేది భౌతిక విధానం. ఆ ఆలోచన మెదడు కణాలలోంచి ఉద్భవిస్తుంది. మెదడుకూడా భౌతికమే కదా? మెదడులోని కణాలు వదలిన మచ్చే, "స్మృతి," గతానుభవం". ఆ మెదడులో "స్మృతి – జ్ఞాపకం – అనుభవజ్ఞానం" అన్నీ వుంటాయి. ఆ కణాల కదలికే, కాలం.

అందుచేత ఆలోచన అనేది స్మృతిభాండంనుంచి, అనుభవం నుంచి పోగుజేసి, దాచి, నిల్వవుంచుకున్న జ్ఞానంనుంచి ఒక గొలుసులాగ అనంతంగా వస్తూనే వుంటుంది. అది కేవలం ఆలోచనా విధానంలోనే వుంది. అది కూడా మెదడులోని భాగమే; అంటే, అలోచన గతంనుంచే పుడుతుంది. దానికి ఇంకోమార్గం లేదు. ఆ గతమే అన్ని కాలాల్లోనూ నడిపించే శక్తి. అది వర్తమానంలో తనకు తాను మారి, నమ్మకాలతో, భ్రాంతులతో రక్షణ ఏర్పరచుకుంటో ముందుకు కొనసాగుతుంది.

కనుక ముందు ఆ మెదడును జాగ్రత్తగా గమనించాలి. మెదడు అంటే, నాడీ మండల కేంద్రం. అది గతాన్నంతా భద్రపరుస్తుంది. అందులో మన విజ్ఞానం, అభిప్రాయాలు, సిద్ధాంతాలు, అభిమానాలు, ఆలోచనలు, భయాలు అన్నీ, అంతా వున్నాయి. వాటి అన్నింటితో అది పరిమితమై వుంది. ఆ మెదడు అనంతంగా వూహించి, భావించి, ఆలోచించగలదు. అగోచరం, అవ్యక్తం, నామ-రూపరహితం అయినదాన్ని కూడా అది వూహించి, భావించగలదు.

కాని, అంత గతం కల ఆ మెదడు, తన అంతాన్ని తాను వెతుక్కోగలదా? ఎందుకంటే, ఆ అంతంతోనే అసలు సంగతి ఆరంభమౌతుంది. అప్పుడు మెదడులోని కణాల కదలి

కొత్తగా, గతానుభవం లేశమాత్రం లేకుండా స్వేచ్ఛగా, స్వచ్ఛంగా, నిర్మలంగా వుంటుంది.

కనుక సనాతనమైన ఆ మెదడు అన్నింటినీ, "ఇది కాదు - ఇది కాదు," అంటూ తన పరిధి దాటి కదలాలి. ఆ స్థితిలో మెదడు ఎట్లా పనిచేస్తుందో గమనించాలి. దాన్ని గమనించాలేకాని, తర్కించకూడదు, పాత పదాల్లోకి అనువదించుకో కూడదు. "తప్పు-ఒప్పు, అందం-వికారం; మంచి-చెడ్డ; అదీ-ఇదీ" అని దేన్నీ అనవద్దు, అనుకోవద్దు. వూరికే వుండాలి. వూరికే వుండి అన్నింటినీ దర్శించాలి. ఆ చూపులో కలుషితం వుండదు, లేదు. అలా చూస్తున్నప్పుడు మనసు తనకు తాను కల్పించుకున్న ఇంద్రజాలంలోంచి, చిక్కుల్లోంచి తప్పించుకుని బైటపడుతుంది. అప్పుడు ఆ మనసు దేనినైనా చూడగలుగుతుంది. జీవితంలో అదే ముఖ్యమైన సంగతి.

ఇంతకాలం ఎందరో కొండల్లో, అడవుల్లో, ఇంకా అనేక చోట్ల; అన్నీ పరిత్యజించి, చివరికి అసలు వున్నదాన్ని పొందాలని నానాబాధలూ, యాతనలూ పడ్డారు. కాని, ఎటూ కదలని మనోస్థితే, ఆలోచనలు ఆగిన స్థితి. అదే సహజ స్థితి. అది మౌనంలో తప్ప తెలుసుకోలేని దివ్యానుభవం.

స మా ప్తం